# దాక్షిణాత్యుల నాట్యకళాచరిత్ర
## గూర్చి కొన్ని మాటలు....

ఈ గ్రంథ రచన చేయుటకు ఐదు సంవత్సరములు పరిశోధన చేశాను. అనేక గ్రంథాలయాలు, సంస్థానములకు వెళ్ళి సంస్కృత. ఆంధ్ర, తమిళ, హిందీ, మరాఠీ, ఇంగ్లీషు భాషలలో నృత్యకళపై వున్న రచనలు పఠించాను. అనేకులైన నాట్యకళావేత్తలు, పండితులు, విద్వాంసులు, కళాకారులు, కళాకారిణులను సందర్శించాను. వారి కళాసాధన, ప్రదర్శనరీతులు, అనుభవాలు తెలిసికొన్నాను. ఎన్నో నూతన విషయాలు వారినుండి నేర్చుకొన్నాను. శాస్త్రము, సంప్రదాయము రెండూ తెలిసికొని వాటియొక్క సమన్వయముతో, సుందరరూపమిచ్చి రూపొందించిన మొదటి గ్రంథము మన తెలుగు భాషలో—'దాక్షిణాత్యుల నాట్యకళా చరిత్ర'. ఈ గ్రంథ రచన ముగించిన సమయంలో తెలుగుభాషా సమితివారు, 'దక్షిణదేశ నృత్యకళా చరిత్ర' గూర్చి గ్రంథరచన పోటీ పెట్టారు. అందులో ఈ రచన ప్రథమ బహుమతి నందుకుంది.

ఈ గ్రంథము అచ్చునకు

సంగీత నాటక అకాడమీ, ఢిల్లీవారు రూ 2000-00

సంగీత నాటక అకాడమీ, ఆంధ్రప్రదేశ్‌వారు రూ 2000-00

యిచ్చినారు. వారికి నా కృతజ్ఞతను తెలియజేయుచున్నాను.

ఈ గ్రంథము రచించుటకూ, పరిశోధన కాలంలో మొదటినుండీ నన్ను అనేక విధాలుగా ప్రోత్సహించి, సహాయముచేసిన కళాపోషకులు, మహాపురుషులు, శ్రీ శ్రీ శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజుగారు. వారికి ఈ రచన అంకితంగా సమర్పిస్తున్నాను.

ఇందులోని ముచ్చటైన రేఖాచిత్రాలు చిత్రించిన శ్రీ బి. రామకృష్ణకు, శ్రద్ధాసక్తులతో అందముగా అచ్చువేసిన ఆదర్శగ్రంథమండలివారికి నా ధన్యవాదాలర్పిస్తున్నాను.

నటరాజ రామకృష్ణ

# సముల్లేఖము

కవితాదుల వలెనే రసభావయుక్తమైనది నాట్యము. చతుర్వేదాంతర్గతములగు నాట్యాంగముల సమగ్ర స్వరూపము నాట్యము.

సర్వ వర్గములకు, సర్వ వర్ణములకు సర్వకళాస్వరూప సరస సుకుమార రమ్యతల నందించు క్రీడనీయకము ప్రీత్యుత్పత్తి పదము. పాఠ్యగీతాభినయ రసముల సాముదాయిక ప్రయోగము. మనోహరమును, రమ్యమును, కళా ప్రపూర్ణమునగు మధుర సౌందర్యసృష్టినిర్మాతయగు చతుర్ముఖుడే నాట్య నిర్మాతయగుట సముల్లసితము. ఇట్టిదగు నాట్యవేదమునకు సర్వజ్ఞుడగు భరతుడు శాస్త్ర ప్రణేతగా, అభిజ్ఞులైన మహర్షులు, బోధవ్యులుగా, ఆవిర్భవించుటచేతనే విశ్వశ్రేయమైనది భరత ప్రోక్తమయిన నాట్యశాస్త్రరీతులు భారతావనిని బహుళ ప్రచారము నందుటయే గాక లోకానుగతముల నందినవి. లోకవృత్తిము రసభావ సత్వసంయుక్తమగుట నాట్యగతమై - ప్రయుక్తమై-సర్వమానససమ్మోదామోదమునందినది. బహుళ ప్రాచీన మగునదైనను అతినవ్యములును, సార్వజనీనములును, సార్వకాలికములును అగు అంశములతో బహుళ విలసితమైనది నాట్యము, భారతావనిని.

అట్టి మహత్వపూరకమగు నృత్యరీతులతో సముజ్వలమైనది దక్షిణావని. ఆ వివిధ కళారూపాల జన్యజనక స్వరూపాల నిందు కూలంకషముగ చర్చించినారు భరతకళాప్రపూర్ణ శ్రీ నటరాజరామకృష్ణ.

దాక్షిణాత్యుల నృత్యకళలతో పాటు, వారివారి హృదయ సౌందర్యముల నెరిగిన వాడు మన నటరాజ. విజ్ఞాన విన్యాసము దేశోపకృతికి జీవమని నమ్మిన సరసహృదయుడు రామకృష్ణ.

ఈ గ్రంథము శ్రీ నటరాజరామకృష్ణఅపారకృషిని ప్రతిభను వ్యుత్పత్తిని తెలుపుతుంది.

సిద్ధాంతవేత్తయేగాక అనుభవవేత్తకూడ కావడంవల్ల గ్రంథమంతయు సుస్పష్టంగా చెప్పడం జరిగింది.

వివిధ కళాసంప్రదాయ రూపముల జన్యజనక బాంధవ్యములను, నాయకానాయకుల భేదాలను సూచించే పటాలవల్ల దాక్షిణాత్య నాట్యకళా చరిత్ర పరిణామం తేటతెల్లమవుతున్నది.

శివతాండవ వివిధదశలు చిత్రపట సహాయముతో అభివర్ణించి పఠిత కళ్ళముందు తాండవించేటట్లు చేయకలిగినవారు ఈ రచయిత. వివిధ నర్తన [illegible]లను సవిశదంగా వర్ణించిన తీరు హృద్యంగా వుంది.

ఆలయ నృత్యాలను గూర్చిన వీరి పరిశోధనావ్యాసంఅమూల్యమైనది.

వివిధ రాష్ట్రాల శాస్త్రీయ, జానపద నృత్యరీతుల వివరణ బహుధా మెచ్చుకో దగ్గది.

అభినయ భేదాలు, హస్తాలు, నాయికా నాయక రసభేదాలు ఈ గ్రంథమున కలంకారములు.

దాక్షిణాత్య నాట్యకళకు సంబంధించివీరు ఈ గ్రంథమున స్పృశించని అంశమంటూ లేదనే చెప్పగలను. ఏ వంవిధబహుగుణదీప్తనీయమగు నిట్టి రమణీయ గ్రంథమును తీర్చిదిద్దుట చేతనే తా నందుకొన్న భరత కళా ప్రపూర్ణ బిరుదమునకు వన్నెను సముపార్జించి పెట్టినారు మిత్రులు శ్రీ నటరాజ రామకృష్ణ.

భూమిక అతి విశాలంకావడం వలన కొన్ని కొన్ని అంశాలను క్లుప్తీకరించినను సామాన్య పఠితకవసరమైనంత వరకు ఇందు లభ్యమగు ననుటలో సందేహము లేదు.

వీరేయేవిషయముల యందు ప్రజ్ఞను, కౌశలమును చూపిరో భావుకులరగు కళాశీలురు పరిశీలుంతురు గావుత.

శాస్త్రము, సంప్రదాయ విలసితమై కాలగతిలో నవ్యత నాపాదించుకొంటూ అభివృద్ధినందినపుడే కళావిలసితమగుట. ప్రయోగాత్మకముగ ఉపాసకుల దృష్టిని చూరకొనుట. అధ్యేతలకు ఈ దాక్షిణాత్యుల నాట్యకళా చరిత్ర, సమగ్ర ప్రామాణ్యమై, సుగమబోధనీయ కళామార్గమై విలసిల్లగలదని నమ్ముచున్నాను.

సర్వాంగసుందరమైన ఈ గ్రంథమును సర్వదా నే నాంతర్యముగ మెచ్చు మిత్రుడొకడు రచించుట నా కనవద్యమగు ఆనందాన్ని చేకూర్చినది.

మరియూ ఈ కృతిని, సుకృతియు సహజ సౌమ్యగాంభీర్య రూపసియు కృష్ణభాగవతాద్యనేక గ్రంథముల స్వీకరించిన సరసుడును, రాచకీయ రంగమున వివిధరీతుల నాట్యమొనర్చు దిట్ట, వర్ధమానుడైన శ్రీ రాజాసాగి సూర్యనారాయణ రాజన్యుడు స్వీకరించుట సముచితము. మీదు మిక్కిలి ఈ కృతికర్తయు-భర్తయు-ఉభయులు నాకు పరమ మిత్రులు నగుట నాట్యకళామతల్లికొక నవ్యమహోదయం. అస్మదాదులకు నవప్రియా సంశ్లేషణా సదృశం. జగతికి శోభనప్రాప్తి.

—పసల సూర్యచంద్రరావు

# సాగివారి చరిత్ర

భారత వర్షమును పరిపాలించిన క్షత్రియ రాజుల చరిత్రలందు సూర్యచంద్రవంశనులు ప్రముఖమైనవి. అందు సూర్యవంశ మూలపురుషుడు సూర్యుడే యనియు ఆయన పేరవే ఆ వంశము సూర్యవంశముగా పిలువబడుచున్నదనియు ఐతిహ్యము. పురాణపురుషుడైన శ్రీరామచంద్రుడు. అతని పూర్వీకులైన దిలీపుడు మొదలగు ఇక్ష్వాకు కుల మహారాజులు సూర్యవంశమునకు చెందినవారే. తదనంతరము జానపద చరిత్రలందు ప్రసిద్ధిగాంచిన భట్టివిక్రమార్కులును ఈవంశమునందు సంభవించినవారే. అట్టి మహోన్నత సూర్యవంశమునకు చెందినదే సాగిరాజ వంశమూ ఈ సాగిరాజ వంశమునకు మొదటివాడు దుర్జయ మహారాజు. ఆ దుర్జయ మహారాజునకు రణంజయ మహారాజును అతనికి ద్యుతికర్ణమహారాజును, ద్యుతికర్ణునకు ధవళకర్ణ మహారాజును ఉదయించిరి. ధవళకర్ణునకు మనుమలు హేమకర్ణ, సోమకర్ణులు వీరి కాలము నాటికి ఈ క్షత్రియ వంశము దేవగిరిపైన అధిపత్యము వహించుచుండెడిది పిదప సోమకర్ణునకు కుమారుడైన ద్విజకర్ణ మహారాజు నాటికి దేవగిరి మగధ రాజుల వశమైనది ద్విజకర్ణుడు మాగధులకు సామంతుడై వేంగి దేశమును పరిపాలిస్తుండే వాడు. పిదప సోమకర్ణ మహారాజునకు అన్న కుమారుడైన ప్రభాకర మహారాజు వీరుడై, మగధ రాజులనోడించి దేవగిరి దుర్గమును మరళకైవసము చేసికొనెను ఈ ప్రభాకర మహారాజునకు మునిమనుమడు సాగ్నిపీచి మహారాజు. ఈతనినే సాగిరాజనియు పిలుచుచుండుట చేత కాలకమమున వీరివంశమునకు సాగివంశమని యన్వర్థనామము కలిగినది,

ఇట్టి సాగిరాజవంశము కాలక్రమమున సామ్రాజ్యమును కోల్పోయి తంగెడు గ్రామ జమీందారీ వంశముగా నిలిచిపోయినది. సామ్రాజ్యము క్షీణించిపోయినప్పటికిని, ఈ వంశస్థులయందు సచ్ఛీలము ఏ మాత్రము తరిగిపోలేదు. ఈనాటికిని వీరిపూర్వీకుల ఘనత వీరియందు దృష్టఫలముగా గానవచ్చుచున్నది ఈ వంశీకులు మొదటినుండియు కళాసాహిత్యపోషకులై యశస్సు గాంచిరి.

ఈ వంశమునకు చెందిన జమీందారీ ప్రభువులు తంగెడు జమీందారీయందును ఆ గ్రామమునకు చుట్టుప్రక్కలయందును అనేక ప్రజోపయోగకార్యములనొనరించిరి. ఆయన ప్రశస్తి తంగెడు గ్రామజమీందారీ యందే కాక ఇతర ప్రదేశములయందు వ్యాపించి యుండెడిది. ఈవంశదీపకుడనదగిన శ్రీ బుచ్చివేంకట రాజగోపాలరాజుగారు తంగెడు గ్రామ జమీందారీయందే గాక యితర ప్రదేశంలందున్నూ కీర్తిపొంది యుండిరి. వారి కుమారుడున్నూ, వారి నాల్గవ అన్నగారైన జోగి జగన్నాధరాజు గార్కి దత్తపుత్రుడైన శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు గారు సమర్థుడైన రాజనీతిజ్ఞుడుగా అటవీశాఖామాత్యులుగా ప్రస్తుతము ఆంధ్రప్రదేశ ప్రభుత్వంలోనున్నారు. శ్రీ సాగి సూర్యనారాయణరాజుగారు వారి పూర్వీకుల వలెనే కళాసాహిత్యాభిమాని మహాపండితుడు. మహాకవియై ఆంధ్రప్రదేశ ఆస్థానకవిగా వెలుగొందిన కీ॥శే శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు రచించిన శ్రీకృష్ణ భాగవతమును అంకితము పొందినధన్యులు, మాన్యులు శ్రీ సాగి సూర్యనారాయణరాజుగారు.

శ్రీ రాజా సూర్యనారాయణ రాజుగారు శోభకృతనామసంవత్సర కార్తీక శుద్ధ ఏకాదశి. ఆదివారము ఉత్తరా భాద్రానక్షత్ర తులా లగ్నమందు జన్మించినారు.

సూర్యభగవానుడి పేరిట శ్రీ సూర్యనారాయణరాజు సూర్యునివలె వర్థిల్లుతూ మహదైశ్వర్యయుతుడై సర్వులకు వాంఛనీయుడై దేవగురువువగు బృహస్పతి వంటి గురునిపొంద విశ్వవిఖ్యాతుడై సర్వవిద్యలను నేర్చి చంద్రునిలా చల్లగా పెంపొందుతుండెను. దేవబ్రాహ్మణభక్తితో, పండితుల యెడ గౌరవభావముతో లోకధర్మము నెరవేర్చుచుండెను చేతికి వచ్చినంత విత్తముగాక సుజనులైన యాచకులువచ్చి అడిగినంతనే మంచి మనసుతో ఇచ్చెడువాడు. అంత ఇచ్చాను-ఇంతయిచ్చాను అని చెప్పుకొనడు "ఇచ్చెదనని చెప్పినంత" ఇచ్చువాడు. ఆడితప్పని వాడు. అభ్యాగ్యకుడు, భవ్యేనుడు, గొప్పవాడిననే గర్వములేనివాడు శ్రీ సూర్యనారాయణరాజు

స్నానము, సంధ్య, జపము. సజ్జనసేవ, ధర్మచింతన గాక అన్యవిధంగా కాలుకదపడు. దుష్ప్రసంగతిని మెలగడు. దుర్వ్యసనముల వంక నవులాటకయినను మనసుపోనివ్వడు.

అన్నలను తన తండ్రిలాగా కొలుచును. తమ్ములను తనయులలాగా ఆదరించును. సోదరపత్నులను తల్లులుగా భావించును. ఇతరుల విత్తము తృణప్రాయముగజూచును. భూతకోటిని తనఆత్మలాగ నిత్యము భావించును. తనను ఆశ్రయించిన వాడు ఏదైనా తప్పుజేసి, తప్పును ఒప్పుకుంటే ప్రశాంతంగా ఆదరించి వానికి హాని చెయ్యకుండా పూర్వపు ప్రేమకంటె నూరురెట్లు ప్రేమతో ఆతనిని ఆదరించును.

శ్రీ సూర్యనారాయణరాజు ఎలమంచిలి గ్రామములో దేవసేనాని సుబ్రహ్మణ్యస్వామి శూలిని దుర్గ, కేతగ్రహ దేవాలయం కట్టించి దాని ప్రతిష్ఠకు కొంత ద్రవ్యము వెచ్చించి, ధూపదీపాదియర్చనలు రెండు

పూటలా జరుపుటకు ప్రతి సంవత్సరము రెండు వందలరూపాయలు ఇచ్చుచున్నాడు. అంతేగాక ఆ యలమంచిలి గ్రామంలోనే 18 నెలలు జరిగిన సత్రయాగమునకు 18 నూర్లరూపాయిలను ఇచ్చిన త్యాగమూర్తి శ్రీ సాగి సూర్యనారాయణ రాజు. యెలమంచిలి తాలూకా పుపమంక అగ్రహారం శ్రీ వెంకటేశ్వరీ ఆలయం, నరసీపట్టణం తాలూకా కైలాసపట్టణం శ్రీ రాజగోపాలస్వామి ఆలయం, నరసీపట్టణం తాలూకా బలిఘట్టం శ్రీ బ్రహ్మలింగేశ్వర ఆలయములు పునరుద్ధరణ కార్యక్రమము నిర్వహించిరి.

శ్రీ వారికి ఆత్మగౌరవ మతాభివేశాలు అబ్బినవనుట సత్యదూరము. పుట్టుకతోనే వారిలోనివి, తలకొత్తెననుట నిక్కువము. గౌరవభంగమున్నచో ప్రాణము గూడా లెక్కచేయడనుట యదార్థము. నేను నీ వాడను నన్ను కాపాడుము అని ఎవరైనా ప్రార్థించిన వానిని కుమారునికన్న ఎక్కువగ సంభావించి అతని మనోరథమును తీర్చి ఎంతో దయతో అతనిని రక్షించును. శ్రీ సూర్యనారాయణరాజువంటి భక్తవత్సలుడు ఈ కలికాలంలో ఒక్కడూ కనబడడు.

కపటము, కల్ల, మోసము, విపరీతార్థము, వికటోక్తిదంభము శ్రీ సాగి సూర్యనారాయణ రాజు గారిలో లేవనుట సత్యము

శ్రీ సాగి సత్యనారాయణ రాజు దయాంతఃకరుణులు. తన వద్దకు వచ్చిన యెట్టివారికైనను దయతో వారు వచ్చిన పనిని తెల్సుకొని వారికి ఉచితమైన సమాధానమిచ్చి క్షణములో పంపును. ఇది వారి సహజ సద్గుణమని నిశ్చయముగా చెప్పవచ్చును.

కవులన్నా, కవిత్వమన్నా వారికి ఎంతో ప్రేమ, వారికి తన మనస్సునే అర్పించువాడు.

అడిగిన అర్థము అర్థులకు ముచ్చటగా ఇచ్చువాడు ఈ యుపకారము మీచేతనే కావలెనని యర్థించిన వారికి ఆ ఉపకారము చేసిపెట్టును ఇతరుల బాధను చేతనైనంతలో తొలగించును. భూతదయాళుత్వబుద్ధి వలన మంచివాడనే పేరు సంతరించుకొన్నాడు. ఇతడు సత్యవాక్య ప్రవర్తకుడు. శాంతుడు, సుగుణ సాంద్రుడు. మృదుల హృదయుడు ఆచార నిరతుడు, తదమరుడు – శ్రీ సూర్యనారాయణరాజు.

సుగుణములెల్ల పోగై వీక్షకులకు సంతసము కలుగునట్లు ఈ లోకంలో శ్రీ సాగి సూర్యనారాయణ రాజుగా జన్మమందెనో, లేక సుగుణములు ఉగ్గులో రంగరించి సొంపుగా బొజ్జలో పోసెనో–లేకుంటే లెక్కలేని సద్గుణాలు ఈ దొరకేల కలుగును.

శ్రీ వేంకట రాజగోపాలరాజునకుజననమంది శ్రీ కోగి జగన్నాథరాజేంద్రునకు దత్తపుత్రుడై తనను కలిదిండి వంశ వేంకటసుందరునకు, వేంకట సుభద్రయ్యకు కలిగిన వేంకట నరసయ్యను పెండ్లాడి ఘనముగా గార్హస్థ్యధర్మము నెరుపుతుండెను శ్రీమతి వేంకట నరసయ్య చంద్రమతికి, సావిత్రికి, సీతాదేవికి సాటియై పేరు గాంచిన సాధ్వీలలామ. విజ్ఞానధాను.

చాపలంతో పరజనుల, ధరనొల్లని మంగళాంగి ఈమె పదిమంది నోటపడి రచ్చకెక్కని మంజువాణి ఈమె. అర్ధాంగినని గర్వముతో భర్తను గద్దరింపని మృటివరాక్షి. పాటిచెప్పినా మాట్లాడ దలపెట్టని విభుద దేవి ఈ విభుదేంద్ర దేవని ఎల్లవారు కొనియాడుచుండ ప్రాణనాథుని మనసులో వశించుచు వాకాస్థాన మెలమిగొనియు అనువర్తనమున భర్తను కొలుచుచుండును గుణకదంబ వేంకటనరసమాంబ.

శరీరానికి నీళ్ళలాగ భర్తకు నీడయై, భర్తతో కలిసి యెల్లప్పుడు తన్వచిత్తముతో మాటామంతీతో ఒక్కటిగా కన్నులపండువుగా మెలగు ఈ మానవతీ లలామను వివాహమాడి మాన్యుడు ఈ సూర్యనారాయణ రాజు ధన్యుడాయెను.

అభినవ కృష్ణ దేవరాయ బిరుదాంకితులైన, ఈ మహా పురుషుని నేను ఒకసారి దర్శించుట సంభవించినప్పుడు నా కళాసేవ, ప్రచారము, నృత్యకళాపరిశోధన గూర్చి తెలిసికొని ఆనందించిరి. చిరుతప్రాయముననే అంతటి పాండిత్యము సంపాదించినందుకు సంతసం వెలిబుచ్చిరి. ఆంధ్రుల నృత్యకళా చరిత్ర వ్రాయుచున్న విషయాన్ని ప్రశంసించి, అట్టిది దేశానికి యెంతో ఉపయోగకారియని తెల్పి. అట్టి పరిశోధన విశేష వ్యయప్రయాసలతో గూడిన దగుటచే–నే కోరకముందే ఆ పరిశోధనకయ్యే ఆర్థిక సహాయము తాము చేయుదమని నిండుహృదయముతో సెలవిచ్చినారు. ఆ పరిశోధన కాలముననే తెలుగుభాషాసమితి వారు–"దాక్షిణాత్యుల నాట్యకళాచరిత్ర" రచన పోటీలు నిర్వహించినారు ఆ పరిశోధన ఫలితాలను ఈ గ్రంథ రూపములో రచన సాగించి పోటీలకు పంపినాను. ఈ గ్రంథము ఉత్తమ రచనగా యెంచి ప్రథమ బహుమతి యివ్వబడినది. ఈ రచనకు ప్రోత్సాహకులు శ్రీ రాజావారే గనుక వారికి నేనారాధించే నృత్య సరస్వతి చల్లని దీవెనతో సమర్పించుచున్నాను. వారు దయతో స్వీకరించినందునకు ధన్యవాదాల నర్పించుచున్నాను.

నృత్యనికేతనం,<br>హైదరాబాదు.

"భరత కళాప్రపూర్ణ"<br>నటరాజ రామకృష్ణ



శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు గారు

'చదివితి సకలశాస్త్రములు,
అందలి సారములెల్ల గ్రహించితి
అంత, విజ్ఞాన నేత్రంబు విప్పిజూడ,
తెలిసికొంటిని నాకేమి తెలియదంచు'
— ఖయ్యాం సూక్తి.

దివ్యవాణి—
తెలియనిది, తెలియదని చెప్పుట
అభ్యుదయానికి మార్గము.
తెలియనిదాని గూర్చి డాంబికములు పల్కుట
ఆత్మవంచనము,
విద్య వినాశానికి మొదటి మెట్టు.

( అభినయ విద్యాభ్యాసము ముగించి, సెలవు దీసుకొనునప్పుడు పూజ్యగురువు శ్రీమతి రాజమ్మగారు దీవిస్తూ పల్కిన అమృత వాక్కులు.)

ఈ గ్రంథము దక్షిణ భారతదేశమునందలి వివిధ నాట్య సాంప్రదాయములను గురించి తెలుగులో వ్రాయబడిన గ్రంథములలో ఉత్తమమని నిర్ణయింపబడి తెలుగుభాషాసమితి వారిచే జరుపబడిన పోటీలో ఆంధ్రప్రభుత్వమువారిచే ప్రథమ బహుమానమును పొందినది. ఈ బహుమానము ది. 22–6–1955 ని రాష్ట్రపతి డాక్టరు రాజేంద్రప్రసాద్‌గారిచే హైదరాబాదులో జరిగిన మహాసభలో నొసంగబడినది.

నటరాజ రామకృష్ణ

# దాక్షిణాత్యుల నాట్యకళాచరిత్ర

## విషయ సంగ్రహము



వింధ్యపర్వతమునకు దక్షిణమునగల ప్రదేశమునందంతటను వ్యాప్తిలోనుండియున్న వివిధ నృత్య, నాట్యకళారీతులను—ఆటవిక, జానపద, శాస్త్రీయ పద్ధతులలోని అన్ని విధానములనుగూర్చి విపులముగా ఈ గ్రంథమున చర్చించబడినవి. ఇందు నాలుగు భాగములు గలవు.

*మొదటి భాగములో*—

కళ, లలితకళలు, నృత్యకళ, మహారాష్ట్ర దేశముతోగూడిన దక్షిణ భారతమునందలి నాట్య సాంప్రదాయములు చర్చించబడినవి.

*రెండవ భాగములో*—

ఆటవిక, జానపద నృత్యములు చర్చించబడినవి.

*మూడవ భాగమందు*—

నృత్యకళాసారస్వతము, భరతుని నాట్యశాస్త్రము, అభినయ దర్పణము, అలంకారశాస్త్రము రస ప్రకరణము చర్చించబడినవి.

*నాలుగవ భాగమందు*—

భరతనాట్యము, దక్షిణదేశమునందు ప్రచారములోనున్న 'లాస్య' విధానము—దాసిఆట—దక్షిణదేశపు దర్బారు నృత్యములు, వాటియొక్క వివిధరీతులు—నృత్త, నృత్య, అభినయములు—ఇతర నూతన నాట్యవిధానములు చర్చింపబడినవి.

## వివరములు

*మొదటి భాగము*—

(a) *కళ*——కళకు ప్రకృతితోగల సంబంధము—లలితకళలు—నాట్యకళ, సంగీతము, చిత్రలేఖనము, శిల్పము. వీనికిగల సంబంధము—కళ, కళాకారుడు. కళాకారుడు ప్రకృతినుండి నేర్చుకొనదగిన విశేషములు.

నాట్యధర్మి, లోకధర్మి—వీనికి లలితకళలయందుగల ప్రాధాన్యత, జానపద కళలు—శాస్త్రీయ కళలు.

(b) *సంగీతకళ*——భారతీయ సంగీత, నృత్యములయొక్క చారిత్రక వివరణము.

(1) వేదయుగము. (2) శాస్త్రయుగము. (3) ఆధునికయుగము.

నాట్యకళ—సంగీతము—వీని యుత్పత్తి—చరిత్ర, కళ—మతము, నృత్యము—సంగీతము, పూజావిధానములలోని భాగములు. విద్యాధికులచేత, నాగరిక ప్రజలచేత ఆదరింపబడిన కళావిధానములు.

(i) దేవదాసీ నృత్యవిధానములు—దేవాలయ నృత్యములు, ఆలయములందు దేవతామూర్తుల యెదుట ప్రదర్శింపబడెడి శాస్త్రీయ నృత్యములు—పుష్పాంజలి, నవసంధి, భుజంగత్రాస, శుభలీల, ఆకాశచారి, భూచారి, కౌస్తుభము మొదలైనట్టివి.

(ii) కేళిక, కచేరీ లేక దర్బారు నృత్యములు—రాజదర్బారులందు, పండితసభలందు ప్రదర్శింపబడు నృత్యములు. మేళ ప్రాప్తి, జిక్కిణి, దండలాస్య, పేరిణి, జతి, శబ్దము, పదకేళిక, చౌపదకేళిక, దురుపదకేళిక, వర్ణము, పదము, జావళి, దేశి, దరువు, గుజ్జరి మొదలగునట్టివి.

(c) ప్రాచీన భారతీయ శాస్త్రీయ నృత్యరీతులు.

(i) మతసంబంధములైనవి—సవర, వీరనాట్యము, ఖడ్గనృత్యము, బెహుళ మొదలైనవి.

(ii) బృంద నృత్యము. } కురంగి కర్షణీ మొదలైనవి.
సంఘ, మతసంబంధములు.

(iii) ప్రబంధ విధానము—చలికము.

(iv) ఆలయ నృత్యములు—నవసంధి, బలిహరణ నృత్యములు.

(v) దర్బారు నృత్యములు—జకారి, మత్తావళి, తాండలిక—అందలి తాళములు, రాగములు, మృదంగ శబ్దములు—ప్రదర్శన రీతులు—హస్త, చారి, కరణ విన్యాసాదులయొక్క వివరణ.

(d) శివతాండవము—సప్తతాండవములయొక్క తాత్విక దృక్పథము—వాటియొక్క కలయిక, ప్రదర్శన విధానము. శివతాండవ పౌరాణిక దృక్పథము—తాండవములందు పాడబడునట్టి గీతములు, మృదంగశబ్దములు.

(e) దేవదాసి—దేవదాసీ విధానము—ప్రారంభము, అభివృద్ధి పతనము—దేవదాసీలలోని తరగతులు, ఆలయముల్లోని విధులు, శిక్షణ, నాట్యవిధానములు—ప్రత్యేక సమయములందు, పర్వదినములందు ప్రదర్శింపబడు నృత్యములు—శివదాసీలు విష్ణుదాసీలు, వారి నృత్యభేదములు— అందలి సంగీత రచనలు, తాళములు, వివిధ హస్తవిన్యాసములు, అడవులు మొదలైన వివరములు.

(f) నాట్యమేళములు—నట్టువమేళములు, భాగవత మేళములు—కూచిపూడివారి ప్రత్యేకత—

కూచిపూడి, కోటకొండ నాట్యమేళములు, మేలటూరు, శోలమంగలము, భాగవత నాట్యమేళములు—ఆయా నాట్య సాంప్ర దాయములు; అడవులు, జతులు, దరువులు, వృత్తములు, కందము, శ్లోకము, మొదలైనవి—ప్రదర్శన విన్యాసరీతులు—పాట, ఆట (నృత్యము), నాటకముల్లో పాత్రధారణ, ఆహార్యము లేక అలంకరణ, దుస్తులు, సహకార సంగీతము, వాద్య పరికర ములు, పాటలయందలి వివిధరీతులు, నృత్త, నృత్యములు మొదలగువాని వివరములు.

(g) కధకళి—మలబారు దేశమందలి నాట్యవిధానము—కధకళియొక్క పూర్వపు రీతులు—ముద్రలు, నవరసములు, కరణములు అంగ హారములు, తాళములు, శబ్దములు. ప్రదర్శనముల్లోని పాటలు—చెక్కిరాయకుత్తు, కైకొత్తుకళి, కుట్టి, సేవకలి, పంఘకళి, మొదలైనవి.

మోహిని ఆట్టము—మళయాళదేశపు నాట్యస్త్రీలచే ప్రత్యేకముగా ప్రదర్శింపబడునట్టి నృత్యవిధానము.

(h) కర్నాటక దేశమునందలి యక్షగాన సాంప్రదాయములు—అభినయ, నృత్య, నృత్త విధానములు.

(i) ఓరియంటల్ నాట్యము:— ఆధునిక నాట్యవిధానము— అభివృద్ధి, ప్రదర్శన. బుద్ధుని జీవితమందలి ఘట్టములు— "బుద్ధం శరణం గచ్ఛామి" వంటివి— నృత్య ప్రదర్శనము, సంగీత వాద్యరీతులు.

(j) దక్షిణ దేశమునందలి జానపద నృత్యములు. మత, సాంఘిక సంబంధములు:— (1) జానపద స్త్రీల నాట్యములు.
(2) పురుష నాట్యరీతులు.
(3) వృత్తిపరుల నాట్యములు.

(1) కుమ్మి, కోలాటము, బతకమ్మలాట మొదలైనవి.

(2) గరగలు, కోలాటము, తప్పెటగుండు, వీరనాట్యము.

(3) వీధిభాగవతము, జోగట, బొమ్మలాట, తోలుబొమ్మలాట, యానాది, దాసరి భాగవతులు, తమాషా, దండోరా, కురవంజి మొదలైనవి.

(k) నృత్య ప్రదర్శనము—ప్రదర్శనా విధానము సంపూర్ణముగా వివరింపబడినది.

*రెండవ భాగము—*

ఆటవికజాతుల, జానపద నృత్యములు:— ఆటవికులు, వారి వివిధ నాట్యరీతులు—సవరులు, గోండులు, బైగాలు, కోయలు, చెంచులు, బంజారులు, తోడాలు, గదబలు, బరియనులు, కురవలు యితరులు—

ఆటవిక, జానపదాదుల సాంఘిక మత సాంప్రదాయకాది నృత్యములు — బరియనుల నృత్యజాత్రలు—కురవల పంటల నృత్యములు, హల్చావేట నృత్యములు—గోండుల ఖర్మ నృత్యము, బైగాలయొక్క రేలా, సేనా నృత్య విధానములు—నాట్యరచనలు, తాళ కాల ప్రమాణాదులు, సంగీతము—ఆటవికుల నృత్యములందుపయోగింపబడు సంగీతోపకరణములు—వాద్య విశేషములు.

*మూడవ భాగము—*

నృత్యకళా సంబంధములగు గ్రంథములు, సారస్వతము. తాండవ, లాస్య, నృత్త, నృత్య, నాట్య, అభినయములకు ఈ దిగువను పేర్కొనబడినవి ప్రధానములగు ప్రమాణ గ్రంథములు.

(1) భరతుని నాట్యశాస్త్రము, (2) భరతార్ణవము. (3) అభినయ దర్పణం. (4) బలరామ భరతము. (5) హస్త లక్షణదీపిక. (6) సంగీత రత్నాకరము. (7) కుట్టినీ మతము. (8) నృత్త రత్నావళి.

ముఖ్యమగు అలంకార గ్రంథములు :—

(1) ప్రతాప రుద్రీయము. (2) రసగంగాధరము, (3) భావ ప్రకాశిక. (4) రసమంజరి. (5) భరత రస ప్రకరణము. (6) నరస భూపాలీయం (7) వాత్స్యాయనుని కామ సూత్రములు.

తెలుగు గ్రంథములు :—

(1) భరతసార సంగ్రహము. (2) అభినయ స్వయంబోధిని. (3) పంచరత్న ప్రబంధము. (4) భరతార్ణవము. (5) సభారంజని. (6) వివిధ సంస్థానములందు, నాట్యాచార్యులవద్దగల వ్రాత ప్రతులు. (7) పండితారాధ్య చరిత్ర. (8) బసవ పురాణము. (9) పల్నాటి వీరచరిత్ర. (10) కావ్యాలంకార సంగ్రహము.

అత్యంత ప్రాముఖ్యముగల ప్రమాణ గ్రంథము—భరతుని నాట్యశాస్త్రము. 36 అధ్యాయములు గలవు (36వ ప్రకరణము రెండు ప్రకరణములుగా విభజించబడి కొన్ని ప్రతులయందు 37 ప్రకరణములుగా గానబడుచున్నవి. నాట్యమునకు సంబంధించిన ప్రకరణములు వివరముగా చర్చించబడినవి—

(a) నాట్యము, నృత్య, నృత్త, లాస్య, తాండవములు.

నాట్యము—వివిధరూపములు. నృత్యము—వివిధరూపములు.

(c) నృత్తము—విషయ, వికట, లఘు మొదలగు రీతులు.

(d) లాస్యము—ఛురిత, యౌవరిత

(e) తాండవము—పేరణి, బహురూప.

(f) చతుర్విధ అభినయములు—ఆంగిక, వాచిక, ఆహార్య, సాత్వికములు.

(g) రసము, భావము—సాత్వికము. సంచారి భావములు—నాట్యమునందు ప్రదర్శించు విధము.

(h) నవరసములను రూపొందించు ప్రదర్శనానుకూలములగు ప్రత్యేక నృత్యరచనలు.

(i) తాండవలక్షణము—చారి, కరణ, అంగహార, రేచక, ఖండ, మండలాదులు.
108 కరణములు—కొన్ని కరణముల వివరణ, ప్రయోగము, నృత్యమందుపయోగపడు మృదంగ శబ్దములయొక్క వివరణ

(j) హస్తములు—సంయుత, అసంయుత, నృత్య నృత్త హస్తములు వాని ప్రాముఖ్యత.

(k) స్థానకములు, ప్లవనములు, భ్రమరములు, మొదలైనవి.

(l) నృత్య ప్రదర్శనమునందు నృత్త, నృత్యసమయ వివరణ.

(m) తాళములు—వాని ప్రమాణాదులు. నృత్యమునందుపయోగపడునట్టి వివిధములగు తాళములు, జాతులు.

(n) పాద విన్యాసము— అడవు, జతి, జాతులు మొదలైనవి.

(o) నృత్య శిక్షణ.

## అభినయము—

చతుర్విధాభినయము—ఆంగిక, వాచిక, ఆహార్య, సాత్వికములు. నవరసములు—వాటి సంపూర్ణ వివరములు.

సంచారి వ్యభిచారుల అభినయమునందు ప్రదర్శించు విధము. ఆంగిక, సాత్వికములు—లాస్య, తాండవములు వీనియందు ప్రయోగబడెడి రసములు.

తాండవమందు లాస్యవిధానము, లాస్య విధానములో తాండవము. ఉదాహరణ సహితముగా.

## నాయికా నాయకులు

శృంగార నాయికా నాయక వివరణములు. అలంకార శాస్త్రము ననుసరించి నాయికా నాయకులయొక్క వివరణము.

రసములు, రాగములు, తాళములు, యతులు. వాటిలో రచనలు—డమరుకయతి, మృదంగయతి. ఉదాహరణములతో వివరణము.

రసము—వాచికాభినయము.

రసములు—దుస్తులు. పాత్రధారణ, ఆహార్యాదులు. అలంకరణాదులు.

పైవాటికన్నిటికి ప్రమాణము—అలంకార శాస్త్రములు, రసశాస్త్రములు.

నాలుగవ భాగము—

భరత నాట్యము—దక్షిణ భారతదేశములోని ప్రభువులచేత పోషింపబడి, దేవదాసీలు, రాజనర్తకినులు రూపొందించి వృద్ధిచేసిన ముఖ్యమైన నాట్యవిధానము—భరత నాట్యము, కేళిక, దాసి ఆట, భోగము ఆట. దానియొక్క ప్రారంభము, అభివృ విజయనగరము, తంజావూరు దర్బారులందలి భరత విద్య.

క్షత్రియ ప్రభువుల ఆస్థానములయందును, వెంకటగిరి, కాళహస్తి, పిఠాపురము మొదలైన జమీందారుల ఆస్థానము యందును ఒనప్పబడిన నృత్య విధానములలోని రీతులు, వ్యత్యాసములు.

తంజావూరు, కార్వేటినగరము, కాళహస్తి, బొబ్బిలి, వెంకటగిరి, పెద్దాపురం, పిఠాపురము, విజయనగరము, జయపురవ మొదలైన జమీందారుల ఆస్థానముల యందభివృద్ధిగాంచిన నృత్యకళ—వివరణ.

కేళిక—పూర్వపు ప్రదర్శనరీతులు, ప్రస్తుత విధానము, ఎప్పుడెట్లు పెంపొందినది—ఈరెంటికిగల వ్యత్యాసము.

తంజావూరును పాలించిన నాయక ప్రభువులు. క్షేత్రజ్ఞులు—దక్షిణభారత నృత్య విధానమునందు ముఖ్యముగా అభినయ కళకు ఆయన జేసిన సేవ.

క్షేత్రయ్యకు పూర్వముండిన నృత్యకళ. క్షేత్రయ్య పదరచన తరువాత అభివృద్ధిజెందిన నృత్యకళ.

రఘునాథ నాయకుడు—లలిత కళలకు, నృత్యమునకు ప్రోత్సాహము.

విజయరాఘవ నాయకుడు—సంగీత, నృత్యకళలకు యక్షగానములకు గల్గిన యుపకృతి.

రంగాజమ్మ—కవయిత్రి, కళాసేవ.

మహారాష్ట్ర ప్రభువులు—యక్షగానములు (నృత్య నాటకములు) కళాభివృద్ధి—వీరికాలములో (భరతనాట్యము) కచ్చే నాట్యముయొక్క అభివృద్ధి.

చిన్నయ్య, పొన్నయ్య, వడివేలు, శివానందము మొదలైనవారి కృషి.

వెంకటరామశాస్త్రి—నృత్య నాటకములు, వీధి భాగవతములు, పదములు మొదలైన నృత్యసంగీత రచనలు—

సభాపతయ్య, సారంగపాణి, సీనయ్య మొదలైన కర్తలు.

## ఆధునిక భరతనాట్య ప్రదర్శనము

(1) అలరింపు (2) జతిస్వరము (3) శబ్దము (4) వర్ణము (5) పదము (6) జావళి (7) తిల్లాన (8) తరంగములు అష్టపదులు (10) శ్లోకములు;— ఇందలి నృత్య, నృత్త అభినయాదులు.

పదాభినయము—శృంగార నాయికలు, శృంగార రసము.

దాక్షిణాత్య వివిధ భరతనాట్యములు—ఉదాహరణములు. నాయికాభినయము పదములు—సోదాహరణము.

అష్టపది—గుప్తాభినయము, ప్రత్యక్షాభినయము.

రాగనృత్యము—వివిధ రాగములలోని భావమును ప్రకటించు నృత్యము.

దేశి, మార్గి భేదములు—వాని నృత్యరీతులు.

నర్తకుని కళా ప్రావీణ్య పరీక్ష

నృత్యకళ—నాట్యచార్యుడు.



# భారతీయ నృత్యకళ పెంపొందిన రీతి

ప్రకృతి.

కళలు.

లలితకళలు.

నాట్యధర్మి (మార్గి) — లోకధర్మి (దేశి)

లలితకళలు.

సంగీతము — చిత్రలేఖనము — శిల్పము

గీతము — వాద్యము — నాట్యకళ

నాట్యము — నృత్యము — నృత్తము

యక్షగానము నృత్యనాటకము — గేయ, వచన నాటకము — విషమ — వికట — లఘు

నృత్యము

లాస్యము — తాండవము

ఛురిత — యౌవరిత — పేరిణి — బహురూప

x x x x

నృత్తము

రసప్రధాన — గతిప్రధాన — జతిప్రధాన — శబ్దప్రధాన

నృత్యము



కథాప్రధాన        గీతప్రధాన

## ఆ ల య క ళ లు

ఆలయము (హైందవ సంస్కృతికి నిలయము)

అర్చకులు        పౌరాణికులు

x

హరిదాసులు        భజనకూటములు

x

విచిత్ర వేషములు
(పగటియందు
యొనర్చునట్టివి—:
పగటి భాగవతులు
పగటి వేషములు.)

యక్షగానములు

బహుపాత్ర (నాట్యము)        ఏకపాత్ర
(కలాపము)

x        x

నాట్యము

నాటకములు

తోలుబొమ్మలాట
బొమ్మలాట
వీధి భాగవతములు

x        x

వీధి భాగవతములు

నట్టువ మేళములు
(స్త్రీలు నృత్యమాడునవి)

భాగవత మేళములు
(పురుషులకు మాత్రం ప్రవేశం.)

x        x

**నటువ మేళము**




x x




---

**దేవదాసీల నృత్యము**



X

# భాగవత మేళములు

## (నాట్య మేళములు)

వీధి భాగవతులు

I (a) కూచిపూడి బ్రాహ్మణ భాగవతులు
(b) కోటకొండ
కపటాల్రి భాగవతులు
(c) యానాది భాగవతులు
(d) చెంచు భాగవతులు
(e) గొల్ల భాగవతులు
(f) నక్కల భాగవతులు
(g) దాసరి పాటకులు
(h) బహురూపులు (ఆంధ్ర)

II బ్రాహ్మణ భాగవతులు (తమిళనాడు)
మేలత్తూరు, ఊత్తుకాడు, శూలమంగళం

III యక్షగాన నర్తకులు (కర్నాటక)

IV కథాకళి
చక్కియార్ కుత్తు
కుట్టియాటమ్ (మలబారు)

V రామలీలా
నౌటంకి
భరతులు (ఉత్తరదేశము)

VI గాజన్ (వంగదేశము)
(శివలీల)

VII దండోరా (మహారాష్ట్ర)

కలాపములు
(ఆంధ్రలో ప్రచారమునందు గలవు)




---

కలాపములందు తప్ప భాగవత నాటకములందు స్త్రీలు పాల్గొనరు. స్త్రీ పాత్రలుగూడా పురుషులే నాట్యమాడుదురు. ఇందలి నాట్యరీతులు తాండవమునకు జెందినట్టివి. గనుకనే స్త్రీ పాత్రల నృత్యము శుద్ధలాస్యముగాక, తాండవ నృత్యవిధానములోనే తేలిక పద్ధతులలో నొనర్పబడును.

నట్టువమేళము.




X X X

## వాద్యపరికరములు.

(1) చర్మవాద్యములు—మృదంగము, తబలా, శుద్ధమద్దెల మొదలైనవి.
(2) గాలివాద్యములు—వేణు, ముఖవీణ, మొదలైనవి.
(3) తంతి లేక తంత్రీవాదములు—వీణ, తంబురా, వాయులీనము మొదలైనవి.
(4) తిత్తి—(శృతి)
(5) జలవాద్యము—జలతరంగిణి.



దశావస్థలు.

| | | | |
|---|---|---|---|
| (1) | చక్షుఃప్రీతి | (6) | తాపము |
| (2) | చింత | (7) | లజ్జాత్యాగము |
| (3) | సంకల్పము | (8) | ఉన్మాదము |
| (4) | గుణనుతి | (9) | మూర్ఛ |
| (5) | క్రియాద్వేష | (10) | మృతి |

---

## కళాశాస్త్ర పరిమాణములు

నాయికా




నాయకులు




x x x

ప్రఖ్యాత నాయకులు




'శృంగారి' అను నాయకుని గూర్చి రసరత్న కోశమున పేర్కొనబడినది.

---

పురుష




x x x

శృంగార నాయక




x x x

నర్మసచివ




x x x

# నాయికా భేదములు

ప్రకృతి



### పరకీయ

కన్య　　　　　　　　　　పరోఢ

ప్రాచీన మతానుసారము చెప్పబడిన 16 నాయికలు
ఎనిమిదేసి దశావిశేషములచే ఒక్కొక్కరు 8 విధములగుదురు.
(వారే ప్రోషిత, ఖండిత మొదలైనవారు.)
వీరిని లెక్కింప (16 × 8) = 128 భేదములు.
మఱియు ఉత్తమ, మధ్యమ, అధమ అను భేదములు లెక్కింప (128 × 3) = 384 భేదములు.
వీరినే దివ్యా, అదివ్య, దివ్యాదివ్య అను భేదముల లెక్కించిన (384 × 3) = 1152 భేదములగును.




## రసములు—6

శృంగారము, వీర, కరుణ, హాస్య, భయానక, రౌద్ర, భీభత్స, అద్భుత, శాంత.

x　x　x



శృంగార




x x x

(రసము — మనస్సుచే నెఱుగదగిన సుఖవిశేషము భావజ్ఞులచే ఆస్వాదింప బడుచున్నది. రసిక హృదయముల స్రవింపజేయునది. ద్రవింపజేయునది, రసము.)

## విభావ—అనుభావములు




x x x




x x x




x x x




x x x




x x x

పేరిణి
అంగములు—5




x x x

తంజాపూరు నేలిన నాయకరాజుల కాలములోనుండిన ప్రాచీన నృత్యరీతులు — 20

1. చౌపదకేళిక
2. దురుపదకేళిక
3. పదకేళిక
4. పదము (నప)
5. కోపు
6. దురుసైవకోపు
7. పేరిణి
8. జక్కిణి
9. దేశి
10. కొరవంజి
11. చిందు
12. దండలాస్య
13. కొరము
14. మదనబలదూత్యము
15. గుజ్జరి
16. శుభలీల
17. గుజరాతిదేశి
18. వాల్చిచి
19. ఏల్వేదు
20. కందుకక్రీడ

x x x

"పుష్పాంజలి"నందు పట్టవలసిన అడవులు — 6




x x x

చంద్రశేఖర మతానుసారము. ప్రాచీన నాట్యభేదములు—24

1. శృంగార
2. ఉగ్ర
3. భృంగి
4. చిత్ర
5. చారి
6. చాళియ
7. శుద్ధ
8. హస్తచాళియ
9. మార్గ
10. అంగహార
11. పాదచారి
12. పార్శ్వక
13. ముఖచాళియ
14. లవణి
15. పేరిణి
16. దేశి
17. లీలా
18. తాండాళిక
19. సంధి
20. ప్రాంత
21. భూచారి
22. ఆవృత్త
23. విద్యుద్భ్రమర
24. పుష్పాంజలి

ఇందు శుద్ధ, దేశి—మంగళప్రదములు

---

## ఆలయ నృత్యములు (ఆరాధన నృత్యములు)

| | |
|---|---|
| 1. నవసంధి | 9. కుంచిత |
| 2. సర్వవాద్యం | 10. అకుంచితపాద |
| 3. సమపాద | 11. ఊర్ధ్వపాద |
| 4. భుజంగ | 12. కమలనృత్త |
| 5. భుజంగార్చిత | 13. మండలనృత్త |
| 6. భుజంగత్రాస | 14. దండపాదనృత్త |
| 7. భుజంగలలిత | 15. సంధ్యానృత్త |
| 8. భ్రమరిక | 16. మర్మణి |

x x

శివుని ప్రీతికి— 'వికుంచిత' (కరణము 64)
శివ ప్రీతికి — 'తలపుష్పపుట' (కరణము 1)
ప్రదర్శింపవలెను.

శివాలయంలో సంధ్యకాలమందు ప్రదర్శించునట్టిది — "భుజంగత్రాస."

x x

### పిండిబంధములు—4

ఉపయోగములు— 1. దేవతల వాహనముల జూపుటకు.
2. పాత్రలు రంగస్థలమునుండి విష్క్రమించుటకు.
3. బృందనృత్యములందు వివిధ విధములుగా రూపొంది నర్తించుటకు

x x

పిండి




x x x

## పిండి - (నేటి భరతనాట్యములో వినియోగము)

| బేద్యక | శృంఖలిక | లత | పిండము |
|---|---|---|---|
| (ప్రారంభంలో మేళప్రాప్తి, అలరింపులు.) | అభినయమందు ప్రతిచరణమునందు ప్రవర్తించే ముక్తాయిలు) | (అల్లిక జతులు లేక భ్రమర నృత్తము) | (నృత్తముయొక్క ముగింపు లేక తీర్మానము.) |

### పిండి - వాహనములు

విష్ణు - గరుడు

శంకరుడు - నంది

మన్మధుడు - రాచిలుక మొదలైనవి.

పిండీ - బృందనృత్యములందు చక్రాకారము, పత్రాకారము, కోలాటములందు జడపిల్లుట - మొదలైనవి.

### తీర్మానము - 2 విధములు

నృత్త, నృత్యములు ముగింపు అంగవిన్యాసము రెండు విధములు.

1. హైందవ సాంప్రదాయ విన్యాసము :-

ఇందు కుడిచేతితో పుష్పములు వేయుచున్నట్లు అలపల్లవముతో ముగించబడును.

2. తురుష్క ప్రభావము.

ఇది సలామ్ జేయుచున్నట్లు పతాకముతో ముగించబడును.

## నృత్యమునందు ఆహార్యమునకు ఉపయోగపడునట్టి శిల్ప, చిత్ర లేఖనములు

### శిల్పము

నృత్త, నృత్తములు

ఎల్లోరా.
రామప్ప.
తంజావూరు, తాడిపత్రి, శ్రీశైలము
నాగర్జున.
చిదంబరము, కంచి కైలాసనాధ ఆలయం.
లేపాక్షి, బేలూరు, అహోరావు, కొనరక్ మొదలైన ఆలయ శిల్పములు.
నృత్త, నృత్యములందు అలంకరణమునకు ఉపయోగించును.

### చిత్రలేఖనము

అభినయము

అజంతా,
లేపాక్షి,
మాచర్ల
తంజావూరు ఆలయములలోని చిత్రలేఖనము,
కొచ్చిన్ రాజభవనంలోని గోడలపై చిత్రములు,
రవపుత్ర
నాయికా నాయకుల,
రాగరాగిణీ చిత్రములు
ప్రబంధ పద్ధతి అలంకరణకు ఉపయోగించును.

### నృత్య భంగిమలతో నలరారు ఆలయములు

(108 కరణములు)

1 కంచి కైలాసనాధ ఆలయము.
2. తంజావూరు బృహదీశ్వరాలయము.
3 చిదంబర నటరాజాలయము.
4. ఎల్లోరాలో శివభంగిమలు.
5. రామప్ప గుళ్ళలో ప్రత్యేక నృత్య భంగిమలు.
6. తాడిపత్రి ఆలయములు.
7. అలంపుర ఆలయములు.
8. శ్రీశైలము.
9. అహోరావు.
10. బేలూరు

అభినయ అభ్యాసమున కుపయోగించునట్టి శిల్ప, చిత్రలేఖనములు :-

శిల్ప - నాగార్జున; బేలూరు.
చిత్రలేఖనము - అజంతా.
అలంకార విశేషములు (ప్రాచీన శిల్ప చిత్రలేఖనముల్లో)

పుష్పముల్లో - పద్మము.
పక్షుల్లో - రాజహంస.
జంతువుల్లో - ఐరావతము.

## ఆలయాల్లోని దేవతామూర్తులు శిల్ప నృత్యకళల సంబంధము

నృత్యములో దేవతామూర్తుల నభియించినప్పుడు ఈ క్రింది భంగిమలందు ప్రదర్శింతుము. ఆ రీతినే ఆలయశిల్పముగూడా శిల్పులు చెక్కినారు.

ఇవి ముఖ్యముగా 5 రకములు.

1. స్థానకము - నిలబడివున్న స్వామి.
2. ఆసీనము - కూర్చున్న దేవుడు)
3. శయన - (పవళించినవారు).
4. యాన - (పయనించుచున్న మూర్తి).
5. నృత్య - (నర్తనమాడుచున్న స్వామి)

వివరణ - ఉదాహరణములు :-

1. స్థానక :- ఎక్కువగా జ్ఞానప్రబోధము చేయుచున్న బుద్ధ విగ్రహములు; జిన విగ్రహములు, శ్రీ వేంకటేశ్వరస్వామి (తిరుపతి) యీ భంగిమలో చూచెదము.

2. ఆసీన :- పద్మాసనమందై యున్న బుద్ధుడు, పట్టాభిషిక్తుడైయున్న రాములవారు, వినాయకమూర్తి - మొదలైనవారిని యీ భంగిమలో ప్రదర్శింతుము.

3 శయన :- శ్రీరంగంలోని రంగనాథస్వామి ('పాలకడలి శయన రారా' - అని గానము చేయునప్పుడు పట్టే భంగిమ

4. యాన:- "గరుడగమన రారా
నను కరుణనేలుకోరా"

ఇట్టి కీర్తనలందు గరుడవాహనారూఢుడైన స్వామిని ప్రదర్శింతుము. అట్టి భంగిమయే "యాన"

5. నృత్య:- నటరాజ లేక శ్రీకృష్ణ, లేక గణపతి, మొదలైనవారి నాట్యములందు పట్టే భంగిమలే.

"ఆనంద నటనం ఆడినార్"
"కాళీయ మడుగులో తాండవ
కృష్ణుడు - అడుగో! అడుగో!
అడుగడుగో!!!"

"తాండవ నృత్యకరా
గజానన"

* * * *

మరియు ఈ దేవుళ్ళు 4 రకములుగా చిత్రింపబడుతారు. అభినయింపబడుతారు.

1. ధ్యానమూర్తులు :- యోగనిష్ఠలోనున్న మూర్తులు (ధ్యాన బుద్ధమూర్తి, శివమూర్తి శివునికొరకు తపస్సు చేయుచున్న పార్వతి. అభినయమందు ఈ భంగిమ ప్రదర్శితము)

2. భోగపద్ధతి - వైభవోపేతముగా నున్న దేవుడు - (ఉమాసహిత శివుడు రాధాసహిత మాధవుడు, లక్ష్మీ నారాయణులు).

3 వీరమూర్తులు .- దుర్గను, చండికను అభినయించునప్పుడు పట్టే భంగిమలు త్రిపురసంహారం మొదలైన శివకథలందు పట్టే భంగిమలు .-

"ధగద్ ధ్ధగద్ధగ ధగద్ ధ్ధగయని అసురులు బెదర జగములు అదర అజరాజ్ త్రిపురసంహారము జేసిన"

4. అభిచారిక మూర్తి - ప్రియజనముతో కేళీవిలాసాల తెలియాడు మూర్తి - పరమశివుని 'సంధ్యాతాండవ' వర్ణన నటనము - కృష్ణుని 'రాసక్రీడ' నర్తనము

* * * *

హిందూమతములో సృష్టి, స్థితి లయ కారకులైన ముగ్గురు మూర్తులను ఆరాధిస్తారు వారే బ్రహ్మ, విష్ణు, ఈశ్వరులు -

ఏ కారణముచేతనో సృష్టికర్త అయిన బ్రహ్మకు యెక్కువ ప్రాముఖ్యతగాని, పూజలుగాని లేవు. భారతదేశం మొత్తంలో ఐదు, ఆరు ఆలయాలకంటే యెక్కువగా లేవు. ఆంధ్రలో రెండు చిన్న ఆలయములున్నవి. ఒకటి శ్రీకాకుళంవద్ద, రెండవది చేబ్రోలు-గుంటూరు జిల్లాలో.

మిగిలినవారిలో యీశ్వరుడు ఎక్కువగా ప్రాముఖ్యత వహిస్తాడు నర్తనమూర్తిగా. విష్ణు కృష్ణావతారమూర్తిగా వర్ణింపబడినప్పుడు తప్ప, నర్తనముతో ఎక్కువ సంబంధము లేదు.

శివుని మూర్తులను ముఖ్యముగా నాల్గురీతుల చెప్పవచ్చును

1. సాధారణంగా మనం ప్రతి ఆలయంలో చూచే లింగస్వరూపము, వృషభ వాహనమూర్తి, పార్వతీసహిత పరమేశ్వర మొదలైనవి అర్ధనారీశ్వర యిత్యాది అపూర్వ కళాఖండాలు.

2 పరప్రధానమూర్తి లేక ప్రసన్నమూర్తి. ఇతరులను అనుగ్రహిస్తున్నట్లుగా ప్రదర్శించట.

3. సంహారమూర్తి–రాక్షససంహారము చేయుచున్న మూర్తి–గజాసురవధ చేయుచున్నట్లు. త్రిపురాసురుని హరించుచున్నట్లు. అంధకాసురుని హరించుచున్నట్లు చిత్రించుట. వర్తించుట చేయుచున్నాము

4. ఇంకనూ కొన్ని ప్రత్యేక మూర్తి రూపాలను ప్రదర్శించుచున్నాము

నటరాజమూర్తి. కళ్యాణ సుందరేశుడు. భిక్షాటనమూర్తి. కాలభైరవ. వీణాపాణి ఇత్యాదులు. ఇవియేగాక ఆయా శివకథ ననుసరించి ఎన్నియో భంగిమలను ప్రదర్శింతుము ఆ కల్పనయే ఆలయములందు శిల్పులు చేసినారు ఈ భంగిమ లన్నియు నాట్యమందు ప్రదర్శింపబడే 33 స్థానకములందు ఏదో ఒకదానిలో వుండును

శివమూర్తి తరువాత మన కెక్కువగా వచ్చునట్టిది–విష్ణుకథ:-

ఇందు యెక్కువగా దశావతార కథలు ధర్మ సంస్థాపనార్థమై విష్ణు వెత్తిన పది అవతారములు) ప్రదర్శింపబడుతాయి ఒక్కొక్క అవతారమునకు ఒక్కొక్క ప్రత్యేకత వున్నట్లే. ఆయా భావప్రకటితమును బట్టి భంగిమలందును రూపము లెన్ని మారినా వాటికి మూలమైన స్థానకము. భంగిమలు మాత్ర మొక్కటియే మూర్తివిబట్టి అలంకరణ. స్వరూపముల్లో భేదము కనబడును ఈ అవతారముల్లో కృష్ణావతారము జగద్విఖ్యాతి గాంచినట్లు – ఆయనకు పట్టే భంగిమలు అనేకములై అలరారుచున్నవి. ఆయా కథల ననుసరించి ఎన్నో రీతుల భంగిముల ప్రదర్శించుచున్నాము.

మరి యిద్దరు ప్రత్యేక మూర్తులు:- గణపతి. కుమారస్వామి వీరికిగూడా ఆయా వర్ణనల ననుసరించి భంగిమల నేర్పరచుకొని ప్రదర్శించినట్లే. చిత్రీకరించుటలో గూడ అట్టి సూత్రమే పాటించబడుతుంది

ఈ విషయాలు కళాకారులు జ్ఞప్తియందుంచుకొని ఆలయ శిల్పకళను పరిశోధించిన – నృత్యకళకు. శిల్పానికి గల సంబంధం తెలిసికొని. వారి నాట్యకళను యెంతగానో అభివృద్ధి చేసుకోగల్గుతాము.

## భారతీయ నృత్యకళయొక్క సంపూర్ణ స్వరూపము

| ఆరాధనశైలి (మతసంబంధ నృత్యము) | కచ్చేరిశైలి. (దర్బారు నృత్యము) | ప్రచారశైలి. (భాగవతులు | జానపదశైలి | ఆటవికశైలి. |
|---|---|---|---|---|
| 1. దాసి ఆట. | 1. భరతనాట్యము. | 1. భాగవతము (ఆంధ్ర | 1. కుమ్మి. | 1. అగ్నినృత్యము. |
| 2 వీరనాట్యము | 2. మోహిని ఆట | 2. భాగవతము (తమిళ) | 2. కోలాటము. | 2 ఋతువుల నృత్యములు |
| 3 వీరుల కొలుపు. | 3. భోగమాట | 3. కథకళి | 3 గొబ్బి | 3. పంటల నృత్యములు. |
| 4. గరగలు | 4 కళావంతనాట్య. | 4 దండోరా | 4 గర్బ | 4 యుద్ధ నృత్యములు. |
| 5. సంధితాళ | 5. కథక్ | 5. నౌటంకి | 5 బతకమ్మలాట. | 5. నృత్యజాత్రలు. |
| 6. భుజంగ తాన | 6 ఒడిస్సీ. దక్కని | 6 యక్షగానము. | 6 జోగాట. | 6. అనుకరణ నృత్యములు. |
| 7. కుభలీల. | 7. కేళిక | 7 కీర్తన | 7. తప్పెటగుంపు | ఉదా వృషభ నృత్యము. |
| 8. కావడిచిందు | 8. ఖేంటా. | 8. పౌవాడ | 8 బంగ్డా. | సర్పనాట్యము. మయూర |
| 9. భగవతిపాట | | 9. సొక్కనాట. | 9. జంగంపాట. | నృత్యము మొదలైనవి. |
| 10 చిరతల భజన. | | | 10. జముకుల. | 7. సర్ప నృత్యము |
| 11 సేవ. | | | | 8. పక్షుల నృత్యములు |
| 12 సేవకళి. | | | | |
| 13 అగ్నినృత్యము | | | | |
| 14 చౌనృత్యము | | | | |
| 15. రాసలీల. | | | | |
| 16 లయహరోబా. | | | | |
| 17. లామానృత్యము. | | | | |
| 18. రామలీలా. | | | | |
| 19 రంగనృత్యము. | | | | |
| 20 అంభిదూనట | | | | |

## తమిళ, ఆంధ్ర, కర్ణాటక, మళయాళ దేశములందలి శాస్త్రీయ నృత్యకళ

స్త్రీలచే చేయబడునట్టి శాస్త్రీయ నృత్యము.

తమిళదేశము ,
కర్నాటకము భరతనాట్యము
ఆంధ్రదేశము ,
మలయాళ దేశము - మోహిని అట్టము

* * * *

పురుషులు ఆరాధించు నృత్య సంప్రదాయము

ఆంధ్రదేశము | భాగవత మేళము
తమిళదేశము |

కర్నాటక ప్రాంతము - యక్షగానము
మలయాళ దేశము - కథకళి

* * * *

స్త్రీలచే ఆరాధింపబడిన నృత్యకళ.

ఆంధ్ర, తమిళ, కర్నాటక ప్రాంతాల్లో ఒకేరీతిగా అభివృద్ధి గాంచినది

మోహిని అట్టము మాత్రం కొంత వేరుగానున్నది.

* * * *

భాగవత మేళ సంప్రదాయము-

ఆంధ్ర తమిళ ప్రాంతాల్లో ఒకేతీరుగాను; కేరళ కర్నాటక ప్రాంతములందు మరొక తీరుగాను అభివృద్ధి గాంచినది

యక్షగానములందు తమిళాంధ్ర ప్రాంతాల్లోని నర్తకులు పాడుచూ నర్తనము సల్పుదురు. కర్నాటక ,మలయాళ నర్తకులది మూగనాట్యముగా నుండును.

* * * *

ఆంధ్ర, తమిళ కర్నాటకములందు స్త్రీల విద్యలో అభినయము ప్రాధాన్యత వహించును.

మోహిని అట్టము, అంగిక ప్రాధాన్యత గల్గిన నృత్యము

* * * *

భరతనాట్యములో-

నృత్త నృత్యాభినయములం దుపయోగపడునట్టి సంగీత రచనలు:

### నృత్తము

స్వరపల్లవులు, శబ్దపల్లవులు, సాహిత్య పల్లవులు, జతిస్వరములు, జాతిస్వరములు, తిల్లానలు, గీత ప్రబంధములు మొదలైనవి.

నృత్యము :-

తరంగములు, అధ్యాత్మ రామాయణ కీర్తనలు, శబ్దములు సలాము జతులు, జక్కిణి దరువులు, పదదరువులు, స్వరజతులు, తాన వర్ణములు, పద వర్ణములు పెద్ద వర్ణములు దరువులు, అష్టపదులు, కైవార ప్రబంధములు, శివతాండవ గీతములు మొదలైన రచనలు

### అభినయము

శ్లోకములు (కృష్ణ కర్ణామృతము, పుష్పబాణ విలాసము, రసమంజరి మొదలైనవి) క్షేత్రయ్య, అన్నమాచార్య, పురందర దాసు, సభాపతయ్య, సారంగపాణి, ఘనంసీనయ్య మొదలైన వారి పదములు, జావళీలు గీతములు మొదలైనవి

భరతనాట్యములో అతి ముఖ్యమైన రచనలు "పదములు". అందు త్రిపుట తాళమందున్న రచనలు విశేష ప్రాముఖ్యత వహించును

* * * *

భాగవత మేళములందలి సంగీత రచనలు :

ద్విపద, దరువు, వృత్తము, పంచామరము, కైవారము, కందము, కందార్థము, సీసము, సీసార్థము, ద్విపద, ద్విపదార్థము, ధవళము, త్రిభంగి అష్టకము ఏల, హెచ్చరిక, అర్ధచంద్రిక, శోభనములు మొదలైన రచనలు.

అతి ముఖ్యమైన రచనలు :

దరువు, ద్విపద

* * * *

నాట్యమునందుపయోగపడే వాద్యములు :

కరతాళములు, గంటలు, మృదంగము, శుద్ధమద్దెల, చండ వాద్యము, పిల్లనగ్రోవి, వేణువు, ముఖవీణ, శంఖము, స్త్రీ పురుష గాత్రము, కంజీర.

సునాదముగల గజ్జెలు భారతీయ నృత్యానికి జీవము.

* * * *

### పదములు

| ప్రముఖ పదకర్తలు | — ముద్రలు |
|---|---|
| క్షేత్రయ్య | మువ్వగోపాల |
| తాళ్లపాకవారు | శ్రీ వెంకటేశ్వర, వెంకటాచలపతి. |
| పురంధరదాస | పురంధర విఠల |
| ఘటపల్లివారు | కైలాసపతి |
| జటపల్లివారు | జటపల్లి గోపాల. |
| బొల్లాపురమువారు | బొల పరము |

శోభనగిరి – శోభనగిరి.
మల్లికార్జున – మల్లికార్జున. కృష్ణ.
వినుకొండవారు – వినుకొండ విజయరాఘ.
వేనంగివారు – వేనంగి.
సభాపతయ్య – రాజగోపాల.
వీరభద్రయ్య – వరద వెంకటేశ్వర.
మాతృబుద్ధేశ్వరవారు – దామెర కుమార వెంకటభూపాల.
యువరంగ – యువరంగ.
మనంపీనయ్య – మన్నారురంగ.
కస్తూరిరంగ – కస్తూరిరంగ
పరిమళరంగ – పరిమళరంగ.
సారంగపాణి – వేణుగోపాల
ముత్తుతాండవర్ – నటరాజ.
పాపవినాశ మొదలియార్ – విందాస్తుతి
మేటూరి వెంకటరామశాస్త్రి – మల్లజేంద్ర
ఇవిగాక నారాయణతీర్థుల తరంగములు –
జయదేవుల అష్టపదులు.

పదములకు నుపయోగించిన రాగములు :–

కాంభోజి, యెరుకలకాంభోజి, గుమ్మకాంభోజి, శంకరాభరణము, సురట, తోడి, భైరవి, శహన, బేగడ, అఠాణ, మోహన, కళ్యాణి, కేదారగౌళ కేదార, నీలాంబరి, ఆహిరి భూపాల, ఘంట, పున్నాగవరాళి వరాళి. నాదనామక్రియ, అసావేరి, సావేరి, సౌరాష్ట్రి, ఆనందభైరవి, గౌరి, కురంజి కామవర్ధిని, సైంధవి, కాపి, ధన్యాసి, శ్రీరాగము, పంతువరాళి, నాట, బిలహరి, మాలవశ్రీ, పూర్వి – మొదలైనవి.

పదములం దుపయోగించిన తాళములు :–

త్రిపుట, ఆది, రూపక, జంపె, ఏక, అట, చాపు మొదలగు తాళములు.

పంచముఖి తాళములు శివతాండవమునం దుపయోగింపబడు చున్నవి.

108 తాళములు కరణ విన్యాసమునందు, పూజానృత్యములం దుపయోగింబడును.

'శబ్దములు' యెక్కువగా కాంభోజిరాగమందు, చాపుతాళమందు పాడబడుచున్నవి.

## ఆంధ్రలో శాస్త్రీయ నృత్యకళ

శాతవాహనులు, ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, చోళులు, పల్లవులు వారి రాజ్యపాలనలో నృత్యకళ అభివృద్ధిచెందిన వివరములుగల గ్రంథములు లభ్యమగుటలేదు.

వైదికమతము, యజ్ఞయాగాది సమయములందు చేయబడే వివిధ నృత్యగానముల వివరములు తెలియకున్నను, నాగార్జున స్తూపములందలి స్థానక రేచక విన్యాసాదులనుబట్టి నాటి విద్యగూర్చి కొంతవరకు తెలియుచున్నది.

జపామదేశమునందలి బౌద్ధాలయాల్లోని ఆరాధన నృత్యకళ తిలకించిన ప్రాచీనాంధ్రమునందలి బౌద్ధయుగమునాటి కళగూర్చి తెలిసికోగలము.

బౌద్ధముతరువాత శైవము, వీరశైవము పశుపతి సంప్రదాయము. జైనుల ప్రభావములో నృత్యమభివృద్ధి గాంచినట్లు లేదు. కాకతీయుల కాలములో ఆంధ్రలో నృత్యకళ అనేకరీతుల వృద్ధిచెందెను.

ఆధార గ్రంథములు : జాయపసేనాని నృత్తరత్నావళి. రామప్ప గుళ్లలోని సుందర నృత్యశిల్పము.

రామప్పలోని వినాయక నర్తన భంగిమలు :–

అష్టదిక్పాలక ఆరాధన సమయములందు ( బలిహరణ ) గజస్తంభమువద్ద నర్తకిచేసే ప్రథమనాట్యము గణపతి ఆరాధన.

మదనక్కలిత కరణ విన్యాసము :–

విష్కుట వినాయక తాళమునందు, గణపతి కవుత.

నృత్యము :–

అటుపై వివిధ కరణాంగహారములతో కుమారస్వామి ఆరాధన

తరువాత ఇంద్రస్తవము.

ఆ గణపతినాట్యమే భంగిమలందు రూపొందించబడినది. కాకతీయుల కాలములో శైవ సంప్రదాయవిద్య విరివిగా ప్రచారములోనికి వచ్చినది. చోళులు, పల్లవులకాలమునందుగూడా భరతార్ణవమునందు వర్ణించబడిన సంప్రదాయములు –

దేశి, పేరిణి ప్రేంఖణ, దండిక ఇత్యాది సప్తలాస్యములు ప్రచారమునం దుండినవి.

ఆనాటి తెనుగు భరతాది గ్రంథములందు పై నాట్యముల గూర్చి అచ్చటచ్చట సూచించబడెను.

విజయనగరరాజుల కాలము :

వీరవైష్ణవము, వైష్ణవమత ప్రచారానికి అనుగుణ్యమైన కళాభివృద్ధి

అభినయకళ ప్రత్యేకాభివృద్ధి : రాధామాధవ మధురభక్తి ఉపాసన గీతగోవిందాది ప్రబంధములకు అభినయము.

యక్షగాన కళాభివృద్ధి : యక్షగానము ప్రత్యేక దేశి సంప్రదాయ విద్య.

యక్షులు (జక్కులు), నాగులు : ఆంధ్రలోని అతి ప్రాచీన తెగలు.

రెడ్డిరాజుల కాలమునాటి విద్యకు 'వసంత రాజీయము' గ్రంథము ముఖ్యము. అది లభ్యమగుటలేదు.

* * * *

తంజావూరు, మధుర నాయక రాజులు.

యక్షగానములు, కేళిక (కచ్చేరి నాట్యము).

అభివృద్ధి :

కచ్చేరి నాట్యము : నృత్త, నృత్య, అభినయ క్రమముల యేర్పాటు.

క్షేత్రయ్య పదములు అభినయ విద్యాభివృద్ధికి కారణము.

## యోగి సిద్ధేంద్ర :

ప్రాచీన యక్షగాన రీతిలో (పారిజాత నాటక) భామాకలాప రచన. ఆ విద్య కూచిపూడివారిద్వారా ప్రచారము. వారి కళారాధన యక్షగాన సంప్రదాయములో అనేక శాస్త్రీయ మార్పులకు కారణము

## విజయరాఘవ నాయక, రంగాజమ్మ :

వర్ణనాత్మక గేయరూపములో నుండి ఏకపాత్ర నృత్యానికి అనువుగానుండిన యక్షగానము స్వరూపము మార్చి అనేక పాత్రలను సృష్టించి నృత్యనాటకములుగా రచనలు గావించిరి

రఘునాథాభ్యుదయము. మన్నారుదాస విలాసము నర్తకవి విద్య పరీక్షించుటకు తగిన గ్రంథములు.

* * * *

## మహారాష్ట్ర రాజులు :

నాయకరాజుల కాలమునందు క్షేత్రయ్యపదములు అభినయ విద్యాభివృద్ధికి కారణభూతమైనట్లు మహారాష్ట్ర రాజుల కాలములో రచింపబడిన 'పదవర్ణములు' నృత్త, నృత్యముల అభివృద్ధికి తోడ్పడినవి.

వివిధ రకములైన అడవు, జతి, గతి విన్యాసముల ప్రదర్శనకు అనువైనట్టి "దరువు", అందలి ఆటక్రమము.

అనేకవిధాల విభావానుభావసాత్త్విక సంచారుల ప్రదర్శనమునకు వీలైనట్టి పదములు అభినయ పోకడలు ఆధారముగా గొని తాన వర్ణక్రమము ననుసరించి గావింపబడిన నూతన సంగీతసృష్టి 'పదవర్ణము' లేక చౌకవర్ణము.

పదవర్ణములు పదములతరువాత సృష్టింపబడిన సంగీత రచనలు.

వీనియందలి నృత్త నృత్యములు దరువునందలి ఆటవలె అనేక గతి, జతి విన్యాసములు గల్గియుండును

సంచారుల వర్ణనలు, పల్లవిలోని నాయికావస్థల ప్రదర్శన పదాభినయమును పోలియుండును.

* * * *

## ఆంధ్రలోని వివిధ జమీందారుల కళాపోషణ :

కార్వేటి నగరము. కాళహస్తి వెంకటగిరి, కొల్లాపురము, గద్వాల, వనపర్తి, నూజివీడు, పిఠాపురము, పెద్దాపురము, తుని, విజయనగరము, బొబ్బిలి, జయపురము మొదలైన సంస్థానము లందు–

పల్లవులు, జక్కిణి దరువులు, పదదరువులు, పెద్ద వర్ణములు, పదములు మొదలైన సంగీత రచనలు గావించబడినవి. భామాకలాపము, గొల్లకలాపము, వీధినాటకము పోషింపబడినవి.

దేవతాస్తోత్రములైన 'కవుత'ములు అతి ప్రాచీనములు.

శబ్దములు లేక సలాంజతులు మొదటిసారిగా మహారాష్ట్ర ప్రభువుల పాలనలో 'కేళిక' సమయంలో రాజనర్తకీమణులు ప్రభువుల స్తోత్రముతోగూడిన నర్తనము సల్పుటనిమిత్తం రచింపబడినవి.

అటుపై అట్టి రచనలే యితర జమిందారులందరి ఆస్థాన కవులు రచించిరి ఇవ్విధాన వివిధ సంస్థానములందు రచింపబడిన ఈ రచనలు కొన్ని వందలున్నవి.

* * * *

హంపీ విజయనగరము తరువాత ఆంధ్రలో నృత్యకళను అనేకరీతుల నభివృద్ధిలోనికి దెచ్చిన సంస్థానము విజయనగరము. గనుకనే విజయనగరమును కవిపండితులు విద్యల నగరముగా గొనియాడిరి. ఆనందగజపతి మహారాజాగారు అందు ముఖ్యులు. వీరి కాలములో అనేకములైన పదములు, పల్లవులు, శబ్దములు రచింపబడినవి.

అన్నిటిలో అతి ముఖ్యమైన సంగీత రచన "మండూక శబ్దము"

తూర్పున ప్రఖ్యాతిగాంచిన "శుభలక్షణ పల్లవి" సృష్టి యిచ్చటనే జరిగినది.

సీతారామ గజపతి కాలములో పత్రతాళములందు జక్కిణి దరువులు, పద దరువులు, స్వర పల్లవులు, పొణ్ణంగి దరువులు విశేషముగా రచింపబడినవి.

ఇవన్నియూ నాట్యకళకు అలంకారములు.

* * * *

కార్వేటినగరము నేలిన వెంకటపెరుమాళ్ రాజేంద్రులు కాలములో నృత్యకళకు చాలా ముఖ్యమైన గోవిందసామయ్య

"వర్ణపంచకము" అనబడే ఐదు పెద్దవర్ణములు రచింపబడినవి ఈ వర్ణములు అపూర్వము వీటికి నృత్యమాడుట నర్తకులకి పరీక్ష వంటిది.

మోహన, నవరోజు, కేదారగౌళ, గౌళ, వరాళి – ఐదు రాగములందు ఈ వర్ణములు రచింపబడినవి ఇందు 'మోహన వర్ణము' – కార్వేటినగరము, కాళహస్తి, వెంకటగిరి ప్రాంతము లందు, నవరోజువర్ణము కోస్తా జిల్లాయందు ప్రచారములో నున్నది.

◆ ◆ ◆ ◆

వెంకటగిరి సంస్థానమున బంగారెచమ భూపాలుర కాలములో నాట్యకళ చాలా వృద్ధిగాంచినది ఆయన అనేక కవి పండిత, గాయక, నాట్యాచార్యులను పోషించుటయేగాక వివిధ ప్రాంతముల నుండి సంగీత విద్వాంసులను రప్పించి, చర్చించి నాట్యముపై ఒక గ్రంధము రచించిరి. అదియే 'సభారంజని'.

◆ ◆ ◆ ◆

మిగిలిన సంస్థానములందు నాట్యకళ అభివృద్ధిచెందిన వివరములు అంతగా తెలియుటలేదు.

## పుణ్యతీర్ధములందు నృత్యకళ

శ్రీశైలము :– శైవ సంప్రదాయము. ఈ స్వామిపై రచింపబడిన అనేక కవుతములను నర్తకులు ఆడుచున్నారు.

భామాకలాపము, గొల్లకలాపములు శ్రీశైల భ్రమరాంబపై రచింపబడిన అంబస్తవముతో ప్రారంభింపబడుచున్నవి.

ప్రాచీన కాలమందు యిచ్చట 'శృంగ నాట్యము' సప్త లాస్యములు ప్రదర్శింపబడినట్లు ఆలయ శిల్పమును బట్టి చెప్ప గలము.

శ్రీ కాళహస్తి – శైవ సంప్రదాయము :– ఆలయ ఆరాధన సంప్రదాయములు, కేళిక విద్య అభివృద్ధిచెందినది. ఇచ్చట భాగవత విద్య అంతగా లేదు.

తిరుపతి :– వెంకటేశ్వరునిపై తాళ్ళపాకవారు అనేక రచనలు గావించినను ఒకే ప్రత్యేక నృత్య విధానముండినట్లు ఆధారములు గన్పించుటలేదు.

మన్నారు పోలూరు :– వైష్ణవ సంప్రదాయము. ఆలయ ఆరాధన విద్య, కేళికా నాట్యము దేవదాసీలచే ఆరాధింపబడినది.

చెయ్యూరు :– శైవ సంప్రదాయము – సుందరేశ్వర స్వామిపై అనేక ప్రత్యేక రచనలున్నవి సర్వ వాద్య ఆరాధన యిచ్చటి విశేషము. ఇచ్చట సప్తలాస్య ఆరాధన, కేళిక, యక్షగాన సంప్రదాయము, ఈ మూడు పద్ధతులు అభివృద్ధి చెందినవి

ద్రాక్షారామ :– అంబ ఆలయము. శైవ సంప్రదాయము ననుసరించి నాట్యకళా ప్రదర్శనము.

మంగళగిరికొండ :– వైష్ణవ సంప్రదాయము.

బాపట్ల :– భావనారాయణస్వామి – వైష్ణవ సంప్రదాయము. ఇచ్చట సిద్ధాంతులవారు శాస్త్రీయ విద్యను ప్రచారము చేసిరి.

మార్కాపురం :– వైష్ణవ సంప్రదాయ ఆరాధన విద్య. కేళిక పద్ధతి.

మాచర్ల :– చెన్నకేశ్వర, వీరభద్ర స్వాములవారి ఆలయము లందు వైష్ణవ శైవ సంప్రదాయ నృత్యారాధన–కేళిక పద్ధతి.

ధర్మపురి :– వైష్ణవ సంప్రదాయ ఆరాధనకళ కేళిక–పద్ధతి.

అల్వాల :– వెంకటేశ్వరస్వామి ఆలయము ఆరాధనకళ – బలిహరణవిద్య – వైష్ణవ సంప్రదాయము – కేళిక, కర్నాటక ఉత్తరాది సంప్రదాయములు

శ్రీకాకుళము – ఆంధ్రవిష్ణు ఆలయము వైష్ణవ పద్ధతి ఆరాధనకళ, కేళిక

పిఠాపురము – కుంతిమాధవుని ఆలయము :– వైష్ణవ సంప్రదాయము ఆరాధన, కేళిక, భామాకలాపము, గొల్లకలాపములు.

కుక్కుటేశ్వరస్వామి ఆలయము :– శైవము.

శ్రీకూర్మము :– వైష్ణవసంప్రదాయము. కేళిక, చైతన్యుని పాదములు ప్రతిష్ట జరిగిన ప్రదేశము. వంగదేశ భజన సంప్రదాయ నృత్యము.

ఇంకను యెన్నియో పుణ్యతీర్థము లున్నవి.

శైవ వైష్ణవ సంప్రదాయవిద్యలోని బేధాలు :–

బలిహరణ నాట్యములు, కేళిక యించుమించు ఒకేరీతిగా నుండును మూలవిరాట్టు సాన్నిధ్యంలో ప్రదర్శింపబడే ఆరాధన నృత్యములు సప్తలాస్యములు, కవుతములు మార్పు నుండును.

ఇవన్నియూ దేవదాసీలచే చేయబడే నృత్యములు.

నృత్యము వారి యింటివిద్య? సంస్కృతము, తెనుగు పండితులవద్ద ప్రత్యేకముగా అభ్యసింతురు.

ఆలయములందు ఆగమశాస్త్ర ప్రకారము వీరు నృత్యకళతో దేవతల నారాధింతురు.

---

## ఆంధ్రలో జిల్లాలవారీగా కళాభివృద్ధి

గంజాము :– పాలించు ప్రభువులు ఓడ్రులు కాని వారి మంత్రులు తెనుగువారు గనుకనే గంజామునందలి అనేక జమిందారీలందు తెనుగు సంప్రదాయము నృత్యము అభివృద్ధిచెందినది.

ఒడిస్సీ నృత్యము తిలకించిన, గానము ఉత్తరదేశ బాణీలో ఉన్నప్పటికీ జతి కట్టుబాట్లు, గతి విన్యాసము, అభినయక్రమము తెనుగుదేశపు భారత విద్యను పోలి వుండును

గంజామందలి ఒక జమిందారు ప్రతాపరుద్రదేవ వెయ్యి మంది దేవదాసీలను స్వామిసేవ నిమిత్తము పూరి ఆలయానికి సమర్పించిరి. వారచ్చట నాట్యకళతో స్వామి నారాధించిరి.

ఆ కళకు ఆంధ్రుల కళకు చాలా దగ్గర పోలికలున్నవి.

•   •   •   •

ఆంధ్రలో ప్రాచీన ఆలయములున్నచోటులందు, సంస్థానములు వెలిసిన ప్రదేశములందు నృత్యకళ విరివిగా అభివృద్ధి గాంచినది,

శ్రీకాకుళము, విశాఖపట్నము జిల్లాలు : శ్రీకూర్మము, అరసవిల్లి (పుణ్యతీర్థములు). బొబ్బిలి (సంస్థానము). కోమటిపల్లి, విజయనగరము సంస్థానము, జయపురము (సంస్థానము). మాడుగుల (మత్స్య వంశీయులేలిన ప్రదేశము). చోడవరము, జామి. విమ్మలవలస, నరసన్నపేట. రాజాము, నరసీపట్నము, దొడ్డిగల్లు-

ఈ ప్రదేశాల్లో దేవదాసీల భరతనాట్యము, పురుషభాగవతుల భామాకలాపము, గొల్లకలాపము ఎక్కువగా వృద్ధిజెందినది.

ఈ ప్రాంతాల్లో వున్నన్ని భామాకలాప, గొల్లకలాప నాట్యమేళములు, ఆంధ్రలో మరెచ్చటనూ గాంచము.

ఈ రెండు జిల్లాల్లో స్త్రీలు (భాగవతము) కలాపములాడుట అరుదు.

ఈ కలాపములవారు : సిద్ధేంద్రులవారి కలాపము గాక వంకాయలవారి కలాపము, చింతలపాటివారి కలాపము, కసింకోట వారి కలాపములను చేర్చి ఆడుచున్నారు. వీరి భాగవత విద్యకు కూచిపూడి విద్యకు సంబంధము లేదు.

•   •   •   •

దేవదాసీల విద్యమాత్రము శ్రీకూర్మము మొదలుకొని తంజావూరువరకు యించుమించు ఒకే విధముగా వభివృద్ధిజెందినది.

•   •   •   •

తూర్పు పశ్చిమగోదావరి జిల్లాలు :- తుని (జమీందారి), పిఠాపురము (జమీందారి), పెద్దాపురము (జమీందారి ప్రాంతము). కాకినాడ, అమలాపురము, ముమ్మిడివరము, పేరూరు, మానేపల్లి, మండపేట, ముక్తమంద, రాజమండ్రి, ధవళేశ్వరము, పసలపూడి, ఖాటిపాక, రాజోలు, వాడపల్లి, ద్రాక్షారామము, ఉండి, మారంపల్లి, నరసాపురము, అత్తిలి, అంతర్వేది, ఏలూరు.

ఈ ప్రదేశాల్లో నాట్యకళ విరివిగా వభివృద్ధిగాంచినది.

ఇచ్చట భాగవతములాడే పురుష నర్తకులు తక్కువ,

స్త్రీలే కచ్చేరినాట్యము, కలాపముల నాడుదురు.

ఈ ప్రాంతాల్లో నాట్యంజేయు స్త్రీలు రెండు తెగలుగా నున్నారు.

భోగమువారు, సానులు. భోగమువారు కచ్చేరినాట్యము, సానులు భాగవతముల నాడుదురు.

వీరి ఆటకు కూచిపూడివారి ఆటకు సంబంధములేదు. వీరిలో సంస్కృతము, తెలుగు భాషల దక్కగా నెరిగి - శాస్త్ర సంప్రదాయముల దెలిసి నర్తనమాడు నర్తకీమణులు అనేకు లున్నారు

•   •   •   •

కృష్ణా - గుంటూరు జిల్లాలు :- కూచిపూడి, మొవ్వ, నంగిగడ్డ, రేపల్లె, తెనాలి, గుంటూరు, బాపట్ల, గుడివాడ, శ్రీకాకుళము, పొన్నూరు, ఒంగోలు

కూచిపూడి భాగవత మేళములకు ప్రసిద్ధి, భామాకలాపము, గొల్ల కలాపము వివిధ యక్షగానములు, వీధినాటకములాడుటలో ఈ నర్తకులు సుప్రసిద్ధులు ఈ ప్రాంతాల్లో కొందరు దేవదాసీలు గూడా కూచిపూడి సంప్రదాయ భాగవత విద్య నభ్యసించినారు. అట్టివారు నంగిగెడ్డ, రేపల్లె ప్రాంతాల్లో వున్నారు. మొవ్వ క్షేత్రయ్య పుట్టినవూరు

•   •   •   •

నెల్లూరు చిత్తూరు జిల్లాలు :- టంగుటూరు, కావలి, సింగరాయకొండ, జొన్నవాడ, నెల్లూరు, కలువాయి, బుచ్చిరెడ్డిపాలెం, వెంకటగిరి, మన్నారుపోలూరు, నాయుడుపేట, కాళహస్తి, కార్వేటినగరం, తిరుత్తని, చెయ్యూరు, మధురాంతకం, జంగాలపల్లి మొదలైన ప్రదేశాలు.

దేవదాసీల కేళికావిద్య విరివిగా ప్రచారమునందున్నది.

కూచిపూడివలె జంగాలపల్లెయందు - విశేషముగా నాట్యమేళములవారున్న కూచిపూడివారు బ్రాహ్మణ భాగవతులు జంగాలపల్లెవారు జంగం భాగవతులు. వీరుగూడా యక్షగానములు, వీధి నాటకముల నాడుదురు.

తిరుత్తని, చెయ్యూరు, మధురాంతకం, ప్రస్తుతం తమిళనాడులో నున్నవి.

•   •   •   •

దత్తమండలములు :-

కడప, కర్నూలు, అనంతపురము జిల్లాలు :-

కోటకొండ, బనగానపల్లి, ప్రొద్దుటూరు, హిందుపురం, తాళ్ళపాక, పుల్లంపేట బుక్కాయపాలెం కోటకొండ భాగవతులు కూచిపూడి సంప్రదాయమునకు జెందినవారు.

వీరిని బనగానపల్లి నవాబుగారు ఆ ప్రాంతములకు ఆహ్వానించి కోటకొండలో వారికి భూములనిచ్చి నివాసము నేర్పాటు జేసిరి. వీరిద్వారా భాగవతకళ దత్తమండలములందు ప్రచారము జరిగినది

దేవదాసీలు కేళికవిద్య నారాధించిరి.

•   •   •   •

తెలంగాణ ప్రాంతములో నృత్యకళ : ధర్మపురి, పెద్దపల్లి, నాగుపూరు, గద్వాల, వనపర్తి, జటప్రోలు, ఆత్మకూరు, హైద్రాబాదులందు-

హైద్రాబాదులో ముస్లిం ప్రభావముగల కళ అభివృద్ధి జెందినది. మిగిలిన ప్రాంతాల్లో కేళికవిద్య అభివృద్ధి గాంచినది.

# దాక్షిణాత్యుల నాట్యకళా చరిత్ర

## కళ

ప్రకృతియే కళ. కళయే ప్రకృతి. ప్రకృతిలో యెక్కడ చూచినా మనకు కళయే కనబడును. కళ ప్రకృతిలో దాగుడు మూతలాడుచుండును. మానవ జీవితమే ఒక గొప్ప కళ. సృష్టిలోని సౌందర్యోపాసనయే కళారాధన. మానవుని జీవితమును రంజింపజేయునట్టి, ఉత్తేజపరుచునట్టి వికసింపజేయునట్టి ప్రకాశమే కళ. మండుచున్న అగ్నిజ్వాలలో హృదయాహ్లాదకరమైన నృత్యాన్ని మనము చూచుచున్నాము. పర్వతశ్రేణులనుండి పల్లపు ప్రదేశములకు, జలజలపారే సెలయేళ్ళలో మధురసంగీతము వినుచున్నాము. సాయంసమయములలో చెట్ల సందులగుండా పరుగులెత్తే మలయమారుతము హాయిగా పాడుచుండును. పిల్లగాలులకు అల్లల్లాడే ఆకులు, దాగుడు పూచి కాడను విడిచి భూమిపైబడే పువ్వులరేకులు, పండుటాకులు నయనానందకర నృత్యమాడును. పౌర్ణమినాడు యిసుకతిన్నెలపై కూర్చొని భయంకర ధ్వనులతో తరంగములుచేసే గంభీర నృత్యము చూడగలము. స్త్రీ, పురుష పక్షుల ప్రియసంభాషణలో సంగీతము వింటున్నాము. వర్షఋతువులో కప్పలు బెక బెక నాదాలతో హాస్యగీతములను పాడి మనల నానందబెట్టుచున్నవి. మేఘావృతమైన ఆకసమునుజూచి నెమళ్ళు తమ ప్రియురాండ్రను ఆకర్షించుటకుజేయు అంగవిన్యాసములో నాట్యకళ కనబడుచున్నది. మేఘగర్జనలో మృదంగవాద్యము, కోయిల కో, కో, రవములో మురళీనాదము, బెబ్బులల ఘీంకారములలో వీణా ఝుంకారములు మనకు వినబడుచున్నవి. వసంతఋతువులో ప్రభాత సమయమున ప్రకృతి వివిధాలంకారములతో చిత్రకారుడు చిత్రించిన సర్వాంగసుందరివలె మనముందు ప్రత్యక్షమవుచున్నది. చెట్ల లేత ఆకులమీద పడిన మంచుబిందువులు, యౌవనవతి కుచములపై తళతళ మెరిసే ముత్యాలమాలవలె, మనకు ప్రాతఃకాలమందు దర్శనమిచ్చుచున్నవి. భ్రమపెట్టుచు కన్నులు మిరిమిట్లు గొలుపుచున్నవి. ఈ విధముగా ప్రకృతి నెక్కడజూచినా మనకు లలిత కళలమయముగా కనబడుచున్నది.

### కళ అనగా నేమి ?

ప్రకృతిని సహజముగా అభినయించుట, ప్రదర్శించుటయే కళ. కళారాధకునిద్వారా ప్రకృతి తన రమణీయతను ప్రపంచమునకు ప్రదర్శించును. కళారాధకు డను నద్దముపై తన సహజ సౌందర్యాన్ని ప్రతిబింబించును. ప్రకృతి సౌందర్యమును మరింత సుందరవంతముగా, ఆదర్శవంతముగా, లలితముగా, కోమలముగా, ఆకర్షణీయముగా అభినయించుటయే కళ. సృష్టియొక్క రహస్యములను అర్థముచేసికొనుటయే కళారాధకునియొక్క కర్మము. ప్రకృతి సాయములో తన స్వయంకృషివల్ల సృష్టి నర్థముచేసికొని, ప్రావీణ్యత సంపాదించి ప్రకృతికి రేఖలుదిద్ది, ప్రకృతిలోని లోటులను సవరించి ప్రపంచమునకర్థమగు విధమున సృష్టిలోని వివిధ రహస్యములను ఆదర్శ కళారాధకుడు ప్రదర్శించును. సృష్టిరహస్యములు, ప్రకృతిసౌందర్యము, ప్రజానీకమునకు అతి సులభముగ అర్థమగుటయేగాక, వారు వానిని అభ్యసించి, మరల ప్రదర్శించుటకు వీలగుటకై, కళావేత్తలు శాస్త్రములను వ్రాసిరి. శాస్త్రమనగా సామాన్య మానవుడు ఒక పనిని యెటుల చేయవలయునో తెలుపునట్టి సూత్రముల గ్రంథము.

వర్షాకాలమేఘగర్జనలే మృదంగ వాద్యమునకు జీవము. ప్రకృతిలోని వివిధ నాదములే సంగీత శాస్త్రములోని స్వరముల కాధారము. సృష్టిలోని జీవకోటియొక్క సంచలనమే నృత్యము. ప్రకృతిశోభయే చిత్రకళకు మాతృక. జవ్వనుల శృంగారచేష్టలే నవరసభరితమైన అభినయము. కనుక కళ సజీవముగా నుండవలెనన్న కళారాధకుడు కళకు జీవమైన ప్రకృతిని ఆరాధించవలెను. కేవలము శాస్త్రపఠనముతోనే తృప్తిచెందక, ప్రకృతిలో లీనముకావలెను. నాదే కళ (గీత, వాద్య, నృత్య, చిత్రలేఖన, శిల్పములలో ఏదైననూ) శాశ్వతముగా, సజీవముగానుండగలదు.

---

# భారతీయ సంగీత కళ

శ్లో॥ "గీత వాదిత్య నృత్యానాం త్రయం సంగీతముచ్యతే."
గీత వాద్యనృత్యముల చేరిక సంగీతమనబడును.

భారతీయ సంగీతకళయొక్క చరిత్రను నాల్గు యుగములుగా విభజింపవచ్చును.

(1) వేదయుగము.

(2) స్వర్ణయుగము (శాస్త్రయుగము.)

(3) మధ్యయుగము.

(4) నవీనయుగము.

## (1) వేద యుగము :

ఈ యుగములో ఆరాధనకళలు విరివిగా ప్రచారమందుండినవి. ప్రతి స్త్రీ, పురుషుడును, విధిగా సంగీతకళను అభ్యసించేవారు. ప్రపంచమునకు కారణమైనట్టియు, ఆధారమైనట్టియు పంచభూతములను నృత్యగీతములతో ఆరాధించెడివారు. సంగీతకళ యిప్పటి మన సంఘములోవలె యే కొందరో గాక, దైనిక కృత్యములో ఒక భాగమైయుండినది. ఇప్పటికీ అడవి జాతులలో (గోండులు, బైగాలు, ఒరియనులు, సంతాల్, ముండా మొదలయిన ఆటవికులు) ప్రతి యొక్కరూ సంగీత కళ నభ్యసించుదురు. ఈ విధముననే బలిద్వీపపు ప్రజలలోకూడ ప్రతి స్త్రీ, పురుషుడు, లలితకళల నభ్యసించు వాడుక నేటికినీ గలదు.

## (2) శాస్త్రయుగము : (స్వర్ణయుగము) క్రీ. శ. 13-వ శతాబ్దమువరకు.

ఇది మన దేశపు సంగీత కళయొక్క చరిత్రలో అతి ముఖ్యమైన యుగము. ఈ యుగారంభముననే (బ్రహ్మ నాల్గు వేదములనుండి) ఋగ్వేదమునుండి వాద్యమును, యజుర్వేదమునుండి అభినయమును, సామవేదమునుండి గానమును, అధర్వణ వేదమునుండి రసమును గ్రహించి నాట్యవేదమనబడెడి 'భరతశాస్త్రమును' రచించెను. (భరత శాస్త్రమనగా-భ-యనగా భావము, ర-యనగా రాగము, త-యనగా తాళము. భావ, రాగ, తాళములతో గూడిన కళ, నాట్యకళనుగూర్చి తెలుపుశాస్త్రమని యర్థము.) "భరతార్ణవమును" సంక్షిప్తపరచి నందికేశ్వరుడు ఇంద్రుని కోర్కెపై 'అభినయదర్పణ' మను గ్రంథమును రచించెను. శివ, పార్వతులు; తాండవ (ఉద్ధతమైన పురుషుల నృత్యము) లాస్య (సుకుమారమైన స్త్రీల నృత్యము) నృత్యభేదములను నిరూపించిరి. విష్ణు, దత్తిలుడు, కోహలుడు, యాజ్ఞవల్క్యుడు, నారదుడు, హనుమంతుడు, విఘ్నేశ్వరుడు, షణ్ముఖుడు, రావణుడు, అర్జునుడు, శ్రీకృష్ణుడు, ఉష మొదలగువారు సంగీత కళ నారాధించి సంగీత శాస్త్రములను వ్రాసిరి. సప్తతాళ నిర్ణయము, రాగముల సృష్టి, ఏ యే రాగములు యే యే సమయములలో పాడవలయునో అట్టి కాలనిర్ణయము నేర్పరచిరి. ప్రకృతిని బహుజాగరూకతతో పరిశీలించి, విమర్శించి, నాట్యకళ కుపయోగపడు దృష్టి, గ్రీవా మొదలైన భేదములగూర్చి విపులముగా వ్రాయబడినది.

నృత్యహస్తముల (ముద్రలు) పుట్టుక గూడ చాలవరకు ఈ కాలములోనే జరిగినది, నృత్యమునకుపయోగపడు వాద్యములు (వీణ, మృదంగము, మురళీ మొదలైనవి) కనిపెట్టబడినవి. ప్రకృతియొక్క ప్రతిబింబము సంగీతకళ, శాస్త్రరూపమును దాల్చినది. ఈ యుగములోనే అర్జునునివల్ల మత్స్యదేశమందు శాస్త్రీయ నృత్యకళ ప్రచారములోనికి వచ్చెను. (అజ్ఞాతవాస సమయమందు విరాటరాజు కుమార్తె ఉత్తరకు బృహన్నలగా అర్జునుడు నాట్యమును నేర్పెను). ప్రమీలను అర్జునుడు పరిణయమాడుటవల్ల మళయాళ దేశమందును, చిత్రాంగద నృత్యకళారాధనవలన మణిపుర దేశమునందును, శాస్త్రీయ నృత్యకళలు ప్రచారము లోనికి వచ్చినవి, అర్జునుడు నేర్పెననగా అంతకు పూర్వము నృత్యకళ లేదనియర్థముగాదు. అచ్చట నృత్యముండిననూ తానెరిగిన ఒక విశిష్ట శాస్త్రీయ సాంప్రదాయవిద్యను ప్రచారము జేసియుండును.

శ్రీకృష్ణుని కాలమందు 'రస్లీలా' అనునొక నృత్యసాంప్రదాయము ప్రచారములోనికి వచ్చినది. అది నేటికినీ మణిపుర ప్రాంతమున ప్రదర్శింపబడుచున్నది.

ఉషయొద్ద లాస్య నృత్యరీతు లభ్యసించిన బాణాసురుని కుమార్తె ఉష ద్వారకయందలి రాకుమార్తెలకు ఆ నృత్య సాంప్రదాయమును నేర్పెను.

పిమ్మట విక్రమార్కుడు, హర్షుడు, అశోకుడు, మొదలైన రాజులకాలములో నృత్యకళ యెంతయో అభివృద్ధిచెందుటయే గాక ప్రాచీన శాస్త్రము నాధారముగా యెన్నియో నూతన సాంప్రదాయములు ప్రచారములోనికి వచ్చినవి. మహాకవి కాళిదాసు, శూద్రకుడు, భాసుడు, భవభూతి మొదలైన ప్రఖ్యాత కవులు ఈ యుగమున వెలసి కళలకు రూపులు దిద్దిరి. కాళిదాసు

నాటకములందు నాటి నాట్యపద్ధతులు, నర్తనశాలలగూర్చి యెన్ని యో వివరములు తెలియుచున్నవి.

ఆ కాలమునందు నృత్యకళ రెండు విధములుగానుండినది. అవియే *మార్గి, దేశి* విధానములు. నృత్యమును దైవికముగా ఆరాధించుటకు దేవదాసీలు యేర్పరుపబడిరి. (వీరిది మార్గి నృత్యము) తర్క, వేదాంత, సంగీత కళలనభ్యసించి రాజ దర్బారులయందు తమ పాండిత్యమును ప్రదర్శించి ప్రభువుల గౌరవమునకు పాత్రులైన స్త్రీ కళారాధకులే గణికలు. వీరి సంగీతమే దేశి.

ఈ యుగములో ప్రతి నాగరికుడు ఈ కళను అభ్యసించి నను (వాత్స్యాయనుడు-తన కామశాస్త్రములో ప్రతియొక్కడూ అభ్యసించవలసిన 64 విద్యలలో గీతము, వాద్యము, నృత్యము గూడ పేర్కొని యున్నాడు.) ఈ కళయందు కృషిసల్పి ప్రాపీణ్యతను సంపాదించుటకు సంఘము ఒక ప్రత్యేక తెగను యేర్పరచినది. వారే కళావంతులు. వీరి నృత్యమందు ఛురిత, యౌవరిత అను రెండు భేదములుండినవి. శాస్త్రయుక్తముగా ప్రదర్శింపబడునట్టిది 'ఛురిత' నృత్యము. శాస్త్రవిదితముగా గాక కేవలము వినోదార్థము చేయునట్టిది యౌవరితము.

ఆంధ్రదేశమునుగూర్చి :-

ఆంధ్రదేశములో శాతవాహనుల కాలములో అనేకవిధములైన నృత్య సాంప్రదాయములు వృద్ధిచెందినవి. ఆ *గ్రంథ* ములు నేడు మనకు లభ్యముగాకున్నను నాటి శిల్పమునందలి విన్యాసముల జూసిన ఆనాడు నాట్యకళ పెంపొందిన తీరులు తెలియును.

పిమ్మట ఇక్ష్వాకులు, చోళులు, పల్లవులు, కాకతీయులు, విజయనగరపు మహారాజులు, రెడ్డిరాజులు, వెలమప్రభువులు, నాయకరాజుల కాలములో అనేక నూతన నృత్య సాంప్రదాయములు ప్రచారములోనికి వచ్చినవి. నృత్యగ్రంథములుగూడ రచింపబడినవి. అందు ముఖ్యమైనట్టివి, ఆంధ్రుల నృత్యకళల సాంప్రదాయముల స్వరూపము తెల్పునట్టి గ్రంథరాజములు :- జాయపసేనుని 'నృత్త రత్నావళి', కొండవీటి కొమరగిరి ప్రభువులయొక్క 'వసంతరాజీయము'. రాజులు ఏటా వసంతోత్సవములు చేసెడివారు. అప్పుడే వివిధ ప్రాంతముల్లోని పొరుగు రాజ్యములందలి, సామంతుల ఆస్థానములందలి కళారాధకులను రావించి కళలయందలి వీరి పాండిత్యమును పరీక్షించి వారి కృషికి తగిన విధముగా సత్కరించెడివారు. ఆ కాలములో ముఖ్యముగా ప్రచారములోనున్న కొన్ని నృత్యములు మన గ్రంథములందు పేర్కొనబడినవి-మత్తలి *శేక మత్తావళి*, గొండ్లి, పేరిణి, జక్కిణి.

ఆ కాలములో భారతదేశమందంతటను సంస్కృతమునకే యెక్కువ ప్రాముఖ్యముండుటచే కావ్యములు, శ్లోకములు, నాటకములు మొదలైనవన్నియూ సంస్కృతములో వ్రాయబడినవి. అందుచే దక్షిణ, ఉత్తర హిందుస్తానమంతటా సంగీతమొకే రీతిగానుండెను. కాని యుగాంతములో ప్రాంతీయ భాషలకు ప్రాముఖ్యత హెచ్చెను. రాజులు ప్రాంతీయభాషలందు గ్రంథరచనను ప్రోత్సహించిరి. కవులు గ్రంథములువ్రాసిరి. నాటినుండి కళలు వేరు వేరుగా చీలి, ఆధారశాస్త్రమొక్కటేయైననూ వివిధ సాంప్రదాయములుగా రూపొందినవి.

## మధ్యయుగము (క్రీ. శ. 19-వ శతాబ్దమువరకు)

భరతుని నాట్యశాస్త్రము తరువాత ఉత్తర దక్షిణ భారతాల లోని సాంప్రదాయ స్వరూపములను కూలంకషంగా తెల్పునట్టి [illegible] శరాజము 'సంగీత రత్నాకరము' ఈ గ్రంథము ఈ యుగమందే వ్రాయబడినది. దీని రచన కాలమువరకు ఉత్తరదక్షిణ భేదములు సంగీతమందు కలుగలేదు. తరువాత మహమ్మదీయ దండయాత్రచేత ఉత్తరదేశము అల్లకల్లోలమై నూతన వాతావరణము వ్యాపించి ప్రజా జీవితములందు పెద్దమార్పులు కల్గినవి. మహమ్మదీయ ప్రభువులు, మొగల్ సమ్రాట్టులు, వారి వారి సంగీత నాట్యములను ఆదరించసాగిరి. అందుచేత ఉత్తరాదిని సంగీత నృత్యములలో పెక్కు మార్పులు వచ్చి నూతన యుగ మారంభమయ్యెను. సంస్కృతము యొక్క ప్రాముఖ్యత తగ్గి ప్రాంతీయ భాషల ప్రాముఖ్యత వహించ, ఆ భాషలందు నృత్య రచనలు జరుగగా ఆయాభాషల తీరులనుబట్టి స్వరపోకడల నేర్పరచిరి. సంగీతము, వాద్యముల నిర్మాణముల తీరుననుసరించి వాద్య సంగీతము, నృత్య రచనలు జరిగినవి. ఆ విధముగా కళలు వివిధ ప్రాంతీయ రూపములను దాల్చినవి. ఉత్తర దేశమున వ్రజభాషకు ప్రాముఖ్యత హెచ్చి ఆ భాషకు సరిపోవు విధమున స్వరముల గూర్చి, రాగములకు పేర్లిచ్చి, తాళముల స్వరూపముల దిద్ది, ఉత్తర దేశీయులు నూతన సంగీత దానిని వృద్ధిలోనికి దెచ్చిరి.

దక్షిణ దేశమునందు తెలుగు భాషకు ప్రాముఖ్యత హెచ్చి శాస్త్రీయ సంగీత, నృత్యసంబంధ రచనలన్నియూ ఆ భాషయందే చేయబడినవి. తెనుగు మిక్కిలి మధురమైన భాషయగుటచే, ఆ భాషయందే అందరును నృత్యసంగీతములను రచించిరి. నృత్యోప

యోగమైన పదములు, పదవర్ణములు, గీతములు, శబ్దములు, యక్ష గానములు, మొదలైనవి వ్రాయబడినవి. (బ్రిజభాష, తెలుగు భాషలయందేగాక యితర ప్రాంతీయ భాషలందు సంగీత రచనలు జేయబడినను శాస్త్రీయ నృత్య, సంగీత సాంప్రదాయములకు మాత్రము ఈ రెండు భాషలయందలి రచనలే ఆధారమునైనవి.)

శాస్త్రయుగమునందలి వివిధ ప్రాంతములందలి పండితులెట్లు సంస్కృత భాషయందు శాస్త్రీయ గ్రంథముల రచనలు జేసిరో అట్లే ఆ యుగములందు వివిధ ప్రాంతములకు జెందిన పండితులు (దక్షిణ ప్రాంతమందలివారు) తెనుగు భాష నభ్యసించి, తెలుగునందే శాస్త్రీయ సంగీత రచనలు గావించిరి. ఈ రచనలుగాక యితర భాషలయందుగూడ రచనలున్ననూ ఆ రచనలు ప్రాంతీయ భాషలుగా ఆరాధించబడినవి గాని, శాస్త్రీయ పండితులంతగా ఆదరించలేదు.

ఈ యుగము మన దేశముపై మహమ్మదీయ ప్రాబల్యము బడిన నాటినుండి ప్రారంభమైనదని పేర్కొంటిని. అప్పటి వరకు మన కళలు ఆలయమందలి ఆరాధన నృత్యములైననూ ఆలయము వెలుపలి వినోద ప్రదర్శనములు (కేళికా ప్రదర్శనములు) అయిననూ మత సంబంధమై దేవతల కథలకు సంబంధించినవిగా యుండెను. గాని అన్య మతములకు జెందినవారు మన దేశమును పాలించుట మొదలిడిన తరువాత ఆ పాలించు ప్రభువుల వినోదార్థము రాజాస్థానములందు కళలు వృద్ధిపొందినవి. వారి మతాచారములు వేరు, సాంఘిక కట్టుబాటులు వేరు, సాంస్కృతిక నిబంధనలు వేరు. వాని ననుసరించి కళలు వృద్ధి జెందినవి. గనుక ఉత్తరదేశ కళలు, పూర్వపు స్వరూపమును గోల్పోయి యొక నూతన పద్ధతిలో వృద్ధిజెందినవి. ఈ విధముగా వృద్ధిజెందినట్టిదే *కథక్ నృత్యము*. ఈ యుగములో ఉత్తర హిందూస్థాన సంగీతమునకు అమోఘమైన సేవజేసిన వారిలో ముఖ్యులు అమీర్‌కుష్రూ, తాన్‌సేన్, బైజు, హరదాసయోగి. తబలా, సారంగి, సితార మొదలైన నూతన వాద్యములు ఈ యుగమునందే కనుగొనబడినవి. *ఖ్యాల్, ఠుమ్రీ, టప్పా, గజల్* మొదలైన సంగీత రచనలు చేయుట, పాడుట, అభినయించుట ఈ కాలమునందే జరిగినది. దక్షిణదేశమందు ఆరాధన, కేళిక నృత్యములు గాక మరొక ప్రత్యేక సంగీత రచనా విధానము, నృత్యవిధానము ప్రచారములోనికి వచ్చినవి. అవియే వీథినాటకములు లేక వీథి భాగవతములు.

అనాదినుండి మన దేశములో అనేక మత సాంప్రదాయములు మారుచూవచ్చినవి. ఆర్యుల వేదమతము వచ్చి అంతకంటే ప్రాచీనములైన ద్రావిడ మతములందు విపరీతములైన మార్పులను దెచ్చినది. అట్లే ఆర్యుల యజ్ఞయాగాది క్రతువులందలి జీవహింసచే విసుగెత్తిన ప్రజలు మహావీరుని జైనమతము, గౌతముని బౌద్ధమతమును స్వీకరించిరి. మరల కొంత కాలమునకు ఈ మతముల ప్రాముఖ్యత తగ్గి శంకరాచార్యుల, రామానుజాచార్యుల ప్రభావము దేశముపైబడి శైవము, వీరశైవము, వైష్ణవము దేశమునందు ప్రబలినవి. ఇన్ని మతములు దేశమునందు మారుచూ వచ్చిననూ ఇవి యన్నియూ ఈ దేశమందే బుట్టి ఆది నుండి మన దేశమందలి ప్రజల్లోనున్న మత విశ్వాసములకు సంస్కరణతోగూడిన ఉద్యమములుగా ఉపకరించినవి. కాని పైదేశమునుండి వచ్చిన మహమ్మదీయ దండయాత్ర మన సాంఘిక, సాంస్కృతిక వికాసములకు అత్యంత ప్రమాద పరిస్థితులను గల్పించినది. అట్టి పరిస్థితులనుండి దేశమును గాపాడి మన సంస్కృతి రక్షణను కళలద్వారా చేయుట అతి సులభసాధ్యముగా నాటి మత ప్రవక్తలు గ్రహించి కళా ప్రచారకులుగా వేదపురాణేతిహాసములు, సంగీత నాట్యములను చక్కగా నభ్యసించిన పండితులు పూనుకొని రామాయణ మహాభారత భాగవత గాథలను నాటకములుగా నాటి సామాన్య ప్రజలలో కళ ద్వారా ప్రబోధము గావించిరి. ఇట్టివారు దేశము నాల్గు చెరగులా వ్యాపించిరి. ఈ తరగతికి చెందినవారే కూచిపూడి భాగవతులు, కేరళదేశ నాట్యమేళములవారు. కళలద్వారా మతప్రచారమేగాక కళలయొక్క పూర్వశాస్త్రీయ స్వరూపము చెడకుండ కాపాడిరి.

రాజులు తమ దర్బారులయందు అనేక నాట్యాచార్యులను నర్తకీమణులను పోషించి, ఒకరితో యింకొకరు పోటీబడునట్లు అనేకవిధములైన సంగీత రచనలు జేయించిరి.

ఈ విధముగా భారతదేశములో అనేకవిధములైన నృత్య సాంప్రదాయములు ప్రచారములోనికి వచ్చినవి.

## నవీన యుగము

ఆంగ్లేయుల ప్రభావము మన విద్యాధికుల పైబడి మన సాంప్రదాయములు, విద్యలు, కళలు చిన్నచూపు చూడబడినవి. పాశ్చాత్య నాగరికతా వ్యామోహముతో మన విద్యల విలువల నెఱుగక చిన్న చూపుచూడబడుటచే అవిద్య పెరిగి సత్సాంప్రదాయానికి జెందిన విద్యలు అంతర్ధాన మొందసాగినవి. నృత్యారాధన అరుదైనది. దేవదాసీలు కళారాధనమానిరి. ప్రాచీన కళల నెరిగిన కళారాధకులు అరుదైరి. అట్టితరి మన కళలయొక్క పూర్ణస్వరూప మెరిగిన పెద్దలు విద్యల ప్రచారమునకు పూనుకొ

నిరి. నాటినుండి దేశములో అనేక కళాకేంద్రములు నెలకొల్పబడినవి. కళలు మరల పూర్వపుటౌన్నత్యము నందుకొనుచున్నవి. కాని యిందు ఒక ముఖ్యమైన మార్పు జరిగినది. అది కళల యభివృద్ధికి ఎంతవరకు తోడ్పడుచున్నదో నేడే చెప్పలేముగాని కళాభ్యున్నతి శుభసూచకముగా పేర్కొనగలము. అదేమన పూర్వము నృత్యకళ కులవిద్యగా వెలసినది. ఇతర తెగలవారు ఆ విద్యను ఆరాధించెడివారు గారు. నేడు ఆస్థితిపోయి విద్యల యందు ఆసక్తి గలవారందరూ ఈ విద్య నభ్యసించుటకు మొదలిడిరి. దీనివలన కళలు విరివిగా ప్రచారమగుటయేగాక నూతన వికాసముతో గూడిన నృత్యకళ దేశములో ప్రచారమగు అవకాశ మేర్పడినది. దేశమందలి కళలకు ఉజ్వల భవిష్యత్తు గలదని ఆశింపవచ్చును.

# మన నృత్యకళ - కొన్ని వివరములు

## శాస్త్రము-సాంప్రదాయము

ఒక భావమును ప్రదర్శించుటకు పట్టవలసిన అభినయ పద్ధతులు, అంగవిన్యాసములు గ్రంథములందు పొందుపరుచబడుట శాస్త్రము. శాస్త్రపరిధి నెచ్చట జూచినా ఒకే తీరున యుండును.

సాంప్రదాయము తల్లినుండి బిడ్డలకు, గురువునుండి శిష్యులకు వచ్చుచుండునట్టి అభ్యాసక్రమము. కనుకనే భారతీయ నృత్యకళకు భరతదేశమందంతటనూ నాట్యశాస్త్ర మొక్కటే ఆధారగ్రంథ మైననూ ఆ శాస్త్రము ననుసరించి సాంప్రదాయ విద్యలు అభివృద్ధిజెందిననూ, ఆయా ప్రాంత ప్రజల అభిరుచులను, మత సాంఘిక పరిస్థితుల ననుసరించి రూపొందుతూ వచ్చినవే వివిధప్రాంతీయ నృత్యములగుటచే అందనేక భేదములు గాన్పించుచున్నవి. వివిధ రూపములలో వృద్ధిజెందినవి. ఉదా :- పతాకహస్తమును పట్టేవిధము.

నాట్యారంభములో పతాకమును యిరుప్రక్కలకు చాచినట్లు పట్టవలయునని శాస్త్రము తెల్పును.

ఈ హస్తమును భాగవతనర్తకులు, కేళికా ప్రదర్శనము జేయు దేవదాసీలు పట్టుదురు. హస్త మొక్కటే అయినా-ఇరువురు పట్టుక్రమమందు మాత్రము కొంత భేదమున్నది.

కేళికా (భరతనాట్య) నర్తకులు పట్టినప్పుడు హస్తము భుజములతో సరిసమానమగు యెత్తునందుండవలెను. (భుజములు, చేయి, యొకే ఎత్తునందుండవలెను) ఇక భాగవత సాంప్రదాయమునం దట్లుగాదు. హస్తము, భుజమును దిగి పట్టవలెను.

(హస్తము రెండింటిలో పట్టునదొక్కటేగాని పట్టు విధమందుమాత్రము భేదము).

అట్లే అడవులు (మండె, తెయ్, కత్తెరసటు మొదలైనవి).

ఈ రెండు సాంప్రదాయములందూ ప్రదర్శించినమూ వారు ప్రదర్శించు సమయములు రెంటియందునూ ఒక్కటే అయిననూ, సాంప్రదాయ నిబంధనలననుసరించి వాని విన్యాసమునందు భేదముండును. ఈ విన్యాసక్రమమునుబట్టియే మనము ఒక సాంప్రదాయమునుంచి యింకొక సాంప్రదాయమును గుర్తించగల్గుచున్నాము.

మరియు ఇంకొక విషయము.

భామా కలాపము నాడునప్పుడు — భామ తనపైన అలిగి పోయిన శ్రీకృష్ణుని వెదుకబోవు సమయమందు —

" ఎందుబోతివి ఎందుబోతివి
ఎందుబోతివి కృష్ణా''

ఈ దరువు పాడును.

'ఎందుబోతివి' దరువును ఇటపట్టుట శాస్త్రీయముగా ఒక నాయికను అభినయించుట. కాని అది శాస్త్రీయమే కాని

'బాలగోపాల మా ముద్దరి కృష్ణ
పరమ కళ్యాణ గుణాకర' —. తరంగం సత్యభామ అభినయించుట అంత సమంజసముగాదు. కాని యిది అనాది

మంచి కూచిపూడివారు ఆచారముగా అభినయించుచున్నారు. సత్య – శృంగారనాయిక. బాలగోపాలుని కీర్తించి అభినయించుట రసభంగమగునుగదా — ఇది అశాస్త్రీయముగదా ! అని సందేహము గలుగును.

కాని భాగవత సాంప్రదాయాభివృద్ధినిగూర్చి తెలిసికొనిన, అది ముఖ్యముగా భక్తిప్రబోధముకొరకు వృద్ధిబొందిన కళ. కాన– అందు వీలుగల్గినపుడెల్లనూ భక్తిప్రబోధమునకు అనువైన కీర్తనలు, శ్లోకములు పాడి అభినయించు సాంప్రదాయమును ఈనర్తకులు వృద్ధిబొందించినారు. ఇందు యిట్టివి అభినయించుట దోషము గాదు. ఇట్లు శాస్త్రసాంప్రదాయముల పాటింపునందు మార్పులు గనబడును.

## మార్గ, దేశి

### మార్గి :

శాస్త్రీయ పద్ధతులలో వృద్ధిపొందినట్టి, ఉచితశాస్త్రము ననుసరించి కరణాంగహార రేచక విన్యాసముల ప్రదర్శన గల్గినట్టి, దైవారాధనకు సంబంధించినట్టిది 'మార్గి' నృత్యము.

ఉదా :– ఆలయములందలి–పుష్పాంజలి క్రమము, నవ సంధి, కమలనృత్తము మొదలైనట్టివి.

### దేశి :

ఆయా ప్రాంతములలో నివసించు ప్రజలు తమ వినోదార్థము వృద్ధిపొందించుకున్నట్టి నృత్య సాంప్రదాయము 'దేశి' కళ. ప్రాంతీయ భాష, సంగీతబాణి, నృత్తనృత్య విన్యాసములు, చందస్సులకు ప్రాముఖ్యతనిచ్చి వృద్ధిపరుచబడిన కళలు 'దేశి' కళలు.

ఉదా :– యక్షగానను, భాగవతములు, కేళికానృత్యములు.

## నాట్యధర్మి, లోకధర్మి :

నాట్యధర్మి :–

నృత్యాభినయములందు ఒక భావము ప్రకటించుటకు శాస్త్రీయ నృత్త, నృత్యహస్తములు, కరణాంగహారముల ప్రయోగము 'నాట్యధర్మి'.

లోకధర్మి :–

స్వాభావికముగా అభినయించుట "లోకధర్మి".

ఉదా :–

కరుణ రసాభినయమందు అశ్రువులు ప్రదర్శించవలసి వచ్చినప్పుడు మయూర హస్తమునుపట్టి ఆచేతిని నేత్రములవద్దకుతెచ్చి అశ్రువులు చిమ్మినట్లు, ప్రేక్షకులు భ్రమించువిధమున అభినయించుట 'నాట్యధర్మి' యగును.

అట్లుగాక నేత్రములనుండి అశ్రువులు కార్చుట 'లోకధర్మి' ప్రదర్శనమగును. (ఇది లోకమందు సహజముగా గలుగు అనుభవమే.)

## బౌద్ధయుగమందలి నృత్యము

బౌద్ధయుగ నృత్యారాధనగూర్చి మనకు ఆకాలమున మన దేశములో పర్యటించిన విదేశయాత్రికుల వచనలవల్ల ఈ క్రింది విషయములు తెలియుచున్నవి.

కొందరు తలిదండ్రులు తమ బాలికలను సౌందర్యవంతముగా అలంకరించి బౌద్ధాలయములకు గొనిపోయి అచ్చట అంకితమొనరించెడివారు. ఆ బాలికలకు నృత్య సంగీతములందు శిక్షణ ఇవ్వబడియెడిది. పర్వదినములందు ఆ బాలికలను బౌద్ధాచార్యులు ఆలయములందు నృత్యము జేయుటకు ఆహ్వానించెడివారు. అట్టి సమయములందు వారు రుచికరమైన భక్ష్యములను దేవునికర్పించుటకు గొనివచ్చి భగవానునిముందుంచి నృత్యము జేసెడివారు. నృత్యము ముగియువరకు దైవసాన్నిధ్యములో ఆ పిండివంటకముల నుంచిన భగవంతుడు ఆరగించునని వారి నమ్మకము. అటుపైవారు ఆ నైవేద్యమును యిండ్లకు గొనిపోవుదురు. ఈ విధముగా ఆ బాలికలు వివాహకాలమువరకు కొన్ని నిబంధనలకు కట్టుబడి నృత్యకళతో భగవానుని ఆరాధించెడివారు. ఇదియును ఒకవిధమైన దేవదాసీ సాంప్రదాయమై యుండవచ్చును. మరికొన్ని సమయములందు వారు తమ భార్యలపై ఆగ్రహముజెందిన దేవతల ప్రీత్యర్థము నృత్యమాడెడివారు.

కొన్ని సమయములందు దేవతలు తమ అర్థాంగినులపై విసుగుజెంది ఆగ్రహముతో వీరిని విడిచివచ్చెదరనియు అట్టివారిని సంతృప్తిపరచి మరల తమ భార్యలపై అనురాగము గల్గించుటకు నగ్నముగా నృత్యము జేయబడియెడిది. అంతట దేవతలకు కోపశమనముగల్గి తమ పత్నులను చేపట్టేవారు. (ఇది యొకవిధమైన ఆత్మార్పణ నృత్యము. ఇట్టిది నాగవాసు లనే తెగవారు నాగపంచమినాటి అర్ధరాత్రియందు జేతురు. దీనికి 'బెహూళ' నృత్యమనిపేరు. వీరిది వంగదేశమునకు జెందినట్టి యొక ప్రత్యేకతెగ. ఆ తెగకుజెందినవారిలోనూ కొందరు తప్ప

అందరిలోనూ ఈ నృత్యము దర్శించే అర్హతలేదు. 'బెహాళ'ను గూర్చి వివరములు వేరుగా వ్రాసితిని.)

బౌద్ధ నృత్యకళను గూర్చి ఈ వివరములు దొరికిననూ నాడు ప్రచారములోనున్న సాంప్రదాయముగూర్చి మనకు తెలియుటలేదు. బౌద్ధశిల్పమును చక్కగా పరిశోధించిన కొంతవరకు తెలిసికొనగలమేమో !

## మత్తావలి, గొండ్లి, పేరిణి, జక్కిణి.

### మత్తావలి లేక మత్తిలి

ఇది ముస్లిం సాంప్రదాయమునకు చెందినట్టి నృత్యము. శాస్త్రీయ అభినయము, నృత్త నృత్యములకంటె ఇందు లోకధర్మి ఆధారమైనట్టి అభినయమునకు ప్రాముఖ్యత హెచ్చు. తురుష్క ప్రభువులు మస్తుగా మద్యము సేవించి, విందారగించి సభ తీర్చియుండ — అట్టివారిని వినోదపర్చుటకు విలంబ, మధ్య, ద్రుత లయలయందు సుళ్ళుగా తిరుగుతూ ప్రదర్శింపబడు భ్రమరగతి ప్రధానమైనటువంటి నృత్తము 'మత్తలి.'

### గొండ్లి

అరణ్యప్రాంతములయందు నివసించు, గోండుల నృత్య సాంప్రదాయము. (వీరినిగూర్చి ఆటవికుల నృత్యకళయందు వివరముగా వ్రాసితిని.) ఇది బృందనృత్యము. ఇందనేకులు స్త్రీలు, పురుషులు పాల్గొందురు. వీరనేక ఋతువులందుచేయు ప్రత్యేక నృత్యములు గాక 'ఖర్మ' ముఖ్యమైనది. ఇది ఆరాధన నృత్యము. చాల నియమబద్ధముగా వారి సాంప్రదాయములననుసరించి ప్రదర్శింపబడును. ఈ నృత్యమును 'ఇప్ప' చెట్లు పూచినపుడు జేయుదురు. ఈ నృత్యారాధనవల్ల సకాలవర్షములు, పంటల వృద్ధి, దేశము సుభిక్షముగా యుండునని వారినమ్మకము. పూచిన 'ఇప్ప' కొమ్మను పల్లెలోనికి మంత్రపూతమొనర్చి దెచ్చి, పూజించి, విందారగించి, అటుపై దానిచుట్టూ తిరుగుతూ నృత్యమును ఆడుదురు. ఈ నృత్యము త్రిశ్రగతిలో నుండును. మృదంగమునుబోలు వాద్యములు దీనిలో తాళలయల కాధారము. విలంబితలయలో ప్రారంభమై ద్రుతలయలో ముగియును. ఈ బహుసుందరవంతమైన ప్రఖ్యాతనృత్యమునకు 'గొండ్లి' అనికూడ అందురు. ఈ నృత్యమును బస్తరు, చాందాజిల్లా, గోండ్వానాలోని గోండులు నేటికిని జేయుచున్నారు.

### పేరిణి :

గర్షర, విషమ, భావాశ్రియ, కవివారక, గీతము అను అంగములు గల్గినట్టి నృత్యక్రమము పేరిణి. ఈ నృత్యము 'కేళికా' సాంప్రదాయమునకు జెందినట్టిది. శాస్త్రీయపద్ధతిని 'పుష్పాంజలి' నిచ్చుటలో ప్రారంభమై, అనేకములైన బహుకష్టతరములైనట్టి కరణవిన్యాసములప్రదర్శనగల్గి, నృత్త నృత్యములు, ఆంగికాభినయము ప్రదర్శించినపిదప అభినయముతో ముగియునట్టిది పేరిణి క్రమము. ఇది యేకపాత్ర నృత్యసాంప్రదాయమునకుజెందినట్టిది. ఇది దాదాపు నేటికాలములో ప్రదర్శింపబడే భరతనాట్య క్రమమును బోలియుండును. దీనివిగూర్చి వివరముగా ఆలయనృత్యములలో చర్చించినాను.

### జక్కిణి :

మృదంగశబ్దములతో, స్వరములతో, పాటతోగూడినట్టి సంగీతరచన జక్కిణి. మృదంగ జతులకు నృత్తము–గీతమునకు ఆంగికప్రధాన అభినయ ముండును. ఇందలి గీతభావము సాధారణముగా స్తోత్రరూపములోనుండును. ఈ ప్రాచీనరచన నాధారముగాజేసికొనియే అటుతరువాత వచ్చిన రచయితలు శబ్దములు, సలాము జతులు రచనజేసిరి. కాని ఈ రెండింటియందలి నృత్త క్రమమందు మాత్రము మార్పుండును.

### జక్కిణి దరువు

ఆనందభైరవి — ఆది.

చక్కని సామిరారా ! యీ
జక్కిణి కృతిగై కోరా
చక్కనరా
శ్రీ పూసపాటి సీతారామరాజ
దానరాధేయ.
సాస్సారిసని । నీసాసనిసగగమామగమపమా
పగరిసని తకిట ఝుం । తకఝుం తకిటతక
తాం తకిట దిమికిటతక తక్క దధింగిణ్ణతోం ।
స్వరసంగతులను । శబ్దజాతియును
సరసగతిజతుల । సప్తతాళముల
బరగిన దరువులు । పంచజక్కిణియ
సిరుల మరవినికి । చిత్తగింపదగు.

అటుపై ధ్రువ, మత్య, రూపక, ఝంపె, త్రిపుట, ఆట, ఏకతాళములందు కొణుగవశబ్దములు చెప్పబడును. దానికి నృత్తము ప్రదర్శింపబడును.

కొణుగప | జతి ... :
రేక | ధృవతాళము—14 అక్షరములు.
కొనుగోలు |

తద్ధిమిద్రిమికిణ ఝణుతకతోం
ద్రిమికిణ తక ధాం। తధిమి తకిటతక
ధణజెణుత జెణుధిమిత। ధిమితరి తకతరి
తధణ తధింగిణత॥

కొనుగోలు అనగా—నృత్తమాడునపుడు త, తక, ధిమి, ఝణు, తహత, మొదలైన శబ్దములను తాళమునకు సరిపడునట్లు ఒక క్రమములో ఏర్పరచి 'తధిగిణతోం' ముగించుట.

'కథక్' నృత్యము

కథకుడు (కథక్)నుండి కథక్ నృత్యమునకు పేరివ్వబడినది. కథకుడుగా నృత్యగీతాభినయములతో ఒక కథను ప్రజారంజకముగా జెప్పువాడని యర్థము. వారే హరిదాసులు, వారు జెప్పుకథలు హరికథలు. ఈ నృత్యమునకు ప్రాచీనగాన పద్ధతి ననుసరించి పేరివ్వబడిననూ, ఇది యెక్కువ ముస్లిం ప్రభావము గల్గినట్టి నృత్యసాంప్రదాయముగా జెప్పవచ్చును.

ఖ్యాల్, ఠుమ్రీ, టప్పా, గజల్ :

ఇవియన్నియూ ముస్లింప్రభువుల ప్రభావము మన ప్రాచీన సంగీతముపై బడిన తరువాత రచియింపబడిన సంగీత రచనలు.

ఖ్యాల్ : ఇది అతి విలంబితలయలోనుండి దీర్ఘమైన రాగాలాపనతో వివిధరకములైన అలంకారయుక్తమైన సంగతులతో గూడియుండినట్టి రచన. గాయకుడు తా ననుభవించు భావసౌందర్యమును స్వరములలో, ఆలాపనములో చిత్రించును.

ఠుమ్రీ, టప్పా, గజల్

శృంగార రసపోషణతోగూడిన సంగీతరచనలు. ఇవి దాదాపు మన భాషలోని పదములు, జావళీలను పోలియుండును. ఇవి భావయుక్తములై అభినయమునకు అనువగు సంగీత రచనలు. ఇందు 'దీప్‌చంద్' అను తాళమునందున్నట్టివి, తెలుగులోని త్రిపుట తాళమునందలి పదములవలె విలంబితలయతో నుండి రసాభినయమునకు యెక్కువగా ఉపయోగపడును.

# నర్తన రీతులు

ప్రతి దేశములోనూ సాధారణముగా నృత్యకళ ఐదు విధములుగా పెంపొంది ప్రచారములో నుండును.

(1) ఆరాధన నృత్యము.
(2) శాస్త్రీయ నృత్యము.
(3) ప్రచార నృత్యము.
(4) జానపద నృత్యము.
(5) ఆటవికుల నృత్యము.

## (1) ఆరాధన నృత్యము

ఆంధ్రదేశములో వీరభద్రుని సంబరములలోచేయు వీర నాట్యము, సింహాచలదేవుని సేవ, దేవీ నవరాత్రులప్పటి అమ్మవారి జాతరలందలి గరగల నృత్యము, వీరుల కొలుపులలోని నృత్యములు, కథకళి నృత్యములోని సేవకళి, పూర్వముదేవాలయములలో దేవదాసీల నృత్యము, మహారాష్ట్రములోని అగ్ని ఆరాధన, టిబెట్టుదేశములోని లామాలనృత్యము, సింహళదేశీయుల పైశాచి నృత్యాలు, తమిళనాడులోని కావిడి చిందు, మణిపురి రాసలీలా, లయహరోబా, అస్సాములోని అంకియానట్, ఉత్తర హిందూస్థానములోని రామలీలా, గోండుల ఖర్మనృత్యము, ఒరియనుల సార్‌హుల్‌పండుగ నృత్యాలు మొదలైనవన్నీ ఆరాధన నృత్యములే.

ఈ ఆరాధన నృత్యకళ కొన్ని ప్రాంతములందు శాస్త్రీయ నృత్యపద్ధతుల ఆధారముతో 'నాట్యధర్మి', 'లోకధర్మి' లను సమముగా పోషించుచూ చక్కని నృత్యసాంప్రదాయముగా పెంపొందినది. అట్టివానిలో ముఖ్యమయినది—దేవదాసీల నృత్యము, సేవకళి, లయహరోబా, అంకియానట్.

## 2. శాస్త్రీయ నృత్యము :

భరతుని నాట్య శాస్త్రము, అభినయ దర్పణము, భరతార్ణవము, హస్తలక్షణదీపిక ఇత్యాది నాట్యగ్రంధముల ఆధారము తో, స్థానక రేచక మండల ప్లవనకరణాంగ హార గతిజతియతి బంధ విన్యాసాదులు గల్గి ఆయా దేశముల నేలు ప్రభువుల, శాస్త్ర వేత్తలైన కవిపండిత గాయక నాగరిక ప్రజల అభిరుచులననుసరించి రూపొందించబడిన నృత్త నృత్య అభినయములు క్రమ పద్ధతిలో పోషించినట్టి కేళిక సంప్రదాయమే శాస్త్రీయనృత్యము.

ఈ నృత్యము ఆంధ్ర తమిళ కర్నాటకదేశములందు — దాసి ఆట, భరతనాట్యము, కచ్చేరీఆట, ఆస్థానము, మేజువాణి, కర్నాటకము, సాదిర్ అనియూ, కేరళదేశమందు మోహినీ ఆట్టము అనియూ, ఓఢ్రదేశములో ఒడిస్సీ అనియూ, ఉత్తర హిందూస్థానమంతటా కథక్ అనియూ పిలువబడుచున్నది. ఈ నృత్యము యెక్కువగా రాజులచే ఆదరించబడిన వారి సంస్థానములద్వారా పోషింపబడినది. ఆస్థానములందలి నాట్యాచార్యులు, రాజనర్తకినులు ఈ పద్ధతి విద్యను వృద్ధిపరిచి ప్రచారములోనికి తెచ్చినారు. ఈ నృత్యకేళిక సాధారణంగా స్త్రీ కళాకారులచే చేయబడును. పురుషులు ప్రయోక్తలుగా, హంగుదారులుగా సహకరింతురు. కనుకనే ఇందలి హస్త పాద విన్యాసములు లలితములై స్త్రీ ప్రకృతికి అనువైనరీతిని తీర్చి దిద్దబడినవి. ఈ సంప్రదాయము సాధారణంగా ఒకేనర్తకి కొన్ని గంటలు అతుకులు అనువైన రీతిని, కొన్ని సంగీతరచనలతోకూడి యుండును తాళలయ ప్రాధాన్యతగల నృత్తముతో ఆరంభించబడి, నృత్యములో నర్తకి తనపాండితీ ప్రతిభ ప్రదర్శించినపిదప అభినయముతో ముగించబడును. గీతగోవిందము, కృష్ణ కర్ణామృతము, రామకర్ణామృతము, పుష్పబాణవిలాసము, శృంగార మంజరి కాళిదాసాది మహాకవుల సంస్కృత రచనలు: అన్నమయ్య, క్షేత్రయ్య, పురందర, సారంగపాణి, సభాపతి ఇత్యాది పదకర్తల పదములు, జావళీలు, పద్యములు, పదవర్ణములు, చౌక వర్ణములు, గీతములు, పదదరువులు; తమిళయోగిపుంగవుల,కర్నాటక సంగీతజ్ఞుల రచనలు; సూరదాస, మీరా, చండీదాస, గౌరంగ ప్రభు ఇత్యాది ఔత్తరాహమహాభక్తుల రచనలు ఈ సంప్రదాయమందు వాడబడి నర్తన మాడబడును. ఈ నృత్యము ఒక కథా నాటకముగాక, ప్రత్యేకసంగీత రచనలకు ప్రదర్శింపబడునట్టి నృత్త నృత్య అభినయముగా పేర్కొనవచ్చును.

ఈ నృత్యవాణి మలయాళ దేశంలోని తిరువాన్కూరు, కొచ్చిను రాజుల ఆస్థానములందును, కర్నాటకదేశమందు మైసూరు ప్రభువుల ఆదరణయందు, తమిళనాడులో తంజావూరు, మధుర, రామనాధపురం, పుదుక్కోట, ఎట్టియాపురం మహారాజుల ప్రోత్సాహంతో; ఆంధ్రలో కాకతీయ, విజయనగర సామ్రాజ్యాది పతులు: కార్వేటినగరం, పెద్దాపురం, తుని, విజయనగరం మొదలైన క్షత్రియ సంస్థానాలు: కాళహస్తి, వేంకటగిరి, పిఠాపురము, బొబ్బిలి, కొల్లాపురం ఇత్యాది వెలమ జమీందారులు, కొండవీడు, గద్వాల, వనపర్తి మొదలైన రెడ్డిరాజులవర్భారులందూ: ఉత్తరాన మొగల్ పాదుషాలు, రసపుత్రుల ఆస్థానములందూ:ప్రాంతీయ అభిరుచుల కనుకూలంగా వృద్ధిచెంది ప్రచారమునకు తేబడినది. దక్షిణాపథములోని నృత్యకళ ప్రాచీన హైందవ సంప్రదాయాన్ని ప్రతిబింబించేకళగా రూపురేఖలు దిద్దుకొనగా, ఉత్తరదేశపు కళ మహమ్మదీయసంప్రదాయాలకు లోనై వృద్ధి చెందినది.

## 3. ప్రచార నృత్యము :

ప్రాచీన హైందవ సంస్కృతివికాసము, పురాణేతి హాసము ల్లోని విశిష్టత, మతరాజకీయ విశ్వాసములు,సామాన్య ప్రజానీకంలో సంగీత నృత్యకళలద్వారా ప్రచారము చేయుటకుగాను యేర్పడినట్టి సంప్రదాయమే ప్రచారకళగా పేర్కొనవచ్చును. ఇందు సాధారణంగా పురుషులే పాల్గొందురు. ఇదియే యక్షగాన, భాగవతకళ. ఈ భాగవతులు బృందములుగా యేర్పడి దేశములోని పల్లెలు పట్టణాలు మారుమూల ప్రాంతములలోగూడా పర్యటనజేసి యక్షగానములు, వీధినాటకములు, బొమ్మలు ఆటలు, తెరుకూతుగా కళలద్వారా మనమత ధర్మాలు, పురాణగాధలు ప్రచారముజేసినారు ఈ విద్య గూడా శాస్త్రీయమే : కళాకారులు వివిధశాస్త్రములను అధ్యయనము చేసినమా అతిసామాన్యమైన ప్రజలకుకూడా ప్రబోధానికి ఉపకరించు విధాన మనఃకలను సులభశైలిలో. ప్రజలభాషలో, ప్రజలకు అర్థమయ్యే భావవిన్యాసాల్లో రూపొందించి ప్రచార సాధనగా ఉపయోగించారు.

అట్టి కళయే ఆంధ్రదేశంలోని కూచిపూడి భాగవతము, తూర్పు భాగవతము, దాసీలభాగవతము, గొల్లభాగవతము,యానాది భాగవతము, దాసరి భాగవతము ఇత్యాదులు,తమిళనాడులోని భాగవత మేళములు, తెరుకూతు, కురవంజి నాట్యములు, కేరళలోని కథకళి, ఓటంతుళల్ కళాకారులు — కన్నడదేశంలోని యక్షగానము.

వీరందరూ రామాయణ మహాభారత భాగవత కథల్లోని వివిధ ఘట్టాలను నృత్యగానముద్వారా ప్రదర్శించి ప్రజల్లో ప్రచారము చేయుదురు — గాన వీరు శాస్త్ర విజ్ఞానము, పాండితీ ప్రతిభ గల్గియుందురు. వీరివల్లనే శాస్త్రీయపండితులేగాక, అనేకదేశికులు గూడా మనదేశంలోని సంగీతము, నృత్యములందు ప్రచారములోనికి వచ్చినవి. శైవవైష్ణవకథాగానములు విరివిగా వ్యాప్తమైనవి.

ఆంధ్రలో కూచిపూడి భాగవతులు శ్రేష్ఠులు. వీరు బ్రాహ్మణోత్తములు వేదవిద్యాపారంగతులు. ఆంధ్రలో వీరశైవము ప్రభావము తగ్గి వైష్ణవమత విజృంభణకాలములో కూచిపూడి గ్రామ ప్రజలు ఈ నృత్యకళను చేపట్టినట్లు చెప్పవచ్చును. నాటినుండి కొన్ని శతాబ్దాలుగా వీరికళను ఆరాధించుచున్నారు భారతావనిలో మరే ప్రాంతమునందు అభివృద్ధి జెందనంతటి విశిష్ట పద్ధతుల్లో ఆంధ్ర దేశములో శాస్త్రీయ నృత్యకళ, ప్రచార నృత్యకళ వృద్ధిపొందినది. దానికి ప్రాచీన కళాకారుల కళాతపస్సే కారణము. మనదేశంలో కొన్ని ప్రాంతాల్లో శాస్త్రీయకళ అభివృద్ధిజెందినది గాని ప్రచార కళ మరుగునపడినది. అట్లే ప్రచారవిద్య వృద్ధిపొందినచోట శాస్త్రీయవిద్య కుంటుపడినది. ఆంధ్ర కళాకారు లట్లుగాక రెండు రీతుల విద్యలను ఒకేస్థాయిని — ఒకరితో ఒకరు పోటీపడినవిధాన వృద్ధిపరచినారు. అంతియేగాక శాస్త్రీయకళను స్త్రీలు, ప్రచారకళను పురుషులు యావద్భారతదేశంలోని కళాకారులు ఆరాధించగా ఒక ఆంధ్రదేశంలో మాత్రం భాగవతకళను స్త్రీలుగూడా అభ్యసించి ప్రదర్శించుచున్నారు. ఇట్టి కళాభ్యాసము మరెచ్చటనూలేదు. ఇది ఆంధ్ర దేశానికెంతో కీర్తిదాయకము, గర్వకారణము.

## 4. జానపద నృత్యము :

శాస్త్రముతో సంబంధములేక కేవలము లోకధర్మిపై ఆధారపడి పెరిగినట్టిది, జానపదనృత్యకళ. తెలుగుదేశములోని గొబ్బి, అరవదేశములోని కుమ్మి, కోలాటము హైదరాబాద్ ప్రాంతములోని 'బతకమ్మలాట' పుంగిడి, చెమ్మచెక్క, మలబారులోని 'కైకొట్టుకలి' గుజరాతులోని గర్బనృత్యము, వంగదేశ వ్రతాచారి నృత్యములు, పులిఆట, గుర్రముల ఆట, బుట్టబొమ్మలు, దానవ్ల నృత్యము, పల్నాటికథ, జంగముకథ, కాటమరాజుకథ, బొబ్బిలి కథలోని నృత్యము.

ఇవి యన్నియు జానపదనృత్యమునకు జెందును.

## 5. ఆటవికుల నృత్యము :

అరణ్యములలో నివసించు కోయలు, చెంచులు, బైగాలు, కురవలు, మొదలైనవారు చేయునది ఆటవికనృత్యము. ఆటవికుల నిత్యజీవితములో నృత్యమొకభాగము. ప్రతి ఋతువునందును చేయుటకు వీరికి వేరు వేరు నృత్యములున్నవి. శిశువుదయించినప్పుడు నృత్యము, బారసాల సమయములో నృత్యము, వధూవరులు ఒకరి నొకరు నెన్నుకొనుటకు నృత్యము, జీవయాత్రచాలించి అంత్యక్రియలు జరుపు సమయమున నృత్యము, వరినాటు వేయుటకు, ఆరంభములోను, పొలములున్నప్పుడును నృత్యము, పంటలు బాగుగా పండుటకు నృత్య పూజలు, కోతలసమయములో నృత్యము, కోతలైన తరవాత సంవత్సరకృషి ఫలితము ఇల్లుజేర్చుకొనునప్పుడు నృత్యము, అతిథులెవరైన విచ్చేసినప్పుడు నృత్యము, వారిని సాగనంపునపుడు నృత్యము—ఈలాగున వారి జీవితమంతా వివిధనృత్యఘట్టములతో గూడిన యొక నృత్యనాటికవలె గడిచిపోవును.

పైన చెప్పిన ఐదువిధములైన నృత్యకళ అన్నిదేశములలోనూ పెంపొందినది. పై నృత్యవిధానముల గూర్చి వివరములను ఆయా నృత్యపద్ధతులను గూర్చి వ్రాసినప్పుడు దెల్పుదుము.

+++

# నేటి భారతదేశములోని నృత్య సాంప్రదాయములు

ప్రస్తుత కాలములో మన దేశములో యెక్కువ ప్రచారములో నున్న నృత్య సాంప్రదాయములు—భరత నాట్యం, కథక్, కథకళి, మణిపురి, కూచిపూడి, సిరై కేళా, ఒడిస్సీ, అంకియానట, యక్షగాన నృత్య పద్ధతులు. వీటిలోని పోలికలు, భేదములు, విశిష్టతలనుగూర్చి ఇందు వ్రాయుచున్నాను.

*భరతము* :—ఇందు నాట్యము, నృత్యము, నృత్తము, అభినయము, తాండవము, లాస్యము అను భేదములున్నవని అందరికీ తెలిసిన విషయమే.

పైనజెప్పిన సంప్రదాయములు ఏ పద్ధతికి చెందునో వ్రాయుచున్నాను.

## భరత నాట్యము

ఆంధ్ర, తమిళ దేశములలో దేవదాసీలు ప్రదర్శించు దాసి ఆటయే నేటి కాలములో 'భరతనాట్య'మను పేరుతో పిలువబడుచున్నది. ఇది అతి పురాతనమైన నృత్యము. హిందువులు దేవాలయములు కట్టుట ఎప్పుడు మొదలిడిరో, ఆనాటినుండి ఈ కళ యెక్కువ ప్రచారములోనికి వచ్చినది. భరతుని నాట్య శాస్త్రము ననుసరించియే అంగహారములు, రేచకములు, కరణులు, ఉత్ల్పవనములు మొదలగునవి శాస్త్ర సమ్మతములుగా ప్రదర్శించు కళ ప్రస్తుత కాలములో మన దేశములో ఇదొక్కటే కనబడుచున్నది. భరతనాట్య శాస్త్రమును బాగుగా అభ్యసించి, జీర్ణించుకొని, ఈ కళను రూపొందించి ప్రచారములోనికి నాట్యాచార్యులు తెచ్చినారేమో !

ప్రస్తుత కాలములో ప్రచారములోనున్న భరతనాట్య ప్రదర్శన క్రమము (అనగా అలరింపు, జతి, శబ్దము, వర్ణము, పదము, జావళి, తిల్లాన) తంజావూరు నేలిన రఘునాధరాయలు, విజయరాఘవనాయకుల కాలములో 'పేరిణి' పద్ధతి ననుసరించి వృద్ధిజెందినదై, సంపూర్ణ స్వరూపము శరభోజి, శహాజి, శివాజి మొదలైన మహారాష్ట్రి రాజుల కాలములో యేర్పడినది. ఈ విధానము ననుసరించి చేయబడు ప్రదర్శనములలో నృత్య, నృత్త, అభినయములు సరిసమానముగా పోషింపబడుచున్నవి. ఆంగిక, వాచిక, సాత్వికాభినయములకు చక్కని అవకాశము గలదు. ఈ విధమైన చక్కని విభాగము నా అనుభవములో నేను చూచి అభ్యసించిన జాపనీస్, బాలినీస్, సయామీస్, కంబోడియన్, కథకళి, మణిపూర్, కథక్ నాట్యములలో ఎచ్చటను జూడలేదు.

ఈ నాట్యము లాస్య పద్ధతికి జెందినదగుటచే సుకుమారమైన కోమల ఆంగికాభినయములతో నయనానందకరముగా హృదయాహ్లాదకరముగా ఉండును. నాయికాభినయమందు ఈ సాంప్రదాయముదే పైచేయి. రౌద్ర, బీభత్స, భయానక రసములు తప్ప తక్కిన రసములన్నియు ఈ పద్ధతిలో అభినయింపవచ్చును. భరతనాట్య నర్తకులు చిత్రగతులను జతిస్వరమందు నృత్తమాడునపుడు మన హృదయములు ఆనాద ప్రభావముచే ఆకర్షించబడి అర్థముకాని ఒక ఆనందము ననుభవించును. నాయికా నాయకులకు సంబంధించిన శృంగార రసనిలయములైన పదముల అభినయము జూచినప్పుడు మనము మనవాస్తవిక జీవితములోని సుఖదుఃఖములను అనుభవింతుము. కృష్ణ వర్ణన గీతములతో గూడిన శబ్ద నృత్యము జూచినప్పుడు దేవాలయముల లోని శిల్పము లన్నియూ మన కన్నులముందు కదలుచున్నట్లే భ్రమ కలుగును.

నేటి కాలములో కేవలము వ్యాపార దృష్టితో నాట్యము చేసేవారుగాక నాట్య కళకై తమ జీవితముల నంకితము జేసిన కళోపాసకుల భరతనాట్య ప్రదర్శనము జూచినప్పుడు మన హృదయములు ఆధ్యాత్మికానందముతో నిండిపోవును. మనలో పవిత్ర భావములు స్ఫురించును. నిరంతరానంద సంధాయి, ఆ దేవదేవుని సాన్నిధ్యములో నున్నట్లే అనిపించును. కాలక్రమేణ పతితుల చేతులలోబడి అపఖ్యాతి పొందినా పవిత్రమయిన ఆదర్శములతో కూడుకొనియున్న కళ యిది.

ఇందు 'లోకధర్మి', 'నాట్యధర్మి' సమముగా పోషింపబడుచున్నవి. పూర్వము భరతనాట్యము స్త్రీలు చేయుచుండెడివారు. పురుషుడు నటుడుగా (నాయికాభినయమందు చెలికత్తెగాను, వంత పాట పాడుటకు) మాత్రమే యుండువారు. అందుచే భరత నాట్యము స్త్రీలే చేయవలెననియు, పురుషులు చేసినా రాణించదనియూ, "పురుషులు చేయుటకు వీలుండునా" అనియు నేటి కళారాధకులలో ఒక సంశయము కలిగినది.

అలారి, జతి, శబ్దము, తిల్లాన భాగములు స్త్రీ పురుషులిద్దరూ చేయవచ్చును. కాని పురుషులు అభినయించుటకు

నాయికా సంబంధమైన గీతములేగాక, నాయక సంబంధమైన పదములు, గీతములు, జావళీలు పదవర్ణములు ఎన్నియోయున్నవి. వానిని ప్రచారములోనికి తీసికొని రావచ్చును. కొందరు పురుషులు స్త్రీ వేషము ధరించి నాయికా సంబంధములైన గీతముల నభినయించుటగూడ జూచుచున్నాము.

నాయక గీతములు పురుషవేషములోనే అభినయింపవచ్చును. కనుక స్త్రీ పురుష ఉభయులూ పాల్గొనుటకు వీలున్నది.

*భరతనాట్యం:*—తమిళ-ఆంధ్ర దేశములలో యెక్కువ ప్రచారములోనున్నది. ఇప్పుడిప్పుడు ఈ నాట్యకళలోని విశిష్టత గ్రహించి ఉత్తర హిందూస్తానములోని కళారాధకులుగూడ యెందరో ఈ నాట్య పద్ధతిని అభ్యసించిరి. ఇంకనూ అభ్యసించుచున్నారు.

## కథకళి

భరతనాట్యము కోమల, సుకుమార, భావములకు నిలయమైతే కథకళి గంభీర, ఉద్ధత భావములతో నిండియుండే తాండవపద్ధతికి జెందిన నృత్యము వీర, రౌద్ర, బీభత్స, భయానక రసముల నభినయించుటలో కథకళి నర్తకులకు పెట్టినదే పేరు. ఒక్కొక్కప్పుడు నర్తకులు ఇంచుక ప్రారంభకులే అయినప్పటికినీ వారు ధరించే దుస్తులు, ముఖములకు వేసికొనే రంగులు, చండ, మద్దెలలనుండి వెలువడే గంభీర నాదములు, ప్రేక్షకులలో ఆ రసముల నుత్పత్తిచేయును. నృత్యమందు వీరి ఆహార్యము వాస్తవికతకు కొంతదూరముగా ఉండునట్లు దోచుచున్నది.

భరతనాట్యము రాజదర్బారులలో పెరిగినది. అందుచే అభినయము, గానము, ఆహార్యము, ప్రతివిషయమందు లాలిత్యము, కోమలత్వము, కనిపించును. కాని కథకళి నృత్యనాటికలలో లాలిత్య సౌకుమార్యములకు తావులేదు. ఇది ముద్రానాట్యము. ఇం దుపయోగబడినట్లు ముద్రలు మరియేపద్ధతియందు కూడ ఉపయోగింపబడవు. కనుక సాత్వికముకన్న ఆంగికమే ఈ పద్ధతిలో ఎక్కువగా ఉపయోగమందున్నట్లు తోచును. ఇది ఉద్ధత నాట్యమగుటచే దీనియందు సాధారణముగా స్త్రీలు పాల్గొనరు. స్త్రీలు 'మోహిని ఆట' అభ్యాసంచేసెడివారు.

వింత వింత రంగులతో మేకప్ చేసికొని, చిత్రవిచిత్రములైన ఆభరణములను ధరించి రంగస్థలముపై చండ వాద్యము ననుసరించి నాట్యమాడుచుండగా ప్రేక్షకులు విస్మయానందవీచికల నోలలాడుదురు. ఈ నాట్యములో ఎంత విద్వత్తు ఉన్ననూ, ఎట్టి అద్భుతమైన ఆహార్యమున్ననూ, అభినయ విధానము, భావ ప్రకటన సున్నితముగా ఉండదు. 'లోకధర్మి' చాలా యెక్కువగా ఈ కళయందు ప్రదర్శింపబడుచున్నది. కాని మన దేశములో మిగిలియున్న పూర్వకళలలో పూర్వ పద్ధతులలో ప్రదర్శింపబడునది ఇదియొక్కటియేయని విశ్వకవి రవీంద్రునిచే పొగడ్తలొందిన ఈ కళకు మలబారుపుట్టినిల్లు. బెంగాలు, దక్షిణభారత దేశములలో ఇది యెక్కువ ప్రచారములోనున్నది.

## కథక్

ఇది మహమ్మదీయ యుగములో ప్రభువుల విలాసార్థము పోషింపబడిన కళ. ఇందు ఠుమ్రీ, గజల్, అభినయము నాయికా భావములతో గూడియున్ననూ, శాస్త్ర సమ్మతముగాని ఈ అభినయము 'యౌపరిత' నృత్యమును పోలియుండును. జనుల హృదయమును ఆకర్షించునట్టిదే, రంజింపజేయునట్టిదే. (ఆదర్శవంతమైనదికాకపోయిననూ) కళ అను పద్ధతిలో యిది పోషింపబడినది. ప్రభువుల తీరిక సమయములో, 'జల్సాకు'గాను ఈ కళ పెంపొందినది. అభినయమెట్లున్ననూ మరియే నృత్య సాంప్రదాయములోనూలేని తాళ నృత్తము దీనియందున్నది. కథక్ నర్తకుడు యే తాళములోనైననూ గంటలకొలది నృత్యమాడగలడు. బహు కష్టతమమైన బ్రహ్మ, ధమార్, రుద్ర, లక్ష్మి మొదలైన తాళములలో అవలీలగా నృత్తమాడగలడు. తన అడుగుతో యెట్టి కష్టతరమైన శబ్దములనైననూ, ఎంత త్వరితగతినైననూ పలికించగలడు. ఇట్టి అభ్యాసము మరియే పద్ధతియందునూలేదు. కాని యిది రసభావములులేని నృత్తమగుటచే అంత ఆకర్షణీయముగా నుండదు. కనుక ప్రేక్షకులు యెక్కువకాలము చూడలేరు. ఇది లాస్య పద్ధతికి చెందిన నృత్యము.

ఈ కథక్ నృత్యము రెండు విధములుగానుండును.

(1) జైపూరీ నృత్యము.

(2) లక్నో ఘరానా.

ఈ రెండునూ విశేషముగా పోలియున్ననూ, విమర్శన దృష్టితో సూక్ష్మముగా జూచిన చాలా భేదములు కనబడును.

జైపూరి నృత్యముపై హైందవ సాంప్రదాయముల ప్రాభవము యెక్కువగానుండును. లక్నోఘరానా నృత్యములో

మహమ్మదీయ సాంప్రదాయములు ప్రబలముగానుండును. వేష ధారణయందుగూడ ఈ భేదము కొంతవరకు కనిపించును. జైపూరి నర్తకి లంగా, చోళి, వల్లె ధరించును, లక్నో నర్తకి చుడీదార్ పైజామా, పొడుగుపాటి జుబ్బా, కుచ్చుల షేర్వాణీ వేసికొనును.

జైపూరి అభినయము మీరా జన్మభూమియగు రసపుత్ర ప్రదేశములోని మధుర భక్తితో తొణికిసలాడుచుండును.

ఇటుల యెన్నియో విభేదములున్నవి.

ఈ కథక్ నృత్యముయొక్క ప్రభావము చాలవరకు మహా రాష్ట్ర దేశములోని పోవాడ, లావణీ నృత్యములలో కనబడు చున్నది. ఇది ఉత్తర ప్రదేశము, పంజాబు, రాజపుటాన, బొంబాయి మొదలగు ప్రాంతములలో యెక్కువ ప్రచారములో నున్నది.

## మణిపురి

లాస్య పద్ధతికి జెందిన నృత్యము. చైతన్యుల జన్మభూమి యైన వంగదేశములోను, మణిపురి ప్రాంతములోను యెక్కువ ప్రచారములోనున్నది. వేణుగోపాలుని నృత్యగానములతో పూజించునట్టి ఆరాధన నృత్యముగా దీనిని పేర్కొనవచ్చును. పూర్వము భరతము విద్య ఆరాధన నృత్యమైననూ, ఒక కళగా వృద్ధిచేయుటకు, పాండిత్యము ప్రదర్శించుటకు దానిని దేవ దాసీలు అభ్యసించేవారు. మణిపుర నృత్య మట్లుగాక సామాన్య ప్రజానీకపు జీవిత నిత్యకృత్యములలో యొకభాగమగుటచే అది అట్టి మహోన్నత స్థితికి రాలేదు. విశేష ప్రచారము మాత్ర మున్నది. ఇది కోమలమైన, మనోహరమైన, రమణీయమైన ఆంగికాభినయముతోగూడి చూచుట కింపుగా నుండును.

ఆకుపచ్చ, ఎరుపు, తెలుపు రంగుల అద్దములచే కుట్టబడిన బుట్టలవంటి లంగాలు ధరించి, శిరోజములు శివుని జటాజూటము వలె పైకెగదువ్వి, నడినెత్తిపై గోపురాకారముగాకట్టి, మణులతో అలంకరించుకొని, భక్తిపారవశ్యముతో స్త్రీలందరూచేరి జయ దేవుని అష్టపదులు పాడుతూ, చేతులు తట్టుతూ, కృష్ణ మందిరా వరణలో నృత్యం చేయడము చూచినచో, మనకు ద్వాపర యుగంలో యమునాతీరములో కృష్ణుని రాసక్రీడ జ్ఞాపకమునకు వచ్చును. వీరు భక్త్యావేశముతో నృత్యము చేయుదురు. కనుక వీరు ఒక్కొక్కసారి పాడే పాటకు, చేసే అభినయమునకు సంబంధమే యుండదు. అభినయముకూడ యెక్కువ అభివృద్ధి జెందలేదు. రసపోషణ తక్కువ. ఈ సాంప్రదాయము శాస్త్రముకన్న ప్రకృతిపైననే యెక్కువ ఆధారపడియుండును. హస్తవిన్యాసము మాత్రము బహురమణీయముగా వెలయేళ్ళ ప్రవాహమువలె ఇంపుగా యుండును. దైవారాధనకొరకు నృత్యము చేయు నర్తకులు శాస్త్రమునకుగాని, 'లోకధర్మి', 'నాట్యధర్మి'లకుగాని యెక్కువ ప్రాముఖ్య మివ్వక ప్రకృతిపైనే ఆధారపడియుండుట లోకవిదితమే.

## కూచిపూడి నృత్య కళ

ఆంధ్రదేశములో ప్రచారములోనున్న భాగవత నృత్యము నకు 'కూచిపూడి నృత్య'మని పేరు. ఈ నర్తకులు వీధి నాటకములు నాడుటయేగాక, నట్టువమేళ పద్ధతిలో పదముల అభి నయము, వర్ణములకు నృత్యము, కొల్లుకట్టు, మండూక శబ్దము, నృత్తములనుకూడ నాడుదురు. 'పటవాటము' మొదలైన పురాతన అడవులను ఈ నర్తకులు నేటికినీ ప్రదర్శించుచున్నారు. భరత శాస్త్రములో చెప్పిన చతుర్విధ అభినయములు ఈ కళలో గాంచ వచ్చును.

వీరి నృత్యములో ముఖ్యముగా చూడవలసినవి నృత్య నాటకములు, మరియు తరంగముల నృత్యము, అష్టపదుల అభినయము, కొల్లుకట్టు, జతుల నృత్యము, భామా కలాపము మొదలైనవి.

## సిరైకేళా చెవ్వు నృత్యము

సిరైకేళా సంస్థానాధీశునిచే పోషింపబడి, సిరైకేళాలో ప్రచారములోనున్న నృత్య సాంప్రదాయము. ఇందు ఆ సంస్థాన రాకుమారులు పాల్గొందురు. ఇది తాండవ నృత్యము. ఇది కథకళిని పోలియుండును. ఇందులో నృత్యము చేయునప్పుడు నర్తకులు ముఖములకు తొడుగులను (Masks) – ఏయే నృత్య ములలో ఆయా పాత్రకు సరిపోవునట్టివి – ధరించి నృత్య మాడు దురు. అభినయమునకు జీవమైన ముఖము కప్పబడుటచే వీరు రసభావములను సంగీతముయొక్క ఆధారముతో ఆంగికాభి నయముద్వారా ప్రదర్శింతురు. వీరు ప్రదర్శించే నృత్యములలో రాధాకృష్ణ, కాళీయమర్దన, జీవితపు మాయ, బంధజీవి, వేటగాడు, జీవనావ ముఖ్యముగా చూడదగ్గవి.

మయూర్‌భంజ్‌యందు ప్రదర్శించే 'చెవ్వు'నందు నర్త కులు ముఖములకు తొడుగులు ధరించకపోయిననూ అభినయము

మాత్రముండదు. ముఖముపై యెట్టి భావప్రకటనగాని ప్రదర్శింప బడదు.

## కన్నడ ప్రాంతములోని యక్షగానములు

కన్నడ ప్రాంతములో రెండు రకములైన యక్షగానములు ప్రచారములోనున్నవి.

(1) బైటక్ యక్ష గానము.
(2) నృత్య నాటకము.

*బైటక్ యక్ష గానములు*

ఈ గానములలో పాల్గొనువారు ఆహార్యము ధరించరు. వాద్యము లెక్కువగా యుండవు. ఇందు పాల్గొనువారందరు మహా పండితులు. శాస్త్ర పురాణముల నెరిగినవారు. పండితులందరు దగ్గరచేరి వారి పాండిత్య ప్రతిభను ప్రదర్శించు సభ వంటిదే ఈ యక్షగానము. ఈ పండితులందరు ఒకచోట గూడుదురు. వారిలో ఒకరు పెద్దగా యుందురు. రామాయణ, భారత, భాగవతములలో యేదైనా ఘట్టమును తీసికొని యక్ష గానము చేయుటకు నిశ్చయింతురు. వారిలో పెద్దగా యెన్నుకో బడిన పండితుడు ప్రారంభించును. తరువాత ఒక్కొక్కరు తమకు నిర్దేశింపబడిన పాత్రననుసరించి సమయోచితముగా గద్య పద్యములతో ఆశువు ధోరణిలో సమాధానములు చెప్పవలసి వుండును. ఇది యొక విధమైన ఆశుకవిత్వ ప్రదర్శనమేగాక, పండితులకు విద్యా పరీక్షవంటిది. ఎవరైతే ప్రారంభించిన స్థాయిలో భాషను, భావాన్ని పోషించుచూ ఆ పాత్రను నడుప లేరో వారు ఓడిపోయినట్లు యెంచబడును. ఇట్టి ఆచారము ఉత్తర దేశములో 'కవాలీ' పాటకులయందు 'సవాల్' 'జవాబు' అని యున్నది.

ఉదా :-కృష్ణరాయబారము వారు గానము చేయుచున్నారను కొందము. శ్రీ కృష్ణుడు దుర్యోధనుని దర్బారుకు వచ్చినప్పటి ఘట్టము—

ఆ రోజున యెన్నుకొనబడినపెద్ద కృష్ణుని సంభాషణతో ప్రారంభించును. వెంటనే అతని ప్రక్కనున్న పండితుడు ప్రారంభకుడు యెట్టిభాషలో ప్రారంభించునో అదేపద్ధతిలో దానికి తగిన జవాబు—పురాణములోని పద్యగద్యములను సమయానుకూల ముగా తన స్వకల్పనములతో చేర్చి, దుర్యోధన పాత్రనో, దుశ్శాసన పాత్రనో చెప్పవలెను. అతడు ముగించగానే విదురుని పాత్రయో, కర్ణుని పాత్రయో యింకొకరు అభినయింపవలెను. ఇట్టి యక్షగానములందు పండితులందరూ ఒకచోట జేరి తమ విద్యను ప్రదర్శించుటకు అవకాశముండును.

*నృత్యముతోగూడిన యక్షగానములు*

ఈ గానమునందు పాత్రలందరూ ఆహార్యము ధరించి, సంగీత వాద్యముల సహాయముతో నాటకము లాడుదురు. ఇందు భాష కన్నడమైననూ ఆహార్య విధానమునందు, వాద్య విశేషములందు, కథనడుపు విధానమునందు చాలవరకు ఇది 'కథకళి'ని పోలియుండును. ఇందు నాట్యము చేయు పాత్రలు పాడరు. మద్దలం, చండ మొదలైన కథకళి వాద్యములనే వీరు ఉపయోగింతురు.

## బొమ్మలాటము

తోలు బొమ్మలకు మన ఆంధ్రదేశము ప్రసిద్ధికెక్కినట్లు కర్ర బొమ్మలాటకు కన్నడ దేశము ప్రసిద్ధి. మనిషియెత్తు కర్ర బొమ్మలను ప్రతి అవయవము వేరుచేయబడి, నృత్యమందు అంగ విన్యాసము చేయుటకు వీలగునట్లు తీగెలు కట్టబడియుండును. వానికి నృత్యములోని పాత్రలకు తగినట్టి ఆహార్యమును తొడిగి తెరవెనుక నిలబడిన మనుష్యులు పాడుతూ ఆడింతురు. నేటి కాలపు బొమ్మలాటమువారు భాగవతములోనేగాక, భరత నాట్యములోని అలరింపు, జతి స్వరము మొదలైన నృత్యములను గూడ ప్రదర్శించుచున్నారు.

## మహారాష్ట్రములోని యక్షగానము

లావణి (లలిత), దండోరా, తమాషా పోవాడ నృత్య రీతులు.

లావణి, దండోరా, తమాషా — ఇవి నట్టువ మేళమునకు చెందిన యక్షగాన రీతులు. ఇందు ఒకరుగాని, యిద్దరుగాని స్త్రీలు పాల్గొందురు. అందు ఒక స్త్రీ నాయిక పాత్ర ధరించును, ప్రక్కన తాళమువేయు నటుడు కథలోని వివిధ పాత్రలుగా మారుచుండును. అంతలోనే చెలికత్తె, దూతిక, కృష్ణుడుగా మారుచూ కథ నడుపును. ఇవి యెక్కువగా పామర జనరంజక ముగా నుండునట్టి నృత్య విశేషములు. ఈ నృత్యములపై హిందూస్థానీ కథక్ నృత్య ప్రభావమెక్కువగా నున్నది. నృత్యములోని అడవులు, హస్తవిన్యాసము, భావపోషణ అంతయు

కథక్ పద్ధతిలో నడచును. ఇవి శృంగార రసప్రధానములైన గానములు.

## పోవాడ నృత్యములు

ఇందు ముఖ్యముగా పురుషులే పాల్గొందురు. మహారాష్ట్ర దేశములోని వీరపురుషుల జీవిత చరిత్రములను గానము చేయుదురు. ఇందు శృంగారమునకు నెక్కువ స్థానముండదు.

## ఒడిస్సీ నృత్యము

ఒరిస్సా దేశములోని అతి ప్రాచీనమైన నృత్య సాంప్రదాయము ఈ ఒడిస్సీ నృత్యము. ఇది భరత శాస్త్రానుగుణ్యముగా నభివృద్ధి చెందినటువంటి నృత్య సాంప్రదాయము. ఇది గాక దక్కిని, చొక్కినట అను మరిరెండు సాంప్రదాయములు కూడ ఓఢ్ర దేశమందు ప్రచారమందున్ననూ, అశేష ప్రజానీకముచే ఆదరింపబడి పండితులచేత, శాస్త్రజ్ఞులచేత నామోదింపబడిన నృత్య సాంప్రదాయము ఈ ఒడిస్సీ నృత్యము. ఈ నృత్యమునందు ప్రదర్శించెడి హస్తవిన్యాసము, ముద్రలు, భావ ప్రకటన, జతి కట్టుబాటులు, తీరికలు, మొదలైనవన్నియు భరత శాస్త్రము ననుసరించి ప్రదర్శింపబడుటచే చాలవరకు మన ఆంధ్ర దేశమునందలి పురాతన దేవదాసీల నృత్య రీతులను పోలియుండును. వీరి శబ్దముల కొలిపింపుకూడ మన బాణివలెనే యుండును. సంగీతము మాత్రము ఒరియా భాషకు అనువైనట్టి విధముగా నభివృద్ధి చెందుటచే కొంతవరకు ఔత్తరాహుల సంగీతపు పోకడలు మనకు కాన్పించును. పూరీయందలి జగన్నాథ స్వామి ఆలయము లలితకళలకు నిలయము. అచ్చట భగవంతుని సంగీత నృత్యములతో (అష్టపదులను ముఖ్యముగా పాడుచు) ఆరాధించు నాచారము నేటికిని యున్నది.

ఒడిస్సీ స్త్రీ నర్తకులు ధరించు ఆహార్యము, చీరకట్టు చాలవరకు మన ఆలయమునందు పూర్వము దేవదాసీలు నృత్యమాడునప్పుడు ధరించెడి రీతిని పోలియుండును. వీరును ప్రతి పాటకు నృత్యమాడునప్పుడు ముక్తాయితో ప్రారంభించి తీర్మానముతో ముగింతురు. క్షేత్రయ్య పదములను పోలిన రాధా మాధవుల ప్రేమతత్వమును తెలుపునట్టి గీతములను వీరు ముఖ్యముగా అభినయింతురు. దక్షిణ దేశపు నాట్యమందు నాట్యాచార్యుడు నర్తకిని ఆడించునపుడు చిట్టాలు కొలుచునపుడు పదములు, జావళీలు పాడునప్పుడు చేతనున్న తాళములను తట్టుచూ నాడించును. ఒడిస్సీయందు ఆచార్యుడు పాడినమా తాళము మాత్రము వేయడు. వీరి నాట్యమునకు పక్వాజ్ ముఖ్య వాద్యము.

దక్కని నాట్యము తెలుగు దేశము నానుకొనియున్న ప్రాంతములో విరివిగా ప్రచారములోనున్నది. చొక్కనాట్ మన భాగవత కథను పోలియుండును. నేటి కాలములో ఒడిస్సీ నాట్యమును గూర్చి విశేషముగా ప్రచారము చేయుచున్న వారిలో ముఖ్యులు శ్రీ కవిచంద్ర కాళీచరణ్ పట్నాయక్‌గారు. వీరి వద్ద అనేక తాళపత్ర గ్రంథములున్నవి. వీరు చాలకాలముగా జగన్నాథస్వామి ఆలయమునందు ప్రముఖ సంగీత విద్వాంసులుగా నుండుటచే అపూర్వ గ్రంథములను సేకరించుటయేగాక, అనేక ఆరాధనా నృత్య విధానములనుగూడ తెలిసికొని ఆ కళను విశేషముగా ప్రచారము చేయుటయందు పాటుపడుచున్నారు. ఈ ఒడిస్సీ సాంప్రదాయము ముఖ్యముగా లాస్య పద్ధతికి చెందినది.

## అంకియానట

కామరూప్‌నందు (అస్సాం) విశేష ప్రచారములోనున్న ఆరాధన నృత్య సాంప్రదాయము అంకియానట. ఈ సాంప్రదాయము క్రీ. శ. 1449 నుండి 1568 వరకు జీవించిన మహా పురుష శ్రీ శంకర్‌దేవ్ అను వైష్ణవ మతాచార్యునిచే ప్రచారములోనికి తేబడెను. శంకర్‌దేవ్ 'శిరోమణిబుయర్' అను జమీందారీ సాంప్రదాయమునకు చెందిన కుటుంబములో జన్మించిననూ, సకలైశ్వర్యములను త్యాగముచేసి మానవాభ్యున్నతికి, హైందవ ప్రచారానికి తమ జీవితము నర్పించిన త్యాగపురుషుడు. ఈ మహనీయుడు అనేక వత్సరములు ఉత్తర దక్షిణ దేశములందు పర్యటన చేసెను. వీరు ప్రేమ తత్వమును బోధించిరి. ఈయన నృత్యగాన కళలద్వారా భగవదారాధన చేయు విధానము విరివిగా ప్రచారములోనికి వచ్చెను. వీరు వ్రాసిన నృత్యనాటకములందు ముఖ్యమైనది 'కాళీగోపాల్', 'కాళీయదమన్', 'సీతా స్వయంవర్', 'పారిజాతాపహరణ్' మొదలైనవి. అంతియేగాక తమ గురు పీఠమును అలంకరించు ప్రతిప్రవర్తయును ఒక నాటకమునైననూ వ్రాసియుండవలయునని ఈ మహనీయుడు శాసించుటచే అస్సాంనందలి శాస్త్రీయ నృత్య విద్య, మన కూచిపూడినందలి భాగవత కళవలె శతాబ్దములు గడచిననూ, నేటికినీ దినదినాభివృద్ధిని చెందిన జీవకళగా నిల్చియున్నది.

శంకర్‌దేవ్ తన కాలమునాటికే రంగులు వేసిన తెరలను కూడ తన నాటకములకు ఉపయోగించిరి. అస్సాంయందలి

నృత్యము ముఖ్యముగా 'ఒజ్‌పాలీ', 'గాయన్ బాయన్' అను రెండు విధములుగా పెంపొందినది. ఈ రెండు పద్ధతులను కొన్ని తరముల నుండియు కొన్ని ప్రత్యేక కుటుంబములకు చెందిన వారు ఆరాధించుచున్నారు. శంకర్‌దేవ్ అనేక సంవత్సరములు ఉత్తర దక్షిణ దేశములు పర్యటన చేసి అనేక నృత్య సాంప్రదాయములను సందర్శించిన వాడగుటచే, దేశములోని వివిధ సాంప్రదాయములను, సౌందర్య స్వరూపములన్నిటినీ, ఏర్చి కూర్చి తమతమ ప్రచారమునకు ఉపకరించునటువంటి ఉన్నత భావములు కలిగిన ఒక చక్కని నృత్య కళా సాంప్రదాయమును రూపొందించి ప్రచారములోనికి తెచ్చిరి. ఇది ఆ మహనీయుని యొక్క ఆదేశముగా ఆ దేశపు ప్రజలు ఎంచుటచే అచ్చటి కళ తమ, తమ జన్మలు తరించు మార్గముగా భావించి ఆరాధింప బడుటచే, నేటికినీ తనయొక్క పవిత్రతను కోల్పోక, పూర్వపు ఔన్నత్యముతోడనే శోభిల్లుచున్నది. మన దేశములో ప్రచారములో నున్న భాగవత కళకును, ఈ కళకును ఎంతటి సాన్నిధ్య మున్నదో తెల్పుటకుగాను ఒక చిన్న విషయమును ఇచ్చట వ్రాసి ముగింతును.

సిద్ధేంద్రులు రచించిన పారిజాతాపహరణ నాటకము వంటిదే శ్రీ శంకరదేవుగారుకూడ పారిజాతాపహరణమను పేరుతో వారి భాషయందు రచించిరి. వారి నాటకములను ప్రదర్శించు విధానము—నటి సూత్రధారుల ప్రవేశము, పాత్ర సభా ప్రవేశము, నిష్క్రమణ, నర్తకులు, గాయకులు, వాద్యకులు, సభయందు నిలుపబడు విధానము, నటుని వ్యాఖ్యానపు పోకడలు, అన్నియూ భామా కలాపమునందు మన భాగవతులు అనుసరించు విధానమునే చాలవరకు పోలియుండును.

భారత దేశములోని నాట్య పద్ధతులన్నిటిలోనూ, భరత నాట్యము, కూచిపూడి నాట్యము, ఒడిస్సీ నృత్యము, అంకియానట ఈ నాలుగు సాంప్రదాయములు చాల సన్నిహిత సంబంధముకలిగి వృద్ధిజెందిన కళలుగా కనబడుచున్నవి.



# కొన్ని అపూర్వ నృత్యములు

## 1. సబర నృత్యములు

ఈ తరగతికి చెందిన నృత్యములన్నీ ఆరాధన నృత్యములే. ఈ నృత్యమును కొన్నితెగలవారు మాత్రము చేయుదురు. అందును ఈ నృత్యమునకై నిర్దేశింపబడినవారు మాత్రమే చేయుదురు. అన్యులు చేయుటకు అర్హులుగారు. ప్రకృతి ఆరాధనకు చెందిన గోండుల ఖర్మ ఆ నృత్యము, మూండా, బైగాల నృత్య జాతరలు ఈ తరగతికి చెందినవే. దేవదాసీల దాసి ఆటకూడ ఈ నృత్య పద్ధతికి చెందినదే. దేవదాసీలు కూడ కళావంతుల తెగకు చెందిన వారైననూ దేవళములో భగవంతునికి కైంకర్యముగావింపబడి, దేవ ముద్రధరించినవారుతప్ప ఇతరులు దేవళములో నృత్యము చేయరాదు. కొన్ని సంస్థానములలో దేవాలయ దాసీలు ఇతరసమయములందు జరుగు నృత్య ప్రదర్శనములలో పాల్గొన్ననూ, మేళములాడు దాసీలు మాత్రము ఆలయములలో కుంభహారతి పట్టుటకుగాని, ఆలయ ప్రాంగణములో నృత్యము చేయుటకుగాని అర్హులు గారు. ఇట్లే బలిద్వీపములో నేటికిని దేవదాసీ నృత్యము ఆచారములో నున్నది. కడు చిన్నతనములోనే భగవంతుని కర్పింప బడిన బాలికలకు బహుకఠిన నియమ ప్రకారము శిక్షనివ్వబడి, నృత్యమునేర్పబడును. అట్టి వారే భగవంతుని యెదుట నృత్యము నేర్పబడుదురు. ఈ నృత్య సాంప్రయానికి చెందిన ఒక నృత్యము నేటికినీ వంగదేశములో నున్నది. ఇదే 'నాగవాసులు' అనుతెగవారు చేయు బెహుళ నృత్యము. ఈ నృత్యము ఎంత రహస్యముగా వుంచబడినదనగా అసలు ఇట్టి నృత్యమొకటున్నదని వంగ దేశీయులకే చాలమందికి తెలియదు. ఈ నృత్యము ఆ నాగవంశీయులు మాత్రమే చేయుదురు. అదియునూ నాగపంచమి రోజుననే. ఈ నృత్యము ఇతరు లెవరూ చూచుటకు వీలుండదు. చూడనివ్వరు. విలువెత్తు ధనమిచ్చిననూ ఇతరులకు నేర్పరు. ఈనృత్యము ఒక బాలికచే చేయబడును.

## 2. కర్షణీ నృత్యము

ఎనిమిది మంది గోపికలు ఎనిమిది కృష్ణ విగ్రహముల చుట్టు నిలువబడి స్తోత్ర గీతముల పాడుచు నృత్యమాడుట కర్షణీ నృత్యమనబడును. ఈ నృత్యము శ్రీ కృష్ణుని కాలములో మనదేశములో అమలులోనికివచ్చినది. బహుశః ఇది కృష్ణుని రాసలీలలో ఒక భాగమై యుండవచ్చును. ఈమాదిరి నృత్యము ఆంధ్రలో కారువా మేళగాండ్రు చేసెడివారు. కాని విగ్రహములకు బదులుగా యువకులు కృష్ణ పాత్రల ధరించి నృత్యమాడుదురు. ఈకర్షణీ ఇప్పటికీ ఉత్తర హిందూస్థానములో కృష్టాష్టమి ఉత్సవసమయములో నక్కడక్కడ ఛాయగా చూడగలము. కర్షణీ యొక్క స్వరూపము మణిపురములో కూడనున్నది.

## 3. కౌరంగి [వసంతోత్సవ నృత్యము]

స్త్రీలు పురుషులు కలసి వసంత ఋతువారంభములో ప్రకృతి గీతములను పాడుచు చేయునృత్యము. ఇది వసంత పంచమినాడు ప్రారంభమగును. వసంతము—పశుపక్ష్యాది జంతువులు తమసంసారముల నేర్పరచుకొను సమయము. నెమలి తనపురి విప్పి రమణీయముగా నృత్యమాడి తన ప్రేయసి నాకర్షించును. చెట్లుచిగిర్చి ప్రకృతి అంతయు పచ్చగారంగు చిమ్ముచు ఉండును. కోయిలల "కుహూ" రవములతో వనములన్ని నిండి యుండును. అట్టి సమయములో స్త్రీ పురుషులశృంగారమునకు ఆదిదేవతయగు మన్మథుని పూజించుట సహజము. మన్మథ స్తోత్ర గీతములతో కూడినయుల్లాస నృత్యమే కౌరంగి నృత్యము. ఇప్పటికి నుత్తర హిందూస్థానమున స్త్రీలు వసంతఋతుపు ప్రారంభములో అందరు పసుపు వన్నె చీరలు, రవికలు ధరించి ప్రకృతిగీతములను పాడుచు, నృత్యమాడుచు వసంతు నారాధింతురు. ఈవసంతోత్సవములు పూర్వరాజులందరు చేసెడువారు. ఆంధ్రలో రెడ్డి ప్రభువుల కాలములో విరివిగా నుండినది. కొమరగిరి ప్రభువు వసంత రాజీయమను నృత్య గ్రంథము వ్రాసెను. ఈఉత్సవముల వల్లనో యేమో ఈయనకు కర్పూర వసంతరాయడను బిరుదు.

## 4) 'ఛురిత' లేక 'ఛలిక నృత్యము'

కాళిదాసు కాలములోని మన కళను రెండు విధములుగా చెప్పవచ్చును. దేవాలయములో కేవలము దైవసంబంధమై దేవదాసీలచే చేయబడు 'మార్గి' నృత్యము, సంగీత, సాహిత్య, తర్క శాస్త్రములందు ప్రావీణ్యము సంపాదించి, రాజ సభలయందు తమ పాండిత్యము వెల్లడిచేసి గౌరవముపొందిన గణికల 'దేశి' నృత్యము. ఈ 'దేశి' నృత్యము రెండు విధములు.

(1) 'ఛురిత' లేక 'ఛలిక' నృత్యము.

(2) యౌవరిత నృత్యము.

కాళిదాసు 'మాళవికాగ్నిమిత్ర' నాటకములో మాళవిక నాట్య గృహములో రాజు ఎదుట చేసిన నృత్యము 'ఛలిక' నృత్యమే. ఇది నాయకీ, నాయకుల పరస్పరానురాగము తెలుపు

నట్టి నృత్యమే. ఈ నృత్యములో పాడబడు గీతము నాల్గు పాదములు గలదియైయుండును. అభినయించెడి నర్తకి మొదటి రెండు పాదములలో శాస్త్రము పఠించి, మిగిలిన రెండు పాదములలో అతి చమత్కారముగా, అన్యులకు తెలియునట్లుగా తన మనస్సులోని కోర్కెను రాజునకు తెలియబరచును. ఇదే ఛలిక నృత్యము.

ఉదా :—

'మాళవికాగ్నిమిత్రము'లోని శ్లోకము.

నాయిక ప్రోషిత భర్తృక. అనగా తన పతి దేశాంతరము నుండగా ఆ వియోగమును అనుభవించుచున్న స్త్రీయని అర్థము.

"దుర్లభః ప్రియో మే తస్మిన్ భవహృదయం నిరాశం
అహో! పాంగే మే పరిస్ఫురతి కిమపి వామః
ఏష సచిర దృష్టః కథం పున రుపనేతవ్యః
నాథః మాం, పరాధీనాం త్వయి పరిగణయ సతృష్ణాం"

'హృదయమా! ప్రియుని కొరకు తహ తహ పడకుము. అతనినికూడు నాశ వదులుకో.

ఆహో! ఎడమ కన్ను అదరుచున్నదే.

పై శ్లోకముయొక్క మొదటి రెండు పాదముల యొక్క అర్థమిది. అనగా ఈ రెండుపాదములలో ప్రోషితయొక్క నిరాశా హృదయమునుగూర్చి తెలుపబడినది. ఇందు దశావస్థలూ అభినయించవచ్చును.

"ఇక ఈ ఎడబాటును సహించలేను. మరల అతని గూడుటెట్లు ? దేవా ! నిస్సహాయనై యున్నాను. నిన్ను గూడ నా మనస్సు కొట్టుకొనుచున్నది. నన్ను నీదానిగా చేపట్టుమా !"

ఇది మిగిలిన రెండు పాదముల యర్థము. నర్తకి యీ భావము నభినయించునపుడు తన హృదయములో దాగియున్న కోర్కె అన్యులకు తెలియకుండా రాజుకు తెలుపును. ఇతరులకు మాత్రము ఇది కేవలమొక పదముయొక్క అభినయము మాత్రమే. ఇట్టిదే 'ఛలిక' నృత్యము.

## ఛలికము-అభినయము

వివరములు :—

అభినయము రెండు విధములుగా నభివృద్ధి చెందినది.

(1) నర్తకి ఒక పదముగాని శ్లోకముగాని దానియొక్క అర్థమును, అందలి భావమును కవి వచనముగా వ్యక్తపరచుట.

(2) నటించు పాత్ర ఆ భావమునందు లీనమయి, తన ప్రత్యేకతను మరచి తానే ఆ పాత్ర అయి, అందలి భావమును తాననుభవించి ఆ రసమును ఇతరులకు పంచి ఇచ్చుట.

మొదటి పద్ధతియందు నర్తకి అభినయము (ఆంగిక, సాత్వికములు) శాస్త్రీయ దృక్పథముతో చేసిననూ కవి చెప్పిన భావములు, శాస్త్రపు కట్టుబాట్లకు ప్రాధాన్యత ఇచ్చి అభినయించుటవలనే ప్రత్యేకత కల్గియుండును. కాన అభినయము ఎంత విద్వత్తుతో కూడికొని యున్ననూ కొంతవరకు సహజత్వము కుంటుపడును.

రెండవ పద్ధతియందు, తాను కేవలము నర్తించు పాత్రయను భావము మరచి అందలి నాయిక స్థాయికి తానుబోయి ఆ ఉన్నతి స్థాయిలో అభినయ విద్యను ప్రదర్శించును కాన అభినయము ఉత్తమోత్తమముగా నుండును.

ఉదా :—

క్షేత్రయ్య పదము.

'ఖామరో ఊరికి బయలుదేరే వేళ
ప్రేమమీర నాసామి పిలిచి చెప్పిన మాట
ఏమని తెలుపుదు — ఏలాగు తాళుదు
ఏమి చేతునే చెలియా ।'

నర్తకి సభలో ఈ పదమును అభినయించుచున్నపుడు "తాను యొక నర్తకిని ప్రోషిత భర్తృక నాయికను అభినయించుచున్నాను. అందలి సాత్వికసంచారులు, నాయిక చేష్టలు, వ్యాపారములు, చిత్తవృత్తి ప్రదర్శించుట మాత్రము తన కర్తవ్యము"—ఈ నియమము అభినయించుట మొదటి తరగతికి చెందును. ఈ అభినయము రసవంతముగనున్ననూ సహజత్వము లోపించును.

తాను సభలో నర్తనముచేయుచున్ననూ- క్షేత్రయ్య, అతని రసానుభూతులు, అతని నాయికల యుత్తమస్థాయిని దృష్టియందిడుకొని తన్ను తామరచి- ఆ నాయకయే తానై, ఆ ప్రదేశమే

బృందావనమైనట్లుగా, తాను ద్వాపరములో నున్నట్లు, భావించి ఆనాటి అతివల మానసిక వ్యవస్థను తానను భవించి *రసభంగము కలుగకుండ* కనులకు కట్టినట్లు అభినయించి ప్రేక్షకులచే అనుభవింప చేయుట ఉత్తమపద్ధతి. ఈ పద్ధతి బహు కష్టతరమైనట్టిది. నర్తకి ఏ మాత్రము అలసత్వమువహించినా రసాభాసమగును. తమిళదేశములోని కళారాధకులు మొదటిపద్ధతినే ఎక్కువగా అనుసరించుచున్నారు. ఆంధ్రలోని అపూర్వ ప్రఖ్యాతిగాంచిన 'దేవదాసీలు' రెండవ పద్ధతిలో అభినయ విద్యను ఆరాధించిరి.

ఆంగిక సాత్విక ప్రాధాన్యత కల్గిన అభినయము నాల్గు విధములుగా ఉన్నది.

1. పదార్థాభినయము.
2. విశేషాభినయము.
3. ప్రత్యక్షాభినయము.
4. గుప్తాభినయము.

## 1. పదార్థాభినయము

ఒక పదమునకుగాని శ్లోకమునకుగాని అభినయము ప్రదర్శించునపుడు ఆ గీతముయొక్క అర్థము ప్రేక్షకులకు తెలియు తీరున హస్తములు, ముద్రలు, భంగిమలు పట్టి అభినయించుట పదార్థాభినయమగును.

ఉదా :-

తామరసాక్ష! నీవెపుడొత్తువోయని
తలవాకిలిల్లుగా నిలిచియున్నదిరా!
'తామరసాక్ష'— ఈ మాటను అభినయించునపుడు-

ముకులహస్తమును పట్టి మొగ్గనుచూపుట, అలపద్మ, సోలపద్మములుగా ముకులము మార్చి వికసించిన తామర పువ్వును చూపుట, రెండు చేతులుచేర్చి పద్మకోశముపట్టి కర్తరీ ముఖము నేత్రములవద్ద పట్టి వికసించిన పద్మములవంటి కనులు కలవాడా అను అర్థము ప్రదర్శించుట.

కొలను, కొలనులోని నీటిని అభినయించి పతాకములతో ఆకులు, ముకులములతో మొగ్గలు, పల్లవ, సోలపద్మ, పద్మకోశ ములతో పువ్వుల నభినయించి, చతురహస్తముతో నేత్రములను చూపి, పద్మాక్ష అను భావము ప్రదర్శించుట పదార్థాభినయ మగును.

## 2. విశేషాభినయము

తామరసాక్ష-

వికసించిన తామర తనలోని మధువును గ్రోలుటకు తుమ్మెదను ఆకర్షించునట్లు సొగసైన చూపులచే జవ్వనుల ఉల్లముల కొల్లగొనువాడా!

తామరపువ్వులో లేతకెంపు రంగునుపోలు కెంపువన్నె గల నేత్రములు కలవాడా!

తామర రేకులవలె విశాలమై తీర్చి దిద్దినట్టి కనుగవ కలవాడా!

అతి సున్నితమైన సువాసనగల తామరవలె లలితమైన ఆనందకరమైన దృక్కులు ప్రసరించువాడా!

ప్రాతఃకాలమున తన చల్లని కాంతితో చక్కలిగింతలు పెడుతూ కొలనులోని పద్మకన్యల వికసింపజేయు భానునివలె చూపుతూపులచే విరహిణుల హృదయములను రంజింప జేయువాడా!

పుష్పములన్నిటిలో ఉత్తమమైనది, లక్ష్మికి నిలయమైన పద్మమునుబోలు నేత్రములను కలవాడా!

ఇట్టి భావములను తెల్పునట్టి అభినయము విశేషాభినయ మగును.

## 3. ప్రత్యక్షాభినయము

నర్తకి యొక ఘట్టమును ప్రదర్శించుచున్నప్పుడు ఆ దృశ్యము మన కనులముందు జరుగుచున్నట్లు ప్రేక్షకులు అనుకొనే తీరున వారి మనస్సులను ఉర్రూత లూగించుట ప్రత్యక్షాభినయము.

ఉదా :-

'సరసిజాక్షులు జలకమాడే
సమయమున నీవచటకుజని
సరిగెచీరలు మెల్లచేకొని
పరుగులెత్తుట న్యాయమా!'

ఈ శబ్దమును అభినయించుచున్నదనుకొందము.
అట్టితరి- అది నదియని ప్రేక్షకలోకముమరచి-

అది ద్వాపరము, యమునానదీ తీరము, ప్రాతఃకాలము.... గోపికలు తళతళ మెరిసే బిందెలను తమ నెత్తులపై కెత్తుకొని, ఆడుతూ–పాడుతూ, కేరింతలు గొట్టుచూ, కాలి అందెలు ఘల్లని మ్రోయగ, చేతిగాజులు మృదువుగా ధ్వనించ, మరాళములవోలె, మయూరములవోలె ఒయ్యారముగా అడుగులిడుతూ, వివిధగతుల వర్తన శోభ వెలువడునట్లు నడుచుచూ, యమునను చేరి, తాము కట్టిన సరిగెచీరెలు విడిచి, ఒడ్డుననుంచి ఉల్లాసముతో జలక్రీడలు సల్పువేళ, చిన్ని కృష్ణుడు కూకటిముడిలో నెమలి ఫించెము వర్తనమునల్ప, చెవుల కుండలములు పిల్లవాయువులకు అల్లలాడుతూ, పాలుగారు నునులేత చెక్కిళ్ళపైని కాంతిసోకి మెఱయగా, నడుమున కట్టిన పట్టుదుకూలము గాలితో సయ్యాటలాడ, చేత మురళిగొని, కాలి బంగరు మువ్వలు చప్పుడు చేయునేమోయని మెత్తగ అడుగులిడుచూ వెన్నదొంగ అచటకువచ్చి చీరెలు దొంగిలించి, చెట్టుపైకెక్కి కూర్చొని, ఉల్లాసముతో మురళి నూదుకొనుచుండగా, గొల్లపడుచులు స్నానము ముగించి తమ వస్త్రములు కానక తత్తరపడి, నీటినుండి పైకి రాలేక, అటునిటు వెదకుచుండగా, వృక్షముపై చిలిపి కృష్ణుని తియ్యని పాటవిని పైకిచూచి తమ చీరెల సతనివద్ద చూచి ప్రార్థించి హస్తములలోబడిన చీరెల సింగారించుకొని కృష్ణుడు నడుమనిల్వగా అతని చుట్టూచేరి, రాసక్రీడలు సల్పిన దృశ్యము—

ఈ గీతము వ్రాసిన కవి తన కనులముందు కాంచిన చిన్ని కృష్ణుని లీలల్లోని ఈ దృశ్యమును— రసిక జనులు తమ కనుల ముందు జరుగుచున్నట్లు రసానుభూతి పొందుట ప్రత్యక్షాభినయ మగుచున్నది.

## 4. గుప్తాభినయము

ఒక కీర్తనలోని గుప్తభావములు ప్రేక్షకులు అనుభవించునట్లభినయించుట.

నర్తకి యొక పదములోని భావమును అభినయించునపుడు సభలోని రసికజనులు ప్రతియొక్కరూ "నర్తకి ఆ భావమును తనకే తెల్పుచున్నది, అన్యులకుగాదు, తన మనస్సులోని భావముల నెఱిగి అభినయించుచున్నది, తన మనస్సులో దాగియున్న భావములనే అభినయించుచున్నది" అని ఈ విధముగ ప్రతియొక్కరూ తమతమ అంతఃకరణశుద్ధి ననుసరించి రసానుభూతి పొందు విధముగా భ్రమకల్గునట్లు అభినయించుట గుప్తాభినయము.

ఉదా :

ఎందుకు మొగమిచ్చకపు మాటలాడేవు
ఏరా! మువ్వగోపాల మేరగాదురా
ముందటివలె నాపై నెనరున్నదా స్వామి
ముచ్చటలిక నేలరా!

ఈ పదాభినయములో:

ఏరా! మువ్వగోపాల నా స్వామి—

నర్తకి మువ్వగోపాలుని నాయకునిగా ఎంచి అభినయము పట్టును.

సభలోని ప్రతి రసికజనుడు— తననే సంబోధించినట్లు, ఆ రసానుభూతి తనకే కల్గినట్లు, తననే పిలిచినట్లు, తనతో మాట్లాడినట్లు, తనపై అలిగినట్లు, చిలిపి కజ్జములాడినట్లు భ్రమించగా

ముందటివలె నాపై నెనరున్నదా—

ముందటి లాలన, పాలన, సరస సల్లాపములు, యేకాంతములో గడపిన మధురక్షణములు, మధురఘట్టములు, మొదలైన అనుభూతులతో కూడిన భావనా ప్రపంచములో విహరించుచూ—ఖండిత నాయికయైన నర్తకి తనకే తెల్పుతున్నట్లు, తన చర్యలనే ఖండించుచున్నట్లు తలంచి, అన్యులకు, ఆ భావములు తెలియునని తత్తరపడునట్లు— రసానుభూతికల్గు విధమున అభినయము ప్రదర్శించుట గూఢాభినయము.

ఇంతకూ నర్తకి చేయునట్టిది ప్రేక్షకులముందు అభినయము మాత్రమే. కాని అందు యెన్నోవిధములైన భావములు గూఢమై యుండి, ఆ అభినయము చూచువారికి ఒక్కొక్కరికి ఒక్కొక్క విధముగా తోచును.

రసికులైన యౌవనులకు ప్రేయసీ ప్రియుల ప్రణయ కలహముగా తోచి శృంగారముద్భవించును.

వయసుమళ్ళిన శాస్త్రకారులకు— అలంకార శాస్త్ర ప్రమాణముతో రచింపబడిన తమ కవితకు శాస్త్రీయాభినయము. కృష్ణ భక్తులకు— కృష్ణదేవుని జీవితములోని ఒక మధురఘట్టము.

మధురభక్త్యుపాసకులకు— రాధామాధవుల ప్రణయలీల.

ఆధ్యాత్మిక చింతలేని యువకులకు—

సురక్షితమైన అంగసౌష్ఠవముతో- యౌవనములోనున్న ఒక నర్తకి ప్రదర్శించే హావభావ విన్యాసము.

మెత్తని హృదయముగల పండితుడు- తన మనస్సులో దాగియుండిన భావములే ఆ కళోపాసిద్వారా ప్రకాశించునట్లు.

విలాసవంతుడైన దక్షిణ నాయకుడు- తన గృహిణి అప్పుడప్పుడు తన ప్రవర్తనకు కినిసి మందలించిన తీరు జ్ఞప్తికి వచ్చి- రసానుభూతి నొందునట్లు.

ఇన్ని విధాల రససాగరమును ముంచి తేల్చునట్టిదే ఫలికము.

ఇన్ని అలంకారములతో కూడిన అభినయము. నేటి కాలములో అరుదు కనుక అది అపూర్వ నృత్యము.

'జకారి', 'మత్తావళి' తురుష్క సాంప్రదాయము ననుసరించి చేయబడిన నృత్యములు. ఇవి కేవలము వినోదార్థము చేయబడు నృత్యములు. ప్రభువులు విందారగించి, సురాపానముచేసి, సభతీర్చియుండగా వారిని సంతోషపెట్టుటకు ప్రదర్శింపబడే జల్సా నృత్యాలు. ఈ నృత్యములనుండి ప్రస్తుత హిందూస్తానీ "టుమ్రీ" నృత్యములు, 'అదా' అభినయము పుట్టినది.

## 5. జ కా రి

పూమాలలతో అలంకరించుకొని పూగుత్తుల చేకొని ప్రకృతి గీతములు పాడుచు కేవలము హృదయ రంజకముగా నుండు హావభావములతో (అనగా కొంతవఱకు మనుష్యునిలోని పశుత్వము తృప్తిపరచుటకు) చేసెడి నృత్యము.

## 6. 'మత్తాళి' లేక 'మత్తల్లి'

మితిమీఱు మద్యము సేవించి ఆ నిషాలో ప్రేక్షకులు విడియపడునట్లుగా తురుష్కులు చేసెడి నృత్యము.

పైన వర్ణింపబడిన నృత్యపద్ధతులన్నీ అతి ప్రాచీనమైనవి. ఇందు కొన్ని అదృశ్యమైపోయినవి. కొన్ని ఛాయగా మిగిలియున్నవి.

పెదకోమటి వేముడు తన నాట్య గ్రంథములో తురుష్క సాంప్రదాయమునకు చెందిన దీనినిగూర్చి వర్ణించెను.



# శివతాండవము

తెల్లనికొండ ఇల్లుగను
తెల్లని గిబ్బయె వారువంబుగా
తెల్లని ఏరు తాల్చుకొని
తెల్లని మిన్కుల వాని పువ్వుగా
తెల్లని త్రాచు సొమ్ముగను
తెల్లమిగా గయికొన్నయట్టి ఆ
తెల్లనిసామి…… ……… …..





ఆంగికం భువనం యస్య వాచికం సర్వవాఙ్మయం
ఆహార్యం చంద్రతారాది తం వందే సాత్వికం శివమ్.

## నటరాజ నృత్య భంగిమ

(1) దక్షిణోర్ధ్వ భుజముననున్న డమరు—సృష్టిక్రియా సూచకము.
(2) వామోర్ధ్వ భుజమున ఉన్న అగ్ని—సంహార సూచకము.
(3) దక్షిణహస్త పతాకము—విజయ సూచకము.
(4) వామహస్తాభయముద్ర—వరప్రదాన సూచకము.
(5) ఊర్ధ్వప్రసారితమగు పాదము—శాంతి, భవ, బంధ విమోచన సూచకము.

# శివతాండవము

ఇచ్చట వర్ణింపబడిన శివతాండవము (సప్తతాండవములు) వేరు. ఆలయములందు పూజా సమయములో ప్రదర్శించు సప్తతాండవములు, (శుద్ధ, దేశి, పేరిణి, ప్రేంఖణ, దండిక, కుండలి, కలశ) దేశీసీ తాండవములు (నికుంచిత, కుంచిత, ఆకుంచిత, పార్శ్వకుంచిత, అర్ధకుంచిత) వేరు. ఇందు వర్ణించబడిన నృత్యము పంచభూతాత్మకమైన ఈ ప్రపంచములోని చేతనాచేతనములయొక్క సృష్టి, స్థితి, లయములను వివిధ విన్యాస రూపములలో ప్రదర్శింపబడునట్టి భావాత్మకమైన నృత్య విశేషము.

శుద్ధ, దేశి ఇత్యాది తాండవములు, తాళ లయ ప్రాధాన్యత కలిగి వివిధ చారి, కరణ, అంగహార, మండల, స్థానక విన్యాసములు, వివిధ తాళములందు ప్రదర్శింపబడు నృత్త విశేషములుగా రూపొందినట్టివి. శుద్ధ నాట్యములో ప్రదర్శింపబడు ఏడవ విన్యాసము ఊర్ధ్వ తాండవము. ఇందు వర్ణింపబడిన శివతాండవములోని పార్వతీ పరమేశ్వరుల ద్వంద్వ నృత్యమునందు శివుడు పార్వతిని గెల్చుటకుగాను ప్రదర్శించిన ఊర్ధ్వతాండవము. ఈ రెండు మాత్రము కలియుచున్నవి. మిగిలినవి వేరువేరుగా రూపొందినట్టివి. పరమశివుని తాండవము వివిధ భావములను ఆంగికాభినయ ప్రాధాన్యతతో ప్రదర్శింపబడునట్టి నృత్య విశేషములు. ఆలయములందలి సప్తతాండవములు తాళ లయాశ్రితమైనట్టి, వివిధ జతులకు ప్రదర్శింపబడునట్టి నృత్త విశేషములు.

ఈ వివరములను మనము చక్కగా తెలిసికొనినచో శివతాండవముయొక్క స్వరూపము చక్కగా అర్థము చేసికొన గల్గుదుము.

# శివతాండవము

భారతదేశ నృత్య విధానములో 'శివతాండవము' మిక్కిలి ముఖ్యమైనది. శివతాండవము గూర్చి చక్కగా తెలిసికొనవలయు నన్న కేవలము ఆచరణ విధానమును గూర్చియేకాక దాని యందలి గర్భితార్థమును తెలిసికొనుట అత్యవసరము.

సృష్టి, స్థితి, సంహారములు అను మూడు శక్తులను హిందువులు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అను రూపమున పూజించుచున్నారు. సృష్టికర్త బ్రహ్మ, సృష్టి నిరోధక శక్తులను హతమొనరించువాడే విష్ణువు. కనుక అతడు—

'పరిత్రాణాయ సాధునాం
వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాప నార్థాయ
సంభవామి యుగేయుగే'

దుష్టశిక్షణ, శిష్టరక్షణలకు దశావతారములు దాల్చినాడని జెప్పబడినది.

సృష్టిని అంతమొందించు మహాశక్తియే రుద్రుడు. కైలాస మాతని నివాసము. వ్యాఘ్రాజిన మాతని వేషధారణము. పార్వతి ఆతని పత్ని. వృషభ మాతని వాహనము. మెడలోని పాములే అతని ఆభరణ సర్వస్వము.

ఇట్టి మూర్తిత్రయమున కతీతమైన మహాశక్తియే విశ్వ మును, సర్వమును, తనయందిముడ్చుకొనును. తననుండి వెలి పరచును.

ప్రపంచమును సృష్టించుట, వృద్ధిపొందించుట, ధర్మ మార్గమున నడుపుట, అంతమొందించుట, మరల తనయందు లీనము చేసికొనుట, అను ఐదు క్రియలనే త్రిమూర్తులచే ఈమహా శక్తి నెరవేర్చును.

ఈ క్రియాపంచకమునే ఈశ్వరుడు తన సప్తతాండవములో ప్రదర్శించును.

శంకరుని తాండవములు ఏడు విధములు.

1. ఆనంద తాండవము.
2. సంధ్యా తాండవము.
3. కలిక తాండవము.
4. విజయ తాండవము.
5. ఊర్ధ్వ తాండవము.
6. ఉమా తాండవము.
7. సంహార తాండవము.

## 1. ఆనంద తాండవము

'ఆంగికం భువనం యస్యవాచికం, సర్వవాఙ్మయం
ఆహార్యం చంద్రతారాది తం వందే సాత్వికం శివమ్'

ప్రపంచ సృష్టిని చూచి ఆనందమును వెలిబుచ్చుచూ ఈశ్వరుడు ఆనంద తాండవము నాడును.

'ఢుమఢుమఢ' యని అతని కుడిచేతిలోని ఢమరు సృష్టికి కారణమైన నాదము పలుకుచున్నది. వామహస్తమున ప్రపంచ నిరోధక శక్తుల హతమొనరించు అగ్ని ప్రజ్వరిల్లుచున్నది. మూడవ చేతిలో ధర్మమునకై పాటుబడి ప్రపంచ శ్రేయస్సునకు తమ జీవితములను ధారవోసిన త్యాగమూర్తులకు అభయ ప్రదాన మొసగుచున్నాడు. నాల్గవచేతిపతాకహస్తమువిజయమునుసూచించు చున్నది. సృష్టియందలి జీవకోటియొక్క సంచలనమే అతని ఆంగికాభినయము. ప్రకృతిలోని వివిధ నాదములే అతని వాచికాభి నయము. చంద్రతార లాతని అలంకారములు. మానవుని చిత్త ప్రవృత్తియే అతని సాత్వికాభినయము.

## 2. సంధ్యా తాండవము

'కైలాస శైల భువనే త్రిజగజ్జనిత్రీమ్
గౌరీం నివేశ్య కనకాంచిత రత్నపీఠే
నృత్యం విధాతు మభివాంఛతి శూలపాణే
దేవాః ప్రదోష సమయే నుభజంతి సర్వే.

వాగ్దేవీ ధృతవల్లకీ శతమఖో వేణుం దధత్పద్మజః
తాలోన్నిద్రకరోరమా భగవతీ గేయప్రయోగాన్వితా
విష్ణుస్సాంద్ర మృదంగ వాదన పటుఃదేవాస్సమస్తాత్ స్థితా
సేవంతే త మనుప్రదోషసమయే దేవం మృడానీపతిమ్.'

సృష్టి నిరాటంకముగా అభివృద్ధి నొందుటనుచూచి సంతసమున శంభుడు చేయు నృత్యమే సంధ్యా తాండవము.

పరమేశుని అర్ధాంగి పార్వతి మణిమయ సింహాసనాధిష్ఠితయై ఉన్నది. ఇంద్రుడు మురళి నూదుచున్నాడు. విష్ణువు మృదంగము. సరస్వతి వీణవాయించుచుండగా. బ్రహ్మ తాళము వేయుచుండగా. యక్ష. గంధర్వ. కిన్నర. కింపురు షాదులు ఆనందముతో చూచుచుండ రుద్రుడు సంధ్యా తాండవనృత్య మొనరించును.



2. సంధ్యా తాండవము



3. కలిక తాండవము

ప్రపంచాభివృద్ధి నిరోధకములగు అజ్ఞానము, అవినీతి మొదలగు దుష్టశక్తులను హతమార్చి అఖండ జ్యోతిని వెలిగించుటకు, ఆ దుష్ట శక్తులను చెండాడు నప్పటి అంగచలనమే కపాలధరుని కలిక తాండవము.



## 4. విజయ తాండవము

గజాసుర వధయే విజయతాండవ మనబడును. పూర్వము ప్రపంచము యొక్క శ్రేయోభి వృద్ధులకు భంగము చేయగల్గు మంత్రశక్తులను కొందరు ఋషులు కలిగియుండిరి. వారిని వారించి ఆ దుష్ట శక్తులను సంహరించి వారిని సన్మార్గమున సంచరింప జేయ సమకట్టి అర్ధనారీశ్వరుడు ఋషి రూపము తాల్చి అరణ్యములకు వెళ్లెను. ఆ మును లాతనిచే ఓడింపబడి అతని పరిమార్ప నెంచి హోమకుండమున ఒక క్రూర వ్యాఘ్రమును సృష్టించిరి. రుద్రుడాపులిని పట్టుకొని దాని చర్మమును తన చిటికెన వ్రేలితో ఒలిచి తన నడుము చుట్టూ అలంకారముగా ధరించెను. అంత ఆ మునులొక క్రూరమైన ఉరగమును సృష్టిచేసిరి. దానిని శివుడు మాలగా ధరించి నృత్యమాడసాగెను. కడపట ఒక ధుష్టశక్తి (గజాసురుడు) ఆ హోమకుండమునుండి శివునిపైకురికెను. దానిని తన పాదములతో త్రొక్కి వెన్నెముక విరిచి దానిపై విజయతాండవము చేయుచుండ దేవతలు చూచి ఆనందించిరి.



5. ఊర్ధ్వ తాండవము

సృష్టికి కారణములయిన ప్రకృతి పురుష శక్తుల (Spirit and Matter) అంతః కలహమే దీనియందలి అంతరార్థము. తాండవమున గట్టివాడు శివుడు. లాస్యమున నేర్పరి ఉమ. తనే గొప్పకళావేత్త అని శూలియు— "నేను చక్కగా అభినయింప గల" నని అంబయు వాదులాడుకొనుచుందురు. వీరి చిలిపి జగడము తీర్చుటకు యక్ష, గంధర్వ, కిన్నెర, కింపురుషాదులు, మహామునులు, అప్సరసలు–అందరూ కైలాసముపై గుమి గూడిరి.

ఉమాశంకరు లిర్వురును పతాక హస్తములను పట్టి నిలువబడిరి. ఉన్నటులనే యుండి పకపక ధ్వనులతో శర్వుడు నృత్యమాడ మొదలుపెట్టెను. పెళపెళమని మృదంగము మ్రోగినది. తళతళమని చంద్రరేఖ మెరయుచున్నది.

విష్ణువు మృదంగముతో నృత్యశబ్దములను పలికించుచున్నాడు. బ్రహ్మ లయవేయుచున్నాడు. సరస్వతి వీణ ఝంకారించుచున్నది. ఇంద్రుడు మురళి నూదుచున్నాడు, నారదుడు తంబుర మీటుచున్నాడు. 'ఢాంఢోం' అను శంఖనాదములతో ఆ ప్రదేశమంతయు ప్రతిధ్వనించుచున్నది. ఇందిర ఆ నాదముతో కంఠముజేర్చి పాడుచున్నది.

శివ, పార్వతులు హెచ్చుతగ్గులు నిర్ణయింప నలవికాని విధమున నృత్యము చేయుచున్నారు. ఈశ్వరుని నృత్యము గంభీరమై యున్నది. భవాని భావ ప్రకటన అతి మృదువుగా నుండి నయనానందము గొల్పుచున్నది. వీరికి కొంతదూరములో నిలిచియున్న కుమారస్వామి వాహనమగు నెమలి శంకరునితో కలిసి అడుగులు వేయుచున్నది. సరస్వతి సమీపమందున్న మరాళము తన మందగమనమును సవరించుకొనుచున్నది. అప్సరసాదులు తమ నృత్యకరణులు, చారులు, రేఖలలోని దోషములను దిద్దుకొనుచున్నారు.

ఇక దంతిముఖుని యుదంతమో? నాట్యశాస్త్రము చేకొని నృత్యము శాస్త్రోక్తముగా జరుగుచున్నదో లేదోయని అల్లనల్లన మెల్లనిచూపులు చూచుచు చల్లగా తొండమెత్తి శివుని జడలనుండి ప్రవహించుచున్న జలమును గ్రహించి, పొంతనున్న సహస్రాక్షునిపై జల్లి వినోదము ననుభవించుచు వెకిలి నవ్వులు నవ్వుచున్నాడు.

నృత్యములో చండికకే విజయము చేకూరుచున్నది. నృత్యమిపుడు సంహార తాండవములోనికి దిగినది.

అందునూ అంబికయే గెలుచునేమో?

శంకరుడు ఓడుచున్నట్లు గ్రహించెను. ఇక తానామెను ఓడించుట కష్టము. విష్ణువు ద్రుత లయలో మృదంగము పలికించుచున్నాడు.

కిడద్రెన్ ధే దడద్రి కిటతః
కిడద్రెడ్ ధే దడద్రి కిటతక

లక్ష్మి తాండవ జతిలోని కడపటి ముక్తాయింపు పాడుచున్నది. రుద్రుడు తటాలున ఒక కాలునెత్తి తలపైనుంచి ద్రుతమునుండి విలంబితమునకు లయమార్చి వికటముగా నృత్యమాడ మొదలిడెను. (ఇదే గౌరీ శంకరుల ద్వంద్వనృత్యము. ఉమామహేశ్వరుల ఊర్ధ్వ తాండవము.) జగన్మాత అట్లు చేయనొల్లక తన నృత్యము నిలిపినది. ఈశ్వరుడే జయించెను.



## ౬. ఉమా తాండవము

ఉమా శంకరులు భూతగణములతోకూడి స్మశానవాటికయందు నృత్యము చేయుచున్నారు. తమోగుణప్రధానుడై ఏది భుజములతో వీరభద్రుడు, వీరభైరవుడు అను పేర్లతో శివుడు, వీరభైరవియను పేరుతో అంబయు పిలువబడుదురు. ప్రపంచము నందలి క్రియలను పరిసమాప్తి జేసిన శరీరములను వదలి జీవరాసులు ఒక్కొక్కటివచ్చి వీరిని చేరుచున్నవి. మండుచున్న చితులనుండి అనేకమైన వెలుగులువచ్చి వారిని చేరుచున్నవి. పటపట ధ్వనులతో సమాధులను బ్రద్దలు జేసికొని జీవాత్మలు అందుండి వెలికివచ్చి ఆమెతోకూడ నృత్యములో పాల్గొనుచున్నవి. ఆ నృత్యమునకు భూమి దద్దరిల్లుచున్నది. ధూళి మింటి కెగయుచున్నది.



## 7. సంహార తాండవము

మానవ జీవననావ సంసార సాగరతరంగములలో మునుగుచు తేలుచు కడపట చేరుకొనునట్టి గమ్యస్థానము విశాల స్మశానవాటిక. దేహమునిండుగ విభూతి అలదుకొని, జడలుకట్టిన శిరోజములపై చంద్రకళను ధరించి పద్మాసనోపవిష్టుడై పరమశివుడు ధ్యానముద్రయందున్నాడు. చితులనుండి జీవకణములు లేచివచ్చి అతనియందు లీనమగుచున్నవి. మాయా వ్యామోహముల బారినుండి జీవకోటిని విముక్తియొనరించి మరల తనయందైక్య మొనరించుచున్నాడు. ఆసంహార తాండవమూర్తి పరమశివుడు.

సప్తతాండవములలో ఇది కడపటిది.

ఇట్లు సృష్టి. స్థితి, సంహార, అనుగ్రహ, తిరోధానము లను పరమేశ్వరుని పంచకృత్యములను సూచించునదే శివ తాండవము.

## శివతాండవము ఆట వివరములు

శివతాండవములో ముఖ్యముగా గమనించవలసిన నృత్య విశేషములు. శివతాండవము 12 అక్షరముల చతురశ్ర ఆట తాళములో చేయబడును. చతురశ్ర ఆట తాళము 2 లఘువులు, 2 ద్రుతములు కలిగి సమగతిని నడచును.

తాళ విభాగములు 1 1 0 0.

1 2 3 4 | 5 6 7 8 | 9 10 | 11 12.

సాధారణముగా నృత్యములో శరీరపు కుడి భాగముతో చూపిన హస్త, పాదవిన్యాసమే ఎడమ భాగముతోకూడ చూపి ముక్తాయింపు నాడినగాని, ఒకకరణముగాని, అంగహారముగాని ముగింపుకు రాదు. అట్టి విన్యాసములు చేయుటకు ఈ తాళము ఎక్కువ అనుకూలముగనుండి మొదటి 8 అక్షరములవరకు నాలుగు, నాలుగు అక్షర విభాగములుండుటచే భంగిమల విన్యాసము పూర్తియై మిగిలిన రెండు ద్రుతములకు తీర్మానము ప్రదర్శింపబడును. మరియు శివతాండవ నృత్య శబ్దములు పలికించుటకు అనుకూలములేగాక, గంభీరముగాకూడ నుండును. ప్రారంభ గతులు కనుక సమగతినే నృత్యమాడబడును. ఉమా తాండవము, సంహార తాండవములలో మాత్రము విషమగతి తాళము లుండును. ధమార్ (14 అక్షరముల తాళము) లేక త్రిపుట (7 అక్షరముల తాళము) తాళములలో నుండును.

## ఆనంద తాండవము

ప్రపంచముయొక్క పుట్టుకను, కదలికలను వర్ణించునట్టి ఆంగికాభినయ ప్రధానమైన నృత్యము. ఈ నృత్యము విలంబిత లయలో ప్రారంభమగును. పరబ్రహ్మ స్వరూపమయిన ఓంకార నాదము పుట్టగనే ఆనందమూర్తిలో చైతన్యము కలుగును. అంత నాతడు సృష్టిలోని పశుపక్ష్యాది జంతువుల, క్రిమికీటకాదుల కదలికలను, దృష్టి, భ్రూపుట, శిరోభేదములు, హస్తభేదములను, సంయుత, అసంయుత హస్తముల (ముద్రల) లక్షణలక్ష్యముల గతి, చారి, కరణ, భ్రమరములు మొదలైన అంగప్రత్యంగోపాంగముల చలనప్రధానమైన నృత్యమును ప్రదర్శించును. ఇందు రసభావములంతగా వృద్ధిచెందవు. నృత్యములో ప్రథమ భాగములైన నృత్తము, ఆంగికాభినయము, నృత్యము పోషింపబడును.

*ఆనంద తాండవములో పలికించు కొన్ని శబ్దములు :*

(1) జంత దుగు దుగు దుగు దుగు. దుగు దుగు దుగు దుగు
ధుమకిట కిటతక।
జణుత జణుత తకి జణుత జణుత తక
జగణం జరితక జగణం నకనక।
జగన తగన నగన నగనగ నగా
నగం ఝుంత ననం రుంత
తణం తోంత తరుం రుంత।
తనన తోంత తననం.
తాస తందాన తాస తందనన ననసితు
నతతోం।
ద్రిరికిట తాస దిరి రాస ధుమకిట రాస
ధ్రుగుడు తాస
ధుం ధుం ధుం ధుం। ధుమకిట ధుమకిట
ధాం ధాం ధాం ధాం। తత్తోం తస తందనాం.

(2) జంజం జంకిట జంకిట ధుమకిట
దిం దిం ధీంకిట దిగిదిగి దిసకిట।
జంకిట ధీంకిట ధుమకిట కిటతక
తందాన దిగిథైయ్యా తకతక దిరికిట థైయ్యా।
కకున కకున కున కుకనర జంతక
ననక ననక నక నగనగ దిగి దిగి।
థైయ్యం దోహం దొద్దోం గిణతోం
తరి ణం ణం।
రింరీం జంజాం ధింధీం హణ్ణం హత్తి జం।
గణగణ దణదణ రింఖణ రింజరి
ధళాం ధళాం ధళాం ధళాం ద్రీహీం.

ఆట సమయమందు పైశబ్దములను ముక్తాయింపులను జేర్చి ఆడుదురు.

## సంధ్యాతాండవము

ఈ నృత్యము విలంబిత లయలో ప్రారంభమయి, మధ్య లయలో ముగియును. ఇందు ఆంగికమేగాక, సాత్వికాభినయము కూడ పూర్తి వికాసము పొందుచున్నది. సాత్వికభావములు, నవ రసములు, వానియొక్క అలంకారములగు వ్యభిచారి సంచారుల యొక్క అభివృద్ధి మొదలైనవన్నియు ఈ నృత్యములో కని పించును. ధ్వని ప్రాధాన్యముగా (అనగా పాటగా లేకుండ వాద్య

సంగీతముల ఆధారముగా) ప్రదర్శింపబడును. ఇందలి సంగీతమును ఆనందతాండవములోవలె తాళ, లయ ప్రాధాన్యముగాక భావ ప్రధానమై యుండును.

సంధ్యాతాండవములో ప్రదర్శింపబడు అర్ధనారీశ్వర జతి

జం జంత కిటతక తధీం ధీంత కిటతక ॥2॥

జంతక తైతక దిత్తక తళాంగ్
తజం జంత తజం జంత కిటతక తై ॥2॥

తాం కిటతకతై తై కిటతక తై కిటతకతై
తాం। తైయత్త దినకిట తతైయ్యా తైయ్యత్త కిటతక
తద్ధిం ఓద్ది ఓద్ది తాకు తత్తక తక తక
జణు తక దిగి తక

తాంగిట తత్తా తత్తాకిటతక। ఢేంకిట తత్తా తత్తా కిటతక
తక్కిట తత్త తత్త కిటతక। ధింగిట కిటకిట తై॥

జం జాం కిటతక జం జాం కిటతక దిత్త తైతై దిగి
దిగి తైతై

జం జాం దిత్త తైతై॥ (దిగి దిగి తైతై)
ఇత్తక తైతై దిగి దిగి తైతై జం ॥2॥
ఇత్తకు తైతై జం.

దిన్న దిన్నకు కిటతక దిమిదిమి దిద్ది తైయ్యా

దణాం దణకు జణు దణ దణ కిణ జణు ॥2॥

దిన్నా దిన్నకు కిటతక దిమి దిమి దిద్ధి తైయ్య
జం తరి కిటతక జంతరి కిటతక జంతరి కిటతక తోం॥3॥

ధిర్గుడు। తజం జంత। ధిర్గుడు తజం జంత। జం జంత।
జం జంత కిటతక జం

ధీం దినకు దిన్న। తాం తతైయ్య తక। ధీదినకు దిన్న
దిరికిట తైయ్యత్తాం.

ధిరుడు జంజం ధిర్గుడు జంజం ధిరుడు జం జం జం

దినక దినక తైయ్యా ధిర్గుడు తదినక తాం
దినకిట దినకిట తాం।

ధిర్గుడు తైయ్య ధిర్గుడు తైయ్యా ధిర్గుడు తై॥
దినక దినక దినక దినక దినక దినకిట తై
ధిర్గుడ తైయ్యాం

దినకిట దినకిట తాం
తాం జం
తజం...
తతదిమి తాకిట తైయ్యా॥

తతై తైత తతై తైత తైదితతై తైదితతై
తై తై తై దిత్త తై ॥2॥
తై తై తై ది త్తతై। తై తై దిత్తతై।
తై దిత్తతై। దిత్తతై। తై
తై తై తై తై
దిత తై తాం। దిత తై తాం
తాం

కలిక తాండవము [త్రిపుర సంహారము]

ఈ తెంటిలోని నృత్య విశేషము లించుమించు ఒకటి నే యుండును. కనుక రెంటిని కలిపి పేర్కొంటిని.

ఇందులో వీర, రౌద్ర, భయానక రసములు పూర్తి వికాసము నొందుచున్నవి. ప్రతిభంగిమయు, అర్ధనారీశ్వరునివలె దక్షిణ భాగమందు పట్టిన విధముగనే వామభాగమునకూడ పట్టబడి. దక్షిణ హస్తముతో పట్టినప్పుడు తాండవ పద్ధతిని, వామహస్తముతో పట్టినప్పుడు లాస్య పద్ధతిని పోలియుండును.

ఉదా :- త్రిపుర సంహారము.

ప్రథమమున త్రిశూలము చేతబూని, త్రిపురుని పొడిచినట్లు దక్షిణ హస్తముతో ప్రదర్శింపబడును. ఇది వీరావేశముతో, గంభీరముగా భీతి గొల్పుచుండును. మరల నదే భావము వామహస్తముతో ప్రదర్శించునపుడు పార్వతి అభినయము రౌద్ర రసప్రధానమైనదైనను, స్త్రీలకుండునట్టి సహజ కోమలత కలిగి లాలిత్యముగా నుండును. ఇట్లు తాండవ, లాస్య మిశ్రితములైన హస్త పాద విన్యాసములతో ఈ నృత్యము కూడియుండును.

మరియు నిందు "చక్రాకారపరణు"లను మార్దంగికులు వాయింతురు.

కొన్ని మృదంగ శబ్దములను ఒక ఆవృత్తము లేక రెండు ఆవృత్తముల జతిగాకూర్చి ప్రతిసారి జతియొక్క చివరవచ్చు శబ్దములు, మరల రెండవసారి వాయించునప్పుడు మొదటి జతి యొక్క మొదటి అక్షరములకు బదులుగా వచ్చుచూ, యీలాగున నృత్య మంతమగునప్పటికి, ఆ జతి రూపము క్రమేణా మారుటకు "చక్రాకారపరణ"మని పేరు. (ఇది మన తెలుగు కావ్యాలంకారములలోని ముక్తపదగ్రస్తమును కొంతవరకు పోలియుండును.)

ఉదా :—

1 2

దిగు దిగు తెయ్యా। దిడాంత్ దిత్ దిత్ తక।

3 4

దిత్తరింగ్ తక। హుం హాం తదాన దరి.

1 2

తదాన దరిదిగు తెయ్యా। దిడాంత్ దిత్ దిత్ తక

3 4

దిత్తరింగ్ తక। హుం హాం జగ నగ ఝణ.

1 2

5) జగన గణ గణ తెయ్యా। దిడాంత్ దిత్ దిత్ తక

3 4

దిత్తరింగ్ తక। హుంకి తెత్రి క్రేకిట.

ఈ జతి నాల్గు భాగములుగ విభజింపబడినవి. ఆరంభములో 1)వ నంబరు జతి వాయించబడును రెండవసారి, నాల్గవ భాగములోని శబ్దములను తీసికొని మొదటి భాగములోని మొదటి అక్షరములను కొన్ని తీసివేసి అప్పుడు ఈ శబ్దములనుపయోగించి ము సరిజేసి

తదాన దరిదిగు తైయ్యా। దిడాంత దిత్ దిత్ తక,

దిత్తరంగ్ తక। హుం జగణ గణ గణ.

పై విధముగా నాల్గవ భాగములో శబ్దముల మార్పుతో వాయింపబడును. మూడవసారి వాయించినప్పుడు ప్రారంభ జతి ని మొదటి భాగములో మిగిలిన అక్షరములన్ని పూర్తిగా ర్చి క్రొత్త అక్షరములు (2వ సారి వాయించిన జతిలోని ల్గవ భాగములోనివి) చేర్చి వాయింపబడును. ఈలాగు 2, 3 ర్లు ఆ జతిని వాయించునప్పటికి మొదటి భాగము యొక్క రూపము పూర్తిగ మారును. ఇట్లు ప్రారంభించు జతియొక్క ర్పునుబట్టి జతిలో క్రమేణ అక్షరములు మార్చుతూ కొన్ని వృత్తములు వాయించి జాగాకు వచ్చుటకు, "చక్రాకారపరణ" నిపేరు.

ఇక నృత్యములోని విశేషము :—

జతి కొన్ని ముద్రలు, అడవులతో ప్రారంభమగును. దవసారి పరల చేయునప్పుడు మృదంగ శబ్దముల మార్పును ట్టి మొదటి భాగములో కొంత మార్పున్ననూ, మిగిలిన జతి అంతయూ పరల అదే విధముగా నృత్యమాడబడును. మళ్ళీ వారు "సారె"పై పట్టినుంచి, దానిని త్రిప్పుచూ అది యొకసారి తిరిగి వచ్చునప్పటికి ఏ విధముగ కొంచెము కొంచెము నగిషీని చెక్కి చివరకు దానినొక సుందరమయిన పాత్రగా తయారు చేయునో, అటులనే ఈ చక్రాకారపరణమాద వలయములు పెరిగి, నృత్యమందు క్రమేణ విన్యాసములలో మార్పులు కలిగి ఆఖరికి ఒక సౌందర్యవంతమయిన నృత్య కళగా ముగియును. ఇదే చక్రాకారపరణముల యొక్క విశిష్టత.

## విజయ తాండవము

ఈ తాండవము నాట్యముగ "విలంబితలయ"లో ప్రారంభమై నృత్యము తీ ద్రుత లయలో ముగియును. ఇందు ప్రధాన పాత్ర శివుడు. ఆంగికాభినయము (ముద్రల వినియోగము) ప్రధానము. గజాసుర వధ సంహారము చేయబడు నృత్యమునందు, ఢక్కలో వాయించిన తకానమునుబోలు జతి మృదంగములో వాయించబడును.

"ఝగ ఝగ ఝగ ఝగ। గిణ గిణ గిణ గిణ
ఝగ్గిణ గిణ గిణ గిణ
ఝగ్గిణ గిణ గిణ గిణ
ఝగ ఝగ ఝగ। గిణ గిణ గిణ
గిణ ఝగ। గిణ ఝగ్
గిణాం గిణాం గిణ........."

పై విధములయిన శబ్దముల కూర్పుతో మృదంగముపై జతుల పలికింతురు.

* * * *

## ఊర్ధ్వతాండవము

ఇది లాస్య తాండవములతో కూడియుండును. ఇందు శివుడు తన కాలిని త్రిశిరముపైనుంచి నృత్యమాడినట్లు వర్ణింపబడి యున్నను, ప్రస్తుత మా విధముగా నెవ్వరూ నృత్య మాడుట లేదు. ప్రఖ్యాత నర్తకుడు ఉదయశంకర్ ఈ నృత్యము చేయునప్పుడు శివుడు తన శరీరముపై నున్న కొన్ని వస్త్రములను తీసి పారవైచినట్లు చూపెను. పార్వతి అట్లు చేయనొల్లక నిలువబడెను. ఈ విధముగా ఆ నృత్యమును కొంతమార్చి ప్రవర్తించుచున్నారు.

ఇందు మృదంగము లేక డమరుక యతిలో వ్రాయబడిన జతులను ఒకరి తరువాత నొకరు వెంట వెంటనే నృత్యమాడుదురు.

మృదంగ యతి—మృదంగముపోలె ముందు తక్కువ అక్షరములుగల జతితో ప్రారంభమై, పోను పోను పెరిగి మరల క్రమముగా తగ్గి ప్రారంభించిన విధముగనే ముగింపబడును.

మరొక విధము

ఇందు తాళములో జాగా యిచ్చి పరుసలు పలికించబడును.

| | |
|---|---|
| 1 | తాం ............................................ తధీం |
| 2 | తిరికిటతాం ............................................ తిరకిటతై |
| 3 | తక తిరికిట తాం .................. తాం కకుంతరితై |
| 4 | జగ ణణ ణగ జగత .................. ణతోంగణ తకతై |
| 5 | జంతరి కుంతరి హుంతరి తోం తరి తం |
| 6 | హంత కుంత రింతా హత రింఖణ |
| 7 | కణ కణ జగ జగ కంకణ రింఖణ |
| 8 | తదిమి దిమిత దిమిత దిమిత కుందరి కిటతక |
| 9 | జగ జగ జంతరి .......... జగి దిగి తంతా |
| 10 | తగ ణ గణ .................. తకుందరిత |
| 11 | జంతరికిట .................. తరికిట తోం |
| 12 | తాం .................. గణ గణ తై |

ఈ విధముగా వ్రాయబడినప్పుడు ఇద్దరు నర్తకులు 'తాం' నుండి 'తధీం'కు మధ్యనున్న కాలమునకు జాగానిచ్చి 1 నుండి 4 వరకు I నంబరు శబ్దములను ఒకరు, II నంబరు శబ్దములను మరి యొకరు ఆడుదురు. 5 నుండి 8 వరకు ఒకరి తరువాత మరొకరు ఒక్కొక్క పరుసనాడి ముగింపునందు ప్రారంభమునందువలె జాగా యిచ్చి నృత్యమాడుదురు.

## ఉమాతాండవము

ఇది మధ్య లయలో ప్రారంభమై, త్రిపుట తాళములో గాని, ధ్రువ పదములోగాని వివిధ గతులలో ప్రదర్శింపబడును.

## ధ్రువపదము

పల్లవి యందువలె వివిధ గతులను కలిగి ప్రతి ఆవృత్తమునకుగాని రెండుమూడు ఆవృత్తములకుగాని ముక్తాయింపుతో జాగాకు వచ్చి నిలుచుటకు ధ్రువపదమని పేరు.

## ధ్రువపదము-ఆటరీతి

ధృవపదము—హర! హర! ప్రమథ గణాధిప! దేవ!
భవహర! శంకర! పరమశివ!

ధృవములు 1) ద్రిహిం తత్ ద్రిం ద్రిహిం తత్ ॥2॥
దిహిం తత్ ద్రిహిం తత్ ద్రిహిం తత్
ద్రిహిం తత్
దిన్నాం దిన్నాం దిన్నాం దిన్నాం
దినకిట తాం

2) దెహెం దెహెం దే హం...తం ॥2॥
దోహం ద ద్దో ం తాం ధోంగిణ దత్త
దధోం దాత్త ధధోం దాత్త దిరికిటతై

3) ధణాం దధాతై ధగ ద్ధగత ధిమి
ధాంగిట ధీకిడ్ త త్త దధత దధతతై
తత్ర్ రంగ రంగ త్తుంగ
తాళంగ్ తకతక తకతక దిగితక
తత్లాంగ్ ధిగితక జణుతక
దిద్ధి తెయ్య తెయ్యం తెయ్య తెయ్యం దిదదిద
ధమికిట ధమికిట ధాంకిట జణు జణు
ధణాం జణుం ధణాం జణుం ధాం

ఈ విధమైన జతులకు పైన జెప్పిన శివ పల్లవికి ఆటతో ప్రారంభమగును. అటుపై ఒక్కొక్క గురుపును అనగా నాల్గేసి మాత్రల సాహిత్యమును తగ్గించుచు ఆ మాత్రలకు సరిపడు జతిని కలుపుచు చివరకు పూర్తిగా సాహిత్యమునువిడిచి జతులే పలికించి స ర్తనము సల్పి ముగింతురు.

ఎట్లన--

హర! హర! ప్రమథగణాధిప! దేవ!
భవహర! శంకర! పరమశివ!

ప్రారంభములో పూర్తి గీతము పాడబడి పూర్తి అవృత్తమునరు అనగా 32 అక్షరములకు జతు లాడబడును.

అటుపై

"హర హర" 4 అక్షరములు తగ్గించి పాడబడి ఆ నాల్గు అక్షరములకు సరిపడు మృదంగ జతి పూరించి 32 అక్షరముల అవృత్తము + 4 అక్షరముల మృదంగ శబ్దములు కలిపి 36 అక్షరముల జతి పలికించి ధృవము ముగించబడును. ఇట్లే ప్రతి అవృత్తమునకు 4 అక్షరముల చొప్పున తగ్గించబడి జతులు చేర్చబడును.

విషమగతిలో ఆడబడినప్పుడు 3 అక్షరముల చొప్పున గాని 5 చొప్పునగాని తగ్గించబడి జతులు చేర్చబడును.

## సంహార తాండవము

ఝిర్ ర్ కిటదెతు, ధడాన్ ధళ ధళ ధళ ధళాంగ్
ధళ ధళ ధళం ధళం ధళాంగ్ ది త్త రంగ్ ప్లాం ప్లాం ప్లాం దిద దిద దిద రింగణ గణ గణ దడాన్ తద్రే ద్దితద్రే ద్రేన్న కిటతక ధడాన్న కిటతక తళాంగ్ తక దిద తరంగ్ దిద దితు గిణ గిణతోం.

ఇట్టి ముక్తాయితో ప్రారంభమగును. ఇందు లయకు యెదురుగా నడిచే జతులతో నృత్యము ద్రుతలయలో ప్రారంభమై క్రమముగా విలంబితమై ముగియును.

సృష్టి, స్థితి సంహారములను సూచించునట్టి ఊహాతీతమైన ఈ ఉత్తమ నృత్యమును ప్రదర్శించుటకు కళారాధకుడు ప్రకృతిని పూర్తిగా అర్థము చేసికొనవలెను. ప్రకృతియం దాతడు ఐక్యము కాగల్గిన నాడే ఈ మహత్తర నృత్యమందలి నిగూఢ భావముల నెరుగగలడు. అప్పటికీ కళారాధకుడు ప్రపంచ బంధములనుండి విముక్తుడై ఆధ్యాత్మిక చింతానురక్తుడై పరమేశ్వరునకు ఆత్మార్పణము చేయకల్గిననాడే అతడు తాండవ నృత్యమును చేయుట కర్హుడు. లేనిచో అతడు చేయు శివతాండవమునందు, యిందు విశదపరుపబడిన భావములు కలుగవు. తదన్యములు మాత్రమే కల్గును. అట్టి ప్రదర్శనము చూచిన మహాదేవునిపై నున్న భక్తికూడ సన్నగిలిపోవును.

ఇందులో మృదంగ, డమరుక యతులను గురించి వ్రాసితిని. ఇవి శాస్త్రీయ దృక్పథము ననుసరించి దృతము, లఘువు, ప్లుతము, కాక, పాదము మొదలగు విభేదములను పాటించుచూ శాస్త్రకట్టుగా వ్రాయలేదు. చదువరులకు ఆ యతు లెటులుండునో తెలియుటకుగాను సూత్రప్రాయముగ కొన్ని తాండవ నృత్య శబ్దముల కూర్పును చూపితిని. శబ్దము లివే అయిననూ దృత, లఘువుల విభేదము పాటించిన, యతి ఎత్తుగడ తీర్మానములతో ముగింపు చూపవలసి యుండును. అట్టి విభేదము విశేషముగా చూపలేదు కనుక తీర్మాన విధానము వ్రాయలేదు. మరీ వివరములలోనికి పోయిన 'శివతాండవము' ఒక గ్రంథ మగును. గ్రంథ విస్తర భీతిచే వీలైనంతవరకు సంక్షిప్తముగ వ్రాసితిని. పండితులీ విషయమును సహృదయముతో గ్రహింతు రని నా నమ్మకము.



# నటరాజ నర్తన శోభ

నటరాజమూర్తి కైలాస పర్వతమున నాలుగు దిక్కులందు అమర్చబడియున్న స్వర్ణ, మణిమయ, రజత, చిత్ నర్తన మండపములందు సల్పిన నర్తనములను "శివరహస్య" మను గ్రంథములో వర్ణించిన వివరములు ఇచ్చట తెల్పుచున్నాను.

ఇది కుమారస్వామి జైగీష మొదలైనవారికి తెల్పినట్లుగా వర్ణించ బడినది. కైలాసమందు సంధ్యాసమయమున పరమశివుడు ప్రతినిత్యము సల్పిన నృత్యము ఇందు వర్ణించబడినది.

సనాతన, సనందనులు మొదలైనవారు పరివేష్టింప ; నంది, భృంగి, రిటీశ్వర, గణపతి, తండు, హుండ, బాణ, రావణ, చండిక మొదలైనవారు సేవింప, దేవమునులందఱు గుమిగూడి ఆయన నర్తన విద్యను చూచి ఆనందించ, శివుడు గజచర్మమును ధరించి, తన పాదపద్మముతో అపస్మారుడను రాక్షసుని తాడనము చేయుచు సంధ్యా తాండవము సల్పును.

అంత అతనియొక్క కేశరాశి గాలిలో ప్రకాశవంతమై కదలియాడుచుండును. తలపైని గంగ ఉప్పొంగి తరంగములుగా నల్లని ఆ జటల మధ్యనుండి ప్రవహించును. అందు వికసించిన కమలములు శోభాయమానముగా, శివుని జటాజూటమునకు అలంకారముగా నుండ, కమలమిత్రుడు నిర్మల గంగాజలమున ప్రతిబింబించు చుండును. ఆదిశేషుడాతని చెవున కలంకారమగును. పదునారు కళలతో ఒప్పిన చంద్రునివలె వదనము ప్రసన్నముగా నుండును. అతని నాసికము సంపెంగ బోలె తిన్ననై, మృదువై ఆకర్షణీయముగా నున్నది. అతని నేత్రములు వికసిత కమలముల కంటె ఆకర్షణీయముగా అలరారుచున్నవి. భస్మము నలదిన అతని శరీరము, త్రిపుండ్ర ముద్రాంకితమైన అతని నొసలును దివ్యకాంతులీనుచున్నవి.

ఆయన అర్ధనారీశ్వరుడు అయి ప్రకాశించుచున్నాడు. ఎడమచేతి అందమైన అతని నఖములు లాక్షారసాలంకారముచే ఎరుపుకాంతులుదయించుచున్నవి. మెడలోని మణిమాలలు అసియాడుచున్నవి. రత్నములతో కలిపి కట్టబడిన రుద్రాక్షమాల కుడిప్రక్క అతని మెడచుట్టు కాంతివంతముగనుండ, ఎడమప్రక్క నాగరత్నమాల అలంకారముగా నున్నది. మెడలోని నవరత్నమాల, చేతులకున్న అపరంజి మురుగులు, నడుమునకున్న చిరుమువ్వల మొలత్రాడు ముచ్చటగా మెరువగా అర్ధనారీశ్వరుడు నర్తనము సల్పుచున్నాడు.

ఒక చేతిలో డమరు, రెండవ చేతిలో ప్రజ్వలాగ్నియును, వేఱొక చేతిలో అభయముద్ర పట్టియున్నాడు. వరద హస్తము యొక్క వ్రేళ్ళకు ధరించిన రతనాల ముద్దుటుంగరములు తళతళ లాడుచున్నవి. వస్త్రముగా ధరించిన పులితోలు అందముగానుండి పవిత్రత తొణకిసలారుచున్నది. బ్రహ్మతల నాయకముగా నమర్చిన పుత్తెలపేరు మెడలో ఎసగుచున్నది. కాళ్ళనలంకరించిన చిరుమువ్వలు ముచ్చటగా పల్కుచున్నవి. నడుమును అందముగా వంచుచు నటశేఖరుడు, నటమహానటుడు, నటరాజమూర్తి త్రిభువనములను మోహింపజేయు నర్తనమాడుచు ముల్లోకములను కాపాడుచున్నాడు.

నర్తన సమయమునందు మహాదేవుడు తన అంతమొప్పు రసులనుండి అందముగా రత్నఖచిత సింహాసనముపై కూర్చొని, ఆయన నాట్యమును తిలకించుచున్న అంబను ఒకసారి విలాసముగా చూచును. ఆమె ముత్యాల ముక్కర శుక్ర నక్షత్రముపరె కాంతివంతముగా నున్నది. కంఠముపైనున్న మూడురేఖలు, కంఠసీమ నలంకరించిన మూడు మణిమాలలకంటె అందముగా నున్నవి. ఆమె ధరించిన స్వర్ణాంబరము అంతరిక్షముకంటె ప్రకాశవంతముగా నున్నది.

చంప కాశోక, పున్నాగ, సౌగంధిక పుష్పములతో ఆమె వినీల కచభారము అలంకృతమైనది. అన్ని పుష్పముల మధ్యగా నుండి రత్నసీమంతిని ముద్దుగొల్పుచున్నది. నుదురుపై వ్రాలిన ముంగురులకు, చంద్రికళగా ధరించిన సింధూరము మరింత వన్నె తెచ్చుచున్నది. చేతులకుదాల్చిన నాగాభరణములు, రత్నాలు తాపిన గాజులు, రవ్వలు పొదిగిన ఉంగరాలు ఆమె చేతులకు సొంపుకూర్చుచున్నవి. ఆమె కాళ్ళకు ధరించిన రత్నాలు పొదిగిన చిరుమువ్వల మధురధ్వనితో భూమి ముచ్చటగా ప్రతిధ్వనించు చున్నది.

అప్పటి ఆ ప్రదేశమంతయు చంద నాగరు, కర్పూర కస్తూరీ వాసనలతో నిండియున్నది. అంబ ఒక చేతిలో సౌగంధిక పుష్పము తాల్చియున్నది. రెండవ చేతిని అందముగా ప్రక్కకు జారవిడిచినది. మరి రెండు చేతులందు పాశాంకుశములను దాల్చినది. ఈ విధమున జగజ్జనని అలరారుచున్నది.

అంబగూడ స్వామిని తన ముద్దులొల్కు దృక్కులతో చూచినది. ఆయన అందముగా మరల మరల ఆమెను చూచుచు నర్తనమాడుచున్నాడు. మహాకాల, గణపతి, స్కంద, భృంగి, నంది; దేవ, గంధర్వ, యక్ష, కిన్నర, కింపురుషాదులు ఆయనను

సేవింప, సంగీత వేదఘోషలతో తన సంధ్యాతాండవ నృత్యము ప్రతినిత్యము కైలాసమందు నాల్గు దిక్కులందున్న నర్తనవేది కలపై చేయుచుండును. కొన్ని సమయములందు అంబ ఆ నాట్య మందు అతనిని అనుసరించును. మరికొన్ని సమయములందు తానొక్కడే నర్తనమాడును. ఆ నాట్యము కనులకు పండువై, వీనులకు విందై, ఆత్మకానందమై, లోకములకు శుభమై ఒప్పారు చున్నది.

ఇక పరమ శివుడు తూర్పుదిక్కున నున్న స్వర్ణమండప ములో చేసిన సంధ్యానర్తనమును గూర్చి విపులముగా వర్ణింతును.

అర్ధాంగియైన పార్వతీదేవి ఎల్లప్పుడు వామ భాగమున ప్రకాశించగా నటరాజమూర్తి కైలాసమందు సంధ్యా సమయ మున నర్తనమాడుచుండెను.

చంద్రకళచే ప్రకాశమానమైన ఆతని కేశపాశము గాలిలో నర్తనమాడుచున్నది. ఆయన సాత్వికరూపుడై విరాజిల్లుచున్నాడు. బ్రహ్మశిరముతో గూడిన పుర్రెదండలు ఉచ్ఛ్వాస నిశ్వాసములతో నుప్పొంగుచున్న ఆతని విశాల వక్షముపై కదలియాడుచున్నవి. కుబేరుడు ప్రక్కగా నిలిచి స్తోత్రగీతములు పాడుచున్నాడు. నర్తనము ఉద్ధృతమగుచుండును. బ్రహ్మ కపాలము గాలిలో కెగురుచు నక్షత్ర మండలమును తాకుచున్నట్లు భ్రమగొల్పు చున్నది. ప్రపంచము ఆ నర్తనమునకు దద్దరిల్లినది. శిరములోని గంగ ఉప్పొంగి గాలిలో ఆడుచున్న కేశపాశముతో కదలియాడు చున్నది. అట్టి సమయమున మహావిష్ణ్వాది దేవతలు ఆయనను కొలుచుట కచటికి జేరుచున్నారు. అంజలి ఘటించి ఆయనను స్తోత్రము చేయుచున్నారు. తండుడు, ఇంద్రుడు, చండీశ్వరుడు డిండిమము, డమరు, ఘంటా వాద్యములను పలికించుచున్నారు. నటశేఖరుని కిరుప్రక్కలా నిలిచిన బ్రహ్మ, విష్ణువులు ఆయనకు నమస్కరించు చున్నారు. అచ్చటజేరిన దేవర్షిగణములందఱు ఆశ్చర్యానందములతో కదలక మెదలక అట్లే నిల్చి ఆ నర్తన శోభను తిలకించి తరించుచున్నారు. ఆయన మెడలోనున్న అనేక రకములైన ఆభరణములు ఆయనతో కలిసి నర్తనము సల్పుచున్నవి. శిరోజాల నలంకరించిన చల్లని చంద్రుడు ఆయన కంఠమునందలి విషములోన గల వేడియావిరికి, చేతిలోని అగ్ని జ్వాలకు క్రమేణ వేడెక్కుచుండగా, వేదాల సారమైన ఆ స్వామి తన అర్ధాంగిని ఆనందపరచుటకు స్వర్ణమయ మండపమందు నర్తించుచున్నాడు.

ఆదిశేషుడు తన చేతి అలంకారమాయెను. అతని కాళ్ళ చిన్నిమువ్వల తియ్యని సవ్వడులు, ఆదిశేషుని ఉచ్ఛ్వాస నిశ్వాసములు లోకములను, లోకస్థులను కదలించుచున్నవి. కాని మహా దేవుడు మాత్రము మందహాస వదనారవిందుడై ప్రశాంతమైన దృక్కులతో మణిగణాలంకార శోభితయైన దేవిని చూచు చున్నాడు. ఆయన నర్తనవిద్యను చూచి ఆనందించినట్లు దేవి చిరునవ్వుతో మందహాసము చేయుచున్నది. అంత ద్విగుణీకృతో త్సాహముతో సదాశివుడు వివిధగతుల వివిధరీతుల నర్తనము సల్పుచున్నాడు.

అటుపై హైమయొక్క ఆనందముకొరకు దక్షిణ దిక్కున నున్న మణిమండపమందు ఆయన నర్తనము చేసెను.

ఆదిశేషుడు అతని చెవికి అలంకారమాయెను. అతని శిరముపైనున్న నాగమణికాంతిలో శివుని కంఠము మెరియు చున్నది. పక్షిముఖముగల చండీశ్వరుడు ఇత్యాదులు స్తోత్రము లను చదువుచున్నారు. బ్రహ్మాదిదేవతలు వేదమంత్రోచ్చారణ చేయుచున్నారు. శర్వుడు ప్లవన, మండల, చారి, కరణాంగ హారముల విన్యాసము ప్రదర్శించుచుండ, తండుడు మైమరచి పాడుచున్న బ్రహ్మ, విష్ణుల స్థాయి తగ్గించమని, ఆయన నర్తన మునకు స్థలము నొసగుమని వేడుచుండగా, స్వామి నటరాజై నర్తన విద్యకు విలాసము కూర్చుచున్నాడు. నర్తన మందు నటునిటు ఆయన శిరము కదలునపుడు చంద్రునిలోని అమృతము జాలువారినది. కదలుచు, లేచుచు ఉద్ధృతముగా నాట్యమాడి నపుడు ఆయన శిరము నలంకరించిన నాగుపాములు మిక్కిలిగా కదలింపబడుటచే నుక్కిరిబిక్కిరైనవి. ఆదిశేషుడు, భూమి, సూర్యుడు, చంద్రుడు, మెరియుచున్న స్వర్ణపర్వత పంక్తి అన్నియు భీతిచెంది శివునియొక్క పాదవిన్యాసమునకు వణక జొచ్చినవి. అంత భీకరముగా మహానటుడు నర్తనముచేసి దేవిని సంతోషపెట్టెను. ఆమె కలువకన్నులనుండి అమృత మొలుకు నట్టి చూపులతో ఆయనను సంతోషపెట్టినది.

అట్టి ఉద్ధృత నాట్యమందు తన నానాభరణములు జారిపో కుండ, వస్త్రముగా ధరించిన గజచర్మము వీడిపోకుండ అప్పు డప్పుడు హస్తపాద విన్యాసముల ఉద్ధృతము తగ్గించుచున్నాడు. అట్లే తనయొక్క జటాజూటమునందు గంగ పడిపోకుండ చంద్రుడు వ్రాలిపోకుండ జాగరూకతతో నర్తనము సల్పు చున్నాడు. ఆ నాట్యవైఖరిని తిలకించి దేవర్షులు మొదలైనవారం దరు తమ జన్మలు తరించెనని తలంచుచున్నారు.

ఇక పడమటి దిక్కుననున్న రజతమండపముపై శివుని నర్తనము వర్ణింతును.

తన వామ భాగములో పార్వతీ స్వరూపముదాల్చి, పాము లను ఆభరణములుగా ధరించి, బ్రహ్మకపాలమును మెడయం దుంచి, అంబయొక్క ఆభరణములు మెల్లగా ధ్వనించ నర్తిస పాడును. కటి భాగమున గజచర్మమున్నది. కళలొల్కు చంద్రుడు అతని జటాజూటమున కలంకారుడయినాడు. ప్రసన్న దృక్కు లతో తన బిడ్డలనందరను చూచుచు రజత మండపముపై శివుడు నర్తించును.

ఆదిశంకరుడు విస్మయుడై నర్తించుచున్నాడు. బ్రహ్మ దేవుడు అతని నర్తన విద్యను వేయినోళ్ళ పొగడుచున్నాడు. మహావిష్ణువు అయన నర్తన విద్యకచ్చెరువొంది ఆరాధించు చున్నాడు. అతని భక్తులు ఆ సంగీతామృతమును ఆస్వాదించి తనివి తీరక మరల మరల ఆ అమరనర్తన విన్యాస ప్రదర్శన మును కోరుచున్నారు. తన భక్తుల సంతోషార్థము స్వామి నర్తించుచున్నాడు.

స్వామి సృష్టిక్రమమును నర్తనరీతిలో ప్రదర్శింప, స్థావర జంగమాదులు కూడ ఆడదొడగినవి. స్వామి ఆంగిక విన్యాసమే సకల చరాచరముల యొక్క కదలికలాయెను. ఆయన పాదముల నుండి వెలువడిన ధ్వనులే శబ్దమై, వర్ణములై, మాటలై, వాక్య ములై, సూత్రములై, భాష్యములై అలరారినవి. నీలాకాశము నందలి నక్షత్రమండలము అతని కలంకార ప్రాయమాయెను. నర్తనవేళ ప్రదర్శించిన వివిధ భావములే నవరస శోభితమైన సాత్వికాభినయమైనది. ఇన్ని విధముల నర్తన విద్యను వికసింప జేయుచు ఆడుచున్నాడు ముక్కంటి వేల్పు.

లోకరక్షణకుగాను సముద్ర మథన సమయమున భక్షింప బడిన హాలాహలముచే నీలిమ పొందిన కంఠము ప్రకాశవంతముగా నున్నది. అటుపైన అతడు ఉత్తర దిక్కుననున్న జ్ఞానమండపము వద్ద సల్పిన నాట్యము వర్ణింతును—

'హ్రీం' రూపమైన దేవి పరమశివునియొక్క దివ్య స్వరూపమును ఎల్లప్పుడు తనయొక్క హృదయ కమలమునందు ధ్యానించును. సృష్టి కాధారమైనవి ప్రకృతి పురుష శక్తులు. ఈ రెండు శక్తులయొక్క సంయోగమువలననే సృష్టి జరుగును. ప్రకృతి స్వరూపము పరాశక్తియైన అంబ. పురుష రూపము శివమూర్తి. అట్టి పరమశివుని రూపమును అంబ నిరం తరము ధ్యానించును.

శివుడు భోళాశంకరుడను పేరు కలవాడు. తనను నమ్మిన వారిని వరములొసగి బ్రోచువాడు. అట్టి అమృత హృదయమూర్తి అందముగా అలంకరించుకొని కుంకుమ, కేసరి మొదలగు సుగంధ పూరితములైన వస్త్రములను కట్టుకొని మేరువును ధనువుగా ధరించినాడు. ఆయన నర్తన పీఠముక్రింద 'హ్రీం' యొక్క చిత్రము అతి రమణీయముగానున్నది. అట్టి తరి పంచవర్ణములలో ప్రకాశించుచు స్వామి జ్ఞాన సభయందు నర్తించును.

లక్ష్మీ సరస్వతులు అతనిని గొల్చుచున్నారు. విష్ణువున కితడు ఇష్టదైవమయినాడు. ఆయన శ్రీ విద్యకధినేత ఆయెను. తనయొక్క కరుణాదృక్కులు శాస్త్రవేత్తలయెడల ప్రసరించు చున్నవి. కంఠమందు హాలాహలమును ధరించియున్నాడు. స్వామి వదనము నిర్మలమై అప్పుడు పూచిన తామరవలె స్వచ్ఛమై అందముగా ముద్దులు మూట గట్టుచున్నది. తన్ను నమ్మినవారిని అభయమిచ్చి కాపాడుచున్నాడు. నారాయణుడు అతనిని నిరం తరము పూజించుచున్నాడు.

గజ చర్మాలంకృతుడైన ఆయన నాగలోకమున ప్రవ హించు గంగను శిరమున దాల్చియున్నాడు. నానా రూపములైన నర్తన రీతులను ప్రదర్శించుటకు సమర్థుడైన ఆ స్వామి ఏ రూప మును కోరిన ఆ రూపమునందే ప్రత్యక్షమగుచు నర్తించును. సృష్టికర్తయైన బ్రహ్మకే గురువువలె ప్రకాశించుచున్నాడు. విష్ణువు నకు నైతము కనుగొనలేనట్టి అద్భుతమైన పాదపద్మములు కలిగిన వాడును, స్కందుని జన్మకు కారణభూతుడును అగు నాతడు తన చూపుచే కాముని భస్మముచేసెను. అతడు అందమైన అంగసౌష్ఠ వము కలవాడు. మందార కుసుమమువలె స్వచ్ఛమైన దృక్కులు కలవాడు. శుభప్రదుడు. సర్వము తానై విలసిల్లు శంకరుడు జ్ఞాన సభయందు నర్తనము సల్పుచుండెను.

జ్ఞానులు శుభంకరుడైన చంద్రశేఖరుని పాదపద్మములను సేవింతురు. కళలందు సాటిలేని మేటి. పాప పంకిలమునుండి భక్తులను కాపాడుటయందాతని కాతడే సాటి. అతడట్టి దయా హృదయుడైనను దుర్మార్గుల పాలిటి భైరవుడు. బ్రహ్మయొక్క పంచమ శిరమును ఖండించినవాడు. నొసటియందు అగ్నిజ్వాలల వర్షించు నేత్రమున్నను, చల్లని సౌకుమార్యమైన దృక్కులు కల్గిన ఆరుద్రమూర్తి జ్ఞాన సభయందు నర్తించుచున్నాడు.

బ్రహ్మదేవుడు ఆయనను నుతించుచున్నాడు. దేవతల కోర్కెలు తీర్చుటయందాతడు చింతామణి సమానుడు. ఆది

శేషుని ఆభరణముగా కల్గియున్నాడు. ఇంద్రుని సేవలందుకున్న ఆ స్వామి భక్తులు కోరిన కోర్కెలు తీర్చుచున్నాడు. నాల్గువేదముల సారము వెలువడినట్లు స్వామి అర్ధనారీశ్వరుడై భక్తుల హృదయములందు ఎల్లకాలము నిల్చునట్లు సంధ్యా నృత్తము సల్పుచున్నాడు.

మెరుపు తీగలు ఆతని జటలనుండి ప్రకాశించును. ముంగురులు ఆతని ముఖముపై అల్లలనాడుచున్నవి. యముని గర్వమణంచి, మార్కండేయుని రక్షించిన త్రిశూలమును ధరించియున్నాడు. విష్ణుశక్తిని బాణముగాధరించి, రాక్షస గణములను సంహరించినాడు. ముల్లోకములను ఉదరమున ధరించి తాచేటిపై నిల్చినాడు. యోగులయొక్క హృదయకమలములలో నివసించువాడు. ఒకచేత కుత్తాలము (గండ్రగొడ్డలి) ను వేరొకచేత లేడిని ధరించియున్నాడు. చేతులయందున్న ఛురిక (చిరుకత్తి), ఖడ్గము తళతళ మెరయుచు, ఆయన శరీరమును నీలి కాంతులతో ప్రకాశింప జేయుచున్నవి. ప్రమథగణములు మొదలైనవారు అపస్మారుని సంహరించిన ఆ మూర్తిని పొగడుచున్నారు. విష్ణు బ్రహ్మేంద్రాదులు వాద్యగోష్ఠి సల్పుచున్నారు. శివుడు డమరును వాయించుచున్నాడు. కమలదళములను బోలు ఆయన కనుగవ అగ్నిజ్వాలవలె భాసించుచున్నది.

స్కందుడు మయూరవాహనమును, వినాయకుడు మూషిక వాహనమును ఎక్కి ఆయనను సేవించుచున్నారు. నర్తన వేదిక బంగారు స్తంభములతో నొప్పి రక్తారుణకాంతితో ప్రకాశించుచున్నది. మండపోపరిభాగము వజ్రములతో నలంకృతమైనది. సప్తమాతృకలు, నవశక్తులు ఆతని ప్రక్కగా నున్నారు. ప్రపంచములను వృద్ధిపరచిన తాను సృష్ట్యంతమందు సమస్త జీవకోటిని తనయందే ఇముడ్చుకొనుచున్నాడు. ఆతని మెరుపు తీగలవలె కదలిక కల్గు హస్తముల విన్యాసము వర్షబీభత్సమును కల్గించుచున్నది. అప్పుడు అత్యద్భుతముగా నున్నది మిన్నువాకతాల్చు నృత్తన చోద్యము. నృత్తనములో హస్తములు ముడుచుకొన్నను ఘనభోంతరమును చుట్టిపెచినట్లు వికాసము చెందుతున్నవి. ఆ నృత్తనోత్సృతమునకు శిరోజాలు కదలియాడుచూ ప్రపంచమును చీకటిగా చేయుచున్నవి. పాదములు తాళలయక్రమము తప్పకున్నను. అతివేగముగా చలించుచు నక్షత్రమండలము నంటుచున్నట్లు భ్రమగొల్పుచున్నవి. ఇన్ని రీతుల నృత్తనముసల్పి స్వామి అంబ యెదురుగ నిల్చి యున్నాడు, ఆమెయొక్క ప్రశంసలను ఆశిస్తూ. మందహాస వదనయై అంబ చిరునవ్వుతో ఆతని నృత్య విద్యను అభినందించుచున్నది.

ఇదియే పరమ శివుడు జ్ఞానసభలో సల్పిన నృత్యము.



## త్రిపుర సంహార సమయములో పట్టు శబ్దములు

(1) అహరవధి నవసంధ్యా సమయారంభ విజృంభమాణ ఘుంభత్కుం
ఖీనస కటక భుజస్తంభ విజృంభిత రంభిత టంఠం డౌకుమార
థక్కా థమ థమ గాథ నిరూఢ ప్రౌఢ శ్లేఖాలంఘన జంఘా వికహేలా
సమ సమయ సమయ—విశ్రమిత జయ జయభేరీ

భం భం భాం—భం భం భాం—భం భం భాం

(2) భమికిట భాంకృతి బుద్ధ నిరుద్ధతి మధ్యధ్యానా ధన్యో బధిరీభూత
బ్రహ్మాండాభ్యంతర ఉరగక్షోణీవల్లభ వరనందన దిగ్విజయస్ఫుట-సన్నికటక
ధగ ద్ధగిత ధవశేశాం స్థగిత దిశాం

భం భం భాం—భం భం భాం—భం భం భాం.

(3) భగిడ్డగ భయంధ భిభ్రుభి జిచ్చ హాకుట జిచ్చహాకుట గిగిడ్డగ
గిగిడ్డగ మగిడ్డగ మగిడ్డగ రణకర్తిక రణకర్తిక డమరు డసిక డమరు డసిక
గొగ్గిరిగిరి గొగ్గిరిగిరి భయభర్లిక భయభర్జిక పరిమహాపాత్ర శ్ఫరీర
శ్ఛంద్ర నరేంద్రాద్భుత జైరి

భం భం భాం—భం భం భాం—భం భం భాం.

(4) అసురయపుర అసురయపుర ణణణ ణణ ణణణ ణణ ఉరగ
ఉరగ మాణిత్త్యైరి భిర్జోగి భిర్జోగి జోగి జజ్జగుడ్డిగ జజ్జగుడ్డిగ
ఉర ఘనపాణీ కదంబరేయు పావడ సద్వరదేర కిర్రు కిక్కుమాణిక్య
క్షత్రైః

భం భం భాం—భం భం భాం—భం భం భాం.

(5) ధిం ధిం ధిం ధిం ధిక్కా ధిమికృత ధిగధిక్కూం ధిగధిక్కూం ఝుంకిణ
ఝుకు ఝుకు కుంభినీకృత తద్రాజముఖీ కందర్ప సంగీత నృత్య
కోలాహల విజయీభవా

భం భం భాం—భం భం భాం—భం భం భాం.

(సుప్రసిద్ధ నర్తకి శ్రీమతి వైదేహిగారిచ్చిన గొల్లకలాపమునుండి)

## శివపంచముఖ శబ్దములు

(1) చతురశ్రము (శబ్దము)

నగి నగి ననగీ నగినగి ననగీ
ననగిడ కిటతక గిడ గిడదా
కికిత తతకిట కికిత తతకిట
కికితకిట కికితకిట ధోంగి ధోంగి
కికితకిట ధోంగి ధోంగి గిడ గిడదా
ధోంగి ధోంగి గిడ గిడదా
ధోంగి ధోంగి గిడగిడదా

(2) త్రిశ్రము (శబ్దము)

ధరికిట గిడ దగదా టటకుటటా టటకుటటా।
ననగి ననఖ ననగి ననఖ ననగి నఖిరి
ధోంగి నగీ ధోంగి నగీ
తత్తా దిద్దీ ధరికిట గిడదగధా॥
ధరికిట గిడదగధా॥
ధరికిట గిడదగధా॥

(3) మిశ్రం (శబ్దము)

తతకిట గిడదగితా ధధకికి గిడదగితా
తతకిట గిడతగితా ధధకికి గిడదగితా
ధధకికి తకాధికీ తకాధికీ టకునగు టకునగు
ఖరితు ఖరితు సరిసరి ఖరిసరిఖి
తకిట గిడెదగిధా
తతకిట గిడదగిధా
తతకిట గిడదగి

(4) ఖండం (శబ్దము)

తత కిటకిట దోహంత దోహంత
ధోంగిన ధోంగి ధోంగిన ధోంధోం గోంగోం
దొగిణ తాతా కిటతోం
ధోంగినఖే నఖే టకు ఝుంఝుం (3 సార్లు)

(5) సంకీర్ణం (శబ్దము)

నీఝోం నఝోం ఝాం కిణకిణకి కిణకిణకి
నీఝోం నఝోం ఝాం గిరిగిడ గిరిగిడ గిరిగిడ
గిరిగిడ గిరిగిడ
దిద్దికిటకీ దగికినగి దగికినగి (2 సార్లు)
దగికినగి దరికిటదా దొనక.
నఝోం నఝోం ఝాం నఝోం నఝోం ఝాం
నఝోం నఝోం ఝాం.

(సుప్రసిద్ధ నర్తకి శ్రీమతి వైదేహిగారిచ్చినవి)

జటాటవీ గల జ్జల ప్రవాహపావిత స్థలే
గలేవలంబ్య లంబితాం భుజంగ తుంగమాలికాం
డమడ్డమడ్డమ న్నినాద వడ్డమ డ్డమర్వయం
చకారిచండ తాండవం తనోతు నశ్శివశ్శివం.

జటాకటాహ సంభ్రమ భ్రమన్నిలింప నిర్ఝరీ
విలోలవీచి వల్లరీ విరాజమాన మూర్ధని
ధగద్ధగద్ధగ జ్వల ల్లలాట పట్టపావకే
కిశోర చంద్రశేఖరే రతిః ప్రతిక్షణం మమ.

ధరాధరేంద్ర నందినీ విలాస బంధుబంధుర
స్ఫుర ద్దిగంత సంతతి ప్రమోదమాన మానసే
కృపాకటాక్ష ధోరణీ నిరుద్ధ దుర్ధరాపది
క్వచిద్దిగంబరే మనోవినోదమేతు వసుని.

జటాభుజంగ పింగళ స్ఫుర త్ఫణా మణిప్రభా
కదంబ కుంకుమద్రవ ప్రలిప్త దిగ్వధూముఖే
మదాంధ సింధుర స్ఫుర త్త్వ గు త్తరీయ మేదురే
మనోవినోద మద్భుతం బిభర్తు భూతభర్తరి.

దశవక్త్రవిరచిత శ్రీ శివతాండవ స్తోత్రమునుండి.

శ్లో॥ శాంతాకారం, శిఖరిశయనం
సర్పమాలం, మహేశం
విశ్వాధారం, గగనవచసం
స్వచ్ఛవర్ణం, శుభాంగం
గౌరీకాంతం, విషమనయనం
యోగి హృద్యానగమ్యం
వందేశంభుం, భవభయహరం
సర్వలోకైకనాథం।

శ్లో॥ శాంతం, పద్మాసనస్థం, శశధర మకుటం, పంచవక్త్రం, త్రినేత్రం
శూలం వజ్రంచఖడ్గం పరశు మభయదం, దక్షభాగే వహంతం
నాగం, పాశంచ ఘంటాం, ప్రళయహుతవహం, సాంకుశం వామభాగే
నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం పార్వతీశం నమామి.

ఉ॥ ఆడగ గెంజెడల్ దొలకియాడగ జాహ్నవి దిక్కుటెల్ల స
ల్లాడగ భూతధాత్రియసియాడగ నాకము, నాకసంబు నూ
టాడగ ముజ్జగంబుగొని యాడగ నిచ్చలు నీవు తాండవం
బాడగ గౌరి నిన్ సరిసమాడగ జేరునటా ! మహానటా।

(విష్ణు కథానిధానము.)

మ॥ ఝిరిఝక్కారవ వాద్యమింపొదవ గంగా తుంగరంగత్తరం
గ రవప్రస్ఫుట తాళసమ్మిళిత త క్కుంజాతపుంజస్ఫుర
ద్వరపుష్పంధయ మందరధ్వనుల గీతం బొప్పతౌర్యత్రికం
బిరిపైయుండగ నీదు తాండవ మహంబేపారు సర్వేశ్వరా।

(విష్ణు కథానిధానము)

ఉ॥ తారకజి చ్ఛిఖండి శివతాండవ మాడ నతండుమూర్ధశో
దారరవంబు మేఘనినదంబని చేరినజూచి నాసికా
ద్వారబిలంబు జన్నిదపువ్యాళము జొచ్చిన దొండమెత్తి ఛీం
కారముచేసి నవ్వు వెనకయ్య కృపాళువు మెల్లమెల్లగన్॥

(అరుణాచల పురాణము)

మ॥ క్షయకాలంబున సీధుసాగర రసాస్వాదాతిరేకంబునన్
నయనాబ్జంబులు ఘూర్ణితంబులుగ సంధ్యావేళ రాత్రీకర
ద్వయతాళానుగతిం బ్రమోదమున మత్తల్లీ మహా నృత్యముల్
ప్రియమొప్పారగ జేయు భైరవుడు గావించున్ మహానాట్యముల్.

(ప్రాచీన గ్రంథమునుండి)

———

## మోహనరాగము, మిశ్రగతితాళము

పల్లవి శివుడు తాండవమాడుచుండెన్॥
అనుపల్లవి అపురాయన గౌర్యస్థానమునన్ ॥శివు॥
కంకణములు కణ కణ కణ కణ కణమని మ్రోయన్
కింకిణి గణములు ఘలు ఘలు ఘల్లని కెరలుచు సారెకురాయన్
ఖందు ఖండ మదిత తళ తళ తళ తళమని మెఱయన్
దండశూకమణి కాంతులు ధగ ధగ ధగమని యొలయన్ ॥శి॥
జగత్పాలకులు హాహాహాహాహా యని పల్కన్
జగన్నాథుడో హర హర హర హర హరయని మ్రొక్కన్ ॥శి॥
(గాయన గాయనీజన పారిజాతమునుండి)

---

## ఫరజురాగము - ఆదితాళము

దొరసామయ్య రచన.

ప॥ ఆడెనమ్మా హరుడు ధ్రుకుట్టతైయని ఆడెనమ్మా॥
అ॥ ప॥ జాడగ గిరికన్యకను క్రీగంట జూడ
అంబ 'సెబాస్' అని కొనియాడ
చూడ జూడ వేడుకగా చంద్ర చూడుండు
మూడు కండ్లవాడు ॥ఆడెనమ్మా॥
చ॥ చెవులనుండు తాటంక కుండలచ్ఛవి
చెక్కిట మెఱుగార జాహ్నవీ
యువతీయుతమైన జడకట్టు ముడియు వీడియసియాడ
నవరసంబులొలుక మోము చిరునవ్వు ముద్దుగులుక త్రి
భువనావన చతురుడై వెలయు త్రిపురహరుడు
నడుము గిర్రని దిరుగ ॥ఆడెనమ్మా॥

---

# దేవనర్తకి - ఆలయ నృత్యములు



పసుపు పారాణి పాదముల నలంకరించిన రత్న మంజీరాలను మధురముగా పలికిస్తూ తమ నృత్యా రాధనతో ఆలయాలను సంస్కృతీ నిలయాలుగా రూపొందించి స్వామియం దైక్యమైన దేవనర్తకీమణులకు సుమాంజలి.



"కళకే జీవితము నంకితముజేసి నృత్యకళను మహోన్నత స్థితికి తెచ్చినది ఆదర్శదేవదాసి. తాను నాథునిగా పరిగ్రహించిన పరమేశ్వరుని జూచినపుడు కనులనుండి రాలు ఆనంద బాష్పములతో అతని నభిషేకించి, నేత్ర పుష్పములతో పూజించి జ్ఞానాగ్నియందు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాదులను ధూపమొనర్చి తన శరీర స్వరూపమును నివేదన మొనరించి తరించిన ఆ దేవనర్తకి రూపము కనులయెదుట చిత్రించుకొనినచో ప్రాచీన భారతీయుల ప్రాభవము వ్యక్తము కాగలదు. వారివలే, కళాస్వరూపిణియైన ప్రకృతి మాతను పవిత్ర హృదయముతో పూజించిననాడే, కళారాధకుడు అమరత్వము నొందే కళాసంప్రదాయముల సృష్టించగలడు. కళలు సముజ్జ్వలములై విలసిల్లగలవు."



# నాట్యారాధన

## ఆలయము - దేవనర్తకి

ఆలయము హైందవ సంస్కృతికి నిలయము. లలిత కళలకు పుట్టినిల్లు. నాగరకతకు చిహ్నము. భారతీయ సంస్కృతి దేవాలయములో పుట్టి, దైవ సాన్నిధ్యంలో పెరిగి, ఆలయ ప్రాంగణములో ఆటపాటల నేర్చి, సర్వాంగ సుందరముగా రూపొంది, రాచబాటను తరలివెళ్ళి ఆస్థానముల నలంకరించి, ఆరాధనల నందుకొని, విదేశయాత్ర సల్పి తన సుమ పరిమళములతో అన్యదేశీయుల సహితము సమ్మోహితుల జేసి, వారి హృదయములలో చిరస్థావరముల నేర్పరచుకొని నేటికినీ పవిత్ర భావములతో ఆరాధింపబడుచున్నది. ఇదే మన సంస్కృతి, లలిత కళల యొక్క పవిత్ర చరిత్ర.—

మన శిల్పులు తమయొక్క ప్రతిభనంతనూ చూపి జీవకళ ఉట్టిపడే శిల్పములతో దేవతలకు ఆలయముల నిర్మించి తమ కళావిజ్ఞానానికి అమరత్వము చేకూర్చుచున్నారు. లక్ష్మీప్రసన్నులైన ప్రభువులు, నాగరక ప్రజలు ఆ నిర్మాణములకయ్యే వ్యయముల భరించి, ఆ కళలను పోషించిరి. చిత్రకళాకారులు మన పురాణేతిహాసములలోని వివిధ నీతి ప్రబోధక గాథలను మందిరముల గోడలపై ప్రజోపయోగార్థము చిత్రించి, అలంకరించి, తమ కళల సార్థక పరచిరి. కవులు తమ గద్య, పద్య, గీత, ప్రబంధ రచనల ద్వారా స్వామిని కీర్తించగా, సంగీత విద్వాంసులు ఆ గీతములకు రాగ, తాళములను గూర్చి ఆలపించగా, వాద్యకులు తమ వివిధ వాద్యములపై ఆ సంగీతము ననుసరించగా, నాట్యము తెలిసిన దేవనర్తకీమణులు తమకాళ్ళకు గట్టిన పసిడి మువ్వలు 'ఝణం-ఝణా' రవముల జేయగా మేళవించిన మహతీ నాదములో తమ కోమల కంఠములనుజేర్చి మధురముగా భక్తిగీతముల నాలాపించుచూ, వాని యర్థమును హస్తభంగిమాదులతో నెఱుక పరుస్తూ, రసభావములను నేత్రవిన్యాసములతో తెల్పుచూ, పాదములతో తాళగతిని, లయవిన్యాసమును సూచించుచూ, అతినిర్మలమైన మనస్సుతో పరమహంసవోలె దేవదాసీలు ఆ దేవదేవునెదుట నృత్యము సలిపేవారు. అట్టి నృత్యమును జూచిన వారందరూ విస్మయానందోద్వేగులై తన్మయమునొందెడివారు. తమ్ముతాము మఱచి, ఆ తన్మయత్వముతో నున్నవారు మాయా వ్యామోహముతో బంధింపబడినట్టి ఈ జగతిని మఱచి నిరంతరానంద సంధాయి యగు నా పరమేశ్వరునెదుట నున్నట్లే భావించెడివారు.అట్టిదైవత్వమును తెల్పే నృత్యాన్ని జూచినవారేధన్యులు. వారి జీవితములే సార్థకములు. దైవసేవకు అంకితమైన "దేవదాసీలు" యితర చోట్ల నృత్యమాడరు. భూపతియైనను, భూసురోత్తముడైనను దేవనర్తకీమణుల నృత్యము జూడవలెనన్న, ఆరాధన సమయములో ఆలయమునకు వచ్చి తీరవలసినదే. సంఘాభివృద్ధికి గాను ప్రభువులే ఈ నియమముల నేర్పరచినను ఆత్మ సంస్కారమున్న వారగుటచే వారును ఈ నియమములను విధిగా పాటించేవారు. గౌరవించేవారు. * పోషించు ప్రభువులే ధర్మబుద్ధి గలిగి యుండుటచే నాటి దాసీలకు గూడా తమ విధ్యుక్త ధర్మమును నెరవేర్చుటకు యెట్టి యాటంకము లేకుండినది. కనుకనే కళలు ఆదర్శవంతముగా నభివృద్ధి జెంది ప్రపంచానికి ఒక దివ్య సందేశము నివ్వగలిగినవి.

---

* తంజావూరు ఆలయ నిర్మాణమును గూర్చి ఒక కథ ప్రచారములో నున్నది. రాజరాజచోళుడు తమిళదేశమును పాలన జేయుచున్న కాలము. అతడు తరుచుగా మారువేషములో తన రాజ్యములో పర్యటన జేసి ప్రజల యోగక్షేమములను తెలిసికొనెడివాడు. అట్టి పర్యటన సమయాన కావేరీనదీతీరాన వున్న ఒక చిన్నగ్రామములో వుండగా, ఒకనాటి రాత్రి పండ్రెండుగంటల సమయమప్పుడు తనకు దగ్గరలోనున్న పూరింటి నుండి గజ్జెల చప్పుడు, సంగీతము, మృదంగవాద్యము విని, అచ్చటకు వెళ్ళి, తలుపుదీసికొని లోనికి ప్రవేశించి తానూ ఒక కళారాధకుడననియు, నృత్యముజూడ అపేక్షతో లోనికి వచ్చితిననియు తెలియజేయును. కాని అతని జూచినవెంటనే ఆ జవ్వని గజ్జెలను విప్పివేయును. ఆ ముదుసలి (ఆమె తండ్రి) మృదంగము కట్టిపెట్టును.

ఆ వృద్ధుడే శిల్పాచార్యుడు గోవిందాచారి. ఆమె యతని ముద్దులపట్టి, అమరనర్తకి కల్యాణి.

మారువేషములో నున్న రాజునకు నిరాశ కలుగును. అతడు అచ్చటనే కొన్నిదినములుండి, యెంత ప్రయత్నించినను, ఆచారి యేదియోఒకఅభ్యంతరముజెప్పి ఆమెచే నాట్యము చేయించెడివాడు గాడు. ఒకనాడు ఆచారి ఊరలేని సమయమున రాజరాజు ఆమెను యెంతయో నిర్బంధపెట్టగా ఆతని మాటను త్రోసివేయలేక ఆమె గజ్జెలు ధరించి నాట్యమాడ సిద్ధమగును. అంత అకస్మాత్తుగా ఆచారి తిరిగివచ్చి—

"నాయనా ధర్మము పాలించవలసిన రాజువు నీకిది ధర్మము గాదు. కల్యాణిని దైవాని కర్పించ దలచాను. ఆమె మానవుల ముందు నాట్యమాడద"ని శాసించును. మారువేషముననున్న తన నెట్లు గుర్తుపట్టెనా, అని విభ్రాంతబోయి. రాజు చూచుచుండగా—

"రాజా! కఠినశిలల దొలిచి సజీవమూర్తుల సృష్టించు నాకు నీ నిజరూపము తెలిసికొనుట ఆశ్చర్యమేముంది. నీవు తలంచిన, బహుకొలది కాలములో నీ కోర్కె నెరవేరగలదు. బృహ

దేవదాసీలను మనపూర్వులెట్టి పవిత్రభావములతో చూచెడివారో తెల్పుటకు ఇచ్చట ద్రాక్షారామాలయమునకు సంబంధించిన ఒక గాథను వ్రాస్తున్నాను.

శైవము, వీరశైవము, పశుపతి సంప్రదాయారాధన ఆంధ్రలో విరివిగా, విజృంభించి వీరవిహారము జేసినకాలము. ఆంధ్రలో యెచ్చట జూచిననూ శివాలయములు కమనీయ శిల్పకళతో కళకళలాడుతూ కనుల పండుగజేయుచూ వెలసినవి. ఆ కాలమునందే పంచారామములు అమరావతి, సామర్లకోట, పాలకొల్లు, ద్రాక్షారామము, భీమవరము మొదలైన చోట్ల వెలసినవి. ద్రాక్షారామమే దక్షవాటిక. ఇచ్చట స్వామి అరాధనకు అనేకమంది దేవదాసీలు* నియమింపబడిరి. ప్రభాత సమయమున భూపాల రాగాలాపనముతో స్వామిని మేల్కొలిపేవారు. సేవసమయములో ఏలలు, అష్టకములు, కందార్థములు, హెచ్చరికలు, ధవళములు, జోలలు, అర్ధచంద్రికలు, మంగళహారతులు మొదలైన వివిధ రకములైన సంగీత రచనలనుపాడి స్వామిని ఆనందపరిచేవారు. వారు భుజంగత్రాస, శుద్ధ, శుభలీలా, కౌస్తుభములు మొదలైన నాట్యములతో సంధ్యా సమయమున కుంభహారతి ముగిసిన పిదప కేళిక సల్పి స్వామికి వినోదము కల్గించెడివారు. ఈ విధమున నృత్యగానాదులతో స్వామిని సేవించుట వారి జీవితాదర్శమై యుండెను. మాణిక్యాంబ ఒక దేవదాసి. ఆమె అతి నియమముతో శాస్త్రీయ నృత్యకళతో స్వామి నారాధించి జీవితము గడపిన భక్తురాలు. తన జీవితసర్వస్వము స్వామి కర్పణము గావించి స్వామిలో నైక్యమైనది. ఆ ఆలయములోని అమ్మవారిపేరు మాణిక్యాంబ. ఈ దేవదాసియే ఆ మాణిక్యాంబ. ఆమె భక్తితో దైవము నారాధించి జన్మను తరింపజేసికొన్న నాటినుండి ఆమెను అమ్మవారుగా ఆ ఊరిప్రజలు తలంచి పూజించుట మొదలుపెట్టిరని తెల్పుదురు.

మన పూర్వులు నాట్యకళను, నాట్యమాడు నర్తకినీ ఎంతటి భక్తిభావముతో జూచెడివారో తెల్పుటకుగాను- నాట్యము జేసే

దీశ్వరునికి ఆలయము నిర్మించుము. స్వామి ప్రతిష్ఠరోజున కళ్యాణి 'పుష్పాంజలి నిస్తుంద'ని తెల్పగా.

రాజరాజు తంజావూరు తిరిగివెళ్ళి అచ్చట బ్రహ్మాండమైన బృహదీశ్వరాలయము నిర్మించెను. కల్యాణి దేవదాసియై నృత్యగానములతో స్వామిని సేవించి జన్మసార్థకము జేసికొనినట్లు, ఆ దేవనర్తకియే ఆ అపరూప శిల్పకళాసృష్టికి కారణమైనట్టును చెప్పుదురు.

శివదాసి:- శివదాసీలు వేరు. బసవిరాండ్రు, పార్వతులు వేరు. దేవదాసీలు భగవంతుని నృత్య సంగీతాదులతో నారాధించు కళారాధకులు. పార్వతులు స్వామిసేవకే గాక, సంఘసేవకై అర్పింపబడిన స్త్రీలు. వీరు గణాచారులు. వీరికి నృత్య సంగీత కళలతో సంబంధములేదు. కొన్ని కొన్ని వ్యవసాయ తెగలకు జెందిన వారు తమ పుత్రికలను భగవంతుని పేరుతో కైంకర్యము జేయుదురు. అట్లు స్వామి కర్పింపబడి ఆయన ఆరాధనలో కాలము గడుపుతూ ఆ యూరిలోని జనుల యొక్క కష్టసుఖములందు ఆదుకొందురు. వీరు నర్తనము సలుపరు. ఈ పార్వతులకు సంబంధించిన ఆచారము హైదరాబాదులో ప్రచారములో నున్న దానిని యిచ్చట వ్రాయుచున్నాను.

*ి గ్రామదేవతల అర్చకులు సాధారణముగా పంచములకు చెందిన వారుందురు. ఆ తెగలోని స్త్రీలు కొందరు భగవత్కైంకర్యము జేయబడుదురు. అట్టి స్త్రీలు దేవీ నవరాత్రులందు 'కలశము' పెట్టిన రోజునుండి ప్రతిదినము పూజలు సలిపి దశమినాడు మహాకాళీ ఆలయమునకు వెళ్ళి, ఆ దేవిని ఆరాధించిన పిమ్మట రంగమెక్కి ఆ సంవత్సర ఫలితములను జెప్పుదురు.

అప్పుడే కుమ్మరి యింటినుండి తెచ్చిన పచ్చికుండను భూమిలో కొంత ద్రవ్వి మంత్రోచ్చారణ జరిపి బోర్లింతురు. రంగమెక్కే స్త్రీ (గణాచారి) అభ్యంగనము చేసి, శరీరమునిండా పసుపు నలదుకొని, ముఖమున పెద్ద కుంకుమబొట్టు పెట్టి, పసుపు రంగు వస్త్రముల ధరించి, ఏవియో మంత్రముల జదువుచూ అచ్చటకు వచ్చును. పూజారులు ఆమె ముందు అగ్నినిపెట్టి, ధూపములను వేయుదురు. అంతనామెకు భగవదావేశము గల్గును. పిమ్మట ఆ పచ్చికుండపై నిలబడి ఆ సంవత్సరమునందు దేశము యొక్క స్థితిగతులు, అతివృష్టి అనావృష్టుల చర్చ, వివిధ ధాన్యముల పంటను, ప్రజల ఆరోగ్యము, సాంఘిక వాతావరణముల గూర్చి యెన్నియో విషయములను తెలుపును. ఆమె చెంత నున్న వారు ఆ విషయములను జాగ్రత్తగా వ్రాసి యుంచుదురు. భగవదావేశము గల్గినప్పుడు ఆమె జెప్పిన ప్రతి వాక్కు నిజమగునట. ఆమె రంగమెక్కినప్పుడు ఆ పచ్చికుండ బ్రద్దలయిన ఆ సంవత్సరము దేశానికి ఘోరవిపత్తు గల్గునని వారు భావింతురు. ఇట్టి నిదర్శనములున్నవట చూచిన పెద్దలు చెప్పుదురు. ఇట్టి గణాచారులే పార్వతులు, బసవిరాండ్రు.

సమయములో నర్తకిని గూర్చి భావనను తెలుపునట్టి యొక చక్కని యుదాహరణము నిచ్చుచున్నాను.*

నాట్యము చేసే సమయములో నర్తించు పాత్రయొక్క అవయవములందు వివిధ దేవతలు ఆశ్రయించి యుందురట. (1) బ్రహ్మరంధ్రమున*- సదాశివుడు. (2) లలాటమున - క్షేత్రపాలుడు. (3) కటిస్థలమున - బుద్ధుడు. (4) మణికట్ల యందు - మహాదేవుడు. (5) హస్తములయందు - స్థిరలక్ష్మి. (6) హస్తాగ్రములయందు-పార్వతి. (7) వక్షమున- శ్రీ మహా విష్ణువు. (8) స్తనద్వయమున — మేరుమందరములు. (9) నాభి యందు — లక్ష్మి. (10) జఘనమున - భూదేవి. (12) ఊరు ద్వంద్వమున — ఇంద్రుడు. (12) జంఘలయందు — బ్రహ్మ. (13) జానువులను - వాయువు. (14) దృష్టులయందు - మన్మ థుడు. (15) రెండు పాదములందు-సూర్యచంద్రులును వుందురు. ఇది అలంకార యుక్తమైనట్టి యొక ఊహా చిత్రముగా మనకు తోచిననూ, ఎట్టి భావములతో నృత్యమును, నర్తకిని గౌరవించి మన కళను పెంపొందించిరో వ్యక్తమగుచున్నది.

ఆరాధన నృత్యకళ యెన్నడు, యెవరిచే, యేరూపములో ప్రచారములోనికి తేబడి, ఆలయ పూజా విధానములో ఒక భాగమైనదో తెల్పుట కష్టము గాని, ఈ కళ అతి ప్రాచీనమై భారతీయ శిల్పులు ఆలయములను, ఆరామములను, స్తూపములను నిర్మించిననాటికే ఒక సంపూర్ణ కళగా రూపొందినట్లు మాత్రము చెప్పగలము. నర్తించు నర్తకులుండినప్పుడే కఠిన శిలలయందు సౌందర్యవంతమైన సజీవమూర్తులను సృష్టించు శిల్పులుగూడ నుండుట తటస్థించును గదా!

ఎన్ని శతాబ్దముల క్రిందట ఏయే దేవనర్తకీమణులు ఆ నృత్యభంగిమలను ప్రదర్శించిరో! ఎన్ని వందల సంవత్సరము లైనదో ఆ నర్తకీమణుల భంగిమలను శిల్పులు శిలలయందు సజీవ పరచినారు. కళలను పోషించిన ప్రభువులు మనకు గానరారు. శిలల రూపొందించిన శిల్పులు కాలవాహినిలో నదృశ్య మైరి. తన కాళ్ళ రత్నమంజీరములు మధుర ధ్వనుల బలుక నర్తనము సల్పిన నర్తకీమణులు తమతమ జన్మలను తరింప జేసి స్వామియం దైక్యమైరి. కాని ఆ యపూర్వ శిల్పము ఆలయ ప్రాకారములపై చెక్కుచెదరక సొంపులీనుచూ నేటికినీ కళల యొక్క సౌందర్యమును,మహత్తును తెలిసికొనగోరి కళాన్వేషణకై దేశములో పర్యటించే కళోపాసకులకు తమ దివ్య సందేశము నిచ్చుచున్నవి. ఏ యాదర్శముతో మన ఋషులు, ఆచార్యులు, శిల్పులు, నర్తకులు, నాట్యకళాకోవిదులు, సంగీత శాస్త్రజ్ఞులు ఈ కళలను సృష్టించిరో ఆ యాదర్శములు ఫలించినవి. వారు ధన్యులు. భారతీయ శిల్పులు, దేవనర్తకీమణులు.

అట్టి కళోపాసకులయొక్క శ్రమ ఫలితమే నేడు మనకు దేశములో మిగిలియున్న అపూర్వ శిల్పసంపద. చిదంబర నటరాజస్వామి ఆలయమందూ, తంజావూరు బృహదీశ్వరాలయ మందూ, కంచి కైలాసనాథ ఆలయమందు నాట్యశాస్త్రములో వర్ణించబడిన 108 శాస్త్రీయ కరణములు- లేపాక్షిలోని రంభనృత్య విన్యాసములు, ఎల్లోరా గుహలలోని శివతాండప భంగిమలు, తాడిపత్రి ఆలయము, రామప్ప గుళ్ళలోని శాస్త్రీయ నృత్య విన్యాసములు- ఇవి అపూర్వ శిల్ప కళాఖండములుగా విరాజిల్లుచూ శాస్త్రీయ నృత్య కళారాధకులకు వారి నృత్యకళను సరిదిద్దుకొను టకు లక్ష్యములుగా నుపకరించుచున్నవి.

ఇక అజంతాలోని చిత్రలేఖనము రసాభినయము (సాత్వి కాభినయము)న కెంతగానో ఉపకరించును. ఏ పవిత్ర మూర్తులైన నర్తకీమణులు ఆ భావ భంగిమలను అభినయించ గలిగిరో గాని, నాగార్జున శిల్పములోని సాత్వికా భావప్రదర్శనకు అనువైనట్టి యా భావభంగిమలను మించినవి మరెచ్చటను మనకు గావ్పిం చవు. ప్రాచీన బౌద్ధ యుగమునాటి నాట్యరీతులను గూర్చిన వివర ములను దెల్పే గ్రంథములు నేడు మనకు యెక్కువగా దొరక కుండిననూ, ఆ సుందర శిల్పమును జూచినప్పుడు మాత్రము- శాస్త్రీయకళలను, నృత్యరీతులను ఎరిగినట్టి నర్తకుడు నాటి నృత్యకళ యొక్క ఔన్నత్యము గ్రహింపగలడు.

ప్రారంభములో నృత్యకళ ప్రత్యేకముగా ఆరాధనకై వినియోగింపబడిననూ, క్రమేణ గర్భాలయములను విడిచి దేవ నర్తకి కల్యాణమండపము వద్ద ఉత్సవమూర్తుల కెదురుగా తన

---

* శ్లో॥ పాత్ర స్యాంగేషు తిష్ఠంతి దేవతాస్సముపాశ్రితాః
బ్రహ్మరంధ్రేస్థితో దేవస్సదాశివ ఇతీరితః
లలాటే క్షేత్రపాలస్తు శాక్యః కట్యంతరే స్థితః
మణిబంధే మహాదేవః పరమేశః స్థితోమహాన్
కరస్థలే ఒచలా లక్ష్మీ కరాగ్రే జయపార్వతీ
వక్షఃస్థలే హృషీకేశః స్తనయోర్మేరు మందరౌ
నాభౌతు దేవతా లక్ష్మీ జఘనే పృథివీ తథా
ఊర్వోర్దేవ స్సహస్రాక్షః జంఘయోః కమలాసనః
జాన్వోశ్చ దేవతా వాయుః దృష్ట్యోశ్చైవ రమాసుతః
ఉభయోః పాదయో రేతౌ చంద్ర సూర్యౌ ప్రకీర్తితా.

కళను ప్రదర్శింప నారంభించెను. నాటి నుండి వారికి తెలియకనే కళలు వాని పవిత్రతను గోల్పోవుటకు ప్రారంభమయ్యెను. వారు శాస్త్రమునకు ప్రాధాన్యము నిచ్చినను తమయొక్క స్వీయానుభవములకు, ప్రజారంజకమైనట్టి హావభావ ప్రదర్శన మునకు, కొంత ప్రాధాన్యతనిచ్చి, ప్రదర్శనములను యిచ్చుట ప్రారంభించిరి. అప్పుట వీరు నృత్త ప్రాధాన్యమైనట్టి కరణ విన్యాసములు గాక, నృత్య అభినయ ప్రాధాన్యమైనట్టి ఆయా ఆలయములకు సంబంధించిన పురాణ గాథలను ప్రదర్శించెడివారు.

ఆలయమునందు మాత్రము శాస్త్రీయ సంప్రదాయాలనే అనుసరించిరి. ఉత్సవ మూర్తులు ఆలయముదాటి * తిరువీధులందు ఊరేగింపులలో బయలుదేరునప్పుడు ఆలయ సంగీత విద్వాంసులు, నాట్యాచార్యులు, నర్తకీమణులుగూడ ఆలయమును విడిచి రాచబాటలయందు తమ విద్యా ప్రదర్శనము గావించిరి. బాటయందు ప్రదర్శింపబడిన నృత్యము చాలావరకు ప్రజారంజకపు కళగా మారి పూర్వపు పవిత్రతను గోల్పోయెను. ఇట్లు ఆరాధన నృత్యకళ కేవల వినోదకళగా రూపొందెను. ఇట్టి నృత్యకళ గణికల (రాజనర్తకీమణుల) ద్వారా రాజదర్బారులందు ప్రవేశించి స్వామికి బదులుగ ప్రభువుల స్తోత్రములతో నిండి ఆస్థానమందు జేరిన పండితుల, రసికజనుల రంజింపజేయు వినోదవిద్యగా పెంపొందినది. కొంతవరకు శాస్త్రమర్యాదలను రాజనర్తకీమణులు పాటించినను, పోషించు ప్రభువుల అభిమతాను సారముగ నర్తించుట వారి విధ్యుక్తధర్మము. ఆ ధర్మమునే వారు పాటించిరి.

ఈ విధముగా ఆరాధన నృత్యము ఆలయమును వీడి, ఆలయ ప్రాంగణమును దాటి, రాచబాటను నడిచి, ప్రభువుల దర్బారు ప్రవేశించి, వారి యభిరుచుల ననుసరించి వన్నెల చిన్నెల నలవరచుకొని తన ఆదర్శమును మరచి, తన యపూర్వ ప్రతిభను గోల్పోవుట మొదలిడినది. దేవదాసీ సాంప్రదాయము త్యాగముతో గూడిన, నియమబద్ధమైన జీవితము. ఆలయములందు స్వామిని తమ నృత్యకళచే నారాధించి, ఆలయము యొక్క ఆదాయములపై నాధారపడి జీవించెడివారు దేవదాసీలు కనుకనే సంఘములో వారికి గౌరవ మెక్కువగా నుండినను, వారి జీవితములు అతి నిరాడంబరముగ నుండెడివి. రాజస్థానమునందు ప్రభువులు, పండితులు, రసికజనులచే నాదరింపబడి, గౌరవింపబడిన గణిక లక్ష్మీప్రసన్నురాలు. సరస్వతీ కటాక్షము, లక్ష్మీ ప్రసన్నము గలిగినట్టి రాజనర్తకీమణుల వైభవోపేతమైన జీవితము దేవదాసీల నాకర్షించిన దనుటలో నాశ్చర్యమేమున్నది?

దేవదాసీలుగూడ లక్ష్మియొక్క చల్లని చూపుల బడయ గోరి తమయొక్క జీవితములను గూడ నాగరక ప్రజలయొక్క అభిరుచుల కనుగుణ్యముగా సరిదిద్దుకొన నారంభించిరి. ఈ విధాన పవిత్ర గంగా జలమువలె నిష్కళంకమైనట్టి దేవరనర్తకిజీవితము నానాటికి దిగజారి అథఃపతనము పొందినది. దీనికి దేవదాసీలు యెంత కారకులో ఆనాటి సాంఘిక వ్యవస్థ కూడ నంతియే కారణము.

ఈ విధముగా కాలక్రమేణ దేవదాసీ వ్యవస్థ యెంతటి దుర్గతి పాలయినను ఆదిలో ఆ నర్తకీమణుల యొక్క త్యాగ నిరతి, ఆధ్యాత్మిక చింతన, కళయందుకృషి, నిస్స్వార్థపరత్వము నేడు మనకు ఆలయములలోని అపూర్వ శిల్పరూపములలో అమర కావ్యములుగ నిలచియున్నవి.

* తిరువీధులు—

ఒక గ్రామములోని దేవతామూర్తికి బ్రహ్మోత్సవ సమయములందు, ఆ మూర్తిని ఊరేగింపునందు గొనిపోవు మార్గమును ప్రత్యేకముగా నాలుగు వీధులయొక్క అష్టదిశలయందు మంత్రపూరితముగా అష్ట దిగ్బంధనమొనర్తురు. అటుల అష్ట దిగ్బంధన మొనర్పబడినట్టి నాలుగు వీధులందు మాత్రమే స్వామి తరలి వెళ్ళును. ఆ సమయములందు ఏ యితర దేవుళ్ళ ఉత్సవములుగాని, ఆ వీధులందు ఊరేగుటకు వీలులేదు. కనుకనే మన పూర్వులు ఒక గ్రామమునందలి ఆయా దేవతామూర్తులకు వేర్వేరు ఋతువులందు ఉత్సవములను యేర్పాటుచేసి యుండిరి.

ఈ అష్టదిగ్బంధన పద్ధతికి చెందినదే ఆలయమునందు ప్రదర్శించే 'నవసంధి' — 'బలిహరణ' నృత్యములు.

# దేవదాసి - పూర్వ చరిత్ర



నరనారాయణుల తపస్సు

*దేవనర్తకి — ఊర్వశి*

దేవదాసీలెవరు ? వారికి ఈ ఆలయనృత్యకళకు సంబంధ మెట్లు గలిగినది ? ఈ విషయములను పరిశీలించెదము.

పూర్వము నర నారాయణులు బదరికావనములో తపస్సు చేయుచుండగా, ఇంద్రునికిది కన్నెఱ్ఱయై వారి తపస్సునకు భంగము కల్గించుటకుగాను, తన యాస్థాన నర్తకి, ఆటపాటల యందారి తేరిన అప్సరస, పన్నెల విసనకఱ్ఱయగు రంభను ఆమె పరివారముతో అచటికంపెను. ఆమె నృత్యగానములతో వారియొక్క తపోదీక్షకు భంగము కలిగించ ప్రయత్నించెను. నారాయణుడది దెలిసికొని, ఇంద్రుని గర్వమణచి, బుద్ధిచెప్పి, జ్ఞానోదయము కలిగించనెంచి తన ఊరువుల నుండి ఒక జవ్వనిని సృష్టించెను. ఆమె అతిలోక లావణ్యవతి. సౌందర్యరాశి. కళాకౌముది. ఆమె కదలికలందు నృత్యకళా సరస్వతి తాండవించు చుండెను. ఆమె యొక్క ప్రతి పలుకూ తేనె లొలుకుచు గానవాహినియై ప్రవహించుచుండెను, ఆ కుసుమ కోమలి పసిడివన్నె తనులత నుండి వెలువడుతున్న దివ్యతేజస్సును జూచి ముల్లోకముల మోహింపగల అందగత్తెనని సౌందర్య గర్వముతో విఱ్ఱవీగు రంభ తన నాట్యమును మఱచి వెలవెల బోవుచు సిగ్గుతో తలవంచుకొని తన తప్పిదమునకు పశ్చాత్తాపము నొందుచూ ఆ ముగ్ధమోహనమూర్తిని జూచుచు నిలువబడెను. వెంటవచ్చిన వాద్యకులు ఆ దివ్యలోక సుందరిని జూచుచు మైమరచి తమ వాద్యగోష్ఠి మాని నిశ్చేష్టులై నిలువబడిరి. ఆ అపరూప సౌందర్యమూర్తియే ఊర్వశి. నారాయణుని ఊరువుల నుండి పుట్టినది గాన 'ఊర్వశి' యని పేరు వచ్చినది.

మువ్వల ధ్వని, మృదంగ వాద్యము ఆగిపోయినంతనే తపోశాలుర తపస్సుకు భంగముకలిగి వుండునని అత్యానందముతో తరలి వచ్చుచున్న ఇంద్రుడు అచ్చటకు చేరినంతనే అవమాన భారముతో కృంగిపోవును. నారాయణుని యొక్క దివ్యత్వము నెఱుగక తాను జేసిన తప్పిదమునకు క్షమించమని వేడుకొనును. శ్రీమన్నారాయణుడు మందహాస వదనార విందుడై, సహస్రాక్షుని క్షమించి, తన ముద్దుల కూతురు నింద్రున కిచ్చి పాణిగ్రహణము జేయును. నాటినుండి ఇంద్రలోకాని కొక అలంకారమై ఊర్వశి విరాజిల్లెను. ఆమె యొక్క సంతానమే దేవదాసీలు. నారాయణాంశ గలవారగుటచే వీరు ఆలయములందు స్వామి పూజలందు పాల్గొనుటకు, ఛత్ర చామరములను వీచుటయందు, కుంభహారతి నిచ్చుటకు, స్వామిని నృత్యగానములతో ఆరాధించుటకు మన పూర్వులు దేవదాసీలను నియోగించిరి. ఈ ప్రత్యేక తెగవారు మాత్రము ఆలయములందు నృత్యమాడుట కర్హులు. రంభ మొదలయిన యితర అప్సరసల వంశీయులు రాజదర్బారులందు, సభలందు నాట్య వినోదముల సల్పినను ఆరాధన నృత్యములందు వారికి తావులేదు. ఆలయ సింహద్వారము దాటి గజ్జె కట్టే



నారాయణుని ఊరువుల నుండి ఊర్వశి పుట్టుక

యర్హత వారికి లేదు. తాను కోరినచో దేవనర్తకి రాజసభలందు నాట్యము చేయవచ్చును. ఆ స్వేచ్ఛయే మన ఆరాధన కళ యంత రించుట కొక ముఖ్య కారణముగా జెప్పవచ్చును.

దేవదాసి తెగయందు పుట్టినంత మాత్రమున ప్రతి బాలిక ఆలయ నర్తకి కాలేదు. ఆలయ విధుల ననుసరించి క్రమము దప్పక ఆరాధన పద్ధతుల, నృత్యవిన్యాసముల నభ్యసించిన పిదప భగవంతుని సాన్నిధ్యములో ముద్రవేయబడి, పరీక్షింపబడిన నర్తకి మాత్రము ఆలయములో నాడెడిది. ఇతరులు దేవదాసీ లయినను, స్వామి సన్నిధిలో 'పుష్పాంజలి' నర్పించు యర్హత వారికి లేదు. ఇట్టి సంప్రదాయముల నెఱిగిన దేవనర్తకీమణులు సంఘములో చాల గౌరవింప బడేవారు. వివాహాది శుభకార్యము లందు వారియొక్క రాకను శుభ సూచకముగా నెంచెడివారు.

దేవదాసీలను ముఖ్యముగా రెండు విధములుగా విభజింప వచ్చును. విష్ణుదాసీలు, శివదాసీలు. శిక్షణా క్రమము చాలావరకు ఒక్కటే. అయినను, వీరియొక్క నృత్యములందు భేదము కన బడుచున్నది. శైవసంప్రదాయ నృత్యము, ఉద్ధతమైన కరణాంగ హారముల విన్యాసములతో, గంభీర భావ ప్రకటనతో విరాజిల్లు చుండును. కోమలమై, భావ ప్రాధాన్యత గల్గి, సుకుమారకరణాంగ హారములతో అలరారుచుండునట్టిది. వైష్ణవ సంప్రదాయనృత్యము. అష్ట దిక్పాలకులు మొదలైన ప్రత్యేక మూర్తుల ముందు ప్రద ర్శింప బడిన కరణములు, జతులు, గతులు, తాళములు, తీర్మాన ములు చాలవరకు పోలియుండినను, విన్యాసక్రమములో భేద ముండును. అంబ ఆలయాలలో నృత్యారాధన, శివాలయాలలో నృత్య ములు అంతయూ ఒక్కటియే. 'నాంది' క్రమములో మాత్రము తేడాలు ఉన్నవి. ఈ వివరములు నృత్యములగూర్చి వ్రాసినప్పుడు చర్చించుతాను.

# బలిద్వీప దేవదాసీల 'సాంగ్‌యాంగ్' నృత్యము

దేవదాసీల నృత్యము యెట్టి పవిత్ర భావములతో నిండి యుండెనో, ఆరాధన నృత్యము యెట్టి కఠిన నియమములతో గూడినట్టిదో, దేవదాసీ లెంత పవిత్రమూర్తులుగా చూడబడుచుం డెడివారో తెలుపునట్టి బలిద్వీపపు హిందువుల 'సాంగ్‌యాంగ్' నృత్యమును నేను బలిద్వీపములో నుండగా జూచినది యిక్కడ వర్ణించుచున్నాను. మన దేశములో అంతరించి పోయినను, నేటికీ ఈ సంప్రదాయము బలిద్వీపములో నిలిచియున్నది.

ఢింగ్ ఢాంగ్ . . .
ఢింగ్ ఢాంగ్ . . .
ఢింగ్ ఢాంగ్ . . .

గమ్మేళన (బలిద్వీపము వారి ఆర్కెష్ట్రా) గంటలు మధుర ముగా పలుకుచున్నవి.

ఉదయము సుమారు ఆరు గంటలవుచున్నది. సముద్ర గర్భములో నుండి పైకి వస్తున్న ప్రభాత భానుని లేత కిరణము లకు విష్ణుదేవాలయపు బంగారు గోపురము తళతళ మెరుస్తున్నది.

"ధంగ్‌త - ధంగ్‌త - ధంగ్
ధంగ్‌త - ధంగ్‌త - ధంగ్"

గుడిలోని నగారా ధ్వనించుట మొదలు పెట్టినది. 'జయ మాధవా, జయమాధవా, జయమధుసూదనా, జయమహావిష్ణు'

ఆ ప్రశాంత ప్రదేశమంతా జయ జయ నాదములతో ప్రతిధ్వనించుచున్నది.

స్నానముచేసి, ముడివేయక వదలిన శిరోజములపై పచ్చని పూవుల ధరించిన బలిదేశపు వనితలు దేవళమునకు త్వరత్వరగా నడుస్తున్నారు.

'జయమధుసూదనా, జయమధుసూదనా'

వక్షస్థలముల్ల వరకు సీతాకోకచిలుక రంగుల, పువ్వుల సరోంగులు (బలి ద్వీపపు స్త్రీలు ధరించే వస్త్రములు) ధరించి ఒక చేతిలో పళ్లెములో కొన్ని పండ్లు పట్టుకొని కొందరు భక్తు రాండ్రు విష్ణు దేవళము చేరుచున్నారు.

'జయ మహావిష్ణు, జయ మహావిష్ణు'

రాత్రి అంతా ప్రియవియోగము ననుభవించి అరుణోదయ సమయానికి సరోవర గర్భము నుండి పైకివచ్చి తమ నవ్వు ముఖాలతో అరుణు నాహ్వానించు తామర పువ్వులను చేతబట్టి బలిద్వీపపు బాలికలు, ముడివేయక వదలిన తమ శిరోజములు వాయుదేవునితో మేలమాడుచుండగా, దేవాలయము వైపునకు పరుగెత్తుచున్నారు.

'జయమాధవా, జయ మధుసూదనా'

స్త్రీలు, పురుషులు, వృద్ధులు, యువకులు అందరు ఆలయ ప్రాంగణములో చేరారు.

'ధంగ్‌త ధంగ్‌త ధంగ్
ధంగ్‌త ధంగ్‌త ధంగ్
ధంగ్‌త ధంగ్‌త ధంగ్
ధంగ్‌త ధంగ్‌త ధంగ్'

గమ్మేళన వడిగా వాయించుచున్నారు. నగారా జోరుగా మ్రోగుచున్నది. 'ఓం' అని శంఖనాదము వినబడుచున్నది. గణ గణమని దేవాలయమున గంటలు మ్రోగుచున్నవి.

పూజారి విష్ణువు ముందున్న తెరను తీశాడు.
'జయమహావిష్ణు, జయమహావిష్ణు, జయమహావిష్ణు'

భక్తులు మిన్నునంటునట్లు కంఠమెత్తి విష్ణుస్తోత్రము చేస్తున్నారు. వారి నేత్రములు ఆనందాశ్రువులతో నిండినవి. ఉల్లాసముతో చేతులు తట్టుచూ విష్ణు గీతములను పాడుచున్నారు.

'తద్దంగ్...........'

అందరూ కన్నులు మూసికొని, ఒక్క నిముసము నిశ్శబ్ద ముగా నిలువబడినారు.

గమ్మేళన విలంబితలయలో మధుర ధ్వనుల వెల్లిగక్కు చున్నది. డెబ్బది సంవత్సరముల ముదుసలి దేవతా స్వరూపులగు యిద్దరు బాలికలతో ప్రవేశించినది. బంగారు ఛాయగల వారి శరీరము పసుపు రాయుటచే పచ్చగా మెరుస్తున్నది. పసుపు పచ్చని సరోంగు, జల్తారు నగిషీ పని చేయబడిన పసుపు పచ్చని జాకెట్టులు ధరించిరి ఆ బాలికలు. చేతులకు, మెడలోను పూలమాల లున్నవి. నొసట రక్తవర్ణపు తిలకము దిద్దారు.

మహావిష్ణుమూర్తిని తిలకిస్తూ ఆ మూర్తి కెదురుగా నిల బడినారు ఆ బాలికలిద్దరు. వారి ముందున్న ముత్యపు చిప్పలోని అగ్నిలో వేయబడిన సాంబ్రాణి పొగ వారి శరీరముల మీదికి ప్రాకుచున్నది.

'ధంగ్‌త ధంగ్‌త దిడ దిడ
ధంగ్‌త ధంగ్‌త ధంగ్'

గమ్మేళన గట్టిగా మ్రోగుట మొదలు పెట్టినది. ఇద్దరు బాలికలూ పతాక హస్తములను పట్టి నిలువబడిరి.

'జయదేవ – జయదేవ
జయమాధవా'

అక్కడ చేరిన స్త్రీ కంఠములు గమ్మేళనతో చేరి పాడు చున్నవి. ఆ బాలికలు నృత్యమాడ మొదలు పెట్టిరి. ఇది మన నృత్యములోని 'పుష్పాంజలి'ని పోలియుండును. ఇది ప్రార్థనా నృత్యము.

గమ్మేళన వడిగా మ్రోగుచున్నది. బాలికల నృత్యము గూడ త్వరిత గతిలో జరుగుచున్నది. మంచి ముత్యములను బోలు చెమట బిందువులు వారి శరీరము నుండి రాలుచున్నవి. ఆ బాలికలు నృత్యము చేసిచేసి స్మారకము తప్పిపోవు స్థితికి వచ్చిరి. ఇద్దరు స్త్రీలు వెళ్ళి వారిని పట్టుకున్నారు. వారి శరీర ములపై ధారగా కారుచున్న స్వేదమంతా గుడ్డతో అద్దిరి. పూజారి గర్భగుడి నుండి తళతళ మెరయుచున్న అతిసుందరమైన రెండు బంగారు కిరీటములను దెచ్చి ఆ బాలికల శిరముల నలంకరించి నాడు. (నృత్యముచేయు బాలికలకు భగవదావేశము గలిగినదని తెలిసినపుడే అర్చకుడు ఆ కిరీటములను వారి శిరములపైనుంచును. ఇతరులా కిరీటము ధరించుట కర్హులుగారని వారి దృఢవిశ్వాసము.)

విష్ణు పాదముల వద్దనున్న పుష్పములు, తులసి తెచ్చి వారి చేతులలో నుంచును. వారల్లే ఒక నిముసము నిలువబడి రెండు చేతులను శిరముపైకెత్తి జోడించి నమస్కరించిరి.

మరల గమ్మేళన పాడుట మొదలయినది. స్త్రీలు పురు షులు, బాలురు, బాలికలు, వృద్ధులు అందరూ చేరి స్తోత్ర గీత ములను పాడుచున్నారు. బాలికలు తమ నృత్యము ప్రారంభించిరి.

ఇది అసలు దేవదాసీల నృత్యము.

తమ శరీరములోని అంగ ప్రత్యంగములను, గమ్మేళనా సంగీతము ననుసరించి విన్యాసము చేసినప్పుడు, హంస గమ నముతో భగవంతుని చేరునప్పుడు, భారతదేశ ప్రాచీన కళను మనము మరచిపోయిన మన దేవదాసీల కళను బలి ద్వీపము

మరల మనకు నేర్పుటకు చెక్కు చెదరకుండ తన గర్భములో దాచియుంచినదా యని అనిపించును. వారు నృత్యరేఖలు, చారులు, కరణులు ప్రదర్శించినప్పుడు భరతకళామూర్తి వారిలో ప్రత్యక్షమవుతుంది. ఆ భక్తులందరూ గూడి స్తోత్రగీతములు పాడినప్పుడు హోమము ముగిసిన తరువాత ఇంద్రవరుణుల స్తోత్రము చేయుచూ వేదములను పఠించిన వేదకాలపు మనపూర్వులు జ్ఞాపకము వత్తురు.

ధన్యులహో ! బలిద్వీప ప్రజలారా ! !
ధన్యులహో ! బలిద్వీప దేవదాసీలారా ! !

నృత్యము ముగిసినది. ఆ బాలికల నిద్దరిని రెండు కుర్చీలపై ఆసీనుల చేసిరి. వ్యాధిగ్రస్తులైన కొందరు ప్రజలు ఆ బాలికల పాదముల ముందు సాష్టాంగపడి, పాదముల స్పృశించి పోవుచున్నారు. కొందరు స్త్రీలు ఆ బాలికల మెడలోని పుష్పమాల లోని ఒక్కొక్క పూవును తీసి అతిభక్తితో కండ్ల కద్దుకొని యిండకు తీసికొని పోవుచున్నారు.

ఆ సమయములో ఆ దేవదాసీ బాలికల స్వరూపము చూచిన ప్రతి యొక్కరు స్వర్గమునుండి దిగివచ్చిన దేవతామూర్తులవలె ఆ బాలికలను భావించుచుండిరి.

వీరే బలిద్వీపపు దేవదాసీలు. భగవంతుని సేవకురాండ్రు. వారికి, ఈ ప్రపంచ సౌఖ్యములకు, యే విధమైన సంబంధము లేదు. వారు సభలలో నృత్యమాడరు. జీవితమును భగవత్సేవలో గడుపుటయే వారి ముఖ్యోద్దేశము, మహదాశయము. శివుని జడల నుండి స్రవించు గంగా జలమువలె వారి జీవితములు స్వచ్ఛములు. అతి పవిత్రములు.

పవిత్రాశయములతో గూడిన యిట్టి దేవదాసీ సంస్థ లంతరించి పోయినను, మహోజ్జ్వలమైన దేవదాసీ నృత్యము మనదేశములో అంతర్ధానమొందినను, వేదకాలమునాటి హైందవ సంప్రదాయములను నేటివఱకు పాటించుచున్న ప్రపంచము యొక్క మారు మూలలో నున్న బలిద్వీపములో మాత్రము యింకను నిలిచియున్నది. వారికి సుమాంజలి.



# గురు చరణముల వద్ద దేవనర్తకి



దేవనర్తకిగా నర్తించదలంచిన బాలికకు సంప్రదాయ సిద్ధముగా, శాస్త్రీయ విధానము ననుసరించి చిరుత ప్రాయమునుండే శిక్షణివ్వబడును. బాలికకు ఐదు సంవత్సరముల వయస్సు వచ్చినంతనే శిక్షణ ప్రారంభమగును. ఒక శుభ ముహూర్తము నిశ్చయించి ఆ రోజున సూర్యోదయమునకు పూర్వమే బాలికకు అభ్యంగనము జేయించి కొత్త వస్త్రములు ధరింపజేయుదురు.

నాట్యాచార్యుడు కలశస్థాపన జేసి, గౌరీదేవిని విఘ్నేశ్వరుని, గజ్జెలను, తాళములను, నాట్యపీఠమును, చిరుతలను పూజ చేయును. అటుపై పంచరంగుల ముగ్గుతో అష్టదిక్పాలకుల ఆరాధనకు యెనిమిది కోణములు వచ్చునట్లు ఎనిమిది పద్మముల ఆకారములో ముగ్గును వేసి ముందుగా తమ యిష్టదైవమును (శైవ సంప్రదాయమైన పరమశివుని, వైష్ణవ సంప్రదాయమైన విష్ణువును) అష్టదిక్పాలకుల ఆసనముల మధ్యగా వేయబడిన ఓంకార పీఠముపై మంత్ర పూరితముగా ప్రతిష్ఠింప జేసి, తరువాత అష్టదిక్పాలకులను స్తోత్ర గీతములతో ఆహ్వానించి అధిష్టింప జేయును. చందన తాంబూలము, ఐదు రకముల ఫలములు, పంచవన్నెల పువ్వులు, అక్షతలు, అత్తరు, పన్నీరులతో, బంగారు, వెండి, రాగి నాణెముల దక్షిణతో ఆ దేవతల పూజించి వారికి వస్త్ర సమర్పణము జేయును. ఈ వస్త్రము తొమ్మిది మూరలు గాని, తొమ్మిది జానలు గాని పొడవు గల్గి అంచులేని సన్నని తెల్లని వస్త్రమై యుండవలెను.

పిమ్మట కలశస్థాపన జేసిన స్థలమున కెదురుగా ఆరు కోణములు వచ్చునట్లు ముగ్గువేసి, అచ్చట 7, 9, లేక 11 మూని కల—ఈ విధముగా బేసి అంకెలలో—వడ్లుగాని, బియ్యముగాని ఆ ముగ్గుపై బోసి 'తాళ పీఠము' విధముగా చౌకముజేసి అచ్చట గూడా పూజ జేసిన పిదప నాట్యోపదేశము చేయబడు బాలికను అచ్చటకు గొనివత్తురు. ఆమె కాళ్లకు పారాణి, నొసట కర్పూర నామము (వైష్ణవమైనచో) ధరింపజేసి, ఆ వడ్లపై కుడికాలు



ముందుగా మోపి అటుపై యెడమకాలు పెట్టి *సమభంగిమయందు నిలువబడిన తరువాత ఆ బాలిక కట్టిన పుట్టమును కాసెబోసి కట్టించి పూజలో నుంచిన గజ్జెలను గురువుగారు ఆమె కాళ్లకు ధరింప జేయును. తరువాత పుష్పములు, దక్షిణ ఆ బాలిక చేతిలో ఉంచబడును. ఆచార్యుడు చూర్ణికను పఠించిన పిదప !పుష్పములు, దక్షిణ గురువుగారికి సమర్పించును. ఆయన బాలిక రెండుకాళ్లను తన రెండు చేతులతో పట్టుకొని, తాళధారి తాళము వేయగా, మార్దంగికుడు మృదంగమును పలికించగా

'తాతై – తాతై – తాతై – తాతై'

అని ప్రథమ అడవులు వేయించును. పిమ్మట 'వినాయక తాళము'లో 'గణపతి కవుతము' నకు అడవులు వేయించును. **గురువందన క్రమము జెప్పించి గజ్జెలను విప్పివేయును. అంతటితో విద్యోపదేశము ముగియును.

మల్లాము—

మరునాటి ఉదయము 'మల్లాము సాము', తొక్కాటముతో, నృత్య శిక్షణ ప్రారంభమగును.

మెత్తని దర్భచాపపై విద్యార్థినిని భూమివైపు ముఖము జేసి పరుండజేసి—మెడను, జబ్బలను, మోచేతులు, మోకాళ్లు, కీళ్లు, మణికట్లు, నడుము, వెన్నెముక మొదలైన వివిధ ప్రత్యంగోపాంగములను కొన్ని యోషధులతో ప్రత్యేకముగా తయారు జేసిన తైలము వ్రాసి మర్దింతురు. ఈ తైలములను తయారుజేయు విధము, మర్దన జేయు క్రమము అతి రహస్యముగా ఉంచబడును. ఈ క్రమము ననుసరించియే నర్తకి యొక్క భావి నాట్యకళా

---

* గురు వందనము.

హృదయమున కెదురుగా రెండుచేతులందు శిఖర హస్తములను పట్టి, బొటనవ్రేళ్ల భుజముల కానించుచూ ముందునకు దెచ్చి, ముంగాళ్ల పై కూర్చొని, శిఖర హస్తముల విప్పి, పతాకములుగా కూర్చి, భూమి కానించి మరల సమస్థానములో నిలిచి నమస్కరించుట.

శిఖరము—అన్ని వ్రేళ్లను అరచేతిలోనికి ముడిచి, బొటనవ్రేలు చాచి పట్టిన శిఖరమగును.

పతాకము—చేతి అన్ని వ్రేళ్లను జేర్చి చాచిపట్టిన పతాకమగును. ఇది ఆది హస్తము. అన్నిహస్తములకు మాతృక.

** సమభంగిమ.

రెండుకాళ్లను దగ్గరగా జేర్చి వంపులేక నిలువబడవలెను. చేతులు డోలాహస్తములుగా గాని, లేక అర్ధ చంద్ర హస్తములు పట్టి నడుముపై జేర్చిగాని యుంచవలెను. దృష్టి నిశ్చలమై యుండవలెను.

డోలాహస్తము—రెండు ప్రక్కలకు చేతులను సహజముగా జారవిడిచి యుంచుట డోలాహస్తమనబడును.

అర్ధచంద్ర—హస్తము యొక్క చూపుడు వ్రేలు మొదలుకొని నాలుగు వ్రేళ్ల చేర్చియుంచి, బొటన వ్రేళ్ల విడదీసి చాచి పట్టిన అర్ధ చంద్ర హస్తమగును.

విన్యాసము, భంగిమల సొగసు, అడవుల యందము, హస్తముల పొందిక యుండును గాన ఈ క్రమమునందు సాముజేయునప్పుడు అన్యులను రానీయరు. నడుము, వెన్నెముక, జబ్బలు చక్కగా మర్దించిన పిదప, మరల విద్యార్థిని వీపుపై తిరిగి పండుకొనును. అప్పుడు ఛాతి, ఉదరము, మెడ, మోకాళ్లు, పిలమండలు, మోచేతులు మరల మర్దింతురు. ఈ విధముగ ఒక గంట మర్దన అయిన తరువాత మొగ్గలు వ్రాలుట, పిల్లిమొగ్గలు (ప్లవనములు) వేయుట, హస్తములు వివిధ లయలలో చలించుట, వాలుట, ముడుచుట, వివిధ పద్ధతుల నడచుట, గాలిలో ఎగురుట, పలు యములు తిరుగుట, ఉచ్ఛ్వాస నిశ్వాసములను స్వాధీనము నందుంచుకొనుటకు ప్రాణాయామము యొక్క అభ్యాసము. వివిధము లైన అనేక క్రమములు అభ్యసించబడును. ఈ సాము ముగియుటకు సుమారు ఆరునెలలు పట్టును. సాము ముగియునప్పటికి విద్యార్థి శరీరములోని ప్రతి అవయవము పూర్తిగా స్వాధీనము లోనికి వచ్చుటయే గాక, ఏ విధాన మనము మలచ దలంచిన ఆ విధముగ ఆ భంగిమలో ఆ గతిలో శరీరము మలచ వచ్చును. కావలసినట్లు శరీరమును మట్టివేయ వచ్చును. బొంగరమువలె గిరగిర నిముషముల కొలది భూమిపై కాలు ఆనించక తిరుగ వచ్చును. గాలిలో ఎగిరి పలుయములు చుట్టి భూమిపై వ్రాలవచ్చును. కరిగిన శిలవలె శరీరమును ఘనీభవింప జేయవచ్చును. చిరుగాలికి వెన్నవలె శరీరములోని ప్రతి అవయవము కరగి ప్రవహించుచున్నట్లు, కండరముల సంఘము వల్ల కదలిక వలన చూపరులకు భ్రమ కలిగించవచ్చును.

ఈ మల్లాముసాము జేయుట వల్లనే నర్తకి నృత్త నృత్యములు ప్రదర్శించు సమయము నందు వివిధ భంగిమలను, కరణములను శిల్ప ప్రతిమలవలె ప్రదర్శించి వెను వెంటనే రసాభినయమందు సుకుమారమైన అంగవిన్యాసముల ప్రదర్శించ గలుగుచున్నది.

సాము ముగిసిన పిదప వివిధరకములైన *"అడవులు" 'తై' అడవులు, 'దిత్తై' అడవులు, తాదిత్తై, తైయ్యందత్తా, తైయ్యాతై, తైదిత్తితై, మండి, ఒద్దిక, జారు, బిరుగు జారీ క్రమముగా చెప్పించబడును.

విస్తృత సంయుత, అసంయుత నృత్త, నృత్యహస్తములు, నూటయెనిమిది కరణముల విన్యాసము, నవరస అంగహార క్రమము, పందొమ్మిది విధములైన గ్రీవా భేదములు.

మూడు విధములైన దృష్టి భేదములు
ఎనిమిది విధముల రసదృష్టి
ఎనిమిది విధముల స్థాయీభావదృష్టి
ఇరువది విధముల వ్యభిచారి భావ దృష్టి
ఇరువది తొమ్మిది విధములైన పదవిన్యాసములు
ముప్పది రెండు స్థానకములు
నూట యెనిమిది తాళములు
తొమ్మిది విధముల ఆకాశచారులు
పదహారు విధముల భూచారులు
నవరసముల అభినయ క్రమము
దశవిధ సాత్త్వికముల ప్రదర్శన పద్ధతి
నాట్య, నృత్య, నృత్త విభేదములు
లాస్య తాండవ విన్యాసములు.

శృంగనృత్య విధానము, సప్తతాండవ క్రమము, కౌతుకము, పుష్పాంజలి మొదలగునవి సంపూర్ణముగా చెప్పించబడును. ఈ శిక్షణ సమయమందు ఆచార్యుడు కరణాంగ హార విన్యాస

---

* అడవులు.

'అడవులు' వేరు—'అడుగులు' వేరు. రెండునూ ఒకటిగాదు. వివిధ తాళములందు రచింపబడిన పాటలకు లయకు తగినట్లు పాదముతో తాళము కట్టుచూ ఆడుట 'అడుగు' అనబడును. నాట్య శాస్త్రములో చెప్పబడిన కొలతల ననుసరించి పాదమును వివిధ పద్ధతులలో వేయుచూ, దానికి తగినట్లు నృత్త హస్తమును పట్టి, కాలి యొక్క గతి ననుసరించి చేతితో గూడా విన్యాసముచేసి ముగించుట 'అడవు' అనబడును. కాలి, చేతి యొక్క ప్రతి కదలికకూ ప్రత్యేక శబ్దములు—తై, దితై, తైయ్యాతై, తాదితై అని ఈ విధమైనట్టివి ఉన్నవి. అడవుల యొక్క కూర్పే జతులగుచున్నవి. ఈ అడవులను నాట్యశాస్త్రములో చెప్పబడిన కరణములుగాను, వీని యొక్క కలయికతో ఏర్పడే జతులను అంగహారములుగ చెప్పవచ్చును. మరియు ఈ అడవుల అభ్యాసము వివిధ తాళములలో వుండే అంగసంజ్ఞల (గురువు, లఘువు, ప్లుతము, కాకపాదము మొదలైనవి.) వాడుక విధానము వలె శాస్త్రీయ క్రమము ననుసరించి యేర్పరుపబడినట్టివి. ఈ అడవులే కాలి మునివేళ్లపై మండెగా కూర్చొని విన్యాసము చేసిన, నేల అడవులు లేక భూచారి క్రమమనియు నిలువబడి విన్యాసము జేసిన ఆకాశచారి క్రమమనియు చెప్పుట గూడా కలదు. వీనిని గూర్చిన వివరములు విపులముగా కరణములు, అంగహారముల గూర్చి వ్రాసిన చోట చర్చించెదను.

ముల జెప్పి, అభినయ మందు సౌకుమార్యమును సరిదిద్దుటకు గాను చిరకాలము నృత్య ప్రదర్శనముల నిచ్చి విరమించిన వృద్ధ దేవదాసి యొక్క సహకారముతో 'అంగశుద్ధి' క్రియను ముగించును.

ప్రారంభము నుండియు సంస్కృతము, మాతృభాష, గాత్ర సంగీతములందు శిక్షణ యివ్వబడును. ఇవియు ముగియుటకు సుమారు ఐదు సంవత్సరములు పట్టును. అనగా పదవ సంవత్సరమునకు విద్యార్థికి శాస్త్ర పరిచయము లభించును.

తరువాత పై విధముగా నేర్చిన వివిధ విన్యాసము లను చేర్చి వివిధ నృత్యములుగా సమకూర్చి అభ్యసింప చేతురు.

గాత్ర సంగీతము—ఆలయములో దేవుని సముఖమందు స్వామిపై పాడే గీతములకు అభినయము ప్రదర్శించునప్పుడు, పుష్పాంజలి సమర్పించునప్పుడు నర్తకి తానే స్వయముగా పాడవలెను గాన గాత్ర సంగీత సాధన ఉపయోగపడును.

గీర్వాణ భాషాజ్ఞానము పుష్పాంజలి సమర్పించునప్పుడు చదివే చూర్ణికలు, అష్టకములు, అష్టదిక్పాలకారాధనా స్తుతిగీతములు మొదలైన సంస్కృత రచనల పఠనము చేసికొనుటకు.— తెనుగునందు పాండిత్యము, కేళిక సమయములో పాడే పదములు, వర్ణములు, జక్కిణీ శబ్దములు, దరువులు, సలాములు, వృత్తములు మొదలైన వాని యొక్క అర్థమును తెలిసికొని భావము నభినయించుటకు సహాయ పడును.

కరణములను, అంగహారములను, గతులను, తాళములను ఉపయోగించి.

పుష్పాంజలి నృత్తము (మేళప్రాప్తి), పేరిణి, ప్రేంఖణ, శుద్ధ, దేశి, దండిక మొదలైన సప్తలాస్యములు, నవసంధి నృత్యములు, పంచ కౌస్తుభ నృత్యములు, జోహారు శబ్దములు —

కళ్యాణ మంటపము వద్ద స్వామి కొలువు దీరినప్పుడు ప్రదర్శింపబడు 'కేళిక' (యేక పాత్ర నృత్యములోని)

మేళప్రాప్తి, అలరింపు, స్వరపల్లవి, శబ్దపల్లవి, సాహిత్య పల్లవులకు నృత్తము—

శబ్దములు, జక్కిణీ దరువులు, సలాము జతులు, స్వర జతులు, పదవర్ణములు, మొదలైన రచనలకు నృత్త, నృత్య ములు—శ్లోకములు, వృత్తములు, పదములు, జావళీలు, గీతములు, కీర్తనలకు రసాభినయము—

భామా కలాపము, గొల్ల కలాపము, రాధామాధవము, క్షీరసాగర మథనము, మొదలైన కలాపములు—

శైవవైష్ణవ సంప్రదాయముల ననుసరించి రచింపబడిన సుందరేశ విలాసము, విష్ణు పల్లకి సేవా ప్రబంధము, శివపల్లకి సేవా ప్రబంధము, కృష్ణ పారిజాతము, గిరిజా కల్యాణము మొదలైన యక్షగానములకు – నాట్య, నృత్య, నృత్తాభినయము – నాట్యధర్మి, లోకధర్మి, లాస్య, తాండవ విధానముల ననుసరించి ఆచార్యుడు అభ్యసింప జేయును.

ఈ శిక్షణమంతయు ముగిసి నర్తకి తానే స్వయముగా పాడుచూ, ఆ పాటల యొక్క అర్థమును తెలిసి క్రమము తప్పక అభినయించు సామర్థ్యము సంపాదించుటకు మరియొక నాలుగు సంవత్సరములైనను పట్టును. అనగా పదునాల్గవ సంవత్సరమునకు ఆమె విద్యాభ్యాసము ముగియును. యుక్తవయస్సు వచ్చిన తరువాత ఆలయములో ముద్రధారణ జేయుదురు.

## సహాత్రేణ మహోత్సవము

### [ ము ద్ర ధా ర ణ ]

ఒక శుభ ముహూర్తమున ప్రాతఃకాలమున ఆలయములో స్వామి సన్నిధిని ముద్రధారణ మహాకార్యము చేయును. నర్తకి అభ్యంగనము జేసి, పసుపు పచ్చ పట్టు వస్త్రములు ధరించి ఆలయము చేరును. అచ్చట పురోహితుడు పూజాదికములు ముగించి హోమము జేసి—వెండితో చేయబడిన శంఖము, చక్రము, నామముతో గూడిన చక్రము— ఈ మూడు ముద్రలు హోమాగ్నిలో కాల్చి – శంఖము ఎడమభుజముపై, చక్రము కుడి భుజముపై, నామముతో కూడిన చక్రము వక్షస్థలము మధ్యపైనను (ఇది వైష్ణవ సంప్రదాయము) నర్తకి యొక్క విద్యను పూర్తిగా పరీక్షించి, ఆమె నియమబద్ధమైన జీవితము నాటినుండి గడుపునదని నమ్మకము పోసిన తరువాత, ముద్ర ధారణ చేయుదురు. ఆమెకు మంత్రోపదేశము జరుగును. అప్పటి నుండి ఆమె ఆలయములో నాట్యమాడుటకు అర్హత సంపాదించును. దీక్ష కాగని నర్తకి యింత శ్రమించి విద్య నేర్చినను, ఆలయ నాట్యమున కర్హురాలుగాదు. ఆమె ఎంత పండితురాలైనను, నాటినుండి సంఘమునందు చిన్నచూపు జూడబడును. సభలందు నాట్యమాడి జీవించవచ్చును. నాటి సాయంత్రము ప్రథమ పర్యాయముగా ఆమె ఆలయములో స్వామికి కుంభహారతినిచ్చి, పుష్పాంజలి సమర్పించి మేళప్రాప్తి, కౌస్తుభ నాట్యముల నాడును. స్వామి కొలువై యుండగా ఆయన దర్బారులో 'కేళిక' జరిపి స్వామికి వినోదము చేకూర్చును. నాటి నుండే ఆమెకు దేవదాసీత్వము ప్రాప్తించును. ఆమె ఆ దేవదేవుని పాలిటి దేవదాసి. ఆ భగవంతుని తన స్వామిగా స్వీకరించి ఆయన సేవలో జీవితము గడపి జన్మతరింప జేసికొనును.

# శాస్త్ర చర్చ

(ఈ గ్రంథములో పంచమవేదమను పేరుతో నాట్యశాస్త్రమును గురించి ప్రత్యేకముగా చర్చించియున్నాను. ఇచ్చట మరల శాస్త్ర విషయములు చర్చించుటకు గల కారణము—

సాధారణముగా లోకములో నృత్యకళను గురించి చెప్పునప్పుడు నాట్య శాస్త్రమును ప్రమాణ గ్రంథముగా చెప్పుట ఆచారముగా యున్నది. నాట్యశాస్త్రము నాటక కళకు, రసాభినయమునకు ఎక్కువగా ఉపయోగపడినను. దేవదాసీల నర్తన విద్య మాత్రము నందికేశ్వరుని 'భరతార్ణవము.' ఆ గ్రంథము యొక్క సంక్షిప్తగ్రంథము 'అభినయ దర్పణము' పై నాధారపడి, యొక విశిష్ట సంప్రదాయముగా రూపొందినది. ఈ సంప్రదాయమందు పట్టుహస్తములు, పాదగతి విన్యాసములందు, చారికరణ ప్రదర్శనమందు ననేక భేదములు కనబడుచున్నవి. కనుక ఇచ్చట ప్రత్యేకముగా భరతార్ణవమందు చెప్పిన శాస్త్రీయ విషయములు గురించి మరల వినికిడి చేయుచున్నాను. నాట్యశాస్త్ర చర్చలో విపులముగా తెల్పిన విషయము లిచ్చట సంక్షిప్తముగను, అచ్చట వివరముగా తెల్పిన విషయముల గురించి ఇచ్చట సంపూర్ణముగను వ్రాసియున్నాను.

మన దేశమందలి భాగవతకళకు మాత్రమే చాలవఱకు నాట్యశాస్త్రము ప్రమాణగ్రంథము. ఈ రెండు శాస్త్రములందు కరణములు, అంగహారముల గురించి, చారీరేచక విన్యాసముల గురించి తెల్పియున్నను, వానియొక్క వినియోగములు మాత్రము వేఱుగా కనబడుచున్నవి. కనుకనే శాస్త్రము, సంప్రదాయము రెండును చక్కగా సవిమర్శక దృష్టితో నారాధించిన పండితులు— భరతుని నాట్యశాస్త్రము, రసాభినయమునకు, నందికేశ్వరుని భరతార్ణవము నర్తనమునకు ప్రమాణ గ్రంథములుగా పేర్కొనిరి.)

## (1) నాట్యము, నృత్యము, నృత్తము, అభినయము—

**నాట్యము :—** ఒక కథను ఆధారముగా జేసికొని అనేక పాత్రలు ప్రవేశపెట్టబడి, గాన అభినయాదుల ద్వారా భావ ప్రకటన జేయుచు కథ నడుపుట నాట్యము.

**నృత్యము :—** పతాక, త్రిపతాక, అర్ధపతాక మొదలైన హస్తముల యొక్క ప్రయోగములతో ఒక పాటయొక్క గాని, పదముయొక్క గాని అర్థమును దెల్పుచూ తాళలయల ననుసరించి పదవిన్యాసము జేయుట నృత్యము.

**నృత్తము :—** రసభావ ప్రదర్శనము లేక కేవలము కొన్ని మృదంగ జతులకు, తాళములకు, స్వరములకు అంగవిన్యాసము ప్రదర్శించుట నృత్తము.

**అభినయము :—** సాత్విక సంచారి భావముల యొక్క ప్రదర్శనతో ఒక పాటలోగాని, పద్యములోగాని, శ్లోకముయొక్క గాని భావము వ్యక్తపరచుట అభినయము.

నాట్యమునందు— నృత్యము, నృత్తము, అభినయము ఈ మూడును ఉండి ఒక ప్రసిద్ధగాథ ఇతి వృత్తముగా గల్గి ఉండును.

## (2) లాస్యము, తాండవము

**లాస్యము :—** సుకుమారమై, సుందరమైన భావప్రకటన గలిగి, కోమలమైన అంగ విన్యాసము గల్గి చూపరులను ఆనందోత్సాహములతో ముంచి తేల్చునట్టి నృత్యము లాస్యము.

**తాండవము :—** ఉద్ధతమై, గంభీరమైన భావప్రకటన గలిగి వీర, రౌద్ర మొదలైన రసముల కాలవాలమై యుండునట్టి నృత్యము తాండవము.

దేవదాసీల నృత్య సంప్రదాయములో తాండవ లాస్యములకు మరొక విధముగా వ్యాఖ్యానము జెప్పెదరు. వీరి నాట్యకళయందు వీర, రౌద్ర, భయానక, బీభత్స రసములను సాధారణముగా ప్రదర్శించే యవసరములుండవు గాన వీరి కళా సంప్రదాయము ప్రకారము—

కూర్చొని— పదములు, శ్లోకములు, వృత్తములు మొదలైన రచనల నభినయించుట లాస్యము.

నిలువబడి— పల్లవులకు, శబ్దములకు, స్వరములకు, జతులకు నృత్తమాడుట తాండవము.

(3) హస్తములు——ముద్రలు.

నృత్యములో ఒక భావమును ప్రదర్శించుటకుగాని, ఒక పాటయొక్క అర్థమును దెల్పునప్పుడుగాని, చేతి వ్రేళ్ళు చాచుట, ముడుచుట అనేక పద్ధతులలో ఆకారములు కల్పించుట 'హస్త' మనబడును.

ఈ హస్తములు ముఖ్యముగా మూడు విధములు.

(1) అసంయుత — ఒక చేతితో ప్రదర్శించునట్టివి.

(2) సంయుత — రెండు చేతులతో ప్రదర్శించునట్టివి.

(3) నృత్తహస్తములు ప్రత్యేకముగా నృత్త నృత్య విన్యాసములలో ఉపకరించు నట్టివి.

ఈ హస్తములనే 'ముద్రల'నికూడా ప్రస్తుతము పిలుచుచున్నాము. కాని పూజా సమయములందు ఉపయోగించెడి హస్త విన్యాసములు మాత్రము 'ముద్ర'లని పిలువబడును.

అసంయుత హస్తములు: 30

పతాక, త్రిపతాక, అర్ధపతాక, కర్తరీముఖ, మయూర, అర్ధచంద్ర, అరాళ, శుకతుండ, ముష్టి, శిఖర, కపిత్థ, కటకాముఖ, సూచి, చంద్రకళ, పద్మకోశ, సర్పశీర్ష, మృగశీర్ష, సింహముఖ, లాంగూల, అలపద్మ, చతుర, భ్రమర, హంసాస్య, హంసపక్ష, సందంశ, ముకుళ, తామ్రచూడ, త్రిశూల, ఊర్ణనాభ, బాణ.

సంయుత హస్తములు: 24

అంజలి, కపోత, కర్కట, స్వస్తిక, డోల, పుష్పపుట, ఉత్సంగ, శివలింగ, కటకావర్ధన, కర్తరీ స్వస్తిక, శకట, శంఖ, చక్ర, సంపుట, పాశ, కీలక, మత్స్య, కూర్మ, వరాహ, గరుడ, నాగబంధ, ఖట్వ, భేరుండ, అవహిత్థ.

నృత్య హస్తములు: 33

గజదంత, తలముఖ, విప్రకీర్ణ, సూచీవిద్ధ, నలినీ సరోజకోశ, మకర, జ్ఞాన, పల్లవ, అర్ధరేచిత, కేశబంధ, కపోత, పార్శ్వమండల, త్రిపతాక పక్షవంచిత, కరిహస్త, ఊర్ధ్వమండల, ముష్టి, స్వస్తిక, ఉద్వృత్త, పురోమండల, నితంబ, ఉల్బణ, ప్రయుక్తాలపల్లవ, లతాకర, సూచికాస్య ఉరఃపార్శ్వమండల, దండపక్ష, పక్ష ప్రద్యోతిత, ముకుళస్వస్తిక, రేచిత, అవిద్ధ వక్ర, అరాళ కటకాముఖ, ముద్ర, గరుడపక్ష, వరదాభయము.

ఇవి గాక నృత్తమునందు—

పతాక, శిఖర, కటకాముఖ, పల్లవ, త్రిపతాక, పాశ మొదలైన హస్తములు ఉపయోగించబడును.

(4) గ్రీవము :

సహజముగానున్న మెడను అభినయమందుగాని, నృత్యమందుగాని, యిరుప్రక్కలకుగాని, ముందు వెనుకలకుగాని, అర్ధచంద్రాకారముగా గాని, ఒక భావము వ్యక్తపరచుటకు కదిలించుట గ్రీవాభినయ మనబడును.

గ్రీవాభేదములు —— 19 విధములు.

ధుత, విధుత, ఆఘాత, అవధూత, కంపిత, ఆకంపిత, ఉద్వాహిత, పరివాహిత, అంచిత, నిహంచిత, పరావృత్త, ఉక్షిప్త, అధోముఖ, లోలిత, తిర్యాన్నతోన్నత, స్కంధానత, ఆరాత్రిక, సమ, పార్శ్వాభిముఖ.

(5) దృష్టి :

వివిధ రకములైన చూపులద్వారా భావము వ్యక్తపరుచుట ముఖ్యముగా మూడు విధములు.

త్రివిధ దృష్టి భేదము ——

రసదృష్టి, స్థాయీ భావ దృష్టి, వ్యభిచారిభావ దృష్టి

రసదృష్టి—— 8 విధములు.

కాంత, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, బీభత్స, అద్భుత.

స్థాయీ భావదృష్టి—— 8 విధములు.

స్నిగ్ధ, హృష్ట, దీన, క్రుద్ధ, దృప్త, భయాన్విత, జుగుప్స, విస్మిత.

వ్యభిచార దృష్టి——20 విధములు.

శూన్య, మలిన, శ్రాంత, లజ్జిత, శంకిత, ముకుళ, అర్ధముకుళ, గ్లాన, జిహ్మ, కుంచిత, వితర్కిత, అభితప్త, విషణ్ణ, లలిత, ఆకేకర, వికోశ, విభ్రాంత, విప్లుత, త్రాస్త, మదిర.

(6) పద విన్యాసము :

నృత్యమాడు సమయమందు పాదములను వేయు విధములు (పాదముల కదలికలు) 32 తీరులుగా నుండును.

చలనము, సంక్రమణము, సరణము, కుట్టనము, లుంఠితము, లోలనము, విషమ సంచారము.

అంచిత, కుంచిత, సూచి, అగ్రతల సంచార, ఉద్ఘట్టిత, సమ, సారిక, అర్ధ పురాటిక, స్వస్తిక, స్ఫురిక, నికుట్టిక, తలోత్క్షేప, పృష్ఠోత్క్షేప, వేష్టన, అర్ధస్ఖలితిక, మత్త, పురాటిక, ప్రవృత్త, ఉల్లోల, సమస్ఖలితిక, లతాక్షేప.

ప్రేంఖణ, సమోత్సారిత మండల, లలిత.

(7) స్థానకములు :

నృత్యమును ప్రారంభించునప్పుడు, ముగించునప్పుడు, వివిధ రసములను ప్రదర్శించుటకు ముందు నిలువబడవలసిన పద్ధతులు 32. వీనినే స్థానకములందురు.

ఆయత, అవహిత్థ, అశ్వక్రాంత, మోటిత, వినివృత్త, ఐంద్ర, చంద్రిక, సమపాద, వైశాఖ, మండల, ఆలీఢ, ప్రత్యాలీఢ, స్వస్తిక, వర్ధమాన, నంద్యావర్త, చతుశ్ర, పార్ష్ణి పీడ, ఏకపార్శ్వ, ఏకజాను, పరివృత్త, పృష్ఠోత్తాన, ఏకపాద, బ్రహ్మ, వైష్ణవ, శైవ, గరుడ, సమసూచి, విషమసూచి మరియు ఖండసూచి, కూర్మాసన, నాగబంధ.

(8) చారి :

పాదములు, మోకాళ్లు, ఊరువులు, నడుము, వీని యొక్క చేరికచే ప్రదర్శింపబడు విన్యాసము 'చారి' యనబడును.

చారి భ్రమము [illegible] లు.

అందు

ఆకాశచారి -- 9 విధములు.

భూచారి -- 16 విధములు.

'ఆకాశ చారి' అనగా భూమినానుకొనక ప్రదర్శించునట్టి క్రమము లేక నిలువబడి ప్రదర్శించునట్టిది.

'భూచారి' అనగా భూమిపై ప్రదర్శించునట్టిది లేక మండెగా గూర్చొని ప్రదర్శించునట్టి విన్యాసము.

ఆకాశచారి - సమప్రేంఖణ, సారిక, అగ్రప్లుత, విద్యుల్లీల, ఖడ్గబంధ, రేఖాబంధ, లుఠితోల్లలిత, కుండల వర్తక, విచిత్ర

భూచారి - సమపాద, చాష, స్థితావర్త, విచ్యవ, ఉద్వృత, అడ్డిత, వక్త్రబంధ, జనిత, ఉత్స్యందిత, స్యందిత, శకటాస్య, అపస్యందిత, సమోత్సారిత, మత్తలి, అద్యార్ధిక, ఏడకాక్రీడిత.

(9) కరణములు :

నృత్యములో వివిధ విన్యాసములందు పాదములను, హస్తములను జేర్చి క్రమ పద్ధతిని ప్రదర్శించుట కరణము.

కరణములు — 108

తాళములు — 108

తాళములు, కరణములు, నూట యెనిమిది యున్నను సాధారణముగా అన్నిటినీ నృత్యమందు ఉపయోగించము. కాని ప్రత్యేకముగా సంధి నృత్యములు, సప్తలాస్యములు మొదలైన నృత్యములందు వచ్చు తాళములు—

వినాయక, రుద్ర, లక్ష్మి, గజలీల, వీర విక్రమ, రాజ, చూడామణి, సింహనందన, తురంగ లీల, రంగ ప్రదీప, హంసనాద, విజయతాళ, మకరంద, మల్లతాళ, సమతాళ, పూర్ణ కంకణ, లీలాతాళ - మొదలైన తాళముల గూర్చి.

అతిక్రాంత, శకటాస్య, మయూర లలిత, గంగావతరణ, లలాట తిలక, తలపుష్పపుట, భుజంగ త్రాస, తలసంఫోటిత, లలిత, దండపాద మొదలైన కరణముల గూర్చి అచ్చటచ్చట విపులముగా జతులతో గూడ జేర్చి వ్రాసియున్నాను.

(10) అంగహారములు :

పై కరణముల యొక్క చేరిక వలన అంగహారము ఏర్పడు చున్నది. [illegible]

ప్రతి కరణము ఒక్కొక్క ప్రత్యేక తాళము నందు గాని, గతియందు గాని ప్రదర్శింపబడును. అంగహారమట్లుగాక, అవసరమును బట్టి చిత్రవిచిత్ర విన్యాసముల ప్రదర్శనతో ముగించబడును.

కరణము - పాదము, హస్తము యొక్క ప్రసారముతో గూడిన ఒకే ఒక్క విన్యాసము మాత్రము.

అంగహారము—సంపూర్ణ విన్యాసములు గలిగి, ముగింపును గూడ గలిగియుండును.

కనుకనే

అడవును - కరణమనియు

జతిని—అంగహారమనియు, ప్రాంతీయ నృత్య పరిభాషలో వాడుట గలదు.

అడవు - ఒక ప్రత్యేక విన్యాసము మాత్రము.

ఉదా:— తైయ్యందత్తా తైయ్యాతై॥

ఈ శబ్దములకు ఏర్పడిన హస్తపాద విన్యాసము అడవు. జతి - కొన్ని అడవుల చేరికతో ఏర్పడి ముగింపును గలిగి యుండును.

ఉదా:— తైయ్యందత్తా తైయ్యాతై - రాథ దణథ జణు రాదితై॥

ఈ విధముగా యిరు ప్రక్కలను విన్యాసము జేసిన పిదప—

తైతై దిత్తతై - తై। తైతై దిత్తతై - తై

తైతై దిత్తతై। తై దిత్తతై।

తై దిత్తతై। తై॥

పై విధముగా ఒకే విధమైన శబ్దములను మూడు సార్లు పడి, యెడములకు ఆడి ముగించుట జతి.

అంగహారములు - 9 విధములు.

లలిత, విక్రమ, కారుణిక, విచిత్ర, విరిల, భీమ, విస్మృత: ఉగ్రతర, శాంతజ —

వీనినే 'నవరస అంగహారము' లనెదరు.

కరణములు, అంగహారములు రసభావములు లేనట్టి నృత్త ప్రాధాన్యత గలిగిన విన్యాసములుగా చెప్పియుండుటచే 'నవరస అంగహారములు' గురించి మనకు సందేహము గలుగ వచ్చును. రసాభినయము రెండు తెరగులుగా నున్నది.

(1) గాన ప్రాధాన్యత గలిగి ఆ గానములోని భావము ననుసరించి వివిధ రసములు ప్రదర్శించుట.

(2) ఆ యా రసమునకు తగిన విధమున తాళములను, జతులను, స్వరకల్పనలను కూర్చుకొని వాద్యముల యొక్క సహాయముతో రసములను ప్రదర్శించుట.

ఈ రెండు విధములైన ప్రదర్శన క్రమమును నాట్యకళా వేత్తలు ప్రచారములోనికి దెచ్చిరి. ఆయారసమును ఒప్పించుటకు అంగ విన్యాసము జేయవలసి వచ్చినప్పుడు—

గీతములు గాని, పదములు గాని అభినయించునపుడెట్లు వివిధ సంచారుల ద్వారా ఆయారసములను పూర్తిగా వ్యక్త పర చెదమో - అట్లే కేవలము వాద్య సంగీత ప్రాధాన్యముగా రస ముల నభినయించ వలసి వచ్చినప్పుడు వివిధ అడవుల చేరికతో గూడిన ప్రదర్శన ద్వారా ఆ రసోత్పత్తి ప్రేక్షకులలో గల్గునట్లు నృత్త మాడబడును.

ఉదా:— పర్వ దినములందు ఆలయములలో జరిగే 'బలిహరణ' నృత్యారాధనలోని ఒక నృత్యము (ఇంద్ర స్తవము) గూర్చి వ్రాస్తున్నాను.

ఈ నృత్యారాధన పెద్దమేళము (డోలు, సన్నాయి) యొక్క సంగీతారాధన తరువాత ప్రారంభమగును. పెద్ద మేళ గాండ్రు ప్రదక్షిణము ముగించిన పిదప, చిన్న మేళము వారు - మృదంగము, ముఖవీణ, శృతి, దేవదాసీలు, బలిహరణ గీత ముల పాడే దేవయాజ్ఞికులు, వీరందరూ కలిసి ఈ ఆరాధన ప్రారంభించెదరు. ఒక్కొక్క దిక్కునకు వచ్చినంతనే అచ్చట నిల్చి యాజ్ఞికులు స్తోత్ర గీతములను పాడెదరు.

"ఏతదిందత్ర గద్యప్రియః
దేవ గాంధార రాగ ప్రియః
సమతాళ ప్రియః
మేఘ నాద వాద్య ప్రియః
లలిత నృత్త ప్రియః
చత్తర్కాల గీతాను సార వాద్య ప్రియశ్చ"

యాజ్ఞికుల స్తోత్రము నాపినంతనే వాద్యమును ఆ రాగ మును, తాళమును వాయించెదరు. తరువాత ఈ క్రింది గీతము ననుసరించి దేవనర్తకి నాట్యమాడును.

గీతము—

సకల సురవర ముకుట మణి ఘృణి
చుంబితాంఘ్రి సరోరుహం
దనుజ నిరసన విబుధ జయకర
వజ్రపాణి శచీపతిం
రచిత గిరివర విలసదలిసిత
హస్తి మస్తకి నిష్ఠితం
కలిత కరహిత పటహఝిటికృత
మింద్ర తాళ యుదం మహత్॥

ఈ నృత్యము ముగిసిన పిదప క్రింది శబ్దములకు నృత్తము ప్రదర్శించును.

జతి— జంజం కిటకిట
కిణాంగ్ కిటదరి
తకిట దికిట దరి
తహంత కుంతక

తక తకుకుకు దరికిట
దత్త తాహత జేం–
దత్తజేం – తాకిట జేం –
దరికిట జేం –

గతి—. దిగితరి దిగితరి దిత్త, దిగినగ దిగితరి
దిత్త దిత్తసగ దిగితరి జగతరి దధీంత
జగనగ జగనగ దిత్తకి జగజగ జణు
జగదిత్తగనగ జం తజ్జం –

తీర్చి—. జగ జగ జంతరి – జంకిణ రేకిణ
తగ నగ దిత్తగ – తకుందరితకిణ
తత్తాం దిత్తాం తాకిట తైయ్యా
తత్త జంతక తాహత తెయ్ ॥

ఈ నృత్తము 'లలిత' మునకు సంబంధించినట్టిది. ఇందలి అంగచలనము కేవలము రస భావములు లేని నృత్తముగా గాక, రస భావములతో కూడిన ప్రదర్శనముగా నుండును. శబ్దములు గూడా అందు ఒప్పించ వలసిన రస ప్రదర్శనకు అనువైన విధముగ కూర్చ బడియుండును.

రసాభినయము—

ఆంగిక, వాచిక, ఆహార్య, సాత్వికముల ప్రదర్శనము ద్వారా ఒక పాటలోని భావమును ప్రదర్శించు అభినయము.

(11) గతి :

చతురశ్ర, తిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణ, అని గతులు ఐదు విధములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| చతురశ్ర | – 4 | అక్షరముల | నడక | గలిగినట్టిది. | (తకిటత) |
| తిశ్ర | – 3 | ,, | ,, | ,, | (తకిట) |
| ఖండ | – 5 | ,, | ,, | ,, | (తక తకిట) |
| మిశ్ర | – 7 | ,, | ,, | ,, | (తకిట తకతక) |
| సంకీర్ణ | – 9 | ,, | ,, | ,, | (తక తకిట తక తక) |

ఇవిగాక

మరాళ, మయూర, సింహ, కురంగ, గజ, శుక, మొదలైన గతులు గూడ నున్నవి.

ఈ గతులన్నియూ ముఖ్యముగా తాళలయలకు సంబంధించి చేయబడే నృత్తమునందు, కరణాంగహార ప్రదర్శనము నందు ఉపయోగించిన, నృత్తము రమణీయముగా నుండును.

(12) తాళము :

నృత్యమున కుపయోగపడే 108 తాళములు గాక, నేటికాలములో ప్రచారములోనున్న తాళములు.

ధృవ, మఠ్య, రూపక, త్రిపుట, ఝంపె, అట, ఏక–ఈ ఏడు తాళములు ఐదు జాతులలో ప్రస్తారముచేయబడి 35 తాళములగుచున్నవి. ముప్పది ఐదు తాళములందును 10, 12 తాళముల కంటే గాత్ర సంగీతమునందు ఉపయోగ పడుట లేదు. ఇక 108 తాళముల విషయము.ఇవి గాత్రము కంటే నృత్యమునకే. యెక్కువగా ఉపయోగము. అందును 'కేళికా' ప్రదర్శనము నందు కంటే ఆలయ నృత్యములందు ముఖ్యముగా వీని యొక్క ఉపయోగము కానవచ్చుచున్నది.

పంచముఖి తాళములు—చాచ్చత్పుట } సంపద్వేష్టక
చాచపుట } ఉద్ఘట.
షట్ పితా పుత్రిక }

వినాయక, రుద్ర, లక్ష్మి, విష్ణు, బ్రహ్మ—ఈ తాళము లందు ఆయా దేవతలకు సంబంధించిన కౌస్తుభములు లేక కవుతము లాడబడును.

కవుతమనగా కొన్ని మృదంగ శబ్దములతో గూడిన జతులు, ఆ యా దేవతల స్తోత్ర ,గీతములతో చేర్చి ఒక పాటగా వ్రాయబడిన ప్రత్యేక ఆరాధన సంగీత రచన.

క – అధిదేవత సరస్వతి – తెల్లని రంగు
వు – అధిదేవత మహాలక్ష్మి – ఎరుపు రంగు
త – అధిదేవత పార్వతి – నలుపు రంగు.

ఈ ముగ్గురు ఆదిదేవతలకు చెందిన అక్షరముల యొక్క చేరికతో యేర్పరుప బడిన ప్రత్యేక నామము కవుతము.

(13) సప్తలాస్యములు :

శుద్ధ, దేశి, పేరిణి, ప్రేంఖణ, దండిక, కుండలి, కలశ అని లాస్యములు ఏడు విధములు.

ఈ లాస్యములు ప్రపంచములో ప్రచారములోనికి వచ్చిన తీరు – కైలాసమునందు నృత్యోత్సవ సమయమున పరమ శివుడు ఉల్లాసముతో సప్త తాండవములను నర్తనము సల్పగా, పార్వతి నట మహానటు ననుసరించి నాట్యమాడెను. అంతట శివుని యొక్క నాట్యము సప్త తాండవములుగా రూపొందగా, కోమల కరణాంగహార విన్యాసము గల్గిన పార్వతి నృత్యము సప్త లాస్యములుగా రూపొందినది.

## పాద భేదములు

పాదభేదములు 34 విధములు అందు ముఖ్యమైనట్టి 7 పద్ధతులను గూర్చి తెలుపుచున్నాము

1) చలనము 2) సంక్రమణము 3) సరణము 4) కుట్టనము 5) లుట్టితము 6) లోలితము 7) విషమసంచారి.

**1. చలనము.**— సమముగానున్న పాదములను ఉన్నచోటనే కదలించుట చలనమందురు.

**ఉపయోగము:**— పల్లెలందలి పూజారులయొక్క నాట్యము లందును, శివతాండవమునందలి అంగహార ప్రదర్శన ప్రారంభమునందును, ఛాలయ నృత్యము, ఝుంకారనృత్యమునందును ఉపయోగపడును.

**2 సంక్రమణము:**— పాదమును చక్కగా పైకెత్తి అడుగులు వేయుట సంక్రమణమగును.

**ఉపయోగములు:**— నర్తనముయొక్క ముగింపునందును, (అనగా ముక్తాయింపుల ప్రదర్శనము) త్వరితగతిన ప్రదర్శించు అడుగులకు, అడవుసాము అభ్యాసమునకు ఉపయోగింతురు.

**3. సరణము:**— పాదములను భూమినుండి పైకెత్తకుండా ముందునకు నడచిన సరణమనబడును.

**ఉపయోగములు:**— నదీప్రవాహముయొక్క ఉధృతమును, నృత్యముయొక్క అంతమునను, లాస్యనృత్యప్రదర్శనమునకును, శృంగారరసప్రాధాన్యత గల్గిన నర్తన విన్యాసములకును ఉపయోగపడును.

**4. కుట్టనము:**— కాలియొక్క ముందటి భాగముగాని మడమను గాని, పూర్తిపాదమునుగాని భూమిపై కొట్టుటను కుట్టనమనబడును.

**ఉపయోగములు:**— శృంగారరస సంబంధమైన దృశ్యప్రదర్శనములలోను, చారీనాట్యమందును, వివిధరకములైన అడవు విన్యాసములతో కూడిన జతి విన్యాసములందును ఉపయోగపడును.

**5. లుట్టితము:**— రెండుకాళ్ళను స్వస్తికముచేసి యిరుప్రక్కలకు కాళ్ళను పైకెత్తుచు ఎగురుచు ప్రదర్శించుట లుట్టితమగును.

**ఉపయోగములు:**— ఆకాశచారి ప్రదర్శనమునందును, ప్రాంతీయ నృత్త ప్రదర్శనమునందును ఉపయోగింపబడును

**6. లోలనము:**— పాదములను యిరుప్రక్కలకు వలయాకారముగా త్రిప్పుతూ విన్యాసముచేయుట లోలనమనబడును.

**ఉపయోగములు.**— భ్రమర విన్యాసమునందును, కరణముల యొక్క ప్రదర్శనమునందును ఉపయోగింపబడును.

**7. విషమసంచారి:**— పాదముయొక్క ఒక భాగమును భూమిపై ఆనించి కదలించిన విషమసంచారి యగును.

**ఉపయోగములు:**— అద్భుతరస ప్రాధాన్యత గల్గిన నృత్యములు ప్రదర్శించుట యందును, ప్రాంతీయనృత్యములందును, ముఖచాలి నృత్యమందును ఉపయోగింపబడును—

•••o•••

## శృంగ నాట్యము

స్థానక, భూచారి, ఆకాశచారి, అంగహారములయొక్క కలయికచే యేర్పడు నర్తన విశేషమే శృంగ నాట్యము.

ఈ శృంగనాట్యమును గూర్చి భరతార్ణవమున నందు తెల్పిన వివరములు—

వసంతోత్సవ సమయమందు పార్వతీ పరమేశ్వరులు కైలాస పర్వత శిఖరముపై విహారార్థమువెళ్ళినపుడు జగన్మాత శంకరుని 'ఆకాశచారి' విన్యాసక్రమమునుగూర్చి తెల్పుమని కోరగా పరమశివుడు, అంబప్రీత్యర్థము "శృంగనాట్యము" ప్రదర్శించెను.

**శృంగనాట్యము—**

ఒక అంగహారమునకు రెండు 'చారీ'లను విన్యాసము చు,

శేర్చి పిమ్మట స్థానమును జతపరచిన - అట్టి నాట్యక్రమము శృంగనాట్య మనబడుచున్నది.

ఈ నాట్యక్రమము ఆకాశచారితో ప్రారంభమై భూచారితో ముగియుచున్నది. ఈ రెండు చారి విన్యాసముల నడుమ అంగ హారముతో మొదటి పద్ధతి ప్రదర్శనముండును.

ఉదాహరణకు:-

| | | | |
|---|---|---|---|
| లలిత అంగహారము | — | 5 | విన్యాసములు |
| విక్రమ | — | 3 | ,, |
| కారుణిక | — | 4 | ,, |
| విచిత్ర | — | 2 | ,, |
| విశాల | — | 2 | ,, |

Note : ఒక్కొక్క అంగహారము 4, 5 విన్యాసక్రమములు కలిగియుండును.

శృంగ నాట్యములో-

ఒక ఆకాశచారి తరువాత అంగహారములోని ఒక విన్యాసము మాత్రము ప్రదర్శించి భూచారి పట్టవలెను. మిగిలిన అంగహార విన్యాసములకుగూడా అట్లే వివిధ ఆకాశచారి, భూచారి క్రమములను జేర్చిపట్టవలెను. ఒకే ఆకాశచారికి అంగహారమందలి సంపూర్ణ విన్యాసము పట్టుట సంప్రదాయము గాదు.

## శృంగనాట్యము — 1 వ విధము

శృంగనాట్యము — మొదటి విన్యాసము ఆకాశచారి సమ ప్రేంఖణతో ప్రారంభింపబడి ఆయతస్థానకము చేర్చబడును. పిమ్మట లలితకరణములోని మొదటి విన్యాసము, అటుపై అవహిత స్థానకము చేర్చిన పిమ్మట సమపాదచారి ప్రదర్శించి అశ్వక్రాంత స్థానకముతో ముగించబడుచున్నది.

ఇదే విధముగా లలిత అంగహారములోని మిగిలిన నాల్గు విన్యాసములు వర్తన చేయబడును. శృంగనాట్యముయొక్క సంపూర్ణ స్వరూపము తెల్పుటకుగాను శృంగనాట్యములోని ప్రథమ విన్యాసముగూర్చి వివరముగా వర్ణించుచున్నాను.

శృంగము — మొదటి విన్యాసము

ఇందు వచ్చే చారీ విన్యాసములు

| | |
|---|---|
| ఆకాశచారి-సమప్రేంఖణ<br>భూచారి-సమపాద | అంగహారము:- లలిత<br>ఇందు 5 భాగములు గలవు |

స్థానకములు.

ఆయత — అవహిత్థ అశ్వక్రాంత.

కాలును భూమిపైనుండి పైకెత్తి గాలిలో విన్యాసముచేయుట ఆకాశచారి యగుచున్నది.

పాదమును భూమిపైనుంచి వివిధవిధములుగా జరుపుచూ విన్యాసముచేయుట భూచారి యగును

సమ ప్రేంఖణ:- సమదృష్టిగల్గి సమపాదమందు నిల్చిన వ్యక్తి ఇటునటు ప్రక్కలకు కదలుచూ, (ప్రేంఖణ విన్యాసం) చేతులను నడుముపైనుంచి, ముందు వెనుకలకు వెళ్ళుతూ, మరల సమముగోనికి వచ్చి — అటుపై ప్రక్కలకు వెళ్ళుట సమప్రేంఖణ మగును.

ఇందు ముందుకు వెళ్ళునప్పుడు ఈ విన్యాసము నే పర్యాయములు ప్రదర్శింపబడుచున్నది.

సమపాద:- నాట్యములో ముందునకు వెళ్ళునప్పుడుగాని, వెనుకకు వచ్చునప్పుడుగాని, ప్రక్కకు నడుచునప్పుడుగాని రెండు పాదములు ఒకదానితో నొకటి చేర్చియుంచి వర్తించుట సమపాద చారి.

స్థానకములు:- నాట్యారంభమందుగాని, విశ్రాంతి సమయమందుగాని, ఒక విన్యాసాంతమందు నిలువబడే విధానానికి స్థానక మనిపేరు

ఆయత:- కుడిచేతిని కటిపైనుంచి, ఎడమచేతిని డోల హస్తముగా జారవిడిచి నిలుచుట ఆయతము.

అవహిత్థ — ఆయతలోని చేతులు మార్చిన అవహిత్థ మగును.

అశ్వక్రాంత:- చేతులందు కర్తరీ ముద్రపట్టి, కుడి కాలిపై నిలువబడి ఎడమకాలు ముందునకు జారవిడిచిన అశ్వక్రాంతమగుచున్నది.

**లలిత అంగహారము:—**

1 వ విన్యాసము — నర్తకి ఆయతస్థానమునందు నిలువబడి సమదృష్టి గల్గియుండి 'సూలూ' విన్యాసము ప్రదర్శించుట లలితములోని మొదటిభాగము.

కోమల మలయమారుతమునకు మెల్లగా కదిలే దీపకళికలా శరీరము చలింపజేయుట సూలూ విన్యాసమనబడును.

ఒత్తితో వెలిగించబడిన నూనె దీపము మొదట్లో లావుగా నుండి పోను పోను సన్నమగుచుండే పిల్లగాలులకు మొదట్లో చలనము కనబడక పోయిననూ, పోను పోను ఆ చలనము స్ఫురించి చివరలో పూర్తిగా కనబడినట్లు 'సూలూ' విన్యాసము నర్తకి ప్రదర్శించినప్పుడు కదలిక పూర్తిశరీరమందున్ననూ, శరీరము ప్రక్కలకు కదల్చి శిరమునందు మాత్రము పూర్తిగా చూడగల్గుచున్నాము. ముందు వెనుకలకు కదలినప్పుడు పూర్తి శరీరములో ఆ కదలిక కనబడుచున్నది. కాని యిట్టి విన్యాసము గాంచుట చాల అరుదు. నేటికాలములో ప్రదర్శింపబడే భరతనాట్యములందు ఎన్నియో విధములైన 'అడ్డి' విన్యాసములు జూచిననూ పరిపూర్ణమైన * 'సూలూ' విన్యాసముగాంచుట బహు అరుదుగా నున్నది.

* కొన్ని సంవత్సరముల క్రిందట పిఠాపురములో నేనుజూచిన ఒక నృత్యప్రదర్శనము గూర్చి తెల్పుచున్నాను.

పిఠాపురములో పెండేల సత్యభామ అనే సుప్రసిద్ధ నర్తకీమణి యుండేది. ఆమె భామాకలాపము, గొల్లకలాపములందు ఆరితేరిన విదుషీమణి. భాగవత విద్య అభ్యసించవలెననే యభిలాషతో తరచుగా ఆయూరు వెళ్ళేవాడిని. కచ్చేరీనాట్యము చూడవలెనని కోరికతో ఆమెను కోరగా, సాధారణముగా భాగవతప్రదర్శనముల నిచ్చేవారు మేజువాణీ ఆటయందు పాల్గొనరు గాన, ఆ యూరిలోని మరొకరి ప్రదర్శనము చూచే యేర్పాటు చేసినది.

నాట్యము చేసే జవ్వనికి షుమారు పదహారు సంవత్సరముల వయస్సు యుండును నాట్యమే కులవృత్తిగా గలవారి యింటి బిడ్డ ఆ యూరిలో పేరుబడ్డ నాయకురాలివద్ద భరతవిద్య నభ్యసించినది.

ఆమె "శుభలక్షణ పల్లవి"తో ప్రారంభించినది. శుభలక్షణ పల్లవి నాట్యము తూర్పు జిల్లాలలో (వైజాగ్, శ్రీకాకుళం, గంజాం ప్రాంతములలో) ఎక్కువగా ప్రచారములో నున్నది. చతురశ్ర, త్రిశ్రగతులందును లేక ఆది, రూపకములందును నర్తన మాడబడును. ఈ పల్లవి ఆటలో మూడుకాలాలలో అడవులు, జతులు, తీరికలు ప్రదర్శింపబడుచున్నవి. ఆట ఆరంభములో ఆమె సమస్థానకములో నిలువబడి రెండుచేతులందు వర్ధమాన హస్తముపట్టి చతురశ్ర, త్రిశ్రములందు 'సూలూ' విన్యాసము ప్రదర్శించినది. ఆ విన్యాసముపూర్వము పిల్లగాలులకు సన్నగా చలించే దీపకాంతిలో ఆమె శరీరమందలి ప్రతి అంగములోను సుకుమారమైన చలనము కాన్పించినది. మృదంగములేదు. తాళములేదు ఆమె పినతల్లిమాత్రము వంతపాడినది. కాని ఆమెగతి విన్యాసముల నెఱుకపరుచుచూ చేసిన ఆ ప్రదర్శనము అత్యద్భుతము. పాదాలతో మెత్తని మువ్వలచప్పుడు, పాదపైభాగములో కనీ కనబడని చలనము, ఊరువులందు అంతకంటే కొంచెము స్పష్టమైన కదలిక కటిభాగము మరికొంత స్పష్టత, పక్షభాగమందు పొందికతోగూడిన చలనము, శిరోభాగములో కాంతివంతమైన చూపుతో స్పష్టతగల్గిన చలనము — యిదంతయు కొన్ని క్షణములలో జూపిన విన్యాసము. శరీరములో ఒక విద్యుత్కాంతి ప్రవేశించి పంచలనము కల్గించినట్లు, మెఱుపుతీగ మెరసి మాయమైనట్లు భ్రమగొల్పి ఆ విన్యాసమందము గల్గించినది. విస్మిత భ్రూపుట విన్యాసము, నేత్ర విన్యాసము, శిరోభేదములను ప్రదర్శించి అడవుల ట్టినవి మదరాసు మొదలైన ప్రాంతములో నంతకంటె సొగసైన అడవుజాతి విన్యాసము చూచినానుగాని, ప్రఖ్యాత కళాకారుల ప్రదర్శనములలో గూడ యింత చక్కటి 'సూలూ' విన్యాసము చూడలేదు. ఇదియే శాస్త్రీయ పద్ధతిలో ప్రదర్శించవలసిన 'సూలూ' పద్ధతి. శరీరములోని వివిధ అంగ ప్రత్యంగములలోని, కదలికలలోని తూకము ఈ విధముగా నుండవలెనని తెలిసికో తగినవిధంగా యుండిన ప్రదర్శనము ఆ జవ్వని కళలో చూడగల్గినాను

"రేపు వత్తుగాని తూరుపు తెల్లవారే
పోరా యీ వేళకు
నా పతి జూచిన రాపిడి చేయును
కాపురము నేడు కడగడ్ల పాలవును"

ఈ పరకీయనాయికను అభినయించినది. ఆమెకు అభినయము మంచినీళ్ళ ప్రాయము ఆ అస్త్రములపొందిక సహజత్వములో గూడిన భావప్రదర్శన వివిధసంవారుల ప్రదర్శన యిందు జూపిన నేర్పరితనము చూచినప్పుడు కళాసరస్వతి ప్రత్యక్షముగా మాట్లాడినట్లు తోచినది అంతవిద్యయుండి యామెను పేరును లేకుండ వారు మూలపడియుండుటకు కారణము వారు జన్మించిన

క్రమ పద్ధతిలో ఈ విన్యాసముల ప్రదర్శన కల్గివట్టిది, శృంగ నర్తనము మొదటి విన్యాసమగుచున్నది.

ఇక 'లలిత'ములో మిగిలిన 2, 3, 4, 5 భాగముల నెట్లు వర్తన మాడవలెనను సందేహము గల్గవచ్చును.

ఆ యా భాగముల్లోని విన్యాసము నాధారముగ జేసికొని చారీ స్థానకముల నేర్పరచుకొని నర్తన మాడబడుచున్నది. మరి కొన్ని వేళలందు అంగహారభాగములు మారినను చారీస్థానకములు అవియే పట్టబడుచున్నవి.

**ఈ నాట్యమునుపయోగించవలసిన తాళములు:-**

108 తాళములందు ఏయే భాగములుగల తాళములు (లఘు, గురు, ప్లుతములు మొదలైనభాగములు) ఈ నాట్య విన్యాసమునకు ఉపకరించునో అట్టి వానిని నిర్ణయించుకొని ఆ యా తాళములకు నృత్యవిన్యాసములకు తగిన మృదంగ శబ్దములతో తత్కారము, జతి, తీర్మానముల నేర్పరచుకొని నర్తన మాడబడును.

....o....

## శృంగనాట్యము - 1 వ విధానము

ఆకాశచారి — సమ ప్రేంఖణము
స్థానకము — ఆయత్త
అంగహారము — లలిత
స్థానకము — అవహిత
భూచారి — సమపాద
స్థానక — అశ్వక్రాంత

....o....

## శృంగనాట్యము - రెండవ విధానము

ఆకాశచారి — సారికచారి
స్థానకము — మోటిత
అంగహార — విక్రమ మొదటిభాగము
స్థానకము — వినివృత్త
భూచారి — చాషగతిచారి
స్థానకము — ఐంద్ర

... o....

## శృంగనాట్యము - మూడవ విధము

ఆకాశచారి — అగ్రప్లుత
స్థానకము — చాండిక
అంగహార — కారుణిక
స్థానకము — వైష్ణవ
భూచారి — స్థితావర్త
స్థానకము — సమపాద

....o....

## శృంగనాట్యము - నాల్గవ విధము

ఆకాశ చారి — విద్యుత్క్రీలం
స్థానకము — వైశాఖ
అంగహార — విచిత్ర
స్థానకము — మండలం
భూచారి — విచ్యవ
స్థానకము — అలీఢ

....o....

---

సాంఘిక వాతావరణమని తెలిసికొని చాల చింతించినాను. కాని అట్టి విద్య నేటికాలములో భరతనాట్యము ప్రదర్శించే పేరొందిన కళా కారులలో గూడ చూచుట అరుదు. ఇది వీరికి వంశ పారంపర్య ముగా అబ్బినవిద్య.

అప్పటిలో ఆమె విద్యాప్రచారమునకు నేను యే విధము గాను సహకారము చేయలేకపోయాను. మరల కొంతకాలమునకు అచటికి వెళ్ళినప్పుడు ఆమె గురించే అడుగగా, ఒక ధనవంతుని పోషణలోనికి వెళ్లుటచే నాట్యవిద్య విరమించుకోవలసినట్లు తెలిసి కొని నప్పుడు చాల బాధ గల్గినది.

.o....

శృంగనాట్యము - అయిదవ విధము

అకాశచారి — అడబంధ
పావకము — ప్రత్యాలీఢ
అంగహార — వికల
స్థావకము — (సామ్యపాద) సమపదం
భూచారి — ఉరూద్వృత్త
స్థానము — స్వస్తికము

....o....

శృంగనాట్యము - ఆరవ విధము

అకాశచారి — రేఖాబంధ
స్థావకము — వర్ధమానము
అంగహార — భీమ
స్థావకము — నంద్యా వర్తము
భూచారి — అద్దిత
స్థావకము — పార్ష్ణిపీడిము

....o...

శృంగనాట్యము - ఏడవ విధము

అకాశచారి — ఉత్తోల్లాలిత
స్థావకము — ఏకపార్శ్వ
అంగహార — విశృత
స్థావకము — ఏకజాను
భూచారి — వక్త్రిబంధ
స్థావకము — పరివృత్త

—o—

శృంగనాట్యము - ఎనిమిదవ విధము

అకాశచారి — కుండలావర్తక
స్థావక — ప్రష్టోత్తన
అంగహార — ఉగ్రగర
స్థావక — ఏకపాద
భూచారి — జవిత
స్థావకము — బ్రాహ్మము

... o ...

శృంగనాట్యము - తొమ్మిదవ విధము

అకాశచారి — విచిత్రము
స్థావకము — వైష్ణవము
అంగహారము — శాంకజము
స్థావకము — శైవము
భూచారి — ఉత్స్యందిత
స్థావకము — గారుడము

... ...

శృంగనాట్యము—తాళముల ప్రదర్శన తీరు

ఉదా:-

శృంగనాట్యము మొదటి విన్యాసము—
ఇందువచ్చే చారి, అంగహారములు—
అకాశచారి - సమప్రేంఖణ
భూచారి-సమపాద
స్థానకములు - ఆయత,-అవహిత్థ-అశ్వక్రాంత

అంగహారము-లలిత

ఈ విన్యాసములు తురంగలీలా, కందర్పతాళములందు ప్రదర్శింపబడుచున్నవి.

001-రెండు ద్రుతములు ఒక లఘువు గలది తురంగము
001 ss-రెండు ద్రుతములు, ఒక లఘువు, రెండు గురువులు గలది కందర్ప తాళము.

తురంగ లీలాశబ్దములు జం జం కిటతోం-జగ జగధికి తొంగ
కందర్ప శబ్దములు — తతికిట - తకికిట - కిటకిట కిట జక

తకఝుకు ఝకకిఝ తకతతకిటఝఝు-
తక కకుం దరికిట ఝగజేం కిటతక॥

సమప్రేంఖణమంపు పాదవిన్యాసము జేయునప్పుడు నర్తకి కుడి యెడమలకు వెళ్లునప్పుడుగాని ముందువెనకలకు వెళ్ళి మరల స్థానమునకు వచ్చినప్పుడు తాళగతి సమగతి కల్గియుండ వలెను.

తురంగలీల 2, 2, 4=8 అక్షరముల కాలము గల దగుటచే సమవిభాగములు గల్గియున్నది. అట్లే కందర్ప తాళముగూడా 2, 2, 4, 8, 8-24 అక్షరములు గల్గి సమముగా విన్యాసము చేయుటకు అనుకూలముగా నున్నది. ఒకవేళ 2, 2, 3=7 అక్షరముల నడకగల తాళము తీసికొనిన విషమగతి గల్గి సమముగా ప్రేంఖణ విన్యాసమునకు కుదరదు. కాన తాళముల నిర్ధారణ చేయునప్పుడు ఆ యా విన్యాసముల నడకలనువృష్టిలోనుంచుకొని తాళముయొక్క నడకను గూడా తెలిసి అనుకూలమైన తాళమునందే ప్రదర్శనము గావించబడును ఇట్లే తాళముల ప్రయోగము జేయబడుచున్నది.

ఈ శృంగనాట్యము అలయములలో నర్తలావ్యములకు ముందుగా ప్రదర్శింపబడును. శృంగము, నర్తలావ్యములు, పేరిణి విన్యాసము - ఈ క్రమములన్నింటియొక్క ఆధారముతో యేర్పరుచబడునట్టిదే నేటి భరతనాట్య ప్రదర్శనక్రమము. గనుకనే ఆ క్రమము నృత్త, నృత్య అభినయాదులు సంపూర్ణ వికాసము చెందిన ఒక అత్యుత్తమ సంప్రదాయముగా వృద్ధి చెందినది.

రెండుచేతులందు 'శుకతుండ' ముద్రనుపట్టి, నర్తకి ఎడమ కాలును భూమికానించి ముందునకు జరుపుచు కుడికాలితో నర్తనము సల్పును.

తరువాత మోటితస్థానక మందుండి పిమ్మట 'విక్రమాంగహార' విన్యాసము చేయబడును.

ఎడమ పాదము సమముగానుంచి, కుడిపాదము ఎడమ పాదమునకు అరవ్రేళ్ళు ఎడముగునట్లు కుంచించి ఊర్ధ్వముఖమగు కర్కట హస్తములను రెండుచేతులతో పట్టిన మోటితమగును.

ఈ స్థానకము నుండి విక్రమాంగహార మాడవలెను.

విక్రమము:-

ఒకచేత పతాకము, రెండవచేత శిఖరముపట్టి, ఎడమ పాదము భూమిపైనుంచి, కుడిపాదముతో త్వరితగతిని విన్యాసము చేయుట. విక్రమములోని ప్రథమ విన్యాసము ప్రదర్శించిన తర్వాత 'వివివృత్త' స్థానకమునందు నిలువవలెను.

కాలుతో భూమిపై తట్టి వెనుకప్రక్కకు జూచిన 'వివివృత్త' మగును

ఈ స్థానకమునుండి 'చాషగతిచారి' ప్రదర్శింపబడును.

రెండు పాదములను దగ్గరగానుంచి ఒకదాని తరువాత నొకటి, ఒక అడుగు ఎడముగా జరుపుచు నర్తన మాడుట 'చాషగతి' యగును. కుడికాలుతో ఈ విన్యాసము ప్రారంభించవలెను.

తరువాత 'ఐంద్రస్థానకము'నందు ముగించవలెను.

చేతులందు త్రిపతాకములనుంచి భూమిపైనుంచిన పాదముల నెత్తకుండ కదిలించుట ఐంద్రస్థానకమగుచున్నది.

## శృంగము—ప్రదర్శన విధానము

శృంగము 1 వ విధము ప్రారంభమునందే చర్చించబడినది గాన రెండునుండి తొమ్మిదివరకు వివరముగా తెలుపబడినవి.

## శృంగనాట్యము - రెండవవిధము

సారికచారి:-

ఈచారీ విన్యాసము శైవస్థానకముతో ప్రారంభించబడి, ముగించబడుచున్నది.

## శృంగనాట్యము- మూడవ విధము

'అగ్రప్లుతాచారి'యనరెండుచేతులందు ముష్టిహస్తములు పట్టి ఆహస్తములను గాలిలో ఎగురవేచి నర్తకి ముందునకుఎగిరి కుడి కాలము ఆయత్తస్థానకమందు నిలుచుట. అటుపై మందగతిలో మునుగాళ్ళపైన నడచుట. ఈ విన్యాసముచేయునపుడు సమదృష్టి కలిగియుండవలెను. పిమ్మట రెండు పాదముల మునుగాళ్ళపై మందగమనముతో ఏడు పర్యాయములు విన్యాసము చేయవలెను.

కుడిచేతితో 'అర్ధచంద్రముద్ర'నుపట్టి కటిభాగమందుంచి ఎడమచేతిని తారపైచుట 'ఆయత్త స్థానక'మనబడును.

తరువాత 'చాంద్రికస్థానక'మందుండి కారుణి కాంగహారము ప్రదర్శింపవలెను.

రెండుచేతులతో తామ్ర చూడహస్తములు పట్టి కాళ్ళను ఇరు ప్రక్కలకు కదలించిన 'చాంద్రిక' మగును.

రెండుచేతులతో ముకుళహస్తములు పట్టి జాలిని గొల్పు దృక్కులు గలిగి పాదములతో చంక్రమణ విన్యాసము ప్రదర్శించిన 'కారుణికాంగహారము' అగుచున్నది. చంక్రమణమునగా పాదములను పైకెత్తి వెలుపలి భాగముపై నిలిచి విలంబితలయలో కష్టతరముగా విన్యాసము జేయుట అది ముగిసిన తర్వాత 'వైష్ణవ స్థానక'మందు నిలువవలెను.

ఒక కాలును సహజముగానుంచి రెండవకాలును కొంచెముగా వంచి ప్రక్కకు ఒరుగునట్లుంచుట 'వైష్ణవ' మనబడును.

ఒక కాలితో వలయాకారముగా భూమిపై విన్యాసము జేసిన పిదప రెండవకాలును మొదటిదానితో చేర్చిన 'స్థితావర్త చారి' యగును.

రెండు పాదములను చేర్చి నిలిచి, రెండు చేతులను దండలు గట్టి నిలుచుట 'సమపాద' మనబడును.

## శృంగనాట్యము-నాల్గవ విధము

సమపాద మందున్న నర్తకి కుడికాలుపై నిలువబడి, ఎడమ కాలును పైకి కదలించి, అటుపై ఎడమ పాదముపై నిలిచి కుడి పాదమును పైకి కదలించుట 'విష్కల్లీలాచారి' యగుచున్నది. ఇందు రెండు హస్తములతో లత, లేక లతముద్ర పట్టవలెను. రెండు చేతులందు పల్లవ హస్తములను పట్టి శిరమువద్దనుంచుట 'లలిత హస్తము'గుచున్నది. ఈ విన్యాసమును చేయునపుడు హస్తములు పల్లవములవలె కదులుచుండును.

తరువాత వైష్ణవ స్థానక మందుండి పిమ్మట 'విచిత్రాంగ హారము' ప్రదర్శించవలెను. రెండుకాళ్ళను త్రి జానల ఎడముగా నుంచి ఎడమచేత కటకాముఖము, కుడిచేత శిఖరము పట్టిన 'వైశాఖ స్థానక' మగుచున్నది.

ప్రలోకిత దృష్టికలిగి రెండుచేతులందు సూచీవక్త్రముద్ర పట్టి, పూర్తిపాదముతో భూమిపై తాడనముచేయుచు నర్తనమాడుట 'విచిత్రాంగహారమ'గుచున్నది పిమ్మట మండల స్థానకమందు నిలువవలెను.

రెండుకాళ్ళను నాలుజానల ఎడముగా నుంచుట 'మండల స్థానక' మగుచున్నది. పిమ్మట 'విచ్యవాచారి' విన్యాసము ప్రదర్శింపవలెను.

దగ్గరగా నుంచిన పాదములలో నొకపాదమును విడదీసి పూర్తిపాదముతో భూమిపై తట్టుట 'విచ్యవాచారి' యగుచున్నది. తరువాత 'ఆలీఢస్థానకము'తో ముగించవలెను.

ఎడమ పాదమును భూమిపై స్థిరముగా నుంచి కుడిపాదమును ముందునకు ఐదు జానల ఎడముగా నుంచుట 'ఆలీఢక' మగుచున్నది. రెండుచేతులందు ముష్టి కటకాముఖ హస్తములు పట్టవలెను.

## శృంగనాట్యము - ఐదవవిధము

బ్రహ్మస్థానకమందు నిలిచి రెండుచేతులందు 'కర్తరీముఖ' హస్తములనుపట్టి ముందునకు నడచుట 'అర్గళబంధచారి' యగుచున్నది. ముందునకు నడచునప్పుడు ప్రారంభములో కుడి ప్రక్కకు, అటుపై ఎడమప్రక్కకు నడువవలయును. ఇట్టివిన్యాసములు వరుసగా కొన్ని ప్రదర్శించుట అర్గళబంధ మగుచున్నది.

ఆలీఢస్థానక విన్యాసమును ఎడమప్రక్కకు ప్రదర్శించుట 'ప్రత్యాలీఢ'మగు చున్నది.

సహజదృష్టిగలిగి రెండు చేతులందు ముష్టిముద్రపట్టి రెండు పాదముల మడమలతోగాని, పార్శ్వములతోగాని భూమిని తట్టుట 'విక్షలాంగహార'మగు చున్నది

అటుపై సమపాదములుగల్గి నిలుచుటకు 'సమపాదస్థానక'మని పేరు.

ఒకపాదము చీలమండ నుండి విడునట్లు భ్రమగలించు రీతిని పైకి తెచ్చి మోకాలువంచి అటుపై దానిని మునగాలుపై భూమిపైనుంచుట 'ఊరూద్వృత్తచారి' యగుచున్నది.

రెండుకాళ్ళను స్వస్తికముగా నుంచుట 'స్వస్తికస్థానక'మగుచున్నది. అనగా రెండుపాదములయొక్క చిటికెనవ్రేళ్ళు ఒక దానితో నొకటి తగులురీతిని యుంచిన స్వస్తికమగును.

## శృంగనాట్యము - ఆరవవిధము

కాళ్ళను క్రిందికి వెనుకకు లేక ఇరు ప్రక్కలకు ఒకదాని వెనుక నొకటి కదిలించిన 'రేఖాబంధచారి' యగును. ఇందును 'లలితముద్ర' 'శిరోముద్ర' పట్టవలెను. ఈచారీ విన్యాసముతో ప్రారంభించి 'వర్ధమానస్థానకము' ప్రదర్శించవలెను.

రెండుకాళ్ళయొక్క మడమలు తగులునట్లు క్రుంగి నిలువబడుట 'వర్ధమానస్థానక'మగుచున్నది.

రెండుచేతులందు 'వితంబముద్ర'ను ధరించి కాళ్ళను యిటు నటు కదలించి, పిమ్మట భూమిపైతట్టి నిలుచుట 'భీమాంగహార'

మనబడును. విన్యాసముచేయునపుడు 'ఉల్లోకి తదృష్టి'ప్రదర్శించి, అటుపై సహజదృష్టికలిగి యుండవలెను.

వర్ధమానస్థానకమునందలి పాదములను 4½ అంగుళములు ఎడముగా వుంచి చేతులందు 'మయూర హస్తములు' పట్టిన'నంద్యావర్త'మగును.

ముంగాళ్ళను దగ్గరగానుంచి నర్తకి ముందునకు వెనుకకు కదలుచు వర్తించిన 'అర్ధిత'చారి యగును.

కుడిపాదముయొక్క వెనుకభాగమునుండి ఎడమపాదమును తెచ్చి చీలమండను అనునట్లుంచిన 'పార్ష్ణిపీడ' మగును.

## శృంగనాట్యము - ఏడవ విధము

రెండుచేతులందు 'ఉత్తాన వంచిత' హస్తములుపట్టి, రెండు కాళ్ళను ఒకదాని తరువాత నొకటి అర్ధచంద్రాకారములో విన్యాసము చేయుచు, పైకి కదలించుచు, తర్వాత ఆయిదడుగులు ముందునకు, అయిదడుగులు వెనుకకు వేయుచు వర్తనము చేయుట 'లలితోల్లాలిత చారి' యనబడును.

ఒకకాలును భూమిమీద సహజముగా నుంచి, రెండవదానిని మొదటిదానికి ఎడముగా ఎదురుగా విల్చినయెడల 'ఏకపార్శ్వ స్థానక' మందురు.

కుడిచేతియందు అరాళము, ఎడమచేతియందు శిఖరముపట్టి, పాదములతో చంక్రమణ పదవిన్యాసము జేసిన 'వికృతాంగహార' మగును.

ఒక కాలును సహజముగానుంచి, రెండవదానిని కొంచెముగా మోకాలు వంచి నిలిపిన 'ఏకజానుస్థానక'మగును.

రెండుకాళ్ళను స్వస్తికముగా జేయుచు మోకాళ్ళను కదిలించిన 'వక్రబంధచారి' యగును.

ఒకకాలుయొక్క మడమకు రెండవకాలి చిటికెనవ్రేలు తగులునట్లుంచిన 'పరివృత్తస్థానక' మగును.

## శృంగనాట్యము - ఎనిమిదవవిధము

రెండుచేతులందు సూచీ ముద్రలుపట్టి, చెవులకు దగ్గరగా నుంచి నర్తకుడు ఎడమకాలుపై నిలువబడి కుడిప్రక్కకు గుండ్రముగా తిరిగి తరువాత పాదములను విషమసంచారి పద్ధతిలో నుంచి మరల కాళ్ళను మార్చుచు మూడు పర్యాయములు తిరిగిన 'కుండలావర్తకచారి' యగును. పాదముయొక్క ఒకభాగముపై నిలువబడుట విషమసంచారి యగును.

ఒకకాలును సహజముగానుంచి, రెండవకాలును మొదటి దానిపై వ్రేళ్ళయొక్క లోపలిభాగము తగులునట్లుగా నుంచిన 'ప్రష్ఠోత్థిత' స్థానకమగును.

రెండుచేతులందు నాగబంధముద్రలుపట్టి, నేత్రములందు క్రోధ దృక్కులు కలిగి ముంగాళ్ళపై నిలచి విన్యాసముచేసిన'ఉగ్రతాంగహార'మగును.

ఒకకాలును సహజముగానుంచి, రెండవ కాలియొక్క చీలమండవెనుకభాగము చేతులకు తగులు రీతిని పైకెత్తిన 'ఏకపాద' స్థానక మగును.

ఒకచేతితో కటకాముఖ ముద్రను హృదయమున కెదురుగా పట్టి, రేచిత విన్యాసము ప్రదర్శించుచు, ఆ చేతికి ఎదురుగా నుండు కాలును, భూమిపై ముంగాలుగా నుంచి కదల్చిన 'అవిత' చారి యగును.

ఒక కాలును సహజముగా నుంచి, రెండవకాలును మొదటి కాలియొక్క చీల మండపైనుంచి మోకాలు వరకు తెచ్చిన 'బ్రాహ్మస్థానక'మగును.

## శృంగనాట్యము - తొమ్మిదవ విధము

రెండుచేతులతో రేచిత విన్యాసముచేయుచు, ఆలీఢస్థానక మందు తరువాత ప్రత్యాలీఢమందు నిల్చుచు, ఈ విధముగా తొమ్మిది పర్యాయములు స్థానకములు మార్చుచు విన్యాసములు చేయుట 'విచిత్ర'చారి యనబడును.

రెండు చేతులందు పతాక ముద్రలు పట్టి, శిరచేతులను కొంచెముగా ముందుకు కదల్చి, కాళ్ళను రెండుజానల ఎడముగా నుంచిన 'వైష్ణవస్థానక'మగును.

చేతులను మోకాళ్లపై ఆనించి, కరుణ దృక్కులు కలిగి కాళ్ళతో బంధ, లేక వక్రబంధచారీ విన్యాసము ప్రదర్శించిన 'శాంతతాంగహార'మగును.

ఒక కాలును సహజముగా నుంచి, రెండవకాలును మోకాలు దగ్గరవంచి, అర్ధముగా మొదటికాలుపై యుంచినయెడల 'శైవస్థానక' మగును.

రెండు పాదములను లోపలి ప్రక్కకుగాని, వెలుపలి ప్రక్కకు గాని రేచక విన్యాసమందువలె త్రిప్పిన యెడల అది 'ఉత్స్యందితచారి' యగును.

ఎడమకాలును మోకాలివద్ద వంచి ముందుకు భూమిపైనుంచి కుడికాలును కూడ మోకాలు వద్ద వంచి వెనుక ప్రక్కకు తెచ్చి, భూమికి తగులునట్లు ఉంచిన యెడల గారుడ స్థానక మగును.

## స్వామి సన్నిధిని దేవనర్తకి

సంధ్యాసమయము.

రత్నఖచిత సింహాసనముపై అంబ ఆసీనయై యుండగా, విష్ణు మృదంగమును మధురముగా పలికించగా, బ్రహ్మ తాళధారియై వివిధ జతుల, గతుల విన్యాసము దెల్పగా, దేవేంద్రుని మురళి ముద్దులొల్క గానము జేయ, చదువులతల్లి సరస్వతి వీణ తియ్యగా ఆలపించగా, లక్ష్మి గీతము పాడగా, నారద తుంబురులు సహకార గానము సల్పగా — గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, విద్యాధరులెల్లరు ఆనంద పారవశ్యమున నృత్యమును తిలకించగా, పరమశివుడు కైలాసముపై 'సంధ్యా తాండవము' సల్పే సమయము.

సంధ్యారుణ కాంతిలో ఆలయ స్వర్ణ గోపురము తళతళ మెఱియు చుండును. ఆలయ ప్రాంగణము సన్నాయి, మంగళ వాద్య సంగీతము భక్తి పారవశ్యము కలిగించుచుండును. నాడు దేవనర్తకి ప్రథమ నృత్యారాధన, చంద్రోదయమైనంతనే ఆలయము లక్ష దీపములతో అలంకరించబడును. గణగణ గంటల నాదములతో, భక్తుల జయజయ ధ్వనులతో, సన్నాయి సంగీతముతో, భేరి, డక్కా వాద్యములతో పూజారుల మంత్ర పఠనముతో ఆలయము కళకళలాడుచుండును.

కుంభహారతి సమయము. నాట్యాచార్యుడు, గాయకులు, వాద్యకులు వెంటరాగా, దేవనర్తకి స్వామి సంసేవార్థము ఆలయము ప్రవేశించును. ఆమె తెల్లని పట్టు వస్త్రమును ఆలయ సంప్రదాయము ననుసరించి కాసెకోసి కట్టును.(ఆభరణవివరములు విపులముగా నిచ్చినాను.) పసుపు పారాణి పాదములపై నల్లని దారముతో అల్లబడిన వెండిమువ్వలు చూడముచ్చటగా నుండును. ఆమె గర్భాలయములోని స్వామి కెదురుగా సమ భంగిమలో నిలబడును. పూజారి కుంభహారతిదెచ్చి ఆమె కందిచ్చును. మంగళ వాద్యములు హారతి పాటల నాలపించగా ఆలయములో గంటలన్నీ ఒకేసారి ధ్వనించగా, నగారా, శంఖము, కాహళ, డక్కా, సూర్య చంద్రమండల వాద్యములు, శుద్ధ మద్దెల, పంచముఖ మొదలైన వాద్యములు వివిధ నాదములలో స్వామిని ఉపాసించుచుండగా దేవనర్తకి 'హారతి' నిచ్చును. ఒక నిమిషము నిశ్శబ్దము. తరువాత ఆచార్యుడు 'కుతప' విన్యాసము జేయును. (ఆలయములో స్వామికి దేవనర్తకి 'పుష్పాంజలి' సమర్పించి నర్తలాస్యములు, కవుతము వాడునప్పుడు నాచార్యుడు, మార్దంగికులు మొదలైన యితర వాద్యకులు, గాత్ర పాటకులు, తాళధారి నిలబడవలసిన శాస్త్రీయ విధానమునకు 'కుతప'మని పేరు. ఈ క్రమమెట్టిదనగా నర్తకి నడుమనుండగా, ఆమెకించుక ప్రక్కగా (కుడివైపు) నాట్యాచార్యుడు, తాళధారి, ఆమె కిరుప్రక్కలగాని ఒక ప్రక్కగాని మార్దంగికులు, వారి నడుమ నర్తకి ననుసరించి స్త్రీ పురుష గాయకులు. శ్రుతి, ముఖవీణ, వేణువు మొదలైన వాద్యకులు యుండవలెను. ఇట్లు యేర్పాటయిన, సంగీతము చక్కగా పూరింపబడి మేళము రక్తి కట్టును.)

అటుపై దేవనర్తకి 'తలపుష్పపుట' కరణములో నిలువబడును. ఆలయ పూజారి పుష్పములను, తులసి దళములను ఆమె దోసిలియందుంచును. అంత నామె విష్ణుదేవుని స్తోత్రము చేయుచూ 'మార్గిక'ను పఠించును.

"శ్రీమత్సమస్త సద్గుణ నయ వినయ
వివేక వితరణ విచక్షణ దక్ష
గూఢార్థ నిర్ణయ నిస్సందేహ నిరాఘాట
నిరవంద్య గద్యపద్య వచనస్తు వచన
తర్కవేదాంత మీమాంస వ్యాకరణ
సాంఖ్య యోగాది శాస్త్ర పారీణా
సంగీత సాహిత్య సకల కళాప్రవీణ
సర్వేశ! భజద్వం యుష్మత్పదపందనం."

మార్గికను ముగించి

"దిత్తళాంగ్ తక తళాంగ్ తకదికి
తాందిత్తై దిత్తాందితై దిత్తాందితై."

వాద్యములు పై శబ్దములు పలికించగా 'పుష్పాంజలి' సమర్పించి, వందన మాచరించి, మృదంగమునకు నమస్కరించును.

### అంబరము

గాలివాద్యములు — వేణువు, ముఖవీణ మొదలైనవి నృత్యారంభములో పూరించుట 'అంబర'మన బడును.

అంబరము ననుసరించి 'ఆయిత్త' ప్రదర్శనము జరుగును. ఆయిత్తమనగా అతి మార్దవముగా మృదంగముపై కొన్ని శబ్దములను పూరించుట. అవి యేవనగా—.

తాహం తెహియం దత్తాహం
తెహి తెహియం దత్తాహం
తత్తైహి తెహియం దత్తాహం
దినకట తాం। దినకిటతై। దినకిట

తరువాత 'అలాపము' (అడ్డి), 'మొహర' ప్రదర్శించును. ఇది నాట రాగములో ఆలపించబడి ఝంప తాళములో విన్యాసము జేయబడును.

'తర్ — జగదత్త' మొదలైన అక్షరములతో ప్రారంభమై "తోదిగిదాం — తోదిగి — దందం — 'దాం'' మొదలైన అక్షరములతో ముగిసిన పిదప అన్ని వాద్యములు చేరి తీరిక విచ్చును. దీనికి 'మొహర' అని పేరు.

'అడ్డి' స్వరూపము. (మేళప్రాప్తి)

తాం తత్తై తై — తై జగదత్తా
తో దిగిదాం తోదిగి దందం దాం
దాం దందం దం దం దాం।
దందం తకదికి — తక తదిగిణ తోం॥
తోదిగి ధీం । తోదిగి దిందిం ధీం
ధీం దిందిం । దిందిం ధీం
దిం దిం తకదికి — తక తదిగిణ తోం॥

తోదిగిధాం తోదిగి — దందం దాం
తోదిగి ధీం తోదిగి — ధిందిం ధీం
తోదిగి దాం దాం । తోదిగి ధీం ధీం
తోదిగి దాం । తోదిగి ధీం
ధాం ధాం — తక దికి తక
తతోంత దొద్దో
దం దం దాం — తకదికి తక
తతోంత దొద్దో
దాం దాం — తకదికి తక । దం దం దాం — తక దికి తక
తతోంత — తకదికితక
తుంగుతక — దదిగిణతోం॥

* * *

మొహరం—

తిత్తిత్తై — కిటతక తి త్తిత్తై
తోదిగి దందం — తకదికి తక
తుంగాతు తక తోం
తక తోం దికి తుంగ
దిగి దిగి, తక తుంగ
పై కాలము॥ తక తక తోంగ । తక తక తోంగత్తోంగ
తోంతోంతోం । తోం తోం తోం గత్తోంగ

ప్రథమకాలము॥ తొక్కత్తో । దిమి దిమి దిమి ధీం దొద్దొద్దో
తదికతో । దిమి దిమి దిమి ధీం
దొద్దొద్దో
తొక్కత్తో దిమి దిమి దిమి
తదికతో దిమి దిమి దిమి
ధాం — గిణతోం
ధంధం — గిణధీం
ధా దిద్దా దిద్దా దిత్రాంగ
తోందిగి ధాం — దాం దాంఽ
తిత్తిత్తై । కిటతక తి త్తిత్తై

తీరిక॥ తోం దిగి దిం దాం
తకదికితక । తుంగాతు దదిగిణతోం.

* * *

అడ్డిక ముగించి 'నాంది' లేక శబ్దము నృత్యమాడును. ఈ శబ్దము మృదంగ జతులతో ప్రారంభమై ఆయా దేవతలపై స్తోత్ర గీతములు పాడబడి, తీర్మానములతో ముగించబడును. ఈ శబ్దమును మూడు భాగములుగా విభజించవచ్చును. ప్రారంభజతి, తోహారు గీతము, తీర్మానము.

నాంది నృత్యమునకు ముందు ఆయా ఆలయములననుసరించి — శైవ సంప్రదాయమైనచో 'భుజంగత్రాస నృత్తము' వైష్ణవమైనచో 'భ్రమర నృత్తము' బ్రహ్మ తాళమునందు ప్రదర్శించిన తరువాత జతి విన్యాసములతో గూడిన 'నాంది' నృత్యము జరుగును.

'నాంది' క్రమము.

భ్రమర నృత్తము:
బ్రహ్మతాళము—:

తద్దీ, కృతకజం — తదిమిత కిటతక జం
తక్కిటతక — ధిక్కిటతక — తొంగిటతక —
నంగిటతక — ఝంఝం కిటతక॥
తాతై తై దత్తతాం — కిటతక
అతై తై దతతాం॥

శబ్దము—: (ఆదితాళము)

జంతారి కిటతక ధా – దరికిట తక ధా – జేకిట తక–
దరికిటతక – ధిం కిటతక – దిధిత్తళాంగ్‌తక – కిటతక –
ధాణు ధణా ధణత – జెణూ ధిమిత ధిమీ గదిత
తతోంతక తకుధికుక్కు రితకిట జెణుతక కిటతకధా
కిణదణ – జెణుదిమి – గది ॥
తారిత్తారి కిటత్రక । తకుకు ఝుకుకు । రిత కుకుందరీ
తత్త ధింకు । తధింధింకు । తఝొమ్మికా
గధీం తారి కుంతా । ఝుంతరి కిటతర
తక్కుడు తోం తోం గిడతక ।। తోం తోం నంనం గిడతక ।
తొంగుకిడతక । తక తదిగిణతోం

ము క్తా యి—

ఝుం తరికిటతక । తక్కుడు తోం గిడతక
తోదాం నంనం గిడతక । తొంగు కిటతక
తక తదిగిణతోం
} 3 సార్లు

త్తై దత్తాం॥
శ్రీ ల । నీలాసతీ మనోలోల ।
కుక్షిస్థ చరాచర జాల
సద్భక్త జనావన శీల
వరసింగ పల్లి పుర ఖేల
వెంకునాయకాది పరిపాల
(జోహారు వేణుగోపాల) ॥ 3 సార్లు ॥

తీ ర్మా న ము ॥

కిడత క కిడతక । దరికిట తక । ఝెంకిడతక ।
దరికిట తక । ధిం కిటతక । కిటతక కిటతక॥
దిద్దిత్ । తళాంగ్‌తక । తళాంగ్ తళాంగ్ తక ।

తళాంగ్ తక । తదిగిణ తోం॥3 సార్లు॥
తద్ధణత్ । తఝెణత్ । తధిమిత్ । గదిత్
తకిట దదిగిణత॥3 సార్లు॥

* * *

'నాంది' తరువాత 'వినాయక కవుతం' లేక 'కౌస్తుభ' నృత్యము 72 అక్షరముల వినాయక తాళమునందు ఈ నృత్యము ప్రదర్శింపబడును.

ధీత్తెయ్ । ధీత్తెయ్ । తత్తాదిద్ది తోంనంత్తా ।
ధిక్కిట ధిక్కిట తక్క।ధిగ్గుడు తోం తోంగ।ధీం దత్త ధీం
దత్తధీం । ద్ధీం ద్ధత్తక్క। తదిమి దిమిత తక్క। ధిరుగుడు
తాం తోంగ। తా తా ధిత్తా ధిక్కిట తక ధిక్కిత్తాం । ద్ధత్త।
ధిక్కిట కిటతక। ధిక్కిట కిటతక। తొంగిట కిటతక। నంగిట
కిటతక ।

కరిముఖ హరసుర।
వర కమల జనుత
నర పాశాం కుశయుత
చరణంతే చరణం

తక్కిట ధిమికిటతోం। తకతోం। తధిక్కిట ధిమికిట్ట తోం।
సతతం। సిద్ధయుక్త। బుద్ధియుక్త
సింధుర వదనా। తక్కిట కిటతక్క తోంగ్గ
దేహివర గణపతి। ధిక్కిట కిటతక ధిక్కి తోంగ్గ
గణపతి కవుతం। సత్వర వినయర
ధిగ్గుడు తధా। ధిరుడు త్తై। తత్తక్కి।
ద్దిద్ది తద్దిత్తై। తోం తోం గిటతక తోం।
తద్ది కిటతక ధిక్కిత్తా॥

తీర్మానము॥

తంద్దిక తకతక। తంద్దిక తకతక।
తంద్దిక తకతక। తళాంగ్ తోం।
ధిం ధికి ధికి ధికి। ధిం ధికి ధికి ధికి।
ధిం ధికి ధికి ధికి। ధీంగిణతోం।
తంద్దక తక తక। ధళాంగ్ తోం
ధిం ధికి ధికి ధికి। ధీంగిణతోం
ధళాంగ్ తోం। ధీంగిణతోం
తాం తక తద్దితక తరికిటతక।
తక దళాంగ్। తధింగిణతోం॥

'కవుత'ము తరువాత 'సప్తలాస్యము'ల ప్రదర్శనము, దీపారాధనతో నృత్యారాధన ముగియును.

సప్తలాస్యములు.

శుద్ధ, దేశి, పేరిణి, ప్రేంఖణ, దండలాస్య, కుండలి, కలశ— ఈ ఏడు నాట్యములు సప్తలాస్యములు.

ఇందు 'దండలాస్యము' (కోలాటము) యెక్కువమంది నర్తకీమణులచే చేయబడును గాన ఒకే నర్తకి ప్రదర్శించ వీలైనట్టి మిగిలిన ఆరు నాట్యములు మాత్రము ప్రదర్శించి 'దండిక' వేరుగా ప్రదర్శింతురు.

ఈ నాట్యములు అతి ప్రాచీన కాలమునుండి మనదేశములో ప్రచారమునందున్న శాస్త్రీయ నృత్యములు. శ్రీనాధకవి, పాల్కురికి సోమనాధుడు మొదలైనవారు తమయొక్క రచనల యందు ఈ నృత్యముల గూర్చి పేర్కొనియున్నారు. జాయపసేన విరచిత 'నృత్య రత్నావళి' యందుగూడా ఈ నాట్యములగురించి వర్ణన యున్నవి. కాని ప్రస్తుత కాలములో ఈ నాట్య సంప్రదాయముల నారాధించువారు అరుదై అత్యద్భుతమైన ఈ నృత్యములు అదృశ్య మగుచున్నవి. ఆలయములలో సుందర శిల్పము జీవకళలుట్టి పడు నట్లు చెక్కుటకు ఆధారములు ఈ నాట్య విన్యాసములే.

1] శుద్ధనాట్యము.

(1) దక్షిణ భ్రమన . (5) విద్యుద్భ్రమన
(2) వామ భ్రమన (6) లతాభ్రమన
(3) లీలా భ్రమన (7) ఊర్ధ్వ తాండవ.
(4) భుజంగ భ్రమన

ఈ ఏడు విధములైన భ్రమరికములను గలిగి,

(1) మయూర గతి (4) గజగతి
(2) మరాళ గతి (5) సింహగతి
(3) కురంగ గతి (6) శుక గతి

ఈ ఆరు పద్ధతుల గతి విన్యాసములు గలిగి,

(1) మయూరలలిత
(2) గంగావతరణ
(3) కరిహస్త
(4) సింహ విక్రీడిత
(5) కీరభూషణ

ఈ అయిదు కరణముల ప్రదర్శనము గలిగి

(1) స్థితావర్త (4) స్యందితా
(2) ఉరుద్వృత (5) ఉస్యంధిత
(3) వక్త్రిబంధ

చారి విన్యాసములు గలిగి,

6 తాళములు భూచారి ప్రదర్శనమునకు

6 తాళములు ఆకాశ చారి ప్రదర్శనమునకు

(1) మల్లికామోద—
2 లఘువులు—4 ద్రుతములు
(2) హంసనాద—
1 లఘువు 1 ప్లుతము 2 ద్రుతములు.
(3) జంపతాళము—1 ద్రుతము ద్రుత విరామ 1 లఘువు 2½ మాత్రలు.
(4) ద్వితీయతాళ—2 ద్రుతములు—1 లఘువు
(5) పూర్ణ కంకాల—4 ద్రుతములు 1 గురువు 1 లఘువు
(6) ఉద్ఘట్ట—3 గురువులు
(7) అభంగతాళ – 1 లఘువు – 1 ప్లుతము.
(8) సింహ విక్రమ—3 గురువులు 1 లఘువు 1 ప్లుతము
1 లఘువు 1 గురువు 1 ప్లుతము.
(9) శరభలీలా—2 లఘువులు 4 ద్రుతములు
2 లఘువులు.
(10) జంప.
(11) కోకిల ప్రియ—1 గురువు 1 లఘువు 1 ప్లుతము.
(12) జంప:—

ఈ విధముగ 12 విధములైన తాళ విన్యాసములు గలిగి నట్టిది శుద్ధ నాట్యము.

2] దేశి :

(1) మన్మధ కరణ.
(2) సౌందర కరణ.
(3) వరుణ కరణ.
(4) గజ విక్రీడిత కరణ.
(5) చంద్ర కరణ.
} ఈ అయిదు కరణములు.

(1) చాష గతి చారి.
(2) విచ్యావ చారి.
(3) అద్దితా చారి.
(4) జనితా చారి.
(5) శకటాస్య చారి.
} ఈ ఐదు చారి భేదములతో

(1) వి కుంచిత.
(2) కుంచిత.
(3) ఆకుంచిత.
(4) పార్శ్వ కుంచిత.
(5) అర్ధ కుంచిత.
} ఈ ఐదు గతి భేదములతో

పూర్ణకంకాల తాళమును గలిగి నట్టిది దేశి.

(3) పేరిణి :

పేరిణి పంచ అంగములు.

(1) గర్ఘరము. (2) విషమము. (3) భావాశ్రయము.
(4) కవి వారకము. (5) గీతము.

గర్ఘర విన్యాసము:—

(1) పటవాట (2) పటవము (3) సూరి వర్తైము
(4) లకాడిమి (5) సిరిబిర (6) హలాచిద
హైరాంబ కరణము—అపక్ర్యందితా చారి,
విన్యాసములు గలిగియుండును.

[4] ప్రేంఖణ :

వివిధ కరణ విన్యాసములు గలిగి భ్రమరములతో ముగింప బడి—చారి భేదములతో అలంకరించబడి ఉద్ధతమై గంభీర భావముల గలిగినట్టిది ప్రేంఖణ.

కంఠ కరణము., సమోత్సాత మత్త విచారి; విన్యాసములు గలిగినది.

ఈ నాట్యమునకు తాళము—

1 లఘువు
1 గురువు } గల రాజ విద్యాధర తాళము.
2 ద్రుతములు

[5] దండికాలాస్యము : (కోలాటపు కోపు.)

వినాయక తాళ నృత్యముతో ప్రారంభింపబడును. ఆరు విధములైన భంగిమలు, గతుల విన్యాసము గలిగియుండును. ఇది బృంద నృత్యము నర్తకిమల రెండు చేతులలో కోలలు పట్టుకొని నాట్యము చేయుదురు. విష్ణుక్రాంత కరణము, ఆద్యార్ధిచారి ప్రదర్శనము, తాళము విజయానంద — 2 లఘువులు, 3 గురువులు గలిగి 8 మాత్రల కాలము గలిగినట్టిది.

[6] కలశ :

జయమంగళ తాళమునందు చేయబడును. — 2 లఘువులు 1 గురువు 2 లఘువులు 1 గురువు, 8 మాత్రలు.

గరుడ ప్లుతకరణము, ఏడకా క్రీడిత చారి.

[7] కుండలి :

నారాయణ కరణము, మత్తల్లికా చారి.

1. ద్రుతము యిరుప్రక్కల లఘువు గల 2½ మాత్రల లక్ష్మీశ తాళము.

---

## 1 శుద్ధ నాట్యము

నృత్త వివరములు—దక్షిణ భ్రమనము.

మొదటి పద్ధతి—మల్లికామోద తాళమునందు ప్రదర్శించి మయూర-గతిని, మయూర లలిత-కరణముల నాడి,సమపాదచారితో ముగించవలెను.

రెండవ పద్ధతి—హంసగతి హంసనాద తాళమునందు ప్రదర్శించి హరిణప్లుత కరణమునాడి. స్థితావర్తచారితో ముగించవలెను.

మూడవ పద్ధతి—కృష్ణ సారిగతి జంప తాళమునందు ప్రదర్శించి, గంగావతరణ కరణమునాడి ఉద్వృత్త చారితో ముగించవలెను.

భ్రమనము:—

ఒక కాలిని భూమిపై నానించి రెండవ కాలితో యిరు ప్రక్కలకుగాని, సర్పాకారముగా గాని, లతాకారముగా గాని తిరుగుట భ్రమన మనబడును.

[1] దక్షిణ భ్రమనము :

ఎడమకాలిపై నిలువబడి కుడికాలిని పైకెత్తి కుడి ప్రక్కకు తిరుగుట దక్షిణ భ్రమనమనబడును. ఇది మల్లికామోద తాళమునందు ప్రదర్శించవలెను.

తత్త తత్తా – తరికు కకిణ త్రా – కిణకిణత్రాత్రా–
కిణ – తిటనక – ఒకతా॥

మయూరగతి:—రెండు చేతులందు కర్తరీ ముద్రనుపట్టి నైన స్థానకమున నిలువబడి ఎడమ పాదమును కదలించుచు నర్తన మాడుట.

నృత్త శబ్దములు:—

జణకు దరికు – కుకుని – కుకున – ణకు ఝెం
దణకు దరికు – కుకుని – కుకున – ణకు – ఝెం
ధరిత జణుత – కుకుని – కుకున – ణకు – ఝెం
తతఝె తదణ – కుకుని కుకున – ణకు – ఝెం

మయూర లలిత కరణము:—

కాలిని వెనుక ప్రక్కకు వంచి, శరీరమును నడుమువద్ద మలిచి చేతులందు 'రేచిత హస్తము' పట్టిన మయూర లలిత కరణ మగును.

సమపాదచారి:—

ప్రక్కలకుగాని, ముందు వెనుకలకుగాని కదులునప్పుడు రెండు కాళ్ళను సమముగా ఒకదాని ప్రక్క నింకొకటి వుంచినట్లయిన సమపాదచారి అనబడును.

శైవస్థానకము:

ఒక కాలిని సహజముగా నుంచి, రెండవకాలిని వంచి, మొదటి కాలిపై మోకాలివద్ద తగులునట్లు చేర్చిన శైవస్థానక మగును.

రేచిత హస్తము:—

రెండు చేతులందు అలపద్మముల పట్టి గుండ్రముగా త్రిప్పుతూ ప్రక్కలకుగాని, ముందునకుగాని త్వరితగతిని తెచ్చిన యెడల 'రేచిత' మగును.

పై విన్యాసములతో గూడిన నృత్తము దక్షిణ భ్రమనము లోని మొదటి పద్ధతి.

[2] హంసగతి :

సమపాద స్థానమునందు నిలువబడి రెండుచేతులందు 'పక్ష వంచిత' హస్తముపట్టి, పాదములను 'విషమ సంచారము'నకు మార్చిన హంసగతి యగును.

దీనికి 'హంసనాద' తాళములో మృదంగ శబ్దములు.

నకు జక కిటతరి కుందరి కుకుంతత్తా—తొంగిట కిటకిణ

నకు—కుకుతాం తోంకిటతా.

ణకకిణ జకకిట తాకిట తకుందరి—తాంగిట—తకకిణ

నక—కుకుతాం తోంకిటతా.

ణంణం జంకిట తాంగిట తకుందరి—తాంగిట — తకకిణ

నక—కుకుతాం—తోంకిటతా.

హరిణప్లుత కరణము:—

అతిక్రాంతమునందు నిలువబడి, నర్తకి గాలిలోనికి యెగిరి, భూమిపై నిలిచి మోకాలిని వంచిన హరిణప్లుత మగును.

స్థితావర్తచారి :

సమపాదములోని ఒక పాదమును భూమిపై వలయముగా త్రిప్పి, రెండవ కాలిని పైకెత్తిన స్థితావర్తచారి యగును.

విషమ సంచారము :

పూర్తి పాదమును భూమిపై ఆనించక, మునిగాళ్ళపైగాని, మడమలపైగాని, ప్రక్కలపైగాని నిలువబడుట విషమ సంచారము.

పక్షవంచిత హస్తము:—

రెండుచేతులందు అర్ధచంద్ర హస్తములను పట్టి నడుముపై ఆనించిన పక్షవంచిత హస్తమగును.

అతిక్రాంత స్థానకము :

అతిక్రాంతము పట్టే విధానము వివరముగా తెల్పియున్నాము.

(3) కృష్ణసారగతి :

రెండు చేతులందు మృగ శీర్షములను పట్టి 'కుత్తన' పద విన్యాసము జంపతాళమందు ప్రదర్శించవలెను.

పాదము ముందరి భాగముతోగాని, మడమలతోగాని పూర్తి పాదముతోగాని, భూమిని తట్టుట 'కుత్తన' మనబడును.

మృదంగ శబ్దములు:—

నతితోం—ణకకుణం—జకతరిత—తదిగినతోం—

తరికు—జకకు తరిజం—జణకుతాం—

జేజేకిట—॥

దితితోం—దినతకుం—దినతరిత—ధీంగిణతోం—

తడికు—జకకుతరిజం—ధణకు—ధణుకుతాం—

జం జం కిట॥

గంగావతరణ కరణము:—

సమపాద స్థానకమునందు నిలబడి చేతులందు అంజలి ముద్రను పట్టి శరీరమును ముందు ప్రక్కకు వంచవలెను.

ఊర్ధ్వకచారి:

పాదము ముందరి భాగముపై నిలబడి, మోకాళ్ళనువంచి, మడమలను ఒకదానికొకటి యెదురుగా వచ్చునట్లు జేసిన ఊర్ధ్వత చారి యగును.

పై మూడు రకములైన ఆంగిక ప్రదర్శనముతో గూడినట్టిది దక్షిణ భ్రమనము.

2. వామభ్రమనము

దక్షిణ భ్రమనమునందు ప్రదర్శించిన 'ఆంగికమే' వామ భ్రమనము. అందు ఎడమ ప్రక్కకు ద్వితీయ తాళమునందు ప్రదర్శించ వలెను.

శబ్దములు :

కిటకిట—కిణతోంగ—జగనగ—జంతరి—
తకుజక—కిటతరి – తాంతాం—కిటతోంగ
ణంణం—కిటకిట – కుకుకరి—తోంగిణత.

గజగతి. పూర్ణకంకళ తాళములో ప్రదర్శించి, కరిహస్తకరణము వక్త్రిబంధ చారితో ముగించవలెను.

రెండు చేతులందు పద్మకోశ హస్తములను పట్టి, ముందుకుగావి, వెనుక ప్రక్కకుగాని అధోముఖ దృష్టిని గలిగి పూర్తి పాదమును భూమిపై తట్టవలెను.

శబ్దములు :

కిటతోంగ—తకకిటతోంగ—తాంగితా –
తోం జగ నంగి—జకునకు కిడతో—జం జం తోంగ-కిణ్ణ
దిమితైయ్యా దిగినగతోంత-తోంగిడా—
తోం తకదిమితాహ— ఉనకు జకు దిమితో–తాంతాం
తద్ది—తైయ్యా॥

కరిహస్తకరణము:—

సమపాదమునందు నిలువబడి, కరిహస్తమును పట్టి, అనువృత దృష్టిని గల్గియుండిన కరిహస్తకరణమగును.

వక్త్రిబంధచారి:—

మాటి మాటికి కాళ్ళను స్వస్తికముగా జేసి మోకాళ్ళను కదిలించవలెను.

కరిహస్తము:—

ఎడమచేత త్రిపతాకము పట్టి భుజము వద్దనుంచి కుడిచే పద్మకోశము భూమితట్టు జూమినట్లు పట్టవలెను.

అనువృత్తదృష్టి—సూక్ష్మదృక్కులు.

[3] లీలాభ్రమనము:

ఎడమచేతిలో శిఖరము, కుడిచేత పతాకము పట్టి కుడికాలు వంచి, పైకెత్తి వలయము తిరగవలెను.

జంపతాళమునందు ఈ భ్రమనము ప్రదర్శించవలెను.

కిణ్ణా తోంగతోం—తద్దికతాం తాతజం
దిమ్మిదిమికిటతై—ధీదిత్త దిమిదిమి తా.

[4] భుజంగ భ్రమన :

కుడికాలియొక్క మడమను యెడమ మోకాలిపై జే నుము కొంచెముగా వంచి, శరీరమును కదిలించవలెను. హ ములు నాగబంధముద్ర పట్టవలెను.

రెండు చేతులందు సర్పశీర్షముల స్వస్తికముగా పట్టిన నా బంధ మగును.

శబ్దములు :

తోకిట తోంగతా_ తద్దిధిక కుకిక జెం—

తరువాత—సింహగతి, సింహవిక్రమ తాళమందు ప్ర ర్శించ వలెను.

రెండు చేతులందు సింహముఖ హస్తముపట్టి, గాలిలో యెగిరి కుడికాలిని భూమికి రాయుచు జరిపి, మరల అట్లే యెడ కాలితో గూడ ప్రదర్శించవలెను.

శబ్దములు :

కిటతోం గత్తా_తక కిణ్ణంతా తగునగు తరికిట—
కుకుజెం—జెకిన్నతరి కుకునక జెం—తరి ధళాంగ్ క
దరికుత—తకుకుం జహాతరికుం తకుకిణతా_తజ్జెక కు

సింహవిక్రీడిత కరణము:

ముందుగా కాలిని చాచి, రెండుచేతులందు సింహవ ముద్రమ పట్టి ముదువ వలెను.

కిత్స్యందిత చారి :

కాళ్ళను లోపలికి ముడిచి ముందుకు చాచి చేతులతో రేచక విన్యాసము ప్రదర్శించవలెను.

6] విద్యుద్భ్రమన :

ఈ భ్రమనము ఉద్గట్ట తాళమునందు ప్రదర్శించవలెను. రెండు కాళ్ళను ఒకదాని తరువాత మరొకటి పైకెత్తి, గాలిలోనికి ఎగిరి దగ్గరకు దెచ్చి, మరల భూమిపై నిలిచి, ఎడమకాలిని వంచి, ఎడిప్రక్కకు మూడు పర్యాయములు తిరుగుతూ త్వరిత గతిని పైకి క్రిందికి ఆడవలెను.
వట్టే హస్తము—రేచితము.
ఉద్గట్ట తాళము :

తరికు జక దిత్తరితో దికకిటతా—తా–తా–
జకుతా–కు జక్కతా.

7) లతాభ్రమన :

ఎడమ కాలిపై నిలువబడి, చేతులందు బాణహస్తము పట్టి కుడికాలిని చాచి కుడి ప్రక్కకు ఐదు పర్యాయములుగాని ఏడు పర్యాయములుగాని తిరిగి కుడికాలిని మడిచి మరల తిరుగవలెను. ఇది 'శరభలీల' తాళమందు ప్రదర్శించవలెను.

శబ్దములు

తోం తద్రుమ – కిణతోంగ తత
తాం తంగిణ – తాకిట దివత
పిమ్మట శుకగతి కోకిలప్రియ తాళమందు ప్రదర్శించి, కీర భ్రమణ కరణము, స్యందిత చారితో ముగించవలెను.

శుకగతి :

వర్ధమాన స్థానకమందు నిలువబడి రెండు చేతులందు శుక తుండ ముద్రలు పట్టి వక్షమున కెదురుగా ఎనిమిది అంగుళములు దూరముగా యుంచవలెను. పదగతి 'సరణము'

శబ్దములు:

తగనగ జగజే–తరి తత జెం
కిణకిణ కిటకిట జెం—

జగ జగ జంకిణ—దరి దరి జణ
దణ జణ కిణ కిట ధాం.

వర్ధమాన స్థానకము]

రెండు కాళ్ళయొక్క మడమలు తగులునట్లు కాళ్ళను కుదించి నిలబడవలెను.

సరణగతి :

కాళ్ళను భూమిపైనుండి పైకి యెత్తకుండా ముందుకు జరిపిన సరణమగును.

కీర భ్రమణ :

రెండు చేతులందు అర్ధచంద్ర హస్తములు పట్టి రేచక విన్యాసము ప్రదర్శించవలెను. పాదములు సమము. దృష్టి సహజము.

స్యందితచారి :

ఎడమకాలిపై శరీరముయొక్క భారమును మోపి నిలువబడి, కుడికాలు ఐదు అంగుళముల పొడవుగా చాచి పట్టవలెను.

[7] ఊర్ధ్వతాండవ :

ఎడమకాలిపై నిలువబడి, ఉల్లోకిత దృష్టి గలిగి, కుడికాలిని పైకెత్తి కుడి చెవికి యెదురుగా యుంచవలెను. కుడిచేతియందు శిఖర ముద్రను వక్షము వద్ద పట్టి, ఎడమచేత పట్టిన శిఖరమును తలపైకి దెచ్చి పరిపాదమును పట్టుకోవలెను. ఈ భంగిమలో విన్యాసము చేయవలెను. ఇది ఝంప తాళములో ఆడవలెను.

శబ్దములు :

కిణ జకకుతా–తద్ధి తాద్యేం తో తరికు తాదితాద్యేం
దివత ధిర్గుడు ధిర్గుడు తత–జనక కిటతక కిటతక తోం
ధిరికిట ధిరికిట తక్–ధిరికిట ధిరికిట తక్
జం, గిడగిడ గిడగిడ గిడగిడ గిడగిడ గిడగిడ
గిడగిడ తోం.

ఈ శబ్దములను అద్భుత రసమొప్పునట్లు ప్రదర్శించవలెను.

———

## 2. దేశి

ఐదు విధములైన కరణ, చారి ప్రదర్శనములు గలిగియుండి వికుంచిత, కుంచిత, ఆకుంచిత, పార్శ్వకుంచిత, అర్ధకుంచిత విన్యాసములతో అలరారుచున్నట్టి నృత్యము 'దేశి'

[1] వికుంచిత :

రెండు చేతులందు పద్మకోశములు ఊర్ధ్వముఖముగా ప్రారంభములో ముందు ప్రక్క పిమ్మట వెనుక ప్రక్క పట్టవలెను. కుడికాలిని వంచి ఎడమకాలియొక్క మోకాలిపై ఆనించవలెను. సహజ దృష్టి.

ఈ నృత్యము దర్పణ తాళములో చేయవలెను.

శబ్దములు :

కిడికిడజెం తకంకిణ జం జం విద్దా
ధగధగ ధాం తకుంతరి తాం తాం తత్తా.

మయూరిగతి :

నాగబంధ స్థానకమునందు నిలువబడి, రెండు చేతులందు కర్తరీ ముద్రలు పట్టి, సరణ పద భేదము రాజనారాయణ తాళమందు ప్రదర్శించవలెను.

రాజనారాయణ తాళము :

దరి తకికుత కుతాం — తో తరికుతకు జెం
కిట జనకు కిటతోం॥
తకణక జతతతోం—తాం తరికుతకు తాం
తక దరికిటకు తాం॥

మన్మధ కరణము :

ఆలీఢ స్థానకమునందు నిలువబడి, త్రిపతాకముల బట్టి ఎడమచేతిని చాచి, కుడిచేతిని భుజముపై జేర్చవలెను. శరీరమును యిరుప్రక్కలకు వంచుతూ, మరల సహజముగా నుంచవలెను.

చాషగతిచారి :

కుడికాలిని ఒక అడుగు దూరమువరకు చాచి మన్మధకరణ విన్యాసము చేయవలెను. అటుపై సమపాద చారితో ముగించవలెను.

నాగబంధ స్థానకము :

కూర్చున్న భంగిమమందు కుడి మోకాలు ఎడమకాలి యొక్క తొడకు తగులునట్లు వుంచిన అది నాగబంధమగును.

సరణపద భేదము గూర్చి తెల్పియున్నాను.

ఆలీఢ స్థానకము :

చిత్రముగూడా యిచ్చియున్నాను.

(2) కుంచిత :

ఈ నృత్యము చాచపుట తాళములో ప్రారంభించి, హంసిని గతి, సౌందర కరణము, విచ్యవచారీ ప్రదర్శనముతో ముగించవలెను. రెండుచేతులందు సందంశ ముద్రలు అధోముఖముగా ముందువైపునకు అటుపై వెనుక ప్రక్కకు పట్టి ఎడమకాలిని వంచి కుడికాలి మోకాలిపై నుంచవలెను.

చాచపుట తాళము :

తోంగిట తో తత్తా-కిట తకణక ఝెం

హంసినీ గతి :

మండల స్థానకమందు నిలువబడి రెండు చేతులందు హంసపక్ష హస్తములు పట్టి, ఎడమ పాదముతో విన్యాసము ప్రారంభించి, రెండుప్రక్కలకు ప్రదర్శించవలెను.

హంసలీల :

తిట తకుకుకుతా నకుతరి తకుఝె
తక కిట జకు జం- తతణకి జకు జం
తరిత తరిత తా—తరికిట కిటఝె
దణత జణక జం దరిదరి కుకుజం

సౌందర కరణ :

ఎడమకాలిపై నిలువబడి, కుడికాలిని ఎడమకాలి మోకాలి పైభాగమున ఆనించి, రెండు చేతులందు చతుర ముద్రలు ఒకదాని కెదురుగా ఒకటి పట్టవలెను.

ఔంచ్యావసారి :

సమపాదమందు నిలువబడి, ఒక కాలిని విడదీసి, భూమిపై తట్టవలెను. అటుపై రెండవ పాదమును గూడా తట్టవలెను.

మండల స్థానకము :

చిత్రము, వివరణ వేరుగా యిచ్చియున్నాము.

[3] అకుంచిత :

రంగతాళమందు ప్రారంభించి హరిణిగతి, వారుణ కరణము ప్రదర్శించి అద్దితాచారితో ముగించవలెను.

కుడికాలినివంచి, తొడపై ఆనించి చేతులందు పతాక ముద్రలు పట్టవలెను.

శబ్దములు :

తటకిన_తటకిన_కిటతకు_కిణణక_తాదికకిణతా
డిగిణత_దిగిణత_దినతకు_కిణణక_ధీకిట జణతా
తకిటత_కిణతక_తదితది_జణుతక_తాకిట జణుతా
దరికిట_కిటతక_దదితది_కిణకిట_దాదరి జెణుతా॥

హారిణి గతి :

కూర్మాసన స్థానకమందు నిలువబడి, అర్ధ పతాక ముద్రలు పట్టి ఎడమకాలితో విన్యాసము ప్రారంభించి, కాలి ముందర భాగముతో భూమిని తట్టుచు కోణములుగా సింహనాద తాళ మందు విన్యాసము జేయవలెను.

శబ్దములు :

ఓకగుణ తకణకు తదిక కిణ్ణతా-కిట కిణకు జనతరికు తోం-
తత్త తగుతరి తరి తరి కుతా॥

వారుణ కరణము :

వర్ధమాన స్థానక మందు నిలువబడి, కర్తరీ స్వస్తిక ముద్ర పట్టి, మోకాళ్ళను కొంచెముగా వంచి విన్యాసము జేయవలెను.

అద్దితా చారి :

ఈ చారి విన్యాసము నందు కాలియొక్క ముందరి భాగము భూమి కానించుచు, ముందు వెనుకలకు కదలవలెను.

కూర్మాసనము:—ఎడమ కాలిని సహజముగా వుంచి, కుడి కాలి పీలమంత, మోకాలు భూమికి తగులు నట్లు వుంచిన కూర్మాసన మగును. వర్ధమానము గురించి చెప్పియున్నాము.

[4] పార్శ్వాకుంచిత :

ఈ విన్యాసము బిందుమాలి తాళమందు ప్రారంభించి, కరిణి గతి, గజ విక్రీడిత కరణము ప్రదర్శించి జనిత చారితో ముగించవలెను.

చేతులందు శుక తుండములు పట్టి, తలను క్రిందికి మీదికి సొంపుగా కదిలించి, పైకి క్రిందికి చూడవలెను. కుడికాలిని వంచి మడమ భాగము ఎడమకాలి యొక్క తొడపై చేర్చవలెను. తరువాత ప్రక్కలకు దృష్టిని ప్రస్తారము చేయవలెను.

శబ్దములు :

జంజం కిటతోం-కిట తకువకువకు తోంగిట కతోంగ
తాంద్ది తకతోం-తక తరికిట కిట తోంగిట తతోంగ
ధీంతా దిద్దితాం-దిర్ జక ణక కిణ ధీంకిట దితోంగ
ణం ణం కిటతోం-ణకు జకు కిణణక ణంకిట
తతాంగ

కరిణి గతి :

కరి హస్తము పట్టి, కుడి కాలిని సహజముగా వుంచి, ఎడమకాలితో అర్ధ చంద్రముగా విన్యాసము జేసి, త్వరితగతిని ముందుకు నడిచి, మరల యింకొక కాలితో వెనుకకు నడువవలెను. దీనికి తాళము గజలీల.

జెకు నకకు జెకుకు జగ తాంతా కులిత తతరికు
జగనం

గజ విక్రీడిత కరణము —:

ఎడమ చేత త్రిపతాకము పట్టి, నడుమువద్ద జేర్చి, కుడి చేతితో లతాముద్ర పట్టవలెను.

కుంచిత పద విన్యాసము.

జనిత చారి :

ఒక చేతితో కటకా ముఖము వక్షము వద్ద పట్టి, రెండవ చేతితో రేచిత విన్యాసము ప్రదర్శించ వలెను. అగ్రతల సంచార పద భేదము.

**లుంఠిత పాదము :**

కాళ్ళను స్వస్తికము జేసి, యిరు ప్రక్కలకు ఊయలవలె కదలించిన లుంఠిత మగును.

**అగ్రతల సంచారము :**

బొటనవ్రేలు, మిగిలిన వ్రేళ్ళను బాగుగా విడదీసి భూమిపై ఆనించి మడమను పైకెత్తిన అగ్రతల సంచార మగును.

**[5] అర్ధ కుంచిత :**

ఈ నృత్యము కోకిల ప్రియ తాళమందు ప్రారంభించి, పారిక గతి, చంద్ర కరణ, శకటాస్య చారితో ముగించవలెను.

రెండు చేతులందు కర్తరీముఖ ముద్రలను పట్టి,కదలించుచు ఎడమ కాలిని ముక్కోణముగా వంచి, కుడి కాలియొక్క మోకాలిపై ఆనించి, ఎడమ ప్రక్కకు జూడవలెను.

**శబ్దములు :**

జగనక కిటా–జంకకు జెంకిణ్ణత.

**పారిక గతి :**

కుడిచేత అర్ధ చంద్ర, ఎడమ చేత శుక తుండము పట్టి వైశాఖ స్థానకముతో ప్రారంభించి, కుడి కాలిని ఎడమ చేతియొక్క భుజములు తాకునట్లు తెచ్చి ఎడమ కాలితో విన్యాసము చేయవలెను.

**కందర్ప తాళము :**

తగు జగు తకితోం — ఝకిణ్ణ తతికిణత
ఝక జక ఝకితోం — జంకిణ ఝజగణత
తరి తరి తక తోం — తొంకిణ తతకిణత
జగ జగ నగితోం — జంకిట కిట తరిత.

**చం[ద్ర] కరణము :**

అద్రిత చారితో ప్రారంభించి, స్ఖలిత పద భేదము ప్రదర్శించ వలెను. చేతులందు ఊర్ధ్వమండలి ముద్రపట్టి తరువాత రేచిత విన్యాసము త్వరితము ప్రదర్శించవలెను.

**శకటాస్యము:—**

కాలి యొక్క ముందరిభాగమును జరిపి శరీర సౌష్ఠవము తవబడునట్లు నిలువబడవలెను.

**ఊర్ధ్వ మండల :**

రెండు చేతులందు అరాళములు పట్టి పైకి చాచవలెను.

స్ఖలిత — రెండుకాళ్ళను ఒకేసారి జారవిడుచుట స్ఖలితము.

---

## 3. పేరిణి

**పేరిణి పంచ అంగములు :**

(1) గర్ఘరము (2) విషమము (3) భావాశ్రియము (4) కవి వారకము (5) గీతము

**(1) గర్ఘరము :**

వివిధ విధముల గజ్జెలను ధ్వనింపజేయుచు పాద విన్యాసము ప్రదర్శించుట. ఈ గర్ఘరము ఆరు విధములు.

**(a) పటువాటము :**

రెండుపాదములను భూమిపై మోపియుంచి నృత్యమాడుట. కాలి ముందరి భాగము (వేళ్లు) భూమికి తాకించి యుంచి, మడమలతో భూమిని తట్టుచూ నృత్యమాడుట - ఒక కాలితో తట్టుచు గాని, కాళ్ళు మార్చి వేయుచు గాని.

ఈ అడవుకు శబ్దములు:- తకతక తక తక.

**(b) పబవము :**

కాలిని గాలిలోనికి యెత్తి-భూమిపై పాదమును తట్టుట.

రెండు పాదములను భూమిపై నుండి — ఒక పాదమునందు మరియొక్క పాదాంగుళులుంచి తట్టుట.

ఈ అడవుకు శబ్దములు—

ధగ ధగ ధగ ధిగ

**(c) సూరివట్టము :**

రెండు పాదములను భూమిపైనుండి ఒక పాదమును తట్టి, ముందుకు జరిపి మరల నట్లే వెనుకకు తెచ్చుట.

అడవుకు శబ్దములు—

తక్కిట కిటతక తక్కిట కిటతక.

(d) లతాడలియా :

ఒక దాని తరువాత నొకటి రెండు కాళ్లు గాలిలోనికి యెత్తి మెల్లగా మరల భూమిపై నుంచి మడమలు భూమిపై నానించక నర్తనము సల్పుట.

శబ్దములు-ధిగ్గు ధిగ్గు.

(e) సిరిబిరము :

సమపాదములోని ఒక కాలిని తట్టి, ముందుకు జరిపి, మోకాళ్ళను కదిలించి నాట్యమాడుట. లేక స్వభావికముగా నున్న పాదములను మోకాళ్ళచే కదిలించుట.

ఈ అడవుకు శబ్దము:—

తకుకుకు తకుకుకు తేం దిగి దిగి దిగి

(f) హాలా బిడము :

ఒక కాలిని వ్రేళ్ళపై ఆనించి-నిలిపి రెండవ కాలిని భూమిపై తట్టి యిరు పార్శ్వములకు వరుసముగా తిరుగుట.

అడవుకు శబ్దము —

తకుధికు తకుధికు తకుధికు తకుధికు

[2] విషమము :

కాళ్ళ యొక్క, పాదముల యొక్క విన్యాసము గాలిలోనికి యెగిరి ప్రారంభించుట విషమము.

[3] భావాశ్రయము :

శరీరమును వివిధ విధముల వంచి (వికృతముగా) నర్తన మాడుట.

[4] కవి వారము :

భగవంతుడు గాని, ప్రభువు యొక్క గాని గుణ కీర్తనము చేయు గీతములకు (శబ్దములకు) నృత్యము ప్రదర్శించుట.

ఉదా :

తజ్ఞేకు - ఝంకిటకు - కిటతక ఝంత - ఝంతారి—
కిటకిటక - ధెగధెగద - దణదణత-కిణకిణత—
తాహంత - కిటతక ఝంత
క్షీరాబ్ధి శయనురే
శృంగార కారురే
కరుణాంత రంగురే
కౌసల్యా తనయురే
ధీరకిట - డకిట - క్కిణకి-ఝేకి-ఝణకి-తరిగి -
తర్రంగి - తకఝంగ-తోదిమిత
కేతకి - తాటకి - మర్దన
కౌశిక - యాగ - సంరక్షణ
నంగిటతక - దిద్దికిటతక-దిద్దిక్కు-కుంతారి
కుంతారి-దిద్దిక్కు-దిద్దిక్కు-కుంతారి.
అహల్యా శాప విమోచన
అరచేత దండన-ఖండన-మండన
జానకీ కళ్యాణ జమదగ్ని-రామాను భంగ
తత్తకిట-కిటతక తకిట
సాకేత పట్టణ వాస్సాను తీశ
చదరంగ రణభీమ పట్టాభి రామావతారా
తగ్గధీం-తగగధీం-తాహతధీ—
తగ్గ-ద్దీంత
తద్దీంత-గద్దీంత చరికిటతక
తత్తజేం - ఝంత - తద్దిత్త-దిత్త-
(దదిగిణ తోం) ॥3 సార్లు॥

[5] గీతము :

కైవార ప్రబంధ గీతములతో గూడిన నృత్తము.

ఉదా:—

నాటరాగము - రూపక తాళము

దుగు దుగు ఝెం ఝెం-తత్త ఝెం ఝెం-ఝెంత ఝెంతత్త—
తత్త తత్త దిక్కి-తదిం ధింకుక్కి-ఝకకు ఝెం-ఝగ ఝగ ఝగ
ఝగ ఝగగ-ఝెంతరి త్తకిట-ఝెంతరి తకిట—
ధాకిట ధాధాకిటధ-ధళం ధళం-ఝగ ఝగ ఝెంత్ర ఝెం -
త్రఝెంతరి-తంధాం తాధిమికిట-తుత్తు దుగు దుగు
దుగు దుగు-తాదిగిదిగి దిగి దిగి దిగి - ధాం ధాం—
తుత్తు రుత్తు త్తురు-ఝెంత్త రిత్త రిక్కి-తొదిగి తత్త దిగిద—
ఝకు ఝెం-ట గణగణగణ గణగణగ-ఝగఝగ ఝంకిణ—
కిణఝంక్కిణ-ఝం ఝం క్కిణ-ఝంత్త రిత—

రి త్తరిత తధ - తంతుక్క-ఝెంతరి - ఝెంతరి - ఝెంతరి॥

*  *

పేరిణి, మృదంగ శబ్దములతో కూడిన జతికి గర్షర విన్యాసము జేసి ప్రారంభించవలెను. ముగింపు గూడ అట్లే చేయబడును. ప్రారంభ శబ్దములు బ్రహ్మానంద తాళములో నుండును.

జతి—ధరికుకు కుణాం జణకుకు కుతా—కిటతరి జగణం
తో తరికుతజం కిటతక తకఝెం—కిటతోంగతా—
తకజక—కుకునకకుతా—జహకిటతక జనకుంఝెం—
జకతక తకజన ఝెం జఝెం— కిట తత్తా తకు
తరకిణతా—తతకిత త్తళాంగ్ కిణ్ణతను జగనత ఝెం—
కిణ్ణ కిటతోంగ కిటకిట కుకుఝెం—తరికిన కినకిట
కుకుతా

ఈ శబ్దములకు 6 విధములైన గర్షర విన్యాసములు ప్రదర్శించవలెను. ఇందు వుపయోగించే స్థానకము—బ్రహ్మస్థానకము॰ హస్తములు—కపిత్థము, శిఖరములు వుపయోగించవలెను.

ఒక పాదమును సహజ పద్ధతిని భూమిపైనుంచి, రెండవ కాలిని మొదటి కాలియొక్క మోకాలిపై మోపి పైకి జరిపిన బ్రహ్మస్థానకమగును. అటుపై హైరాంభకరణ విన్యాసము. అపస్యందితాచారి విన్యాసము చేయవలెను.

హైరాంభ విన్యాసమునందు చేతులను ప్రారంభములో హృదయము వద్దనుంచి అటుపై 'పార్శ్వమండల' నృత్త హస్తము లోనికి మార్చి యిరుప్రక్కలకు నటించవలెను. హస్తము ననుసరించి తను గతి యుండవలెను.

'పార్శ్వమండల'—రెండు చేతులందు అరాళములు పట్టి ఆ చేతులను ప్రక్కలకు దెచ్చిన పార్శ్వమండల మగును. ఈ హస్తము పావురాయియొక్క సొగసైన గతి విన్యాసమునకు, నాగాస్త్రము యొక్క ప్రదర్శనమునకు వినియోగపడును.

అపస్యందితచారి :

కుడికాలిని సహజముగా నుంచి, శరీరముయొక్క బరువు నంతయు ఆ కాలిపై మోపి, ఎడమకాలిని విటారుగా బదు అంగుళముల దూరమునకు జరిపివుంచిన అపస్యందితచారి యగును.

## ప్రేంఖణ

ప్రేంఖణ నృత్యము రాజవిద్యాధర తాళమునందు ప్రదర్శించి తంభకరణము, సమోత్సారిత మత్తలిచారితో ముగించవలెను.

శబ్దములు :

తా—తత్తతకుకుంజెం—జకతరి తకజె—జకకుం జకకుం
తరిజనకుతా—జహకిణ్ణు కిటత—జెంజెం తరికిట—
తకు తళాంగి తదికు కుణాం తకకుంతరి జంతరి కుకుత—
కిటజే—

జె—జజ్జకుకుతాజం—తకతరి తకజె—తకుకుం జకకుం
తరి దన తకా—జహకిణ్ణకిటత—తాం తాం తకిటత—
తకు దడాంన్న తదికు కుతత తక జంతరి జణతరి కుకుత-
తకతా—॥

విన్యాసక్రమము :—

సమమందు నిలువబడి, రెండుచేతులందు కపిత్థము, తరువాత శిఖరముద్రలు పట్టి పై శబ్దములకు విన్యాసము ప్రదర్శించిన సదప తంభకరణ ప్రదర్శనము.

బ్రహ్మస్థానకమునందు నిలువబడి రెండు చేతులందు సందంశములను పట్టి రేచక విన్యాసమును త్వరితగతిని ప్రదర్శించుచు - కేశములవద్దనుండి చేతులను క్రిందికి తెచ్చుచుండవలెను.

సమోత్సారిత మత్తలిచారి :

మందముగా గమనము ప్రారంభించి త్వరితగతిని చేరబోవుచున్నట్లు పాదవిన్యాసము ప్రదర్శించవలెను.

బ్రహ్మస్థానకము :—

ఒక కాలిని సమముగానుంచి రెండవ పాదము మొదటి కాలియొక్క మోకాలిదగ్గర జేర్చి పైకి జరుపవలెను.

## కుండలి

కుండలి నృత్తము లక్ష్మీశ తాళమందు ప్రదర్శించి, నారాయణ కరణము, మత్తలికాచారితో ముగించవలెను.

వైష్ణవ స్థానకమునందు నిలువబడి, ఉత్తానవంచిత హస్తము పట్టవలెను. విన్యాసమునందు అభయ, వరద హస్తములను పాద విన్యాసముతో చేర్చి పట్టవలెను.

శబ్దములు :—

జహకిటతోం-తరికుం తకజెం-కిణ్ణం కుతతకు జెం—
తతజణతాం-తకకు తకజెం-దణ్ణం దగణకుజెం—

కాశాయణ కరణము :

ఉత్తాన వంచిత హస్తమునుపట్టి, వైష్ణవ స్థానమునందు నిలువబడవలెను.

మత్తల్లికాచారి :

రెండు కాళ్ళను కదిలించుచూ ముందుకు జరిగి చేతులందు అభయవరద ముద్రలు పట్టవలెను.

ఉత్తానవంచిత :

రెండు చేతులందు త్రిపతాకములు భుజములవద్ద పట్టవలెను.

వైష్ణవ స్థానకము :

ఒక కాలిని సహజముగా నుంచి, రెండవకాలిని మొదటికాలి యొందునుండి ప్రక్కకుతెచ్చి వుంచవలెను.

## దండిక

కోలాటము, కోలాటపు కోపులు నేటికినీ మనదేశములో నేక విధముల ప్రచారమునందున్నవి. కాన దండలాస్యముగురించి ము ప్రత్యేకముగా యిందులో వ్రాయుటలేదు. అదృశ్యమగుచున్న ృత్యములగురించి మాత్రము యిందు వివరముగా వ్రాయుచున్నాము.

## కలశ

ఈ నృత్యము జయమంగళ తాళమునందు ప్రారంభించి, రుడ ప్లుతకరణము, ఏడకాక్రీడిత చారితో ముగించవలెను.

బ్దములు :—

జకకిటక-జకకిటత జంజం-కిణ్ణం కిటకు-కుజె
తోం కణకుట తకిణక-తకకుదికుత ధీం జె

గరుడ ప్లుతకరణము :-

రెండు చేతులందు పతాకములనుబట్టి కుడికాలిని వెనుక ప్రక్కకు మడిచి పై కెత్తవలెను.

ఏడకాక్రీడిత చారి :-

కాళ్ళను ప్రారంభములో నెమ్మదిగా కదిలించి,తరువాత గాలి లోనికి యెగిరి అడవులను వేయవలెను.

కలశనృత్యముతో సప్తలాస్యములు సమాప్తము.

ఈ నృత్యములోని అడవులగూర్చి మరికొన్ని వివరముల విప్పుట వ్రాసి ముగించెదము. ఇందలి జతుల ప్రదర్శించు పదవిన్యాసము రెండు రకములుగా నుండును.

1) పేరిణియందు చెప్పిన గర్ఘర విన్యాసముల ననుసరించి, ఆయా మృదంగ శబ్దముల ననుసరించి పదవిన్యాసము ప్రదర్శించుట.

ఉదా:— తకుకుకు-జకుకుకు-తకిట కకిట తక

ఈ విధముగా శబ్దములున్న వనుకొందము.

'తకుకుకు' అని వచ్చినప్పుడు గర్ఘరియందు పిరిపిర విన్యాసము ప్రదర్శించవలెను.

'తకిట కకిట' అని వచ్చినప్పుడు— సూరివస్తైము.

ఈ విధముగా పదభేదములు కూర్చవలెను.

మరియు యింకొక పద్ధతి :

కరణ విన్యాసములందు—తై, దితై, తాదితై అడవులు పట్టవలసి యుండును.

అదెట్లన-

జం కిణ రేఖిణ జగనగ దిత్తక నగవ నగవ నగ
దిగితక జణతక జగతక జగది త్తక తకజం

ఈ శబ్దములకు గర్ఘరము ప్రదర్శించవలెను. లేక

తై య్యందత్తా।తై య్యి తైయ్యా।తై తై దత్తతై।తైయ్యా
తైయ్యా।తై తై దిత్తై తై దిత్తై॥

ఈ విధముగా 'అడవులను' కూర్చినప్పుడు ఆ అడవుల క్రమము ననుసరించి హస్తము, పాదముల విన్యాసముండును.

సప్తలాస్యములతో నృత్యారాధన ముగియును. మరల సర్వ వాద్యముల సేవింపజేసి హారతినిచ్చి పూజాక్రమమును ముగింతురు. అటుపై దేవుని దర్బారులో దేవనర్తకి 'కేళిక' సలుపును.

(ఈ గ్రంధమునందలి శాస్త్ర విషయ వివరములకు ప్రమాణ గ్రంధము నందికేశ్వర విరచిత భరతార్ణవము.

సంప్రదాయము—కాళహస్తీశ్వర ఆలయ శైవ సంప్రదాయము. పీఠికాపుర మాధవస్వామి ఆలయవైష్ణవ సంప్రదాయము.)

## దేశిసీ తాండవము

ఇది అయిదు విధములు. ఈ తాండవము పార్వతిచే ప్రదర్శింప బడినది.

(1) వికుంచిత (2) కుంచిత (3) అకుంచిత (4) పార్శ్వ కుంచిత (5) అర్ధకుంచిత.

[1] వికుంచిత :

ఈ తాండవమును రెండు ద్రుతములు ఒకగురువుకల దర్పణతాళము నందు ప్రదర్శింపవలెను. రెండు చేతులందు పద్మకోశముద్రలను అధోముఖముగా ప్రారంభములో ముందునకు, పిమ్మట వెనుకకు పట్టవలెను. కుడికాలిని వంచి ఎడమకాలు మోకాలిపై మంచవలెను. సహజదృక్కులు కలిగియుండవలెను.

దర్పణ తాళ శబ్దములు –

కిడకిడ ఝం, తకంకిణ, ఝుం ఝుం, దిద్దా

పై శబ్దముల వల్లిగల జతులకు నర్తన విన్యాసము చూపి 'రాజనారాయణ' తాళమందు మయూరి గతి ప్రదర్శింపవలెను. రాజనారాయణ తాళమన రెండు ద్రుతములు, ఒకలఘువు, ఒక గురువు, ఒకలఘువు, ఒకగురువు కలిగినట్టిది. మయూరిగతి— రెండుచేతులందు కర్తరీముద్రపట్టి నాగబంధస్థానకములో నిలిచి పిమ్మట న:ణవిన్యాసము ప్రదర్శింపవలెను.

ఈ గతికి మృదంగశబ్దములు—

దధి, తకికుత, కు, తాం—తో, తరికుతకు ఝం—కిట

ఝనకు, కిటతోం

పిమ్మట మన్మథకరణ విన్యాసముచేసి చాషగతి చారి ప్రదర్శనతో ముగించవలెను. ఆలీఢస్థానకమందు నిలిచి రెండుచేతులందు త్రిపతాక ముద్రలనుపట్టి ఎడమచేతితో దీర్ఘ విన్యాసము ప్రదర్శించి కుడిచేతిని భుజముపై నుంచవలెను. శరీరమును ఇరుప్రక్కలకు వంచుతు. నిలువబడుతూ విన్యాసము చేయవలెను. అటుపై చాషగతితో ముగించవలెను ఈ గతిలో కుడికాలును ఒక అడుగు దూరమునకు పోనిచ్చుచూ విన్యాసము చేయవలయును. దీనితో సమపాదచారికూడ చేర్చి విన్యాసము చేయవలెను.

[2] కుంచిత :

రెండు చేతులందు సందంశ ముద్రలు అధోముఖముగా ముందు వెనుకలకు పట్టవలెను. ఎడమకాలినివంచి కుడికాలియొక్క మోకాలి మధ్యభాగముగా చేర్చవలెను. ఈ విన్యాసము ఒకగురువు, రెంపులఘువులు, ఒకగురువు కల చాచపుట తాళమందు ప్రదర్శింపవలెను.

చాచపుట శబ్దములు :

తోంగిట, తో, తత్తా—కిటతక, ఝకరుం.

పిమ్మట హంసిపీగతి, సౌందర కరణముల ప్రదర్శించి విచ్యవాచారి విన్యాసముతో ముగించవలెను. హంసిపీగతి—రెండు చేతులందు హంసపక్షముద్రలనుపట్టి మండల స్థానకమందు నిలిచి ఎడమకాలును ఇరుప్రక్కలకు కదలించవలెను. ఈ గతి విన్యాసము రెండు లఘువులు, ఒకవిరామము కలిగినట్టి హంసలీలా తాళమున ప్రదర్శింపవలెను.

హంసలీలా తాళశబ్దములు :

కిటతకు, కుకుత—నకుతరి, తకుఝే,

సౌందర కరణ :

నర్తకి ఎడమకాలిని భూమిపై నిలిపి కుడికాలిని ఎడమకాలి మోకాలిపైనుంచి చతురముద్రలు రెండుచేతులందు ఒకదానికొకటి ఎదురుగా మందునట్లు పట్టి పిమ్మట ఇరుప్రక్కలకు పట్టవలెను. విచ్యవాచారి విన్యాసముతో ముగించవలెను. ప్రారంభములో సహజముగా మంచిన పాదములను విడదీసి భూమిపై ఒకదాని తరువాత మరియొకటి తాడనముచేయుట విచ్యవాచారి విన్యాస మనబడును.

[3] అకుంచిత :

కుడికాలిని వంచి ఎడమకాలి తొడపైనుంచి రెండుచేతులందు పతాకముద్రలుపట్టి నాల్గుద్రుతములు, ఒక గురువుగల రంగ తాళమందు విన్యాసము చేయవలెను.

రంగతాళ శబ్దములు :

తతకిణ—తతకిణ—కిటతక—కిణనక తధిక కిణత.

——పిమ్మట హరిణీగతి, వారుణకరణముల ప్రదర్శించి అడ్డితాచారి విన్యాసముతో ముగించవలెను. రెండుచేతులందు అర్ధపతాక ముద్రలు పట్టి కూర్మాసన స్థానకమందు నిలిచి ఎడమ పాదపు ముందరిభాగముతో ముందునకు విన్యాసము చేసిన హరిణీ గతి యగును. ఈ గతి ఒక లఘువు, రెండు గురువులు, ఒక లఘువు, ఒక గురువు కలిగిన సింహనాద తాళమునందు ప్రదర్శింపవలెను.

తాళ శబ్దములు :

ధికగుణ, తకణకు. తధిక కిణ్ణత—కిటకిణ
కృణణతరి కృతోం—తత్తా తగు తరి తరి తరి కృతా.

వారుణ కరణము :

వర్ధమాన స్థానకమునందు నిలిచి కర్తరీస్వస్తికము పట్టి మోకాళ్ళను కొంచెము వంచుతు కుంచించుచూ విన్యాముచేయవలెను. అడ్డితాచారి—నర్తకి ముందునకుగాని వెనుకకుగాని నడచునపుడు ఒక కాలియొక్క ముందరిభాగము రెండవకాలియొక్క మడమకు తగులునట్లు ఉంచుతూ ఆడుట అడ్డితాచారి యగును.

(4) పార్శ్వ కుంచిత :

రెండుచేతులందు శుకతుండ ముద్రలు పట్టి తలను, నేత్రములను క్రిందు మీదులకు విలాసముగా విన్యాసము చేయుచు కుడి కాలిని వంచి ఎడమకాలియొక్క తొడపై పాదము లోపలి భాగమానునట్లు ఉంచి దృక్కులను ప్రక్కకు నిలుపవలెను. ఈ విన్యాసము ఒక గురువు, నాల్గు దృతములు, ఒక గురువు కలిగినట్టి బిందుమాలి తాళమందు ప్రదర్శింపవలెను.

బిందుమాలి శబ్దములు :

ఝుం, ఝుం, కిటతోం—కిటతకు, ణకునకు తోంగిట, తకతోంగ. పిమ్మట కరిణీగతి,గజ విక్రీడిత కరణవిన్యాసములనుచేసి జనితాచారి ప్రదర్శనముతో ముగించవలెను. కరిణీగతి-రెండు చేతులందు కరిహస్తముద్రలుపట్టి కుడిపాదమును సహజముగానుండి ఎడమపాదముతో భూమిపై అర్ధ చంద్రాకారముగా విన్యాసములు సల్పి త్వరిత గతిని ముందునకు వెళ్ళవలెను. అట్లే మరల పాదమును మార్చి విన్యాసము సల్పవలెను. ఈ నర్తనము నాల్గు లఘువులు, ఒక విరామము కలిగినట్టి గజలీలా తాళమందు ప్రదర్శింప వలెను.

గజలీల శబ్దములు :

ఝే, కుణ, కకుణా, కుకుజగ, తాంత—
కుతిట తా, తరికు, జగణం,

పిమ్మట గజ విక్రీడిత కరణము ప్రదర్శించవలెను. ఎడమచేత త్రిపతాకము పట్టి నడుముపై నుంచవలెను. కుడి చేత లతా ముద్రపట్టి పాదములతో లుట్టిత విన్యాసము ప్రదర్శింపవలెను. తరువాత జనితా చారితో ముగించవలెను. ఒకచేతితో కటకా ముఖ ముద్రపట్టి వక్షమునకు ప్రక్కగా నుంచి రెండవ చేతితో త్వరితగతిని రేచిత విన్యాసము ప్రదర్శింపవలెను. పాదములతో అగ్రతల సంచారము ప్రదర్శింపవలెను.

[5] అర్థ కుంచిత :

రెండుచేతులందు కటకా ముద్రలను పట్టి తరచుగా కదిలించి ఎడమకాలిని ముందునకు వంచి కుడికాలి మోకాలిపై ఆనించి దృక్కులు ఎడమ వైపుకు సారించవలెను. ఈ విన్యాసము ఒక గురువు, లఘువు, ప్లుతము కలిగినట్టి కోకిలప్రియ తాళమందు ప్రదర్శింపవలెను. పిమ్మట సారికాగతి,

——చాంద్రకరణముల ప్రదర్శించి శకటాస్యచారీ విన్యాసముతో ముగించవలెను. సారికాగతి—కుడిచేత అర్ధచంద్ర, ఎడమచేత శుకతుండ ముద్రలుపట్టి, పై శాఖస్థానము నందుండి కుడికాలిని ఎడమ భుజమును తాకునట్లు పట్టి ఎడమపాదమును భూమిపై కదిలించిన శారిక గతియగును. ఈ గతి రెండు దృతములు, ఒక లఘువు, రెండుగురువులు కలిగినట్టి కందర్పతాళమునందు ప్రదర్శింప వలెను.

తాళ శబ్దములు :

తగు జగు, తరితోం—తకిణ్ణా, తతకిణతా.

చాంద్రకరణ :

రెండు హస్తములందు ఊర్ధ్వమండలి ముద్రపట్టి అడ్డితాచారీ విన్యాసముతో ప్రారంభించి స్థలిపాదభేదము ప్రదర్శించుచు హస్తములతో రేచిత విన్యాసము త్వరితగతిని చేయవలెను. పిమ్మట శకటాస్యముతో ఈ తాండవము ముగించవలెను. శకటాస్యము—ఈ విన్యాసమందు పాదము ముందరిభాగమును ముందుకుచాచి అంగసౌష్టవము కనబడు రీతి నిలుచుట శకటాస్య మనబడును.

ఇంతటితో దేశీ తాండవము ముగించబడినది.

## దిక్పాలకారాధన - దేవనర్తకి

పర్వదినములందు ఆలయముచుట్టూ ప్రదక్షిణము చేయుచూ, అష్టదిక్పాలకులను ఆరాధించు సమయమందు వారి ప్రీత్యర్థము నృత్యము చేయుదురు. ఈ నాట్యములనే 'నవసంధి' లేక 'బలి హరణ' నృత్యము లందురు. ఈ నృత్యములన్నియు ప్రత్యేకరాగములు, తాళములందు ప్రదర్శింపబడును.



ఆలయములో స్వామికి పుష్పసమర్పణ మైన పిదప ధ్వజ స్తంభమువద్ద ఇంద్రుని ఆరాధనతో ఈ నృత్యము ప్రారంభమగును. అష్టదిక్పాలకులకు తొమ్మిది ప్రత్యేక రాగములలో, తొమ్మిది అపూర్వ తాళములలో నృత్తములు ప్రదర్శించబడును.

ధ్వజస్తంభమువద్ద ఇంద్రారాధనతో యీ నృత్య మారంభ మగునని తెల్పితిని. ఇంద్రారాధనకు ముందుగా వినాయకుని, కుమారస్వామిని—

తలపుష్పపుట, మదస్ఖలితకరణములతో గూడిన నృత్యముతో విఘ్నేశ్వరుని,

మండలస్వస్తిక ప్రేంఖోలిత, నూపుర, వైశాఖ రేచితముల యొక్క విన్యాసములతో గూడిన నృత్యముతో కుమారస్వామిని ఆరాధించిన పిమ్మట ధ్వజారోహణ, నృత్యపూజ ఆరంభమగును.

## పైన పేర్కొనిన నృత్యములగూర్చి వివరములు

**తలపుష్పపుట :**

భరతుని నాట్యశాస్త్రములో చెప్పబడిన 108 కరణములలో యిది మొదటిది. ఈ కరణము యెక్కువగా దేవతలకు 'పుష్పాంజలి' సమర్పణమందుపయోగించబడును. నాట్యారంభములో ప్రదర్శింపబడునట్టిది కరణము.

**కరణము పట్టువిధము :**

రెండు చేతులను దోస్నెవలెజేర్చి పట్టవలెను. కుడికాలి మడమను పైకెత్తి బొటనవ్రేలిపై పాదము ఆనించి నిలబడి శరీరమును అతి సున్నితమైన విధముగా వంచి నిలబడవలెను.

విశ్ఫలమై, వికాసముగలిగిన దృష్టి.

పుష్పాంజలి సమర్పణకు



ధ్వజస్తంభమువద్ద నాట్యము

**శబ్దములు :**

ఆదితాళములో (సమగతి). ఈ క్రింది శబ్దములు నాట్యాచార్యుడు తాళము వేయుచూ, పాడుచుండగా, మృదంగముపై గా

శుద్ధ మర్దళముపైగాని పలికించగా పుష్పాంజలి వినాయకునికి సమర్పించబడును.

తాహం – తాహం – దిగిదిగి తతెహిత – తెహియ
తెహియ – తెహియం దత్తా – తెహియ – తెహియ
తత్త – దిత్త – తాహత జంతరి – జగనగ–జంతరి
తత్తళాంగ్ తోం – తళాంగ్ తదిగిణ తోం.

మదస్కలిత

పట్టువిధము :

రెండు చేతులను జారవిడువవలెను. తలను యిరుప్రక్కలకు ఆడించవలెను. కుడికాలును వంచి ప్రక్కలకు కదిలించవలెను. అటుపై కాళ్ళను స్వస్తికము చేసి మరల ప్రక్కలకు విడదీయవలెను. తరువాత యెడమకాలును వంచి, ప్రక్కలకు కదిలించవలెను. ఈ కరణము తనుదామఱచి తన్మయత్వములో వర్తనమాడునప్పుడు, మద్యపానమువలన మత్తెక్కిన అంగవిన్యాస ప్రదర్శనకు వినియోగింపబడును.

శబ్దములు :

జగ జగ జగ జగ – దిత్తక దింతక –
జంతకి తాహం – తాహం దత్తా
దొద్దొ – దోహం – దోహం దోహం–
హం రిం హంరిం–దోహం దోహం –
హం తరి తరి – హంతరి తరి
కుం తరి తరి – రాంతరి తరి
దరి దరి దం దరి – దరి దరి దరి దరి
దిత్తరి జగనగ – దత్త తాహం
హం దిగినగ – నగ నగ నగ జం
దిత్తగ దిగితలీ – దత్త తాహం
జంతరి తాం – తజంతరి తాం ॥త జంతరి॥

ఈ కరణ ప్రదర్శనము తరువాత "గణపతి కవుతము" 72 అక్షరముల వినాయక తాళములో ప్రదర్శింపబడును.

కవుతము :

ధీత్త తెయ్ । ధీత్త తెయ్ । తత్తా దిద్దతోం నంత్తా ।
ధిక్కిట ధిక్కిట తక్క । ధిగ్గుడు తాం తోంగ ।
ధీం దత్త ధీం దత్త ధీ । ద్ద ధీ ద్దత్తక్క
తదిమి దిమిత తక్క ।
ధిగ్గుడు తాం తోంగ । తా తా ధిత్తా ధిక్కిట
తక ధిక్కిత్తాం ।
ద్దత్త । ధిక్కిట కిటతక । ధిక్కిట కిటతక ।
తొంగిట కిటతక । నంగిట కిటతక ।
కరి ముఖ నార సుర । వర కమల జనుత ।
వరపాశాంకు శయుత । శరణం తే చరణం
తక్కిట దిమికిట తోం । తకతోం ।
తధిక్కిట కధిమి కిట్టతోం ।
సతతం । సిద్ధముక్త – బుద్ధియుక్త
సింధుర వదనా । తక్కిట కిట తక్కతోంగ్గ
దేహివర గణపతి । ధిక్కిట కిటతక ధిక్కతోంగ
గణపతి కవుతం । నత్వర వినయర
ధిగ్గుడు తధా । ధిగ్గుడు త్తై । తత్తక్కి ।
ద్ధి ద్ధి తద్ధి త్తై । తోం తోంగ్గిట తకతోం
తద్ధి కిటతక – ధిక్కిత్తా॥

తీర్మానము :

తం ద్ధిక తక తక । తం ద్ధిక తక తక
తం ద్ధక తక తక । తళాంగ్ తోం॥
ధిం ధికి ధికి ధికి । ధిం ధికి ధికి ధికి
ధిం ధికి ధికి ధికి । ధీంగికా తోం ॥
తం ద్ధక తక తక । తళాంగ్ తోం
ధిం ధికి ధికి ధికి । ధీంగికా తోం
ధళాంగ్ తోం । ధీంగికా తోం
తాం తక । తద్ధితక । తరికిట తక ।
తక ధళాంగ్ । తదింగికా తోం ॥

## కుమారస్వామికి పట్టవలసిన కరణములు

### మండల స్వస్తిక

పట్టు విధము :

రెండు కాళ్ళను నాట్యశాలవల యెడముగ నుంచవలెను. చేతులను పైకెత్తి, జారవిడిచి, వలయముగా త్రిప్పి మరల యధాస్థానమునకు తేవలెను.

తరువాత వ్రేళ్ళను విప్పుచు, చేర్చుచు, చూపుడు వ్రేలుకు బొటనవ్రేలును ఆనించి, ప్రీతి సుందరముగా రెండవ చేతిభుజమును, మోచేతులను, వక్షస్థలమును తాకునట్లు నటించవలెను.

పిమ్మట చేతులను స్వస్తికముగా జేసి, వక్షమునకు యెదురుగా అరచేతులు ప్రేక్షకులకు కనబడునట్లు, వ్రేళ్ళకొనలు పైకుండునట్లు పట్టవలెను.

దృష్టి — గర్వముతో కూడి వుండును.

ఈ కరణము యితరులను ఆగౌరవ పరచుటయందు విర్లక్ష్యభావ ప్రకటనయందును ఉపయోగపడును.

శబ్దములు :

దం దం దం దం ।
దాతి ర కిట తా దాతి ర కిట తా తైయ్యా
దాహం దాహం — తైయ్య తైయ్య తైయ్యతక
 తతైహిత తైయ్యనక
దాహం దాహం — ధీం ధీం ధీం కిర్తక తక
 దత్త తైయ్య ధాకిట తక
దాహం దాహం — దాం దాం దరి కిట తక
 కిణ ణక కిట తక,
దాహం దాహం — దద్ధ్ దద్ధ్ దద్ధ్ దద్ధ్
దరి కిట త । దరి కిట త । దరి కిట త
దిగి దిగి దిగి దిగి । జం తకి తాం జం కిత తాం
 జం తరి కిట తాం ॥

## ప్రేంఖోలిత — [ఊయెల]

పట్టేవిధము :

ఒక కాలిని వంచి యిరుప్రక్కలకు ఊగించవలెను. తరువాత మడమపై జారవిడువవలెను. అటుపై గాలిలోని కెగిరి, వలయము తిరిగి, మరల భూమిపైకి రావలెను. వడుమును త్వరితగతిని కదిలించవలెను.

## నూపుర - [అందె]

పట్టేవిధము :

కటిప్రదేశమును వలయములుగా త్రిప్పవలెను. ఎడమచేతిని కుడిచేతిని వలయములు ప్రదర్శించవలెను.

బొటనవ్రేళ్ళు యెడముగావుంచి, పాదములను కదలింతవలెను

## వైశాఖ రేచిత

పట్టే విధము :

సమముగా నిలబడి, కుడికాలునెత్తి, ఎడమ పాదము మధ్యభాగమున కుడి మడిమ తగులునట్లు నటించుట. రెండు కాళ్ళమధ్య యెడము మూడున్నర జానలుండవలెను. పిమ్మట కండ్లు, చేతులు, వక్షము త్వరితగతిని చలింపజేయవలెను. ఇది నాట్యమంతయు నెవతకు వెళ్ళునప్పుడు, ప్రేక్షకులకు వీపును జూపకుండా వెళ్ళుటకు ఉపయోగించును.

శబ్దములు — ప్రేంఖోలిత :

తాం తతై । తద్ధింతక । గిణతైయ్యా
ధీం తతై । తద్ధింతక । గిణతైయ్యా
తాం తత । ధీం తత । తకిట దికిట తక
ధీం తతై । తద్ధింతక । గిణతైయ్యా
జం తతోం । జంతక । గిణతైయ్యా
తకిట దకిట తక । తదికిట కిటతక తైయ్యా
తైయ్యా తైయ్యా తైయ్యా తక
తొంగిణ కాంగిణ తత । తాం తతై ధీం తతై

నూపుర :

దిరికిట దిరికిట దిరికిట దిరికిట
దిద్ధింతక దిద్ధింతైయ్యా
ధిర్గుడుత ధిర్గుడుత దిరికిట
దిద్ధిమి దిమికిట
దిగి దిగి దిగి దిగి జంకిట జంకిట
జం జం కిట కిట — కిట కిట కిట కిట తాం.

వైశాఖ :

తాదిత్ దిత్తై తాంగిట కిటతక
తకిట దికిట ధిర్గుడు తాం తైయ్య తక

తఝంత తఝంత తఝంత తరుంత
తక తక తక తక । తాహత ఝంతరి
తకిట దికిట తకిట దికిట
తకి తకి ఝంత కుకు । తాంగిణ తోం.

**శిక్షానము :**

ఝం ఝం ఝంకిట కిటతక
ఝగ దత్త ఝగ వగ వగ దత్తా
తకిట కిట తక । తరికిటత తరికిటత ఝణు
జేకిట కిటతక । ఝణు తకత ఝణు తకత దిమి
తాం గిట కిట తక । తాంగు తకత ఝణు తకత కిట
రాం కిట కిటతక । రాంగిటతా ఝణుతకత తోంగ
రాం రాం కిటతక । ఝం ఝం కిట తక
ధణేకు కిట తక । దదిగిణతోం.

వినాయక, కుమారస్వామి, ఆరాధన ముగించిన పిమ్మట అష్ట దిక్పాలకారాధన ప్రారంభమగును.

## ఆరాధన క్రమము

**వివరములు :**

అష్టదిక్పాలురు : ఇంద్ర, అగ్ని, యమ, నైరుతి, వరుణ, వాయువు, కుబేర, ఈశాన్య.

**వీరికి పట్టవలసిన స్థానకములు :**

భరత శాస్త్రములో చెప్పబడిన 81 స్థానకములలో పురుష స్థానకములు, స్త్రీస్థానకములు లేక అన్నియూ వుపయోగించబడును గాని కొన్ని ముఖ్యమైనట్టివి.

ఆయత, అవహిత, అశ్వక్రాంత, మోదిత, వివివృత్త, ఐయింద్రి, చండిక—స్థానకములను వుపయోగించెదరు.

**పుష్పాంజలికి వుపయోగించవలసిన పుష్పములు :**

శివపార్వతి: వృక్షములనుండి తెంపిన పుష్పములు.
లక్ష్మి, మహావిష్ణు: లతలనుండి తెచ్చిన పుష్పములు.
సరస్వతి, బ్రహ్మ: జలమునుండి సేకరించినవి వుపయోగించవలెను.

**దిక్పాలకులకు :**

ఇంద్రి : మందార, పారిజాత, బిల్వపత్రము, దూరవపత్రము.
అగ్ని : బంధూక, చంపక, కదంబ పుష్పములు.
యమ : ఇందీవర, తాపింఛ, కుముద.
నైరుతి : కరవీర, జపాపుష్పము, శిలీంధ్రి.
వరుణ : కల్హార, కుముద.
వాయు : మల్లిక, జాతి, జవంతి.
కుబేర : సహస్ర రేఖల తామర, బంగరువన్నె తామర, కుముద.
ఈశాన్య : నక్షమాల, ద్రోణపుష్ప, దుతూర, మల్లిక, కురువక,

**పై పుష్పములన్నీ దొరుకనిచో :**

మందార, పారిజాత, బిల్వదళము, దూరువదళము సమర్పించవచ్చును.

**'పుష్పాంజలి' సమర్పించు క్రమము :**

నర్తకి ఆయా దేవత ననుసరించి స్థానకమునందు నిలువబడి పుష్పపుట హస్తమునందు పుష్పముల గ్రహించి 'మార్థిక' గాని 'గద్యము' గాని చదివి పుష్పముల సమర్పించును.

ఇందు_ముగ్గురు మూర్తులు, వారి దేవేరులు; వారి అర్థాంగులకు సమర్పించునప్పుడు రెండు చేతుల మధ్యమందియు, దిక్పాలకులకు; భూసురులకు; భూపాలకులకు – చేతులయొక్క కొనల నుండియు మిగిలినవారికి బొటనవ్రేళ్ళ అడుగుభాగమునుండియు సమర్పించవలెను.

...o...

## అష్టదిక్పాలకారాధన — దేవనర్తకి

(వైష్ణవ సంప్రదాయము)



విష్ణ్వాలయము - దేవనర్తకీ పుష్పాంజలి సమర్పణ



గర్భగుడియందలి దేవదేవుని కెదురుగా దేవనర్తకి దోసిలి యందు పుష్పములు కొని సమదృష్టికలిగి సంస్థానకమందు నిలువ బడును. ఆమెకు కుడిప్రక్కగా నాట్యాచార్యుడు, తాళధారి వారి వెనుక గాయకురాలు, వేణుగాయకుడు అతనివెనుక శృతియును, ఆమెకు ఎడమప్రక్కగా మార్దంగికుడు, అతనిప్రక్కగా వైణికుడు నిలువబడియుందురు. ఈ క్రమమునకు "కుతుప"మని పేరు. పిమ్మట వాద్యములన్నియు పూరింపబడును. అంత నామె సంస్కృతములో "చూర్ణికలు" పఠించి పుష్పములు సమర్పించిన తరువాత క్రింది బొమ్మలోని భంగిమతో ప్రారంభించి నాట్యమాడును. ఆ నాట్యము పేరు భ్రమరనృత్తము. ఇది ఆదితాళము లేక బ్రహ్మ తాళమందు ప్రదర్శింపబడును. మలహరి రాగములో గానము చేయబడును. యుగానాద వాద్యము వాయించబడును. శివాలయ మందైనయెడల భుజంగత్రాస నృత్యము శంకరాభరణరాగములో ఆదిరుద్ర తాళములందు ప్రదర్శింపబడును. మాతృకానంద వాద్యము వాయించబడును. పిమ్మట గణపతి కవుతము, శుద్ధ నాట్యము మొదలైన వర్తనములు ప్రదర్శించినపిమ్మట ధ్వజస్తంభము వద్ద తూర్పుదిక్కునకు అధిపతియైన ఇంద్రునియొక్క ఆరాధనతో దిక్పాలకారాధనా నృత్యము ప్రారంభమగును. ఈ నాట్యములనే బలిహరణ నృత్యములు, నవసంధి నాట్యములనికూడా పిలుతురు. ఈ నాట్యములు ఆలయము లందేగాక కొన్ని వేళలందు దేవుడు ఊరి లోనికి తరలి వెళ్ళినప్పుడు తిరువీథులందు దిగ్బంధనచేయునపుడు బలిరాళ్ళవద్దకూడా ప్రదర్శింతురు.





ఇంద్రుడు

ఇంద్రుడు తూర్పుదిక్కునకధిపతి. వాహనము ఐరావతము, రాజధాని అమరావతి, ఆయుధము వజ్రము. భార్య శచీదేవి. ఇంద్రునకు ప్రీతిమైన నాట్యము – 'లలిత' ప్రియమైనరాగము దేవగాంధారి లేక నాదనామ క్రియయందు గజలీల లేక సమతాళములలో ఈ నృత్యము చేయవలెను. అప్పుడు మేఘనాదవాద్యము వాయించవలెను.

ఇంద్రునకు పట్టవలసిన హస్తములు–ఎడమచేత అరాళముపట్టి నొసటిపైనుంచి త్రిపతాకము కుడిచేత పట్టవలెను. స్థానకము–సమ.



ఆగ్నేయమూల కధినేత వైశ్వానరుడు. వాహనము మేషము. ముఖ్యనగరము తేజోవతి. ఆయుధము శక్తి. భార్య స్వాహాదేవి. ఇతనికి ప్రీతికరమైన నృత్యము—కళింగ. ఇది నాట లేక లలిత రాగములందు అధ్యావన లేక వీరవిక్రమ తాళములలో ప్రదర్శించవలెను. సింహనాదవాద్యము వాయించవలెను.

వైశ్వానరునకు పట్టవలసిన హస్తములు — ఎడమచేతితో ముందుగా కర్తరి పట్టి పిమ్మట త్రిపతాకము తలపై భాగమున పట్టవలెను. కుడిచేతిని వంచి వక్షమున అడ్డముగా నుంచవలెను. స్థానకము—సమ.



అగ్ని





యముడు

దక్షిణమును పాలించువాడు యముడు. వాహనము ఎను
ము. పట్టణము సంయమిని.ఆయుధము దండము. భార్య శ్యామలా
దేవి. ఇతనికి ప్రీతికరమైన నృత్యము – 'కర్తరి'. ఇది కైశిక లేక
అహరి రాగములలో భృంగిణి లేక రాజచూడామణి తాళము
లందు ప్రదర్శించవలెను. సౌదానంద వాద్యములో ప్రదర్శించ
వలెను.

యమునకు పట్టవలసిన హస్తములు.—సూచీ ముద్ర ఎడమ
చేత పట్టి భుజము పైభాగము నుండి కుడిచేత పితృదేవతలకు
పిండ ప్రదానము చేయుచున్నట్లు అలపద్మముతో అభినయించవలెను.
స్థానకము—సమ.



నైరృతీదిక్పతి నిరృతి. వాహనము నరుడు. పట్టణము
కృష్ణాంగన. ఆయుధము కుంతము. భార్య దీర్ఘాదేవి. ఇతనికి
ప్రీతికర నృత్యము—విధృత. ఇది కైశిక లేక భైరవిరాగములలో
మల్ల లేక రంగ ప్రదీప తాళములందు ప్రదర్శింపవలెను.విజయానంద
వాద్యము వాయించవలెను.

నిరృతికి పట్టవలసిన హస్తములు—అర్ధచంద్ర హస్త
మును ఎడమచేతను కుడిచేతితో పతాక హస్తమును భుజములపై
పట్టవలెను. స్థానకము—సమ.



నైరృతి



పశ్చిమ దిగ్గాజు వరుణుడు. వాహనము మొసలి. పట్టణము శ్రద్ధావతి. ఆయుధము పాశము. భార్య కాళికాదేవి. ఇతనికి ప్రియమైన నృత్యము — ఉత్సంగ. ఇది శ్రీ లేక మేఘరంజనీరాగములందు భృంగరి లేక మకరంద తాళములలో ప్రదర్శించవలెను. మంగళ అను వాద్యము వాయించవలెను.

వరుణునికి పట్టవలసిన హస్తములు—కుడిచేత అరాళ హస్తమును పట్టి పిమ్మట వ్రేళ్ళను విప్పి అభయ ముద్ర పట్టవలెను. ఎడమచేత అధోముఖముగా పతాక హస్తము పట్టవలెను.



వ రు ణ



వాయవ్య దిక్కునకు రాజు వాయువు. అతని వాహనము లేడి. పట్టణము గంధవతి. ఆయుధము ధ్వజము. భార్య అంజనాదేవి. ఇతనికి ప్రీతియైన నాట్యము—సువ్యాపగ. ఇది గౌళ లేక వసంతభైరవి రాగములందు టంకరి లేక విజయతాళములలో ప్రదర్శించవలెను. గంభీరానంద వాద్యము వాయించవలెను.

వాయువునకు పట్టుహస్తములు—కుడిచేత శిరస్సునకుపైగా పతాక హస్తముపట్టి త్రిప్పవలెను. ఎడమ చేతితో అభయముద్ర పట్టవలెను. మరల ఎడమచేత పతాకహస్తముపట్టి త్రిప్పవలెను. కుడిచేత కటకాముఖ ముద్రపట్టవలెను స్థానకము— సమ.



వా యు వు



ఉత్తర దిక్పతి కుబేరుడు. వాహనము అశ్వము. పట్టణముఅలక. ఆయుధము ఖడ్గము. భార్య చిత్రరేఖ. ఇతనికి ప్రీతియైననాట్యము- సంకీర్ణ. ఇది నాట లేక శ్రీరాగములందు బిభ్రు లేక తురంగ లీలా తాళములలో ప్రదర్శింపవలెను. సుసంపాత వాద్యము వాయించవలెను.

కుబేరునికి పట్టవలసిన హస్తములు — కుడి చేత పతాక హస్తము, ఎడమచేత అర్ధచంద్ర హస్తమును పట్టవలెను. సంతృప్తిని కలిగించే దృక్కులు కలిగియుండవలెను. స్థానకము — సమ.



కుబేరుడు



ఈశాన్య దిగ్భర్త ఈశానుడు. వాహనము వృషభము. పట్టణము యశోవతి. ఆయుధము త్రిశూలము. భార్య పార్వతి. ప్రీతికరమైన నృత్యము-దండపాద. ఇది హిందోళ లేక శంకరాభరణ రాగములందు వృష లేక నందలీలా తాళములతో ప్రదర్శింపవలెను. మాతృకానంద వాద్యము వాయించవలెను.

ఈశానునకు పట్టవలసిన హస్తములు — కుడిచేత త్రిపతాక హస్తముపట్టి ఎడమచేత ముష్టి హస్తము పట్టవలెను. స్థానకము — శైవము.



ఈశానుడు

## ఆరాధన క్రమము

మంగళ వాద్యములతో ప్రదక్షిణము ముగిసిన పిదప — మేళము (మృదంగము లేక శుద్ధమద్దెల, ముఖవీణ, తాళము) ఆచార్యుడు, నర్తకి వెంటరాగా దేవయాజ్ఞికులు ప్రతి దిక్కునందు నిలిచి ఆయా దేవతల నృత్య గీతాలతో ఆరాధించి నైవేద్యము సమర్పింతురు.



వైష్ణవ దాసి నొసటిపై
ధరించే తిలకము తీరు





ముద్రలు :
చక్రము, నామంతో
గూడిన చక్రము, శంఖం

---

కుడిభుజంపై చక్రము
ఎడమభుజంపై శంఖం
కుడిప్రక్క వక్షంపై
నామంతో కూడిన చక్రం





కుంభ హారతి,
పంచహారతి,
కలశం.



నక్షత్రహారతి

ఉదా: తూర్పు – ఇంద్రారాధన.

పుష్పములు అంజలియందుంచుకొనిన నర్తకి సమస్థానక ముతో నిలిచియుండును.

దేవయాజ్ఞికులు స్తోత్రములు చదివెదరు. ఏతదిందర్ గదః పిర్యః, దేవ గాంధార రాగప్రియః, సమతాళప్రియః, మేఘనాద వాద్యప్రియః, లలితనృత్తప్రియః, తత్తక్కాల గీతామసార ప్రియశ్చ.

అటుపై ముఖవీణపై ఆ రాగము ఆలపించబడును.

నర్తకి పుష్పములను సమర్పించి, యాజ్ఞికులు పాడే

"సకల సుర వర మకుట మణి ఘృణి ఝృమ్భి తాంఘ్రి సరోరుహం

దనుజ విరసన విబుధ జయకర వజ్రపాణి శచీపతిం
రజత గిరి రవ విలసదతి స్థిత హస్తి మస్తక నిష్ఠితం
కవిత కరహిత పటహరుటి కృత మింద్రతాళ మిదం మహత్."

గీతమునకు తాళగతిని జూపుచూ నృత్తమాడును. పిమ్మట గజలీల లేక సమతాళమునందు నృత్తమాడి ముగించును. అటు నుండి మరల ఆగ్నేయ దిశకు వెళ్ళెదరు. అగ్నియారాధన చేయు దురు. ఇట్లే అష్టదిక్కులందు దిక్పాలకుల ఆరాధింతురు.

ఇందు ప్రదర్శించు వివిధ నృత్తములయొక్క స్వరూపము దెల్పుటకు ముచ్చునకు లలితయొక్క వివరములు విపులముగా విచ్చట విచ్చుచున్నాను.

గజలీల – నాలుగు లఘువులు. ఒక విరామము కలిగి వట్టిది. 4½ మాత్రల కాలము.

ఐంద్రకరణ విన్యాసము · రెండు చేతులందు త్రిపతాక ములు పట్టి కాళ్ళను భూమిపైనుండి పైకి లేపకుండా యిరుప్రక్క లకుగాని ముందు వెనుకలకు కదులుట ఐంద్రము.

లలితము 5 విధములుగా విన్యాసము చేయబడును. ఈ 5 విధములైన జతులు, ముక్తాయిలు ఉండి—ముగింపునందు సమ గతిలో పెద్ద తీర్మానముండును. నర్తన మాడునప్పుడు ఏ తాళ ములో ఆడినను ముగింపునందు సమగతిలోనికి—(అనగా చతు రశ్రగతి – అక్షరముల కాలము) వచ్చి తీర్మానించవలెనని శాస్త్రీయ నియమము. ఈ క్రమమే యిందును అనుసరించబడు చున్నది.

## లలితము

**మొదటి విన్యాసము :** ఆయత స్థానకమునందు నిలబడి, సహజ దృష్టి గలిగి, నర్తకి 'సులు' (లలితముగా శరీరమును కద లించుట. ఈ కదలిక మందముగా వీచే గాలిలో కదలాడు జ్యోతివలె మందవలెను.) ప్రదర్శించవలెను.

(ఆయత – ఆయతస్థానకము సాధారణముగా తాండవ, లాస్యము పద్ధతి నాట్యము లన్నింటిలో ప్రారంభములో విని యోగించబడును.)

ప్రక్షేపవిధము : రెండుకాళ్ళను చేర్చి వుంచి, కుడిచేతితో అర్ధచంద్ర పట్టి, ఎడమచేతిని దోల హస్తము నందువలె జారవిడిచిన ఆయతమగును.

**రెండవ విన్యాసము :** అవహిత స్థానకమునకు మారి 'సూచి' దృష్టి గలిగి 'సులు' ప్రదర్శించుచు నర్తన మాడవలెను.

(ఈ రెంటిలోని అంగచలనము ఒక్కటే అయినను— దృష్టి, స్థానకము మాత్రము మారుచున్నది )

అవహిత్థ స్థానకము : ఆయతములోని చేతులను మూసి పట్టిన అవహిత్థ మగును.

**మూడవ విన్యాసము :** రెండు చేతులందు హంసపక్షహస్తము పట్టి కాళ్ళను తట్టుచు నాట్యమాడుట.

**నాల్గవ విన్యాసము :** హస్తములందు రేచిత విన్యాసము గల్గి, 'సులు' ప్రదర్శనముతో ఎడమకాలును భూమిపై మెల్లగా కదుపుచూ (జారు అడవు) నర్తించవలెను.

**ఐదవ విన్యాసము :** ఒకచేత అర్ధచంద్ర పట్టి నడుముపైనుంచి రెండవచేతితో శిఖరముపట్టి జారవిడిచి, పాదములందు 'చలన' విన్యాసము ప్రదర్శించవలెను.

[చలనము దగ్గరగా నుంచిన పాదములను ఉన్న చోటనే కదలించుట చలనము.]

## లలితములోని జతులు, తీర్మానములు

1. జం జం కిటతరి కిటకు కిటతకిట
తకిట దికిట జణు తాహత జగతరిత
తజ్ఞం కిటతక తాంగుడు తైయా తక తక్కిటతక
తతజ్ఞను జంతజ్ఝంత తాహత తైయా తాంగిణతోం.

2. ధికితక ఝణుతక దిహత దిహత కిణ
తకతక కిణతక తహంక తద్ధిమి ఝణం
ఝణుతక్కిణతక ఝగఝగ ఝంతరి
ఝగనగ ధిత్తక తకత ఝగణక తదిగిణతోం.

3. ఝంకిణ కిత్త ఝగఝగ దిత్తా
ఝగనగ నగనగ నగతక దిత్త
ఝంతరుంత రుంతకిట దత్తా—తత్తా దిద్దీ తకిట
ధికిట ధిర్గుదు
తజేంత తజేంత తహ తతహత త్తాకిటతోం.

4. దోహం దోహం త్తైయిద్దోహం
దోద్దో౽దోద్దోహం ద్దైయా
తయ్యనక ధీం తకిట తహత తాత్తా
తద్దీను తజ్జనం తాకిట తద్దిమి
తత్త ఝణుతక తాంగిణతోం.

5. దిగిదిగి డిగిదిగి దిత్తగ త్తైతక
నగనగ నగనగ నంత రుంత రుం
ఝగఝగ ఝగఝగ ఝంకిణ రేఖిణ
దిగిదిత్తగ నగ నంతక ఝగ ఝంతక
తగనగ ఝణుతక తధింగిణతోం.

తీరిక—ఝంఝం ఝంకిట గిటతక
ఝగదత్త ఝగనగ నగనగ దిత్తా
తాకిట కిటతక తరికిటత తరికిటత ఝణు
జేకిట కిటతక ఝణుతకిత ఝణుతకిత ధిమి

తాంకిట కిటతక తాంగుతకత ఝణుతకిత కిట
ఝంకిట కిటతక ఝంగిటతా ఝణుతకిత తోంగ
ఝం ఝం కిటతక ఝంఝం కిటతక
ధణేకు కిటతక దదిగిణతోం.

1. ఏతద్బ్రహ్మ గద్యప్రియః, మల్హారగౌళరాగప్రియః,
ఆదితాళప్రియః, యోధవాతవాద్యప్రియః,
భ్రమరనృత్తప్రియః తత్తత్కాలగీతామసార వాద్యప్రియశ్చ.
అణ్డ మణ్డల కోటిమండిత నాభిపంకజ విష్టరం
అణ్డ పిణ్డ చరాచరామరదేవరాక్షసవ్యగ్వ్రిభుం
కంసవైరి పదాబ్జతత్పరచిత్తయుక్త చతుర్ముఖం
భేరితాడనడంబరాకృతి బ్రహ్మతాళ మిదం మహత్.

2. ఏతదింద్రగద్యప్రియః, దేవగాంధారరాగప్రియః,
సమతాళప్రియః, మేఘనాదవాద్యప్రియః
లలిత నృత్తప్రియః తత్తత్కాల గీతామసార ప్రియశ్చ.
సకలసురవర మకుట మణిఘృణి జృమ్భితాంఘ్రి సరోరుహం
దనుజ నిరసన విబుధ జయకర వజ్రపాణి శచీపతిం
రజతగిరినిభ విలసదతిసిత హస్తిమస్తక విష్ఠితం
కలిత కరహిత పటహఝుటికృత మింద్రతాళ మిదం
మహత్.

3. ఏతదగ్ని గద్యప్రియః, నాటరాగప్రియః
అధ్యాపనతాళప్రియః, సింహనాద వాద్యప్రియః
కళిఙ్గ నృత్తప్రియః తత్తత్కాలయశ్చ.
లోకహితానుగతాహుతి వాహకహవ్య కవ్యకులాధిపతిం
వాహనమేకమజం పరమం సదయా దయయావరదం
జ్ఞాన సమాధికృతానుగతాఖిల కారణ మేతద్వాయుసఖం
భేరిక తాడన తాళవిభేదన పావకతాళమిదం.

4. ఏతద్యమ గద్యప్రియః కౌశికరాగప్రియః, భృఙ్గిణీ
తాళప్రియః పౌధానందవాద్యప్రియః
కర్తరీ నృత్తప్రియః తత్తత్కాల యశ్చ.
కాలదూతపతి కాలమేఘనిభ కాలపాశభృత్ కాలవిత్
కాలచక్రాకృతి కాలచక్రపతి కాలకారణ మహత్తమం
కాలకేతుసఖ కాలహారిపద కాలపూజ్యకరప్రియం
భేరికానుగత తాళభేదయమ తాళమేతదిహ చోదితం.

5. ఏతన్నిర్‌ఋతి గద్యప్రియః, కౌసికరాగప్రియః,
మల్లతాళప్రియః, విజయానందవాద్యప్రియః
విధృతనృత్తప్రియః తత్తత్కాల యశ్చ.
వీర్యసముఛ్ఛ్రిత బాహుబలాధిక వైరిసమూదధయదం
అఞ్జనశైల సమాన భయప్రద మాయ సచారుగదం
ఖాసుర వాసవపీల వినిర్మితపాదుక రమ్యప్రదం
నౌమి సురేతర వాఙ్ముదఛ్ఛ్రిత నైరృతితాళమిదం.

6. ఏతద్వరుణ గద్యప్రియః, శ్రీరాగప్రియః,
భృఙ్గరి తాళప్రియః, మంగళవాద్యప్రియః, ఉత్ప్లుఙ్గ
నృత్తప్రియః తత్తత్కాల యశ్చ.
సకలకల్పవికల్పకారణప్రళయకల్పలసత్తమం
ఉదధి జగత్ప్రభు దివ్యమకరసవాహపాశభృతం పరం

జలధిసప్తసమృద్ధిప్రజలధివిక్రమర్షసమద్ధిప్రదం –
గరుడసన్నిధిభేరితాడన వరుణ తాళమిదం మహత్.

7. ఏతద్వాయు గద్యప్రియః, గౌళరాగప్రియః,
టంకరి తాళప్రియః, గంభీరనాదం, వాద్యప్రియః
సువ్యాపకనృత్తప్రియ తత్త – యాళ్ళ॥
విశ్వసృష్టిలయస్థితిప్రియజీవితం ప్రభుజీవితం
వ్యోమచర విహార వితర్క విష్కళం మృగవాహనం
దేవదానవమానుషాదిః పిశాచాదిజీవకృత్
పాదతాళన భేరితాడన వాయుతాళ మిదం మహత్

8. ఏతత్కుబేర గద్యప్రియః, నాటరాగప్రియః,
బిభృతాళప్రియః సుసంహిత వాద్యప్రియః
సంకీర్ణ నృత్తప్రియః ॥తత్త–యాళ్ళ॥
శంఖనిధిపద్మనిధిసంచితధనేశం । కాలకులవాసినఖదేవకుల దీపం
శ్యామలతను రత్నకిరీట మకుటాఢ్యం ।
పుష్పకరథప్రియకరప్రియనిధీశం
బ్రహ్మపదవిష్ణుపదరుద్రపదచిత్తం ।
వానవ పద ప్రదధనపదవిధీశం
భేరిముఖరేచకవిపూరమణిఘోషం ।
శమ్భునఖకుంభకకుబేరహితతాళం॥

9. ఏతదీశాన గద్యప్రియః, హిందోళరాగప్రియః,
వృషతాళప్రియః, మాతృకానన్దవాద్యప్రియః
దణ్డపాద నృత్తప్రియః ॥తత్త – యాళ్ళ॥
నటన పదహిత పటహఝరికృత । భేరికామగఘోషణం
వృషభగళగత ఘటితమణిరవ । ఘణ్టఘోషవిమర్దనం
దితిజనిశిచరనిహితడమరుగ । డంబరాజితయానగం
సకలసురగణ విజయం శుభకరమీశతాళ మిదం॥

## చూర్ణిక

వ్యస్తశ్రీ కల్పద్రుమకామగవీచిన్తారత్న నిర్జరగణాదివిస్తారకస్య దేవాశ్వప్రస్తారకస్య । వివిధగ్రాహ ఘుమఘుమాయమాన అభ్రంకష కల్లోలవేల్లితస్య । మంజుల మంజరీకృత ఫేనవనమంజరీ లాలితస్య । గంగాది మహాతరంగిణీ సంగమసముద్భూతమంగళ భంగిశృంగారస్య । సకలగుణాధారపయఃపారావారస్య । మధ్య ప్రదేశే హారవిహారవతీర కర్పూరప్రభా దగదగాయమాన ధవళ ద్వీపే సంతాన సంతతోద్యానపరివృతే । సంతానామృతపరిపూరిత పరిఘావలయితే । హిరణ్యప్రాకార ప్రకాశమానే నవరత్న విచిత్రిత తోరణద్వార శోభిత వివిధసౌధవిభ్రాజితే । వైజయంతీ కాంతిసంతురిత నభోమండలే దివ్యవిలాసినీ సహస్ర సంఖ్యాకీర్ణవీథివిరాజితే । రాశీకృతాఖండ సౌభాగ్య నిర్మితే । దివ్యనగరే శ్రీమతి వైకుంఠే విష్వక్సేనాదిప్రధానకింకర మందిరసందోహవిస్తృతే । దుర్నిరీక్ష్యజయవిజయాదిద్వారపాలకసంరక్షిత బహుళ జనపరివారస్య బహిరంగణచిత్రవిచిత్రితరత్నస్తంభ సహస్రభాస్వత్తేజో విశేష విస్ఫూర్జితరమణీయ సభామండపమధ్యస్థ మహాసింహాసనాధిరూఢస్య దివ్యశ్రీ విజ్యమానదామరస్వబ్రహ్మేంద్రాది యత్రిశత్కోటిదేవతాసంఘాత ఘుమాశాద్భుతమానసభా సన్నివేశస్య । పరితః ప్రవర్తిత దివ్యశ్రీ నర్తనావలోకన సావధాన చతురస్య । కందర్ప కోటి సౌందర్యధుర్యస్య । ఉత్ఫుల్ల పుండరీక విశాలలోచనస్య । బాహా విటపావిర్భూతశంఖచక్రగదాభయభరితస్య । దేవ దేవస్య శ్రియఃపతేః పురుషోత్తమస్య । భగవతో నారాయణస్య ।

## 1. బ్రహ్మతాళము :

నమోనాథ సమస్తస్మై । సృష్టికారణ మూర్తయే
పద్మాసన చతుర్వక్త్ర । చతుర్భుజ నమోస్తుతే.

గద్య: అఖిలలోక సురాసురసిద్ధవిద్యాధరగరుడ గంధర్వకిన్నరకింపురుషయక్షరాక్షస పన్నగ నాగభూతప్రేతపిశాచనరమృగ పశుపక్షిసరీసృపస్థావరజంగమాదిసకలభూత పితామహ.... సరసీరుహనాభనాభిసరసీరుహసంభవ సరసిజాసన తత్త్వామీ కరాభ, చతుర్ముఖ, చతుర్భుజ, సావిత్రీ, గాయత్రీ సరస్వతీ నాథ,సకలకళాలంకృత శ్రుతిస్మృతిపురాణేతి హాసైరను గమ్యమానః కుందేందు మృణాళ సద్ధవళహంసవాహన మారుహ్య అజవింశుర్వన్ భగవదుత్సవ సేవార్థమాగచ్ఛ స్సాంగస్సాయుధస్సవాహన పరశక్తి సపత్ని సపుత్రపౌత్ర పరివారాయనమః ధాన్యావాహనాది షోడశోపచార పూజాం సమర్పయామి.........

బ్రహ్మణో బలకాతేజ నృత్యంస్యాత్సర్వమంగళం
గానంచ దైవతం ప్రోక్తం బ్రహ్మతాళం ప్రశస్యతే.

(తాళం) (౧)

(౧) సనక ప్రముఖ ప్రతిబద్ధనఖం సురబృందసమన్వితపన్నపదం
నమితప్రణుత ప్రతిపత్తికరం విధిమద్భుతసృష్టిసముద్వహనం
సరసిజభవనం సరసిజవదనం సరసిజనాభసుతం కరధృతి
కరకం మనమతి మనఘం జితశతపత్రికరం
ప్రకటిత విభవం ప్రముదిత హృదయం ప్రతిదినసృష్టికరం
శతమఖనమితం శకలితకలుషం శతధృతి తాళమిదం
తత్తత్కృత ధృతితాళమిదం ॥హంసనాదతాళం_ముఖారిరాగం॥

2. గరుడ తాళం :

నమస్తే వైనతేయాయ నమస్తే విహగాధిపే
పన్నగాశ నమస్తేస్తు నమస్తే గరుడాయచ
ద్విహస్త మంజలిం కృత్వా కారయే ద్విహగేశ్వర
ఉద్వేగం గమనారంభం యానం గరుడ ముచ్యతే
వందే పతత్రిణాం శ్రేష్ఠ వినతానంద వర్ధన
నాగాంతకం మహాశౌరిం గరుడం విష్ణువాహనం
ప్రియతాం సర్వలోకేశ శ్రీవత్సాంకితలక్షణం
భృత్యైశ్చ పరివారైశ్చ గచ్ఛన్ తత్ర గణై స్సహ
సహస్రాక్ష స్సహస్రాంఘ్రి సహస్రదళపంకజః

సర్వేదేవాః సర్వేదేవ్యాః సర్వేఋషయః సర్వేఋషిపత్న్యః సర్వేపితరః సర్వేపితృ పత్న్యః.

గద్య: సిద్ధ విద్యాధర గరుడ గంధర్వ కిన్నర కింపురుష యక్ష రాక్షస పన్నగ నాగభూతా ద్యష్టాదశ గణా స్సర్వేదేవాః । ప్రియతాం । కమలాయువతీకరకమలపరిమళ పటలపరివాసిత భుజబలమథిత దితితనయ శతసహస్రస్య నిశిచర రజనీచరవపురుధిర బహుళ దారా సమేతస్య మత్స్య కూర్మ వరాహ నారసింహ వామనరామ రాఘవ బలరామ బౌద్ధ కృష్ణ కల్క్యాద్య ప్రాదుర్భావ దశక పరిపాలితస్య, భగవతో నారాయణస్వరూపః సకలపక్షిరాజః అమందమందమథిత మహాజలధివత్సుధాపహారణసుధానమయ చలిత సురవరః సువర్ణ శ్యామాంబర యుగళధృత కనకరాజీవ కటితట ఘటిత కనక కింకిణీ మేఖలారంజితః రుధిరపదండ స్తామ్ర చూడః సముదగ్రమేఖలోపరి వేగవేగ సరకాంత రథోనాగాంతకో గరుతః ప్రీతియుక్త సకలదేవతాహ్వానార్థం ధ్వజ దండాగ్రమండిత పీఠే సన్నిధానం విర్భంతా స్సాంగ స్సాయుధ.

(౨) ఝుణఝుణ ఝుంకృతి కంకణం । హణరణహుంకృతి
కింకిణికం
వినతాతనయం కనకాభవిభం విహంగకుల భూషణం ।
భుజంగకుల భీషణం.
బృహత్పక్షం విపక్షఘ్నం శూరఘ్నం హరివాహం హరి
కేతం గరుత్మంతం నమస్యామి.
తత్తః గరుత్మంతం నమస్యామి ।
విష్ణుక్రాంతవృత్తం – మధ్యమావతిరాగం.

3. ఇన్ద్రితాళం :

హేమవర్ణం సహస్రాక్షం వజ్రహస్తం గజాశ్రయం
ప్రాక్షేశనాయికం వన్దే తృతీయ్యావరుణైః స్థితం
ఇన్ద్రి మైరావతం రూఢం శచ్యాసమావిరాజితం
వజ్రపాణిం సర్వవర్ణం దివ్యాభరణభూషితం.
నవప్రిదశనాథాయ వారితాశేషవిద్విషే
పులోమజకుశాభోగ సంభోగరసమేదినే.

గద్య: జయపురందరా పూర్వదిశాధిపతే శచీవిలాస రసిక సకల సురవరగణై పురోధిసేవ్యమాన రథ గజ తురగ శిబికా రంగ డోలావ్యాళ సింహాది వాహన ఛత్రిచామర వితాన ధ్వజపతాక శోభిత దర్పమాలాభిరంజనైః మంగళపాతకైర్వాద్యబృందకైః సంతాన కుసుమనికరై రాకాశమాపూరయన్ రజతగిరి శిఖర సదృశ మైరావత మారుహ్యాంజలిం కుర్వన్ భగవదుత్సవ సేవార్థమాగచ్ఛ ॥స్సాంగస్సాయుధ॥

(౩) హరి హయ గజవరగతి నిరతం ।
ప్రతిభట బహువిధ నఖ నిరతం
క్షితిధరగతి హరమతి భయదం ।
శ్రీ వరపటు పద యుగళ పదం
సకల సురవర మకుటమణిగణ జృంభితాంఘ్రి సరోరుహం
కమలవిభకర కలిత శతకోటి క్రాంత సురద్విషం ।
విగత మృగకళి వదవ
కామినీ జనకాముకం ।
వివిధ కరివర వివిధ గతియుత మంద్రతాళ
మిదం ప్రియం । తత్తః ఇన్ద్రితాళ మిదం ప్రియం....
గజలీలా తాళం ॥నాదనామక్రియ రాగం....

**4. అగ్నితాళం :**

మేషా రూఢం ప్రతిప్రాచ్య భాసురం హవ్యవాహనం
విశాఖా సంస్థితం వందే శక్తిహస్తం మహాబలం
సప్త హస్తం సప్త జిహ్వ సతతం మేషవాహనం
స్వాహాప్రియం రక్తవర్ణం స్రుక్స్రువాయుధ ధారిణం
సప్తార్చిషే నమః స్సప్త జిహ్వాయాచోగ్రమూర్తయే
విశ్వేశ్వరాయ దేవాయ యజ్ఞమూర్తి ర్వరాత్మనే.

గద్య: సకల భూతాత్మకో వైశ్వానరః సమిధాజ్యచరుపురోడాశ సతిల దధి మధుక్షీరాంబులాజాక్షత యవసర్షపాదిభిః। సంవర్ధితశరీర స్రుక్ స్రువ కమండల జుహేం మేక్ష పీఠా పాత్ర సూర్పోల్లేఖ ముసలాది ప్రాత్రైరస్యైస్సంభృత సంభారై ర్భుజ్యమానై రధ్వర్యుప్రభృతిభిః। స్వాధ్యాయ వషట్కారాదిభిః కర్పూరా గరుకోష్ఠ చందన గుగ్గులాగరు ధూపై ర్నానావిధ దీపికా జాలై సింధూర పరాగపాటలై జ్వాలాజ్వాలి కైః పరివృత స్వాహాస్వధాభ్యాం సహజపా ప్రసవసంకాశోంబుదసంకాశ మేషవాహనమారుహ్యాంజలిన్ కుర్వన్ భగవ దుత్సవసేవార్థ మాగచ్ఛ స్వాంగస్వా యుధ....

(౪) వాహన మేషం వామీత హవ్యం వరదహనప్రియ మారుత భూత సుఖం। స్వాహా సుసంగత చంద్ర విభూషణ శక్తి
సదాసమీతం
దాహన మోహన హుంకృతి సేవిత యాగమయానవం।
లోకమీతా
సుగ తామర భూసుర భూత గతాగత రస్మికరం। దుందుభి మర్దళ పటహసుఘోషిత పావకతాళమిదం।
తత్తః పావకతావీరవిక్రమతాళం – లలితరాగం.

**5. యమతాళం :**

దక్షిణాశాం పతిం కృష్ణం యమం మహిషవాహనం
దండినం భీషణం వందే దంష్ట్రిణం చారులోచనం
దండాయుధం లోహితాక్షం సుముఖం మంజుభాషిణం
ధర్మరాజాయ సర్వేషాం ప్రాణినం సమవర్తినే
కాలాయ కాలరూపాయ పితౄణాం పతయేనమః.

గద్య: కృత త్రేత ద్వాపర కలియుగేషు జరాయుజాం రజస్వేదజ ఉద్భిజాది జంతుకోటీనాం అన్యేషాం చరాచరాణాం కాల దండధరా కాలపాశ కాలదంష్ట్రి కాలమేఘనిభా దక్షిణాశాధి పతే। తత్తత్కాలానుత్సృజ్యతై స్త్రైరేణుభేరీ మృదంగ ప్రణవమర్దళ ఝర్ఝరీ వల్లరీ జర్ఝరీ మురజ గోముఖ తాళ కాహళ వంజాళ దుర్దర శంఖ గదాధరాద్యై ర్వాద్య బృంద కైశ్చాను గమ్యమానఃశత్యభినుత కాలాంజననిభం మహిష వాహన మారుహ్యాంజలింకుర్వన్ భగవదుత్సవసేవార్థమా గచ్ఛస్వాంగస్వాయుధ.

(౫) కాలసువేణు కరాళరవాహత కంకణ భూషణరావయుతం
వాగధర ప్రభునాయకసన్నుత నాగఫణాకృతి పాశధరం
భర్మసుగర్భ పితామహ సృష్టి సమస్త జగత్ప్రభుకం
తాళసుఘోష విభూషితమంజుల మూర్ఛిణి తాళమిదం
తత్తః మంజుల మూర్ఛిణి తాళమిదం
రాజచూడామణితాళం – మలహరిరాగం.

**6. నైరుతి తాళం.**

ప్రేతారూఢం కరాళాస్యం ఖడ్గపాణిం నిశాచరం
నిర్బతించ నిశాహస్తం ధూమ్రముగ్రదృశంభజే
సమస్సమస్త గీర్వాణ గర్వనిర్వాపకారణే
ఆశేషాసురనాథాయ రక్షోధిపతయే నమః.

గద్య: చతుర్దశ భువనాకాశ సముద్వహానాం దేవదానవానాం సిద్ధ విద్యాధరాణాం యక్షరక్షోగణో పేతానాం సత్వరజస్తమో గుణో పేతానాం భగవద్దర్శన సుఖమనుభవిత్రూణాం పురు షాణాం యోషితాంచ అభ్యంతరబాహ్యేషు సర్వత్ర సంచ రణ కర్మ నిరోధికానాం రాత్రించరాణాం ఉచ్చాటన నిపు ణానాం అసిముసల శంఖచక్ర శూలాంకుశ పాశనిక్షేపణీ యాది నానావిధ ఆయుధ ధరాణాం రక్షకపురుషాణాం గణై రనుగమ్యమానో యాతుధానాధిపతయే నిరుఋతయే నర వాహన మారుహ్యాంజలిన్ కుర్వన్ భగవతదుత్సవ సేవార్థ మాగచ్ఛ స్వాంగస్వాయుధ.

(౬) ఘనఘన సంగతి నీలరుచిం। ఘనఘన గర్జిత ఘోషరవం
మణిమయ మండన రాశిధరం। నిశిచర మండన శంఖనిధం

కుపితరాక్షస పరిధిగతం । కరధృత ఖడ్గలతోజ్జ్వలితం
సురవర వంశ వినాశకరం । నిర్‌ృతిశాళ మిదం
తత్తిః నిర్‌ృతితాళ మిదం॥ రంగ ప్రదీపతాళం–భైరవిరాగం.

7. వరుణ :

పశ్చిమాశాపతిం పాశధరం మకరవాహనం
నమామియాతుధానాధం వరుణం శ్వేత విగ్రహం.

గద్య: నమః పశ్చిమరాష్ట్రాధిపతయే పాశపాణయే రక్తాంబరం తం పీయూషధవళకార మూర్తయే జయతు ప్రచేతా భగవాన్ పశ్చిమకాష్ఠాధిపతయే రతిధవళముక్తాంబరధరః సకల సాగర సరిత్పరి పూర్ణేషు మహాహ్రదనదీతటాకకూపపల్వలాదిషు సరసిజనళినసముదాయ సర్వగంధైఃదివ్య స్ఫటిక మణి కనకకలశ ఛత్రచామర బద్ధైః బ్రాహ్మణగణైః సంభావ్యమాన స్వలిలశ్చైశ్చైర్మి కిరవాహన మారుహ్యఃజలింకుర్వన్ భగవదుత్సవసేవార్థమాగచ్ఛ స్వాంగ స్వాయుధ.

(౭) వరుణం తరుణం బలవైరి సఖం మకరధ్వజవాహన మంబుపతిం
ధవళాభరణం ధవళాంబరకం ధవళాకృతి మక్షయ పాశధరం
ప్రథమ ప్రథమ ప్రథిత ప్రభవం ప్రకటీకృత భూషణకం
ప్రకట ప్రకట త్రిజగిచ్ఛరణం వికటధ్వని వారుణ తాళమిదం
తత్తద్వికట ధ్వని వారుణ తాళమిదం । మకరంద తాళం—మేఘరంజని రాగం.

8. వాయువ్య తాళం :

పీనాంగం హరిణాసీనం వాయు మంకుశధారిణం
సదాగతిం విశాలాస్తిం శ్యామాంగం కుంచితద్వయం
ప్రాణినాం ప్రాణిరూపం తం ద్విబాహుం దండధారిణం
వాయుం కృష్ణమృగాసీనం పూజయామ్యఃజనాపదం
నమ ప్రమ స్తభూతానాం ప్రాణిభూతాని వాయవే
సదాగమన శీలాయ పానకప్రియబాంధవే.

గద్య: సతతగతే సమీరణం ఛండవేగ మృత్స్రుజ్య మందంమందం సంచరన్ గిరిభూమి సరసీజ వృక్షజాతాని లతాజాతాని సర్వాణి రాత్రసంపుల్లాని తివాలికసంతానాని పరిమళ బహుళాని దివ్య పారిజాత ప్రసవాని పుణ్యపుష్పాణి సమాదాయ పాత్రే ప్రక్షిప్య కర్పూరాగరుకోష్ఠ చందనైలా లవంగ తక్కోల మృగమదాది పరిమళ జాతాని వివిధమణిగణ కనకపాత్రాభ్యంతరాదాయ సర్వగంధాత్మికత్వర్వప్రాణిభిరనుగమ్య మానోత్యున్నతగతిం కృష్ణ సారంగ మారుహ్యం జలింకుర్వన్ భగవదుత్సవసేవార్థ మాగచ్ఛ స్వాంగ స్వాయుధ.

(౮) బహువిధ సురతరువనసుమనం । పరిమళముహుముహుర విశగతే
దిశిదిశి పరచయ సతత గతేఃమధుకరనికరసుఝుంకృతికృత్ ప్రకటా మకుటాస్ఫుట విశద మృదుస్మిత కటకా నికటస్త వికృత్
తరుచయ దిశిదిశి మారుతి మందమహోఃదినకరకరవిభ హృత్తిమిరే
చరచర కథయతి తాళమిదం । తత్తః చరచర కథయతి తాళమిదం
విజయతాళం । వసంతభైరవిరాగం॥

9. కుబేరుడు :

కుబేరం చిత్రలేఖేశం యక్షగంధర్వనాయకం
అశ్వాసీనం కుంతపాణిం ద్విబాహుం స్వర్ణసన్నిభం
నమః కుబేరదేవాయ శంకరప్రియబంధవే
యక్షేశాయ ధనేశాయ రాజరాజాయ పిద్యతే.

గద్య: అలకాపురివరాధీశ్వర కుబేర పరమేశ్వర సభా ఉత్తరాశాధిపతే, వైశ్రవణాప్సరోభి స్సేవ్యమాన భగవదాలయముఖ మంటప సోపానమంటప గోపురావర్ణ మహామండప నృత్య మంటప యాగశాలాద్యనేక మంటపాన్ సర్వత్ర రంజితాసన యవని కాంబరి భేరివితాన ధ్వజ పతాకకోటిభి ముక్తాధామ స్తంభవేష్టన ద్వారవేదికా సుతోరణ స్తంభకనకకదళీ పతాకపూగమాలాలంకార హరిరుపకరణాష్టక మంగళ సంబాయుధాద్యైస్సైరుపచారైః యక్షిగణైః శ్చానుగమ్యమానః చిత్రరథహయవాహన మారుహ్యః జలింకుర్వన్ భగవదుత్సవసేవార్థ మాగచ్ఛస్వాంగ స్వాయుధ.

(౯) యక్షగణరక్షణ విచక్షణ కుబేరం । దక్షముఖ తక్షణ విచక్షణ హార

మిత్రం । పుష్కరత ప్రియసు చైత్రరథవాసం ।
శంఖనిధి పద్మనిధి
సేవితపదాబ్జం । పుణ్యజనార్చిత పుణ్యజనేశం శ్రీ కరరాగ
హయాధిప
యానం । శ్రీపతిపాలనదైత్యవిదారం నౌమి ఉదక్పతిపాలి
కుబేరం
తత్తః నౌమి ఉదక్పతిపాల కుబేరం....
తురంగలీలతాళం । శ్రీరాగం॥

10 ఈశాన్యాం :

నమో స్త్వీశానదేవాయ స్తూయతాం సుఖదాయినే
కరుణాపూర్ణచిత్తాయ గిరిజాయాఃపతయే నమః
చరాచరాణాం లోకానాం సర్వసంహారమూర్తయే
భుజంగరాజభూషాయ భూతానాం పతయే నమః.

గద్య జయ పశుపతే పార్వతీనాథ సిత పరశుధర సిద్ధవిద్యాధర
గరుడ గంధర్వ యక్షరాక్షసాది సేవ్యమాన కుముద కుంద
మృణాళ సుధా సువర్ణ చంద్రశకలశోభిత జటామకుట
కనకనూపురకేయూరహార బద్ధ కనక కుండలాయమాన
మహావిభూషిత దివ్యావయవ కటితటఘటిత శార్దూలచర్మాం
బరధరః త్రిశూల కపాలాలంకృతకరకమల డమరుక
సకల దిఙ్ముఖ సంధ్యానమయ తాండవప్రియ కైలాసశైల
నివాస పాంగప్పాయుధ.

(౧౦) పార్వతీ సహితం పాపవినాశం । భర్గం దుర్గం భూతాధీశం
హిమగిరి దుహితరి గతమనసం । శుభతర బహువిధ
నటవిరతం
సంధ్యాసక్తం చంద్రాపీడం గజముఖ శరభవ జనితముదం
శివదరి మృగధర పరశుధరం । కాలాకారం సోమాధీశం
ధనపతి సురపతి
నుత చరణం । ఖరతర పురరిపు జనదహనం దుర్గాసక్తం
దుర్గాహాసం
హుతవహ పరిధి గతముఖ నయనం ప్రణమత పశుపతి
మఖిలపతిం

తత్తః ప్రణమత పశుపతి మఖిలపతిం
నందలీలాతాళం । శంకరాభరణ రాగం॥
(బలిపీఠ తాళం)

(౧౧) ముఖపంచ సమవక్త్రి నమనాసికాక్షం ।
దశకర్ణ దశబాహు దశ మేక హృదయం ।
అతిరక్త వర్ణా ద్వయ పాదపీఠం ।
బలిపీఠ బలభూత బలభుజ్నమామి॥
విమానం బలిపీఠంచ సమానం పరికల్పయేత్
సర్వ దేవాశ్రయంధామ బలిపీఠే సమర్పయేత్
యక్షేశం పూర్వదిగ్భాగే రాక్షసం దక్షిణే తథా
పైశాచం పశ్చిమేభాగే భూత ముత్తరతన్యసేత్
ఆమోదంచ ప్రమోదంచ సుముఖో దుర్ముఖ స్తథా
గంధర్వ కిన్నరంచైవ ఊర్ధ్వమేకం సదాశివ
అవిఘ్నేవిఘ్న కర్తార పత్తై తేభూత నాయకాః
సర్వేభ్యో బలిపీఠాది దేవతాభ్యోనమః
బ్రహ్మ వైనతేయాది అష్టదిక్పాలక బలిపీఠ సర్వ దేవతాను
గ్రహేణ సర్వదేవ దిగ్విజయమస్తు....

## సర్వవాద్య ఆరాధన

చెయ్యూరునందలి సుందరేశ్వరస్వామి ఆలయమందునేటికినీ ఈ ఆరాధన విధానము (కొంత మార్పుతో) ఆచరణయందున్నది. ఈ సర్వవాద్య ఆరాధన నాలుగువందల సంవత్సరముల క్రిందటి నుండి సుందరేశ్వరస్వామి ఆలయములో వున్నది, చెంగల్వరాయ కవి కాలమునందు దాలవరకు సంస్కరింపబడి, ఒక చక్కని రూపమివ్వబడి, శబ్దముగాం భగపద్దులు మొదలైన కొన్ని మాతన రచనలు చేర్పబడి గీ/షిత్వాంచన్యాత్యములు మూడును చక్కగా సమపాళ్ళయందు పోషింపబడు విధమున ఒక సంపూర్ణ స్వరూపముగా రూపొందెను.

చెంగల్వరాయశాస్త్రి కవి, గాయకుడు, భరతవిద్యాపారంగతుడు. ఆయన సుందరేశ్వరునిపై, ముక్తాంబపై అనేక కీర్తనలను, శబ్దములను, గీతములను, యక్షగానములను రచించి, భరతవిద్యను యెందరో నట్టువకాండ్రకు నేర్పిన ఆచార్యుడు. ఆయనచే రచింప బడిన 'సుందరేశ్వర విలాసము' అనెడి యక్షగానము పర్వదినము లందు ప్రదర్శింప బడేది.

సర్వ వాద్యము :

ఆలయమునందు స్వామికి షోడశోపచారములు ముగిసిన తరువాత చేయబడే నృత్యగీత వాద్యములతోగూడిన ఆరాధనగా చెప్పవచ్చును. ఇందు అనేక రకములైన – ముఖవీణ, మురళి, సన్నాయి, ధవళశంఖు మొదలైన గాలివాద్యములు; వీణ, గోటు, వాయులీనము ఆదిగాగల తంత్రివాద్యములు; డోలు, మృదంగము, నగారా, శుద్ధమర్దళము, డమరుకము, సూర్యమండలము, చంద్ర మండలము మొదలైన చర్మవాద్యములు, పంచముఖివంటి మృణ్మయ వాద్యముల సంగీతముతో వేరువేరుగా గోష్ఠిగానముగా నారాధించి: పుష్పాంజలి, శుద్ధ నృత్తము, కేళిక మొదలైన నృత్య ములచే దేవుని ఆనందింపజేసి చూర్ణిక, ప్రబంధము, శ్లోకము, అష్టకము మొదలైన రచనలతో స్తోత్రముజేసి ఆ దేవదేవుని గుణ గణముల కీర్తించి కుంభహారతితో ముగించుటయే సర్వవాద్య ఆరాధన.

ధవళము, అష్టకము, వనం, ప్రబంధము మొదలైన సంగీత రచనలు నేడు మనము సంగీత కచ్చేరీలయందు వినెడి యవ కాశము లేకపోయినను, యిట్టి యపూర్వ రచనలెన్నియో సర్వ వాద్య ఆరాధనయందు వినగలుగుచున్నాము.

ఆ రాధన క్రమము .

షోడశోపచారములు ముగిసిన పిదప ఈ ఆరాధన మొదటి దీపారాధనతో ప్రారంభింపబడి ఆఖరి దీపారాధనతో ముగియును.

ప్రతి సంగీత విన్యాసమునకు ముందుగా ఆలయ పూజారి ఈ క్రిందివిధముగా అవతారిక వాక్యములు చదువును.

జయా విజయీభవ ।
దేవ దేవోత్తమ ।
దేవతా సార్వభౌమ ।
అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా
స్వామిన్ బహూపరాక్.

ఆయావాద్యము, గీతము, నాట్యము ననుసరించి 'వీణా వాద్యం అవధారయ' అనియో, శుద్ధనృత్యం అవధారయ అనియో ఈ విధముగా చెప్పినపిదప ఆయా వాద్యములు, నృత్యములు ప్రద ర్శింపబడును.

మృదంగము, తాళము, నట్టువతాళము, గంటలు, జేగంటల సంగీతముతో దీపారాధన జరుగును.

అటుపై 'ఆశీర్వాద' వచనములు ఆలయ పూజారులు చదివెదరు.

అటుపిమ్మట 'ఒడవరులు' గద్యము చదివెదరు. అందు కొన్నివేళలందు తేవారము, తిరువచకము, తిరుప్పావి, పురాణముల నుండిగూడా కొన్ని రచనలను చదివెదరు. అటుపై బ్రహ్మతాళము నందు కొన్ని జతులు పలికించబడును. స్వామియొక్క స్తోత్ర గీతము నాట్యాచార్యుడు తాళమువేయుచు పాడును.

తరువాత శుద్ధమద్దళము (నందికేశ్వర వాద్యము) యొక్క ప్రదర్శనము జరుగును.

పిమ్మట 'ఆలాప విన్యాసము'–నాటరాగము యొక్క ఆలా పన జరుగును.

ఆలాపన ముగిసినంతనే, దేవనర్తకి

పుష్పాంజలి
శుద్ధ నృత్తము
నాట్యము – ప్రదర్శించును.

అటుపై వీణ, వాయులీనము, మురళి, ముఖవీణ, క్లారయో నెట్, గన్‌సెట్ మేళము మొదలైన వాద్యముల సంగీతము జరుగును.

తరువాత.—

వీణానాట్యము—వీణ వాద్యమునకు (ఆలాపము, తానము, పల్లవికి) నాట్యము ప్రదర్శింపబడును.

వీని తరువాత వివిధ రకములైన సంగీత రచనలతో ఆరా ధన గీతము, ప్రబంధము, వర్ణము, చూర్ణిక, శ్లోకము, సీసపద్యము, అష్టకము, అష్టపది, కీర్తన, పదము, జావళి, తిల్లాన, తేవారము, తిరుప్పుగళ్, కావడిచిందు, ఆరుత్త, ధవళము, వనం, ఏల, ఉంజల్, లాలి, హెచ్చరిక, శోభనము, కనడ గీతము, హిందూస్థాన సంగీ తము, వెన్నెల గీతము మొదలైన సంగీత రచనలతో స్తోత్రము జేసి మంగళ గీతము పాడబడును.

విస్మృత వాద్యగోష్ఠి—

తిరుచిన్న, భూరి, ధవళ శంకు, నపురి, ముఖవీణ, బాకా, నాగస్వరము, డమరు, పంచముఖ వాద్యము, పెద్దమేళము, టకోర, జల్లారి, జయభేరి, నగార, ఢంకా, డమరుకము, రాజవాద్యము వీని విస్మృత

అన్ని వాద్యములు కలిసి బృందగానము జేయుదురు.అప్పుడు ఆఖరి దీపారాధన ముగియును.

అటుపై స్వామి దర్బారులో కొలువై యుండగా దేవ నర్తకి 'కేళిక' జరుపును. ఈ కేళికా వినోదములో అలరింపులు, జతిస్వరము, శబ్దము, వర్ణము, పదములు, జావళీలు, మొదలైన సంగీత రచనలకు నృత్త నృత్యాభినయములు ప్రదర్శింపబడును.

ఈ ఆరాధన యందు పాల్గొనిన దేవనర్తకి, వెంగళ్వారాయ కవి శిష్యపరంపరకు జెందిన విదుషీమణి శ్రీమతి శారదయొక్క అభినయము ఆమెయొక్క జీవిత సంధ్యాసమయములో జూచే భాగ్యము నాకు కలిగినది.

చర్మకట్టు వాద్యనృత్యము :

ఈ నృత్యపద్ధతి వెలమప్రభువుల సంస్థానముల్లో యెక్కువగా ప్రచారములో నుండినది. దేముని వుత్సవ సమయములలో తిరువీధులు ఊరేగునప్పుడు 'మోహన - పెద్దవర్ణము'నకు ఈ నృత్యము చేయబడేది.

సుమారు ఇరువది అయిదుమంది శృంగభేరి వాద్యకులు (డోలు) ఇరువది అయిదుమంది సన్నాయి పాటకులు రాజబాటకు యిరుప్రక్కల ఒకరికెదురుగా వొకరు నిలువబడి కార్వేటి నగర సంస్థానాధీశులు పెదవెంకట పెరుమాళ్ల రాజేంద్రునిపై రచింపబడిన 'శోభన చౌకవర్ణము' వాయించుచుండగా నూరుమంది వరకూ నర్తకీమణులు శ్వేతాంబరములు ధరించి బారులుదీరి ఆ వాద్యకుల మధ్య నిలువబడి నాట్యాచార్యుడు తాళము వేయుచుండగా నాట్యమాడేవారు. సన్నాయి వాద్యకులు అతి విలంబిత లయలో పల్లవి వాయింతురు. శృంగ భేరి వాద్యకులు ఆ కాలములో ప్రారంభించి పల్లవి ముగియులోగా త్రికాలము వాయించి జాగాకు వత్తురు. నట్టువరాండ్రు ఆ పల్లవి సాహిత్యమునకు ప్రథమములో ఆంగికాభినయము ప్రదర్శించి అటుపై తాళ లయాను సారముగా త్రికాలములో పలికే వాయిద్యముల సంగీతము ననుసరించి అందరూ ఒకేసారి ఒకేవిధముగా నర్తనమాడి తీర్మానించేవారు. దీనికే 'చర్మకట్టు' అని పేరు.

తాళచిత్ర నృత్యము :

ఇది దేవనర్తకీమలచే నభ్యసింపబడిన యొక ప్రత్యేక నృత్యరీతి. ఇందలి అడవు సంప్రదాయము గూడా సామాన్యముగా మనము జూచే నృత్య ప్రదర్శనమునందలి అడవులకు కొంత మార్పుగా నుండును. ఇందు సాధారణముగా అపూర్వ తాళములందు వ్రాయబడిన "కవతము" లకు నృత్యమాడబడును. ఈ నృత్యమునాడునప్పుడు నర్తకి తన పాదములకు పారాణి రాసుకొని నృత్యమాడును. కౌస్తుభము ముగించునప్పటికి ఏ దేవతను గూర్చి ఆ కౌస్తుభము నాట్యమాడబడినదో ఆ దేవతయొక్క చిత్రమును రంగస్థలముపై చిత్రింపబడియుండును. ఇది యొక అపూర్వపద్ధతి.

ఈ అపూర్వపద్ధతి ప్రారంభములో అభ్యసింపబడిన తరువాత తరముల ఆచార్యులు, నర్తకీమణులు, దేవతల చిత్రములు పాదముతో చిత్రించుట తప్పుగా నెంచి ఈ కళారాధనయందు యెక్కువ వుత్సాహము జూపుట మానిరి. కాని ఈ సంప్రదాయము మాత్రము నేటికినీ మిగిలియున్నది.

— —

# దేవుని దర్బారులో దేవనర్తకి

## అద్దాల మండపంవద్ద దేవనర్తకి నృత్యం

——

రాత్రి సుమారు పది గంటల సమయము. భక్తులను తన దర్శన భాగ్యముచే తరింపజేయుటకు తిరువీధులందు తరలి వెళ్ళిన స్వామి, కళ్యాణ మంటపంవద్ద కొలువు దీరుదురు. అట దేవనర్తకి 'కేళికా' ప్రదర్శనము. 'కేళిక' స్వామి వినోదార్థము చేయబడే నృత్య ప్రదర్శనము. ఆలయములో మూలవిరాట్టుముందు ప్రదర్శించే అరాధన నృత్యములు నృత్త ప్రాధాన్యత గలిగి ప్రత్యేకముగా రూపొందించబడినట్టివి. నర్తకి స్వతంత్రించి అభినయించుటకు యెట్టి స్వేచ్ఛయును లేదు. 'కేళిక' వినోద ప్రదర్శనమగుటచే అభినయ నృత్యనృత్తముల విన్యాసములందు ఆమెయొక్క పాండితీ ప్రతిభ ప్రదర్శించే అవకాశముండును.



తర్క-వేదాంత మీమాంస వ్యాకరణాదులందు ఉద్దండులైన కుండనాల పండితులు, నాట్య కళావేత్తలు, కళోపాసకులు, కళారాధకులు, కళాభిమానులు అందరు ప్రదర్శన స్థలమునకు జేరెదరు. నర్తకి తనపాండిత్యమును ప్రదర్శించుచూ అభినయించును. మధ్య మధ్య కళావేత్తలు ఆమెయొక్క కళావిజ్ఞానమును తరిచి చూచుటకు ప్రశ్నలవర్షము కురిపించెదరు. ఆమె వారడిగిన విషయము లన్నింటికి సమాధానము జెప్పుచూ అభినయించవలెను. దేవనర్తకి విద్యకు అదొక పరీక్షవంటిది. ప్రేక్షకులకు కేవలము వినోదమే గాక, విజ్ఞానపువిందు దేవనర్తకి—మేళప్రాప్తి (అలరింపు) తో ప్రారంభించి సర్వపల్లవి శబ్దము, వర్ణము, శ్లోకము, పదములు, జావళీ అభినయముతో ముగించును.

మేళప్రాప్తి (అలరింపు) స్వరపల్లవులయందు నృత్తము, శబ్దము, వర్ణములందు నృత్య - నృత్తములు, శ్లోకము, పదము, జావళీలయందు అభినయముయొక్క ప్రదర్శనముండును. మేళప్రాప్తి (అలరింపు).

ఆలయములో ప్రదర్శించునప్పుడు ఝంపె తాళమందు ఆడెదరు.

కేళిక సమయమందు తిశ్రగతియందుగాని మిశ్రగతియందు లేక ఐదు జాతులు గలిపి 'పంచముఖి' అనే పేరుతోగాని 'అలరింపు' నాటరాగములో ప్రదర్శింపబడును. ఆలయములో ప్రదర్శింపబడినట్టి నృత్తము, సభలో ప్రదర్శించు విన్యాసక్రమము యొక్క ప్రారంభ ముగింపులు చాలవరకు ఒకే విధముగా నుండును. 'అలరింపు' అనగా శరీరము పుష్పించుట లేక వికసించుట. నర్తకి సమస్థానకమునందుండి, 'తాందిత్తాం తై తతై' మొదలైన శబ్దములు ఆచార్యుడు పాడుచుండగా ఆమె నేత్రములను, కనుబొమలను, పెదవులను, మెడను, భుజములను అటుపై చేతులను ఈ విధముగా శరీరములోని ప్రతి అవయవమును తాళలయల ననుసరించి విన్యాసము జేయును. ఈ నాట్యము చూపరుల కెట్లుండుననగా—

శిలాప్రతిమవలెనున్న నర్తకియందు ఆ సంగీతముయొక్క ప్రభావమువల్ల వివిధ అంగప్రత్యంగోపాంగములు వికసించి చైతన్యవంతములైనట్లు దోచును. ఆలయములోని ఒక సుందర విగ్రహము సజీవమూర్తియై తమముందు నర్తిసమాడుచున్నట్లు భావముగలుగును.

సర్వపల్లవి లేక జతిస్వరము: శబ్దము, సాహిత్యపల్లవి. సరిగమ పదని—స్వరములయొక్క చేరికతో ఒక ప్రత్యేక తాళములో పల్లవి నేర్పరచి ఆ పల్లవికి జతులనుగట్టి నృత్తమాడుట

స్వరపల్లవి, లేక జతి స్వరము. ఇందు ప్రత్యేకముగా కరణాంగ హారముల విన్యాస ప్రదర్శన ముండును. శబ్దపల్లవియందు స్వరములకు బదులుగా త, ది, తక, జం – మొదలైన మృదంగ శబ్దములతో పల్లవి కూర్చబడి యుండును.

సాహిత్య పల్లవికి సాహిత్యముండును. దాని నాధారముగా జేసికొని జతులాడబడును.

శబ్దము—ప్రఖ్యాత పురుషులయొక్కగాని, దేవతలయొక్కగాని, రాజులయొక్కగాని పొగడ్తలతోగూడిన గీతములకు నృత్త, నృత్యముల ప్రదర్శన.

శబ్ద నృత్యములగురించి వివరముగా వ్రాసియున్నాను. వర్ణము – శృంగారరస ప్రాధాన్యతగలిగి నాయికా నాయకుల విరహవియోగముల వర్ణనలతోగూడి నృత్త, నృత్య అభినయాదులు ప్రదర్శించుటకు అనువైన విధమున రూపొందించబడిన సంగీత రచన వర్ణము.

అభినయము—శ్లోకములు, పదములు, జావళిలు మొదలైన రచనలకు సాత్విక, సంచారులయొక్క ప్రదర్శనముద్వారా ఆ రచనలలోని భావమును నవరసము లొలుకునట్లు వ్యక్తపరచుట అభినయము.

భారతీయ నృత్యకళకు తలమాణిక్యము ఈ అభినయ విద్య ఆంధ్రుల అభిమాన విద్య.

జావళీ ప్రదర్శనముతో నృత్యప్రదర్శనము ముగియును.

కేళికనుగూర్చి క్లుప్తముగా వ్రాసినాను. ఈ నాట్యము నేటి కాలములో భరతనాట్యమనే పేరుతో యెక్కువ ప్రచారమునందున్నది. అదృశ్యమగుచున్న అపురూప ఆరాధన నృత్యములను గూర్చియే ఈ గ్రంధములో విపులముగా చర్చించాను. 'కేళిక'లోని వివిధ నృత్యములగూర్చి వివరముగా యిదివరకే యెన్నియో గ్రంధములందు చర్చించినాను. వివరములు తెలిసికొను గోరువారు నాచే రచించబడిన నృత్యాంజలి, నృత్యరేఖ, నాట్యసుందరి, దాక్షిణాత్యుల నాట్యకళాచరిత్ర గ్రంధములను చూడగోరుతాను.

—

# కలాపములు, యక్షగానములు - దేవనర్తకి



ఆలయములలో స్వామి సన్నిధిని ఆరాధన నృత్యములు, కొలువునందు 'కేళికా' ప్రదర్శనములేగాక, ఆయా దేవతలయొక్క పుణ్యగాధలను ప్రజోపయోగార్థము భాగవతములుగాను యక్షగానములుగాను, కురవంజి రూపకములుగాను, కలాపములుగాను, ప్రదర్శింపబడును. ఈ ప్రదర్శనములు కేవలము వినోదమేగాక మత ప్రచారమునకుగూడా నుపయోగించును. దేవనర్తకినులు యిందు పాల్గొనినను ఆమె ఆలయమునకు చెందిన దగుటచే అన్య ప్రాంతములకు కేళికకై వెళ్ళే అవకాశ ముండదు గాన ఆ విద్యను నాట్యమేళములవారు (భాగవతులు), జక్కుల వారు అభ్యసించి ఊరూర, వాడవాడ, మారుమూల పల్లెలందుగూడా, రామాయణ, మహాభారత, భాగవత గాధలను, శివపురాణ గాధలను ముద్దులొలికే ముచ్చటైన రసవత్తర గాధలుగా రూపొందించి నృత్య, నాట్య సంగీతములతో ప్రదర్శించి ప్రజలలో వినోదముద్వారా మతప్రచారము చేయుచుండిరి.

ఆంధ్రలోని దేవదాసీలు ప్రదర్శించే 'కలాపము'లందు ముఖ్యమైనవి భామాకలాపము, గొల్లకలాపము, రాధామాధవము, క్షీర సాగర మధనము.

ఇందు విశేష ప్రచారము గలిగినట్టివి – భామాకలాపము, గొల్ల కలాపము.

సుందరేశ విలాసము, విష్ణుపల్లకి సేవాప్రబంధము, శివ పల్లకి సేవాప్రబంధము మొదలైనవి యక్షగానములు. ఈ యక్షగానములను కొంతకాలము క్రిందటివరకు దేవదాసీలు ప్రదర్శించేవారు. నేటికినీ ఒకరిద్దరు వృద్ధులు ఈ నాటకముల దెలిసినవారు దేశములో నున్నారు.

భామాకలాపము, గొల్లకలాపము, కూచిపూడి భాగవతులు, మరియు యితర భాగవత పురుష నర్తకులు నాట్యమాడినను,—వారి బాణీకి, దేవదాసీల బాణీకి అడవు సామునందు—దరువును నడుపుటయందు, చిట్టాలను కొలుచుటయందు, నృత్యనృత్తము

లందలి అంగ విన్యాసము, అభినయ ప్రదర్శనమందు కొంత భేద మున్నది.

('కలాపములు'గూర్చి వివరముగా 'ఆంధ్రుల నృత్యకళ' అనే గ్రంథములో వ్రాసినాను.)

---

## ఇంద్రలోకములో దేవనర్తకి

ఇంద్రసభ నలంకరించిన నృత్యకళావేత్తలలో రంభ, మేనక, ఊర్వశి, తిలోత్తమ మొదలైనవారు ఉత్తమ శ్రేణికి జెందిన వారు.

అందు రంభ, మేనక, ఊర్వశి, వీరు ముగ్గురు మూడు విధములుగా కళా సరస్వతి నారాధించి మూడు విధములైన నాట్య సంప్రదాయములను రూపొందించినారు. వీరిలోనూ "ఊర్వశి" సంప్రదాయము శ్రేష్ఠమైనట్టిది.

**మేనక నాట్యము:**

ప్లవన, భ్రమర విన్యాసములను యెక్కువగా గల్గియుండి, విషమ, వికట, పద్ధతిలో నుండును. అనగా మొగ్గలువేయుట, గాలిలో యెగురుట, వివిధరకముల సాము, అంగహార ప్రదర్శన ములు ఈ నాట్యమందు ముఖ్యము. ఇందు రసభావములు తక్కువ పడి, ప్రత్యేకముగా శరీర పరిశ్రమముతోగూడి యుండును.

**రంభ నాట్యము:**

జతి, స్వరము ఈ రెంటియొక్క ప్రాధాన్యత గల్గినట్టిది రంభ సంప్రదాయము. ఇదియునూ ఆంగిక ప్రాధాన్యత గల్గినట్టి నృత్యమే. ఇందు కొంతవరకు అభినయమున్ననూ - అది భావాభి నయము గాక, అర్థాభినయమై యుండును. అనగా ఒక గీతమును నాట్యమాడునప్పుడు అందలి భావమును ప్రదర్శించే సాత్విక ప్రాధా న్యత గల్గిన అభినయముగాక, కేవలము ఆయా గీతార్థములను దెల్పునట్టి ఆంగిక ప్రాధాన్యత గల్గిన అభినయ ప్రదర్శన గల్గినట్టిది. అడుగు, అడవజాతి విన్యాసములు, కరణాంగహార ప్రదర్శనములు గల్గియుండును.

**ఊర్వశి నాట్యము:**

భావ ప్రాధాన్యత గల్గినట్టిది. రసాభినయము ఈ సంప్ర దాయములోని శేషము. కనుకనే ఈ విద్య ఉత్తమోత్తమ మై నట్టిది. ఈ సంప్రదాయమునే దేవదాసీలు యెక్కువగా ఆరాధించి, ప్రచారములోనికి తెచ్చిరి. ఇట్టి సాత్విక భావప్రదర్శన గల్గినట్టి దేవదాసీల నృత్యారాధన, భారతీయ నృత్యకళను, మహోన్నత శిఖ రాలకు గొనిపోయి, ప్రపంచములో ఒక విశిష్ట సంప్రదాయముగా రూపొందించినది.

ఈ వివరములను మా గురువులు తెల్పగా నేను భద్రపరచి వుంచినట్టివి. ఈ విషయములు ఏ గ్రంథమునందున్నవో నాకు తెలి యదు. సంప్రదాయసిద్ధముగా నాట్యముజేసే కుటుంబములలో ప్రచారములలోనున్న విషయములు గావచ్చును. ఏది యెట్లున్ననూ నాట్య విద్యలో—ప్రాచీన కాలమునుండియూ, సాము, అడవు, జతికంటే అభినయ విద్యకు యెక్కువ ప్రాముఖ్యత యివ్వబడి నట్లు వివిధ శాస్త్రగ్రంథముల పఠనముద్వారా తెలియుచున్నది. అట్టి అభినయ ప్రాధాన్యత గల్గిన దేవదాసీల విద్యనే పూర్వపు పండితులు యెక్కువగా గౌరవించేవారు. మా చిన్నతనమునందుగూడా నృత్య సభలకు వెళ్ళినప్పుడు, "మీకు యెన్నివందల జతులు వచ్చును, యెన్ని తాళములందు నృత్తమాడగలరు?" అని అడిగిన పండి తులు అరుదు.

"మీకు యెన్నివందల పదములు వచ్చును? పుష్పబాణవిలా సము, రసమంజరి, కృష్ణ కర్ణామృతములోని శ్లోకములకు అభి నయము పట్టగలరా? ఏదైనా ఒక క్రొత్త పదముగాని, శ్లోకము గాని పాడిన అప్పటికప్పుడు నాయికను నిరూపించి, స్థాయిభావము పట్టి, అలంకారశాస్త్ర ప్రమాణముగా అభినయముగూర్చి, సంచారుల విన్యాసము చేయగలరా? అని అడిగేవారే ఎక్కువగా వుండేవారు. గనుకనే దేవదాసీలుగూడా అభినయ ప్రాధాన్యత గల్గినట్టి ఉత్త మోత్తమ "ఊర్వశి" సంప్రదాయ విద్యను ఆరాధించేవారు.

---



## ఆంధ్ర, ద్రవిడ, కేరళ, కర్ణాటకములందు నృత్యకళ

వేటికాలములో దక్షిణాపథము అనేక రాజకీయకారణాలవల్ల భాషారాష్ట్రములుగా విభజింపబడినను ఒకప్పుడు ఈ ప్రాంతములోని శాస్త్రీయనృత్యకళ ఒకేవిధముగా రూపొందినది.

విజయపురిని రాజధానిగా ఏలిన ఆంధ్రరాజులు, శాతవాహనులు, ఇక్ష్వాకులు, ఓరుగల్లును రాజధానిగా ఏలిన కాకతీయులు; మధుర,తంజపురీ కాంచీనగరములను రాజధానులుగా ఏలిన పల్లవులు, చోళులు మొదలైన రాజవంశీయులు; విజయనగరమును రాజధానిగా చేసికొని హైందవసంస్కృతీ వికాసమునకు పట్టుకొమ్మై నిలిచిన రాయలవంశీయులు; తిరువనంతపురము,కొచ్చిను, కేరళప్రాంతములను ఏలిన మళయాళప్రభువులు ప్రదేశములువేరైనను, భాషలు మారినను, ప్రభువులు అనేకులైనను వీరందఱు శాస్త్రీయనృత్య సంగీతములను మాత్రము దాదాపు ఒకేరీతిని రూపొందించుట కొనియాడ తగిన విశేషము. కనుక ఈ ప్రాంతములందలి నృత్యకళను గూర్చి వ్రాయునప్పుడు ముఖ్యముగా రెండు విశేషములు పాటించబడినవి.

1) ఆంధ్ర, తమిళ, కర్ణాటక ప్రాంతములందలి స్త్రీ నర్తకులచే చేయబడు నృత్యము కొన్ని స్వల్పమైన ప్రాంతీయభేదములున్నప్పటికి ఒకేరీతిగ సంప్రదాయము వృద్ధిచెందినది. కేరళ ప్రాంతమునందు మాత్రము స్త్రీలు చేయునాట్యము కొంతభేదముగా కన్పించుచున్నది. భేదములున్నచోట వేరుగా చర్చించుచు పోలికలు కలిగిన సంప్రదాయములు ఒకే శీర్షికక్రింద విపరించబడినవి. కనుక భరతనాట్యముగురించి రచింపబడిన వివరములు, ఆంధ్ర, తమిళ, కర్ణాటకప్రాంతములకు చెందిన వివరములుగా పాఠకులు గ్రహించగలరు. కేరళప్రాంతపు కళకు, ఈ మూడుప్రాంతములందలి కళకు కొంత విభేదము ఉండుటచే 'మోహినీ ఆట్టం' అను పేరుతో వేరుగా కొన్ని వివరములు తెల్పబడినవి.

అట్లే పురుషులచే ఆడబడు భాగవతవిద్య తమిళ, ఆంధ్ర ప్రదేశములందు ఒకేరీతిగాను, కేరళ, కర్ణాటక ప్రాంతములందు మరియొకరీతిగాను వృద్ధిపొందియున్నవి. కనుక కూచిపూడి నాట్యమేళములనుగూర్చి చర్చించినపుడు ఆంధ్ర, తమిళ ప్రాంతములందలి భాగవత కళనుగురించి - విపులముగా చర్చించుటయు: కేరళయందలి కథకళి నాట్యమునుగురించి రచించిన భాగములో కర్ణాటకమునందలి యక్షగాన కళగురించికూడ తెలియచేయుటయు జరిగినది.

ఆంధ్రకర్నాటక ద్రవిడదేశాలలో యీ భరతవిద్య ఒకేరీతిగా నున్నట్లు తెల్పినాము. కాని కొంత భేదమున్నది.

ఆంధ్రలోని కళాకారులు ఎక్కువగా రసభావములకు ప్రాధాన్యత నిచ్చి వివిధ సంచారులయొక్క విన్యాసమునకు అభినయమందు ప్రాధాన్యత కలుగచేయుచున్నారు.

తమిళదేశమందు 'అడవు'సాము చక్కగా ఉన్ననూ అభినయమంతగా ప్రాధాన్యత వహించబడలేదు. దీనికి కారణము ముఖ్యముగా భాషయై యుండవచ్చును. కర్నాటక సంగీతమువలె దక్షిణాది నృత్య సాహిత్యముకూడ నూటికి ఎనుబదిపాళ్లు తెలుగు భాష యందుండుటచే - నాట్యాచార్యులు, నర్తకులు, నృత్య సంగీతములే కాక - తెలుగుభాషయందుగూడ చక్కని పాండిత్యము కల్గియుండవలెను. తెలుగుభాషలోని తెలుగు దనము చక్కగా ఎరిగియుండవలెను.ఇది తెలియనప్పుడు ఆ మాటల అర్థానికి అభినయము పట్టుదురేకానీ – అందలిభావము వ్యక్తపరచలేరు. నృత్యాభినయాలకు కావలసిన వర్ణములు, పదములు మొదలైన ముఖ్యరచనలన్నియు తెలుగునందే రచింపబడినవి. ఇతరభాషల కవులుకూడ సంగీత రచనలు చేయుటకు ప్రత్యేకముగా ఈ భాషను అభ్యసించినారు. తెనుగుయొక్క తియ్యదన మట్టిది.

మూడుప్రాంతములందలి విభేదము తెల్పుటకు ఒక ఉదాహరణము :

తోడిరాగము – రూపకతాళమునందలి

"దానికె తగు జాణర – నీవు – దయయుంచర–ఈ వేళ"

—ఈ వర్ణమును అభినయించుచున్నారను కొందము.

నాయికా నాయకులు ప్రణయకలహకారణమున వేరుబడియున్న సమయమున, దూతిక రాయబారమునకై వెళ్ళి నాయకునికి వినతిచేయుపట్టము వర్ణనతో కూడిన రచన ఇది.

తమిళ, కర్ణాటకములవారు

"దానికె తగు జాణర"

అనునపుడు ప్రారంభములో గ్రీవవిన్యాసము చేసి వెనుక అడుగుపట్టి—త్రికాలపు విన్యాసమునకు ఒక ముక్తాయింపు అడి:-

అటుపై "దానికి తగుజాణర" ఈ మాటకు హస్త విన్యాసము చేయుదురు. అభినయపద్ధతి యేర్పాటు ఎట్టిదనగా,

ప్రతిమాటకు:—

కుడిప్రక్కన విన్యాసముచేసి అటుపై ఎడమకు అదే విన్యాసము ప్రదర్శించి ముగించవలెను. ఈ పద్ధతినే అనుసరించి కుడి యెడమలకు కొన్ని హస్త విన్యాసములనుకావించి మూడునాల్గు ముక్తాయింపులను ప్రదర్శించి:-

"మానవునుదైన శ్రీ మహదేవుని పూజించు శ్రీనిధీ— నీవేరా — శివాజీ మహారాజేంద్ర"

ఈ భాగమును అభినయింతురు.

వీరి ప్రదర్శనమందు "దానికె" అని చెప్పునపుడు—మా సఖి, మా చెలి —— ఈ విన్యాసముల ప్రదర్శనమాత్రమే గావించ బడుచున్నది.

* * *

ఆంధ్ర స్త్రీ వర్తకులుకూడ —— తీరికలు అడవులు
ఇదే క్రమము ననుసరించినమా——

వారు అభినయములు పెంపొందించినరీతి ఈ విధముగా నుండును.

షట్టము—

నాయికా నాయకులు వేరుబడినసమయము.
నాయకునికి నాయికయందు విరక్తికల్గిన సమయము

దూతిక నాయకునికి మరల ఆమెయందు అనురాగము కల్గునట్లు చేయవలెను.

అదెట్లు:- తనయొక్క వాక్చాతుర్యముచేతను, అభినయము చేతను, గాన చాతుర్యముచేతను:—

ఆమె వాక్చాతుర్యము - కవి — వర్ణించినాడు.
దూతిక ముందుగా ఆమె యెట్టిదో తెల్పుతుంది:-

దానికదేసాటి, మా చెలిని యింకొకరికి పోల్పలేము—— ఎందులో ? రూపములో:—

ప్రకృతిలో సంపూర్ణసౌందర్యమంతయు ఒకచోట మూస పోసినట్లు సృష్టికర్త, సృష్టిలోని సౌందర్యమునంతయు ఒకచోట కూర్చి ఆమెను సృష్టించెను కనుకనే

ఆమె — నీలాలు - తుమ్మెదరెక్కలు
ఆమె — ఒయ్యారపు వాలుజడ - నాగుపాము
నొసలు - చంద్రరేఖ.
కనుబొమలు — మన్మథుని ఎక్కుపెట్టినవిల్లు
కనులు - ఎఱ్ఱ తామరలు
చూపులు - మదనుని తూపులు

దానికనుల ప్రకాశము — మీనకాంతుల మించును
అతరళనయన బెదురుచూపులు హరిణదృక్కులు జ్ఞప్తికి తెచ్చును
ముక్కు — సంపెంగపువ్వు
పెదవులు — చిగురుటాకులవలె యెఱ్ఱవిరంగు కలవి. లే చిగురాకులవలె మెత్తదనము గలవి.
పలువరుస — ముత్యాలమాల
చెవులు - శ్రీకారము
చెక్కులు - అద్దములు
చిరునగవు — వెన్నెల

ఆమె ముఖము - వికసించిన కమలము - చంద్రబింబము.

ఇట్లు నాయికనునఖశిఖపర్యంతము వర్ణించి ఆమెయొక్క సౌందర్యములో నాయకుని సమ్మోహితుని చేయును.

మరియు "దానికిదేసాటి" - యెట్లనగా - అది ఆటపాటల యందు మేటి, సంగీతమందు సరస్వతి - అభినయమందు అంబను జ్ఞప్తికి తెచ్చును.

వివిధవిలాస విద్యలందు కడునేర్పరి.

ఇన్నివిధముల ఆమెగుణగణముల వర్ణించుచూ నాయకునికి విసుగు కోపకుండుటకును, అతని ఉత్సాహపర్చుటకును ఆమె తన వర్తన విద్యచే అతనిని ఆకర్షించును. ఆ వర్తనము ముక్తాయింపు రూపములో ఉండును. మరియూ ఈ వర్ణనలు చేయుచూ

నర్తకి ప్రదర్శనచేయుచున్నప్పుడు ఆయా విన్యాసములకు తగురీతిని గతులనాడును.

ఉదా:- ఆమె మరాళగమని — అని చెప్పుటకు మరాళపాద విన్యాసము.

కోకిలవలె పంచమస్వరమును తియ్యగా పాడగలదు. అని తెల్పునపుడు మయూరగతి ప్రదర్శనము.

ఆమె చూపులు మదనుని వాడితూపులు అనునపుడు:—సుకగతి ప్రదర్శన వీటన్నిటితో పేర్చి త్రికాలనృత్తముండును.

ఇట్టి వివరణతో కూడినప్రదర్శన ఆంధ్రయందుమాత్రము అభివృద్ధి జెందినది.

తమిళ, కర్ణాటక ప్రాంతములందు స్త్రీ నర్తకులు పదవర్ణములవంటి రచనలను [illegible], జతివిన్యాసములకు ఎక్కువగా ప్రాముఖ్యత నిచ్చి నృత్య, అభినయాదులకు విశేషత కనబర్చలేదు. మరియు వీరి సంప్రదాయములో ప్రదర్శించు అలరింపు, జతిస్వరము, శబ్దము, వర్ణము, పదము, జావళి, తిల్లాన మొదలైన రచనలుకాక ఆంధ్రలోనివారు పిక్కిణి, దరువు, దశావతారములు, శబ్దపల్లవులు, సాహిత్యపల్లవులు మొదలైన రచనలనుకూడ ఆడుచున్నారు.

కేరళయందలి 'మోహినీ ఆట్టం'కూడ అలరింపు, జతిస్వరము శబ్దములవంటి రచనలతో ఆడబడినను యిందలి ఆటతీరులు, అభినయపు పోకడలు, ముక్తాయింపుల పద్ధతులు, ఆంధ్ర, తమిళ, కర్ణాటక ప్రాంతములందలి భరతవిద్యవలె విపులముగా అభివృద్ధి చెందలేదు. అభినయక్రమముకూడ కోమలవిన్యాసములతో రూపొందలేదు. మరొక ముఖ్యవిశేషము—పురుషనర్తకుల భాగవత విద్యకు, స్త్రీల భరతవిద్యకు ఆధారగ్రంథము ఒక్కటే అగుటచే అందు పట్టు హస్తములు ఒకటే అయిననూ పట్టేవిధానము ఈ రెండు సంప్రదాయములందు వేరుగానున్నది. కాని మోహినీ ఆట్టంవందలి హస్తవిన్యాసము చాలవరకు కథకళి విన్యాసములకు దగ్గర పోలికగా ఉన్నది. ఇట్టి విభేదములను విడిచిన ఈ నాలుగు ప్రాంతములందలి స్త్రీల విద్యను ఒకే విధముగా రూపొందినట్టిదిగా చెప్పవచ్చును.

పురుష నర్తకుల భాగవతవిద్య—

నటించుపాత్ర కంఠముతో పాడుచు, హస్తముతో దాని అర్థమును తెల్పుచు, పాదములతో తాళలయల విన్యాసములను చేయుచు, నేత్రములతో రసభావములను ప్రదర్శింపవలెను—ఈ భరతశాస్త్రమును పూర్తిగా అనుసరించి రూపొందించబడిన కళ ఆంధ్ర, తమిళములందలి భాగవత కళ.

కర్ణాటక, కేరళప్రాంతములందు భాగవతనర్తకులు పాడుట అరుదు. కొన్ని దుష్టపాత్రలు, తక్కువరకపు పాత్రలు వికృతముగా కేకలువేయుట, బొబ్బలిడుటవంటి ధ్వనులుచేయుటతప్ప పాత్రలు పాడుట ఉండదు. వంతపాడువారు కథను గానముచేయగా ఆ గానమునందలి కథను ప్రేక్షకులకు ఆంగిక, సాత్త్వికములద్వారా తెలియచేయుట, ఆ రసోత్పత్తిని ప్రేక్షకులలో కల్గించుటకుగాను గానము ముగిసినపిదప వాద్యసంగీతముననుసరించి ఆ భావమును వికసింపచేయుటకు అనువైనట్టి హస్త, పాదవిన్యాసములు చేయుటతో వారి ప్రదర్శనము ముగియుచున్నది. ఇందు ఒక ముఖ్య లోపము. పాడువారి గానపద్ధతి ననుసరించి నర్తకులు ఆడుటచే వాచికమునందు రసోత్పత్తి కలుగుట అరుదుగా నుండును–కాని ఆంధ్ర తమిళప్రాంతములందు భాగవతులు ఆదేవారు పాడుటచే ఆ పాత్రలభావము ననుసరించి కంఠమును స్వర, వినయ పద్ధతులలో పలికించుటవల్ల వాచికము సంపూర్ణముగా పోషింపబడు చున్నది.

కథకళియందు వాచికమునందలి లోటును సవరించుటకు గాను ఆంగికమును, లోకధర్మిని వారు విరివిగా వృద్ధిచేసినారు. కనుకనే కథకళి ముద్రానాట్యముగా రూపొందినది. భాగవతనర్తకులు తగు హస్తపునృత్త, నృత్య విన్యాసములతో పాత్రపోషణ చేయుచున్నారు.

ఇట్టి కొన్ని భేదములున్నను ఈ సంప్రదాయము లన్నియు ఒకే కుటుంబమునకు చెందినవై హైందవ సంస్కృతీ వికాసమునకు తోడుపడినవి.

——

## ఆంధ్రదేశములోని నృత్యకళ



భరతుని నాట్యశాస్త్రములో ఆంధ్రుల నృత్యకళను గూర్చి

శ్లో॥ మహేంద్రో మలయః సహ్యోమేకలః పాలమంజరః।
ఏతేషు సంశ్రితా దేశాస్తేజ్ఞేయా దక్షిణాపథాః।
కోసలాస్తోశలాశ్చైవ కలింగాయవనాః ఖసాః।
ద్రవిడాంధ్ర మహారాష్ట్రా వైణ్ణావైవాసవానజాః।
దక్షిణస్య సముద్రస్యతథా వింధ్యస్య చాంతరే।
యేదేశాస్తేషయుంజీత దాక్షిణాత్యాంతునిత్యశః।

మహేంద్ర మలయాది పర్వతముల నడిమి దేశమునకు దక్షిణాపథమని పేరు. ఈ దక్షిణాపథము ఆంధ్ర, ద్రావిడ, మహారాష్ట్రాది ప్రాంతములతో గూడియున్నది. దీని ఉత్తరమున వింధ్య పర్వతములును, దక్షిణమున సముద్రమును హద్దులు. అట్టి దక్షిణ భారతమందలి జనులు పలువిధములైన నృత్యగీతవాద్యములతో దాక్షిణాత్యమని ప్రసిద్ధిగాంచిన 'కైశికీవృత్తి' యందు నాట్యము చేయుదురు. ఈ శ్లోకమున గల 'వైణ్ణా' యనుదానికి కృష్ణవేణి, పెన్నాతీరవాసులని అభినవ గుప్తాచార్యులు తమ వ్యాఖ్యానములో వివరించెను. ఈ ప్రదేశమంతయూ ఆంధ్రదేశములో నున్నది. ఆంధ్రులు – 'ఆంధ్రి' అనురాగమును తమ జాతిపేర సంగీతానికి సమర్పించిరి.

మాతంగుని 'బృహద్దేశి' లో ఈ విషయము పేర్కొనెను. 'ఆంధ్రి' మాలవ పంచమ రాగమియొక్క ఆరు రాగిణులలో ఒక్కటి

యక్షగానము: —

యక్షులు, నాగులు – రెండును అతి ప్రాచీన తెగలు ఆంధ్రలో.

యక్షులనే జక్కులవారని గూడ పిలుతురు. వారి సంగీత సంప్రదాయమే యక్షగానము

ఇది ప్రత్యేక దేశసంప్రదాయము.

దీనినే భరతశాస్త్రానుసారముగా నాటకరూపములో వృద్ధి పరచి భాగవత నర్తకులు వీధినాటకమనే పేరుతో ప్రదర్శించు చున్నారు.

హాలుని గాథా సప్తశతిని బట్టిచూచిన క్రీస్తుపూర్వమే అనేక విధాలుగా, ఆంధ్రలో నృత్యకళ అభివృద్ధి జెందినట్లు తెలియును.

కాని, నాటి సంప్రదాయములతీరు తెలియుట లేదు. శాతవాహనులు, ఇక్ష్వాకుల కాలముల గూర్చిన గ్రంథములందు కొన్ని నృత్య వర్ణనలు మాత్రము గన్పించుచున్నవి. ఆనాడు వర్ధిల్లిన కళా విన్యాసముల వివరములు మరుగుపడినవి, బౌద్ధుల కాలమునాటి కళః— ఆరామ శిల్ప భంగిమలే ఆధారము. జపాను బుద్ధాలయాల్లో నేటికీ ప్రదర్శింపబడదే నాట్యముల పరిశోధన వల్ల కొన్ని బౌద్ధ యుగము నాటి ఆంధ్రుల కళలగూర్చి తెలియవచ్చును. అభినయ దర్పణము, భారతార్ణవము రచించిన నందికేశ్వరుడు ఆంధ్రుడని పండితుల అభిప్రాయము.

సన్నెచోడుని కుమారసంభవములో ఎంతో నాట్యవర్ణన నాటి కళ గూర్చి కొంత తెలియజేయును.

అట్లే తిక్కన భారతములోని విరాట పర్వములో బృహన్నల నాట్యము గూర్చి ప్రశంసవల్ల ప్రాచీన నాట్యముల గూర్చి తెల్పును.

వారి వివరములు కొంతవరకు భారతార్ణవమందున్నవి.

చాళుక్యులకాలము – పశుపతి సంప్రదాయ శైవమత ప్రచారము – దినమునకు ఆరు పర్యాయములు శైవారాధన. ఆలయాల్లో మూలవిరాట్టు కెదురుగా వలయాకార బలి పీఠము. ఆట దేవదాసీల నృత్యపూజ ఆంధ్రలో ఆలయ శిల్పములో యిదొక ప్రత్యేకత. అభిలషార్థ చింతామణి – సోమేశ్వర II రెండవ సింగ ప్రభువు – సారంగదేవుని సంగీత రత్నాకరమునకు సంగీత సుధాకర వ్యాఖ్యాన రచన.

కాకతిగణపతిదేవ కాలము—

జాయ సేనాపతి – నృత్త రత్నావళి గ్రంథ రచన
అతని గురువులు కొండామాత్య,వెన్నెలకంటి సూరామాత్య
పెదకోమటి వేమారెడ్డి–సంగీత చింతామణి గ్రంథ రచన
కొమరగిరి ప్రభువు – వసంతరాజీయ గ్రంథ రచన
లకుమ – అతని ఆస్థాన నర్తకి
ప్రతాప రుద్రదేవ – ఆస్థాన నర్తకి మాచల్‌దేవి.

విద్యానాధుడు-'ప్రతాపరుద్రీయము' అలంకార శాస్త్ర రచన
విజయనగర ప్రభువులు-రంజకం, శ్రీ రంగరాజు, కుమార
కుప్పాయి ప్రఖ్యాత నర్తకులు.

పాల్కురికి సోమనాథుని - బసవ పురాణము.

పండితారాధ్య చరిత్రలో నాటి మార్గి, దేశి నృత్యముల వర్ణనలు.

శ్రీనాథుని పల్నాటి వీర చరిత్రములో నృత్య వర్ణనలు.

క్రీడాభిరామమందు ఏకశిలాపురంధ్రి నృత్యవర్ణన, జంగము కథ వర్ణనలు

రఘునాథరాయలు:— రామభద్రాంబ ప్రఖ్యాతి గాంచిన నర్తకీమణి.

అచ్యుతప్ప:— భాగవతులకు అచ్యుతాపురము దానము చేయుట అచ్యుతాపురమే "మేలటూరు" మేళముల వూరు.

విజయరాఘవనాయక:- వివిధ యక్షగానముల రచన.

క్షేత్రయ్య ప్రఖ్యాత పదకర్త.

రంగాజమ్మ:- కవయిత్రి—నాట్య సంగీతములందు గొప్ప పండిత రాలు.

మహారాష్ట్ర ప్రభువులు:— 'దేశి'నృత్యాభివృద్ధి చిన్నయ్య, పొన్నయ్య, వడివేలు, శివానందము - కచ్చేరి నాట్యమునకు యీ అన్నదమ్ముల సేవ.

శహజీ — పంచరత్న ప్రబంధ రచన నాటి నృత్య సంప్రదాయమును గూర్చి తెలిసికొనుటకు ఆ గ్రంథముల యొక్క ప్రాముఖ్యత.

తుండోజీ:- విచిత్ర రాయప్రశంస కవి నాట్యశాస్త్రము, పద్య రూపములో రచన.

## ఆంధ్రలో శాస్త్రీయ నాట్యానికి ఆధార గ్రంథములు

నాట్య శాస్త్రము, అభినయ దర్పణము, భరతార్ణవము, భరత సార సంగ్రహము:

ప్రతాపరుద్రీయము, రసమంజరి, రసప్రకరణము మరియు—తెనుగులో పద్య, గద్యరూపములో పైశాస్త్రాల ననుసరించి, దేశిపద్ధతులచేర్చి రచింపబడిన అనేక గ్రంథములు.

## తెలుగునాట శాస్త్రీయ నృత్యకళ నారాధించువారు:

(1) నట్టువ మేళము:—

స్త్రీలు నాట్యం చేసే సంప్రదాయము.

(2) నాట్య మేళము:—

పురుషులు నాట్యం చేసే పద్ధతి.

నట్టువమేళము :—

దాసిఆట, భోగముఆట, భోగముమేళము లేక సానిమేళము, మేజువాణి, కచ్చేరిఆట, దేశిక భరతనాట్యము.

భోగమువారు -సభలందు, దర్బారులందు నర్తనమాడువారు.

సానులు (దేవదాసీలు) :- ఆలయాల్లో ఆరాధన నాట్య మాడువారు.

వీరు గుడిసేవకై నియమింపబడినవారు. గనుకనే గుడి సానులు, పూర్వము మండలేశ్వరులు వీరినుండి కన్యలను వివాహ మాడు ఆచార ముండినది.

నాట్యమేళము:- వీధి భాగవతము, బ్రాహ్మణ భాగవతులు (కూచిపూడివారు, కోట కొండవారు.)

జంగం భాగవతులు, (జంగాలపల్లెవారు) : ఎఱ్ఱిగొల్ల భాగవతులు, దాసరి భాగవతులు, బహురూపులు, గంటె భాగవతులు, చిలకల భాగవతులు, మానాది భాగవతులు, చిన్నమాదిగ భాగవతులు.

కలాప నర్తకులు:—

భామాకలాపము, గొల్లకలాపముల నాడువారు.

వీరందరూ ఆంధ్రలో వివిధ జిల్లాలలో నున్నారు.

నృత్యశిల్పము - ఆలయాలు:-

జాయపసేనాని 'నృత్తరత్నావళి'-రామప్పగుళ్ళలో సుందర నృత్యశిల్పము.

అందలి వినాయక నర్తనలింగములు-అష్టదిక్పాలక ఆరాధన సమయములందు (బలిహరణ) ధ్వజస్తంభముపద్ద సర్తకిచేసే ప్రథమనాట్యం-గణపతి ఆరాధన.

ముచన్ఫలిత కరణ విన్యాసము—పిమ్మట వినాయక శాల మందు "గణపతి కవుతము" అటుపై పిపిధకరణాంగహారములతో కుమారస్వామి ఆరాధన.

తరువాత ఇంద్రస్తవము—ఆ గణపతి నాట్యమే అందు రూపొందించబడెను.

కాకతీయుల కాలము - శైవసంప్రదాయ కళాప్రచారము. దశవిధ శివలీలలు - సప్తలాస్యములు_పేరిణి, ప్రేంఖణ, కుండలి, దండిక, కుద్ద, దేశి యిత్యాది నాట్యముల ప్రచారములు.

"గొండ్లి"—రాజగొండుల దేశి సంప్రదాయ నృత్యము— ఆంధ్రులకు మధ్యప్రదేశ్ నందలి గోండు సంస్థానములకుగల సాంస్కృతిక సంబంధము. వారి సంప్రదాయ కళాప్రచారము.

విజయనగరరాజులకాలము:—

లేపాక్షి ఆలయసుందర శిల్పము-నృత్యభంగిమలు.

వీరవైష్ణవ, వైష్ణవమత ప్రచారానికి అనుగుణ్యమైన కళాభివృద్ధి.

రాధామాధవ మధురభక్తి ఉపాసన వల్లభాచార్యుల మత ప్రభావము-అభినయకళ ప్రత్యేకాభివృద్ధి - గీత గోవిందమునకు నృత్యాభినయములు-రస నిలయములు, క్షేత్రయ్య, పదములసృష్టి— వానికి అభినయము.

తంజావూరు నాయకరాజుల కాలము:—

యక్షగానములకు స్వర్ణయుగము. కేళిక—నేటి భరతనాట్య ప్రదర్శనక్రమము 'పేరిణి' పద్ధతిననుసరించి రూపొందుట.

నృత్యములో మొదటిసారి పదములు ప్రముఖస్థానము వహించుట. వాటినుండి అభినయవిద్యలో క్రొత్తపోకడలు. కచ్చేరి నాట్యము - నృత్త, నృత్య, అభినయాదులకు క్రమమైన యేర్పాటుకు కృషి.

సిద్ధేంద్రయోగి—ప్రాచీన యక్షగాన పద్ధతిలో (పారిజాతము) భామాకలాపమును, ఆ విద్య కూచిపూడివారిద్వారా ప్రచారము యక్షగానములో అనేక శాస్త్రీయమార్పులు వర్ణనాత్మక గేయ రూపములలో నుండి ఏకపాత్ర నృత్యానికి అనువుగానుండిన యక్షగానము స్వరూపము మార్చి, అనేకపాత్రలసృష్టించి, నృత్యనాటకముగా రూపొందుట.

రంగాజమ్మ విజయరాఘవనాయకు :—

వారి యక్షగానములు నాట్యానికి అలంకారములు. రంగాజమ్మ విరచితము-మన్నారుదాస విలాస యక్షగానము—నర్తకుని విద్య పరీక్షించుటకు చక్కని గ్రంథము

మహారాష్ట్రరాజులు :—

నాయకరాజుల కాలమందు క్షేత్రయ్య పదములు అభినయ విద్యాభివృద్ధికి కారణభూతములు. మహారాష్ట్ర రాజులకాలములో రచింపబడిన "పదవర్ణములు" నృత్త, నృత్యముల అభివృద్ధికి తోడ్పడినవి.

వివిధరకములైన అడుపు, జతి, గతి, విన్యాసముల ప్రదర్శనకు అనువైనట్టి "దరువు"-అందలి ఆట క్రమము.

అనేకవిధముల విభావానుభావ సాత్వికసంచారుల ప్రదర్శనమునకు వీలైనట్టి పదములు, అభినయపోకడలు, ఆధారముగాగొని తాన వర్ణక్రమమునననుసరించి గావింపబడిన నూతన సంగీత సృష్టి "పదవర్ణము" లేక "చౌకవర్ణము."పదవర్ణములు తరువాత సృష్టింపబడిన సంగీత రచనలు.

ఆంధ్రలోని వివిధ జమీందారుల కళాపోషణ :-

కార్వేటినగరము, కాళహస్తి, వెంకటగిరి, కొల్లాపురము, గద్వాల, వనపర్తి, మాడుగుల, పిఠాపురం, పెద్దాపురం, తుని, విజయనగరము, బొబ్బిలి, జయపురము, మొదలైన సంస్థానములందు—పల్లవులు, జక్కిణి దరువులు, పదదరువులు, పెద్దవర్ణములు, పదములు మొదలైన సంగీత రచనలు గావించబడినవి. భామాకలాపము, గొల్ల కలాపము, వీధినాటకము, పోషింపబడినవి.

దేవతాస్తోత్రములైన కృతులు అతిప్రాచీనములు, శబ్దములు లేక సలాంజతులు మొదటిసారిగా మహారాష్ట్ర ప్రభువుల

పాలనలో 'కేళిక' సమయంలో రాజనర్తకినులు ప్రభువుల స్తోత్రముతో గూడిన నర్తనము సల్పుట నిమిత్తం రచింపబడినవి.

అటపై అట్టి రచనలే యితర జమీందారీలందలి ఆస్థాన కవులు రచించిరి. ఇవ్విధాన వివిధ సంస్థానములందు రచింపబడిన ఈ రచనలు కొన్ని మిగులుచున్నవి.

హంపీ విజయనగరము తెలుగు ఆంధ్రలో నృత్యకళను అనేక రీతుల నభివృద్ధిలోనికి దెచ్చిన సంస్థానము విజయనగరము, గనుకనే విజయనగరమును కవిపండితులు విద్యానగరముగా గొనియాడిరి. ఆనంద గజపతి మహారాజుగారు అందు ముఖ్యులు. వీరి కాలములో అనేకములైన పదములు, పల్లవులు, శబ్దములు రచింపబడినవి.

అప్పటిలో అతిముఖ్యమైన సంగీత రచన — మండూక శబ్దము."

తూర్పున ప్రఖ్యాతిగాంచిన "మఖలక్షి శపల్లవి" సృష్టి యిచ్చటనే జరిగింది.

సీతారామ గజపతి కాలములో సప్తతాళములందు జక్కిణి దరువులు, పదదరువులు, స్వరపల్లవులు, పొడుంగిదరువులు విశేషముగా రచింపబడినవి. ఇవి యన్నియూ నాట్యకళకు అలంకారములు.

కార్వేటినగరము నేలిన వెంకటపెరుమాళ్ రాజేంద్రుల కాలములో నృత్యకళకు చాల ముఖ్యమైన గోవిందసామయ్య "వర్ణ పంచకము."అనబడే ఐదు పెద్ద వర్ణనములు రచింపబడినవి. ఈ వర్ణములు అపూర్వము. వీటికి నృత్యమాడుట నర్తకునికి పరీక్ష వంటిది.

మోహన, నవరోజ, కేదారగౌళ, గౌళ, వరాళి—ఐదురాగములందు వర్ణనలు రచింపబడినవి. ఇందు "మోహన వర్ణము"-కార్వేటి నగరము, కాళహస్తి, వెంకటగిరి ప్రాంతములందు, నవరోజ వర్ణము, కోస్తా జిల్లాలందు ప్రచారములో నున్నది—

వెంకటగిరి సంస్థానములో — బంగారేతి భూపాలుర కాలములో నాట్యకళ బాలావృద్ధి గాంచినది. ఆయన అనేక కవి, పండిత, గాయక, నాట్యాచార్యుల పోషించుటయేగాక — వివిధ ప్రాంతములనుండి సంగీత విద్వాంసుల రప్పించి, చర్చించి నాట్యముపై ఒక గ్రంథము రచించిరి. అదియే 'సభారంజని'.

మిగిలిన సంస్థానములందు నాట్యకళ అభివృద్ధి జెందిన వివరములు అంతగా తెలియుటలేదు.

## పుణ్యతీర్థములందు నృత్యకళ

శ్రీశైలము: శైవసంప్రదాయము-ఈ స్వామిపై రచింపబడిన అనేక కవుతములను నర్తకులు ఆడుచున్నారు. భామాకలాపములు,గొల్లకలాపములు శ్రీశైల భ్రమరాంబపై రచింపబడిన అంబ స్తవముతో ప్రారంభింపబడుచున్నవి.

ప్రాచీన కాలమందు యిచ్చట 'శృంగనాట్యము' సప్తలాస్యములు ప్రదర్శింపబడినట్లు ఆలయశిల్పమునుబట్టి చెప్పగలము.

శ్రీ కాళహస్తి: శైవ సాంప్రదాయము—

ఆలయ ఆరాధన సాంప్రదాయములు, కేళిక విద్య అభివృద్ధి జెందినది. ఇచ్చట భాగవత విద్య అంతగలేదు.

తిరుపతి: వెంకటేశ్వరునిపై తాళ్ళపాకవారు అనేక రచనలు గావించినను ఒక ప్రత్యేక నృత్య విధానముండినట్లు ఆధారములు గాన్పించుటలేదు.

మన్నారు పోలూరు: వైష్ణవ సంప్రదాయము.

ఆలయ ఆరాధన విద్య, కేళికానాట్యము దేవదాసీలచే ఆరాధించబడినది.

చెయ్యూరు: శైవ సంప్రదాయము-సుందరేశ్వరస్వామిపై అనేక ప్రత్యేకరచనలున్నవి. సర్వవాద్య ఆరాధన ఇచ్చటి విశేషము. ఇచ్చట సప్తలాస్య ఆరాధన, కేళిక, యక్షగాన సంప్రదాయము ఈ మూడు పద్ధతులు అభివృద్ధి జెందినవి.

జొన్నవాడ: అంబఆలయము. శైవసంప్రదాయము ననుసరించి నాట్యకళా ప్రదర్శనము.

శింగరాయకొండ: వైష్ణవ సంప్రదాయము.

బాపట్ల: భావనారాయణస్వామి-వైష్ణవ సంప్రదాయములు ఇచ్చట సిద్ధాబత్తునివారు శాస్త్రీయ విద్యను ప్రచారముజేసిరి.

మార్కాపురం: వైష్ణవ సంప్రదాయ, ఆరాధన విద్య, కేళిక పదతి.

మాచర్ల: చెన్నకేశ్వర, వీరభద్రస్వాములవారి ఆలయము లందు వైష్ణవ, శైవ. సంప్రదాయ నృత్యారాధన, కేళికపద్ధతి.

ధర్మపురి: వైష్ణవ సంప్రదాయ ఆరాధనకళ, కేళికపద్ధతి.

అల్వాల: వెంకటేశ్వరస్వామి ఆలయము, ఆరాధనకళ— బలిహరణ విద్య—వైష్ణవ సంప్రదాయము—కేళిక, కర్నాటక ఉత్తరాది సంప్రదాయములు.

శ్రీకాకుళము: ఆంధ్ర విష్ణుఆలయము. వైష్ణవ పద్ధతి ఆరాధనకళ, కేళిక.

పిఠాపురము: కుంతి మాధవుని ఆలయము—వైష్ణవ పద్ధతి ఆరాధన, కేళిక, భామాకలాపము, గొల్లకలాపములు.

కుక్కుటేశ్వరస్వామి ఆలయము — శైవము.

శ్రీకూర్మము: వైష్ణవ సంప్రదాయము, కేళిక, చైతన్యుల పాదములు ప్రతిష్ఠజరిగిన ప్రదేశము వంగదేశ భజన సంప్రదాయ నృత్యము.

ఇంకనూ యెన్నియో పుణ్యతీర్థములున్నవి. శైవవైష్ణవ సంప్రదాయ విద్యలోని భేదాలు—

బలిహరణ నాట్యములు, కేళిక యించుమించు ఒకేరీతిగా నుండును. మూలవిరాట్టు సాన్నిధ్యంలో ప్రదర్శింపబడే ఆరాధన నృత్యములు. సప్తలాస్యములు, కవుతములు, మార్పువుండును. ఇవన్నియూ, దేవదాసీలచే చేయబడే నృత్యములు.

నృత్యము వారి యింటి విద్య సంస్కృతము, తెనుగు పండితుల వద్ద ప్రత్యేకముగా అభ్యసింతురు.

ఆలయములందు ఆగమశాస్త్రప్రకారము వీరు నృత్యకళతో దేవతల నారాధింతురు.

---

## ఆంధ్రలో జిల్లాలవారీగా కళాభివృద్ధి

గంజాము—

పాలించు ప్రభువులు ఓఢ్రులు, కాని వారి మంత్రులు తెలుగు వారు. గనుకనే గంజాముసంస్థలి అనేక జమీందారులందు తెనుగు సంప్రదాయపు నృత్యము అభివృద్ధి చెందినది. ఒడిస్సీనృత్యము తిలకించిన గానము ఉత్తరదేశ బాణీలో ఉన్నప్పటికీ జతికట్టుబాట్లు, గతివిన్యాసము అభినయక్రమము, తెనుగుదేశపు భరత విద్యవలెనే వుండును.

గంజాముందలి ఒక జమీందారు ప్రకాశరుద్రదేవ వెయ్యిమంది దేవదాసీలను స్వామిసేవ నిమిత్తము పూరి ఆలయానికి సమర్పించిరి. వారచ్చట నాట్యకళతో స్వామి నారాధించిరి. ఆకళకు ఆంధ్రకళకు చాల దగ్గర పోలికలున్నవి.

ఆంధ్రలో ప్రాచీన ఆలయమున్నచోటులందు, సంస్థానములు వెలసిన ప్రదేశములందు నృత్యకళ విరివిగా అభివృద్ధి గాంచినది.

## శ్రీకాకుళము; విశాఖపట్నము జిల్లాలు—

శ్రీకూర్మము, అరసవిల్లి (పుణ్యతీర్థములు) బొబ్బిలి (సంస్థానము) కోమటిపల్లి, విజయనగరము(సంస్థానము) జయపురము(సంస్థానము) మాడుగుల మత్స్య వంశీయులేలిన ప్రదేశము), చోడవరము, శామి, నిమ్మలవలస, నరసన్నపేట, రాజాము, నరసిపట్నం, దొడ్డిగల్లు. ఈ ప్రదేశాల్లో దేవదాసీల భరతనాట్యము, భాగవతుల భామాకలాపము, గొల్లకలాపము ఎక్కువగా వృద్ధిచెందినది.

ఈ ప్రాంతాల్లో వున్నన్ని భామాకలాప, గొల్లకలాప నాట్య మేళములు ఆంధ్రలో మరెచ్చటనూ గాంచము.

ఈ రెండుజిల్లాలలో స్త్రీలు (భాగవత) కలాపములాడుట అరుదు.

ఈ కలాపములవారు—

సిద్ధేంద్రులవారి కలాపముగాక, పంకాయలవారి కలాపము, చింతలపాటివారి కలాపము, కసింకోటవారి కలాపములను చేర్చి ఆడుచున్నారు. వీరి భాగవత విద్యకు కూచిపూడి విద్యకు సంబంధము లేదు.

దేవదాసీల విద్యమాత్రము శ్రీకూర్మము మొదలుకొని తంజావూరు వరకూ యించుమించు ఒకేవిధముగా నభివృద్ధి జెందినది.

## తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలు :

తుని (జమీందారి) పిఠాపురము (జమీందారి) పెద్దాపురం (జమీందారి ప్రాంతము) కాకినాడ, అమలాపురము, ముమ్మిడివరము, పేరూరు మానేపల్లి,-మండపేట, మురమండ, రాజమండ్రి, ధవళేశ్వరము, పసలపూడి, తాటిపాక, రాజోలు, వాడపల్లి, ద్రాక్షారామము, ఉండి, మారంపల్లి, నరసాపురం, ఆచంట, అంతర్వేది, ఏలూరు, ఈ ప్రదేశాల్లో నాట్యకళ విరివిగా నభివృద్ధి గాంచినది. ఇచ్చట భాగవతములాడే పురుషనర్తకులు తక్కువ. స్త్రీలే కచ్చేరి నాట్యము, కలాపముల నాడుదురు.

ఈ ప్రాంతాలలో నాట్యమాడేము స్త్రీలు రెండు తెగలుగా నున్నారు.

భోగమువారు సానులు. భోగమువారు కచేరినాట్యము, సానులు భాగవతముల నాడుదురు

వీరి ఆటకు కూచిపూడివారి ఆటకు సంబంధము లేదు. వీరిలో సంస్కృతము, తెనుగుభాషల చక్కగా నెఱిగి శాస్త్ర సంప్రదాయములు తెలిసి నర్తనమాడు నర్తకీమణు లనేకులున్నారు.

## కృష్ణా, గుంటూరు జిల్లాలు :

కూచిపూడి, మొవ్వ,నంగిగడ్డ, రేపల్లె, తెనాలి, గుంటూరు, బాపట్ల, గుడివాడ, శ్రీకాకుళము, పొన్నూరు, ఒంగోలు.

కూచిపూడి భాగవత మేళములకు ప్రసిద్ధి.

భామాకలాపము, గొల్లకలాపము, వివిధ యక్షగానములు వీధి నాటకము లాడుటలో ఈ నర్తకులు సుప్రసిద్ధులు. ఈ ప్రాంతాల్లో కొందరు దేవదాసీలుగూడ కూచిపూడి సంప్రదాయ భాగవత విద్య నభ్యసించినవారు. అట్టివారు నంగిగడ్డ,రేపల్లె ప్రాంతాల్లో నున్నారు. మొవ్వ క్షేత్రయ్య పుట్టినయూరు.

## నెల్లూరు చిత్తూరు జిల్లాలు :

టంగుటూరు, కావలి. సింగరాయకొండ, జొన్నవాడ, నెల్లూరు, కలువాయ, బుచ్చిరెడ్డిపాలెం, వెంకటగిరి, మన్నారుపోలూరు, నాయుడుపేట, కాళహస్తి, కార్వేటి నగరం, తిరుత్తని, చెయ్యూరు, మధురాంతకం, జంగాలపల్లి మొదలైన ప్రదేశాలలో దేవదాసీల 'కేళికా' విద్య విరివిగా ప్రచారమందున్నది.

కూచిపూడివలె, జంగాలపల్లెయందు విశేషముగా నాట్యమేళముల వారున్నారు

కూచిపూడివారు బ్రాహ్మణ భాగవతులు. జంగాలపల్లెవారు జంగం భాగవతులు. వీరుగూడ యక్షగానములు, వీధి నాటకముల నాడుదురు.

తిరుత్తని, చెయ్యూరు, మధురాంతకం, ప్రస్తుతం తమిళనాడులో నున్నవి.

గిత్తిమండలములు :

## కడప: కర్నూలు, అనంతపురం జిల్లాలు :

కోటకొండ, బనగానపల్లె, ప్రొద్దుటూరు, హిందుపురం, తాళ్ళపాక, పుల్లంపేట, బుక్కాపట్నం?యపాలెం, కోటకొండ భాగవతులు, కూచిపూడి సంప్రదాయమునకు జెందినవారు. వీరిని బనగానపల్లె నవాబుగారు, ఆ ప్రాంతములకు ఆహ్వానించి, కోటకొండలో వారికి భూముల నిచ్చి నివాసము నేర్పాటుజేసిరి. వీరిద్వారా భాగవత కళ దత్తమండలము లందు ప్రచారము జరిగినది.

దేవదాసీలు కేళికా విద్య నారాధించిరి.

తెలంగాణా ప్రాంతములో నృత్యకళ :

ధర్మపురి, పెద్దపల్లి, నాగపూరు, గద్వాల, వనపర్తి, జటప్రోలు, ఆత్మకూరు, హైదరాబాదులందు—

హైదరాబాదులో ముస్లిం ప్రభావముగల కళ అభివృద్ధి జెందినది.

మిగిలిన ప్రాంతములలో కేళికవిద్య అభివృద్ధి గాంచినది.

గత నాలుగైదు దశాబ్దములలో ఆంధ్రలో కళ నారాధించిన ప్రఖ్యాత కళావేత్తలు—

శ్రీమతులు నాయుడుపేట రాజామణి, చెయ్యూరు శారద, మధురాంతకం రాధ, ఆండాళు, పుల్లంపేట మహాలక్ష్మి,అన్నమ్మ; పీలవేణి, నాగమణి, శుభరత్నం, సుభమంజరి.

బ్రహ్మశ్రీ చింతా వేంకట నారాయణ, వేదాంత లక్ష్మీనారాయణ శాస్త్రి, కోటకొండ చల్లా భరతశాస్త్రం లక్ష్మీనారాయణగారు, భాగవతుల విస్సయ్యగారు, ఏలూరు పువ్వుల పాపాచలం, నగరాజ

తనయ' సాంబ్రాజ్యం, చాటపర్రు బాలా త్రిపురసుందరి, చిత్తజల్లు చిన వెంకటరత్నం, పెద్దవెంకటరత్నం, వైదేహి, ఇందువదన, పేరూరు పారిజాత పుష్పావతి, పెండ్యాల సత్యభామ, కోనేటి చిట్టిరాజు, దువ్వా సూర్యకాంతం, అమ్మిణి, అన్నాబత్తుల బుల్లి వెంకటరత్నం, దుగ్గిరాల మాణిక్యం, కొల్లూరి కామయ్య మద్దెలరాముడు, మద్దెల అప్పలనరసమ్మ, గంధం లక్ష్మీకాంతం, శ్రీ విరాజితం, యండమూరి రామం, యండమూరి అమ్మాణి, మద్దెల బాలా త్రిపురసుందరి, కృష్ణవేణి, నాయుడు సత్య, అమలాపురం మణ్యం, దూడల శంకరయ్య, కోమటిపల్లి జగన్నాథం, భాస్కర భట్ల అప్పల నరసింహం, జీవరత్నమ్మ, ఇత్యాదులు

ఇందు కొందరు భరతనాట్యము నాడువారు, మరికొందరు భాగవత కళనారాధించువారు.

కొందరు కీర్తిశేషులైరి-మరికొందరు జీవించియున్నారు. పైన చెప్పిన కొందరు సంప్రదాయ భరతవిద్య యందు ప్రావీణ్యులే గాక సంస్కృతాంధ్రములందు మంచి పాండిత్యము గలవారు.

సుమారు ఏబది సంవత్సరముల క్రిందటనే దేశంలో కళాభివృద్ధి ఆగిపోయినది, నాటినుండి నూతన రచనలు జరుగలేదు. రోజురోజుకు శాస్త్రీయకళలు క్షీణించిపోవు పరిస్థితి యేర్పడినది. నేటికాలములో శాస్త్రము, సంప్రదాయము రెంటిని చక్కగా తెలిసికొని, నూతనకళాసృష్టిని చేయగల సమర్థులైన నాట్యాచార్యులు, కవి పండిత గాయకులు అట్టివారిని ఆదేశించి, పోషించు కళాపోషకులు అరుదైరి. గనుకనే తరతరాలుగా కళలారాధించినవారు అనేకులు నాట్యవృత్తిని వదలివేసిరి. వారితో ఆ అపూర్వ సంప్రదాయములు అదృశ్యమగుచున్నవి. అందువల్లనే ఆంధ్రలో ప్రాచీన శాస్త్రీయ సంప్రదాయములగూర్చి తెలిసికొనే అవకాశములు సన్నగిల్లు చున్నవి.

శాస్త్రము దెలిసినవారికి సంప్రదాయము, సంప్రదాయ విద్య తెలిసిన శాస్త్రము తెలియక పోవుటవల్ల - అట్టి కళారాధకుల వల్ల కళకు చాలా అపకారము జరుగును. దేశములో ఈ పరిస్థితి తొలగిన కళాభివృద్ధి జరుగును. భరతనాట్యములో నృత్తనృత్యాభినయము లందుపయోగపడునట్టి సంగీత రచనలు—

నృత్తము: స్వరపల్లవులు, శబ్దపల్లవులు, సాహిత్యపల్లవులు, జతి స్వరములు, జాతిస్వరములు, తిల్లానలు, గీతప్రబంధములు మొదలైనవి.

నృత్యము: తరంగములు, అధ్యాత్మరామాయణ కీర్తనలు, శబ్దములు, సలాము జతులు, జక్కిణి దరువులు, పదదరువులు, స్వరజతులు, తానవర్ణములు, పదవర్ణములు, పెద్దవర్ణములు, దరువులు, అష్టపదులు, కైవారప్రబంధములు, శివతాండవగీతములు, మొదలైన రచనలు.

అభినయము: శ్లోకము (కృష్ణకర్ణామృతము పుష్పబాణ విలాసము, రసమంజరి, మొదలైనవి)-క్షేత్రయ్య, అన్నమాచార్య, పురందరదాసు, సభాపతయ్య, సారంగపాణి, ఘనంసీనయ్య, మొదలైనవారి పదములు, జావళీలు గీతములు, మొదలైనవి భరతనాట్యములో అతి ముఖ్యమైన రచనలు :

"పదములు": అందు త్రిపుట తాళమందున్న రచనలు విశేష ప్రాముఖ్యత వహించును.

భాగవత మేళమందలి సంగీత రచనలు :

ద్విపద, దరువు, వృత్తము, పంచచామరములు, కైవారము, కందము, కందార్థము, సీసము, సీసార్థము, ద్విపదార్థము, ధవళము, త్రిభంగి, అష్టకము, ఏల, హెచ్చరిక, శోభనములు మొదలైన రచనలు అతి ముఖ్యమైన రచనలు:

దరువు, ద్విపద.

నాట్యమునకుపయోగించు వాద్యములు :

కరతాళములు, గజ్జెలు, మృదంగము, శుద్ధమద్దెల, చండివాద్యము వీణ, వేణువు, ముఖవీణ, శంఖము, శ్రుతి, పురుష గాత్రము, కంజీర— నాదముగల గజ్జెలు భారతీయ నృత్యానికి జీవము.

పదములు

| ప్రముఖ పదకర్తలు | | ముద్రలు |
|---|---|---|
| క్షేత్రయ్య | — | మువ్వగోపాల |
| తాళ్ళపాకవారు | — | శ్రీ వెంకటేశ్వర వెంకటాచలపతి |
| పురందరదాసు | — | పురందర విఠల |
| ఘటపల్లివారు | — | కైలాసపతి |

జటప్రోలివాడు — జటప్రోలి గోపాల
బొల్లాపురమువాడు — బొల్లపురము
శోభనగిరి — శోభనగిరి
మల్లిఖార్జున — మల్లిఖార్జున, కృష్ణ
వినుకొండవాడు — వినుకొండ, విజయరామ
వేనంగివారు — వేనంగి
సభాపతియ్య — రాజగోపాల
వీరభద్రయ్య — వరద వెంకటేశ్వర
మాతృబుద్ధేశ్వర — దామెరకుమార వెంకట భూపాల
యువరంగ — యువరంగ
ఘనంసీనయ్య — మన్నారు రంగ
కస్తూరి రంగ — కస్తూరి రంగ
పరిమళ రంగ — పరిమళ రంగ
సారంగపాణి — వేణుగోపాల
ముత్తుతాండవర్ — నటరాజ
పాపవినాశ మొదలియార్ — నాదాస్తుతి
మేలటూరి వెంకట రామశాస్త్రి — మల్లజేంద్ర

ఇవిగాక నారాయణ తీర్థుల తరంగములు — జయదేవుల అష్టపదులు.

పదముల కుపయోగించిన రాగములు :

కాంభోజి, ముదుకల కాంభోజి, గుమ్మకాంభోజి, శంకరాభరణము సురటి, తోడి, భైరవి, సహాన, బేగడ, ఆఠాణ, మోహన, కళ్యాణి, కేదారగౌళ, కేదార, నీలాంబరి, ఆహిరి, భూపాల, ఘంట, పున్నాగ వరాళి, వరాళి నాదనామక్రియ, అసావేరి, సావేరి, సౌరాష్ట్ర, ఆనందభైరవి, గౌరి, కురంజి, కామవర్ధిని, సైంధవి, కాఫీ, ధన్యాసి, శ్రీరాగము, పంతు వరాళి, నాట, బిలహరి, మాళవశ్రీ, పూర్వి మొదలైనవి.

పదములందుపయోగింపబడిన తాళములు :

త్రిపుట, అది, రూపక, ఝంపె, ఏక, అట, చాపు, మొదలగు తాళములు.

పంచముఖి తాళములు శివతాండముసందుపయోగింపబడుచున్నవి.

10 తాళములు కరణ విన్యాసమునందును, పూజా నృత్యములందుపయోగింపబడును.

శబ్దములు, యెక్కువగా కాంభోజి రాగములందు చాపు తాళములందు పాడబడుచున్నవి

## పల్నాటి వీరుల కథ – వర్ణన బుర్రకథ

మ॥ ద్రిత తాళంబున వీరగుంభితక ధుంధుం కిటాత్కారవం.
గతి వాయింపుచు నాంతరాళికయతి గ్రామాభిరామంబుగా.
యతి గూఢం ద్విపద ప్రబంధమున వీరావీకముంబాడె నా
కృతి ప్రత్యక్షరముం గుమారకులు ఫీట్కారంబు
నందూలగన్.

ఆ నాట్యవర్ణన :—

సీ॥ గర్జించి యరసి జంఘా కాండ యుగళంబు
వీర సంబెట కోల వేసియునొకరు
ఆ రీతి పాదవిన్యాస మొప్పగ వ్రాలి
కుంతాళినయము గైకొనునొకండు
బిగువు గన్నుల నుబ్బు బెదరు జూపులతోడ
ఫీట్కార మొనరించు బెలుచ నొకడు
పటుభుజావష్టంభ పరిపాటి ఘటియిల్ల
ధరణి యాస్ఫోటించి దాటునొకడు.
తే॥ ఉద్ది ప్రకటింప నొక్కరుం డోలవాడు
బయలు గుప్పించు భంజిల్ల బలుపు నొకడు
కొడుము దాటింపుచును బెద్ద గొలువులోన
బడితి పల్నాటివీరుల బాడునపుడు.

జక్కులపురంధ్ర :

సీ॥ కోణాగ్ర సంఘర్ష ఘుమఘుమ ధ్వని
తారకంఠ స్వరంబుతో గారవింప
మసిబొట్టు బోనన నసలు కొల్పిన కమ్ము
కొడుపుచే దాటించు నెడపదకవ
కుశ్రీతికి సుత్కర్షంబు జూపంగవలయుచో
జెవిత్రాడు బిగియించు జీవగట్టి
గిల్కు గిల్కున మ్రోయు కింకిణి గుచ్ఛంబు
తాళ మానంబుతో మేళవింప

తే॥ రాగమున నుండి లంఘించు రాగమునకు
నురము యూరు ద్వయంబుపై నొత్తిగిల్లి
శా – పల్లి మహాలక్ష్మి కైటభారి
వలపు వాడుచు వచ్చె బెక్కుల పుర శ్రీ.

— —

## ఆంధ్రదేశం - నాట్యకళావ్యాప్తి.

ఆంధ్రదేశంలో నాట్యకళ రెండు విధాలుగా అభివృద్ధికి వచ్చినది. ( ) ఆలయములలో దేవదాసీల ఆరాధనా నృత్యములు. (2) ఆలయముల వెలుపల వినోదంకోసం జరిగే కేళికానృత్యములు.

* ఈ ఆరాధనా నృత్యములు మార్గపద్ధతికి చెందినవి. ఉంవలి కరణ, అంగహార, హస్తవిన్యాసములు: భావప్రకటనం శాస్త్రసమ్మతమై ప్రదర్శింపబడినవి. గర్భాలయములలో మూలవిరాట్టుల సాన్నిధ్యంలో ప్రదర్శింపబడే యీ నృత్యములు ఆయా విరాణ్మూర్తులకు సంబంధించి ఏర్పాటైనవి. శివాలయములందు శైవరీతులు: విష్ణాలయములందు వైష్ణవరీతులు నృత్యములలో ప్రదర్శించేవారు. భుజంగ భుజంగత్రాస, శుద్ధ, శుభలీల, నవసంధి, సమపాద, కౌస్తుభ, పుష్పాంజల్యాదులు ఈ రీతులకు చెందినవే. ఈ రెండు రీతులందువ్య చాలాభేదము కనపడుతున్నది గంభీరమైన భావ ప్రకటనం, ఉద్ధతమైన అంగవిన్యాసం, నృత్త నృత్యములతో భరత శాస్త్రానుగుణములైన కరణాంగహారముల తాండవపద్ధతి ప్రదర్శనం శైవసంప్రదాయ రీతిలో విశేషములు. కోమలమైన సుకుమార పద్ధతి హస్త విన్యాసం రసభావములతో రంగరించిన లాస్యం వైష్ణవసంప్రదాయ రీతిలో విశేషములు.

కాలేదు కాకతీయుల కాలంలో ఉన్న జాయపసేనుడు "నృత్త రత్నావళి" అనే ఒక స్వతంత్ర నృత్త గ్రంధం రచించాడు. దీనిని అనుసరించి ప్రదర్శించిన భంగిమలే పాలంపేట వద్ద రామప్ప గుళ్ళలోని భంగిమలకు మాతృకలవికూడా కొందరు శాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఇలాగే కొండవీటిరెడ్డి ప్రభువుల కాలంలో అభివృద్ధి చెందిన నృత్యకళనుగూర్చి మనకు "వసంతరాజీయం" ద్వారా తెలుస్తున్నది. ప్రతాపరుద్రుని దర్బారును మాచల్‌దేవి అను ప్రఖ్యాత నర్తకి అలంకరించెను. లకుమాదేవి, కొమరగిరి ప్రభువు ఆస్థానములో నృత్యకళాలక్ష్మి నారాధించెను. రాయలకాలములో పేరు గాంచిన నర్తకి రంజకం కుప్పాయి విజయనగరరాజుల హయాంలో ఆరాధింపబడిన నృత్యకళారీతి, అబ్దుల్ రజాక్ అనే విదేశ యాత్రికుడు చూసి వర్ణించిన అంశాలనుబట్టి వ్యక్తమౌతుంది. తమిళదేశమున అతి ప్రాచీనమైన "శిల్పాధికారం" మూలంగా అప్పటి ద్రవిడదేశ నృత్య సంప్రదాయములను విశేషంగా గ్రహింపగలుగుతున్నాము. కాని, అనేక రాజకీయమత హేతువులవల్ల ఆంధ్ర దేశంలో పేరొందిన గ్రంథములు ధ్వంసం కావడంతో అతి రుచ బౌద్ధయుగంనాటి మన లలితకళలనుగూర్చిన గ్రంధములైనా లభ్యం కావడంలేదు. ఐతే, ఇక శిల్పంలో మలచిన మూర్తులనుచూసి కొంతవరకు నాటి నృత్యకళను ఊహించగలుగుతున్నాము. టిబెట్టు, చైనాదేశపు భాషల్లో ఉన్న బౌద్ధగ్రంథములను పరిశోధించితే ఆనాటి ఆంధ్రదేశపు లలితకళనుగూర్చి మనకు కొంతవరకైనా తెలు స్తుందని ఆశించవచ్చు.

మనప్రాచీనకళ పావిత్ర్యభాసితం కవులు గద్య, పద్య, గీత రచనలతో స్వామిని కీర్తించేవారు. సంగీత విద్వాంసులు కవుల గీతములకు రాగ, తాళములను కూర్చి ఆలపించేవారు. వాద్యకులు వివిధ వాద్యములమీద ఆ సంగీతమును అనుసరిస్తే శాస్త్రం తెలిసిన నర్తకీమణులు కాళ్ళకు కట్టిన మువ్వల మృణం మృణాంచనముతో మేళవించిన మహతీనాదమందు కంఠంచేర్చి మధురంగా భక్తిగీత మాలను ఆలపిస్తుండేవారు. గీతార్థమును హస్తభంగిమాదులతోను, రసభావములను నేత్రవిన్యాసముతో, తాళగతిని పాదములతో వ్యక్తపరుస్తూ నిర్మలభావం ఆవేగం, భక్తిపరిపూర్ణ మనస్సు గలిగిన పరమహంసలవంటి దేవదాసీగణం దేవదేవు నెదుట నృత్యం సల్పేవారు. ఇలా స్వామి సేవకు అంకితలైన దేవదాసీగణం ఇతర ప్రదేశాల్లో నృత్యమాడేవారుకారు. ఆదర్శవంతంగా నృత్యకళ అభివృద్ధి చెంది ప్రపంచమునకొక దివ్యసందేశం యివ్వటానికి యిదొక హేతువు.

దేవదాసీగణం స్వామి యెదుట సలిపే ఆరాధన నృత్యంకాక ఆయా సందర్భములందాయా ప్రత్యేక నృత్యములు ప్రదర్శించే

---

* ఆరాధనా నృత్యములు ప్రదర్శించే నిమిత్తం మన ఆలయములందు ప్రత్యేకమైన ఏర్పాట్లు ఉండేవి. కాకతీయ ప్రభువుల కాలములో నిర్మింపబడిన ఆలయములందు స్వామికెదురుగా, నందికి వెనుకవైపు నునుపైన వలయాకారపు శిలా వేదికలు కనిపిస్తున్నవి. ఈ యేర్పాటు భారతదేశములోని యితర ప్రాంతముల ఆలయములందు గోచరించదు. దక్షిణదేశమందలి ఇతరాలయములలో ప్రత్యేక నృత్యవేదికలున్నప్పటికీ అవి స్వామి కెదురుగా ఏర్పాటు

ఆధ్యాత్మిక చింతనకు, శాస్త్రీయకృషికీ, నిస్స్వార్థతకు మన ఆలయములలోని అపూర్వశిల్పములు అమరకావ్యములుగా నిలిచాయి.

ప్రారంభములో నృత్యకళ ప్రత్యేకముగా దేవతారాధనకే వినియోగింపబడినప్పటికీ, ఒక పది గర్భాలయమును విడిచి నర్తకీగణం కల్యాణమండపమందు ఉత్సవ మూర్తుల కెదురుగా తమ కళను ప్రదర్శించడం మొదలుపెట్టారు అది మొదలుగా మనకు తెలియకుండానే కళల పావిత్ర్యం తరిగిపోవడం ప్రారంభమైనది. శాస్త్రీయ శైలిని కాదనక పోయినప్పటికీ నర్తకీగణం స్వీయానుభవములకూ, ప్రజారంజకములయ్యే హావభావలాసములకు ప్రాధాన్యమిస్తూ ప్రదర్శనములు ప్రారంభించారు వీరు నృత్తప్రధానమగు కరణ విన్యాసములు కాక — నృత్యాభినయప్రధానమగు ఆలయ మూర్తుల పురాణగాధల ప్రదర్శనములకు అలవడినారు. ఆలయావరణములో మాత్రం నృత్యకళ శాస్త్రీయసంప్రదాయబద్ధముగానే ఆరాధింపబడినది కాని, ఉత్సవమూర్తులు ఆలయముదాటి తిరువీధులందు ఊరేగింపుగా బయలుదేరినప్పుడు ఆలయములకు సంబంధించిన సంగీతవిద్వాంసులు, నాట్యాచార్యులు, నర్తకీగణం రాచబాటల్లోకూడ తమ విద్యా ప్రదర్శనమును చేయసాగినారు. దీనితో కళారాధనయందు ప్రజారంజనోద్దేశ్య ప్రాశస్త్యమునకై పావిత్ర్య స్వరూపము కొరవడుటా వచ్చినది.

ఈ విధముగా నృత్యకళ గణికలు — రాజనర్తకీగణం — ద్వారా రాజదర్బారుల్లో ప్రవేశించి స్వామికి బదులు ప్రభువుల స్తోత్రపాఠములతో నిండి, ఆస్థానమందలి పండిత రసిక జనరంజనమునకు వినియుక్తమయ్యే వినోద విద్యగా రూపొందినది. వెనకటి అలవాటుల ప్రకారం రాజనర్తకీగణమైనా కొంతవరకు శాస్త్రమర్యాదలను పాటించినప్పటికీ తరువాత తరువాత ప్రభువుల అభిమతానుసారం వర్తించడం వారి ధర్మమైనది.

## కురవంజి

పర్వదినములందు దైవతారాధనకోసం వచ్చిన భక్తబృందము వినోదార్థము చెంచులు, కురవలు మున్నగువారు - ఆటవికులు— ప్రదర్శించే దేశి నాట్యరీతులను కురవంజి నాటకాలు, చెంచునాటకాలు అంటారు.

కురవ + అంజి = కురవంజి. అంటే కురవల అడుగు లేక చిందు.

ఈ ఆటవికులు శ్రీశైల, పీఠికాపుర, దాక్షారామ, భీమారామములు, కోటప్ప కొండలవంటి శైవక్షేత్రములలో శివపురాణ గాధలు; సింహాచల, శ్రీకూర్మ, శ్రీకాకుళములు, తిరుపతి మున్నగు వైష్ణవ క్షేత్రములందు విష్ణుపురాణగాధలను ఆడేవారు. 'గరుడాచల యక్షగానం' పేరుతో యీ నాటికి ప్రదర్శిస్తున్న 'చెంచులక్ష్మి' నాటకం యీకోవకు చెందినదే. తంజావూరు బృహదీశ్వరాలయములో ఇప్పుడుకూడా కురవంజి నాటకము ప్రదర్శిస్తుంటారు.

అయితే, ఈ కురవంజి-చెంచు-నాటకములు మొదట కల్పనాత్మకములైన పోకడలులేకుండా ప్రకృతిమీద ఆధారపడి అభివృద్ధి చెందినవి. వీటిలో సాహిత్య భాగము వర్ణనలతోకూడి, ఒక కథలోని వివిధ ఘట్టములను సువ్యక్తపరచేదిగా ఉంటుంది. కాబట్టి వీటిని 'గేయ నాటకములు' అనవచ్చును కూడ.

కురవంజి నాటకములు నృత్యప్రధానమైనవి. కాని నర్తకులొనర్చేనృత్యం పాటకు, కథాగత సన్నివేశమునకు సంబంధించిన హస్తవిన్యాసముకాదు; ప్రేక్షకులకు విసుగు పుట్టకుండా మధ్యమధ్య ప్రదర్శించు లయప్రధానమైన నృత్తం మాత్రమే: తాళమునకు ద్వితీయ ప్రాధాన్యముంటుంది; లయ వివిధ గతులలో ప్రదర్శింపబడుతుంది.

ప్రప్రథమమున కురవంజి ప్రదర్శనము ఏక పాత్రాభినయముగా ఉండి, ఒకే నర్తకి కథను గానముచేస్తూ, అడపదడప నృత్తం ప్రదర్శిస్తూ ఉండేది సంస్కృత నాటకములందలి నటీసూత్రధారులను పోలినట్టి సింగి - సింగడను రెండుపాత్రలను తరువాత ప్రవేశపెట్టారు. వీరు ఆయా కథా ఘట్టములను పాడుతూ నృత్యం చేసేవారు. మరికొంతకాలమునకు హాస్యరసపోషణోద్దేశంతో కోణంగి (చోడిగాడు) పాత్రకూడా ప్రవేశపెట్టబడింది. ఈ పాత్ర హాస్యధోరణిలో కథాఘట్టములను తోచినరీతిని వ్యాఖ్యానించుట పరిపాటి. ఈ సంప్రదాయమునమసరించే తోలుబొమ్మలాట (తోలుబొమ్మల భాగవతము)లో జుట్టుపోలిగాడు, కేతిగాడు, బంగారక్క అను పాత్రలు నేటికీ సజీవంగా ఉన్నవి. ఈ విధంగా ఏక పాత్రాభినయపద్ధతిని వదలిన కురవంజిలో బహుపాత్ర ప్రవేశానుకూల్యం ఏర్పడినప్పటికీ నాటకములందాయా పాత్రల పోషణపక్కా అమరలేదు. ఆంధ్ర ప్రాంతమున దాసరి భాగవతులు, తెలంగాణమున బహురూపులు ప్రదర్శించే గరుడాచలం నాటకమూ ఈ కురవంజి సంప్రదాయమునకు చెందినదే.

మన శాస్త్రీయ సంప్రదాయములోని సంగీతరీతులు, తాళకట్టులు ఎన్నోవిధములుగా అనుదినము మారుతూవస్తున్నవి.

ఇందుకు సంగీత విద్వాంసుల నిరంతరకృషియే హేతువు. కాని ఈ కురవంజి నర్తకులు మాత్రం ప్రాచీనమైన అపురూప రాగము లందే, యీ నాటికీ అప్పటి బాణీలోనే పాడుతున్నారు. లలిత సంగీతము, సరళసంగీతముల మాధుర్య మాస్వాదించుటకు అలవాటు పడిన వారికి యీ పద్ధతి కొంత మొరటుగా తోచినప్పటికీ, యీ అపూర్వరాగముల ప్రాచీన స్వరూపములను తెలుసుకోగోరు కళా వేత్తల పరిశోధనల కెంతో ఉపకరించగలదు. అహిరి, గుమ్మ కాంభోజి, నారికాంభోజి, హెజ్జెజి ఇత్యాది ప్రాచీన రాగముల లక్షణములు ఎక్కడో గ్రంథములందు కనపడినప్పటికీ, వాడుకలో మాత్రములేవు. వీటిని వినుటకు కురవంజినే దర్శించాలి.

కురవంజి నర్తకులాశ్రయించిన నృత్తరీతి పూర్తిగ దేశి పద్ధతిలో అభివృద్ధికాంచినది. ఈ నర్తకులకు శాస్త్రపరిచయమంతగా లేదు. కాని శృంగార, వీర, భీభత్స, శోక, విరహ, వియోగావస్థల్లో హృదయస్థితివల్ల శరీరాంగికముల చలన పరిణామము లెట్లుండునో చక్కగా ప్రజల కర్థమయ్యే విధముగా వీరు నృత్తము ను ప్రదర్శించగలరు. ఇది శాస్త్రీయమా, అశాస్త్రీయమా అని తర్కించి తేల్చుట కష్టము. కాని వారి నృత్తమునందు ఉద్దేశింప బడిన భావప్రకటనకు సరియైన రసనృష్టి ప్రేక్షకుల హృదయము లందు కలుగుటే ఇందలి విశేషత.

## యక్షగానములు

ఈ కురవంజి నాటకములను యాత్రాస్థలముల్లో పెక్కుచోట చూచి ఆనందించిన నాగరక ప్రజలకు వీటిపై మోజు కలిగింది. పట్టణములు, నగరములందుగల రసికులు యీ సంప్రదాయము నాదరించుటేకాక, ఆరాధించనారంభించారు. ఈ కురవంజి సంప్రదాయమును ప్రప్రథమమున చేపట్టినవారు * యక్షులు.

యక్షులు—జక్కులు, యీ కురవంజి నాటకములనే అభ్యసించి ఆ సంప్రదాయమునకే కొన్ని సంస్కరణలు, మెరుగులు తెచ్చి కళాత్మకముగ ప్రదర్శించ ప్రారంభించుటతో వీటి ప్రాచుర్యం హెచ్చింది. ఆనాటి ప్రభువులుకూడా యీ విద్యను పోషించారు. తాయికొండ నాటకమనే ఒక యక్షగానము శ్రీకృష్ణదేవరాయల దర్బారులో ప్రదర్శించేవారట. ఆయన కాలమున నాగయ్య అనే యక్ష నర్తకుడుండెవాడనీ, రాయలకుమార్తె ఒకామె మారీచీపరిణయమనే యక్షగానము రచించిందనీ ప్రతీతి. పదునారవ శతాబ్దం లోని కందుకూరి రుద్రకవి వ్రాసిన సుగ్రీవ విజయమనే యక్షగానం ప్రఖ్యాతినందినదే. సంగీత సాహిత్యములందు దేశిఫణితులిందు ప్రవేశ పెట్టబడినవి. త్రిపుట, త్రిభంగి, ఝంపె, ధవళ, అర్ధ చంద్రిక, యేల, ద్విపద మొదలైనవి సుగ్రీవ విజయమున కలవు. ఆటవిక సంప్రదాయమును కలుపుకొనుటకుగాను ఎరుకలసానిపాత్ర ఒకటి యక్షగానములందు కల్పింపబడినది. చెంచు నాటకములలోని సపతుల కయ్యమే యింకొంత నాగరకముగా విపులపరుచబడినది.

ఆంగికాభినయమును విరివిగా అభ్యాసమునకు, ప్రచారమునకు తెచ్చినవి యక్షగానములు. యక్షగాన నర్తకులు ఒక పాటపాడి దాని అర్థమును వివిధ హస్తములద్వారా విపులీకరిస్తు నృత్యమాడేవారు. కాని రసాభినయము వారికంతగా తెలియదు. తంజావూరి నేలిన నాయకరాజుల కాలము యక్షగానములకు స్వర్ణయుగము. పలురీతుల యక్షగానముల రచనకు, ఎన్నో తెరగుల వాటి ప్రదర్శనమునకు యీ కాలమున ప్రోత్సాహము లభించింది. విజయరాఘవ నాయకుడు రచించిన "రఘునాథాభ్యుదయము", రంగాజమ్మ వ్రాసిన "మన్నారుదాసవిలాసము" యీ యుగమునందు ఖ్యాతి కెక్కిన యక్షగానములు.

తంజావూరు నాయకరాజుల కాలమునాటివరకూ యక్షగానములకు ఇతివృత్తములను భారతభాగవత పురాణేతిహాసములనుండి గ్రహించేవారు. మాచల్‌దేవి మధుర ఘట్టములతో గూడిన తన జీవితగాధనే రసవత్తరమైన యక్షగానముగా రచింపజేసి వర్తన మాడెనట. కాని దురదృష్టవశాత్తు ఆ రచన మనకు లభ్యముగాలేదు. మొట్టమొదటగా విజయరాఘవుడు తన "రఘునాథాభ్యుదయము"నకు ఒక సాంఘిక ఘట్టమును ఇతివృత్తముగా తీసికొన్నాడు. తన తండ్రి రఘునాథనాయకుడు ఒక ప్రాతఃకాలమున మేల్కొంచినది మొదలు రాత్రి పవళించువరకు రాజ్యపాలనమున, పండితగోష్ఠు లందు విద్యావినోదములలో, మతచర్యయందు, నృత్యసంగీతాది కళాపోషణమునకు తన కాలము నెట్లు సద్వినియోగ పరచినాడో..

* యక్షులనే జక్కులనీ అంటారు. జాతరలలో వీరు గంధర్వుల వేషములు కట్టి గాన ప్రధానమైన నృత్యములు చేసేవారు. అందువల్ల వీరిప్రదర్శనలకు యక్షగానములని పేరు వచ్చింది. వీరాంధ్రప్రాంతమందలి ఒక ప్రాచీన తెగకు చెందినవారు. వీరు అనుసరించిన దొక ప్రత్యేకదేశి సంప్రదాయ సంగీతరీతి. దానిని అనుబంధించుకొని నృత్యంకూడ ప్రదర్శించేవారు.

పరభాషలలో, మధురశైలిలో వర్ణించి నాటకముగా అల్లినాడు. ఈ యక్షగాన నాటకము ప్రదర్శన యోగ్యముగా నుండుటేకాదు: అప్పటి సాంఘిక వాతావరణము, రాచమర్యాదలు, విద్యాపోషణాభిజ్ఞత, ఆహారవ్యవహారాలు, ఆభరణాలంకారవిశేషాలు, పురాంతఃపురవిర్మాణ వైవిధ్యము, పరిపాలనా పద్ధతులు, లలితకళా వైశిష్ట్యము మున్నగు సమస్త విషయములను తెలుపుతూ ఒక చారిత్రక గ్రంథముగాకూడ పనికివస్తుంది.

యక్షగానములన్నింటా ప్రఖ్యాతి గాంచినది, కష్టతరమైనది, పాండిత్యవిలసితమైనది రంగాజమ్మ రచిత * మన్నారుదాస విలాసము. రంగాజమ్మ విజయరాఘవనాయకుని నిజపత్ని. ఈమె సంగీత, సాహిత్య నృత్యముల నెరిగిన విదుషి. కవిత్వము చెప్ప గలదు. ఈ కళలందు అమోఘకృషిసల్పి పాండిత్యము నార్జించిన విద్వాంసురాలు. సరస్వతీ నిలయమగు విజయరాఘవుని దర్బారున కామె అలంకారము. ఆంధ్ర యక్షగానములందమూల్యరత్నప్రాయమైన మన్నారుదాస విలాసమును ప్రసాదించినది. విజయరాఘవుడు తన తండ్రి రఘునాథుని నాయకునిగాచేసి "రఘునాథాభ్యుదయము" వ్రాస్తే, రంగాజమ్మ తన నాథుడు విజయరాఘవునే నాయకుని కావించి "మన్నారు దాసవిలాసము" రచించినది. ఈమె యక్షగాన నాటకము సంగీతము ప్రాముఖ్యము వహించినది. ఆంగికాభినయము పరిపూర్ణతనొందినది: వర్ణనలు సుదీర్ఘములు, అత్యంత కల్పనాత్మకములు. కావున సంగీత సాహిత్యము లందేకాక నాట్య శాస్త్రమందు ఆంగికాభినయ రీతులందు విశేషప్రజ్ఞా పాండిత్యము కలవారు మాత్రమే యీ యక్షగాన నాటకమును విజయవంతముగా ప్రదర్శించగలరు.

యక్షగాన నర్తకులకు మన్నారుదాసవిలాస ప్రదర్శనము ఒక పరీక్ష. రంగాజమ్మకుగల బహుభాషా ప్రావీణ్యమునకు యీ యక్షగానము నిదర్శనము, ఈ నాటకములోని పాత్రలు ఆయా సంఘటనలకు అనుకూలముగా ఐదు భాషలలో సంభాషించుతవి.

నాయక రాజుల కాలమువరకును యక్షగాన నర్తకులు నృత్త నృత్యములు మాత్రం ప్రదర్శించేవారు. ఆ రచనలైనా వర్ణనాత్మకములు కావున అభినయమునకు ఎక్కువ అనుకూలించేవికావు. రసాభినయమును తమ భాగవత యక్షగాన ప్రదర్శనములందు నర్తకులు ప్రవేశపెట్టి ప్రాచుర్యమునకు తెచ్చినది నాయక రాజుల కాలమందే. అభినయోపకరణములు గానున్న పదము, పదకేళికలను ప్రత్యేక సంగీత రీతులు యీ సమయముననే రూపొందినవి.

కూచిపూడికి సమీపమునగల మువ్వ గ్రామమున నివసించిన * క్షేత్రయ్య నృత్యనాటకములందు రసాభినయము, సాత్వికాభినయము ప్రవేశ పెట్టుటకు తోడ్పడినాడు. ఆయన గొప్ప పదకర్త మాత్రమేకాక, నాట్యాభినయశాస్త్రములను అసాధారణ ప్రజ్ఞతో అభ్యసించి ప్రవీణుడైన భరతాచార్యుడు. సాత్వికాభినయానుకూలములైన నాలుగువేల పదముల నాయన రచించినాడు. క్షేత్రయ్య పదాభినయమును ప్రవేశపెట్టి దర్బారు నృత్యకళకొక మహా వికాసము చేకూర్చినాడనవచ్చును.

---

* మన్నారుదాస విలాసములోని వైశిష్ట్యము నెరుంగుటకు ఒక్క ఉదాహరణచాలు. స్త్రీయను అర్థము వచ్చుటకు అనేకచోట్ల వాడిన పదమును వాడక సుమారు నూరు పర్యాయ పదములు రంగాజమ్మ వాడినది. ఆయాపదముల వ్యుత్పత్త్యర్థములను తెలిసినవారై తేనే ఆంగిక హస్తాభినయప్రదర్శనద్వారా నర్తకులు రసపుష్టికి అర్థ విపులీకరణకు దోహదపడగలరు. ఇటువంటివేకాక యీ యక్షగానములో ఎన్నో అలంకార విశేషములున్నవి.

* తెలుగు నాట క్షేత్రయ్య పేరు విననివారుండరు. ఆయన మువ్వగోపాల పదములను ఆలకింపనివారునూ అరుదే. తక్కువ మాటలలో, సులభశైలిలో, ధ్వని ప్రధానమై, సంగీతమయమై తెనుగుదన ముట్టిపడు మధురిమతో క్షేత్రయ్య వ్రాసిన నాలుగు వేల పదములూ అలంకార గ్రంథమునకు లక్ష్యప్రాయములు. క్షేత్రయ్య అసలుపేరు వరదయ్య అంటారు. అనేక పుణ్యక్షేత్రాలు దర్శించి ఆయా దైవములను సేవించి ఆ మూర్తుల మీద పదము లల్లుటవల్ల ఆయనకు క్షేత్రయ్య, క్షేత్రజ్ఞుడు అను పేర్లు సార్థకములైనవని పద పరిశోధకు లగు పెద్దల అభిప్రాయము. క్షేత్రయ్య పెద్ద వైష్ణవ భక్తుడు, మధుర భక్త్యుపాసకుడు. తాను రాధగా, ఆ జగన్నాథుడే మువ్వపురిలో వెలసిన గోపాల నాయకుడుగా భావించి రాధామాధవుల (జీవాత్మ పరమాత్మల) పవిత్ర ప్రేమమ లీలలను పదములలో చిత్రించినాడు. నృత్యము మాటయెత్తినను, సంగీత విషయము తలపోసినను, అభినయ రీతులను చర్చించినను అన్నింటా క్షేత్రయ్య అమరుడు.

విజయరాఘవుని కాలమున క్షేత్రయ్య తంజాపురికి చేరుకొన్నాడు. కాగా తంజాపురి నాయక రాజాస్థాన నర్తకీగణం అభినయవిద్యను అపూర్వముగా పెంపొందించుటకు క్షేత్రయ్య సహాయ సహకార సంపత్తి ముఖ్యముగా పనిచేసినది. క్షేత్రయ్య పాండితీ ప్రతిభ విజయ రాఘవనాయకునే ఆకర్షించినట్లు విజయరాఘవుని రచనలవల్ల తెల్లము కాగలదు: అతడు తన యక్షగానములందు అభినయ ఫణితులకు వినియుక్తమగు పదములను కూర్చినాడు యక్షగానములలో పదములను ఒప్పించుట, యిదియే ప్రథమము ఐనప్పటికీ వీటిద్వారా సాత్వికాభినయము బహుముఖముల నభివృద్ధిచెంది విద్య మరింత శోభస్కరమైనది. అప్పటితో కవులు పెక్కురు తమ యక్షగానములందు పదములను, పదకేళికలను, దరువులను విశేషముగా రచించుట ప్రారంభించినారు.

క్రమముగా యక్షగానములందు దరువులకు ప్రాముఖ్యము లభించినది. ఒక భావమును అనేక సందారులద్వారా విపులపరుస్తూ అభినయించుటకు అనువైన విధమున (ధ్రువముకలిగి) నృత్యమునకు ఉపయోగపడే సంగీత రచనమే దరువు. పాత్ర ప్రవేశదరువులు,సంవాదదరువులు, అభినయదరువులు అను మూడు పద్ధతులలో ముఖ్యంగా దరువు అభివృద్ధి చెందినవి. ప్రతిపాత్ర ఒక ప్రత్యేక దరువుతో ప్రవేశ పెట్టబడుతుంది. ఆ దరువులలో ఆ పాత్ర ఆహార్యము, అలంకరణ విశేషములు, పాత్రపోషణ చక్కగా విపులముగా వర్ణింపబడి ఉండుటతో ఆవేషము కట్టు నర్తకునికి ఎంతగానో సహాయముగా ఉండును. ఆయా పాత్రల మనస్తత్వము బాగుగా నర్థము చేసుకొని పాత్రపోషణ కనువైన ఆంగిక వాచకములను కూర్చుకొనుటకు తోడ్పడే పద్ధతిలో రాగములు తాళములు దరువులలో నిర్ణయిస్తారు. ఈ దరువులవల్లనే యక్షగాన నాటకములందు ఆహార్య నిర్ణయము సులభ సాధ్యమవుతున్నది. వీటిలోని అలంకరణ వివరములవల్ల రాజాస్థానములలోని కవులు, పండితులు, ఆచార్యులు, నట్టువరాండ్రు ఆహార్య విశేషములుకూడ తెలుసుకొనుటకు అవకాశం లభిస్తున్నది.

ఈ విధముగా, అటవికుల కళగా నుండిన కురవంజి ప్రభువుల ఆదరణకు పాత్రమై పండితులచే సంస్కృతమై రాజనర్తకీమణుల కారాధ్యముగా యక్షగాన రూపమున ఒక శాస్త్రీయ కళగా విరాజిల్లినది.

ఇది పదునేడవ శతాబ్దమునాటి ముచ్చట. నాయకరాజుల పిమ్మట యక్షగానకళను పోషించినవారిలో మహారాష్ట్ర ప్రభువులగు శహాజీ, శరభోజి, తుందోజి ముఖ్యులు. విష్ణుపల్లకి సేవా ప్రబంధము. శివపల్లకి సేవా ప్రబంధములను గాన ప్రధానమైన యక్షగానములు పంచరత్న ప్రబంధమును నృత్య ప్రధానమైన రచన శహాజీ కృతులు. పల్లకీసేవా ప్రబంధములు సంగీతప్రాముఖ్యముతో అభినయమున కెక్కువగా ఉపకరించునవి. పంచరత్న ప్రబంధము కూడ చాలముఖ్యమైన రచన. సుమారు మూడు శతాబ్దములక్రితం దర్బారులందు యక్షగానములు కాక 'కేళిక' అనే పేరుతో అభివృద్ధి చెందిన ఏకపాత్రాభినయ నృత్య సంప్రదాయమును గురించి వివరముగా గ్రహించుటకుయీ రచన చాలవరకుపయోగించుతుంది.

ఈ సందర్భమున చెయ్యూరు చెంగల్వరాయని కవితను కూర్చిన ప్రస్తావన అప్రస్తుతముకాదు. చెంగల్వరాయశాస్త్రి కవి, గాయకుడు; బహుకీర్తనలను యక్షగానములను శబ్దములను రచించి భరతనాట్యమును ఎందరో నట్టువరాండ్రకు నేర్పిన ఆచార్యుడు, ఈయన కాలమునందే చెయ్యూరు ఆలయమునందలి * సర్వవాద్యారాధన కొంతవరకు సంస్కరింపబడి చక్కని స్వరూపమీయబడినది. ఈయన సుందరేశునిగూర్చి అనేక శబ్దములుగా అపూర్వ తాళములందు స్తోత్రములు రచించినాడు.

---

* ఆలయమందు షోడశోపచారములు ముగిసిన తరువాత నృత్యగీత వాద్యములతో స్వామి నారాధించుటనే సర్వవాద్యారాధన అనవచ్చును. ముఖవీణ, మురళి, సన్నాయి, ధవళశంఖు మున్నగు గాలివాద్యములు; వీణ, గోటు, వాయులీనములాది గాగల తంత్రి వాద్యములు; డోలు, మృదంగము, నగారా, శుద్ధమర్దళము, డమరుకము, సూర్యమండలము, చంద్రమండలము మొదలైన చర్మవాద్యములు. పంచముఖివంటి మృణ్మయ వాద్యములు: జలతరంగము వంటి జలవాద్యములు సంగీతమునకు జోడించి వేర్వేరుగా, గోష్ఠిగానముగా పుష్పాంజలి, శుద్ధనృత్తము. కేళిక మొదలగు నృత్త వినోదములతో స్వామిని (సుందరేశుని) ఆరాధిస్తూ చూర్ణిక, ప్రబంధ, శ్లోకాష్టకాది రచనలతో స్తోత్రముచేస్తూ దేవదేవుని గుణగణములను కీర్తిస్తూ కుంభహారతితో ముగించుట సర్వవాద్యారాధన. ఈ ఆరాధనాక్రమము అతిప్రాచీన కాలమునుండి ఉన్నప్పటికి, చెంగల్వరాయ శాస్త్రి దానికొక క్రమత నేర్పరచి ప్రచారమునకు తెచ్చినాడు. ఈయన రచనలలో సుందరేశ విలాసము ముఖ్యమైనది. ధవళము, అష్టకము, వనము, ప్రబంధము మున్నగు సంగీతరచన లీనాడు వినుటకవకాశము లేకున్నా, సర్వవాద్యారాధనలో మాత్రము వినగలము.

వర్తమానకాలమందు యక్షగానములను భాగవతములను బహుళముగా రచించి అశేష ప్రజానీకమునకు అందించినవారు తెలంగాణ వాస్తవ్యులగు శ్రీ చెర్విరాల భాగయ్యగారు. యక్షగాన రచనాపద్ధతిని, ప్రదర్శనావిధానమును వివరముగా తెలియగోరు వారికి వీరి రచనలెంతో ఉపకరించుతవి. ఆంధ్రదేశములో జక్కుల వారు ప్రదర్శించే కొన్ని ప్రఖ్యాత యక్షగానములు: జలక్రీడ, మార్కండేయ, ధర్మాంగద. కుశలాయకం, కాళీయమర్దన, గంగా గౌరీ విలాసం.

## భాగవత మేళములు

భాగవత మేళముల నర్తకులు యక్షగానములందు, సంస్కృత నాటకములందు వలె అనేకపాత్రలను ప్రవేశపెట్టి పూర్తిగా తమ ప్రదర్శనములకు నాటక స్వరూపమిచ్చారు. భాగవత మేళముల నర్తకులనే భాగవతులంటారు. వీరు పలు శాస్త్రీయ సంప్రదాయములను యక్షగానములలో ప్రవేశపెట్టి ఆ కళకొక శాస్త్రీయ నాట్యపద్ధతి నాపాదించారు. నృత్త నృత్య చతుర్విధాభినయములు (ఆంగిక వాచిక, ఆహార, సాత్త్వికములు) సంప్రదాయసిద్ధముగా అభివృద్ధికి తెచ్చి నాట్యశాస్త్రమందలి పూర్వరంగమును శాస్త్రీయరీతిని ప్రదర్శించారు. చారీ, కరణ, అంగహార, విన్యాసములను చిత్రాభినయమును భాగవతులు ప్రదర్శించారు. ఆంగికమును గొప్పగా అభివృద్ధి పరచినవారు భాగవతులే. వారు ప్రతిమాటకు, ప్రతిపలుకునకు హస్తములను కల్పించి అర్థములను హస్తవిన్యాసములతో ప్రదర్శించేవారు. గద్యమునుకూడా దానిలోని రసపోషణమునకై రాగయుక్తముగా శృతిబద్ధముగా చదివేవారు. దరువు పాడుట కూడా వీరివల్ల అభివృద్ధికి వచ్చినది. భాగవతుల ప్రదర్శనములలో ప్రతిపాత్ర, రంగస్థల ప్రవేశ మొనర్చునప్పుడు దరువును స్వయముగా పాడుతూ హావభావములను ప్రదర్శిస్తూ అందు కనువైన హస్త విన్యాసములను చూపుతూ లయాను గుణముగా నృత్త మాడుతుంది. వాచిక, నృత్తములలో నర్తకుని ప్రావీణ్య ప్రదర్శనకూ యీ పద్ధతి ఎంతో ఉపకరించుతుంది. ఈ భాగవత మేళములందలి దరువులు వివిధ రాగతాళములందు రచింపబడుటేకాక అనేకరకములైన అడవు విన్యాసములు ఆయా పాత్రలకు తగునట్లుగా ప్రత్యేకముగా సృష్టింపబడినవి. ప్రతిదరువును ఆడుటకు ముందు జతితో ప్రారంభించి దరువాడిన పిమ్మట శబ్దమును నృత్యమాడి ముగించు సంప్రదాయము ఈ భాగవతులతోనే ప్రారంభమైనది. ఒకరాజునకుగాని దేవతామూర్తికిగాని సంబంధించిన వర్ణనాత్మక గీతములతో మృదంగ శబ్దములతో కూడిన ప్రత్యేక సంగీతరచనా సంవిధానమే శబ్దము. ఇందు మృదంగ శబ్దమునకు నృత్తము, స్తోత్రగీతమునకు నృత్యము ప్రదర్శిస్తారు. ఈ భాగవతములకు అలంకారశాస్త్రములు, రసశాస్త్రములగు ప్రతాపరుద్రీయం, భరతరసప్రకరణం, రసగంగాధరం, వరసభూపాలీయం, రసమంజరులు, కావ్యప్రబంధాది బహుగ్రంథ పఠనము వీరి అభినయ నైపుణ్యమున కెంతగానో తోడ్పడినది. పారిజాతనాటకము (నేటి భామాకలాపము)లో అష్టవిధ నాయికాభినయమునకు వేరగువిధమున సత్యభామపాత్రను రూపొందించి వీరు ప్రచారమునకు తెచ్చారు. భారతీయ నృత్యకళకు జీవమనదగిన అభినయవిద్యకు తమ పాండితీ ప్రతిభలో ఎన్నో తీరుల భాగవతులు మెరుగులుదిద్దారు.

కందము మున్నగు దేశియచ్ఛందస్సులేకాక కీర్తనలు, వృత్తములు, శబ్దములు, అష్టకములు, దండకములు శ్లోకములు, చూర్ణికలు, సీసార్ధ కందార్ధ ద్విపదార్ధములు మున్నగు రచనలుకూడ భాగవతులు తమప్రదర్శనములలో ఉపయోగించేవారు. భాగవతులు ప్రదర్శించే కొన్ని నృత్యనాటకములు: పారిజాతాపహరణము, భామాకలాపము, ప్రహ్లాద, ఉషాపరిణయం, హరిశ్చంద్ర, రామనాటకము. రుక్మాంగదలు.

ఆరాధనా నృత్య సంప్రదాయము ఆలయమునువీడి ప్రాంగణమును దాటి రాచబాటలందునడిచి ప్రభువులదర్బారుల్లో ప్రవేశించి తత్తదభిరుచుల ననుసరించి వన్నెచిన్నెల నలంకరించుకొని ఆదర్శమును మరచి పూర్వప్రతిభను కోల్పోవుట ప్రారంభించినది. అసలు సంప్రదాయ బద్ధమగు దేవదాసీల జీవితము త్యాగమయము, నియమనియతమూను. ఆలయములో స్వామిని తమ నృత్యకళతో ఆరాధించుట, ఆలయపు రాబడియందుమీద ఆధారపడి జీవించుట దేవదాసీల పద్ధతికనుకనే అతినిరాడంబరులుగా ఉండేవారు. రాజాస్థానములో ప్రభు పండిత రసిక సమాదరణీయమైన గణిక లక్ష్మీప్రసన్నురాలు. అటు సరస్వతీ కటాక్షము, ఇటు లక్ష్మీ ప్రసన్నముగల రాజనర్తకీమణుల వైభవోపేత జీవితము క్రమముగా దేవదాసీగణము నాకర్షించినదన్న ఆశ్చర్యములేదు. లక్ష్మీదేవి చల్లని చూపులకోసం దేవదాసీగణముకూడ నాగరక ప్రజాభిమతానుగుణముగా తమ జీవిత పద్ధతులను సరిదిద్దుకోనారంభించినారు. ఈ విధముగా ఆభ్రగంగ వలె పవిత్రమైన దేవనర్తకీ సంప్రదాయం నానాటికి దిగజారి అధఃపతితమై పోవుటకు వారి మనఃప్రవృత్తితోపాటు అప్పటి సాంఘిక వ్యవస్థకూడ హేతువేకాగలదు. ఆంధ్రదేశమున దేవదాసీజనం ఊర్వశి అంశకు చెందినవారనీ, ఆలయనృత్య సంప్రదాయమువనుసరించుటకే వారు అర్హులనీ అభిప్రాయముండుటవలన వేరుతెగవారు ఆలయ గోపుర ద్వారముదాటి లోన గజ్జెకట్టే అవకాశమే లభించేదికాదు.

శివాలయములందలి దేవదాసీలకు పుష్పముద్రలేసేవారు, విష్ణాలయములందలి నర్తకీగణమునకు కుడిచేతిదండ పైభాగమున చక్రం, ఎడమచేతి దండపైభాగమున శంఖం, వక్షస్థలపు కుడి భాగమునందు నామసహితమగు చక్రం—ఇవన్నీ దేవతాముద్రలు - కాల్చి అంకితము చేసేవారు. వీటినే శంఖ చక్రాంకితములంటారు. ఇట్లు ముద్రాంకితలైన దేవదాసీలకే ఆలయములందు ఆరాధనా నృత్యము, కళ్యాణ మండపములవద్ద భాగవతములు, కేళికలు ప్రదర్శించే అర్హత లభించేది. ఇతర తెగల నర్తకీగణం రాజదర్బారుల్లో సభలందు నృత్యమాడేవారు. వీరు రంభాంశకు సంబంధించిన వారంటారు. దేవదాసియైనా తన కిష్టమైతే రాజదర్బారుల్లో నర్తించే అవకాశం ఉండేది. ఈ అవకాశమే ఆలయనృత్య సంప్రదాయం క్షీణదశ నందుకొనుటకు కొంత కారణము.

మనదేశమునందలి రాజకీయవాతావరణము ఆరేడెనిమిది శతాబ్దములందు అస్థిరమై ఆందోళనాకరముగా నుండుటవలన ప్రభావము సాంఘికవ్యవస్థ, కళలు, మతములపైన ప్రసరించి అవికూడ కల్లోల పరిస్థితులకు లోనైనవి. నాట్యకళకు పట్టిన యీ హీనదశను తొలగించి సంస్కృతి నుద్ధరించి లలితకళలను ప్రచారమొనర్చుటకే ఆనాటి బ్రాహ్మణ పండితులు నృత్యకళను చేపట్టారు. నృత్యకళలోని ప్రాచీన సంప్రదాయములను, శాస్త్రరీతులను కాపాడుటకే వీరు కృషిచేసినారు. వేదపురాణేతిహాస నాట్యశాస్త్రములలో పరిపూర్ణ విజ్ఞానమును సాధించిన కూచిపూడి బ్రాహ్మణాచార్యులు భారతదేశమందలి ఇతరాచార్యులవలెనే ఆంధ్రదేశమందలి శాస్త్రీయ నృత్యకళను జీర్ణావస్థనుండి ఉద్ధరించి భారతభాగవతాదులను నృత్యనాటకములద్వారా ఊరూరా, వాడవాడలా, మూలమూలపల్లెలా ప్రదర్శించి తోడుగా మతప్రచారమొనర్చి హైందవ నాగరికతా పునరుజ్జీవనమునకు తోడ్పడినారు. ఆంధ్రదేశమున రూఢముగా యీ కృషి జరిపినవారు కూచిపూడి వారగుటవలన వారనుసరించిన విద్యకు కూచిపూడి భాగవతమని, వారికి కూచిపూడి భాగవతులనీ యశస్సు శాశ్వతమైనది. వీరు తమ ప్రదర్శనములందు వేషములు కట్టుటకు స్త్రీలను నిషేధించినారు; కాగా పురుషులే స్త్రీ పాత్రలనుకూడ ధరించేవారు. అప్పటినుండి స్త్రీల నృత్యకళ నట్టువమేళములనీ, కూచిపూడివారి నృత్యకళ భాగవతమేళములనీ పేరుకెక్కినవి. ప్రారంభమునందు ఆంధ్రదేశమున శైవము, వీరశైవమూ విరివిగా ప్రచారములోనున్నప్పుడు వీరు శివసంబంధగాథలనే నృత్తనాటకములుగా ప్రదర్శించేవారు. పండితారాధ్యచరిత్రలో నాటి అనేక మార్గదేశనృత్యరీతులు వివరముగా ప్రస్తావించబడినవి. దశవిధ శివలీలలను నాటి నర్తకులు అభిమానముతో ప్రదర్శించేవారు. పిమ్మట రామానుజ వైష్ణవమతమూ, వల్లభాచార్యుని మధురభక్తి సంప్రదాయమూ ప్రజలనాకర్షించుటతో వీరు భాగవతములోని శ్రీకృష్ణ సంబంధగాథలను నర్తించుటకు మొదలిడినారు. ముఖ్యముగా వీరిని భాగవతులనీ, వీరాడెడివి భాగవతములనీ అన్నారు. మలబారు నందలి కథాకళి; ఉత్తర ప్రదేశములోని రామలీల; కూలమంగళం, ఊత్తుక్కాడు, మేలత్తూరు ప్రదర్శనములు; కూచిపూడి భాగవతములు; కోటకొండ కప్పటాళ్ళ భాగవతములు; అస్సాంలోని అంక్యానట్ నర్తనం—ఇవన్నీ ఈ తరగతికిచెందినవే. ఈ సంప్రదాయములో స్త్రీలు నర్తించరు.పురుషులే కళారాధకులుగా దేశమంతా ప్రచార పర్యటనమొనర్చి నృత్యప్రదర్శనలిచ్చేవారు.

ఈ సందర్భమున నృత్యకళకు సంబంధించిన అతిముఖ్యమైన తాండవలాస్య విశేషములను గుర్తుంచుకొనవలెను. భాగవత నాటకములలో పురుషులు స్త్రీ వేషములు కట్టినప్పుడు వారు ప్రదర్శించే అభినయమునకు, ఆ పాత్రలను స్త్రీలే ధరించినపుడొప్పించే అభినయమునకు చాలభేదము కనిపిస్తున్నది. నృత్యనాటకములందుగాని పదాభినయమందుగాని పురుషులు ప్రదర్శించు నృత్యము శుద్ధ లాస్యముకాదు; తాండవమందలి కోమలమైన అంగవిన్యాసము మాత్రమే. అనగా లాస్యచ్ఛాయా ముద్రితమైన తాండవము. అట్లే స్త్రీలు ప్రదర్శించు నృత్యమునందు తాండవముకాదు; దానిపోలికలు గల లాస్యములోని ఉద్ధత స్వరూపము మాత్రమే. కనుకనే కొందరు శాస్త్రకారులు స్త్రీలు ప్రదర్శించే నృత్యములను అభినయములను రెండుతీరుల వ్యాఖ్యానించారు. నర్తకి సభామధ్యమున కూర్చుండి పదములు, జావళీలు, శ్లోకములు, పద్యములు అభినయించుట లాస్యమనీ; నిలువబడి జతిస్వరములు, శబ్దములు, దరువులు, తిల్లానలు నర్తించుట తాండవమనీ అన్నారు.

## కూచిపూడి భాగవతులు

కూచిపూడి కృష్ణాజిల్లాలోని ఒక అగ్రహారము. ఈ అగ్రహారమందలి బ్రాహ్మణ కుటుంబములకు చెందిన పురుషులందరూ ఆంధ్రదేశమందు నృత్యకళోద్ధరణకు జీవితముల సంకితమొనర్చి దీక్షాకంకణధారులై ప్రాచీన సంప్రదాయముల నభ్యసించి ప్రచారమునకు తెచ్చినారు. కూచిపూడి భాగవతులు 'విజయనగర

రాజుల కాలమునాటికే ప్రఖ్యాతిగాంచినట్లు చరిత్ర చెప్పుతున్నది.
* మాచ్‌పల్లి కైఫీయతులో వీరి ప్రస్తావనకూడ ఉన్నది.

విజయనగర సామ్రాజ్య పతనానంతరము మన నాట్యకళను పోషించినవారిలో ముఖ్యులు తంజావూరునేలిన నాయకరాజులు. క్రీ. శ. 1561 నుండి 1614 వరకూ పరిపాలించిన అచ్యుతప్ప నాయకుడు పలు విద్యలు నేర్చి తనదరికివచ్చిన వందలాది భాగవతుల కుటుంబములకు అచ్యుతాపురిమును అగ్రహారముగా నిచ్చినాడు. ఆ అచ్యుతాపురమే నేడు మేలటూరు (మేలట్టూరు)-అంటే మేళముల ఊరు-అని పిలువబడుతున్నది. ఈ అగ్రహారమునందలి భాగవతులు తంజావూరు నాయకరాజులు రచించిన నృత్య నాటకములనుగూడ ప్రదర్శించేవారు. క్రీ. శ. 1780 ప్రాంతమున ఉన్న మేలటూరు వేంకటరామశాస్త్రి అనుప్రసిద్ధ భాగవత నాటకకర్త రచించిన నృత్యనాటకములను వీరు తరువాతతరువాత ప్రదర్శించేవారు. నేటికీ యివి కొన్ని పర్వదినములందు ప్రదర్శిస్తూనే ఉంటారు.

వైష్ణవ భక్తుడగు * సిద్ధేంద్రయోగి పారిజాతాపహరణమను నృత్య నాటకమును రచించి కూచిపూడిలో పుట్టిన ప్రతి బాలుడు తనజీవిత కాలమున నొక్కసారియైన సత్యభామపాత్ర ధరించవలెనని ఆయన శాసించినాడు. ఆ మహనీయుని ఆజ్ఞను శిరసావహించి నేటికి కూచిపూడి ఆచార్యులు తమ ఇండ్లలో జన్మించిన ప్రతి బాలునికి నృత్యశిక్షణనిచ్చి యీ కళను ఆరాధిస్తున్నారు కావుననే తరతరములనుండి యీ భాగవత విద్య యిప్పటివరకు చెక్కుచెదరక నిల్చి ఉన్నది. సిద్ధేంద్రయోగి రచించిన పారిజాతాపహరణనాటకమే యీ నాడు భామాకలాపము పేరుతో వ్యవహరింపబడుతున్నది. కూచిపూడి భాగవతుల విస్తార ప్రచారమువలనను సరస రస భరిత మగుటవల్లనూ భామాకలాపము మనదేశమునందలి కళారాధకులను ఎక్కువగా ఆకర్షిస్తున్నది. కళోపాసకులు ఆంధ్రదేశం నలుమూలల నుండి కూచిపూడికి యాత్రగావెళ్ళి యీ భాగవత విద్య నభ్యసించినారు. ఇంతేకాదు. ఇతర ప్రాంతముల కవులుకూడ సిద్ధేంద్రయోగి పద్ధతిలో కలాపములను రచించినారు కావున సిద్ధేంద్రయోగి విరచిత భామాకలాపమేకాక ఆంధ్రదేశములో మరి అరువిధముల కలాపములను భాగవతనర్తకులు ప్రదర్శిస్తున్నట్లు తెలుస్తున్నది. సిద్ధేంద్రయోగి కవితామాధుర్యము, పాండిత్యప్రకర్ష, రచనా వైశిష్ట్యము, కళాప్రతిభ ఎట్టివో దీనినిబట్టి దెలియగలము. ఆంధ్రులా మహనీయుని కా కల్పాంతము ఋణపడియున్నారు. ఆమహనీయుడే

---

* క్రీ. శ. 1502 లో వీరనరసింహరాయల కాలమున విజయనగరమున కూచిపూడి భాగవతులు తమ విద్యను ప్రదర్శింపగోరి వారు కూచిపూడివారి ఖ్యాతిని మున్నే విన్నాడు కావున వీరిని నృసింహరాయల దివాణములో ప్రదర్శనమేర్పాటుచేసి రాణివాసమును కూడ దర్శనమునకు అనుమతించినాడు. అప్పట్లో సిద్ధవటంసీమను సమ్మెట గురువరాజు అన్నాయన పాలించేవాడు. అతడు ప్రజలనుండి ద్రవ్యమును గుంజుకొనుటలో చండశాసనుడుగానుండేవాడు. ధనమివ్వని వారి స్త్రీలను పట్టించి తెచ్చి స్తనములకు చిరుతలు పట్టించేవాడట. ఆ రోజుల్లో బ్రాహ్మణభాగవతులీదారుణమును గమనించినారు. కాబట్టి నృసింహరాయలముందు రాణివాసమంతా తిలకిస్తుండగా భాగవతులు ధైర్యముచేసి సమ్మెట గురువరాజు ధనముకొరకు కావించే స్తనపీడనమును ప్రదర్శించినారట. ఒకడు స్త్రీ వేషమును మరొకడు గురువరాజు వేషమును కట్టి రంగస్థలమున స్త్రీ వేషమునకు స్తనములపై చిరుతలు పట్టించి సొమ్మిమ్మని తహాప్పిలు చేసినట్లు భాగవతులు కీర్తన ప్రదర్శించారు. భాగవతుల ముఖతః రాయలు గురువరాజు దుష్పరిపాలనము తెలిసికొని తెల్లవార్లేసరికి ఆస్థానమునందు దండనాధ సేనానాయకుల నెల్లరను పిలుపనంపి ఇస్మాల్ ఖాన్ అనే నాయకుని సేనతోపంపి గురువరాజు తలకొట్టించి ఆ ప్రాంతప్రజల పీడబాపినారు.

---

* కూచిపూడినే కుచేలపురి యనికూడ పిలిచేవారట. 16 వ శతాబ్దమున కూచిపూడిలో సువాణంవారు భాగవతులందు ప్రశస్తులుగా నుండేవారు. శ్రీ నారాయణతీర్థుల కృష్ణలీలా తరంగిణిలోని తరంగములను నృత్యగానములకు ఎక్కువమక్కువతో వాడుకొనేవారు. ఒక రోజున రాయలసీమనుండి ఒక బ్రహ్మచారి దేశాటనము చేస్తూ కూచిపూడి చేరి సువాణంవారి నిత్యజపతపానుష్ఠాన హవనకర్మక్రమమునకును, నృత్యలాస్య నాట్యకళారాధనకును సంతోషించి తానుకూడ ఆ గ్రామముననే స్థిరపడిపోయినాడు; సువాణంభోగావధాన్లు పుత్రికను పరిణయమాడినాడు; కొంతకాలమునకు సన్యసించి సిద్ధిపొందినాడు. ఈ మహనీయుడే సిద్ధేంద్రయోగి. సిద్ధేంద్రయోగి రచించిన పారిజాత నాటకమునే కూచిపూడి భాగవతులచే అప్పటి గోల్కొండ పాదుషావద్ద ప్రదర్శింపజేసి కూచిపూడిని అగ్రహారముగా ఆ భాగవతుల కిప్పించెనని చెప్పుదురు.

లేనిచో భాగవతకళ ఇంతగా మూడుపూలారుకాయలై విరాజిల్లే అవకాశము కలిగెడిదేనా!

కూచిపూడి భాగవతులు తమ పూర్వులనుండి నేర్చిన నృత్యవిద్యతోనే సంతృప్తివహించి ఊరుకోలేదు. నిరంతరకృషితో నూతన విషయము లెన్నింటినో కనుగొని సంతరించి పూర్వ సంప్రదాయముల ననుసరించి తమ నృత్యకళ నభివృద్ధిపరచుకుంటూ వచ్చినారు. భాగవత ప్రదర్శనలకోసం వారే యే సంస్థానములకు వెళ్ళినను అక్కడి నట్టువరాండ్రు, దేవదాసీల నృత్యములను చూచే అవకాశము లభించేది. అక్కడ తాముకాంచిన విద్యలో ఏ కొంత వైశిష్ట్యమున్ననూ సహృదయతతో స్వీకరించుటకు వెనుదీయలేదు. అక్కడక్కడి చూసిన నృత్యపద్ధతులందలి పోకడలను కూడ గౌరవించి తమ భాగవతకళకు విశాలతను చేకూర్చగలిగినారు. తమ విద్యలోని ప్రత్యేకతలను ఆస్థాన నట్టువరాండ్రకును నేర్పినారు. ఇట్లు కూచిపూడి భాగవతులు కళాప్రచారకులని అన్వర్థనామధేయులైరన్ననూ అతిశయోక్తికాదు.

కూచిపూడిలో భామాకలాపమేకాక నృత్యనాటకములనుకూడ సంప్రదాయపూర్వకముగా చిరకాలమునుండి అక్కడి ఆచార్యులు ఆడిస్తూనే వచ్చినారు. ఈ నాటకకళలో మిక్కిలి ప్రసిద్ధికెక్కిన వారిలో ఆఖరివారు బ్రహ్మశ్రీ చింతా వేంకటరామయ్యగారు కొద్దికాలమైె గతించినారు. వారికుమారులు బ్రహ్మశ్రీ చింతా కృష్ణమూర్తిగారు ఆ కళను ప్రస్తుతము వ్యాప్తి నొందిస్తున్నారు.

సుమారు రెండుశతాబ్దములక్రితం బనగానపల్లి నవాబు కూచిపూడి భాగవతులను కొందరిని తన ఆస్థానమునకు ఆహ్వానించి వారికి కొంత భూమిని యీనాముగానిచ్చి అలంపూరునకు దగ్గరలో ఉండే కోటకొండ కప్పట్రాళ్ళ అను గ్రామమును వారికి స్థిరనివాసముగా నేర్పాటుచేసినారు. వారి వంశీయులే తెలంగాణాప్రాంతమున నేటికి భాగవతములను ప్రదర్శిస్తున్నారు.

భామా కలాపము లేక పారిజాతాపహరణ నాటకము.

అష్టవిధ నాయికాభినయమునకు చక్కని అవకాశమును కల్పిస్తూ నాయికల వారిచేష్టలు, వారి వ్యాపారములు రసపోషణానుగుణముగా ప్రదర్శించుటకు వీలగువిధమున సిద్ధేంద్రయోగి పారిజాతాపహరణ నాటకమునల్లినాడు. ఇందనేకపాత్రలు ఉన్నప్పటికిని, ప్రతిపాత్రకొక వైశిష్ట్యముండుటవల్లను దీనికి భిన్నముగా ఒకే వర్తకుడు వివిధరసముల నొప్పిస్తూ వివిధనాయికల నభినయిస్తూ నృత్తనృత్యములలో పాండిత్యము చూపుట కనువైనరీతిగా యీ పారిజాతాపహరణ నాటకము రూపొందించవలెనని సంకల్పిం కూచిపూడి ఆచార్యులు దీనికొక నూతన స్వరూపమునేర్పరచినార అదే భామాకలాపమను పేరుతో ప్రచారమున కెక్కినది. ఇక్క భామ అనగా సత్యభామ, కలాపమనగా ఆమె మానసికవ్యవస్థ. ఈ నాటకమునందు, స్వర్లోకమునుండి తాను తెచ్చిన పారిజాత పు మును నారదుడు శ్రీకృష్ణునకివ్వగా శ్రీకృష్ణుడు దానిని రుక్మి కిచ్చెను. సత్యభామకు ఆ విషయముతెలిసి అలుగును (కోపగి చును.) కృష్ణుడామె అలకను తీర్చి పారిజాత వృక్షమునే తె సత్యభామ పెరటిలో నాటును. ఈ కథాసంవిధానమంతా నాట రూపంలో నున్నందున సత్యభామ పాత్ర తన విశిష్టతను ప్రత్యే ముగా చూపే అవకాశములేదు. అట్లుకాక సత్యాకృష్ణుల ప్రణ కలహమాధారముగా చేసుకొని కృష్ణుడు సత్యనుండి దూరము నున్నప్పుడు ఆ విరహమునందామె మనస్సు పొందిన వివిధావ లను వివిధనాయికలుగా చిత్రించి నాటకమున అభినయింతుర ఈ అభినయ పద్ధతి కనుగుణముగా పెంపొందింపబడిన కల మిది.

ఈ కలాపము "స్వాధీనపతిక"తో ప్రారంభమౌతుం చెప్పినట్లువిని, కోరినట్లు నడుచుకొను పతిగల నాయిక స్వాధీ పతిక. శ్రీకృష్ణుని ప్రేమకు పాత్రురాలైన దేవేరి తనకుమిం ఎవ్వరూలేరని సత్య ప్రగల్భములు చెప్పును. నాటకప్రదర్శనమం భామ దరువును పాడుతూ ప్రవేశిస్తుంది.

దరువు ముఖారి—అటతాళం

భామనే – సత్య భామనే–వయ్యారి సత్య

(1) భామనే, పదహారువేలా
గోపికలు అందరిలోన
రామరో గోపాలముని
ప్రేమ కొల్లగొన్న సత్య॥
.... .... .... .... .... ....
.... .... .... .... .... ....

(4) కూరిమి సత్రాజిత్తు కూతురై
అందరిలోన చాలా
మగనివిడాసి తాళజాలని
వయ్యారి సత్య॥

ఇట్లా ప్రవేశదరువును నృత్యమాడి ముగించిన తరువాత లికత్తెగా, దూతికగా, హస్యప్రియగా అన్ని విధముల ప్రతిబింబిస్తూ పక్కనే ఉండు మాధవితో అంటుంది:

హే సఖీ! స్వామివారికి నాకూగల స్నేహము చెప్పెదను విన మ్మా"

గిరిన్మయూరే గగనేపయోదిరే
లక్షాంతరే భాను జలేచపద్మం
ద్విలక్షసోమే కుముదోత్పలానాం
స్నేహేచ బంధూ నగరాచ మూరః

........................

పదహారువేల గోపికలందునా తనకు సరి యెవ్వరూలేరని ర్షిస్తూ జగన్నాధుడు తనకు దాసుడని సంతోషిస్తూ చెలులతో త్యభామ ముచ్చటించును. నాధునితో జరిగిన మన్మధక్రీడలు, గడి న శృంగార జీవితము సఖితో వర్ణించును. కాని ఆ సమయమున ధుడు తనతో లేడు. శ్రీకృష్ణుడు కోపగించుకొని వెడలిపోయి డు.

ఇచట సత్యభామపాత్ర "కలహాంతరిత" నాయిక నభిన ంచును. పతితో తగవులాడినందుకు పశ్చాత్తాపము తన అవివేక కు దుఃఖమూ ప్రకటిస్తూ చింతపడును.

"భూమిని ఆడజన్మమయి పుట్టిన యందుకు చింతసేతునా,
రామలలోన ప్రాణపతి రమ్మన నందుకు చింతసేతునా,
కాముని బాణజాలములు గ్రమ్మిన యందుకు చింతసేతునా,
ఏమని చింతసేతు, విధినేమని యాడుదు నేడు దైవమా.

* * *

ప్రాయము పాముపాలు,బిగువయ్యెద గుబ్బలరైకపాలు,యీ
కాయము రాత్రిపాలు, చెలికన్నులు చూపులు నిద్రపాలయో,
పాయని ప్రేమచేత యెడబాయక యుంటినె; యిప్పుడిట్లుగా
కాయజు డేయుచున్న పువుఘాతల కోర్వను జీవితేశ్వరా"

స్వామి తనవద్దలేడు. అతడు లేనిదేజీవించుటెట్లు? మరల ాణపతి అనుగ్రహమును సాధించు టెట్లు? అసరీవియోగమును ంచు టేవిధమున? విరహతాపముతో దుఃఖించే యీ తరుణమున త్యభామ "విరహోత్కంఠిత." నాధునికి రాయబార మంపును. వ ఏడువారాల సొమ్ములిచ్చెదనని వాగ్దానమొనర్చి, నాధుని గొని రమ్మని దూతికను వేడుకొనును, లేఖవ్రాసి సత్యభామ మాధవి చేతికిచ్చి ఇలా అంటుంది.

దరువు—పంతువరాళి—ఆటతాళం

"మేలుదానవని చాలనమ్మితి
మేలుమేలు సొమ్ములిస్తునే
ముత్యాల హారమిస్తునే
పవడాల చిన్నసరాలిస్తునే
నీ బాగుకు నేనొర్వజాలనే
నీకు మ్రొక్కేను పగపోవే"

ఈ దరువు నృత్యమాడిన పిమ్మట

"ఉత్తరము చూచుకొమ్మనె నా . . ని నేడు
తత్తరపడి వ్రాసినాను తపో . . . . యీ నాడు
కాయజుని పువుటమ్ముల గాసిచె . ది . ను
తోయజనయన! మనతో వితో . . . . . న"

తన విభుడు అలసట తీర్చుకొ నప్పుడు, విడెము సేవించు నప్పుడు, అద్దముచూచి శృంగారి చుకొను చున్నప్పుడు, ఉల్లాసముగా మన్నప్పుడు, పుష్పపరిమళమును వయ్యారముగా నాఘ్రాణించు నప్పుడు, ధర్మములను చర్చించునప్పు . . . సమయములందు తన దీనస్థితితెలిపి రమ్మని బతిమాలుమని సత్యమాతిక మాధవిని కోరు తుంది. సరే, ఎట్టకేలకు మాధవి అంగీకరిస్తుంది. మాధవివెళ్ళి వస్తుంది. తిరిగి వచ్చునప్పటికి దూతయే నాయకయైనదని సత్య అనుమానించుటతో అభినయము "విప్రలబ్ధ" నాయిక కనుగుణ ముగా మారును. తరువాత వసంత జయంత కీరశారికాభ్రమరము లను పంపును. చిట్టచివరకు శ్రీకృష్ణుడు సత్య ద్దకు రానంగీకరిం చును. అతడు వేంచేయుటతోడనే సత్యభామ "మోసగాడా" అని దూషిస్తుంది. ఇక్కడ సత్య పాత్రకు "ఖండితనాయికా" భినయము.

"ఇంత మోసమా సామి,
ఇపుడె కావలెనా యేమి"
అక్కడొక్క పేగుజక్క వా చెనా లేదా
కొక్కొరొకో యనుచు తొలికో . . . పెరా
చిక్కినావు తస్కర శూర! చీకటిలో విడువలేక
ఇక్కడికి రాను పోను యీ ప్రయాస మేలర సామి
జాంటితెనే లొలుకు దొండపండు వంటి మోవిమీద
గంటు చూడగానె యొడలు మంట లెక్కపోరా"

.... .... .... .... .... .... ....

ఇక శ్రీకృష్ణుడు —

దరువు – కాఫీ – ఆదితాళం.

"ఇంతకాలమేల ఇంతిరో! నేనెట్లోర్తునే
చెంతజేరనికరావే చెలియా నాతో,
నీకు చాల మ్రొక్కేను"

భామ—

"టక్కు మాటలేలనాతో
చక్కనయ్య, లేచిపోరా
అక్కర దీరిచి వచ్చినావు
యేఅతవలకొ మ్రొక్కినావు"

.... .... .... .... ....

సీ॥ అంతరంగపు మాట లాయింతితో గూడి,
బాహ్యరంగపు మాట పలుకరాకు
ఆ పెతో యిచ్చావిహారంబు లొనరించి
వింతలు చూప నా చెంతరాకు

.... .... .... .... ....

ఇట్లు సత్యనిందలు విన్న కృష్ణుడు—

"ఏలనే నన్ను తేలికగ చూచేవు
బాలికామణి! నిన్ను నేనెడబాసి ఓర్వగజాలనే"

కృష్ణుని అనునయింపులకు సత్యభామ శాంతించును. కృష్ణుడు పారిజాత వృక్షమునే తెచ్చి సత్య పెరటిలో నాటించుటకు వాగ్దాన మొనర్చును. అంతట్లోనే రుక్మిణి ప్రవేశిస్తుంది. నాటకములో యిచట సవతుల పోట్లాట కూడ కలదు. చివరకు శ్రీకృష్ణ దిరువు రకూ సఖ్యము కూర్చి ఆశీర్వదించును.

ఆ విధముగా పీ కలాపమందు అష్టవిధ నాయికాభినయము క్రమమున ప్రదర్శించు నవకాశము కల్పింపబడినది.

జడచరితము: భామాకలాపమాడు సమయమున తెరపై జడ వేయు నాచారమున్నది భామ పాత్రధారికి సకల విద్యలందు పాండిత్యమున్నట్లు మా సభలోనెవరైన తన విద్యను పరీక్షించ వచ్చుననియునూ సవాలు చేయుటయే యీ జడవేయుట.

ఈ జడకొక విశిష్టమైన పూర్వగాథ కలదు. శ్రీమహావిష్ణువు సముద్రమదన సమయమందు దేవతలకు అమృతము పంచుటకై జగన్మోహినీ రూపముధరించినప్పుడు విశ్వకర్మచే సృష్టించబడిన ఈ జడను అలంకార విశేషముగా ఆయన ఈ జడనే ధరించెనట. జగన్మోహినీ రూపము నుపసంహరిస్తు శ్రీమహావిష్ణు పీజడను కత్తిరించి పార్వతి వద్దకు బహూకృతిగా కొంపోయినాడట. శివ పార్వతులు పురాణదంపతులగుటవలన జడను పార్వతి ధరింపనొల్ల లేదు. పిమ్మట తెచ్చి రుక్మిణి కీయబోగా ఆమెకూడ అట్లే అభ్యం తరము చెప్పినది. అందుపై శ్రీమహావిష్ణు వా జడను ఒక సందూకు (పెట్టె)లో భద్రపరచి నరకాసురవధానంతరము ఆ జడను ధరించు టకు సత్యమే అర్హురాలని యెంచి ఆమెకు బహూకరించెనట. ఆ నాటినుండి సత్యభామ అలంకారముగా ఆ జడను ధరిస్తూ వచ్చినది. అజడ ఇరువదియేడు నక్షత్రములను సూచించునట్టి ఇరువదియేడు బిళ్ళలను కలిగి అయిదు శిరస్సుల ఆదిశేషుని పోలి ఉండును. తదాదిగానే సత్యభామకు సంబంధించిన కథలన్నింటా ఆ జడకొక ప్రాముఖ్యము కల్గెను. అజడను ధరించుటకు సత్యభామ ఎట్టునమర్థు రాలో అట్లేసమర్థురైన నర్తకుడే సత్యభామ పాత్రనుకూడ పోషించ గలడని తోచును. అసమర్థులకు సత్యభామా పాత్రాభినయార్హత లేదని నిరూపించుటకే అజడను తెరపై వేస్తున్నారు. ఒకవేళ పభలోగల పండితులతో వాదోపవాదములందు సత్యభామ పాత్రధారి ఓడి పోవుచే సంభవిస్తే సభాముఖముననే అజడమ కత్తిరిస్తారు. ఇందుకు మించిన అగౌరవ మా కళాకారునికి వేరుండదు. కాబట్టి సత్యభామ పాత్రధారి విధిగా సమస్త శాస్త్రము లభ్యసించినగాని సభలో సత్యభామ పాత్ర ధరించుటకు పూనుకోడు.

## గొల్ల కలాపము

గొల్లకలాపమనగా ఒక గోపికకుగల విజ్ఞానమును ప్రద ర్శించే నృత్యనాటకము, కలాప శబ్దమునకు సంస్కృత శబ్దార్థకల్ప తరువునందు వేదవాక్యము, బ్రహ్మవాక్యము, విజ్ఞానము అను అర్థ ములు కలవు.

పాలు, పెరుగుల నమ్ముతూ పల్లెలలోను, పట్టణవీధులం దును సంచరించు ఒక గోపికకు, ఒక బ్రాహ్మణునకు మధ్య జరి గిన సంవాద కథయే గొల్లకలాపము. ఈ సంవాద రూపకమున హైందవ నాగరకత, మతము, సంస్కృతి, ఆచారవ్యవహారములు, వర్ణవ్యవస్థను గూర్చిన అనేక విషయములు చర్చకు వచ్చును.

గొల్లకలాపము పుట్టుపూర్వోత్తరములు ఇవి: నూటయేబది

సంవత్సరముల క్రిందట కూచిపూడి భాగవతులు సిద్ధేంద్రయోగి రచించిన భామాకలాపమును శృంగార ప్రబంధమును నృత్యనాటకముగా ప్రదర్శిస్తున్నప్పుడు కృష్ణుడు, సత్యభామ, మాధవి, గోపిక పాత్రలుండేవి. ప్రదర్శనారంభమున గోపికపాత్ర పాలు పెరుగుల నమ్ముతూ రంగస్థలిని ప్రవేశించేది. అంతకుపూర్వమే విదూషకుడు రంగస్థల ప్రవేశమొనర్చి ఉండి గోపికపాత్ర తన నృత్యగానములతో ప్రేక్షక జనరంజన మొనర్చిన తదుపరి ఆమెతో సంభాషణ ప్రారంభిస్తాడు. ఇంతలో కృష్ణపాత్రి ప్రవేశమొనర్చి గోపికతో సరసము మొదలిడుట జరుగును. గోపిక శ్రీకృష్ణపరమాత్మకు నమస్కరించి దాసురాలితో సరసము వలదని ప్రార్థిస్తున్నది. విదూషకుడు వారిరువురి మధ్య రాయబారియై సంధాన ప్రయత్నములు చేస్తు తన హాస్యధోరణిలో ప్రజలను వినోద పరుస్తాడు. ఈ తీరుగా గోపికాకృష్ణుల మధ్య ఆత్మపరమాత్మలను గురించిన ఆధ్యాత్మిక చర్చలు, విదూషకుని హాస్యవ్యాఖ్యానములతో కొంతసేపు గడచిన పిమ్మట సత్యభామ పాత్ర ప్రవేశించేది.

భామాకలాప ప్రదర్శన మీవిధంగా కొంతకాలము నిర్వహింపబడుతూ వచ్చినది. కొన్నాళ్ళకు కొందరు పండితశ్రేష్ఠులు యీ గోపికా వేషమును భామాకలాపమునుండి వేరు చేసినారు. పిమ్మట ఆధ్యాత్మిక విషయములను బోధించే వేదస్మృతి పురాణేతిహాసములనుండి కొన్ని ధర్మసూక్తులను తత్వములుగా వ్రాసి యీ గోపికావేషముచే ప్రత్యేకముగా గొల్లకలాపము పేరుతో నాద ప్రారంభించినారు. శృంగార ప్రబంధమగు భామాకలాపమునుండి యీ విధముగా వేదాంత ప్రబంధమగు గొల్ల కలాపము ఉద్భవించినది. ఈ గొల్లకలాపమునందు విదూషకుడుండును గాని కృష్ణుడుండడు. విదూషకుడే కథలోని సంవాదపాత్ర బ్రాహ్మణుడు. అతడే హాస్యగాడు. రంగపూజానంతరము రంగస్థలముపై నున్న విదూషకుడు గోపిక (గొల్లభామ) సౌందర్యమును వర్ణించే దరువుతో గొల్లకలాపము ప్రారంభమౌతుంది.

"గొల్లభామ వచ్చెనూ – చల్లోయని
గొల్లభామ వచ్చెను
గొల్లభామ వచ్చె – పల్లవీ వాణిరో
పల్లెవాడలంట చల్లనమ్ముతుంటూ॥
ముంగివన్నె చీర చెంగులు జారగ
సంగతిలా కూడి భంగూ గుత్తపు రవిక॥
కలకంఠి నీల కుంతలములు మెరయగ
తలిరుబోడిరో, వింతమాటలాడుచు॥
మొలకమోవి తేనె చిలికెడిపలుకుల
కలికి వీణియ సొంపు గులుకు మోహనాంగి॥ గొల్లా॥

ఈ విధమున విదూషకుడు ప్రారంభించిన దరువును గొల్లభామ పాత్రధారికూడ అందుకొని పాడుతూ నృత్తనృత్యములను ప్రదర్శిస్తూ సభాస్థలము ప్రవేశించినప్పుడు విదూషకుడామెను నీవెవరవని ప్రశ్నిస్తాడు.

తాను గొల్లభామనని ఆమె జవాబు చెప్పును. విదూషకుడు గొల్ల శబ్దమున కర్థమేమని ప్రశ్నిస్తాడు. "గాః లాతీ గృహ్ణాతీతి గొల్లః" అతడే శ్రీ మహావిష్ణువు అతడే కులమున పుట్టెనో ఆ పవిత్రమైన కులమే గొల్లకులము. ఆ గొల్లకులమునకుచెందిన గొల్లవారమని చెప్పుటేకాక. గొల్లభామ తనవద్దనున్న పాలుపెరుగుల విశిష్టతను అతిశయోక్తులతో వర్ణిస్తుంది. ఏబదియారు దేశముల రాచనగరులందలి రాజాధిరాజులూ ఇంద్రాదిదేవతలూ తన పాలు పెరుగుల మహిమవల్లనే సుఖోపేతులైరని చెప్పి మీరెవరయ్యా అని ప్రశ్నించుతుంది. మేము బ్రాహ్మణులమని విదూషకుడు సగర్వముగా మారుపల్కినందుకామె ముసిముసినవ్వులు నవ్వుతుంది. మీరు యోగ్యబ్రాహ్మణులా అయోగ్య బ్రాహ్మణులా అని గొల్లభామ చల్లగా ప్రశ్నించి విదూషకుడు జవాబు చెప్పకమునుపే బ్రాహ్మణుల యోగ్యతా యోగ్యతలను పద్యరూపమున గానమొనర్చి ఆంగికాభినయముతో అర్థము చెప్పుతుంది.

ఉ॥ కాకుని కర్మతలిధి సుకోవిదధార్మికమౌనిదేవ పూ
జాకర సూనృత వ్రతప్రశస్తులు పంక్తికియోగ్యులెప్పుడున్.
కేకసవాహమాహిషక కృత్రిమ గోళక వహ్నిమార భు
ల్పాకి కరర్పదేవళులు పంక్తికియోగ్యులు కారు భూవరా.

ఈ పద్యము పాడి యిందు మీరే తరగతికిచెందినవారు బ్రాహ్మణ వర్యా! అని ప్రశ్నించి, గొల్లభామ,వరుసగా ఒక్కొక్కరిని గురించి శ్రుతి స్మృతు లాధారముగా ఒక్కొక్క వృత్తి నవలంభించువారిని గురించి చర్చించిన పిమ్మట బ్రాహ్మణులై ఉండి స్వకులధర్మమును వీడి ఇతరవృత్తుల నవలంబించినవారిలో మీరే తరగతికి చెందుదురని అడుగును.

శ్లో॥ దేవోమౌనిద్విజోరాజా వైశ్యశ్శూద్రబిడాలకః
పశు మ్లేచ్ఛస్తు ఛండాలో దశవిప్రాః ప్రకీర్తితాః

అంటూ గొల్లభామ విదూషకి విప్రునితో ఛలోక్తులాడుతుంది. తనవద్ద నున్న చల్ల శ్రేష్ఠత్వమును నిరూపించుటకా

అన్నట్లు బ్రహ్మాదిదేవతలుకూడ తన చల్లద్రావి శక్తివంతులైరనీ త్రిపుర సంహారసమయమున పరమేశ్వరుని రథమున కిరుసు విరుగుతే శర్వుడు మధనపడుచుండగా తాను తన చక్రముచే శంకరుని పిపాసబాపి ఇరుసుపై కొంతపోయినా చల్ల ప్రభావమున ఇరుసు విరిగిన దతికినదనీ చమత్కారముగ వర్ణిస్తుంది. పదునాల్గు భువనములందలి ప్రజలెల్లరూ గొల్లకులమునకు చెందినవారే అనును.

సీ॥ సరసిజాక్షుడు గొల్ల చతురాననుడు గొల్ల
శంకరుండునుగొల్ల శశియుగొల్ల
హరిహయుండునుగొల్ల అదితేయులుగొల్ల
మునులెల్లగొల్లలు ముదముమీర
సాగరుండునుగొల్ల బాగుగా శ్రీ గొల్ల
వయమొప్ప విశ్వమంతయును గొల్ల
మాకులంబునకంటె మహియెక్కువేలేదు
ఈ కులంబునందె? ఇందిరేశు
దరయ ప్రౌఢులు మా వంశమందు బుట్టి
రిది ప్రసిద్ధికదా, వీరకెల్ల జూడ
కాంతులను బట్టు చిగురాకు ఖడ్గమనగ
ప్రజలచేనుతి గొను గొల్లభామనేను.

ఇట్లు సర్వదేవతలు గొల్లవారే అనుచూ వీరందరకును శ్రీకృష్ణపరమాత్మతో గల సంబంధబాంధవ్యమును గొల్లభామ నిరూపిస్తుంది. శ్రీకృష్ణ భగవానుడు భారత యుద్ధరంగమగు కురుక్షేత్రమున నిలిచి పార్థునకు విశ్వరూపమును చూపినప్పుడు "పశ్యామి దేవాన్ తవ దేవదేహే" అని అర్జునుడు పల్కిన శ్లోకమునాధారముగాగొని శ్రీ కృష్ణుని శరీరమందు సర్వస్వరూపములిమిడియున్నవి కావున అతడే సర్వజీవులకు తండ్రి కావున "సర్వేజనాః" గొల్లలే అని తర్కిస్తుంది. ఈ విధముగా తర్కిస్తూ అనేకావాదములను పేర్కొంటూ భగవద్భక్తులైన శూద్రులు ఆత్మానాత్మవివేకముకలవారైతే బ్రాహ్మణులుకాదగుదురను తన వాదమును గీతావాక్యములతో సమన్వయపరచి సమర్థిస్తుంది.

శ్లో॥ నశూద్రాః భగవద్భక్తాః విప్రాః భాగవతాః స్మృతాః
సర్వవర్ణేషుతే శూద్రాః యేహ్యా భక్తాః జనార్దనే.

ఇంతేకాదు. గొల్లభామ గొల్లలవిశిష్టత నింకనూ వివరిస్తుంది.

బ్రాహ్మణుల యజ్ఞయాగాది క్రతువులకు సంబంధించిన వస్తువులగు దధిక్షీరఘృతము లాదిగాగలవి. గొల్లవారి ఉత్పత్తులే అనీ గొల్లవారే లేకపోతే క్రతూత్సవములు జరిగే అవకాశములేదనీ సర్వక్రతువులలోను గొల్లల ముఖ్యపశువు మేక ప్రధానమని వేదములే ఘోషిస్తున్నవనీ గొల్లభామ నిరూపిస్తుంది. యజ్ఞపశువువేరు సంవిధానమును గోపిక చెప్పుతుంది. శ్రీమన్నారాయణుని సేవను మించిన పరమధర్మము లేదనుచూ నారాయణాపరావతారమైన శ్రీ కృష్ణుని సేవించుటతో ధర్మార్థ కామమోక్షములు చేకూరుననీ, పశుహింసదోషమనీ ప్రపంచ ప్రజలందరూ ఒకే వర్గమనీ సుగుణ దుర్గుణములచే రెండు జాతులనీ ఇంతకు మించిన జాతులులేవు కావున సర్వమానవ సౌభ్రాత్రముతో ఏ జీవినీ హింసించకపోవుటే ఉత్తమలోకప్రాప్తికి మార్గమనీ బోధిస్తుంది. ఆ మీదట పిండోత్పత్తిక్రమమున నాపె తెలుపును. ఇంకనూ అనేక వేదాంత విశేషములను చర్చించును. తార్కిక వాదమున కిదొకచక్కని ఉదాహరణము. ఈ విధమైన ఆధ్యాత్మిక చింతతో కూడినదే గొల్లకలాపము. గొల్లకలాపములోవచ్చు ఒక ముఖ్యమైన దరువు—

నాదనామక్రియ—ఆదితాళం

ఎగ్గెరి గజ్జెకట్టి అభినయమున నామె పొందిన... బ్రాహ్మణులైతే శరణుచేసెదను ... ములనుండి చిక్కుము చెప్పగల సమర్థ

బ్రాహ్మణులనగా బ్రహ్మజ్ఞానజ్ఞ...కటును. ఇతర నట్టువ...

గాయత్రి జపకర్తలమంటే క...ాలగు నాయకులాలు ఒక్క

గాయత్రి జపమెంతటకలదో ... యందున్న సాత్త్విక

వేదశాస్త్రములు చదువుతు వారికె... ప్రవర్తించి పండిత

వేదాంతుపై వెలుగుచు తానై వెలిగెని ...జావాణి కేవల

...వు విందు,

ఆగ్రికులంబని అంటిరయా మింగ్రిసృష్టిని కన్నాకి అభి

నిగ్రహించి ఆధ్యాత్మికతా సన్మార్గమె శ్రమము తెల్పం

కాలముచెప్పుట కన్నము...ట ఘనులముంటిరే తీయరయ్య

కాలము... ...లము ... ... శీలముగా వయ

...చేయరయా॥

ఇటువంటివే, వేదశాస్త్ర పురాణేతిహాసములందలి అనేక పద్యములు శ్లోకములు గొల్లకలాపమున వాడుదురు.

రాః

భామా కలాపమునవచ్చు గోపికావేషమును విడదీసి గొల్లకలాపమునభివృద్ధి పరచినట్లే గోపికయే రాధ యను భావము కలిగిన కొందరు శాస్త్రజ్ఞు లాపాత్రకు రాధరూపము కల్పించి రాధామాధవముగా నాడుట మొదలిడిరి. ఇది తూర్పునందెక్కువ ప్రచారమున నున్నది. నిరంతరము కృష్ణసాన్నిధ్యమును కోరే రాధ అమా

యిక, భక్తురాలు. ఆమె కి ప్రపంచమంతయూమిధ్య, అంతయూ అశాశ్వతము. నిరంతరానంద సంధాయకునకు శ్రీకృష్ణ పరమాత్మునకోరి ఆయనలో ఐక్యముకావలెనని ఆకాంక్షించుచూ గడిపే ప్రేమికురాలు. ఈ ప్రేమతత్వమే మధుర భక్త్యుపాసనా తత్వము. దీనిని రాధామాధవమన్నారు. (ఈ రాధా మాధవము జయదేవకవి 'గీతగోవిందము' ఆధారముగా అభివృద్ధి జెందినట్టి.)

తానే కృష్ణుడు, కృష్ణుడే తాను, తనకూ కృష్ణునకు అభేదము. ఈ తలంపుతో అనిశము ఆ వెన్నదొంగ లీలలను మననము చేయుచూ ఆలపిస్తూ కాలముగడిపి ఆ తేజోమూర్తిలో లీనమగు 'పతిమాన భక్తురాలు రాధ.

వక ఈ అమాయక ప్రేమోపాసిని ఆదర్శముకాగైకొని తమ
చేస్తు నా మార్గముననే మలచుకొని, మధుర భక్త్యుపాసనతో
గోపికాకృష్ణ యితరులకుకూడా మధురభక్తి భావమును ప్రబో
చర్చలు, విదూషి చైతన్యుడు, క్షేత్రయ్య, అన్నమయ్య మున్నగు
పిమ్మట సత్యభామ రెండక్షరముల పేరున్న ఆ వెర్రిబాగుల
...త్రి కాకపోయినచో మనకు రసనిర్ణయము

భామాకలాప న్రయము లుండెడివి కావేమో.

హింపబడుతూ వచ్చినది.

యీ గోపికా వేషమున ..గములు

పిమ్మట ఆధ్యాత్మిక విషయుతీంద్రులు గొప్ప శ్రీకృష్ణభక్తులు. హాసములనుండి కొత్తపల రూపమున నృత్యముల కనువైన శబ్ద గోపికావేషము. ఈ కీర్తనలే తరంగములు. సముద్రగర్భ ప్రారంభిం ఒకటివెనుక నొకటి పొంగి అలలెల్లు పైకెగ యీ గ్లె యీ తరంగములలో భావరాగతాళములు అలలవోలె వ పైకెగయును. నారాయణ తీర్థులవారి శ్రీకృష్ణలీలాతరంగిణి ..తా కలిసిన ఒక నృత్యనాటకమే. కాని నర్తకులు దీనిని నాటకముగా ప్రదర్శింపనేరక వేర్వేరు తరంగములను గైకొని వేర్వేరు భంగుల నృత్యమాడుతున్నారు. తాళలయలందీ తరంగ నర్తకులు దిట్టలు. తరంగములందలి లయవిన్యాసములు, తాళపు విరుపులు మరింకే నృత్యపద్ధతి యందున గాని చూడలేము. తరంగనర్తకులు భక్త్యావేశముతో నీలమేఘశ్యాముని గుణగణములను కీర్తిస్తు నృత్యమాడుతుంటే లయబ్రహ్మమున వారు లీనమై ఆడుతున్నారా అన్న విస్మయము కలుగకపోదు.

## దశావతారములు

భామాకలాపమన్న నెంత ప్రీతియో, ఆంధ్రులకు, దశావతార నృత్యమన్న నంత అభిమానము.కావుననే పదివన్నెండు విధానములలో దశావతార రచనలు ఆంధ్రదేశమున ప్రచారమునందున్నవి. సాధారణముగ దశావతార నర్తన మెరుగని నర్తకుడుండడనుట అతిశయోక్తి కానేరదు.

జయదేవకవి వ్రాసిన దశావతారములు ఓఢ్రదేశమున గానము చేయబడినప్పటికీ, అస్సాంలోని ఓజ్‌పాల్ నర్తకులు తమ ప్రదర్శనములను దశావతారములతోనే ప్రారంభించినప్పటికీ తెలుగు దేశమున యీ నృత్యమునకున్న ప్రచారము మరెచ్చటను కాన్పించదు. శబ్ద సాహిత్యములతో కూడి పది అవతారములలోనూ ఆయారసములను పోషించే పదజాలముగల రచనావిశేషమే దశావతారములు.

## పగటివేషములు

దేవదాసీజనం ప్రదర్శించే నృత్యములు, భాగవతులు ప్రదర్శనా విధానములుకాక ఆంధ్రదేశమున పగటివేషముల పద్ధతికూడ ఒకటి ఉన్నది. ఈ పగటివేషములవారు పగటిపూటనే వేషములు కట్టి ఇంటింటికి వచ్చి విద్యను ప్రదర్శించి ద్రవ్యార్జన చేస్తారు. వీరెన్నెన్నో వేషములు కట్టెదరు కాని అన్నింట ప్రశస్తికన్నది "అర్ధనారీశ్వరము" ఇందు వేషగాడు వామభాగమును పార్వతిగాను, దక్షిణభాగమును శివునిగాను అలంకరించుకొని యీ రెండలంకారములమధ్య చిన్న తెరనమర్చుకొని ఒకభాగమును తెరయందు మూసి ఉంచుతాడు. శివపార్వతులకు సంబంధించిన పాటలు పాడును. శివునిపాట పాడినప్పుడు పార్వతి అలంకారమును తెరలో దాచి పురుషాభినయమును, పార్వతి పాటపాడినప్పుడు అతిచమత్కారముగ నాట్యమాడుతూ తెరతొలగించి పార్వతిగానే ప్రత్యక్షమై లాస్యమును ప్రదర్శించుట యిందు పరిపాటి. ఇది శివపార్వతుల ద్వంద్వైక్యనృత్యము.

## కేళికానృత్యము

ఇన్నితీరుల కూచిపూడి భరతాచార్యులు శాస్త్రీయకళా ప్రచారము కావిస్తున్న సమయములందు ఆస్థానములలో రాజనర్తకీమణులు ప్రదర్శించే కేళికానృత్యము అనేకమార్పులను పొందినది. ఆస్థానములలోని నట్టువరాండ్రు నృత్త నృత్యాభినయములను యక్షగానమును విరివిగా ప్రచారమునను తెచ్చినప్పటికి నృత్యనాటకము లాడుటయందే సంతృప్తి వహించలేదు. యక్షగానములందు నృత్త నృత్యములు ఆయా పాత్రల ననుసరించి ప్రదర్శింపబడుతవి.

కావున నర్తకుడు కొన్ని కట్టుబాట్లకులోనై ఉండవలసియుండును. కావున దరువులు, పదకేళికలు మొదలైన విశిష్ట సంగీత రచన లందు కూడా స్వేచ్ఛగా తమ పాండిత్యము ప్రదర్శించే అవ కాశము వారికి లేకుండెను. దానివలన, యీ నిబంధనలను దాటి భరతనాట్యమున తమ నేర్పరితనమును పండితులముందు ప్రద ర్శించే అవకాశము కల్పించగల ప్రత్యేక సంగీతరచనలు వారి కవ సరమైనవి. ఈ అవసరమును తీర్చేనిమిత్తము నాటి సంగీతవిద్వాం సులు, పండితులు, కవులు: స్వరపల్లవులు, శబ్దములు, జక్కిణి దరువులు, కేళికలు, చౌపదకేళికలు, దురుపదకేళికలు, పదకేళికలు, పదములు మొదలైన వివిధ రచనలు కావించినారు. స్వరపల్లవి, శబ్దపల్లవి, జతిస్వరము మొదలైన నృత్య విన్యాసములకు ఇవి అను వైన రచనలగుటచే నర్తకీనులకు కరణాంగహార తాళలయాదికము లందు గల పాండిత్యమును ప్రదర్శించుటకు ఉపకరించినవి. నాటి నుండియే "అడవు" సంప్రదాయము ప్రచారములోనికి వచ్చినది.

శబ్దములు దరువులు, జక్కిణి నృత్యమున కుపయోగపడు చున్నవి. ఈ రచనలు వర్ణనాత్మకములగుటచే నర్తకి ఆంగికాభి నయము (పాటయొక్క అర్థమును ముద్రలు, నృత్యహస్తములు, భంగిమలద్వారా ప్రదర్శించుట)ను ప్రదర్శించెడిది. కాని ఈ రచ నలు రసాభినయము, సాత్త్వికాభినయము ప్రదర్శించుట కంతగా పనికిరాలేదు. క్షేత్రయ్యపదకవిత యీ లోటును తీర్చినది. క్షేత్రయ్య పదములవలన ఆంధ్రదేశమున నృత్యకళకొత్త విన్యాసముతోపాటు వికాసమును రసాభినయమునకు ప్రచారమును లభించినవి. క్షేత్రయ్య పదములు రసాభినయానుకూలమైన అతివిలంబితలయలోనుండి నాయికానాయకుల శృంగారరసమునకు సంబంధించి సాత్త్విక సంచారీ భావములను ప్రదర్శించుటకు అనువుగా నుండుటవలన దేవదాసీగణము. ఆస్థాన నర్తకీమణులు వాటినభ్యసించిరి; తమ అభినయవిద్యను వృద్ధిపరచుకొనిరి. భాగవతమేళ నర్తకులుకూడ యీ పదములను తమనాటకములందు యెడనెడ ప్రదర్శిస్తు వచ్చి నారు. ఈ విధముగా ఆలయములలో నృత్తరూపమున ప్రారంభ మైన నృత్యకళ రాజదర్బారులందు నృత్త నృత్యాభినయములం దభి వృద్ధిచెంది సర్వాంగ సౌందర్య విలసితమైన ఒక సంపూర్ణ కళగా రూపొందినది.

ఆంధ్ర దేశములోని గణికల నృత్యకళను మూడు విధము లుగా చెప్పవచ్చును. (1) మేళములు. (2) మేజువాణి. (3) కేళిక లేక ఏకపాత్ర నాట్యప్రదర్శనము.

(1) మేళము: మేళమునందు పది పన్నెండుమంది నట్టువ రాండ్రు పాల్గొందురు. సంగీతమును, భరతమును చక్కగా నెరి గిన విద్వాంసురాలు యీ మేళమునకు నాయకురాలుగా నుండును. ఇందు సాధారణముగా మధ్యమకాల కీర్తనలకు నృత్త నృత్యములు ప్రదర్శింపబడును. ఈ మేళముల ఉత్సవములందును ఊరేగింపు లందును మాత్రమున యుక్తములు.

(2) మేజువాణి: ఇందు ప్రతి నట్టువరాలు నూతన ప్రజ్ఞా పాటవములను, పాండిత్యమును ప్రదర్శించుటకు అవకాశ మున్నది. శబ్దములు, సలాంజతులు, పదవర్ణములు, పదములు, శ్లోక ములు, పద్యములు ఇందు నృత్య మాడుదురు, అభినయింతురు. అభినయము మేజువాణీయందు చూడవలసిన ప్రత్యేక కళ. అలం కార, రస, భరత శాస్త్రములను కావ్య పురాణమును లెస్సగా నెరి గిన నాయకురాలు సాధారణముగా సభ యందు గజ్జెకట్టి అభిన యించును. సభ దీర్చియున్న పండితులు, రసికులు ఆమె పాండి త్యమును తరచి చూచుటకై ఎన్నో శాస్త్రములనుండి చిక్కు ప్రశ్నలను వేయుదురు. అన్నిటికీ సమాధానము చెప్పగల సమర్థు రాలే పదమభినయించుటకు సభలో గజ్జెకట్టును. ఇతర నట్టువ రాండ్రకా అవకాశము లేదు. మహా విద్వాంసురాలగు నాయకురాలు ఒక్క పదమును కొన్ని గంటల తరబడి దాని యందున్న సాత్త్విక సంచారీ భావములను, స్థాయీ భావమును ప్రదర్శించి పండిత హృదయములను రంజిల్లచేయును. కనుకనే మేజువాణి కేవల మొక వినోద ప్రదర్శనమే కాదు. పండితులకది విజ్ఞానపు విందు, రసికులకు పసందైన ఆహారము, విద్య నెరిగిన వారికి అభి నయావధి.

(3) ఏకపాత్ర నృత్యప్రదర్శనము లేక కేళిక ·
దీని నీనాడు స్థూలముగా భరతనాట్య ప్రదర్శన మంటున్నారు
కళ ముఖ్యముగా రాజదర్బారులందభివృద్ధి చెందినది. తం
కార్వేటి నగరము, కాళహస్తి, వెంకటగిరి, పిఠాపు
పురము, కొల్లాపురము, జయపురము, విజయన
మొదలైన సంస్థానాధీశుల పోషణలో యీ
క్షత్రియరాజుల ఆస్థానములందు పెం
ప్రభువుల పాలనలో వృద్ధికెక్కిన
కనబడుతున్నది. తంజావూరు.
పురం, విజయనగరం ము
పెద్దాపురం,విజయనగ
పురం, మాడుగుల
కును పదములా

ర్శించే జతివిన్యాసములు, అడవు విన్యాసములు, నృత్తపు పోకడలు కొంత మార్పుతో కనిపించుతవి. మన నృత్యములందు తెయ్యాడవు, ధితైయ్యాడవు. ఒద్దిక, జారు, మండె, దాటు, జిలుగు, జాతీర్జ, శబ్దకట్టు, కరణములను ఏవిధ రకముల అడవు విన్యాసములు విని యోగించబడుతవి. వీటి కలయికతో ఏర్పడిన విన్యాసము లాధారముగా జతులు, గతులు, తీర్మానములు, ముక్తాయింపులు ప్రదర్శించుతున్నారు. తెయ్యాడవు, ధితైయ్యాడవు, మండె, కరణ, జాతులు ఎక్కువగా దక్షిణ ప్రాంతమునందును, ఒద్దిక, జారు, దాటు, జిలుగు మున్నగు క్రమములు తూర్పు ప్రాంతము నందును ప్రచారములోనికి వచ్చినవి. శబ్దకట్టును మాత్రము సలాంజతులను శబ్దములను ఆడునప్పుడు అందరును ఉపయోగించు చున్నారు: జిక్కిణీని శబ్దములను, పేరిణిని ఆడునపుడుకూడ శబ్దకట్టు వినియుక్తమౌతున్నది.

ఈ కేళికా నృత్యమందు దొకే నర్తకి పాల్గొనును. నట్టువ (ఆచార్యులు) నృత్త నృత్యములందు కొనుగోలు చెప్పుచూ నర్తకిని ఆడించును. ఈ ప్రదర్శనము మేళప్రాప్తిలేక అలరింపుతో ప్రారంభమై జావళిలేక తిల్లానతో ముగింపబడును. అనగా నృత్తముతో ప్రారంభమై పదవర్ణమునందు పూర్తిగా నృత్యమునకు అవకాశము కలిపించి అభినయముతో నంతమగును. ఈ విధమైన శాస్త్రీయ పంథాలో అభివృద్ధిచెందిన నృత్య సంప్రదాయము మన దేశమున నిది ఒక్కటే కనిపిస్తున్నది. * ఈ కేళికా సంప్రదాయము నృత్త నృత్యాభినయాదులకు సమాన ప్రాతినిధ్యము నిచ్చి ప్రదర్శించుటకు వీలగు రీతిగా రూపొందింప బడినది.

తాళచిత్ర నృత్యము: ఇది మన నర్తకీమణులచే అభ్యస్తమైన ఒక ప్రత్యేక నృత్యరీతి. ఇందలి అడవు సంప్రదాయము కూడ సామాన్యముగా మనము చూచు నృత్యప్రదర్శనములందలి అడవులకు భిన్నముగా నుండును. సాధారణముగా నిందు అపూర్వతాళములందు వ్రాయబడిన కౌస్తుభములు నృతమాడుదురు. నృత్యమాను నర్తకి పాదములకు పారాణి పూసుకొనును. కౌస్తుభము ముగించువేళకు ఏ దేవతనుగూర్చి ఆ కౌస్తుభము నృత్యమాడబడినదో ఆ దేవత మూర్తి రంగస్థలముపై చిత్రింప బడి వుండును.

ఈ విధముగానే భాగవత నర్తకులుకూడ తమ నృత్యములందు పళ్ళెరము నిండుగా పిండిపోసి అంచులపై నిలువబడి నీరు తొణకకుండ తాళలయ ననుసరించి నృత్యమాడుట. తలపై నొక ఘట ముంచుకొని అది పడకుండ నృత్య మాడుట, కుండపై నర్తించుట, నాల్గైదు బిందెలను దొంతరగా తలపై నిడుకొని అవి పడకుండ ఒక చేత తాళమువేస్తూ మరొక చేత తంబుర మీటుతూ పాడుచూ నృత్యమాడుట మున్నగు ఎన్నో సంప్రదాయములను ప్రచారమునకు తెచ్చినారు.

ఈ నృత్య రీతులే కాక ఆంధ్రదేశమున తోలుబొమ్మలాట, బొమ్మలాట కూడ విరివిగా ప్రచారమున కలవు. తోలుబొమ్మలాట చాల పురాతన కళ. ఇది క్రీ. పూ. శాతవాహనుని కాలమునందే మనదేశమున ప్రచారములో నున్నట్లు తెలుస్తున్నది.

## పంచరత్న ప్రబంధము

క్రీ. శ. 1687_1711 సంవత్సరాలమధ్య తంజావూరు పరిపాలించిన శహాజీ మహారాజు పంచరత్న ప్రబంధమును రచించినాడు. సుమారు మూడువందల సంవత్సరముల క్రిందట సంస్థానములందు అభివృద్ధి చెందిన కేళికానృత్య సంప్రదాయమును వివరముగా తెలుసుకొనుటకు యీ పంచరత్న ప్రబంధము ఉపకరించు

---

* భరతనాట్య ప్రదర్శనమును కాంచునప్పుడు పదవర్ణము, పదమునందలి విన్యాసములనుగూర్చి తెలిసికొనుట కొంత అవసరము. పదవర్ణమునందును పదములందును వివిధ సంచారీ భావ ప్రదర్శింప బడును. పదవర్ణము నృత్య ప్రాధాన్యముగల వర్ణము నందు వివిధ సంచారులను కవి చక్కని పదజాలముచేత వర్ణభావములు నృత్య. హస్తములతో ప్రదర్శనందట్లు కాక చాల తక్కువ మాటలతో పద ...ను ధ్వని రూపమున యిముడ్చుటచే ఆంగి ...ము. సాత్త్వికాభినయమున కధికావకాశము ... నృత్యములందు నర్తకులు కొన్ని ... వున్నది. పదమందట్లుకాదు; ...భినయ ప్రదర్శనమునకు దృష్టిలో ఉంచుకొని ...వకాశ మేర్పడి

తుంది. విజయ రాఘవుని రచనలవలన * దాదాపు ఇరువదిరీతులకు మించిన కేళికా సంప్రదాయ నాట్యములు రాజదర్బారుల్లో ప్రచారమునందున్నట్లు తెలుస్తున్నది.

చంద్రశేఖరకృతమై ఆంధ్రలో విరివిగా ప్రచారమునందున్న "భరత సారసంగ్రహము"నందు 1. శృంగార, 2. ఉగ్ర, 3. శృంగి, 4. చిత్ర, 5. చారి, 6. చారీయ, 7. శుద్ధ, 8. హస్త చారీయ, 9. మార్గ 10. అంగహార, 11. పాదచారి, 12. పార్శ్వక, 13. ముఖచారీయ, 14. లావణి, 15. పేరిణి, 16. దేశి, 17. లీల, 18. తాండారిక, 19. సంధి, 20. ప్రాంత, 21. భూచారి, 22. ఆవృత్త, 23 విద్యుద్భ్రమర, 24. పుష్పాంజలి, అను నాట్య భేదాలు కనిపిస్తున్నవి. ఇందు శుద్ధ, దేశి యను రెండురీతులనూ మంగళప్రదములుగు నాట్యములని చంద్రశేఖరుడు వ్రాసినాడు.

శహాజీమహారాజు తన కాలమునాటికి ప్రచారములోనున్న నృత్య రీతులనిటిని క్రమముతప్పక ప్రదర్శించే రీతిననుసరించి వివిధనర్తకులచే ప్రదర్శింపచేస్తూ పంచరత్న ప్రబంధము రచించి నాడు. ఇందు ఐదుగురు నాట్యకోవిదులు సంప్రదాయముల ననుసరించి తమ విద్యను వేర్వేరు రీతులలో ప్రదర్శించుతారు. అందుకే దీనిని పంచరత్న ప్రబంధమన్నారు.

(1) విరుదు మిటారులు, (నర్తకీమణులు). (2) నవసిద్ధ యోగి (3) చెంచువాడు, (4) విరుదుబంటు, (5) సాధనకాంధ్రు అను ఆయిదుగురు కళావేత్తలు తమ తమ సంప్రదాయముల ననుసరించి ప్రబంధపద్ధతిని పరమేశ్వరుని ఎదుట నృత్యమొనర్చి మెప్పును పొందుతారు. స్వర, బిరుద, పాట, తెన్నక, శబ్ద, తాళము లను ఆరు లక్షణములు కలిగినట్టిది ప్రబంధమనబడుతుంది. సంగీత శాస్త్రములో యీ ప్రబంధముల ప్రస్తావన విపులముగా ఉన్నది. ఇందలి విరుదుమిటారుల నృత్యప్రదర్శన విధానమును సమగ్రముగా పరిశోధించినచో ఆ కాలములో కేళికావికాసమునుగూర్చిన పలువిషయములు, విశేషములు తెలియగలవు. దాదాపు నూటయేబది సంవత్సరములక్రిందట చిన్నయ్య, పొన్నయ్య, వడివేలు, శివానందం అను నాట్యాచార్యులు యీనాడు భరతనాట్యమనుపేరుతో ప్రచారమందున్న నృత్యమునకు ఒక క్రమమును ఏర్పరచినట్లు తెలిసినవిషయమే. కాని అంతకుపూర్వము సంస్థానములలోని నృత్యమేవిధముగా పెంపొందినదో తెలుపుటకు తగిన ఆధారములు మనకు కనిపించుటలేదు.

తంజాపురి నాయకరాజుల కాలమునుండి యీ నాటివరకూ కేళికా విద్య అభివృద్ధిచెందిన పద్ధతులను గూర్చి తెలుసుకొనుటకు పంచరత్న ప్రబంధ పరిశోధన ఉపకరించగలదు. ఈ ప్రబంధరచనలోగల జతి కట్టుబాట్లు, చిట్టాల శబ్దములు, స్వరంపోకడలు అప్పటి నృత్యకళా విన్యాసములను గూర్చి తెలుపగలవు. ఇప్పటి భరతములోని జతుల కొలిపింపునకు యిందలి శబ్దములకు చాల వరకు భేదము కనబడుతున్నది గాని భాగవతనర్తకులు యీ క్రమమునే యీ నాటికి అనుసరించుతున్నారు. నాటి నర్తకీమణులు పుష్పాంజలితో ప్రారంభించి పలాందరువు, సొల్లు, నెలకట్లు మొదలైన నృత్తనృత్య విశేషములను ప్రదర్శించి పదముతో ముగించేవారు. ఇది కొంతకాలమునకు పదవర్ణము, పదమునకు ముందు నృత్యమాడి జావళితో ముగించు సంప్రదాయము ప్రచారమునకు వచ్చినది. వెంకటగిరి మొదలగు ఆస్థానములందలి నర్తకీమణులు మొన్న మొన్నటివరకూ యీ సాంప్రదాయమునే అనుసరించినారు. ఆలయప్రదర్శనమును కౌతముతోను, దర్బారు ప్రదర్శనమును మేళప్రాప్తి అను నృత్తవిశేషముతోను ప్రారంభించేవారు. ఈ మేళప్రాప్తిలో పల్లవిగా దైవస్తోత్రమైన రామదాసుకీర్తన "జయ జానకీ రమణా, జయవిభీషణశరణా" అను కీర్తనకు (నాట రాగము, ఝంపె తాళము) జతులుకట్టి విచిత్రకములైన అడవులను ప్రదర్శించేవారు. వడివేలు మొదలైన తంజాపుర నాట్యాచార్యులు మరొక మెట్టు పైకిపోయి, ఖండగతియందున్న పల్లవికాక త్రిశ్రము, మిశ్రములందు స్వరశబ్దములతో పల్లవులను జతులను ఏర్పాటుచేసి అలరింపునకు ఒక స్వరూపము నిచ్చినారు. అలరింపుతో ప్రదర్శనమును ప్రారంభించిన నర్తకి నృత్తమును చక్కగా ప్రదర్శించుటకు అనువుగా జతి స్వరములకు నృత్తము ఆ పిమ్మట పదవర్ణము, పదములను ఆడినతరువాత తిల్లానా ముగించుక్రమమును యీ నాట్యాచార్యులు రూపొంది మనకు తెచ్చినారు. నేటికినీ శాస్త్రీయ భర

* అప్పుడు ప్రచారములో నున్నట్లు తెలుస్తున్న నృత్య రీతులు ఇవి : 1. చౌపదకేళిక, 2. దురువద, 3. జక్కిణి, 4. కేతము, 5. పేరిణి, 6. దేశి, 7. కొరవంజి, 8. మదనఫల దూత్యము, 9. కందుకక్రీడ, 10. గుజ్జరి, 11. దండలాస్య, 12. కోపు, 13. దురుపైవకోపు, 14. చిందు, 15. వాల్చిలి, 16. విప్వేదు, 17. గుజరాతిదేశి, 18. ఉభలీల, 19. పదకేళిక, 20. నవపదము మున్నగునవి.

రూపముననే ప్రాచుర్యము కలిగిఉన్నది. ఈ స్వరూపము సంపూర్ణమైనది. కావున చిరకాలము మనగలదని ఆశించుదాము.

మహారాష్ట్ర ప్రభులైన శహాజీ, శరభోజీ, తుందోజీ మున్నగు వారు నాయకరాజుల తర్వాత యక్షగాన కళను పోషించినవారిలో ముఖ్యులు. ఇంతకు ముందు చర్చించిన పంచరత్న ప్రబంధమనే కాక విష్ణు పల్లకిసేవాప్రబంధము, శివ పల్లకిసేవా ప్రబంధములను గాన ప్రాధాన్యముగల యక్షగానమునుకూడ రచించినాడు శహాజీ ప్రభువు. ఈ పల్లకిసేవాప్రబంధములు అభినయమునకు ఎక్కువ ఉపకరించురచనలు. ఇవి మిక్కిలి లలితముగానుండి రసభావములను ప్రదర్శించుటకు అనువైనవి.

## వివిధ నృత్యరీతులు

### అష్టపదుల అభినయము

అష్టపదులను పాడుతూ నృత్యమాడు పద్ధతి వైష్ణవమత సంప్రదాయము విరివిగా ప్రచారమందున్న ప్రాంతములన్నింటా కనిపిస్తున్నది. అష్టపదులను నృత్యమాడుటేకాక ఆంధ్రదేశమందలి నర్తకులు వాటికి అభినయము పట్టుదురు. అభినయమున ఆంగిక ప్రాధాన్య విధానము సాత్త్విక ప్రాధాన్య విధానము కలవు. ఈ రెంటినీ ఒకటివెంట నొకటిగా ప్రదర్శించు సంప్రదాయ మొకటి ఆంధ్రదేశ నర్తకులు అభివృద్ధికి తెచ్చినారు.

"ధీరసమీరే యమునాతీరే వసతివనే వనమాలీ" అనే అష్టపది ఉంది. అభిసారికయైన రాధకు దూతిక చెప్పిన మాటలివి. దూతిక అభిప్రాయముతో ప్రదర్శనము ప్రారంభించబడుతుంది. "ధీరసమీరే యమునాతీరే -" అష్టపది పాడుతూ అందున్న అర్థమునకు సరిపోవు హస్తములను ప్రదర్శిస్తు అర్థమును స్ఫురింపజేయుటే ఆంగికము. వెంటనే నర్తకి తానే నాయికయై చెలికత్తె చెప్పేమాటలకు రాధపొందే ఆనందోత్సాహ వేగాది భావములను ప్రదర్శిస్తుంది. ఇది సాత్త్వికము. మళ్ళీ చెలికత్తెగా "గోపీ పీనపయోధరమర్దన" అని పాడుతూ అర్థమును ముద్రాప్రాధాన్యమగు హస్తాభినయముతో ప్రదర్శించుతుంది. ఆ పిమ్మట తిరిగి రాధగా చెలివచనములు విన్నప్పటి ఆమె మనస్తత్వము (చింత, దైన్యం, ...గ్య మొదలైన సంచారులను) సాత్త్విక ప్రాధాన్యముగా నర్తకి ...ది. ఈ విధముగా వరుస వెంబడి ఆంగిక సాత్త్వికాభి...ంచే సంప్రదాయము ఆంధ్రదేశమున కలదు. ...లలోనే ప్రదర్శించు టాచారము.

రాగ, తహన, అభినయములను నృత్యరీతులుకూడ ఉన్నవి. పదముగాని కీర్తనగాని లేకుండా ఒక రాగమును మాత్రమే వీణపై వైణికుడు వాయిస్తుంటే ఆ ధ్వని ననుసరించి ఆయా రసములను అభినయించుట, అట్లే తహనమునకును రసాభినయము ప్రదర్శించుట—వీటి స్వరూపము. ఈ అభినయమును అర్థమొనరించుకొని ఆనందించగలవారు చాల తక్కువగా ఉంటారు. కావున ఆస్థానములందే యీ విద్య ప్రదర్శన యోగ్యతను పొందింది.

### చర్మకట్టు

సుమారు పది పదునైదుగురు శృంగనాదం, భేరి వాద్యములు వాయించేవారు: మరో పదిపదునైదుగురు సౌనాయి పాటకులు; వీరు ఈ చర్మకట్టు పద్ధతిలో పాల్గొంటారు. రావణాటకు రెండుప్రక్కలను యీ రెండు జట్టులూ ఎదురెదురుగా నిల్చి చౌకవర్ణములు వాయిస్తున్నప్పుడు శ్వేతాంబర ధారిణులైన యేబది అరువదిమంది నర్తకీమణులు బారులు దీరి ఆ జట్టుల మధ్య నిలువబడి నాట్యాచార్యుడు వేసే తాళమునకు అనుగుణముగా నాట్యమాడుతారు. సౌనాయి పాటకులు అతివిలంబిత లయలో పల్లవి వాయిస్తారు. శృంగ, భేరివాద్యముల జట్టు ఆ లయలో ప్రారంభించి పల్లవి ముగిసేలోగా త్రికాలమూ వాయించి జాగాకు వత్తురు. నట్టువరాండ్రు ఆ పల్లవి సాహిత్యమునకు ప్రథమమున ఆంగికాభినయము ప్రదర్శించి ఆ పిమ్మట తాళ లయానుసారము త్రికాలములలో పలికేవాద్య సంగీతము ప్రకారం సామూహిక నృత్యం ఆడి తీర్మానించేవారు. ఈ పద్ధతిని చర్మకట్టు అంటారు. రెండుమూడు దశాబ్దాల క్రితంవరకూ వెంకటగిరి సంస్థానమునందు దేవుని తిరునాళ్ళలో తిరువీధుల ఊరేగింపు సమయమందు యీ నృత్యము ప్రదర్శించే ఆచారము ఉండేది.

### మండూక భరతము

ఆనందగజపతి మహారాజుల కాలమున వ్రాయబడిన ఒక అపూర్వ రచనావిశేషమే మండూక భరతము. ఇందు అంకిత చరణముకాక మూడు చరణములున్నవి. మొదటి చరణములో వర్షాగమ సూచనము కలదు. మేఘావృతమైన ఆకాశమును చూచి వర్షము పడునని మండూకములు ఆనందమును వెలిబుచ్చుటను తెలుపు శబ్దముల కూర్పు ప్రథమచరణమున కలదు. రెండవచరణములో ఝుం ఝూ మారుతమును తెలుపు శబ్దకట్టు, మూడవ చరణ

మున వర్షపు హోరును తెలుపు ధ్వనులు కూర్చారు. ప్రథమచరణ శబ్దములకు వివిధరకములైన "మండె అడవులు" ప్రదర్శిస్తారు. (మోగాళ్ళమీదకూర్చుండి ప్రదర్శించే అడవులకు మండి అడవు లంటారు) రెండవ చరణమునకు భ్రమరములతో కూడిన నృత్యము. ఇది సుడులు తిరుగుతూ మారుతపు ఉద్ధృతమును తెలుపు నిమిత్తం చేస్తారు. మూడవ చరణము హస్తాభినయముతో ప్రదర్శిస్తారు. ఆకాశమునుండి వెండితీగలవలె భూమి మీదపడు వర్షధారలను తెలుపుటకు వివిధరకముల హస్త చాలనములను యిందుకు ప్రదర్శిస్తారు. ఇది మండూక భరతము.

చక్కగా తాళలయల ననుసరించి యీ రచనను పాడుతూ నృత్యము చేసినచో మండూక ఘోష, వాయువేగము, వర్షపుహోరు మున్నగు దృశ్యములన్నియూ కన్నులకు కట్టినట్టుండును. ఇదొక ఆనంద ప్రదమైన భరత విశేషము.

### హరికథ

మనపు అనుదినమూ ఆలయములో పూజానంతరము పురాణ శ్రవణకాలక్షేపము ఉండేది. సంస్కృతాంధ్ర సంగీత పండితులగు వారు భారత భాగవతరామాయణాది పురాణేతిహాసములను గానంచేస్తూ అర్థమును ప్రజలకు సుబోధకమైన సులభ పదములతో విపులపరిచేవారు. వీరే పౌరాణికులు. పౌరాణికులు ఒకచోట కూర్చుండి యీ పురాణ పద్ధతిని వినిపించేవారు. మరికొంత కాల మునకు యీ కాలక్షేపములను మరికొంత ఆకర్షణీయములుగా చేసేందుకు పౌరాణికులు నిలువబడి గాథలను రాగ తాళయుక్తముగా వ్యాఖ్యానించుట ప్రారంభించినారు. దీనికి కొంత నృత్యము కూడ జతపరచ బడేది. వినోదముకొరకు చిన్న చిన్న పిట్టకథలను చెప్పించి హాస్య రసమును కూడ పౌరాణికులు పోషిస్తు యీ కాలక్షేపములకు ఒక కళాస్వరూప మేర్పరచినారు. ఇప్పుడీ కాలక్షేపములను హరికథలనీ, పౌరాణికులను హరిదాసులనీ అంటున్నారు. ఈ విధముగ హరికథా కాలక్షేపములను కళగా రూపొందించి ఆరాధించినవారిలో ముఖ్యులు కీ. శే. శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారు. వీరు బహుభాషా పండితులు, సంగీత విద్వాంసులు, లయబ్రహ్మ, భరతాచార్యులు, గొప్పకవి. నారాయణదాసు గారికి తెలియని విద్యలేదు. తమ రచనలద్వారా హరికథా కాలక్షేప ములకు ఒక రమణీయమైన సంప్రదాయమును సిద్ధపరచి వీరు చరితార్థులైనారు.

## జానపద ఆరాధనా నృత్యములు



నృత్యకళ కొన్ని ప్రత్యేకపు తెగల వారిచే అత్యున్నతమైన పాండితీ ప్రకర్ష కనువైన కళగా రూపొంది ప్రతిభావంతులచే ప్రదర్శింప బడుతూ వచ్చినందున యితర తరగతులకు చెందిన స్త్రీ పురుషులు పండుగ పబ్బములందొకచోట కూడి ఆనందముగా వినోదముగా ప్రొద్దు పుచ్చుట కొరకు తాముకూడ కొన్ని నృత్యముల నేర్పరచుకొన్నారు. వీటినే జానపద నృత్యము లంటారు యీనృత్యము లెక్కువ కష్టమైనవి కావు. ప్రత్యేక సాధన అవసరముకాదు. ఎల్లరూ పాల్గొనుటకు వీలైన బహుసులభ పద్ధతిలో యివి ఏర్పాటైనవి. అందుకే పల్లెల్లోని ప్రతివారూ వీటిలో పాల్గొన గలుగుతున్నారు. గొబ్బి, కోలాటము, బతకమ్మలాట, చిరుతల భజన, తప్పెటగుంటు మున్నగునవి యీ పద్ధతిలోనివే.

గొబ్బి : ధనుర్మాసములో ఆంధ్రదేశమున బాలికలు వీధి గుమ్మముల ముందు చిత్ర విచిత్రములగు ముగ్గులను వేసి అలంకరించి, గోధుమపిండి చిన్న కందుకముల పై ప్రమాణమున ముద్దలు చేసి, పసుపు కుంకుమలు, పుష్పములతో వాటిని శృంగారించి, పూజించి, ధూపదీపనైవేద్యాదికములు కావించి, రంగవల్లు లందలంకార ప్రాయముగా వాటినుంచి, అందరూ కూడి చుట్టూ తిరుగుతూ పాటలను (వీటినే గొబ్బి పాటలంటారు.) పాడుతూ ఆడుతారు. ధనుర్మాస మంతనూ యీ గొబ్బిదేవత పూజకే బాలికలు గడుపుతారు. దీనికే గొబ్బియాట అనిపేరు.

బతకమ్మలాట : దేవీనవరాత్రోత్సవ సమయమునందు బతకమ్మ పూజను స్త్రీలు జరుపుతారు. ఈ ఆచారము తెలంగాణ ప్రాంతము నందున్నది. వివిధరంగులుగల పుష్పములను గోపురాకారమున పేర్చి వీధిగుమ్మమును ముగ్గులతో నలంకరించి అచ్చట నుండి పుష్ప శిఖరమును పూజించి స్త్రీలందరూ గుమిగూడి బతకమ్మ పాటలను పాడుతూ తాళయుక్తముగ చప్పట్లు చరుస్తూ వలయాకారముగ తిరుగుతూ నృత్యమాడుతారు. ఈ రీతిని తొమ్మి దినములు దేవిని సేవించి ఆరాధించి పదవరోజున చల్లని పూజతో ముగిస్తారు. ఈరోజు ఉత్సాహముతో పేర్చేపూలు మనిషి యెత్తునకూడ

పూజానంతరం పుష్పకలశమును నీట వదలుతారు. ఇదొక విధమయిన గౌరీదేవ్యారాధనగా పేర్కొనవచ్చును.

కోలాటకోపులు : కోలాటము వేయునప్పుడు వివిధ రకముల గతులకు చెందిన పాటలు పాడుతూ అందుకు తగిన విధముగా నృత్యమాడుటకు 'కోపు' అనిపేరు. కోలాట నృత్యము మ స్త్రీలు, పురుషులుకూడ చేస్తారు. కోలాట విద్యలో నిపుణులైనవారు తెలంగాణ ప్రాంతమునందలి కరీంనగర్ జిల్లాలో ఉన్నారు. వ్యవసాయవృత్తి యందున్న రైతుపురుషులు యీ కోలాటములందు పాల్గొంటారు దినమంతా కష్టించి చేలలోపనిచేసి సంధ్యావేళకు యింటికిజేరి భోజనాదులు ముగిసిన పిమ్మట వినోదించుటకు ప్రారంభించే ఆటలలోనిదే కోలాటము. సుమారు నలబది యేబది రకముల కోపులను తెలిసినవారుకూడ కరీంనగర్ జిల్లాలో ఉన్నారు.

తప్పెటగుండ్లు : గుండ్రముగా టిన్ను రేకుతో చేయబడిన చిన్నచిన్న తప్పెటలను మెడలందు ధరించి పాడుతూ ఆ పాట ననుసరించి తప్పెటల మీద తాళలయగతులను ప్రదర్శిస్తూ వలయాకారముగా తిరుగుతూ నృత్యమాడుతారు. పురుషులు మాత్రమే యీ నృత్యమున పాల్గొంటారు. అమ్మవారి కొలుపులందు ముఖ్యముగా ఈ తీరు నృత్యములు కనిపిస్తవి. వీరు విశాఖ జిల్లా యందెక్కువగా ఉన్నారు.

జోగాట తెలంగాణప్రాంతములో హరిజనుల తెగవారి యందు జోగువారను ఒక నర్తకులశాఖ వారున్నారు. డప్పుల వాద్యము నాధారము చేసుకొని వారు నృత్యమాడుతారు. ఈ శాఖ వారిలో ఎవరైనను మరణించినచో శ్మశాన వాటికకు తీసుకుపోతూ జోగాట నాడుట పరిపాటి. వీరి నృత్యములన్నిటి లోనూ పిండోత్పత్తి క్రమమును తెలుపు నృత్యములు ప్రత్యేక పరిగణనీయములు. జీవుడుమాతృగర్భమున బిందురూపమున ప్రవేశించినది మొదలు వివిధ మాసక్రమమున పిండము పెరుగువిధానము, ప్రసవము, అటుపై జీవితమునందలి వివిధ ఘట్టములు జోగువారు నృత్యరూపమున ప్రదర్శిస్తారు. ఇట్టి క్రమమే మనకు గొల్లకూపము వందుకూడ కానవచ్చును.

వీరనాట్యము : ఆంధ్రదేశమున వీరశైవము విరివిగా కాలమునందు ఆలయములందు దేవదాసీల శివభక్తులు తాండవ పద్ధతికి చెంది వీరావేశము కలిగించు నాట్యమునుకూడ చేసేవారు. వీరరస ప్రధానము లగు రచనలనూ 'ఖడ్గములను' చదువుతూ వీరొకచేత ఖడ్గమును మరొకచేత డాలును ధరించి నృత్యమాడేవారు. దీనికే వీరనాట్యమన్నారు. ఈ నాట్యము యుద్ధనాట్యములను పోలివుంటుంది.

వీరులకొలుపు : ముఖ్యముగా పల్నాటి యుద్ధమున వీరస్వర్గమలంకరించిన ఆంధ్రయోధుల సంస్మరణార్థము యీ వీరుల కొలుపు ప్రారంభమైనవి. ఇందులో ప్రదర్శింపబడే ఆరాధనానృత్యములుకూడ తాండవపద్ధతికి చెందినట్టివే. కార్యమపూడి. మాచెర్ల, గురజాల మున్నగుచోట్ల పల్నాటి తాలూకాలో ఈ వీరులకొలుపు లీనాటికి ప్రతియేటా జరుగుతుంటాయి.

సేవ : ఇత్తడిరేకులతో చేసిన పెద్ద పెద్ద తాళములను చేత ధరించి సింహాచల నృసింహస్వామిని కీర్తిస్తు నెమలికుంచి యను చేపట్టి నాయకుడు 'నాయ' చెప్పుతుంటే అందరు కలిసి పాడుతూ వలయాకారముగా తిరుగుటా చేసే నృత్యం, సేవ దీనినే సింహాద్రి అప్పన్న సేవ అంటారు.

"హరి హరీ నారాయణాదినారాయణో

కరుణించి మమ్మేలు కమలలోచనుడా" అనునది ఈ సేవలో చెప్పబడే 'నాయం' పద్ధతిలోనిదే

గరగలు : దేవీనవరాత్రములందుగాని, అమ్మవారి జాతరలోల పంచశిరస్సుల నాగుతోడను, రంగురంగుల వస్త్రములతోడను అలంకరింపబడిన కిరీటములను శిరముపై ధరించి డప్పుల వాద్యమును అనుసరించి చేసే భక్తిరస ప్రధానమైన నాట్యములనే గరగ నృత్యము లంటారు

ఇవన్నీ జానపద నృత్యములలోని ఆరాధనా విధానములను తెలుపు రీతులు.

అశ్వనృత్యము : అశ్వనృత్యము గుంటూరు జిల్లాలో ఎక్కువ ప్రచారము కలదు. పల్లెప్రజలకు ఈ నృత్యపద్ధతి ఉత్సాహప్రదమైన వినోదము. గుర్రముల బొమ్మలను తయారుచేసి వాటికి మెరుపురంగులను పూసి చిత్రించి, ఆబొమ్మ గుర్రములమీద స్వారి చేస్తున్నట్లు తోచుటకు ఆ బొమ్మలోనుండి నడుము భాగమువద్ద నుండెడి రంధ్రద్వారా పైకి వచ్చి నర్తకులు స్త్రీ పురుష వేషధారులై ప్రేమగాథలను నృత్యమాడుట దక్షిణదేశంలో ఒక వినోదకళగా ప్రచారములో నున్నది. ఆంధ్రప్రాంతమున సజీవమైన గుర్రంచేతనే

నాట్యమాడిస్తారు. తాళలయల ననుసరించి ముక్తాయింపులను సైతము కాళ్ళతో పలికించు విధముగా గుర్రములకు శిక్షణ గరిపి, ఆ గుర్రముల ముంగాళ్ళకు గజ్జలు కట్టి, గుర్రములను కనువిందుగా నలంకరించి, ప్రక్కన వర్తకి ఆడుతున్నప్పుడు నటుడు పాడుతున్నప్పుడు వాద్య సంగీతము ననుసరించి గుర్రములచే నృత్యము చేయిస్తారు. ఈ నృత్యములను వివాహసమయములందైనను ఇతర ఉత్సవ వేళల యందైనను వినోదమునకుగాను ఏర్పాటు చేయుట అలవాటు. పల్లెలలో ప్రతి మోతుబరి రైతువకూ యిటువంటి ఆటగుర్రము ఉంటుంది. జానపదులందీ గుర్రపు ఆట పట్లగల ఉత్సాహము మెండు.

బుర్రకథ లేక జంగముకథ : ఇది నాట్యమేళ సాంప్రదాయములోని యొక అతిముఖ్యమైన శాఖ. ఈ పాటకుడు తంబురను చేతబూని వ్రేళ్ళకు తగిలింపబడియున్న కంచు కడియాలతో తాళము వేయటం, ఇరు ప్రక్కల నున్నవారు గుమ్మటలు వాయించుచు వంతపాడగా పల్నాటి వీరకథ, బొబ్బిలికథ, బాలనాగమ్మకథ, మొదలైన కథలను గానముచేయుచు మధ్య మధ్య రసభావముల పోషించుటకుగాను నాట్యమాడుచు కథను చెప్పుదురు. ఇది ఒక ప్రచారకళ. — సాధారణముగా కోస్తాజిల్లాలలో జంగమవారును, హైదరాబాదులో పిచ్చగుంట్లవారు ఈ కథలను చెప్పుదురు. ఈ పాట పాడునప్పుడు ప్రతిపాటను చివరను తందాన అను మాటల పాడి ముగించుటచే దీనికి తందానపాట అనికూడ పేరు గలదు. ఇది ఒక అతిప్రాచీనమైనకళ. —నేటికాలమున ఈ విద్య గొప్ప ప్రచార సాధనముగా నుపయోగపడుచున్నది. అనేక రాజకీయ పార్టీలకు చెందినవారు, విద్యావంతులుగూడ, ఈ బుర్ర కథ అను తమ ప్రచారమునకుపయోగించు చున్నారు ఈ బుర్రకథ యెంత ప్రజారంజితమగు విద్యగా తయారైనదనగా — ఒక్కొక్క సమయమందు కొందరు ప్రఖ్యాత కథకుడు చెప్పు కథలను వినుటకు వేలకొలది జనము గుంపుగూడి విని యానందించుచున్నారు.

జముకుల కథ : కుంచము అకారము గలిగి అడుగు భాగముతో కప్పబడి దాని మధ్యనుండి యొక నరమును బిగించి లోపలివైపునకు లాగి, దాని చివరను ఒక కర్రముక్క ముడివైచి ఆ కర్రముక్కను ఒకచేతితో బిగించి పట్టుకొని శృతి బద్ధముగా దానిని లాగుచు రెండవచేతితో ఆ నరముపై తాళ గతులను పలికించుచు వీరగాధలను పాడుచు కాలిమువ్వలను పలికించుచు నవరసంబు లొలుకునట్లు నాట్యమాడువారే జముకుల కథకులు. అటుల వారు వాయించు వాద్యములకే జముకులనిపేరు.

పాండవులవారు: హైదరాబాదు ప్రాంతములందు పాండవుల వారను నొక తెగవారున్నారు. వీరి స్త్రీలు, పచ్చబొట్లు పొడిచి ద్రవ్యార్జన చేయుదురు. పురుషులు పంచపాండవులకు సంబంధించిన భారతగాధను గానముచేయుదురు. వీరు పంచపాండవ వరంపరకు సంబంధించిన వారట, గనుక వారు పాండవులకు సంబంధించిన కథలు తప్ప, ఇతర కథలను గానముచేయరు.

## సయ్యాంవారి మార్కండేయ పురాణం

మార్కండేయ మహర్షి 'పద్మసాలీ'లయొక్క మూలపురుషుడు. ఆ మహావీరుని జీవితమును వర్ణించునట్టి గానమును సయ్యాంవారు చేయుదురు.

సయ్యాంవారు పద్మసాలీలపై ఆధారపడి జీవించే ఒక ప్రత్యేక తెగ. వీరు అరణ్య ప్రాంతములందు నివసించుచూ సంవత్సరమునకొకసారి పల్లెలకు పట్టణములకు వచ్చి ప్రతిపద్మసాలె కుటుంబమునకు అతిధులుగా నుండి వెళ్ళుదురు. వీరు పద్మసాలీలయొద్ద తప్ప యితరులయొద్ద భోజనము చేయరు; యాచించరు. మద్దెలలు, నగారాలు, మొదలైన వాద్యములు సహాయముతో మార్కండేయ పురాణము గానము చేయుదురు.

## రొంజుల వాయిద్యము

రొంజులవారు విశ్వబ్రాహ్మణులపై యాధారపడినట్టి యొక తెగవారు. వీరు రొంజులు అను వాయిద్యముల సహాయమున విశ్వకర్మ పురాణము గానము చేయుదురు. వీరునూ సయ్యాంవారివంటి వారే.

## ఆటవికుల నృత్యము

ఆంధ్రదేశపు అరణ్యాలలో నివసించే కోయలు, చెంచులు, గోండులు, సుగాలీలు, గదబలు మొదలైనవారు చేసే నృత్యాలను ముఖ్యంగా మూడు విధాలుగా విభజింపవచ్చును—

ఆరాధనా నృత్యాలు, వినోదనృత్యాలు, ఋతువుల నృత్యాలు యివన్నీ బృందనృత్యములే. ఇందు అనేకమంది స్త్రీలు, పురుషులు పాల్గొందురు. కొన్ని కొన్ని నృత్యములందు ప్రత్యేకముగా పురుషులు, స్త్రీలు వేరువేరుగా చేయుదురు. మరికొన్నిటిలో స్త్రీ పురుషులు కలిసి పాల్గొందురు.

ఆటవికులనిత్య జీవితములో నృత్యమొక భాగము, ప్రతి ఋతువులో చేయుటకు వీరికి వేరువేరు నృత్యాలున్నవి. శిశువు పుద జుంచినప్పుడు నృత్యము, బారసాల సమయమందు నృత్యము, వధూవరులు ఒకరినొకరు ఎన్నుకొనునప్పుడు నృత్యము, ప్రణయ మందు నృత్యము, జీవయాత్ర చాలించి అంత్యక్రియలు జరుగు సమయమందులో నృత్యము. వరినారు నాటుటకు నృత్యము. ఆరం భములో పొలము దున్నునప్పుడు నృత్యము, పంటలు బాగుగా పండుటకు నృత్యము. కోతల సమయములో నృత్యము, కోతలైన తరువాత సంవత్సరకష్టఫలితముల నిల్లు చేర్చుకొనుటకు నృత్యము. అతిధులెవరైన వచ్చినప్పుడు వారి వినోదార్థము నృత్యము. సాగ నంపుటకు నృత్యము. ఇలా వారి జీవితమంతా వివిధ నృత్యఘట్టము లతో కూడిన ఒక నృత్యనాటికలా గడచిపోతుంది.

మనదేశంలో అతిపురాతనమైన తెగలకు చెందినవారు గోండులు వీరు చేయు నృత్యములన్నింటిలోను 'కర్మనృత్యము' ముఖ్యమైనది. ఈ నృత్యమును వీరు వర్ష ఋతువు ఆరంభంలో పంటలు బాగుగా పండుటకుగాను చేయుదురు.

ఇవ్విధంగానే, కోయలు, చెంచులు వారియొక్క అనేక నృత్యము లున్నవి.

## ముగింపు

ఆంధ్రదేశము అర్ధచంద్రాకారముగనుండి సుదీర్ఘమై సముద్ర తీరము కలిగినట్టి అతి విశాలమైన దేశము నేటికాలములో రాజకీయ వాతావరము ననుసరించి రాష్ట్రములు విభజింపబడినను పూర్వకాల మందు ఓఢ్ర దేశము మొదలు దక్షిణమున రామేశ్వరమువరకును అటుపై తూర్పు దీవులతోను ఆంధ్రులు సాంస్కృతిక బాంధవ్య ములు గలిగి యుండిరి. ఈ ప్రాంతములన్నిటియందునూ ఒకేవిధ మైన ఆధ్యాత్మిక చింతన, ఆరాధనాక్రమము, లలితకళలు పెంపు జెంది ప్రచారములోనికి వచ్చినవి. తెలుగుదేశము సువిశాలమైన ప్రదేశమగుటచే అనేక మండలములందు అనేక ఆస్థానములందు భాషయొకటియే అయినను ఆయా ప్రభువుల కళాభిరుచులను, ప్రజల ఆదరణము ననుసరించి నృత్య సంగీతములు అభివృద్ధి చెంది నను అందరకునూ ఆధారమైన శాస్త్ర మొక్కటియే అయి ప్రాంతముల ననుసరించి వేరువేరు సాంప్రదాయములు దేశమునకంతకును ఒకే సాంప్రదాయము మనకు తోచినను, అనేక శాఖోప శాఖలుగ నృత్యకళ, నృత్య, నృత్త, అభినయాదుల లోతులను సంపూర్ణంగ తరచిచూచి అందలి రత్నరాసులను ఈ వివిధ సాంప్ర దాయములు కళాకారులు మనకు అందించిరి. ఇట్టి కళాభివృద్ధి మన కెంతయో లాభకరమైనదని పేర్కొనవచ్చును. ఇట్టి యభివృద్ధి వల్లనే భారత దేశమందలి శాస్త్రీయ సంప్రదాయములన్నింటియందు నృత్తనృత్య అభినయాదులయందు మనకళయే పరిపూర్ణ వికాసము చెందినదని చెప్పవచ్చును. ఇట్టియపూర్వకళాసంపదను మనపూర్వులు శాతవాహనుల కాలమునుండి అభివృద్ధి పరచి మనకు అందించిరి, గానీ దురదృష్టవశాత్తు సుమారు 3, 4 దశాబ్దములనుండి రాజ కీయ, ఆర్థిక, సాంఘిక సంబంధమగు కారణములవల్ల శాస్త్రీయ కళలపై ప్రజలకు ఆదరణ తగ్గినది. దేవదాసీలు నృత్యకళారాధనను మాని గృహస్థ ఆశ్రమములను స్వీకరించిరి. పోషించు కళోపాస కులు కరువై నానాటికి మన కళలు క్షీణించిపోవుచున్నవి. శాస్త్రము, సాంప్రదాయముల నెఱిగిన నాట్యాచార్యులందరూ వయోవృద్ధులుగ నున్నారు. ఎన్నియో అపూర్వ నృత్యరీతుల నెఱిగిన నర్తకీ మణులు, నాట్యాచార్యులు పరమపదించిరి. ఆ నృత్యములన్నియూ మనకు లేవు. మిగిలి యున్న ఈ వృద్ధకళారాధకులుగూడ అంత రించుటకు పూర్వమే ఆంధ్రదేశమునందలి కళారాధకులు, ప్రభు త్వమువారు మేల్కొని ఆ కళలను వారితోనే అంతరించ కుండు నట్లు తగు ఏర్పాట్లు చేయవలయును.

మన పొరుగురాష్ట్రము ఒరిస్సాయందు తమదేశీయకళల అభివృద్ధికి యువకళాకారులు, కళారాధకులకు ఆ ప్రభుత్వ మొసగు చున్న పోషణ, ప్రోత్సాహము కళల ప్రచారమునకు వారు చేసిన ఏర్పాట్లు మలబారునందలి కథకళీయొక్క అభివృద్ధికి మలయాల దేశీయులు శ్రీ వల్లదోల్ మహాశయులు అనుసరించిన విధానములు తెలుసుకొనుటవల్ల ఎంతో లాభము చేకూరగలదు.

కళాసేవ యందు ఉత్సాహము గలవారు యువకులు కళా రాధనకు పూనుకొని దేశము నాలుగుమూలలా పోయి మన కళల యొక్క వివిధరూపముల తెలిసికొని వాని నభ్యసించి తాము నేర్చిన విద్యను దేశములో ప్రచారము చేయుటవల్ల నెంతయో ప్రయోజన ముండును. నాడు పూర్వపు ఆదర్శములతో నూతన వికాసములతో ఆంధ్రుల కౌన్నత్యమును తెలుపు కళాసాంప్రదాయమును అభివృద్ధి పఱిచి మరల నింకొకసారి తెలుగువారు సాటివారిలో మేటివారని ప్రపంచమునకు చాటగలరని యాసింతము.

———

ఆంధ్ర దేశములోని ఆలయాల్లో, భరతనాట్యము

భాగవతములందు ప్రదర్శించే నృత్యవిన్యాసములు

వాని వివరములు

పుష్పాంజలి : నర్తకి ఆలయమందు స్వామిసన్నిధిని గాని, సభ మధ్యమందుగాని నిలిచి, అంజలి పట్టించి పుష్పములు గొని, సమస్థానకమునందుండి (సమనఖ — రెండుపాదముల బొటనవ్రేళ్ళ గోరులు సమముగా నుండునట్లు నిలబడి) సమదృష్టి గల్గియుండి, దేవతలపైగాని, సభపైగాని స్తోత్రగీతములు, వందన గీతములు పఠించి పుష్పము లర్పించుట పుష్పాంజలి యనబడును. ఇది నాట్యారంభములో చేయబడును. ఇట్లు పుష్పములు సమర్పించిన పిదప తాళలయాశ్రితమై మృదంగ జతులతో గూడిన నృత్తము ప్రదర్శింపబడును. ఆ నృత్తమే అద్ది, మొహరయనియు,అలరింపు-అవియు పిలుతురు. ఆలయాల్లో పుష్పాంజలి సమర్పనప్పుడు నాట రాగములోగాని, ఆరభిరాగములోగాని స్వామి ప్రీత్యర్థము చూర్ణికలు పాడుదురు. తరువాత మేళప్రాప్తి జేయబడును.

మేళప్రాప్తి : అన్ని వాద్యములను—తంత్రి, చర్మ, గాలి, లోహ వాద్యములను ఒకేసారి శ్రుతిపక్వముగా 'ఓం'కారనాదము వెలువడునట్లు పూరించుట మేళప్రాప్తి లేక మేళము కట్టుట యగుచున్నది.

అద్ది, మొహర : ఖండగతిలో, నాటరాగములో కొన్ని మృదంగ శబ్దములను – "తాం, తాతై, తై, జగ, దత్తాం" చేర్చి పాడుతూ, ఆ శబ్దములు మృదంగముపై పలికించగా, తాళగతిని, లయను అనుసరించి నేత్రములు, మెడ, తల, హస్తములు, పాదములు, విన్యాసము చేయుటకు 'అద్ది' అందురు. 'అద్ది'అనగ నృత్తములో అడ్డముగ మెడను కదిలించుట.

ఈ విధముగా కొన్ని విన్యాసములు ముగిసిన పిదప మృదంగముపై కొన్ని ముక్తాయింపులు పలికించ వానికి అంగ విన్యాసము ప్రదర్శించి ముగించుట 'మొహర' అనబడును. 'మొహర' అనునది హిందూస్థానీ పదము, దీనికి దేశీయ పదజాలములో ముందు తీర్మానములేక ముగింపు అందుము. జతిగాని గతిగాని అంత మందు ఒక విన్యాసము కుడిచేత ప్రారంభించి, యెడమ చేతితో కూడ ప్రదర్శించి, మరల కుడిచేతితో ప్రదర్శించిన ముగింపు అగును. (ఒక విన్యాసము మూడుసార్లు చేయబడును.)

అద్దికి 'కంఠాభరణ'మని మరొక పేరు గలదు. దక్షిణదేశములో"మెయ్'—"తో డైమంగళ"మని పిలుతురు.

చూర్ణిక : వివిధదేవతలపై సంస్కృతములో స్తోత్రరూపములో రచింపబడిన సంగీత రచనలు చూర్ణికలనబడును.

కవుతం : బ్రహ్మ, విష్ణు, రుద్ర, వినాయక, లక్ష్మి, సరస్వతి మొదలైన దేవతలపై: నృత్తమాడుటకు అనుకూలమైన విధముగా మృదంగ జతులతో చేర్చి, వ్రాయబడిన ప్రత్యేక ఆరాధన నృత్య రచనలు కవుతములు. ఈ రచనలు బ్రహ్మ, రుద్ర, వినాయక, లక్ష్మి మొదలైన పురూపతాళములందు రచింపబడినట్టివి. ఈ నృత్యములు ప్రత్యేకముగా ఆలయములందు, ఆరాధన సమయములందు ప్రదర్శింపబడును. ప్రతి కవుతము నాల్గు భాగములు కల్గియుండును.

(1) తాళముయొక్క స్వరూపమును దెల్పు శబ్దములు.
(2) తాళవిన్యాస జతి.
(3) కవుతము.
(4) ఐదు జాతులతో గతివిన్యాసములు తీర్మానములు.

'నవసంధి' లేక 'బలిహరణ' నాట్యములు : ఆలయాల్లో పర్వదినములందు అష్టదిక్పాలకారాధనలో దిక్పాలకుల ప్రీత్యర్థములు ప్రదర్శించే ప్రత్యేక నృత్యములు 'నవసంధి' నాట్యములు.

ఇవియును రంగప్రదీప, తురంగలీలా, హంసనాద, హంసలీలా మొదలైన పురూపతాళములందు ప్రదర్శింపబడును

సప్తలాస్యములు : ఆలయాల్లో ప్రదర్శించే శుద్ధ, దేశి, పేరిణి, ప్రేంఖణ, కుండలి, దండిక, కలశ — నృత్యములు సప్తలాస్యము లనంబడును. ఇందలి "పేరిణి" – నేటికాలములో భరతనాట్యమనే పేరుతో ప్రచారములోనున్న నట్టువమేళ ప్రదర్శన క్రమమునకును మాతృక.

నట్టువమేళము : స్త్రీలు మాత్రము నాట్యముచేసే నృత్య సంప్రదాయము నట్టువమేళము. ఇదే దేవదాసీల సంప్రదాయము.

నాట్యమేళము : పురుషులు మాత్రము నాట్యము చేసే నృత్యపద్ధతి నాట్యమేళము. దీనినే భాగవతమేళమని గూడా అందురు.

చిన్నమేళము : నృత్యములో వాయించే (శ్రుతి, ముఖవీణ, మృదంగము, తాళములు) వాద్యబృందము చిన్నమేళ మనబడును.

పెద్దమేళము : డోలు, సన్నాయి, తాళము కలసినదే పెద్ద మేళము.

కేళిక : ఆలయాల్లో కళ్యాణమంటపమువద్ద స్వామి కొలువై యుండగా నర్తకి సల్పే నృత్య వినోదము కేళిక అనబడును.

యక్షగానము : యక్షులు ఆంధ్రదేశమునకు జెందిన ఒక అతి ప్రాచీన తెగవారు. వారినే 'జక్కుల'వారనియుకూడా పిలుతురు. వారి ప్రత్యేక నృత్య సంప్రదాయమే యక్షగానము లేక జక్కుల భాగవతము. ఇది దేశి సంప్రదాయ విద్య.

కురవంజి, చెంచునాటకములు : కురవలు, చెంచు వారు, అటవిక తెగలకు జెందినవారు. వారి నృత్య విద్యలే కురవంజి లనంబడును ఇవియును దేశి కళలే.

కైవారము : కైవార గీతములు ముఖ్యముగా రాజుల దర్బారులందు ప్రభువులను స్తుతించుచు వారియొక్క గౌరవార్థము గానము చేయబడునట్టి రచనలు.

ఈ రచనలు యక్షగానములందు, వీధి భాగవతములందు కూడ దర్బారు దృశ్యముల దుపయోగింపబడుచున్నవి. ఇవి రాజు పాత్ర ప్రవేశమందు చదువుదురు.

ధవళము : ఇదియొక బృందగాన విశేషము. నృత్య నాటకము నందలి యొక పాత్రను కీర్తించుటకు వాడబడునట్టిది. ప్రారంభములో ఒక పాటకుడు ఆరంభించినను అంతమందు మేళమువారందరునూ కలిసి పాడుదురు.

ఏల : రాజుగాని, దేవతామూర్తిగాని నౌకా విహారమునకు గాని, వన విహారమునకుగాని, వెళ్ళినప్పుడు — ఊయెల నూగుచున్నప్పుడు పాడబడే వినోద సంగీత రచన. ఇదియొక ఆలాపముగా నుండి అటుపై తాళలయ బద్ధముగా పాడబడును.

దరువు : భాగవతములందు అతిముఖ్యమైనట్టి సంగీతము దరువు. దరువులేని భాగవతమే లేదు. ఒక భావమును అనేక విధములుగా సంచారము చేయుటకు అనువైన తీరున, అభినయము ప్రదర్శించుటకు అనుకూలించు విధమున పదమును కూర్చి ఏర్పరుచబడిన సంగీత స్వరూపము దరువు. ఇదియే పూర్వము ధ్రువగానమనబడేది... ఒకే చరణమును అనేక భావములు వ్యక్తపడుతీరున, పర్యాయములు పాడుదురు. గనుక దరువులో తాళలయ ... విధ భంగుల ప్రదర్శించుటకు వీలుండును. రాగ ...మము ననుసరించును.

శబ్దము : దైవపరమైన వర్ణనాగీతము, మృదంగ శబ్దములతో మిళితమై, నృత్యమునకు అనువైయుండునట్టి రచన శబ్దము. శబ్దము కవుతము ఒకే విధముగానున్ననూ కవుతములు ఆయా దేవతలకు సంబంధించిన ప్రత్యేక తాళములందు రచింపబడును. శబ్దములు సాధారణముగా సంగీతమందు వాడే తాళములందు రచన జేయబడును. కవుతములందు సాహిత్యమునకు అతిశయము ప్రాముఖ్యత వహించదు. శబ్దములందు సాహిత్యమునకు ఆంగిక ప్రాధాన్యత గల్గిన నృత్యముండును.

ఇవి యెక్కువగా మిశ్రచాపు తాళమందు, కాంభోజి రాగమందు రచింపబడి గానము చేయబడుచున్నవి.

సలాము జతులు : రాజులను జమీందారులను స్తుతించుచూ ఉత్సాహకరమైన మృదంగ శబ్దమిళితమైన నృత్యగీతము. రాజదర్బారులందు నాట్యమాడునప్పుడు నర్తకులు ఆయా ప్రభువులకు జోహారులర్పించుటకుగాను ఈ రచనలు జేయబడినవి. ఈ రచనలు చతురశ్ర, తిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణ ఈ ఐదుజాతులందు యేదో ఒకజాతిలో నుండును అంత్యప్రాస గల్గిన సుందర రచన ప్రతి గీతము "సలాం" లేక "సలాం సలాం" అనుమాటలచే ముగియునుగాన వీనికి సలాము జతులని పేరు వచ్చినది. ఈ రచనలు మహారాష్ట్ర ప్రభువులు దక్షిణావని పరిపాలన ప్రారంభించిన తరువాత అభివృద్ధి జెందినవి. యీ రచనలందు మహమ్మదీయ ప్రభావము గాన్పించుచున్నది. శబ్దములు, కవుతములు, సలాము జతులు, దరువులాడునప్పుడు రక్తికిగాను అందుజేర్చి నర్తనమాడు క్రమమును మన భాగవత నర్తకులు పెంపొందించినారు.

జక్కిణి : ఇదియును శబ్దమువలె ప్రభువుల లేక దేవతల స్తోత్రములు, మృదంగ జతులతో మిళితముజేసి రూపొందింపబడిన సంగీత రచన. ఇందలి అడవు విన్యాసమునకు, శబ్దములో అటకు కొంతభేదమున్నది. ఇందు సాహిత్య భాగము తక్కువై నృత్తము యెక్కువగా నుండును. శబ్దములందు నృత్తము తక్కువగా నుండి సాహిత్యమునకు అభినయము విరివిగా నుండును. ఈ రచనలు యెక్కువగా విజయనగర గజపతి రాజులపైనున్నవి. అందు సప్తతాళ జక్కిణి ప్రఖ్యాతి గాంచినది.

త్రిభంగి : మూడుపాదములు గల్గినట్టి సంగీత రచన, నృత్యనాటకములో రసవత్తర ఘట్టమును ప్రదర్శించ వలసినప్పుడు పూర్వము వాడబడిన విశేషరచన.

అర్ధచంద్రిక : నృత్య నాటకములోని వివిధ ఘట్టములను కలుపుటకుగాను, అతిసులభమైన ఈ రచనాపద్ధతిని వినియోగింతురు. హరికథ లందుపయోగించెడి "తోడయ" ఈ రచనయొక్క రూపాంతరమున పేర్కొనవచ్చును.

హెచ్చరిక : దేవతలుగాని, ప్రభువులుగాని, ఉత్సవ సమయము లందు ఊరేగింపులందు వెళ్ళినప్పుడు పాడబడే సంగీత విశేషము.

పదము : శృంగారము ప్రధానరసముగా గల్గి నాయికా నాయకుల ప్రణయ, విరహ వియోగ వర్ణనలతో కూడియుండి అభినయమునకు అనుకూలముగా నుండునట్టి రచన, పదము.

పదకేళిక : పదాభినయమే ప్రాధాన్యముగాగల నృత్య క్రమము పదకేళిక యనబడును.

పదదరువు : పదములందు ప్రత్యేకముగా రసభావముల ప్రదర్శించు విధాన అభినయము చేయబడును. అందు నృత్తముండదు. పదదరువునందు వివిధ సంచరుల ప్రదర్శనము చేయుటకు ప్రదర్శించే అభినయముతోపాటు నృత్తముగూడా నుండును. ఒక్కొక్కభావము ప్రదర్శించుటకు ఆంగిక, సాత్విక ప్రాధాన్యత గల్గినట్టి అభినయము; అటుపై దానికి అనుకూలమైన తీరున అడవుల నృత్తము ప్రదర్శించుట పదదరువునందలి విశేషత

సువ్వాల్శి,శోభనము : వివాహమహోత్సవ సందర్భము లందు ముఖ్యముగా స్త్రీలు పాడబడే ఉత్సాహకరమైన పాటలు. సువ్వాళి ముఖ్యముగా యక్షగానము లందు వివాహమును దెల్పునట్టి సందర్భములందు పాడుదురు. శోభనములు, వివాహానంతరమున నాయికా నాయకుల ప్రథమ సమావేశములందు వాడుదురు.

జోల : కథానాయకుడు నిద్రించునప్పుడు, పుత్రోత్సవ సమయ సూచనగా ఈ గీతము, గానము చేయబడును.

సువ్వాల్శి, శోభనము జోల, ఏల : ఈ రచనలు శృంగార రసోత్పత్తికి కారణభూతమైన సన్నివేశములందు గానము చేయబడును.

ద్విపద : దేశి పద్ధతికి జెందిన యొక ప్రత్యేక సంగీత రచన. ఇది బహు సులభమై అందరికీ గానము చేయుటకు అందుబాటులో నుండును. ఈ రచన ఖండగతిలో నుండును. యక్షగాన, భాగవతములందు కథనునడుపు సమయములందు ఈ రచనాక్రమము విరివిగా ఉపయోగింపబడినది. యక్షగాన నర్తకులు ఈ రచన పాడినప్పుడు వివిన ప్రత్యేకముగా ఈ రచన యక్షగానములకై పుట్టినదా అనిపించును

ఈ ద్విపద అంతమునందు దరువువలె పాడుచూ నర్తనము సల్పుట ద్విపదార్ధమనబడును

కందము, సీసము : ఈ రెండును ఆ ప్రదేశపు కవితా రీతులకు జెందిన రెండు ప్రత్యేక రచనా పద్ధతులు. కందము అన్నింటి కంటెను చిన్నది. సీసము పెద్దది

ఈ రచనలు ప్రారంభములందు పద్యములుగా పాడి ముగింపులందు దరువులుగా ఆడిన - కందార్ధము; సీసార్ధము అనబడును. ఈ రచనలు యెక్కువగా కలాపములు, యక్షగానములందు గాంచ నగును.

నృత్తము . చంపకమాల, ఉత్పలమాల, మత్తకోకిల, శార్దూలము మత్తేభము, మొదలైనవి. సంస్కృతకావ్యరీతులన్నియూ నాటకములలో ఒక్కొక్క ప్రత్యేక సన్నివేశములలో రసపోషణకుగాను ఉపయోగించబడును.

మన్మథోపాలంబన సమయమునందు ముఖ్యముగా నుపయోగించునట్టి ప్రత్యేక వృత్తము పంచచామరము మన్మథుడు చెఱుకు విల్లునుచేత ధరించి, చిలుకలు, కోయిలలు, తుమ్మెదలు, మఱియు మారుతము వెంటరాగా, గాచిలుకనెక్కి స్వారిజేయుచూ రంగస్థలము ప్రవేశించు విధము ఈ వృత్తమందు ముచ్చటగా నర్తించబడి యున్నది. ఈ రచన చక్కని సంగీతము కూర్పుతో పాడినప్పుడు వీరులు యుద్ధభూమికి వెళ్ళునప్పుడు పాడబడే గీతమువలె నుండును మఱియు విజయోత్సాహము గలిగించును. ప్రతివృత్తము దరువు ఆటతో ముగించబడుచున్నది.

సొల్లుకట్టు : మృదంగ వరుసలు ప్రత్యేకంగా రాగములల్లో పాడుట.

నెలకట్లు . ఇది నృత్తమునకు చెందిన ప్రత్యేక రచన. ఒక పల్లవిని నృత్తమాడు నప్పుడు నర్తకుడు వివిధరకములైన అడవులను — స్వరము, మృదంగముయొక్క శబ్దములను అనుసరించి ప్రవర్తించుట నెలకట్లు అనబడును.

ఆయిత్తము : పాటకచ్చేరియందు రాగాలాపనవలె నృత్తారంభమునందు గూడా రాగముయొక్క చాయలు తెలియునట్లు గానము జేయుచుండగా, ఆలాపము ననుసరించి దృష్టి, గ్రీవ, హస్త, పాదముల విన్యాసమూ

కొనుగోలు : నర్తకి నృత్తమాడునప్పుడు ఒక ప్రత్యేక భాగములో స్వరముల కూర్పును, ఒకతాళమునందిమిడ్చి పల్లవిగా పాడుతూ, నటుడు తనకు తోచినవిధాన మృదంగ శబ్దములనుఅప్పటి కప్పుడు జతులుగా సల్లి పాడి తీర్మానించుట, అట్టి జతులకు నర్తకి నాట్యమాడుట 'కొనుగోలు' ఆట అందురు. ఇది మనోధర్మపు ఆట. ఎంతయో ప్రజ్ఞవుండినగాని, కళాకారులు ఈ ఆట ప్రదర్శించ లేరు. గాన నేటికాలములో ఈ ఆట అరుదుగా జూచుచున్నాము. నర్తకి, నటుడు, మార్దంగికుడు తమ తమ పాండితీ ప్రతిభను వెల్లడి జేసుకొనుటకు చక్కని అవకాశము గల్గినట్టిది కొనుగోలు నృత్తము.

చిట్ట : 'కొనుగోలు' మనోధర్మపు ఆటకు సంబంధించి నది. చిట్టాలు ముందుగా నర్తకి, ఆచార్యుడు, మార్దంగికుడు ఈ ముగ్గురు కలిసి చక్కగా అభ్యాసముజేసి పిదప నృత్త నృత్యాదు లందు ప్రదర్శించు కట్టు శబ్దములు. తీర్మానములు. ఇదియును తాళ లయ బద్ధమైన మృదంగ జతుల కూర్పు.

గతి : సమగతి, విషమగతి అని నడక రెండు విధములు. రెండు అక్షరముల నడక గల్గినట్టిది సమగతి. మూడు అక్షరముల నడక గల్గినట్టిది విషమగతి. రెండు పెట్టి భాగించ శేషము లేనట్టిది సమగతి. శేషముండిన విషమగతి అనబడును.

జాతి : చతురశ్ర, తిశ్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణ. అని జాతులు ఐదువిధములుగా చెప్పబడినవి. ఈ జాతులయొక్క విన్యా సమువల్ల తాళములు కళాత్మకమై, రక్తివంతముగా నుండును.

జతి : కొన్ని మృదంగ శబ్దములను క్రమముగా నేర్ప రచి రెండు, మూడు ఆవృత్తములు వాయించి తీర్మానించుట, అనగా 'దదిగిణతోం' అను శబ్దములతో ముగించుట జతియగు చున్నది. ఈజతులు శబ్దములు, దరువులు మొదలైనవి ప్రారం భించుటకుముందుగా ఆడబడును.

వివిధ మృదంగ శబ్దములను ముత్యములుగాను, వాని యొక్క కూర్పుతో రూపొందినట్టి జతిని ఒక ముత్యాలమాలగనూ, అంతమందు ప్రదర్శించే తీరిక ఆ మాలయొక్క కొలికి పూసగను నవచ్చును. ముత్యాలమాలలెట్లు ధరించువారికి అలంకార అందము చేకూర్చునో అట్లే జతులతో గూడియున్న రక్తివంతముగానుండి రసికజనుల మనంబుల

ముక్తాయి. తీర్మానము :— ఒక నృత్తముయొక్క ఆరంభములో ప్రదర్శించునది ముక్తాయి అంతమందు ప్రదర్శించు నృత్తవిశేషము తీర్మానమనబడును. ముక్తాయి చిన్నదిగానుండి, నాదము అంతము గల్గియుండక ముందుకు గొనిపోవు నదలును, ఉదా : "తదిగిణ తోం – తదిగిణతోం — తదిగిణ" తీర్మానము. దీర్ఘ విన్యాసము గల్గి, నాదము అంత మొందును.

చారి : నృత్త నృత్యముల్లో ఒక పాదమును విన్యాసము చేయుట చారియగును. పాదము భూమినంటియుండగా విన్యాసము చేయుట. భూచారి. పైకెత్తి గాలిలో విన్యాసముచేయుట ఆకాశచారి.

కరణము : ఒకే విన్యాసమును కుడియెడమలకు ప్రద ర్శించి ముగించుట కరణము. దీనినే 'అడవు' అందురు. ఇందు కాలు ననుసరించి చేతులయొక్క విన్యాసము గూడా నుండును.

అంగహారము : కొన్ని కరణములు క్రమముగా జేర్చి ఆది తీర్మానించుట అంగహారమగును. నృత్యములో ఒక భావ మును సంపూర్ణంగా ప్రదర్శించుటకు ప్రదర్శించే హస్తపాద విన్యా సముగూడా అంగహారమగును. అంగహారము సంపూర్ణవిన్యాసము గల్గి యుండును.

మండలము : అంగహారమువలె కొన్ని కరణముల కూడిక గల్గినట్టి నృత్త విశేషము మండలము. ఈ రెండింటికి భేద మేమనగా.

అంగహారము : సంగీతముయొక్క వివిధరూపములు, తాళము, లయ, గతి, జతి, జాతి, విన్యాసములతో క్రమపద్ధతిని గూడియుండి తీర్మానముతో ముగింపబడునట్టి సంపూర్ణ నృత్తముగా నుండును. మండలము, ఖండము లట్లుగాక, కొన్ని విన్యాసముల చేరికలై యుండును గాన పరిపూర్ణతిజెంది యుండవు.

ప్లవనము : నృత్తమాడునప్పుడు గాలిలోనికి యెగిరి విన్యా సముజేయుట ప్లవనమనంబడును.

హస్తము : నృత్తములో ఒక పాటయొక్కగాని పద్యము యొక్కగాని అర్థము తెల్పుటకు వుపయోగించే హస్త సంజ్ఞలు— హస్తము లనబడును.

ముద్రలు : పూజాసమయములం దుపయోగించెడి హస్త సంజ్ఞలు ముద్రలందరు.

స్థానకములు : నృత్యారంభమునందు, అంతమందు నిల

బడే విధములకు స్థానికమని పేరు. ఈ స్థానక క్రమము ననుసరించియే ఆలయములందు వివిధ దేవతా విగ్రహములు చెక్కబడెనవి.

## మార్గ పద్ధతి

నాట్య శాస్త్రమునసనుసరించి వివిధ కరణాంగహారములు దేవతల ప్రీత్యర్థము ఆలయాల్లో నాట్యమాడుట 'మార్గ' పద్ధతిగా పేర్కొనవచ్చును. ఇది జనరంజక కళ గాదు, కళతో దేవతారాధన జేయుట. ఈ సంప్రదాయారాధన వల్ల దేశంలో కళయొక్క శాస్త్రీయ స్వరూపము చెడకుండా వుండుటకు కారణమైనది. మన ప్రాచీనాలయాల్లో అంతటి అపురూప శిల్పకళ జీవకళతో సృష్టింప బడుటకు ఈ సంప్రదాయమే ఆధారము. శివాలయములందు, విష్ణు ఆలయములందు దేవదాసీలు ప్రదర్శించిన వివిధ నృత్య విన్యాసము లన్నియు (ఉదా-భుజంగ, భుజంగ త్రాస, శుద్ధ, శుభలీల, మండల, కమల, భ్రమరనృత్త, లలిత మొదలైనవి) మార్గ నృత్తములే. ఇవన్నియూ సంగీత పాఠకులు సామాన్యంగ నుపయోగించే ముప్పది అయిదు తాళములందు గాక 108 తాళముల్లోని కష్టతరమైన తాళములందు ప్రదర్శింపబడును.

## దేశి పద్ధతి

శాస్త్రము నాధారముగ గొనినమా ఆయాదేశీయుల, పోషించు ప్రభువుల, కళల నాదరించు దాతలయొక్క అభిరుచులు, ప్రాంతీయ సంప్రదాయముల కనుగుణ్యముగా అభివృద్ధి జెందిన సంప్రదాయము 'దేశి' పద్ధతి. గనుకనే 'మార్గ' పద్ధతికి జెందిన ఆరాధన కళ భారత దేశమంతటనూ ఒకే రీతిగా నాటినుండి నేటివరకు విలసిల్లినను దేశ కాల పాత్రల ననుసరించి అభివృద్ధిజెందినటి దగుట చేతనే 'దేశి' కళ వివిధ ప్రాంతాల్లో విభిన్న రూపాల్లో అభివృద్ధి జెందిన వివిధ సంప్రదాయాలుగా రూపొందింది. వేరువేరు పేర్లతో పిలవబడుచున్నది.

ఉదా :- భరతనాట్యము, కథక్, కథకళి, కూచిపూడి, మణిపురి, ఒడిస్సీ.

ఈ సంప్రదాయము లన్నింటికి నాట్య శాస్త్రమే ఆధారమైననూ, ఇందలి వివిధ నృత్త, నృత్య అభినయ రీతులకు భరతశాస్త్రమే ప్రమాణమైననూ ఆయా ప్రాంతీయుల భాష అభిరుచులనుబట్టి ప్రదర్శన తీరులు మారుటచే పలువిధములైన సంప్రదాయములుగా నృత్యకళ రూపొందినది. మరియు నాట్య శాస్త్రముతో సంబంధము లేకుండా సామాన్య ప్రజలచే ఆరాధింప బడునటి జానపద నృత్యములుగూడా 'దేశి' పద్ధతికి జెందినట్టివిగా పేర్కొనవచ్చును. ఈ విద్యలను పండితులు చేపట్టినప్పుడు కొన్ని శాస్త్రీయ పద్ధతులను యీ కళలందు చొప్పింతురు.

ఉదా :- కురవంజి, యక్షగానము. ఈ కళలు ఆదిలో పల్లె ప్రజల వినోద కళలుగా ప్రజల్లో నుండి పుట్టినట్టివి. గాని కొంత కాలానికి ఈ కళలు పండితుల' ప్రభువుల ఆదరణ బడసినవై, అప్పటి పండితులచే కొన్ని శాస్త్రీయ సంప్రదాయములు ప్రదర్శన క్రమమునందు చేర్చబడి సంస్కరించబడి భాగవత కళగా రూపొందినవి. ప్రస్తుతం బ్రాహ్మణ భాగవతులు ప్రదర్శించే వీధి నాటకములకు ప్రాచీన యక్షగానమే మాతృకయైననూ పండితులు ప్రదర్శన క్రమమందు కొన్ని మార్పులు జేసి ఆ కళకు నూతనత్వము జేకూర్చినారు.

## నాట్యధర్మి

శాస్త్రము ననుసరించి, నృత్యముయొక్క ప్రదర్శన క్రమమును (అనగా అడుగు, కరణ, అంగహార, జతి, గతి, హస్త విన్యాసాదులను, అభినయ రీతులను) గురువువద్ద అభ్యసించుట నాట్యధర్మి యగుచున్నది. ఇది దేశమంతటనూ ఒకేరీతిగా నుండును.

## లోకధర్మి

దేశములోని వివిధ ప్రాంతాల్లోని ప్రజలు, విభిన్న మనస్తత్వములు గలవారు, వారియొక్క ఆచార వ్యవహారముల ననుసరించి వారియొక్క హావభావ ప్రకటన పద్ధతులన్నియూ చక్కగా పరిశోధనజేసి, అందలి విశిష్టతను తెలిసికొని శాస్త్ర కట్టుబాట్లు చెడకుండా గురువువద్ద నేర్చిన విద్యకు మెరుగులు దిద్దుకొని నృత్యకళను శోభాయమానముగా నభివృద్ధి చేయుట లోకధర్మి యగును. కళను అలంకార యుక్తముగా, పుష్టిగా నభివృద్ధి జేయుట లోకధర్మి ఆరాధనవల్ల సాధ్యపడును.

## భరత విద్య

నాట్యము, నృత్యము, నృత్తము, అభినయము, తాండవము, లాస్యము- అను ఆరు విభాగములుగా నున్నది.

## నాట్యము

అనేక పాత్రలు ఒక కథను, నాట్యశాస్త్రములో చెప్పిన రీతిని కరణాంగ హార, జతి, యతి నియమముల ననుసరించి రసవంతముగా ప్రదర్శించుట నాట్యము. ఇందలి ప్రతి కదలికయు భావగర్భితముగను, తాళలయానుగుణ్యముగనూ వుండును. నేటి కాలములో ప్రదర్శించెడి నృత్యనాటకములు ప్రాచీన నాట్య రీ గతికి జెందనట్టివి. ఇందు నృత్తము, నృత్యము, అభినయము, తాండవము, లాస్యము, అను యీ ఐదు భాగములు వుండుటయే గాక ఒక ప్రఖ్యాతిగాథ ఇతివృత్తముగా గలిగియుండును. నాట్యము సంపూర్ణ భరతకళా ప్రదర్శనము. 'భరతి' మనగా, భావరాగ తాళములతో కూడిన కళ.

## నృత్తము

రసభావములు లేక తాళలయల ననుసరించి, రాగస్వరములకుగాని మృదంగ జతులకుగాని అడవులు ప్రదర్శించుట నృత్తమగును. మృదంగ శబ్దముల్లోని ఒంపుసొంపులను వ్యక్తపర
టకు వివిధ రీతుల శరీరము కుంచించి, విజృంభించి,
లుగా త్రిప్పి, కోణాకారములుగా రూపొందించి
నృత్తమగుచున్నది.

## నృత్యము

ప్రఖ్యాత పురుషులకుగాని, దేవతలకుగాని జెందిన వర్ణనాత్మక గీతములయొక్క అర్థమును సభికులకు బోధపడునట్లు హస్తపాద విక్షేపముల జేయుచు తాళలయల ననుసరించి ఆడుట నృత్తము.

ఇది రెండు పద్ధతులు. వర్ణన గీతము పాడుచుండగా అందలి అర్థము ననుసరించి ఆంగికాభినయము ప్రదర్శించుట; లేక

ఒక కథను, వాద్య సంగీతము యొక్క ఆధారముతో నర్తన మాడుట.

## తాండవము

ఉద్ధత కరణాంగహార ప్రదర్శనము, గంభీర భావప్రకటన, వీర రౌద్రాది మొదలైన రసములచే పోషింపబడునట్టి కళ. తాండవము, శివుని భూత గణములలో నొకడైన తండునిచే రూపొందించబడిన కళయే తాండవ నృత్యమని కొందరు శాస్త్రకారుల అభిప్రాయము. ఈ నాట్యమునకు అధిపతి పరమశివుడు.

## లాస్యము

కోమల కరణాంగహార ప్రదర్శనగల్గి శృంగార కరుణ రసములతో అలరారు సుకుమార కళారూపము లాస్యము. ఈ విద్యకు అధిదేవత పార్వతి. తాండవము పురుషులచే ఆరాధింపబడు నట్టి కళ. లాస్యము స్త్రీలకొరకు సృష్టింపబడినట్టి విద్య.

నట్టువమేళ విద్వాంసుల అభిమతానుసారముగా :—

లాస్యము :— నర్తకి సభమధ్యయందు నిలబడిగాని, కూర్చుండిగాని శ్లోకములు, పదములు, వృత్తములు, పద్యములు మొదలగువానికి రసభావ ప్రకటనజేయుట లాస్యము.

తాండవము :— నర్తకి తాళలయల ననుసరించి అడవులు, జతులు ఆడుట తాండవము.

## అభినయము

పద్యగద్య పదగీతములందు కవి వర్ణించిన ఒక భావమును ప్రేక్షకులు చక్కగా అర్థముజేసికొని, అనుభవించి ఆనందించు రీతిని వ్యక్తపరచుట అభినయము. ఈ అభినయము నాల్గు విధాలుగా నున్నది.

## ఆంగికము

ఒక గీతముయొక్క అర్థమును హస్తపాదములయొక్క ఆధారముతో వ్యక్తపరచుట ఆంగికాభినయ మగుచున్నది.

## వాచికము

[illegible] కవి వర్ణించిన ఒక ఘట్టమును అందలి అర్థము చక్కగా [illegible] అందలి భావము సంపూర్ణముగా వెలుబడునట్లు [illegible]ర్గస్థలుగా సవరించి పాడుట వాచికమగును.

## ఆహార్యము

ఒక ఘట్టమును నర్తనమాడునప్పుడు అందలి రసభావముల ననుసరించి ఆ సన్నివేశమునకు అనువైన రీతిని వేషధారణచేయుట ఆహార్యము.

## సాత్వికము

ఒక గీతములోని భావమును ప్రేక్షకులు అర్థముజేసుకొని అనుభవించు తీరున రసభావముల నొప్పించుచూ ప్రదర్శించుట సాత్వికము. సాత్వికము ప్రేక్షకుల హృదయముల కత్తుకొని వారి హృదయముల కదిలించి, కరిగించును గాన భరతవిద్యలో సాత్విక ప్రాధాన్యతగల్గిన అభినయమునకు విశేష ప్రాముఖ్యత యివ్వబడినది. ఈ సాత్విక ప్రాధాన్యతగల్గిన అభినయము (దీనినే రసాభినయమని గూడా పిలుతురు) భారతీయ కళలందు చెప్ప ప్రశంసములోని మరి యే కళలందును యింత చక్కగా అభివృద్ధి జెందినట్లు గాన్పించుటలేదు.

ఈ నాల్గు విధములైన ప్రదర్శన గలిగినట్టిదే అభినయకళ.

## కలాపము

ఏకపాత్ర నృత్త, నృత్య, అభినయాదులందు తనకుగల పాండిత్యమును ప్రదర్శించుటకు వీలగు విధమున కూర్చబడిన సంగీత రచన. ఇదియే ప్రాచీన యక్షగానముయొక్క సంపూర్ణ స్వరూపము.

నేటి కాలములో ఆంధ్రలో విరివిగా ప్రచారమందున్నవి భామకలాపము, గొల్లకలాపము.

## బహురూపులు, భరతులు

యక్షులు (జక్కులవారు) దేవదాసీలు బ్రాహ్మణభాగవతుల వలే, తెలంగాణాప్రాంతములో బహురూపులు, భరతులు అని రెండుతెగలవారున్నారు. ప్రత్యేకంగా భాగవతములనాడుటయే వీరి వృత్తి. వీరినిగూర్చి ఆంధ్రలోని జానపద నృత్యకళగూర్చి రచించిన ప్రత్యేక గ్రంథములో విపులంగా చర్చించినాను.

దాసిఆట, భోగముఆట, మేజువాణి, కచ్చేరీఆట, దర్బారు ఆట, కేళిక, కర్నాటకము, దేశీయము, భరతము – దేవదాసీలచే ప్రదర్శింపబడిన నృత్యకళ ఈ పేరుతో పిలువబడేది. నేటికాలములో ఈ విద్య "భరత నాట్య" మని పిలువబడుచున్నది.

## జాతిస్వరము

ఆంగ్లేయులు జాతివారని పిలువబడుచుండిరి. వారి సంగీతము ననుసరించి బ్యాండుట్యూనులవలె వ్రాయబడిన స్వరవరుసలు జాతిస్వరములు. జతిస్వరమువేరు. జాతిస్వరము వేరు. ఈ జాతి స్వరములు కోలాటము చేయునప్పుడు ఉపయోగింతురు. ఇవి కర్నాటక రాగములందే యున్ననూ, వీనికల్పనమాత్రము పాశ్చాత్యబాణిననుసరించి యుండును.

## దండిక లేక దండలాస్యము

కోలాటపు కోవ్వలు దండిక అని పిలువబడును. చిన్న చిన్న కర్రలను చేతగొని తాళగతి ననుసరించి తట్టుతూ నాట్యమాడుదురు గాన ఆ పేరుతో పిలువబడినది. ఇది బృంద నృత్యము.

## కందుక క్రీడ

చిన్న బంతులను చేతగొని ఆడుతూ నర్తనము చేయుట కందుక క్రీడ. పూర్వము రాణివాసములందు ఈ విద్య విరివిగా ప్రచారము నందుండినది. కృష్ణుడుకూడా ఈ ఆటను ఆడినట్లు నారాయణతీర్థ యతీంద్రులవారు తమ కృష్ణలీలాతరంగిణిలో కృష్ణుని బంగారు బంతితో ఆడినట్లు వర్ణించియున్నారు.

## కారువా మేళము

నాట్యమేళములోని కొందరు నర్తకులు గోపికలుగాను, మరికొందరు కృష్ణులుగాను వేషధారణ జేసికొని, రాధాకృష్ణ పాత్రలు నడుమనిల్చి నర్తనము సలుపుచుండగా మిగిలిన స్త్రీ పురుష పాత్రలు– కృష్ణపాత్ర గోపికపాత్ర ఒకరి తరువాత ఒకరు వరుసదప్పక నిలువబడి, వలయాకారముగా తిరుగుచూ వివిధ గతుల నర్తనమాడుట కారువామేళము. దీనినే 'కర్షణి' అందురు. ఉత్తరదేశములో "రాసలీల" అనే పేరుతో ప్రచారమందున్నట్టి నృత్యము. ఈ నృత్యమును జూచియే, లీలాశుకుడు తన 'కృష్ణ కర్ణామృతము' నందు రాసక్రీడ వర్ణించెనేమో ?

## చిందు

చతురశ్ర, తిశ్ర, మిశ్ర, ఖండ, గతులలో నేదో ఒక గతి నాధారముగా జేసికొని ప్రదర్శింపబడే జానపద నృత్త విశేషము చిందు.

## మోడి, మొగ్గవాలుట

పాము నాట్యముకాని, పాములవాని కథకాని నాట్యమాడుట 'మోడి' నర్తన మనబడును. నర్తకి శరీరమును వెనుకకు వంచి భూమిపై చేతులను ఆనించి నొసలు భూమికి తగులునట్లు శిరసు నేలకు అంటించుట 'మొగ్గుట' లేక "మొగ్గవాలుట" అనబడును. పూర్వము నర్తకినులు మొగ్గవాలి నొసలితో రూపాయల నెత్తుట, కనురెప్పలతో సూదులను దీయుట మొదలైన చమత్కారములను ప్రదర్శించెడివారు. ఇవి ముఖ్యముగా ఈటి విద్యలు మాత్రమే. ఇందు కళాప్రదర్శన ముండదు. ఈ విద్యసాధన శరీర సౌష్ఠవము నభివృద్ధి పరచు కొనుటకు మాత్రముపయోగించును.

## అలరింపు

భరతనాట్య ప్రదర్శనారంభములో చేయబడే నృత్త విశేషము. 'అలరింపు' అనగా పుష్పించుట లేక వికసించుట. సమస్థానకమునందు, సమ భంగిమయందు నిల్చిన నర్తకి శరీరము, "ఓం" కార మిళితమైన మృదంగ నాదమునకు వికసించి, పరిమళించి, ప్రేక్షక లోకమును విస్మయానంద డోలికల నోలలాడించుటయే అలరింపు నృత్త విశేషము.

## జతిస్వరము

ఒక రాగముయొక్క స్వరములను ఒక ప్రత్యేక తాళములో బంధించి దాని నాధారము జేసికొని వివిధ రీతుల స్వరకల్పనలు, వివిధగతులలో చేసి, ఆ కల్పనలకు, అనుకూలమైన రీతిని మృదంగ జతుల నేర్పరచి నృత్తమాడుట జతిస్వరము. ఇందు స్వరములు వుండును. మృదంగ జతులుగూడా వుండును. దీనినే పల్లవినాట్యమనిగూడా అందురు. ఈ పల్లవి నాట్యము స్వరపల్లవి, సాహిత్య పల్లవి, శబ్దపల్లవి అని మూడు విధములుగా మున్నది.

## స్వరపల్లవి

రాగము స్వరూపమును దెల్పు స్వరములను తాళమునకు సరిపడునట్లు యేర్పరచి వానికి నృత్తమాడుట స్వరపల్లవి.

## శబ్దపల్లవి

ఇందు మృదంగ శబ్దములనే ఒక రాగములో పాటగా పాడుతూ, మృదంగ జతులకు నృత్తమాడబడును.

## సాహిత్యపల్లవి

శివ లేక విష్ణు సంబంధమగు స్తోత్ర గీతములను ఆధారముగా జేసికొని అపల్లవికి వివిధరీతుల అడవులుకట్టి ఆడుట సాహిత్యపల్లవి ఆట అగును.

## వర్ణము

పదవర్ణము, తానవర్ణము, చౌకవర్ణము. తానవర్ణము సంగీత సాధనకు యెక్కువగా ఉపయోగింతురు. నాట్యమునకు అంతగా వుపయోగములేదు,

## పదవర్ణము

పల్లవి, అనుపల్లవి, చరణములు కలిగి నృత్త నృత్యాభినయములు ప్రదర్శించుటకు అనువైన స్వర పోకడలు, సాహిత్యపు సొంపులు, నడకలు, జతి విన్యాసములు, యతివిశేషములతో అలంకరింపబడిన సంగీత రచన పదవర్ణము. ఇది నాయికా నాయకుల విరహ వియోగ సమాగమముల వర్ణనలతో గూడినట్టి విశిష్ట రచన. ఇందు పల్లవికి అభినయము, పల్లవినాధారముగజేసి త్రికాల అడవు విన్యాసములతో గూడిన ముక్తాయింపులు, చిట్ట స్వరములకు నృత్తము. చిట్టస్వరములందు వర్ణించబడిన సాహిత్యమునకు నృత్యముండును. నృత్తనృత్యాభినయములు సమపాళ్ళలో పోషింపబడిన, రచనయగుటచేతనే దీనికి భరత నాట్యములో విశేష ప్రాముఖ్యత యివ్వబడుచున్నది.

## చౌక వర్ణము

దీనినే పెద్దవర్ణమని గూడా అందురు. ఇది పదవర్ణముకంటె విలంబిత లయలో నర్తన మాడబడును. పద వర్ణముకంటె యెక్కువ చరణములు గలిగి బహు కష్టతరమైన అడవు విన్యాసముల అభినయపోకడలు గల్గియుండును. 'గోవింద సామయ్య పంచకము' అని ఐదు వర్ణములు ఆయనచే రచింపబడినవి ఈ పెద్ద వర్ణములు. ఈ గోవిందస్వామి కార్వేటినగరు సంస్థాన నర్తనాచార్యుడు. ఇందు నవరోజు, కేదారగౌళ, మోహనరాగములందు రచింపబడినవి. ఆంధ్రలో యెక్కువగా ప్రచారమందున్నవి. ఈ వర్ణములాడుట బహు కష్టముగాన ప్రస్తుత కాలము కళాకారులు ఈ వర్ణముల సాధనజేయుట మానివేసినారు.

## జావళి

పదమువలె శృంగార రసప్రధానమై నృత్యమునకు అనువగు విధాన మధ్యమ కాల సాహిత్యము గలిగినట్టి రచన.

## అష్టకము

ఎనిమిది చరణములు గల్గిన సంగీత రచన. ఇవి దేవతా స్తోత్రములు గాన యెక్కువగా ఆలయములందు పాడబడును.

## అష్టపది

జయదేవుని గీత గోవిందములోని రాధ మాధవుల ప్రేమను వర్ణించు పాటలు అష్టపదులనబడును. ఈ పాటలు ఒక్కొక్కటి యెనిమిదేసి చరణములు గల్గియుండును గాన 'అష్ట పది' అని పిలవబడుచున్నది.

## తరంగము

యతినారాయణ తీర్థులవారు రచించిన కృష్ణలీలాతరంగిణి లోని పాటలు తరంగములని పిలుపబడుచున్నవి. ఇవి నృత్తము నకు యెక్కువగా వుపయోగించును. సముద్రమునందు తరంగములవలె ఈ నర్తనము తాళ లయల మిళితమై భక్తిరసముప్పొంగి ప్రేక్షకుల భక్తిపారవశ్యమున మైమరపించును గాన ఈ గీతములు తరంగము లనబడును.

## లావణి

అంత్యప్రాసగల్గి: చతురశ్ర, మిశ్ర, తిశ్ర, ఖండ, ఈ నాలు జాతులందు యేదైన ఒక గతిలో రచింపబడిన శృంగార గీతము.

## తిల్లాన

దురిత గతిని నృత్తమాడుటకు అనుకూలముగా మృదంగ జతులతో కూర్చబడినపాట తిల్లాన. ఇందు పల్లవి, అనుపల్లవి, మృదంగ వరుసలునూ, చరణము సాహిత్యమును గల్గియుండును. పాట మధ్యమకాలములో నుండును. ఈ నృత్తము భరతనాట్యములో ఆఖరిదిగా ప్రదర్శింతురు. పాట మధ్యమకాలములో నున్నను, ఆట త్రికాలములందు ప్రదర్శింపబడును.

## సూలూక్రమము

నాట్యారంభంలో నర్తకి సమభంగిమలో నిలబడి, మలయ మారుతముయొక్క తాకిడికి దీపకళిక వోలె, మృదువుగా శరీరమును చలింపజేయుట సూలూక్రమ మనబడును.

## దేశి నృత్తము

నర్తలాస్యములందలి ఒక ప్రత్యేక నృత్త విశేషము 'దేశి నృత్తము'. ఈ దేశివృత్తము వేరు. దేశి సంప్రదాయము వేరు. ఈ దేశి నృత్తము ప్రత్యేకముగా ఆలయములందు చేయబడును.

## ముక్తపదము

ఇద్దరు నర్తకిములు పోటీపడి నాట్యమాడునప్పుడు, ఒక నర్తకి ఆడిన జతియొక్క ఆఖరి శబ్దములనుగొని వానిని మొదటి అక్షరములుగా జేసి యతిబద్ధముగా యింకొక జతి సల్లి వెనువెంటనే మరొకరు నర్తనమాడుట ముక్తపదము లేక ముక్తపద గ్రస్తము. ఇది పండితులైన యిద్దరు విద్వాంసుల విద్యాపరీక్ష సమయములందు జరిగే పోటీలందు ప్రదర్శింపబడును.

## చక్రవిన్యాసము

ఒక జతిని ముందుగా రెండుమూడు ఆవృత్తములలో రూపొందించి, క్రొత్తశబ్దములను జేర్చకుండా, అందలి శబ్దములనే త్రిప్పిత్రిప్పి వివిధరీతుల అల్లుతూ, దానికి తగినరీతిని నర్తన మాడుట చక్రవిన్యాసము.

## యతి విన్యాసము

యతులు (జతిరూపకల్పనలు) డమరుకము, మృదంగము, గోపుచ్ఛము, నాగబంధము మొదలైనవి అనేకము లున్నవి. ఆ యతిస్వరూపముననుసరించి మృదంగ శబ్దములను కూర్చుకొని నృత్తమాడుట యతి ఆట అగును. దీనికి జతిస్వరమునకు సంబంధము లేదు.

## సమస్య

నర్తకి సభలో అభినయించుచున్నప్పుడు ఒక పదములోని ఒక పాదమువిచ్చి, దానిని వివిధనాయికలుగా రూపొందుతీరున ధ్వని ప్రాధాన్యతతో అర్థపు మార్పులతో అభినయించమని పండితులు కోరుట, నర్తకి అభినయించుట 'సమస్య' అనబడును. ఇది పండితసభలకుజెందిన కళాగోష్ఠి.

# పురాణేతిహాస కావ్యప్రబంధములందు వర్ణింపబడిన నృత్య విశేషములు

వైదికమతము ఆంధ్రలో విరివిగా ప్రచారమునందున్న ప్పుడు యజ్ఞయాగాది క్రతువులందు దేవతలను అనేకరకములైన నాట్యములతో ఆరాధించెడివారు. అష్టదిక్పాలకులు, నవగ్రహములు, పంచభూతములను వివిధరకములైన నృత్యగీతములతో పూజించెడి వారు. రుద్రుని ఆరాధనయందు పలువిధములైన నాట్యములు ఆడ బడినవి. ఈ నాట్యములయొక్క వివరములు చాలావరకు "భరతా ర్ణవము" నందు వర్ణించబడినవి. ఈ నాట్యములనే కొన్నికొన్ని మార్పులు చేర్పులతో మనదేశములోని దేవతలకు ఆలయనిర్మా ణము జరిగిన పిదప దేవదాసీలు ప్రదర్శించుట ప్రారంభించిరి. వీనినిగూర్చి "దేవనర్తకీ - ఆలయ నృత్యములు" అనే గ్రంథ ములో విపులంగా చర్చించాను.

* * *

బౌద్ధము ఆంధ్రలో వ్యాపించినకాలమందు బౌద్ధ దేవతల ఆరాధనయందు నృత్యసంగీతములు గూడా ఒక భాగమై వుండినవి. ఆ సంప్రదాయముల స్వరూపము పూర్తిగా తెలియకున్నను, ఆనాటి చరిత్రకారుల వర్ణనల ద్వారా కొంతవరకు నాటి కళలగూర్చి, కళా కారులగూర్చి, కళారాధన గూర్చి తెలియుచున్నది.

ఆలయాల్లో దైవసేవనిమిత్తము బౌద్ధభక్తులు కొందరు తమ పుత్రికలను ఆలయములకు అంకితము జేసెడివారు. వారు దేవతల ఆరాధనలందు పాల్గొనుటకుగాను నృత్యగీతముల నభ్యసిం చెడివారు. మతగురువులు దేవతల ఉత్సవ సమయములందు వారిని ఆహ్వానించి నృత్యసంగీతములతో దేవతల ప్రీతి కొరకు వేడుకలు జరిపించెడివారు. నృత్యపూజయందు పాల్గొను టకు వచ్చే సమయములందు ఆ దేవనర్తకీలు, ఫలపుష్పములు, మొదలగునవి భక్ష్యములనుదెచ్చి దేవతలకు నివేదనజేసి, నర్త నము సల్పిన తరువాత ఆ ప్రసాదమును యిండ్లకు గొనిపోయెడి వారు. వారు వివాహమువరకు ఈ విధముగా నృత్యపూజయందు పాల్గొని, వివాహానంతరము విరమించెడివారు.

(ఇట్టి సంప్రదాయము నేటికినీ బలిద్వీపములో నున్నది.)

కొన్నివేళలందు దేవతామూర్తులకు, వారి అర్ధాంగులందు విరక్తికలిగినప్పుడు సామాన్య ప్రజలు దైవప్రీతికి దూరమగుదురు గాన అట్టి దేవదంపతులకు శాంతినిగూర్చి, వారిలో పరస్పరాను రాగము పెంపొందుటకుగాను దేవనర్తకీలగు బాలికలు నగ్న రూపమున నర్తనమాడెడివారు. అప్పుడా దేవతలు మనశ్శాంతిని పొంది భక్తులను పాలించెదరని వారి నమ్మకము.

(ఇట్టి నాట్యములు బెంగాలులో నేటికినీ చేయుదురట - నాగవంశీయులనే ఒక ప్రత్యేక తెగవారు నాగపంచమినాటి రాత్రి 'జెహూళ' అనే పేరుతో నాగదేవుని ప్రీతికొరకు ప్రదర్శించే ఆరా ధన నాట్యము ఈ తరగతికి జెందినట్టిదే. ఈ నాట్యము ఆ ప్రత్యేక తెగకు జెందిన ఆరాధకులుమాత్రము జూచే అర్హతగల్గియుందురు.)

ఆంధ్రలో దేవదాసీలుగాక కొన్ని వ్యవసాయ తెగలవారు తమ బాలికలను దేవతల సేవనిమిత్తము కైంకర్యముజేయుట ఒక ఆచారముగా వుండినది. వీరు ముఖ్యముగా శివాలయములకు జెంది యుందురు. వీరినే బసవిరాండ్రు, పార్వతులు అని పిలుతురు. ఈ సంప్రదాయము ప్రాచీనకాలమునుండి వచ్చినదైనను బసవిరాండ్రు నర్తనమాడరు. దేవదాసీ తెగవారుమాత్రము నృత్యము జేయుదురు. బసవిరాండ్రు అవివాహితలై దైవసేవయందు జీవితము గడుపుదురు.

* * *

బౌద్ధము తరువాత శైవము, వైష్ణవము మనదేశములో ప్రబలియుండినవి. ముఖ్యముగా శైవసంప్రదాయములో నర్తలాస్య ములు ఎక్కువగా ప్రదర్శించెడివారు. ఇవి ఆరాధన పద్ధతికి జెందినట్టివి. వీనినిగూర్చి వేరుగా వ్రాశాను.

* * *

భారతములో - విరాటపర్వమందు బృహన్నల యొక్క వృత్తాంతము నర్తన కాలలో విరాటుని కొలువులో సంగీత నాట్యములు ఉత్తరకు చెప్పి నది సుప్రసిద్ధమే. సుభద్రయును ఈ కళను నర్జునుని వద్ద నభ్యసించెను దట. సంగీతము, నాట్యము స్త్రీలకు విద్యలోని ముఖ్యభాగములుగ పురాతనమునుండియు గణింపబడుచుండెననుట నిస్సంశయము.

**భారతములో బృహన్నల :**

"కన్నియలకు నాట గరప నోపుదు
యభ్యసించితిని కౌశవ మాదిగాగ దండలాసిక విధమును
గుండలియును, ప్రేంఖణంబు తెరంగును, ప్రచారంబు;
విశతవాద్యంబులు, మంజుశృతినం భావ్యగీత సంగతులు
వద్యావాశ్రయములు, దక్షిణ్యరసాశ్రయములు నైన
యభినయంబు తెలుగుదున్
ఇన్ని తెలుగుల క్రమము సేయింతు, వట్టు వొజ్జనై
మెలగుదు నగరులందు"

## బసవ పురాణము (పాల్కురికి సోమనాథుడు)

### తృతీయాశ్వాసము

### ముగ్ధ సంగయ్య కథ

#### చంద్రోదయ వర్ణనము

(గణిక) అక్కాంత ముగ్ధ సంగయ్యకు బ్రీతి-నెక్కొని యాత్మలో
నిప్పటిలింగ
నినియంబు లింగపూజనలనటించు — తనదు విలాసినీ
జనుల రావించి
యక్క మహాదేవి! యల్లమద్దెలలు — జక్కొల్పి వేగంబు సంధింపు
కొనుడు
స్వరమానమున బసవప్రమథప్ప — కరమర్థి బట్టుము కాహళలోరి
సకళప్ప! నీపును సంగళప్పయును — నొకరీతి నిలుపుడు
ముకురంబుగాను
బాలరుద్రమ! మొత్తు పట్టుగవాళ — గ్రోలు వాయింపుము
గుడ్డప్ప! నీవు
నిట్టి తాళమువట్టు శివాదేవి ! నీపు — నట్టున నృత్యంబు
నరసం బెడంగి
సంగుదాసమ! మహేశ్వరి! సింధుభద్ర — లింగప్ప! మీరు గేళికలు
సేయుండు
రమణదుకూలంబరమును గంచుకము నమరించుకొని
చల్లడము బిగించి
యేతెమ్ము నీవు పురాతమ్మ ! శిప్ర — మాతి తమ్మగ నృత్యమాడు
దురుగాని
తాళముల్వట్టుడు దాళగింపుడు — నాదతివేళకు నందరు నిలుచు
సవిరళంబుగ నంత నాప్పటంబిచ్చి — జవనికరప్పించి
నరసమై నిలిచి
పొలుపగు ముఖరసంబును సౌష్టవమ్ము — లలియు భావంబు
ఘూకళియు ఝుంకళియు
మరియు తేవయు విభ్రమము రేఖయును — నెలయంగ
నీరీతి నృత్యంబు సలుప
లింగార్చనంబు సల్లీల జేయుచును — మంగళారవములు సంగడి
సులియ
వెల్లవే గుడు స్వచిత్తోల్లాసమమర — సల్లీల సమ్ముగ్ధ సంగయ్యకిట్టు
లంగన పరిచర్య లాచరింపంగ — లింగావసరము చెల్లించుసంతటను

* * *

## పండితారాధ్య చరిత్ర - పర్వత ప్రకరణము

### శివరాత్రి జాగరము - ఆటపాటలు

### 10 విధముల దేశీయములగు ఆటలు

(1) చిందు, కోడంగి యాట

(2) బన్నని నిజదేశ భాషల జతుల కన్ని కోడంగాట లాడెడివారు.

(3) భ్రమరముల్ సాళెముల్, బయకముల్ మెఱసి పసిబి బంబాని పేరది యాడువారు.

(4) ప్రమథ పురాతన పుణ్యచరిత్రములు గ్రమమొంద బహునాటకము లాడువారు.

(5) లలితాంగ రసకళాలంకార రేఖ — లలరార బహురూప మాడెడివారు.

(6) గరణముల్ మెరవణుల్ గతులు చిత్రములు నిడుదగ గడలపై వెర్డంగ మాడెడివారు.

(7) నమయంగనలు దివినాడెడుమాడ్కి సమరంగ గడలపై నాడెడువారు.

(8) నావియుగ్గతి బక్షులాడెడినట్టి — భావనప్రోకులపై నాడువారు

(9) భారతాది కథల జీరముఖంగుల — నారంగ బొమ్మల నాడించువారు (తోలుబొమ్మలు)

(10) గడునద్భుతంబుగ గంబసూత్రంబు — లడరంగ బొమ్మల నాడించువారు (కొయ్యబొమ్మలాట)
నాదట గంధర్వ యక్ష విద్యాధ - రాదులై పాడెదు నాడెదు వారు.

## దేశీయ నాట్యపద్ధతి

### ఆహార్యము

విధముస ప్రచ్ఛన్న వేషముల్ దాల్చి — యధికోత్సవ
ముదులుకొడ నాట్లాడు
శిరమున నురమున జెవుల కంఠమున — గరముల గూకట
కాళ్ల జెల్వార
గవదండటను గనుగవ గవణికలు — నవరంబులును
గలశంబు దండలును
భసితంపు పూతపై బరగు బచ్చెనలు — నలరారు చిరు
గజ్జియలు నందయలును
సరిరత్న పంక్తుల జిలదోననములు — గరమొప్పు తొంగళ్లు గల
చల్లడములు
బొల్చు దంతావళుల్ పుష్పమాలికలు — దాల్చి యత్యద్భుతోత్సవ
లీల దనర

### 16 పక్షి మృగముల చేష్టల అనుకరణములు

నెమిలియు బోలె నుస్నతి నటించుచును — భ్రమరంబు క్రియదాన
బరిఘటించుచును
చిలుకయు బోలె జెన్నొలయ బలుక్కుచును — జలచరంబులవోలె
జనుల కులుక్కుచును
గలహంసయును బోలె గతుల నేర్పుచును — నిల మృగ మట్లరిమి
(రిమి) జూచుచును
గండు కోయిలవలె గడగి కూయుచును — వెండి క్రోతియు వోలె
వికృతి సేయుచును
వాలతేడును బోలె నటయిట ననుచు — గోలికాడును బోలె
గోర్మెన గొనుచు
మద గజంబునుబోలె మాఱుమలయుచు (ను) - బొదలి వ్యాఘ్రం
బట్ల పాఱినులియుచును
గేసరివోలె లంఘించి పట్టుచును - మానటీడును బోలె మట్టి
వెట్టుచును
మహి భుజంగమువోలె మలకలుగొనుచు - విహగంబు క్రియ నభో
వీధిని జనుచు

### 5 విశేష మానుష వ్యక్తుల ననుకరణము

నరి విలాసినివోలె నభమురియుచును పరవిటునట్లు భావము
లరయుచును
గతియట్ల నవరసగ్రాహకుండగుచు — శివయోగి యట్టులు సిలు
నప్పు నగుచు
బగలే వృపననట్లు పరిణమించుచును.

### 8 అమానుష వ్యక్తుల (ననుకరించుట) పోలికలు

పొగలేని వహ్నియ బోలె మించుచును
ఛాయలేని వెలుంగు బోలి గప్పుచును — మాయలేని
ఘోరారిమాడ్కి నొప్పుచును

### దశవిధ శివలీలా నాట్యములు

పుతములు గొల్చిన పోల్కి యాడుచును — మరు జిఱుపుచ్చిన
మాడ్కి నాడుచును
సతికర్ధ మిచ్చిన చందమాడుచును—యతులు గొల్వగ నుస్న యంద
మాడుచును
సంధకాసురు మదంబడచుటాడుచును — గంధ గజాసురు గతవ
టాడుచును
జన్నంబు ద్రుంచిన జాలినాడుచును — వెన్నం కన్నిచ్చువేళ
నాడుచును
గరళంబు దాల్చిన కరణి యాడుచును - సరిస జాలలగొను సరణి
యాడుచును
వెండియుభవు బహువిధ చరిత్రముల — ఖండితగతి నాటకంబు
లాడుచును

భృంగియు సభిపతప్రీతి మర్త్యంబు — భృంగులలో దాను
భృంగియై యాడ
గంబళాశ్వతరాది గణాధిపతులు — తుంబురు నారదాదులు
ప్రీతి బాడ..

### 45 అభినయభేదములు

**మార్గనాట్యపద్ధతి - దేశిపద్ధతితో భరతుని మతములో కలిపినది**

సంగరాగంబు గీతాంగరేఖయును — రంగశోభయు ముఖరాగంబు
దతియు,

వితతంబు, నిలయంబు, విగతియు సంస — గతియు, నాపత్తిని,
గ్రహాసితి, లపణి,
దేసికొరత సభాధీరధియును, గజాసంబు, సౌక్కి సళావళి, భ్రమరి,
యపధానమును, సంధియనునొక విధము — వ్యవసాయమును
నిజపణియు, లంఘిరిమి
దాళి ముఖ యోప తాపనయును, సుతాళంబును, బ్రసన్నతయు,
విపర్తినము
బయవాటము, లలిత, వసయు, గనిషక్కయును, సప్పణము
బళయును, గోమిళక,
యుల్లాసమును, లలియును, — మనోహరము — దీల్లాయి, దుఱణి,
చేపణి, జింకె
చాలంబు, తిపళి, నౌష్టపము, విభ్రమము .. జాళి, యొయ్యారంబు,
నరసంబుదనర

4 పత్త్రి విభ్రమములు। 7 భ్రూలతాటనములు । షడ్విలశతిక్రమ
చిత్రరింకిరము.

10 కరాపధానములు, 9 గళముఖోల్లాసములు । 3 నక్షోవిలాసములు
5 పాదద్వయ పంచకము । ఊరుద్వయ కలిత పంచకము ।
వింశతి అంగహారములు । బంధి సుగతి, సమభంగి, త్రిభంగి,
యనుడగు 12 తానకములు

చతుర్త్రిసుదృష్టు । జౌషష్టి హస్తములు । బత్తీసుచారులు ।
7 భ్రమరములు

108 కరణములు । 100 అలంకారములు । 13 శిరోభేదములు
32 దండనములు

| | | |
|---|---|---|
| హంస | మేష | మొదలైన పెక్కుగతుల నొప్పారు |
| మాతంగ | మయూర | |
| వృషభ | భోగి | |
| మర్కట | | |

రంభ యాదిగ నప్పరస్స మూహంబు
గుంభినీ ధవునితో గూడియాడంగ

## శ్రీనాధ విరచిత

### పల్నాటి వీరచరిత్ర - బాలచంద్ర యుద్ధము

### నలగామరాజు సభయందు విద్యావిధానములు

( నందికేశ్వర రచిత అభినయ దర్పణమందు చెప్పినట్లు శ్రీనాధుడు రాజసభను వర్ణించెను. ధీరోదాత్తుడు, రసగ్రహణపారీణుడు, సమర్థుడు అగు సచివోత్తమకవి సుహృజ్జనముతో తూర్పు ముఖమున కూర్చుండగా, ఆ రాజునకెదురు నాట్యము చేయవలెను. ఆ స్థలము రంగమనబడును. )

పాక శాసను కొల్వు పగిదినున్నట్టి
వేళనేతెంచిరి విద్యాధికతను
నాట్యమేళమువారు నవ విలాసముల
వచ్చి నమ్రతమొక్కి ప్రక్కగా నిల్వ
ఘనవైభవంబున రాజు భూవిభుడు
నవ్వుచు సెలవిచ్చె నాట్యంబు 'సేయ'
నవ మృదంగము చెన్న వాయించుమేటి
కుడి భాగమున యందు కుదురుగా నిలిచె
తాళ మానజ్ఞులు దాపటి దిశను
నిలిచిరుత్సాహంబు నేరుపు మీర
ముఖవీణ వాయించు ముఖ్యుడొకండు
రాగమాలాపించు రమణులిద్దరును
నిండువేడుకతోడ నిలిచిరి వెనుక
కంజలోచనయును ఘనమైన పాత్ర
మదను పుట్టపుదంతి మంజులవాణి
భరత శాస్త్రోచిత బహురాగములను
గరిమతో నేర్చిన కంతు బాణంబు
వచ్చి సభాసదులు వర్ణించి చూడ
నిలిచి నాట్యమునకు నేర్పరియైన
వేత్ర పాణికి దగు వినయంబు జూపి
అతడొసంగిన గజ్జలతి భక్తితోడ
పాదములంగట్టి పంచవర్ణముల కా
శీ గట్టిగ కట్టి కడు జవం బమర
మద్దెల తాళాల మధ్యనిల్చుంచి
ఓర జూపున రాజు నొయ్యన జూచి
సమపాద యుతమైన స్థానకస్థితిని
తాత్పర్యము దేవతలకును మొక్కి
పుష్పాంజలి యొసంగి పూని నాట్యంబు
సమకట్టి నాదంబు సభయెల్ల గ్రమ్మ
కైకోలు విడుదలల్, ఘనకాళాశెలి
కైముడి కట్నముల్, కనుపింపజేసి
వెలయంగ తొమ్మిది విధములైనట్టి
భూచారి నాట్యంబు పొందుగా సలిపి
పదునారువిధములై పరిగిన యట్టి
ఆకాశచారియు నమరుగ నాడి
అంగహారాఖ్య గలట్టి నాట్యంబు
విదితమౌ తొమ్మిది విధముల నాడి
గతి, చారి భేదముల్ గనుపడునట్లు
భ్రమణ సంయుత దీప్త పటిమ మెరంగ
పాద భేదములను పాటించి చూపి
స్థానక సంచయ సంయుక్తి అమర
ప్రేరణి దేశిని ప్రేంఖణ శుద్ధ
దండికా కుండలి తగు బహుచారి
సప్త తాండవములు సల్పె చిత్రముగ
సభవార లాశ్చర్య సంయుక్తులైరి
తిరువాత నిరుమేల దగు చెలులమర
సంయుతా సంయుతా చలన సంకుచిత
నానార్థకరములు నాట్య హస్తములు
శిరమును చూపులు చెక్కిళ్లు బొమలు
దంతోష్ఠ కంఠముల్ తగు చుబుకంబు
ముఖరాగ పక్షముల్ మొదలుగ నెన్న
అంగంబులారు ఉపాంగంబులారు
ప్రత్యంగ సముదయం బారునుంగూడి
మొనిమిది పదియగు నెసగు నంగంబు
లమరంగ నభినయం బాశ్చర్యముగను
మూచర్ల చెన్నుని మహిమంబు దెలుపు
ఆంధ్ర సంస్కృత వాఙ్మయ గీతముల
భావంబు లెస్సగా ప్రకటంబు చేయ
చూచి రంభాదులు చోద్యంబు నొంది
శిరములు వంచియు సిగ్గును జెంది
అప్పుడు భూమీశుడు పరం బొప్ప
వస్త్రభూషణములు వారలకిచ్చి
పోయి రమ్మని పంపించె పిదప

# నృత్యకళలోని వివిధ సంగీత రచనములు - వాని స్వరూపములు

నృత్య సంగీతమునందు పాడబడే వివిధరకములైన సంగీత రచనములగురించి ఈ క్రింద తెలుపబడినది. ఇందలి వచనములు, కీర్తనలు, పదములు మరియు అనేక విధములైన దేశి సంగీత రచనములు దక్షిణ భారత దేశములో భరతనాట్యము, భాగవత సంప్రదాయము, యక్షగాన సంప్రదాయములందు వివిధ భాషలలో ప్రయోగించబడుచున్నవి:

1. వ॥ అని మెచ్చుటలాడి యచ్చట నిప్పుడమివేల్పు జవ రాండ్రు కట్నంబులకై కొట్నంబు దంచుచు అమ్మహోత్సవాల యాంగణంబున సువ్వాల పాడిరట యెటువలెను.

సువ్వాల : సువ్వి మోహనాకార సువ్వి భక్తమందార సువ్వి
చెండలంకార సువ్వి ॥సువ్వి॥ 1
జాసవాలు దొరలుచూడ పసుపులేటి దరులజాడ
తానకేళి సలుపుచున్న రాజమన్న॥ 2
పాలకడలి రాచపట్టె - దాళిమీఱఁ జేపట్టి
శ్రీలఁజాలఁజెలఁగునట్టి - చెలువమన్న॥ 3
విజయరాఘవునివీలు - వెలయుచున్న రాజమన్న
గజరాజగమన నేలు - కరుణ మీఱఁగా॥ 4

2 ధవళం : జయ జయ హేమాబ్జ వల్లి
జయ జయ కాంతామ తల్లి
జయ జయ రాజగోపాల
జయ జయ రమణీయశీల
జయ జయ కలశాబ్ధికన్య
జయ జయ భువనైకమాన్య
జయ జయ నందకుమార
జయ జయ మోహనాకార

3 శోభనము : శ్రీ రాజగోపాలునకు
శృంగార విలోలునకు
చారుముఖోల్లాసునకు
చంపక వనవాసునకు
నీలాంబుద వేణికిని
నిత్య కళ్యాణికిని
జాబవా బొమ్మకును
చక్కని చెంగమ్మకును

పై పాటలు 'యక్షగానములు (తంజావూరు)' సంపుటము ౧ నుండి గ్రహింపబడెను.

## 1. రాగమాలిక

1. వరశాంగి రాగం - తిశ్రలఘు
సామీ నీపై ఆ సరసాంగియు చాలా మరులుకొన్నదిరా
ఆరటమును మనసునగల
ఆతురలు తెలియ వ్రాసిన
సారసాస్త్రధరుడౌ మదన
శాస్త్రములను నెరచదివిన ॥సామి॥

2. సావేరి
ఏమి సేయుదునని మనసా వేరే
యెల్లప్పుడును చిం
తించుచున్నదిరా
మంచి వితరణ గలది యని
యెంచి సరగున నాపై నెన
రుంచి సదనము కొరకు చను
దెంచి కౌంగళిం చానునుంచె ॥యే॥

3. నవరోజ-
నా మనవి విని
నీ వచ్చితే యది
నవరోజ నీ కాని
యాడునురా
తామసములను చలుపుట
నీకు తగదుర యల వని
తామణికి సరిమెన పర
మాత్తుదని కయే మురవిడు ॥నా॥

4. లలిత
తామరసాక్షి నీ
లలితా కారమును
తగల జూచుటకు శ్రీ
తియు గనదిరా
గారాబముతో పదముల తీరుగ గొలుచు
జనులకు దురాగ్రహము నిరాకరించి విరావ
శుభ వరాళొసగు ॥తామ॥

5. వరాళి
ప్రేమతో ఘన
వరాళి యదిసను
బిలిచి నీవద్ద పొమ్మనె
నురా
కూర్మిర మరుడు విరి శరములు
సారెకును యెదపై గురియగ

వారిజముఖి నలపు మిగుల
మీరి నిను కలయుటకు అతి ॥ప్రేమ॥

6. ఆరభి

భామకు నీ ప్రే
మముచే మన
సార భిన్న
లేదాని చెప్పు ఓ
న్నానురా
గాన రసిక శిఖామణియని యశము
గలనీకు సరిసమాన మెవరు
లేదనుచును అనుదినము కొనసలెసను

7. కమాను

వేమారు తడజేయక
మా సుదతియొక్క
వెతదీర్పుట కిదె
సమయము
దాని గుణము దలుప వశమా
పరమ పురుషవర న
వా నిను మదిలోన దలుచు దా
నిపైన అరమరబడి ॥వేమా॥

8. భూపాలం

భూమిలో వెలయు భూపాలుడని
ఎరిగి....నీరాక కోరియున్నదిరా
మార జనక యల మ
ల య మారుతుడు బహు విసరగ
మనసుకరిగి యిది మరి మరి
నిను మదివేదెర సామిగ॥

## 2. రాగమాలిక-ఆదితాళం

సుదతీ నా మోహ నాంగుని
సారవములు సలుపతగునె సాధారణముగ నీవు దెలిపి॥
తోడి తేవే లేవే – మోహనాంగుని
నా మనసున వెతలను – చెలిసీ దయగలిగి వేగమె విభుని॥
క్షితిని వెలయు నిందుపురిని వసంతు దౌ॥
అంతాండముల కాధారమగునని మునీంద్ర సురలాది
నరులు పొగడగ
శ్రీ మెఱయు పరిమళ రంగేంద్రుని
క్షీరసాగరమునబుట్టితివని స్థిరముగాను గొలిచిన సంపద
లిడు సారెకును అతని పదమె గతియని చలముమాని కరు

ణించ మనవి విన కనికరమునమదిగరగి సదయునికి సరసకు
ఇది సమయమని దెలిపి సరగున ॥సుదతీ॥

చెలిమి జేసిన మొదలు కళ్యాణి
ఆ చిరుతనాటి మొదలుగనే ఘనతరముగ మదిని – విభుని
చిత్తగింపుమని శావా కోరితి
నామనవి ఏని సారెకు రావలెననుచు అడుగడుగుకును
కలికి దానికే తమనీ తెలిసి
సామిగయని పొగడి పొగడినా సదయుడని ఈజగములెరుగు
కవ్వడ చేసేది తగునా నాపై
నా మనసెరిగి రతుల పగలన్ జరిపింప తగినవానికి
పలరాయని సారంగముల శరము
కోకిలలుగూయ మఱిమఱి నాసరి, సకులు విని సతతమును
వచ్చిపోతావా బహుళా నిన్ను వేడితి
నే దిగులు పొందినది వినీ విరిశరంబు లురమున
సొలపుమీరి విరహాంబుధిలో
అనాటి సరస విధముల నామది భ్రమసి సదాతలచగ
సొక్కితినే జవరాళి వినవే
నా సరసుని నే తలచ అతని సురత కేళిలో మది తగిలి
అల సౌరాష్ట్ర దేశమున
ఈ జగములలోపల మిగులా సరసుల కనులకు సొగసుగ
దానలో చిక్కిదరు పాము వెతలని
నాసరిసఖులు వాని విభునీ ఇటుల చలమెసగ జేసితె
పలుకరించి నాదు కోర్కెల నీవు పక్షమాలికాభరణ భూపా
లునిగ నీమది కటిగి ఇటులవగలన్ సరసుని కెఱుగ
లలితముగ

భూ– సారెకును నిటుల వగల తగని
ద– సరోజముఖియిది తెలుపవె వానికి
సా– వలచితినని విరిబాణము చేకొని
వ– మనసిజుండిదిగో మిగుల గాచెనని
కాం–పలుకక విని మది విరాళి గొంటివి
ఉ– ఇదే సమయం మని రంపునవే
సా– ఇకను నాదు తాపము తీరుదు విను
క– వచ్చినన్ను కౌగలించి వేగమే
కే– కదియగ పెనగొని చాల వేడ్కతో
శ– తా నధర మధురామృతం బొసగే
క– సదా ముదమునను గలయుటకు విభుని
మో–సరకునిది సమయమని తెలపి సరగున ॥సుదతీ॥

## ప్రహ్లాదచరిత్ర - యక్షగానము

శుక్రకుమారుని వాక్యం : కర్త : విజయరామవృతు

ద్విపద : దనుజేంద్ర, హర్షమెంతయు నయ్యెనేడు
దినము మంచిది శోడి తెప్పింపు డతని
పదునాల్గువిద్యల ప్రావీణ్య మమర
జదివింతు నీమది సంతోష మొదవ

### ఏ ల పా ట

ఉంజలి (ఊయల)

శ్రీరంజిల్లు । కౌసల్యయందు
చెలగి యా కైకేసుssssమిత్రయంssssదు
మేలిమిగా లక్ష్మణభరత తోssssనూ
మేటిమిగా శత్రుఘ్ను బోపనింప
భూలోకమున జనులయింట బుssssట్టి
పుణ్యుడై దశరధుని యింట బుsssssట్టి

*    *    *

ఏలేssఓssssssరామ జయం sss
శ్రీరామం
ఏలేssఓssssssస్వామి జయంsss
శ్రీరామం
నీల నీssssరద రుచిరం
శ్రీరామం
నిత్యశssssళ్యాణ కరం
శ్రీరామం
పాశిssతssssసుర నికరం
శ్రీరామం
పరమ విssssలాస కరం
శ్రీరామం

గతి ఖండ

కేళివిలోలం
కేళాన శ్రీలం
పాలన లోలం
భజన శ్రీలోలం
పాల సాగరమందు
ఏల జాడుచును
పాలుని పోలిక
కాళి బోటన్నవేలు
వాలాయముగ నోట
నొవర కీలించి
లీల మట్టాకులో
చాల పవళించె
మేలిమి శోడుత
మెల్ల పరికింపుచూ
కేళీవిలాసుడై
క్రీగంటి చూపుల
పాలన చేయుచు
పరగసంతోషించి
బాల శ్రీరాముని
ప్రణతులు సేయరే } మిశ్రము
ఏలేsssఓsssss
రామజయం sss
శ్రీరామం

తాండ్రకేళిక :- కృష్ణ కర్ణామృతము నుండి

శ్లో॥ అంగనా మంగనా మంతరే మాధవో
మాధవం మాధవం చాంతరే చాంగనా
ఇత్థ మాకల్పితే మండలే మధ్యగో
సంజగే వేణునా దేవకీ నందనః ।

*    *    *

విప్రనారాయణ యక్షగానము నుండి

కురంజిరాగం, ఝాంపెతాళం, త్యాగమానం

పాడుకు నూఖు జాసల నీరు
చేదితే పొదలు చేమంతి పొదలు.
పండె గోపాల పెండె గోపాల
చెండు చేకొన్న శ్రీరాజమన్న॥
చలువలదేరు సంపంగిపె రు.
కాల్వలకే నూఖు కదవల నీరు
విరిజాజిపొదలు వికసించె నేడు
సురపొన్నలు సొంపురాణించె
మల్లెలు పూచె మగతేటి జొచ్చె
మొల్లలు చిన్న మొగ్గలువైచె
పొన్నలు పెరిగె పొగడలు బొదలె
సన్నజాజులకు సమయము వచ్చె
ఎలదోట విరులు హేరాళమాయె
ఫలమిచ్చి నన్ను బనిగొనవయ్య

### జతి - కైవారం

తరుణీ జన కుసుమ సాయక
తంజాపురీ నాయక పరాకు

## అష్టకం

రాజముఖి వినవమ్మ చక్కని
రాజగోపాల చంద్రుని
రాజనమ్మున తోడితేగదే
రతుల యీరేయి గూడను
తేజమున నరిలేత మించిన
దీనజన మందారుని
భోజరాజ తనూజ నేలిన
ఘనని మోహన గాత్రుని॥

## చూర్ణిక

శ్రీ చంగమల వల్లి మనోహరాకార!
చారుతర మాణిక్య గోపుర ప్రకార!
సమస్త దైతేయ కమల వన వేదండ!
సంభృత శార్ఙ్గ కోదండ!
సంతత దక్షిణ ద్వారకావాస!
శారదచంద్రచంద్రికాహాస
రక్షిత చోళ భూపాల
శరణం తవ చరణ రాజీవయుగళం భజేహం.

వేల్పూరి నరసింహదాస విరచిత కాళింగ మర్దన యక్షగానంలోని

## చల్లలమ్మ దరువు

చలోయమ్మా చల్లా । గొల్ల చల్లో యమ్మా చలో ।
చల్లగొ[redacted]ఖులెల్ల ముదంబున ।౩।
యెల్లలోకముల । కెన్నికగల గొల్ల ॥చల్లో॥
పెరుగోయమ్మా పెరుగు ॥మీగడ॥
పెరుగోయమ్మా పెరుగో ।
మురియుచు వృద్ధులు । భుజియించు నప్పుడే ।౩।
త్వరగ యవ్వనము దాల్చెదరే గొల్ల ॥చల్లో॥
పాలోయమ్మ పాలూ । ధేను పాలోయమ్మ పాలో ।
మేలిమి కసివగ బిగిబిగి గల్గు గొల్ల ॥చల్లో॥
ఘృతమోయమ్మ ఘృతము । కమ్మని
ఘృతమోయమ్మ ఘృతము ।
అతిబలకైనను మతిగల్గును యీ ।౩।
క్షితి చక్రాపుర వరపతికి తగిన గొల్ల ॥చల్లో॥

## నాట్యసాహిత్యంలో ఉపయోగించిన స్త్రీ పర్యాయపదములు

| | | |
|---|---|---|
| నెలత | శృంగారవతి | మెలత |
| చెలువ | కప్పురగంధి | బాలిక |
| చంద్రాస్య | లలన | వేదండగమన |
| వాన | మగువ | కమలాక్షి |

| | | |
|---|---|---|
| కలికి | లతాంగి | జవరాలు |
| కనకాంగి | కోమలాంగి | వారిజాక్షి |
| హేమాంగి | కంబుకంఠి | కంజాక్షి |
| జాణ | కుందరదన | అలివేణి |
| సకియ | ఇందువదన | వనిత |
| తరుణి | ఇందుముఖి | వెలది |
| వనిత | పూబోణి | కాంత |
| పడతి | మృగాక్షి | పడుచు |
| కొమ్మ | మదవతి | పట్టి |
| చెలువ | తరళాక్షి | మేచక కచ |
| తలిరుబోణి | జలజాక్షి | నీరజముఖి |
| రామ | కలకంఠి | మీనలోచన |
| చామ | వనజగంధి | కామాక్షి |
| ఉవిద | వనజముఖి | కోమలి |
| సుదతి | పొలతి | రమణి |
| మదిరాక్షి | వెలది | కాంత |
| ఇంతి | ఎలనాగ | పొలతి |
| విరిబోణి | భామ | జవ్వని |
| పల్లవాధర | భామిని | కొమ్మ |
| శతపత్రలోచన | మత్తకాశిని | చిలుకలకొలికి |
| తోయజనేత్రి | మచ్చెకంటి | సన్నుతాంగి |
| చందనగంధి | పద్మనయన | జలదవేణి |
| అతివ | నీరజలోచన | పణతి |
| వనజలోచన | పద్మగంధి | రాజీవనయన |
| కాంత | తామరసేక్షణ | మంగళాంగి |
| గజయాన | కన్య | లోలలోచన |
| కరిరాజగమన | నెరజాణ | చిత్తిని |
| మరాళగామిని | కుటిలకుంతల | లలితాంగి |
| రాకేందువదన | వాలుగంటి | తొయ్యలి |
| నీలవేణి | మందయాన | మదావళగమన |
| కలికి | చంచలాక్షి | |
| పంకజమృదుపాణి | చపలాక్షి | |
| విమలాంగి | మగువ | |
| వామాక్షి | నళినాక్షి | |
| తొయ్యలి | జవ్వని | |
| అంగన | మించుబోణి | |
| సంపూర్ణచంద్రాస్య | రమణి | |
| విలాసవతి | ననబోణి | |
| రాజవదన | ముదిత | |
| ఇందీవరాక్షి | కొంచెగత్తె | |
| మెచ్చులాడి | వన్నెలాడి | |
| నారీమణి | హరిణాక్షి | |
| మెఱుగుబోణి | లాచంచక్షి | |

## చమత్కార రచన

చ॥ చిగురుల తూపులున్ గల వజీరుని తల్లికి
తోడ బుట్టువున్
తగ తలదాల్చు వాని మెడదండల తిండి కుమారునిన్
ధ్వజం
బుగ గొనువాని ప్రేమసతి పుత్రుని తాత విరోధి
తాతనున్
జగమెఱుగంగ నేలు జలజప్రభ నేత్రుడు
బ్రోచు నెప్పుడున్

టీ॥ లేత బాణములు గల సిపాయి మన్మథుడు।
మన్మధుని తల్లి లక్ష్మి। లక్ష్మి తోబుట్టువు చంద్రుడు।
చంద్రుని ధరించినవాడు సదాశివుడు।
సదాశివుని హారములు సర్పములు।
సర్పముల కాహారము వాయువు। వాయుపుత్రుడు ఆంజనేయుడు। ఆంజనేయుని జండా
ధరించినవాడు అర్జునుడు। అర్జునుని సతి
సుభద్ర। సుభద్ర కొడుకు అభిమన్యుడు।

అభిమన్యుని తాత యింద్రుడు। ఇంద్రుని వైరి
బలిచక్రవర్తి। బలితాత ప్రహ్లాదుడు।
ప్రహ్లాదుని రక్షించినవాడు నరసింహుడు।
అటువంటి నరసింహుడు మిమ్ము రక్షించు నెప్పుడున్।

యాదవాఖ్యకవిరచిత

### గరుడాచల నాటకము

ఎరుకత తావచ్చెను। లవ్వోయవ్వా
ఎరుకత తావచ్చెను॥
ఎరుకత తావచ్చే। ఏడేడు భువనాలు
మరువక నెరువకయు। మరివేగ జెప్పుచు॥

నవరత్నములు దాపిన
పెట్టియువేగ। నయముతో శిరమందున
భువన మోహితురాలు।
పుణ్య చారిత్రియు।
అవనిలో జనులంత।
అమ్మరమ్మని పిలువ॥

పంచరంగుల చీరయు।
మధ్యంబున కంచుకంబును దొడగియు
పంచబాణుని చిలుక
పరమ కల్యాణియు
యెంచ శక్యముగాని। వెలదులు కొలువగ॥

మణిమయ హారంబులు
కాళ్ళందెలు ఘనముగా
మ్రోయగను
మాణిక్య। ముత్యాలహారము
శోభిల్ల। వేణి జల్లాడ
విరులాడ। బంతులుజార।
బాలుని దానెత్తుక। భద్రాద్రేశులీలలు బహునేర్పుక
లోలాక్షి కమలాక్షి లోకమాతయని
ఫాలాక్షు సతిసుత పరమకల్యాణి॥

## సింహళ నృత్యమండలి పల్లవులు - పర్ణములు

**1** గజ

దొంకిట తకదొము
లేక
దొనుడినుగత్తకు గడిగత ధోంతక॥
తనం। తానతు తందోన తంధనా నతు
తందోన తంద నానతు తందన తందన తాన
తరిక। గడదికు జత్తను
కస్త్రిర తరికిట జితు తరికిట దడుంగు రా॥

**2** నయియాది

ధోం జం జం తికిట దొము తక
తనం। తోంతెనెనము తెనెనము తెనె న న
తెనక తెనము తెనెనము తెనెనానా
తరిక
కస్త్రిరా} తకట తతు జితు తకట కుదతరి జితు, ధోం దీఝము

**3** కిరల (వుడ్‌పెక్కరు)

ధోం జిం జిం తకిట దోంతక
తనం। తందన తాన్ తన తన్ తందన
తందన తాన్ తన
తెయి తన్ తాన్ తన తన్
తందన-తైయి తన తాన తన
తరికి తకట తజ్రితు తకట క్రుదతిరి జితు

**4** యిరాది

తాళ॥ గత్తకు క్రున్‌దతు జిం
తనం। తనన తనత। ననగ తనత
తనన్ తననా। నాత్ నన
కస్త్రిర॥ తంగోగతు। తక తోం గతు
తక తరికిట। తక తోం గతై యి॥

### 5 ఉదర

తాళ॥ ధోం జిగత్
తనం। తందన తందాన తిందనాన
తము దన తన తందాన తందనాన
తత్తోంగతు తక తోంగతు తెయి
(తక) కుద గజి జిత్తా

* * * •

### 6 సింహరాజ

మాత్ర– ధోం జిం జిం తకిట ధోం తక
తనం– తమతు తనెన తము । దనతు
తనతు తందనతు తనెన తము
దనతు తనతు తన
– తకట తజింతు తకిట కుద తరి జితు

### 7 హనుమ

మాత్ర– ధోం జిం జిం తకిట ధోం తక
తనం– తనము దనతు తందనన తనము
దన్ । తనముదనతు తెనెన – తెయి ।
తనందనతు తందనతు తనందెన
తనము దెనెతు తనెన
తియా। తకట తతు జితు
తకట క్రుద తిరి జిత

### 8 గణపతి

మాత్ర– గత్తకు క్రుసు దతు జిం ।
తనం– తము దనము దన తన
తాన్ తనముదన తన
తాన తన తందనతము దన తానా
తియా । తతు తోసు గతు । తక తోసు గతు
తక తరికిట తక తోం గతు తైయి

### 9 నవుల

మాత్ర– తైయి తైయి తతు తతు తరికిట॥
తనం– తము తందన తనము । దన
తందన తనము తము తందన
తాన తైయి తంద్యాన తందనన
తియా– తతు తరికిట జి తరికిట
క్రుద తరికిట జి త్తా॥

### 10 గహక

మాత్ర– ధోం జిం గత్తకు గజిగత ధోం తక॥
తనం– తమ తందనా తందనా తందనన
తెయి తన తందన తందనా తందనన
తియి॥ తెయికిత కిత తతు
తరికిట కితతక గజ్జితు తకజతు
తజ్జితు తోన్నను తా॥

### 11 వైరోధి

మాత్ర॥ గత్తకు క్రున్ దతు జిం॥
తన। తందన తందన తందన తన
తాన తెయి తానతెయి తాన తెయి తాన
తందన తన తానతెయి తనము
దన తందెన తానతైయి తంద్యాన తిందనాన
తియా॥ తతు జితు తతు । తక జితు తక
తక తరికిట తక జిత్తక ॥తై॥

### 12 మయూరి

తాన– క్రుద క్రుద గజితు గత్తతు తకిట
తనం॥ తనెన తన తన తనెన తన తన
తనెన తన తానా – తనెన తన తన
తనెన తన తన తనెన తన తనెనా
తియా॥ క్రుద క్రుద గజితు । క్రుద కుద గజితు
క్రుద క్రుద గజితు । గతు తతు
తకిట । తరికిట జెమికిట తా –

### 13 తురగ

తాళ– ధోం ధోం గజతు జిగిత
తనం– తతు తతు తనతు తనెన
నతు తతు తనతు
తనెన తత్తతు తనతు
తనెన తానా – తన తనెన తన
తనెన తనె నతు తనతు తందనతు తందనానా
తియా। క్రుదగజితు । క్రుతగజితు ।
క్రుతగజి । జిత క్రుదను॥

### 14 మరవతి

తాళ– ధోం జిం జిం తకట ధోం తక్
తనం– తన నత్తు తందన త నందన
తందనతు తందాన తనతము – దన తందనాన
తియా। తకట తతు జితు । తకట క్రుద తరిజితు

### 15 మువలాడి (చెవులపిల్లి)

తాళం– ధోం జిం జిం తకట ధోం తక క్రుద క్రుజిగత

తనం- తానత్త తానత్త తానము। తంద
నానత్త తనెనత్త తానము -
తన త్తనెన తనెన తనెన
తానెన తందాన తనెన। నానత్త
తనె నత్త తానము
తియ॥ తకిట తకు జితు తకట
క్రుద తరి జితు॥

16. ఉకున

తాళ॥ దొమికిట తకదొమి
తనం॥ తానా తా నెనము తానతు
తనెనతు తందన తానతు। తనెన తనెన
తందెనతు తానతు - తానా తనెనము
కస్త్తిర॥ గతు జతు తకజతు
గజ్జతు తోన్నతా॥

17. ఉరగ

తాళం- క్రుద క్రుద గడను గత్తతు తకట
ధోం జం జం తకిట ధోం తక
తనం- తందానెనెన తాన తనము - తమద నాన
తనాన తనాన తనాన తనాన తనాన తనము
తంద నాన తనాన తనము
తియ॥ క్రుద క్రుద గజను క్రుద
క్రుద గడను। క్రుద క్రుద గడను
గత్తతు తకిట తరికిట జెమికిట తా

18. అపాద్రన

పాత్ర- తక్రు దను తతు తరికిట కిటతక
తెయి తకట తక తెయికిట తెయియతు
తెయి తాతెయి యతు తెయికిట కిటతక
తనం- తానము తందాన తనెన తంద। నానము
తందాన తనెన తంద (నానము)
తందాన తనెన తంద।
తియ- తర తక తిరికిట తకు జెంతా॥

## సుందరేశ్వర విలాసము

### కవి - చెయ్యూరు చెంగల్వరాయ

(చెలులు మీనాక్షిని భర్తపేరడుగగా చమత్కరించి చెప్పుట)

సీ॥ ఇభరాజగమన నా విభుని పేరడిగేవు
వినవమ్మ చెప్పెద వివరముగను
తరిత్రాడుగా చేయదగు పాముపేరేమి? (వాసుకి)
కదలిత్రచ్చిన గొప్ప కవ్వమెద్ది? (మందరం)
పూలతేనియలను గ్రోలెడు పురుగెద్ది? (ద్విరేఫం)
యరదంబునకు ముందు పరచునెద్ది (అశ్వము)
ఇలునిండ వెలుగొందగల భూషణంబెద్ది? (తరుణి)
విఘ్నేశ్వరునిచేత వెలయునెద్ది (కుదుము)
తే॥ గీ॥ అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
మధ్యవర్ణంబులందు నా మగనిపేరు
గానబడుచుండునమ్మ యూహె సేపరసి
అందరికి తెలియబల్కవే సుందరపన।

## క్రీడాభిరామము - వల్లభరాయకవి

### చలి - ఆంగికం - సాత్వికం

ఉ॥ ప్రక్కలు పంచి[1]పంచి మునిపండ్లను పండ్లను రాచి[2]రాచి టొ
మ్ముక్కల జేసి[3]చేసి తలయల్లని కాళుల సంది[4]సంది లో
చక్కకి నొక్కి[5]నొక్కి యిరుపంబత గుమ్మడి మూటగట్టి పీ
పెక్కి మహాశిచేసి చలి యిక్కడ నక్కడ దెట్టు వేకువన్
1. పంచు 2. రాయు 3. జేయు
4. సందు 5. నొక్కు

## నృత్తములు

మద్దిరాల వేంకటరాయ విరచితము

శా॥ శ్రీరంజిల్లగ గౌరి నన్నిచటికిన్ శ్రీఘ్రంబునం బంపెరా।
కారుణ్యంబున జూచి నామనవి హృత్కంజంబునన్ జేర్చరా।
తా రూఢంబుగ పల్కుమన్న పలుకుల్ తథ్యంబుగాపల్కెదన్
సారస్యంబిదె చూడు పీఠపురవాసా। కుక్కుటేశా। భవా।

దరువు: శ్రీ సితాద్రినివాస। వాసవ సేవితాంఘ్రి సరోరుహ।
పాశహస్త మదప్రశిక్షణ। భక్తవత్సల వీక్షణా।
భూశతాంగ। శివా మనోహర। పూర్వ యోగిని సేవితా
కౌశలంబుగ కుక్కుటేశ్వర। కాంత నిన్ పిలిపించెరా।

## అర్థ చంద్రికలు - కందార్థము

మద్దిరాల వేంకటరాయ విరచితము

శ్రీ కుక్కుటేశ మూర్తిని
నీ కౌగిటిలోన నుండ నేనేమైనా
చేకొని తీసుకు వస్తిన
రాకుండా నాజ్ఞసేయ - రాదాపె గౌరూ ॥అజ్ఞ॥
దర్వు- రాదాపె గౌరు మ - ర్యాదా యెఱుగవు నాతో
వాదేలా పోపోవే - కాదందు రెవరైనా ॥రాదాపె॥
నారీ మణిరో। వినవే
కోరికతో సామి నన్ను గూడిన పిదపన్
కూరిమి మరువక నీకున్
సారసముఖి। వేడ్క బన్నసరము లిచ్చెదనూ

తరుణీరో ! వినవే యీ ధరణిలో నరసింగ
పురములోపల మద్దిపోతిరాజును బ్రోచే
మిశ్రము.— సరసి జాక్షిని తోడితేగదె
మరుని శరబాధకును వెరపను
కరుణ జూడవె నీదు మ్రొక్కెద
కామినీ భామినీ॥

## మన్మథోపాలంబనము: (సాహిత్యము)

పంచచామరము
కిటీ కిటి కిటి ఒకించు కికికి ఎలాతిగా
ఓటాకిస ముటారగటు ఓంచు చట ంటి పే
టుటీ టుటి టుటీ శరంబు మాకిపాకినేసెగా
కిటా కటా కటాళిగాడు కాముడెంత కూరుదే !

శ్లో॥ కాంతో యాస్యతి దూరదేశ మితిమే చింతాపరం జాయతే
లోకానందకరోహి చంద్రవదనే! వైరాయతే చంద్రమాః
కింవాయం వితనోతి కోకిల కలాలాపో విలాపోదయం
ప్రాణానేవ హరంతి హంత ! నిత రామారామ మందానిలాః

శ్లో॥ శేతే సీత కరోంబుజే కువలయ ద్వంద్వాద్వి నిర్గచ్ఛతి
స్వచ్ఛాంబు ప్రతిక సంహ తిప్రపళిమా హైమీం లతామంచతి
స్ఫూర్జత్ కంకణ కోళ మోరభిసవా యాంతి ప్రవణః క్లాన్తతా
మిష్టోప్తారి నరింగరా మమనఖే ! యాత్రాప్యహం కృన్తతి.

శ్లో॥ స్విన్నం కేన ముఖం ? దివాకరకరై స్సైరాగిణీ లోచనే ?
రోషాత్తద్వచనోదితా ద్విలులితా నీలాలకా ? వాయునా
భ్రష్టం కుంకుమ ? ముత్తరీయ కషణా ల్లాక్షాన్తాసి గత్వాగతై
ర్వ్యక్తం తల్పకలం — కిమత్ర వదహే దూతిక్ష తస్యాధరే.

## గణపతి కౌతము

వినాయక తాళము
72 అక్షరములు

| గు | గు | గు | ల | ల | ప్లు | గు | ల | ల | ప్లు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| S | S | S | 1 | 1 | ≡ | S | 1 | 1 | ≡ |
| 8 | 8 | 8 | 4 | 4 | 12 | 8 | 4 | 4 | 12 |

అంగములు

| | |
|---|---|
| S | తాకిటతక తై: దిత్తితై: దిత్తై దిత్తరి దత్తి తాహం |
| S | దత్తానొ తకిట కిణతొంగ డెకు తాం — తొంగా |
| | సంగిట కిటతక సంగిట కిటతక సంగిట కిటతక |
| S | ధీం ధాం నుతకిట కిణతొంగ డెకుతాం — తొంగా |
| | రా టంగి టంగీ కిటతక |
| ల । | ధిక్కుతాం దత్తా దిరుగుడు దొందం |
| । | దిగుందరి దిక్కుటకిటతక డెక్కుతొంగ హరిదియు |
| ప్లు ≡ | హరిమొగ విఘ్నవినాయక వెనకిట హరులప గణపతి |
| | జేజే జెక్కుట నోతరికి ఘం, జేజే జెక్కుట |
| S | నొతరికిడెం; కిణ్ణం తధిక్కు తొధిక్కు ఆనం గౌతరి |
| | తొంగిట కిటతక |
| । | తొంగు తక్కదేవర గణపతి దిక్కుటకిటతక |
| । | దిక్కు తొంగ గణపతి కౌతం గత్తరి |
| ≡ | వినయర తరుగుడుతాం తరుగుడుధేం తాక్కు |
| | ధేక్కు తక్కిట తొంగిట కిటతక ధేయా |
| | తంగికిటతక దిక్కుతాం |

ముక్తాయి : దత్తా ధేందాం దికితక తోదికితాం
తొంగాకు తధిగిణతోం

## నాటనాగము - ధృవతాళము

1 ధృవమండల మండిత వధూజన మండల మహోన్నతం
భవసాగర తారక గిరాం పరిభావుక సులక్షితం
దృతమధ్యమ మసుంధర గతిం అవలోకన సుందరం
కృత పుణ్య ఫలాత్మకస్పృహరిం పరిపశ్యతి ప్రజౌకసాం.
త్రిపతాక పతాక సురైః కటకాముఖ శిఖీ ముఖై
పరభావ రసోత్కట వరైరపి వీక్షణ సుశిక్షితైః
తను మధ్య నియోజిత కరైరపి నాట్యరసోత్కటాః
నారాయణతర్ప కృతం హరిరితి యతిజన తోషం

తాం టక కిణ తధిమి కకిట తక — టక ధరికిట ఝుణుతా హత
ధణ ధిమి ధిమి నుత కిటతధిమి తకిట తక—ఝుణుతా కిటతక
ధణదా—తక ఘణాం టకిట ఝుంతరికిటతక ఝుం—ణంతరి
కిట తక—దణంత కిటతి ఝుంతకిట—ధిరుడు తధైయ త్తక-
ఘాకిట తకఝుం—తరికిట టక ధళంగు తక ఝుం తకిట-
తక టధిమి టకిట ఘణ ధిమి ఘటతక—తతకిట తక తకఝణు
తధణ తద్ధిమి - తక దధిగిణ ఘోం !

## శుద్ధమారావతీ రాగము - మఠ్యతాళము

2 జగతీశం పశ్యర సురవనితా
ప్రజాంగ నాభిరిహ నవనవ మణిదివ్య
కుండల తరణి నిచయ శశిగణ సంజాత
శ్రీజిత సత్యలోక పవిత్ర భూతి రయం
లీలామయ దివ్యసుందర మదన
కోటి విలసిత తను వ్యసుధారాశిర్నృత్యతి భువి
నిజ దాసవర్గ సుఖకర కృపాంబురాశి రేనం

తక ధీనుత జకకిణ ణక దిఘణ కిణణక ధికితధిమిత—ఝుణ
తద్దణ—టద్దిమి తకిట తకతోం—ధరికిట దంధిరుడు తద్ధి
య్య తద ధీను తధీ—తకణక ఝుం తరికుంతరి—తకిట ఝుం

తతక ధణం తరికిట–ధాకిట తకఝుం తరికిట
తక తా హత ధికితక–తధిమిత కిట–తక ఝణుతక–
ధిమి తధిమిత తక దధిగిణతోం
(ఈ విధముగా ఏడు తాళములలో రాసక్రీడా వర్ణనము నారాయణతీర్థులు రచించినారు.)

## నవరసములలో ఉపయోగించవలసిన రాగములు

1 శృంగారరసము–మలహరిశ్రీ, మధ్యమాది, పంచమ, దేశపాళి, మేఘ, వరరంజి, మలహరి, శ్రీ, హిందోల, సైంధవి, గుర్జరాళ, గౌళిపంతు, తోడి, జయశ్రీ, గ్రహమంజరి, నాట, మల్లార, ఛాయ, లలిత, ద్రావిడ, గౌళ, సింధూర, వేలావళి, కర్ణాటగౌళ, ధనాశి, బళ్యారి, సుస్తవి, హుంజకి.
2 వీరరసము– నాట, సైంధవిక, వేలావళి, ధనశ్రీ, శ్రీ, గౌరి, గౌళ, మేఘ, సోమ, ధన్యాశి, మేఘరంజి, తోడి, దేవకృతి, శంకరాభరణ, హిందోళ, దేశక, ఛాయ, లలిత, భేదగుప్త, ద్రవిడగౌళ, శ్రీకాంతిక, లాళి, మాళవగౌళ, దేశపాళి, మలహరి, నాగధ్వని, తురుష్కగౌళ, గౌళసారంగ.
3 కరుణ– సావేరి, కామోది, రామకలి, అసావేరి, వేలావళి, సైంధవి, బంగాళ, దేశి, కౌశిక, భూపాలి, గాంధార, జయశ్రీ–
4 హాస్యరసము– కౌశిక, కామోది, శంకర, బంగాళ, నాట
5 రౌద్రరసము– తురుష్కగౌళ
6 భయానకరసము– మల్లార
7 బీభత్సరసము– పుళిందక
8 అద్భుతరసము– నాట

## కూచిపూడి 'దశావతార శబ్దం'

మోహనరాగం – తాళం మిశ్రచాపు

**మత్స్య**

తగ్గధింత, తంహత ధీనుత
తద్ధీనుత, తానుఝు ఝంతరి
తఝుంతరిత, తఝుం ఝుంతరిత
తఝుంతరిత, ఝుంతగ రేకిణ
తదికు దిదికు, దిదిదికు దింకుకు
తక్కిఝణగ తకుందరి కిణగ
తకుంద, దికుంద, తకుందక్క దికుందక్క
మత్స్యరమున (మరి) అంబుధిలో
జొచ్చియున్న సోమకు ద్రుంచియు
విచ్చలవిడి వేదము లజునకు
ఇచ్చితివా మత్స్యావతారా....

**కూర్మ**

తఝుణుతా, తఝ్ఝుది కకుందధి
పలుమరు నిను ప్రస్తుతి చేయగ
వెలయు సురలు జలధి మధింపగ
కరియు బరియు యలమితో నొసగిన
మందరగిరి మోసి కూర్మావతారా....

**వరాహ**

కుకుంధరి కిట ధరికిట కిటతక
స్థిరముగ ధరను రుపడి చేకొని
వడిగ వడిని యిరుప్పగ జొచ్చిన
హిరణ్యాక్షు బరిమార్చితివా
వర సుగుణా వరాహ రూపా....

**నృసింహ**

ఘం ఘం ఘణా – ధిం ధిం ధిమి
ఘం ఘం ఘణ – దానవుల మించుకు
జంభారి ప్రముఖ సుర కదంబంబును
సంతసంబున వెలయు (సభా)
దానవ డింభకు బ్రోచితివా
నృసింహా ....

**వామన**

తద్ధణాంత, తాహత ఝుంతరి
మానితముగ ముల్లోకములను
జానొప్పగ నాపాదంగా
మానుగ మూడడుగులు బలిచే
దానముగొని వామనరూపా....

**పరశురా**

తరిమి తరిమి తకదిమి జణుతక
తరిమి తరిమి ధరణీ పతులను
పరశువుచే నురుమాడితివా
పరవీర పరాక్రమమున ధర బరగితివా
భార్గవరామా....

**రామ**

జగ జగణకు, జగణకు రేకిణ
దశరథ తనయుడవై సురలకు
వశముగాని దశముఖు ద్రుంచియు
విశదంబుగ అయోధ్యకు సీతతొ
వేంచేసితివా, దశరథరామా....

**బలరామ**

తరిత తరితదణ, దణత దణతఝణు
యాదవ వంశాబ్ధి సుధాకరు
డాదిదేవు డనుజుడుగా ఘన
హలమునుగొని ఖలులను ద్రుంచియు
మేదిని ఘనముదిపిన బలరామా....

**బుద్ధ**

[illegible]... ముంచగ లేకిణి
[illegible]
[illegible]
[illegible]
మంగళ [illegible] బుద్ధావతారా ...

**కల్కి**

పిడుగుల వెగ కిర్రున ఏకవెగ
నాడు కలి బాధల నాగ
సీమగ కలివాలను బూనియు
ఘోటకమునెక్కి దురాత్ముల
గీటడచిన కల్క్యవతారా....
మంచి పేర్ మేలని పొగడగ
నిరతము నీ దాసుల బ్రోవగ
పరగ వాగ్గేయ కృపమున వెలసిన
పదదాస దేవా....
ఆశ్రిత సుర భోజా....
దిక్కులాం....దిక్కులాం... దిక్కులాం....

**జతి**

దృగుడు తతకిట ఝుంత (తరి)
ధణ తధణాంధిమి తదణాందిమి
దృగుడు తతకిట తితికిట తక
దృగుడు తతకిట తిటకిట తక
దృగుడు తలకిట తక తదిగిణతోం
దృగుడు తలకిట తక తదిగిణతోం
దృగుడు తతకిట తక తదిగిణతోం....

---

# తమిళనాడులోని శాస్త్రీయ నృత్యకళాస్వరూపము

భరతనాట్యము, భాగవత సంప్రదాయంగాక ఇతర ప్రాచీన నర్తన రీతులు :-

ద్రవిడ దేశంలోని శాస్త్రీయ నృత్యకళాస్వరూపాన్ని రెండు విధములుగా తెల్పవచ్చును. తెలుగు నాయకరాజులు ద్రవిడ దేశమును పాలించక పూర్వమునాటి నృత్యకళాస్వరూపము. తరువాత వృద్ధిచెందిన నర్తన రీతి.

భరతనాట్యము, భాగవతనాట్య మేళము ఈ రెండునూ, అచ్యుతప్ప, రఘునాథ, విజయరాఘవ నాయకుల కాలంనుండి అభివృద్ధి చెందిన కళారూపములు–

రాజరాజచోళుడు యిత్యాది ప్రసిద్ధ రాజులు, రాజవంశములు తమిళ దేశమును పాలించిన నాటి కళారీతులగూర్చి 'సంఘం' కాలంనాటి తమిళ గ్రంథములో వర్ణింపబడినది. 'కవిత్తొగై' గ్రంథములో శివతాండవముగూర్చి విపులంగా తెల్పబడింది.

కొడుకొట్టు, పండరంగం, కాపాలి, నర్తనముల్లో శివుని నర్తన విన్యాసాల గూర్చి వివరములు తెల్పియున్నారు.

ఈ నాట్యముల యితివృత్తము, ప్రదర్శన క్రమము తెలిసి కొనిన యీసన్నివేశము ఉద్ధత, గంభీరభావాలతో గూడినవి కరణాంగ ప్రదర్శనములేనని. అభినయ, నృత్య, నృత్త విన్యాసములు, వికాసంతో క్రమపద్ధతిలో ఏర్పాటుచేయబడిన కేవలమాత్రం కాదు – రాజరాజ చోళునికాలంలో యెందరో నర్తకీమణులు బృహదీశ్వరుని ఆలయంలో నృత్య పూజచేసేవారు; కంచిలోని, ఆలయాల్లోకూడా నృత్యపూజ వుండింది. ఆరాధనకేళికా రీతి ప్రాచీనమే–

తమిళదేశంలోని చోళ, చేర, పాండ్యరాజుల రాజ్యాలచరిత్ర సాంఘిక జీవనంగూర్చి, కళలగూర్చి మరి రాజకీయ విషయాల గూర్చి ఆకాలంనాటి సంఘం, సాహిత్యం తెలుపుతోంది. నెడుంజెలియన్ అనురాజు మధురనురాజధానిగా పాండ్యరాజ్యాన్నేలినకాలంలో 'శిలప్పదికారం' గ్రంథం వెలుగుజూచింది. నృత్య సంగీత సాహిత్య లలితకళలపోషకుడు, ఆరాధకుడు సేరన్ సెంకుట్టువాన్–చేరరాజ్యం పాలించినప్పుడు శిలప్పదికారం రచన జరిగింది–శిలప్పదికారంలో మాధవి అనే నర్తకి యెన్నోవిధములైన నర్తనములనభ్యసించినట్లు తెలుపబడింది. ఆకాలంలో నర్తనం "కూత్తు" అనిపిలువబడింది– యుద్ధానికి పోవురాజులు, సైన్యములు ద్రవిడదుర్గను పూజించి యుద్ధభూమికివెళ్లేవారు. విజయప్రాప్తికై దుర్గారాధనలో అనేకములైన తాండవములుప్రదర్శించేవారు – యాళ్ అనే సప్తతంత్రి వాద్యము విశేషప్రచారంలో వుండింది.

శిలప్పదికారంలో నాట్యాచార్యునియొక్క పాండిత్యప్రతిభను గూర్చి యీవిధముగా వర్ణించియున్నాడు.

ఆచార్యుడు : 'అహికూత్' భేదాల నెరిగిన భిన్న పద్ధతులందు ప్రవీణతగల పదునాల్గు విధములైన వితక్కులతో మేళవించుశక్తి కలియుండవలెను. ఆకాలంలో ప్రచారములోనున్న ఏకాదశనాట్యాల్లో పాండిత్యం కల్గియుండవలెను.
'కూత్' — అనగా నాట్యమని అర్థము.
తెనుగులో ఆట — అని ప్రయోగించినట్లు.
ఉదా — కచేరిఆట, దర్బారుఆట, భోగంఆట, భాగవతపుఆట, యిత్యాది ప్రయోగములున్నట్లు తమిళంలో అభినయకూత్, తెరుకూత్, [illegible] చెప్పబడును.

## ప్రాచీన నర్తనవిధములు

'వశై పుగల్ వెట్టియాళ్'; — రాజుల ఆస్థానములందు ప్రదర్శించవలసిన నర్తనములు.
"పొదువియల్" :— సామాన్య ప్రజల వినోదార్థము చేయబడే నాట్యము.
"వరి, వాసంతి, వినోదం, ఆర్య, ఇయల్బు, దేశి—మరియు 108 శివుని కరణములు, వానిచేరికలతో ఏర్పడే అంగహారవిన్యాసముల నర్తనం "చక్కం"
"పరై" అనగా పరవంత — ప్రేమకథను ఇతివృత్తంగా కలిగినట్టి ఆట — ప్రయోగించు కవితారీతి — 'పరిపై' ఛందస్సు — తెనుగునందలి త్రిశరగతులు, ద్విపదవేరి వంటివి.
బొమ్మల ఆట రీతిని 'పాళినాట్య' మందురు. శిరస్సుపై నీటికుండ పెట్టుకొని నర్తనము సల్పుట 'కుడం' ఆట నర్తనం.
స్త్రీలు చేసే లలితనృత్తరీతి — 'నోక్కు' ఈ దేశి విధానాలు గూడా ఆ కాలంలో ప్రచారంలో వుండినవి.
"వినూషతకూత" — హాస్యరసాన్ని పోషించే ఆట. మన దేశంలోని సింగి సింగడు, జోడిగాడు, భాగవతం ఆటలో మాధవి పాత్ర వంటిది. నృత్యాభినయ సంగీతముల గూర్చి తమిళ దేశంలో వెలువడిన లక్ష్య లక్షణ గ్రంథాల్లో పంచమరపు, భరతసేనాపతీయం, నాటపీ, తమిళనూల్, ఇంద్రకావ్య, ఈశైవనుకుక్కం ముఖ్యమైనట్టివి —
సూత్రయుగంలోను వెలువడిన మురసల్, గుణనూల్, జయంతం, శైత్యం; అగస్త్యం, కురుగు, కూత్‌నూల్, తలవగై, పంచభరతీయం, భరతం యీ గ్రంథాలన్నీ ద్రవిడదేశ నాట్యకళను గూర్చి తెలిసికొనుటకు ఉపయోగపడును —
కల్యనర్తనం, కుడనర్తనం, కాళీనర్తనం, నటరాజనర్తనం, సీత రావణ నర్తనం, యివన్నీ ప్రాంతీయ నర్తనములే — వీటికీ కచేరిఆట (భరతనాట్యానికి) సంబంధంలేదు.

## ఏకాదశ నర్తన రీతులు

అలియం, కొడుకొట్టు, కుడై, కుడం, పేడి, కడయం, మల్, పండరంగము, మూరపద్మ, మరక్కాల్, పావై —— నృత్యములు

శిలప్పదికార కవి — నర్తకులు, నాట్యాచార్యులు శిక్షణ విధులన్నియూ నాట్యశాస్త్రమునందువలె వివరంగా తెల్పియున్నాడు. గాని వానిని ప్రయోగించి రూపొందించ బడినట్టి నాట్యరీతులు మాత్రము అంతటి ఉదాత్తతతో కూడి వున్నట్లు తోచదు.
ఉదాహరణకు యిచ్చట కొన్ని నృత్యములగూర్చి తెల్పుతాను.
కాళితోగల్ అనే సంఘం కవితలో వర్ణించబడిన శివ నర్తనములు మూడింటిని గూర్చి వివరములు — కొడుకొట్టి, పాండురంగ, కాపాలి, మొదలగు వాటిల్లో శివుడు ప్రళయాంతమందు నర్తన మాడినాడు. జగన్మాత కాళికాదేవి తాళం వేసినది — ఇదే కొడుకొట్టి నర్తనం.
త్రిపుర సంహార అనంతరము ఆనందంతో శివుడు నర్తన మాడినాడు — అప్పుడు మొజ్జగముల తల్లి ఉమ తాళధారియైనది. ఇదే పాండురంగ నర్తనం.
బ్రహ్మదేవునియొక్క ఐదవశిరమును ఛేదించి దాన్ని తనచేత ధరించి శివుడు విజయతాండవమాడగా, అర్ధాంగి పార్వతి అతని వెంట నుండినది — ఇదే కపాలి నర్తనం.
ఇందు వర్ణనలు పేరు — నేటి కాలంలో తమిళ నర్తకులు ప్రదర్శించే శివతాండవములు — నటనం ఆడినారు — ఆనంద నటనం ఆడినారు — కాలై తూక్కి — ఆనంద నటనప్రకాశం — నటనమాడితిరుందా — యిత్యాది పాటలకు నర్తనం పేరు.
పై గాథలలోని యితివృత్తము కేవలం భీభత్స ప్రాధాన్యం కల్గినట్టిది — పదకొండు విధములైన ప్రాచీన ద్రవిడ నర్తనములు.
1. అలియం — బాలకృష్ణుని హతమార్చాలనే దురుద్దేశ్యముతో కంసుడు కృష్ణ బలరాములను మధురకు ఆహ్వానిస్తాడు. అచ్చట వారు అనేక అపాయాలకు గురియౌతారు. 'కువలయాపీడ' మనే రాజుగారి ఏనుగు వారిపైకి వదలబడుతుంది. అది వారిని హతమార్చుటకు వస్తుంది. కృష్ణుడు కడు చిత్రగతుల నర్తనమాడి ఆ ఏనుగు దంతములను పూడబెరికి వాటితోనే దానిని సంహరిస్తాడు. ఆ ఏనుగుతో అతడు పోరాడినప్పటి హస్త పాద విన్యాసములే 'అలియం' అనే నర్తనముగా పేర్కొనబడినది.
2. కొడుకొట్టి — ధరణి రథమై బ్రహ్మ రథసారథిగా, మేరువు విల్లుగా, మహా విష్ణువును అమ్ముగాదాల్చి, దేవతలు వెంటరాగా మహాదేవుడు త్రిపుర సంహారానికి బయలువెడలినాడు. రథానికి చక్రములు సూర్య చంద్రులైనారు. నాల్గు వేదములు నాలుగు గుఱ్ఱములైనవి. మహాదేవుడు త్రిపురాది అసురులను సంహరించి వారి కోటలను ధ్వంసము చేసినాడు. కాలిపోయిన ఆ పురములయొక్క బూడిద పై నిలచి మహాదేవుడు విజయతాండవము నాడినాడు. అప్పుడు భైరవి తాళధారియైనది. ఇదియే కొడుకొట్టి.
3. కుడై — అసురులను సంహరించి దేవతల కష్టములను బాపుటకు కుమారస్వామి యుద్ధము చేసినసమయములో అతనిచే చేయబడినట్టి నర్తనము కుడై — రాక్షసులు వారి వద్దనున్న వివిధ బాణములన్నిటిని, ప్రయోగముచేసి, ఓడిపోయి నిరాశచెంది భీతితో దేవ సేనాపతి కుమారుని ఎదుట నిల్చినారు. అతడు ఆనందముతో

తన రథానికున్న ఛత్రమును తీసి దానిని చేతబట్టుకొని సల్పిన నర్తనమే కుడై. కుడై తమిళంలో గొడుగుకు పేరు.

4. కుడం – బాణాసురుడు గొప్ప శివభక్తుడు. అతని కుమార్తె ఉష. ఆమె కలలో కృష్ణుని మనుమడైన అనిరుద్ధుని చూచి మోహిస్తుంది. ఆమె చెలికత్తె చిత్రలేఖ. బాణాసురునికి తెలియకుండా అనిరుద్ధుని ఆమె మహల్‌కు గొని వస్తుంది. కొంత కాలము అనిరుద్ధుడు బాణాసురుని కోటలో నుండిన పిదప, అతడు తెలిసి ంటాడు. అనిరుద్ధుని చెరలో బంధించుతాడు. అతని విడిపించుటకు, శ్రీకృష్ణుడు ఇత్యాదులు మాయావేషములో బాణాసురుని పురము కేగి వివిధరీతుల నర్తనమాడినారు. అందు శ్రీకృష్ణునిచే చేయబడినట్టిది యీ కుడం నర్తనము.

మట్టి మరియు పంచలోహములతో తయారు చేయబడినట్టి ఒక కుండను చేత ధరించి దానిపై తాళ గతుల పలికించుతూ శ్రీకృష్ణుడు మాయా వేషములో బాణాసురుని పురములో నర్తన మాడినాడు. కుండచేత గొని ఆడుటచే 'కుడం' నర్తనమని పేరు వచ్చినది. 'కుడం' అనగా తమిళంలో కుండ.

5. పేడి – అనిరుద్ధుని తండ్రియైన ప్రద్యుమ్నుడు పేడివారు (నపుంసకులు) వలె వేషధారణ చేసుకొని ఆ పురము వీధుల్లో నాట్యమాడినాడు, తన కుమారుని చెర విడిపించెడి యత్నములో–

6. కడయం–బాణాసురుని పట్టణమైన శోణిత పురముయొక్క ఉత్తర ద్వారం, ఆవల విశాలమైన మైదానములో ఇంద్రాణి ఆఖరి నర్తనమాడినది. ఆఖరి నర్తనం గాన 'కడయం' అనబడినది.

7. మల్ లేక మల్లయుద్ధము – అనిరుద్ధుని విడిపించే ప్రయత్నములో శ్రీకృష్ణుడు మల్లుని వలె వేషధారణ చేసుకొని రాజవీధులో తిరుగుతూ అనిరుద్ధుని చెర విడిపించ మనియు, లేనిచో ఎవరైననూ మల్ల యుద్ధమునకు రావచ్చుననియు, సవాల్ చేసెను. బాణాసురుడే కృష్ణునితో యుద్ధమునకు దిగెను. శ్రీకృష్ణు డాతని అందు ఓడించి సంహరించెను. అదియే మల్ లేక మల్లయుద్ధము.

కుడం, పేడి, కడయం, మల్ – ఈ నాలు నర్తనములు అనిరుద్ధుని చెర విడిపించుటకు శ్రీకృష్ణ బలరామాదులు అసుర పురమునకేగి చేసిన నర్తనములు.

8. పాండురంగము – త్రిపుర సంహారానంతరము సృష్టి క్రమమును తెల్పునట్టి నర్తనము భైరవమూర్తి ప్రదర్శించెను. సృష్టి కర్త బ్రహ్మదేవుడు రథ సారథియై నిలిచి చూడగా, భస్మ మొనరించిన త్రిపురముల తెల్లని బూడిదను శరీరమునకు అలదుకొని శ్మశాన వాటికగా మారిన ఆ ప్రదేశమును రంగస్థలముగా అతడు నర్తనము సల్పెను. పాండు – అనగా తెలుపు, రంగము – రంగ స్థలము అని అర్థము.

9. సురపద్మ అనే అసురుడు మహాసేనునితో యుద్ధముచేయుచూ తన మంత్రశక్తివల్ల సముద్రతరంగముల్లో దాక్కొనినాడు, కార్తికేయుడు అది కనుగొని అతనిని సంహరించి తరంగములతో కదిలాడు సముద్ర జలరాశిని రంగస్థలముగా ఆనందంతో నర్తన మాడినాడు –

10. మరక్కాల్ – మహాదేవుడు అసుర సంహారమునకు గడంగిన సమయాన, ఆయన ఢీకొనగలేక – మాయోపాయముచే పరమశివుని సంహరించ నెంచి, అసురులు ప్రాణసర్పములు, తేళ్ళు మొదలైన విషజంతు జాలములుగా మారి దేవసైన్యముల మధ్యకు ప్రాకజొచ్చినవి. అంత శ్రీ మహావిష్ణు సోదరి మహాదేవి ఉగ్రురాలై గెడగర్రలపై నిల్చి యుద్ధభూమిలో నర్తనమాడి వారిని సంహరించెను. అదియే మరక్కాల్ – కర్ర కాళ్ళ నృత్యం.

11. పావై – అసుర సంహారము చేయుటలో లక్ష్మీదేవి వారి వలె మాయోపాయంతో వారిని సంహరించ దలచి, ఒక త్రిలోక సుందరి రూపము దాల్చి నర్తనమాడ మొదలిడినది. రాక్షసులు వ్యామోహితులై అస్త్రశస్త్రములను విడచిపేసి ఆమె వెంటబడిరి. అప్పటి ఆమె నర్తనమే పావై.

ఈ నృత్యముల యితివృత్తము లన్నింటినీ చూచిన యివి కథారూపపు నాట్యములు. కొన్ని శుద్ధ నృత్యములు, చిందులు, వినోదకములు గాని నేటి కాలంలో ప్రచారములో నున్న భరత నాట్యము లోని నృత్త, నృత్య, అభినయ విన్యాసముల పోకడలు మనకు కన్పించవు. కనుకనే నాయక రాజులకాలము నుండియే తమిళదేశములో శాస్త్రీయ నృత్య ప్రదర్శన క్రమముగా ప్రచారములోనికి వచ్చినదని పండితుల అభిప్రాయం – శాస్త్రీయ శిక్షణ పద్ధతి ప్రచారములో నుండినను ఆ క్రమము ననుసరించి నృత్యప్రదర్శన పద్ధతి (కచ్చేరిఆట) మాత్రం తెనుగురాజుల, మహారాష్ట్ర ప్రభువుల దర్బారులందు రూపొందినది.

# కన్నడదేశములోని యక్షగానము

శాస్త్రీయ భరతనాట్య కేళిక, ఆలయ నృత్యరీతి గాక కర్ణాటక దేశంలో పురుషులచే ప్రదర్శింపబడే నృత్య సంప్రదాయము నాట్యమేళము-యక్షగానము- ఇది నృత్యనాటకరీతి- దేశి సంప్రదాయపు ఆట-

యక్షగానములు, ఆటక్రమము, చరిత్ర, స్వరూపం వీటిని గూర్చి చర్చించేముందుగా, శాస్త్రము, సంప్రదాయములగూర్చి కొద్దిగా వివరించుట అవసరము. శాస్త్రీయవిద్య, సంప్రదాయం రెండింటిలో శాస్త్రీయ పద్ధతులు అనుసరించబడును- నృత్త, నృత్యాభినయములు శాస్త్ర సమ్మతంగానే పోషింపబడును. ఆంగిక, వాచిక, ఆహార్య, సాత్వికాభినయములు, క్రమపద్ధతిలోనేవుండును. పూర్వరంగక్రమము, కథాగమనము, పాత్రలపోషణ, అంతయూ క్రమపద్ధతి ననుసరించును. మరి ముఖ్యభేద మేమిటి? అనే సందేహం కలుగును-

శాస్త్రీయ విద్య నాట్యశాస్త్రములపై ఆధారపడి, పండితులచే రూపొందించబడి సామాన్యప్రజల అభిమానమును చూరగొను రీతిని, వృద్ధిపొంది ఆ స్థాయిని నిల్చిపోవును.

సంప్రదాయ విద్య ప్రజల కళగా ప్రజల్లోనుండి రూపొంది, పండితులు, విద్యావేత్తలు, అభిమానమును చూరగొనురీతిని, శాస్త్రీయరీతుల నలంకరించుకొని ఉత్తమస్థాయి తరగతిని అందుకొన్నట్టిది- కనుకనే పరిశోధకులకు, కళావేత్తలకు తప్ప సామాన్యులకు రెండూ ఒకేరీతిగా కన్పట్టును.

సంప్రదాయ విద్య సామాన్య ప్రజల్లోనుండి పచ్చిన దగుటచే ప్రజాసంగీత, కవితా, పోకడలు చాలావరకు అందు గోచరమగును. మరియు ప్రాంతీయ ప్రభావము విశేషించి, ఆ కళపై ప్రతిబింబించును. కనుకనే దేశికవితారీతులు, ఛందస్సులు, గానరీతులు యక్షగాన, భాగవతములందున్నంతగా, నట్టువమేళములో వుండవు.

జానపద కళారూపంగానుండి, శాస్త్రీయ మెలకువలతో మెరుగులు దిద్దుకొని ప్రచారములోనికి వచ్చిన సంప్రదాయ విద్య నాట్యమేళం భాగవతంగానూ, శాస్త్రముల ఆధారంతో రూపొందించబడిన సామాన్య ప్రజల అభిమానమూ, పండితుల ఆదరమునూ పొందేరీతిని వృద్ధిచెందిన విద్యగా నట్టువమేళ భరతనాట్య కచ్చేరీ ఆటను మనం నిర్ణయించవచ్చును.

యక్షగాన మనగా నేమి?

యక్షగానముగురించి చర్చించేముందు యక్షులెవ్వరు? వారి పూర్వచరిత్రగూర్చి కొంత యోచించుట మంచిది. ఆంధ్రదేశ చరిత్రను పరిశోధించిన, యక్షులు ఒక ప్రాచీన గంధర్వ తెగకు చెందినట్లు, యక్షరాజొకరు భట్టిప్రోలు ప్రాంతమును పాలించుచుండినట్లును, అతడు రుద్రుని భక్తుడుగావుండి, అటుపై బౌద్ధం స్వీకరించినట్లును, బౌద్ధులనాటి ఆంధ్ర చరిత్ర తెల్పుతుంది- ఈ యక్షులు బౌద్ధులనాటికే ఒక ప్రసిద్ధ జాతిగా రూపొందిరని చెప్పవచ్చును. నృత్య సంగీతములు వీరి ముఖ్యవృత్తి- వీరి సంగీతశైలియే యక్షగానము అని ప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు; సంస్కృత పండితులు డాక్టర్ రాఘవన్; కర్ణాటక దేశంలోని యక్షగాన పరిశోధకులు శ్రీ కరంత్ గార్లు అభిప్రాయపడియున్నారు.

యక్షగానము ఒక కథాగానము. భారత భాగవతాది పురాణగాథల్లోని ఇతివృత్తము ఒక కథగా దేశి ఛందస్సులో రచన చేయబడును. ఆ కథలోని అంశాలను గానముచేయు నర్తకి అన్ని పాత్రలను తానే అభినయించుచూ నృత్తమాడును. ఇది అతి ప్రాచీన రూపము. ప్రస్తుతము ఆంధ్రలోని హరికథా రూపము వంటిది- ఇదే కాలక్రమేణా నాటకరూపంలో అనేక పాత్రలు ప్రవేశ పెట్టబడి ప్రదర్శన జరుపబడును. ప్రతిపాత్రలో తనకు సంబంధించిన భాగం గానంచేస్తూ నృత్యమాడును. కాని కర్ణాటకదేశంలో రూపము వేరుగావుంది. కథాగానము ప్రాచీన రూపంలో చేయబడును- ఆ గానమును సూత్రధారుడు చేయును. అతని భాగవత అందురు- అతడు గానం చేసినప్పుడు వివిధ పాత్రలు నృత్యమాడుదురు. ఆ తరువాత పాత్రలు ఆ నృత్యము చేసిన భావము తమ స్వంత వ్యాఖ్యానముతో ప్రేక్షకులకు ప్రబోధం చేయుదురు. ఈ క్రమము మరియొకచోట లేదు.

ఈ యక్షగానము ఆంధ్రనుండి కర్ణాటక ప్రాంతానికి వెళ్ళినదా లేక ఆ ప్రాంతాలలోగూడా యక్షజాతివారు యీ పద్ధతిని వృద్ధిలోనికి తెచ్చిరా? తెల్పుటకష్టము. ఇది చరిత్ర పరిశోధకులు నిర్ణయించవలసిన విషయము. కాని యక్షగానచరిత్ర పరిశోధించిన వారికి ఒక విషయం బోధపడుతుంది. కన్నడ ప్రాంతములో ఆ ప్రాచీనరూపం యింకనూ పూర్తిగా నిల్చియున్నది. ఆంధ్రలో నృత్యనాటక రూపంగా అభివృద్ధి చెందింది- మృత్యుంజయ విలాసం, సుగ్రీవ విజయం, అవి యక్షగానములే అయినా, ఆ రూపాల్లో ప్రదర్శనకేళిక జరుగుటలేదు. కర్ణాటకదేశంలో ఆ రూపంవుంది. యక్షగానములోని పాటలు- ప్రసంగములని పిలువబడును. సుమారు నూరు ప్రసంగముల వరకూ కన్నడదేశంలో ప్రచారంలో నున్నవి.

మన దేశంలో ధర్మాంగద పాముపాట, కుశలాయకం, గరుడాచలం మొదలైన యక్షగానాలు స్త్రీలు గానం జేసుకొని కథలుగా వున్నవి- అవన్నియూ ప్రాచిన పక్కీలోనే వున్నవి.

దామోదరగుప్తుడు- కాశ్మీరదేశపు సంస్కృత పండితుడు. తన రచన 'కుట్టినీ మతము'లో నృత్యనాటక విధానమునుగూర్చి వర్ణించియున్నాడు. ఇతడు వెయ్యి సంవత్సరాల క్రిందట జీవించియుండినాడు- ఆ వర్ణనలు చదివిన మనము యక్షగానములు పరిశోధించిన, ఆనాటి నృత్యనాటకములు, యక్షగాన రూపములుగా కన్పట్టును- దేశీయ విభేదములు కొన్ని మనకు కన్పించిననూ మూలరూపము మాత్రము అదియే అయివుండును.

**కర్ణాటక కవులు**– నాగచంద్ర, (12–వ శతాబ్దంలో జీవించి యుండెను) రత్నాకరవర్ణి– (పదహారవ శతాబ్దము) తమ రచనల్లో "ఎక్కలగాన"– అను నృత్యకేళిక గూర్చి వర్ణించియున్నారు. ఆ వర్ణనలు యక్షగానరీతిని గూర్చినవిగా తెలియగలవు– ఈ యక్షగానము చేయువారినే కర్ణాటక దేశంలో "ఎక్కడగరు" అనియు, తెనుగువారు 'జక్కుల' వారనియు పిలుచుట కలదు. వీరు చేయు కథలోని గానపణితికి యకగానమని నామ మిడినారు. మరియు ఆ కథలను "జక్కులకథ" అని పిలిచెడివారు. సారంగదేవుడు తన 'సంగీత రత్నాకరం'లో "జక్క" అనే సంగీత బాణిని గూర్చి తెల్పియున్నాడు. ఆనాటి అతని కాలంలో చాలా ప్రసిద్ధి గాంచినటిది. గోవింద దీక్షిత తన 'సంగీతసుధ'లో యక్షగాన పద్ధతి సంగీతముగూర్చి తెల్పియున్నాడు. వీటన్నిటినిబట్టి మనము యక్షగానముయొక్క ప్రాచీనత, ప్రసిద్ధత తెలిసికోగలము. మరియుఅది ప్రబల కళగానూ, తెలియవస్తుంది.

రత్నాకరవర్ణి తన గ్రంథంలో యక్షగానము రగడ ఛందస్సులో రచన చేయబడుతుందని తెల్పినాడు– ఇందులో ప్రయోగించబడిన మరికొన్ని గాన రీతులు– (తాళ ఛందోరీతులు) పాటల ఉదాహరణలతో నేనొకచోట యిచ్చియున్నాను. కథాగమనము ముఖ్యంగా రగడ ఛందో రీతిలో జరుగుతుంది. సారంగదేవుడు 'సంగీత రత్నాకరం'లో 'రహడ' ఛందో రీతిని గూర్చి చెప్పియున్నాడు. అది వీర రసప్రాధాన్యత కల్గినట్టి కావ్యరీతి. అదియే కన్నడ రీతిలోని 'రగలె'– ఈ 'రగలె' లేక 'రగడ'– ముఖ్యంగా వీరరస ప్రదర్శనకు ఉపయోగించును గనుక యితర సన్నివేశాలల్లో రస భావ పోషణకు మరికొన్నిరీతులు ఉపయోగింప బడినవి. అవియే ద్విపద, నృత్త, ఖండ, త్రిపుట, పదక్రమ, భామిని, అర్ధచంద్ర, ధవళ, ఏల, యిత్యాదులు. ఇందుకొన్ని ఆంధ్రదేశ రచనలందు, కొన్ని కర్ణాటక రచనలందూ వున్నవి.

ఈ యక్షగానాల్లో నృత్తనృత్యములు ప్రాచీన రీతిలోనే ప్రదర్శింపబడుచున్నవి. అనగా, ఒక భావమును సంపూర్ణముగా విశదీకరించుటకుగాను వాద్యసంగీత సహాయముతో, హస్త పాదములు విన్యాసముచేయుట– ఇంచుమించు ప్రస్తుతపు పాశ్చాత్య 'బాలే' పద్ధతివంటి ఆట– ఇది భారతదేశ ప్రాచీన నర్తన రీతి– భరతుడు చెప్పిన 108 కరణములు వాటిద్వారా ఏర్పడిన అంగహార, మండల, ఖండ, ప్లవన యిత్యాది విన్యాసాలన్నీ యిట్టి నృత్యరీతికి చెందినట్టివే– ఇది వాద్య ప్రాధాన్యం గల్గి– రస భావముల పోషించురీతి. ఈరీతి కాలక్రమేణా, గానప్రధాన నృత్తరీతిగా మన దేశంలో మారిపోయింది. కాని భారతీయ నర్తనము యొక్క ప్రభావముతో నృత్యకళ రూపొందిన తూర్పుదీవులు, సయాం మొదలైన ప్రాంతాల్లో ఆ ప్రాచీన రీతినే నేటికీ వారు అనుసరిస్తున్నారు. కన్నడ దేశములోని యక్షగానములందుగూడా ఆ పద్ధతే అనుసరించబడుతుంది.

**యక్షగాన సంగీతము**– రాగములు కర్ణాటకమే అయిననూ వానిని గానము చేయురీతి, కంఠంలో ఆయా భావములను పలికించుటకు రాగమును, సంచారముచేయు పద్ధతి, పూర్తిగా దేశీయము. గానము రెండు రకములు– స్వర, రాగప్రాధాన్యత గల్గిన సంగీతము– భావప్రధాన గానము. రాగ మొక్కటే అనవచ్చును– కాని, కర్ణాటకమందు రాగములో స్వర ప్రస్తారమునకు యెక్కువ విలువ నివ్వగా, యక్షగానములందు ఆ రాగములో భావ వికాసమునకు ప్రాధాన్యతనిస్తూ, భావమును వికసించుటకు అభినయించే సంచారుల ప్రదర్శించుటకు అనుకూలించు రీతిని గాన మాధుర్యమును వికసింప జేయుదురు. ఇందువల్ల రాగ సంచారం చేయు క్రమంలో మార్పు కన్పట్టును. అందుకే నాట్య, సంగీత శాస్త్రజ్ఞులు ఆట కచ్చేరి సంగీతబాణి వేరు, పాటకచ్చేరి బాణి వేరుగా చెప్పియున్నారు. రెండూ శాస్త్రీయములే కాని వృద్ధిచెందిన క్రమం, ప్రదర్శన తీరు వేరువేరుగా వున్నది. కర్ణాటక గాత్ర సంగీతములో ఉపయోగించినన్ని రాగములు నాట్యములో ఉపయోగింపబడవు. ఏయే రాగాలు ఒక రసమును, దాని సంచారులను సంపూర్ణంగా వికసింపజేయుటకు ఉపకరించునో, అటివే ప్రాచీనులు నాట్యంలో ప్రయోగించారు. అందుకే క్షేత్రయ్యవంటి మహా విద్వాంసుడు నలువదికంటే యెక్కువ రాగములను తన రచనల్లో వినియోగించుకోలేక పోయినాడు.

అదే విధముగా తాళ వాద్యమందునూ– వివిధ తాళములు గతి, జతి, అక్షర ప్రాధాన్యం వాయించుట ఒకటేరు– ఛందోరీతి ననుసరించి ఆ తాళములో భావము పలుకునట్లు, వాయించునది నాట్యరీతి. కర్ణాటక గానమునకు గతి, అక్షర ప్రాధాన్యంతో వాయించిననూ సరిపోవుచున్నది. ఎందుకనగా సంగీత కచ్చేరీలల్లో మృదంగాది వాద్యాలు ఆ పాటలయొక్క తాళములను తెలుపుటకు సహకరించు ప్రక్కవాద్యాలు మాత్రమే. నృత్యములో భావాన్ని వికసింపచేయుటకు ప్రత్యేక తాళములు ఉపయోగ పెట్టబడుచున్నవి. అందువల్ల అందలి పోకడలు, శబ్దజట్టు వేరొక విధముగా నుండును. కర్ణాటకదేశ యక్షగానములు, రసముల పోషణకుగాను కొన్ని ప్రత్యేక వాద్యాలు– 'చండ' వంటివి ప్రయోగింతురు.

ఈ యక్షగానము ప్రాచీనకాలంనుండీ దక్షిణ క జిల్లాలో విశేష ప్రచారంలో వుండినది. ఈ సంగీత బాణి అ పూజా విధానములందు సంగీతంలో కన్పట్టును. మరియు ... సంప్రదాయ వివాహాది వేడుకలందు చేసే గానములో గోచరించును. వివాహాది వేడుకల్లో పాడే పాటలు– మంగళ హారతులు, శోభనములు, ఏలలు, ధవళగీతాలు, సువ్వాలులు, జోలలు యిత్యాదులు– ఇవన్నియూ ప్రాచీనదేశ సంప్రదాయ రచనలు.

కాళగతి, ఛందస్సు, ధ్వని (భావ ప్రధానరీతి) **జాతులు.**
**జాతి**— చతురశ్ర – తిశ్ర – మిశ్ర – ఖండ – సంకీర్ణము.
**చతురశ్ర**— నాలుగు అక్షరాలగతి– త కి ట త.

తిశ్రము— మూడు అక్షరాల గతి— త కి ట.
మిశ్రము— ఏడు అక్షరాల గతి— త కి ట త క ధి మి.
ఖండము— ఐదు అక్షరాల గతి— త క త కి ట,
సంకీర్ణము— త క ధి మి త క త కి ట.
గతి— విషమగతి— త కి ట.
సమగతి — త క ధి మి.

ఈగతి, జాతులంటే ఛందోరీతులు ఏర్పడుతున్నవి—
ఉదా:—
చతురశ్ర జాతి గతి— త క ధి మి । త క ధి మి.

ఈ గతిని (సామాన్య మైనదాన్ని) ఎన్నో విధాలుగా మార్చి వాయించవచ్చును. కావ్యాల్లో ఛందో భేదాలతో వృత్తములు, పద్యములు వివిధ రకాలుగా ఏర్పడినట్లు ఈ విభేదాలవల్ల అనేక నడకలు ఏర్పడుచున్నవి.

1. త క ధి మి । త క ధి మి.
2. తాం కి ట । తాం కి ట.
3. త ధీం త । త ధీం త.
4. కి ట తా । కి ట తా.
5. తా ధా । తా ధీ.

భావఛందోరీతి—

1. తకధిమి । తకధిమి
2. తతిజణు । తితజణు
3. ధిమితక । జణుతక
4. తాహతి । తకజణు
5. ధీంతలి । దిగితక
6. ధిరుడుత । ధిరుడుతి
7. టకునగు । టకునగు
8. నగినగి । ననగీ
9. నరెూంత । తరెూంత
10. కుకునక । కుణకుకు

ఈ విధంగా శబ్దములనుచేర్చి వాయించు గతి ఒక్కటే ఐనా, ఆ ధ్వనిలో మార్పువల్ల రసోత్పత్తి కల్గును. ఈ విధ వాద్యరీతి యక్షగాన పద్ధతిలో వుండును.

యక్షగానము సామాన్య ప్రజల కళారూపంగా తెల్పి న్నాను. సామాన్య ప్రజల కళల ప్రారంభమై, పండితుల కళగా రూపొందినట్టి సంప్రదాయ విద్య— ప్రాచీన కాలంలో 'ఉడిపి' నుండి 'గోకర్ణము' మధ్యప్రాంతాన్ని 'నాగర ఖండ' మని పిలిచేవారు. దానికే 'మలేనాడు' అని మారుపేరు. ఆ ప్రాంతీయ ప్రజల సంస్కృతి వికాసముగా యక్షగానాన్ని పేర్కొనవచ్చును. ఆ ప్రాంత ప్రజలు నాగదేవతలను ఆరాధించేటప్పుడు అనేక రకములైన నర్తనములు చేసేవారు. అందు 'నాగమండల' నర్తన రీతి నుండే యక్షగాన సంప్రదాయం వృద్ధి చెందినట్లు చెప్పవచ్చును.

ఈ విధంగా ఆ ప్రాంతీయ కళగా ప్రారంభమై కాలక్రమముగా శాస్త్రీయత నలవర్చుకొనుటలో యితర ప్రాంతాల కళారీతులతో యెంతో సన్నిహితత్వం యేర్పడచుకొని వుండును. అందువల్ల యితర ప్రాంతాల్లోని భాగవత ఆట కథకళి యిత్యాది రీతులకు చాల సన్నిహితత్వం కన్పట్టును.

యక్షగాన కథలు భారత భాగవతాదులనుండి వివిధ ఘట్టాలు తీసుకొని రచన చేయబడి నవి. వీరము, భయానకము వీరు ముఖ్యంగా పోషించునటి రసాలు. ఆ రసాభినయానికి అనువైన కథా భాగాలనే వీరు యెక్కువగా తీసుకొని నర్తన మాడుదురు. ఈ రసములను పోషించుటకుగాను చేయబడే నృత్యములుగూర్చి యిదివరకు తెల్పియున్నాను. వీర, భయానక రసోత్పత్తి ప్రాధాన్యత గల్గిన నర్తనములుగాని యివి ముఖ్యంగా శుద్ధ తాండవ నర్తనములు. లాస్యాంగానికి యిందు అవకాశము అంతగా లేదు— ఉద్ధత, గంభీరత కల్గిన అంగ విన్యాసములు గల్గిన నర్తనము యిందు ముఖ్యంగా కాంచగలము. ఆరభటి, సతతి వృత్తులు యీ నాట్యములో చూడగలము.

ఆహార్యము— కథకళి నర్తనము, యక్షగానము ప్రదర్శన క్రమములో కొన్ని పోలికలు కన్పించినసూ, ఆహార్యము, ముఖానికి వేసుకొనే రంగులు, అలంకరణ, దేవతా రూపములకు, దుష్ట పాత్రలకు, రాక్షసులకు ఈ రెంటిలో చాలా భేదము ఉన్నవి. ఇందులో దేవతా పాత్రల అలంకరణ కడు రమణీయంగా ఆ పాత్రల సాత్త్విక స్వరూపమును నిరూపించు నట్టివిగా వుండును.

యక్షగానము, బయలు ఆట అనికూడా అనబడుతుంది— బయలు ఆట అనగా ఆరుబయట ఆడబడే ఆట క్రమము. 'కోడంగి' నృత్యముతో యక్షగానము ప్రారంభమవుతుంది—అటుపై గణపతిపూజ, అలంకరణ 'చౌకి' లో ముగించి (చౌకి—Green Room గా పేర్కొనవచ్చును), రంగస్థలంపైకి ఆ విగ్రహమును విదూషకుడు గొనివచ్చి ప్రతిష్టించి, హారతినిచ్చును— అటుపై 'నాంది' ప్రస్తావన జరుగును. పిమ్మట యిద్దరు బాలికలు— బాల గోపాలక వేషములు ధరించి నర్తనమాడి లోనికి పోయిన పిదప, రెండు స్త్రీ పాత్రలు రంగస్థలము ప్రవేశించి నాట్యమాడుదురు. ఆ తరువాత 'ఒడ్డోలగ' నర్తనం ప్రారంభ మవుతుంది— ఇందులో కథలోని ముఖ్యపాత్రలు తెరవెనుక నిల్చి, (ప్రేక్షకులకు వీపు భాగంమాత్రం కన్పట్టును) నర్తన మాడుదురు. అటుపై— విదూషకుడు సభ ప్రవేశించి దేవతలకు ప్రణమిల్లి సూత్రధార భాగవతునికి నమస్కరించి, సభావందన మాచరించును. పిమ్మట కథా గానము, నృత్యము ప్రారంభమగును.

ఈ యక్షగాన మేళములు, దేవళములచే పోషింపబడుచున్నవి. మందర్తి, అమృతేశ్వరి, మరణకట్టె, కొల్లూరు, పెరుదూరు, కటీల్ ధర్మస్థల మేళములవారు ప్రాచీన సంప్రదాయాలలో యక్షగానములను ప్రదర్శించుచున్నారు.

—o—

# కేరళ నృత్యము 'కథకళీ'

రమణీయ దృశ్యములచే నలరారు కేరళ దేశమందలి ప్రాచీన నృత్యకళ 'కథకళీ' అని పిలువబడుచున్నది. ఇది నృత్య గీతములతో కూడుకొనిన నాటకము. దీనియందు రామాయణము, మహాభారతాది పురాణ గాథలను ప్రదర్శింతురు. కథకళీ ముద్ర నృత్యము. 'ముద్ర' లే దానికి జీవము.

నృత్యములో- పశుపక్ష్యాదులు, వృక్షములు, నదులు, మొదలైన వానిని అభినయింప సహాయపడు హస్త చిహ్నములకు ముద్రలనిపేరు.

భయానక, రౌద్ర, భీభత్స రసములకు కథకళీ పెట్టినది పేరు. ఈ నాట్యవిధానమునందు, నవరసములు, సంపూర్ణముగ పోషింపబడుచున్నవి. నవరసము లననేమి? వాని నభినయించు టెట్లు? అను విషయము లిట విపులముగా వ్రాయుచున్నాను.

"యతో హస్త స్తతో దృష్టిర్యతో దృష్టి స్తతో మనః
యతో మనస్తతో భావో యతో భావ స్తతో రసః"

హస్తము యెటుప్రక్క జూపబడునో అక్కడికి దృష్టి ప్రసరించవలెను. ఎచ్చట దృష్టియుండునో అచ్చట మనస్సు, ఎచ్చట మనస్సుండునో అచ్చట భావము పుట్టును. భావమున్న చోట రసముపుట్టును.

ఏదేని ఒక దృశ్యము చూచునపుడు మన హృదయమందు కలుగు మార్పే భావము. ఆ భావమునుండే రసము పుట్టుచున్నది. ఉదా:- స్త్రీ, పురుషులలో గలుగు సంభోగచింత రతి యనబడును. రతియొక్క స్థాయిభావమే, శృంగారరసమనబడును. అనగా 'రతి' యనెడి కోరికవలన పుట్టినది శృంగారరసము.

శృంగార, వీర, కరుణ, అద్భుత, హాస్య, భయానక, భీభత్స, రౌద్ర, శాంతము అని రసములు తొమ్మిది.

### 1 శృంగారరసము

సంభోగాది విషయములందు కోరికలవలన శృంగారరసము పుట్టుచున్నది. ముద్దు మొదలగు వైశసములలోని క్రీడలు శృంగార రసము.

### 2 వీరరసము

ఇది ఉత్సాహము వలన పుట్టును. వీరుల హృదయము నెరుగని అహంకారమువలన ఈ రసము పుట్టుచున్నది, పెరుగుచున్నది.

దయావీర, దానవీర, యుద్ధవీర- అని వీరరసము మూడు విధములు.

### 3 కరుణరసము

ప్రియజన వియోగము లందు పుట్టును. ఈ రసము దుఃఖము వలన పుట్టుచుండును.

### 4 అద్భుతరసము

మన మెన్నడూ చూడని ఒక దృశ్యమును చూచిన, దాని వలన అద్భుత రసము పుట్టును.

### 5 హాస్యరసము

వికృతాది దృశ్యములజూచినచో దానివలన గలుగు మనో వికారమే హాస్యరసము. ప్రజలను నవ్వించునది హాస్యరసము.

### 6 భయానకరసము

భయంకరముగ కనిపించుదానివలన పుట్టుచున్నది. భయము వలన భయానకరసము పుట్టును.

### 7 భీభత్సరసము

ముందు వెనుకలు ఆలోచింపక ఒక పనిచేసి పశ్చాత్తాపము పడుటవలన పుట్టుచున్నది. భీభత్సము దుర్భర విచారమువలన పుట్టును.

### 8 రౌద్రరసము

మనలను హింసించే శత్రువులయందు పుట్టును. రౌద్రము కోపము వలన పుట్టును.

### 9 శాంతరసము

ఎట్టి కోరికయును లేక వైరాగ్యమును పొందుటయే శాంత రసము.

# పూర్వము నవరసములలో చేయుబడిన నృత్యములు

శృంగార రసములో 'ఘురిత' నృత్యము చేయబడినది. నాయికా నాయకుల పరస్పరానురాగము, ప్రేమను వెలిబుచ్చుచు చేయునటువంటిది 'ఘురిత' లేక స్ఫురిత నృత్యము.

వీర, రౌద్ర రసములలో లఘునృత్యము ప్రదర్శించెడివారు. కాళ్ళ మడమలు కొంచెము యెత్తి ఒకదాని తరువాత యింకొకటి భూమిపై కొట్టిన, లఘునృత్య మనబడును.

కరుణరసములో పేడాలి నృత్యము చేయబడేది. రసభావ ములు లేనటువంటి అంగచలనమే 'పేడాలి' నృత్యము.

అద్భుత రసములో బహురూప నృత్యము చేయబడియెడిది. నాటకములో ప్రతిఘట్టమునకు వేరు వేరు విధములైన అలంకార ములను ధరించి రసభావములతో కూడుకొన్నది 'బహురూప' నృత్యము.

హాస్యరసమునందు 'వికట' నృత్యము చేయబడును. ప్రజల హృదయములో భయము, హాస్యము, కలిగించు నటువంటి దుస్తు లను ధరించి చిత్ర విచిత్రముగా నాట్యమాడుట 'వికట' నృత్య మనబడును.

మత్తావళి, భయానక రసములోనూ; జకారి, బీభత్సరసములోను చేయబడేది.

మిక్కుటముగా మద్యము సేవించి, ఆ నిషాతో తురుష్కులు చేసిన నృత్యము మత్తావళి.

ప్రకృతి గీతములను పాడుచూ, అతి సున్నితమైన హావభావములను ప్రదర్శించుచు చూచుచున్న స్త్రీ, పురుషులనుగూడ సిగ్గుతో ముంచివేయునట్లు చేయగలిగిన నృత్యము పేరే 'జకారి'.

## నవరసాభినయములోని దృష్టిభేదములు

### శృంగారాభినయములో చూపు

వికసించిన కనుబొమలచేత అందమైనది, స్వచ్ఛమైనది, పవిత్రమైనది, రమణీయమైనది, ఆత్రత తన్మయత్వములను తెలుపునది. అట్టి దృష్టిని ప్రియమైన వస్తువుపై ప్రసరింప జేయవలెను.

### వీరరసములో

నేత్రములను పూర్తిగా తెరువవలెను. గ్రుడ్లు కదలించక ఒకే వస్తువుపై దృష్టి ఉంచవలెను. నేత్రములు మెరయుచుండవలెను. ఒకొక్కప్పుడు దృష్టి యెక్కువగా ప్రకాశింపకుండుటకుగాను కండ్లను కొద్దిగా మూయవలెను.

### కరుణరసములో

కండ్లు సగముమూసి, గ్రుడ్లలో విచారమును చూపవలెను. కొన్ని సమయములందు కనురెప్పలను కొంచెముగ మూయవలెను. చూపును ముక్కుకొనపై నిలుపవలెను.

### రౌద్రరసములో

ఆతురత వెలిబుచుటకై అధికముగా కదులుచున్న కనురెప్పలు, ఎర్రనిగుడ్లు, కఠినమైనట్టి క్రోధమును వెలిబుచునట్టి చూపు చూడవలెను. కొన్ని వేళలందు గ్రుడ్లునాడించి ఒకచోటనే యుంచవలెను.

### హాస్యరసములో

కనుపాపలను సగముగా మూసి గుండ్రముగా గిరగిర త్రిప్పవలెను. కొన్ని సమయములందు కనురెప్పలను కొంచెముగా మూయవలెను. మరికొన్ని వేళలందు కనుపాపలను కదల్పక ఒక్కచోటనే యుంచి మరల ఇటునటు ఆడించవలెను.

### భయానకరసములో

కొన్ని సమయములందు కండ్లు పూర్తిగా తెరువవచ్చును, పూర్తిగా మూయవచ్చును. లేక ఆత్రత, హృదయాందోళనము తెలుపునట్లు గ్రుడ్లను కదలించుచు, తన చుట్టుప్రక్కలకు, భయముతో చూపుజూచి తప్పించుకొని పారిపోవుటకు మార్గమును వెదుకునట్లు చూడవలెను.

### బీభత్సరసములో

కండ్లు సగము మూయవలెను. కనురెప్పలు, గ్రుడ్లు, ఆతురత వెలువడునట్లు తొందరగా ఆడింపవలెను. ప్రక్కచూపు, అతి సూక్ష్మమైన దృష్టిగూడ ఉపయోగించవలెను.

### అద్భుతరసములో

చూపు, ఆనందము, సంతోషము, తెలుపునట్లుండవలెను కండ్ల నిటునటు కదల్పక దృష్టిని యొకేవస్తువు పైననే యుంచవలెను. కొన్ని సమయములందు సూక్ష్మదృష్టి, సగము మూయబడిన కండ్లనుగూడ ఉపయోగించవచ్చును.

### శాంతరసములో

ఎట్టి తత్తరపాటు లేక, స్వాభావికముగా, స్వచ్ఛముగా, సాత్వికముగా చూపు నుపయోగించవలెను.

### వృత్తులు :

కైశికీ సాత్వతీ, భారతి, ఆరభటి అని వృత్తులు నాలు విధములు. శృంగార, హాస్య, కరుణ రసములలో కైశికీ, వృత్తి: భయానక, బీభత్స, రౌద్రరసములలో ఆరభటీ వృత్తి: వీర, రౌద్ర అద్భుతరసములలో సాత్వతీ, భారతి వృత్తులు ఉపయోగింపబడును.

నర్తకీ, నర్తకులు, చక్కని సంగీతము పాడుచు అతి రమణీయముగ, హృదయాహ్లాదకరముగా, నృత్యమాడుటయే 'కైశికీ' వృత్తి. సత్వగుణ ప్రధానమై, శౌర్యము, దయ, నిరాడంబరత్వము, వికారము లేకనే మన హృదయమునకు ఆనంద మిచ్చునట్టిది 'సాత్వతి' వృత్తి.

గంభీరోపన్యాసములతో నిండియుండునది, పెద్ద పెద్ద పండితులతో మాట్లాడుట, చర్చించుట మొదలగునవి 'భారతి' వృత్తి యనబడును. మాయ, కపటము, యుద్ధము, క్రోధము, బలయందుంచుట మొదలగు విషయములు గలిగియుండునదియే 'ఆరభటి' వృత్తి.

## నవరసములకు అధిదేవతలు

శృంగారమునకు మహావిష్ణువు, వీరరసమునకు ఇంద్రుడు, కరుణకు యముడు, రౌద్రరసమునకు రుద్రుడు, హాస్యమునకు ప్రమథ, భయానక రసమునకు కాళి, బీభత్సమునకు మహాకాళ (శివునియొక్క స్వరూపమే), అద్భుతరసమునకు గంధర్వుడు, శాంతమునకు నారాయణుడు అధిదేవతలు.

## నవరసములలో పూర్వముపయోగింపబడిన గీతములు

శృంగారరసములో అప్పుల బంధకము, వీరరసములో లహరి, కరుణలో కంబూక, రౌద్రరసములో వినోదకము, హాస్య

రసములో చుటల, భయానకరసములో ధ్రువపదము, భీభత్సరసములో త్రిపుట, గీతము ఉపయోగింపబడినవి.

## నవరసముల కుపయోగించవలసిన తెరలు

శృంగారములో తెలుపు, కరుణలో పొగరంగు, హాస్యరసములో అనేక రంగులు, భయానకలో నీలవర్ణము, భీభత్సములో పొగరంగు, అద్భుతములో నలుపు, రౌద్రరసములో ఎరుపు రంగులుగల తెరల నుపయోగించిన, ఆయారసముల అభినయమునకు యివి చాలవరకు సహాయపడును.

## నవరసములయొక్క రంగులు

శృంగారరసము— ముదురు గోధుమరంగు (Dark-Brown), లేక గులాబిరంగుతోను,
వీరరసము— బంగారు ఛాయతోను,
కరుణ — నీలిమబ్బు లేక బూడిదరంగుతోను,
రౌద్రరసము— ఎరుపు లేక రక్తవర్ణముతోను,
హాస్యము - తెలుపుతోను,
భయానకము— నలుపుతోను,
భీభత్సము— నీలిరంగుతోను,
అద్భుతము— పసుపుతోను,
శాంతము — కలిసియున్న అన్ని రంగులతో పోల్చబడును.

ఇట్టి సిద్ధాంతముల ననుసరించే 'కథకళి' నృత్యములో వచ్చెడి పాత్రలు, వారివారి స్వభావములనుబట్టి ముఖమునకు రంగు వేసికొందురు.

పూర్వకాలమున మలబారులో చేయబడిన 'రామనాటక'మే ప్రస్తుతపు 'కథకళి' నృత్యము. ఇది తాండవ నృత్యమగుటచే దీనిలో స్త్రీలు పాల్గొనరు. స్త్రీ పాత్రలుగూడ పురుషులే అభినయింతురు. ఇది నృత్యనాటక సాంప్రదాయము.

## మోహిని ఆట్టము

ఇది కథకళి కన్న పురాతన నృత్యము. మోహినిఆట్టము స్త్రీలు చేయు నృత్యము. ఇది లాస్యనృత్యము. ఇది దాదాపు తెలుగులలోని అభినయకళను పోలియుండును. నేటి భరత నాట్యమువలె నిది ఒక్కరిచే చేయబడును. ఈ నృత్యములో శాంత, భీభత్సరసములు తప్ప అన్ని రసములూ అభినయింపబడును.

కొత్తారకర సంస్థానాధీశులచే 'చక్కియార్ కుత్తు' 'కుటియాట్టమ్' ప్రచారములోనికి తేబడినవి. ఇవి కృష్ణాటముకన్న పురాతనమైన నృత్యములు. కృష్ణాటము గీతగోవిందమును చాలవరకు పోలి యుండును. కేరళ నృత్యమును మూడు విధములుగ విభజింపవచ్చును.

1. దైవికము.
2. దైవసంబంధమై- పాండిత్య ప్రదర్శనముతో కూడుకున్నది.
3. సామాన్యముగా జనులను రంజింపజేయుటకు ప్రదర్శింపబడునవి.

భగవతిపాటు, తియాట్టు, పనపాటు, మొదలైనవి దేవళములో ఆలయ ప్రాంగణములలో భగవతిని స్తోత్రము చేయుచూ చేయబడునవి.

కుత్తు, కృష్ణాటము, కొంగకళి మొదలైనవి దైవసంబంధ నృత్యములైననూ పాండిత్య ప్రదర్శనతో కూడుకొనియున్నవి. సంస్కృత శ్లోక మయమయిన పురాణ ఇతిహాసగాథలు.

తుల్లల్, మోహిని ఆట్టము, కయికొట్టికలి, పతకము, యివి సాధారణముగా జనులను రంజింపజేయుటకు జేయు నృత్యములు. కథకళి సామాన్య జనులు, వినోదార్థము చేయబడు ప్రదర్శన మగుటచే యెక్కువగా ప్రజాదరణమును పొందుచున్నది.

**కవికొత్తు**- డప్పులు వాయించుచు, ప్రజలకు నృత్య ప్రదర్శనము జరుగునని తెలుపుదానిని 'కవికొత్తు' అందురు.

**సేవకళి** - తెరలో ప్రదర్శనము చేయుటకు ముందు దేవళములో భగవంతుని ఆరాధించుచు నృత్యమాడుదురు. ఇది ఆ గ్రామదేవతను సంతోషపరచుచు, ఆరాధించుచు. ప్రజలకు తమ నృత్యకళలోని పాండిత్యమును చూపుచు, వారిని ప్రదర్శనము చూచుటకు ప్రోత్సహించుట కుపయోగపడును.

**పురప్పాడు**- మొదటిసారి రంగస్థలముపై నర్తకులు కనబడుట. ఇందు అందరు నిలబడుదురు. పాడువాడు 'మంజుతర' 'గీతగోవిందము' లోని కొన్ని అష్టపదులను పాడును.

**తోటాయము**- ఇది భరతశాస్త్రములోని పూర్వరంగమును పోలియుండును.

ప్రతి ఘట్టమును ముగించునప్పుడు నర్తకులు తిరుగుచు నృత్యమాడుదురు. ఇది 'కలాశా' అనబడును.

కథకళి ముద్రనృత్యమని చెప్పబడినది. కథకళిలో ప్రతి ముద్ర ఒక నృత్యమగును. ప్రతి ముద్రకు సరిపోవు అంగచలనము, నేత్రచలనము ఉండును. ఒక సామాన్య విషయమునుగూడ అతి రమణీయముగ, హృదయాహ్లాదకరముగ ప్రదర్శించుటయే కథకళిలోని ముఖ్య విశేషము.

ఉదా.— పూచిన తామరపువ్వుపై తేనెటీగ వాలి దానిలోని మకరందమును త్రాగును.

ముందు నర్తకుడు సమభంగిమలో నిలబడి రెండు చేతులను బొడ్డున కెదురుగ దొన్నెవలెచేర్చి పట్టుటచే అది అచ్చము తామర మొగ్గవలె ఉండును. అతని దృష్టిగూడ వికాసములేక, అతి సూక్ష్మముగా కన్నులు మూయబడి యుండును. తాళలయననుసరించి అడుగులు వేయును. కొలనులో దాగికొనియుండిన తామర మొగ్గ లెటుల ప్రభాత సమయములో నీటిపైకి వచ్చునో,

ఆ విధముగనే ఆ కపోతహస్తమునెత్తి వక్షస్థలమున కెదురుగ తేబడును. తరువాత కమల దళములు (రేకులు) ఒక్కొక్కటే సూర్యకిరణములకు విడునట్లు చేతివేళ్ళు ఒక్కొక్కటే విప్పబడును. దీని ననుసరించి దృష్టిగూడ క్రమేణ ప్రకాశవంతమై యుండును. అన్ని వ్రేళ్ళు విప్పి పుష్పమువలె పట్టినప్పుడు కన్నులు గూడ పూర్తిగ తెరువబడును. ఇక్కడికి పద్మనృత్యమైనది. తరువాత నటుడు భ్రమరి వచ్చుట నభినయించును. ఎడమ చేతిలో పద్మహస్తము చేపట్టియుంచి, కుడిచేతితో భ్రమరహస్తముపట్టును. దృష్టిగూడ కుడిచేతిపై నుంచును. తేటి మకరందము గ్రోలుటకు పుష్పముచుట్టు తిరుగుచున్నట్లు ఆ చేతిని యిటునటు ఆడించును. దానితో బాటు నేత్రములుగూడ కదలును.

కనుకొని తేటి కొలనులోని తామర పువ్వులను చూచును. పక్కనున్న తగిన నవనవ పుష్పమును చూచును. ఆ పుష్పము రెక్కలపై వాలును. ఎడమ చేతిలోనున్న పద్మహస్తము వేళ్ళపై కుడిచేతిలో నున్న భ్రమర హస్తము మోపబడును. ఒక క్షణము అది సంతోషముతో తేనెను తాగును. నటుడు నేత్రములలో ఉల్లాసము కనబరచును. కాలిగజ్జెలు "చసనస చసనం చన్ చసస చసస" అని మ్రోగును. కడుపునిండ తేటి మకరందమును గ్రోలును. అతడు నేత్రములలో సంతోషము వెలిబుచ్చును. తరువాత ఆ తేనెటీగ తన రెక్కల కంటుకొనిన పుప్పొడిని దులుపుకొనుచు ఎగిరిపోవును.

కథకళీ ప్రదర్శనములో వెనుకభాగమునుండి నృత్యకథ పాడబడును. దాని ననుసరించి, దాని భావమును నర్తకుడు అభినయించును. ముందువేయబడిన తెరగూడ యిప్పటి మన నాటకములలో వలె నుండదు. వారు రెండు కొనలను ఇద్దరు పట్టుకొని నిలబడెదరు. ఇది చాల ముఖ్యమైన విషయము. నర్తకుడు చేయు అభినయమును బట్టి వారు తెరను ఎత్తుచూ దించుచు యుందురు.

నృత్యములో శరీరములోని అన్నిభాగములను గాక ప్రత్యేకముగా, ఒక ముఖమునే ఒక సన్నివేశములో నర్తకుడు ఉపయోగించుచున్నాడనుకొందము. అప్పుడు వారు తెరను పూర్తిగ అతని అవయవములు కనబడకుండ యెత్తి, అతని శిరమును మాత్రము చూపెదరు. కొన్ని సమయముల యందు కాళ్ళతో పనిలేక కేవలము నడుమునకు పై భాగమునే నర్తకుడు కదల్చుచున్నాడనుకొందము. అప్పుడు వారు తెరను నడుము వరకే ఎత్తియుంచెదరు. చూపరులకు కటి పైభాగమే కన్పడును.

## కథకళి నర్తకుడు - శిక్షణ

పన్నెండు – పదునాలుగు సంవత్సరముల వయస్సులో నర్తకుడు (కలారి) వ్యాయామశాలలో ఉపాధ్యాయునివద్ద (ఆసన్), దక్షిణ, వస్త్రములు సమర్పించి, అతని ఆశీర్వచనమునుపొంది శిక్షణకు ప్రవేశించును. మూడు గజముల పొడవు, ఆరంగుళముల వెడల్పుగల 'కచ' యను గుడ్డను ఆసన్‌వల్ల తీసికొని కటితలమున గట్టిగా కట్టుకొనును. గురువు శిష్యుని దేహమంతటను, నువ్వులనూనె పట్టించి, చేతులు, కాళ్ళు ఒక క్రమమున చాచుట, లాగుట, కదల్చుట, ఊపుట మొదలగు క్రియలకు, లాఘవము, చురుకుదనము, పుట్టుటకుగాను కొన్ని విన్యాసములను నేర్పును. చెమటపట్టిన తరువాత వెల్లకితలగాను, తరువాత బోర్లాను, శిష్యుడు పరుండును. బోర్లగా పరున్నపుడు గడ్డి మెత్త మీద మోకాళ్ళానుకోవలెను. అంత నాచార్యుడు వ్రేలాడుచున్న త్రాడు నాధారముగా జేసికొని కాలి బొటనవ్రేలితో నఖశిఖ పర్యంతము ముప్పదినుండి నలుబదియైదు నిముషములవరకు నొక్కి త్రాయును. కీళ్ళు, ఊపిరితిత్తులు మొదలైన భాగములకు ఈ మర్దన అవగానే స్నానమును, భోజనమును ముగించును. మధ్యాహ్నమందు నర్తకుడు నృత్యము నభ్యసించును. తరువాత కంటిగ్రుడ్డు (తార), బొమలు (భ్రూ), చెక్కిళ్లు (గండ), పెదవులు (అధర) మొదలైన ఉపాంగములతో భావప్రకటనలు చేయువిధముల నభ్యసించును. ఇట్లు కొంత నేర్చిన తరువాత హస్తముల (ముద్రల) నభ్యసించును. అభినయ (చేతులతో, కాళ్ళతో) తాళముచేయు పద్ధతి నభ్యసించును. హస్త పాద విన్యాసములు తాళ లయలకు సరిపోవు విధమును సాధనచేయును. ఈసాధన అభ్యాసము నాలు మాసములుపట్టును.

అటుతరువాత అతడు నటకుడుగా గణింపబడును. కథకళి ఆటలో పాల్గొనుటకు ప్రారంభించును. కొన్ని చొల్లియాట్టము (రిహార్సల్సు) లైన తరువాత మద్దెల 'చెండ' వాయించుచుండగా ఆట, పాట నభ్యసించును. ఇట్లు 5,6 సంవత్సరములు కష్టించి నేర్చిన తరువాత కొంత నైపుణ్యము సంపాదించగలడు. ప్రతి సంవత్సరము వర్షాకాలమునందు 'కలారి' లో దేహశిక్ష, మర్దన వగైరాలు పొందుచుండవలెను. ఆంగిక, సాత్వికాభినయములు నేర్చుకొనుచుండవలెను. వీనియందు చాతుర్యములేనిదే నటుడు ప్రావీణ్యుడుగాడు, ప్రఖ్యాతిగాంచలేడు.

## అభినయములు త్రివిధములు

1) స్వభావికములు:– భావోద్రేకమున తమంతట కలుగునవి.
2) వస్తునిర్దేశమునకై, ఆ వస్తువుయొక్క ముఖ్యలక్షణమును జూపుటకై చిహ్నముగా ఉద్దేశింపబడి యేర్పాటుచేయబడినది.
3) ఆరాధన, అభయము, వరద, దాన మొదలైన సందర్భములను తెలుపుట కేర్పాటు చేయబడినవి.

## కథకళిలో హస్తములు- (ముద్రలు)

అసంయుతములు—24

సంయుతములు—40

అని మలబారు దేశములో చిరకాలమునుండి ప్రసిద్ధిగాంచినవి. భరత శాస్త్రమునకు ఇవి విరుద్ధములు, 'హస్తలక్షణదీపిక '

గ్రంథము వీరికి ఆధారము. 'సిలప్పాధికార'మను తమిళ గ్రంథములో ముప్పదిమూడు ముద్రలు మాత్రమే చెప్పబడినవి. మరియు వేరువేరు పద్ధతులనుబట్టి ముద్రలసంఖ్య వినియోగము మారినది. ఆగమములనుండి, నాట్యశాస్త్ర గ్రంథములనుండి సేకరించి యేర్పాటు చేయబడినవీముద్రలు. అరువదినాలుగు ముద్రలు వాని లక్షణములు, వినియోగములు 'హస్తలక్షణదీపిక'లో విపులముగా చెప్పబడినను, సాధారణముగా పతాక, కటక, ముద్ర, ముష్టి అను ఈ నాలుగు హస్తములనే ఎక్కువగా వాడుదురు.

పాటను అభినయించునప్పుడు హస్తములు మాత్రమేగాక అంగికమునెన్నియో చేరియుండును. ఈ కథకళి నాట్యాభినయము చేత వాక్యార్థమంతయును సులభముగ ప్రదర్శింపవచ్చును.

ఇతరాభినయములు

శిరస్సులో (శిరోభేదములు) 9
దృష్టులు ………… 8 లేక 11
భ్రూభేదములు …. 6
గ్రీవాభినయములు 9

ఇవిగాక ఉపాంగ, ప్రత్యంగములతో కూడినవికూడాగలవు. భరతముని చెప్పినవానికంటె తక్కువగాని ప్రతివాని భాగమందు చెప్పబడినవి. కాని భరతముని చెప్పనటువంటి పండ్ల, నాలికలను ఈ అభినయమందు ఉపయోగించుచున్నారు.

* * * •

## ఆహార్యము

ముఖమునకుశోభ, కాంతి, దీప్తి, మాధుర్యము కలుగునట్లు రంగులతో వేషము వేయుదురు. అవి ఐదురకములు.

1) మినుక్కు:– ఋషులు, బ్రాహ్మణులు, స్త్రీలు వీరికీ పద్ధతి నుపయోగింతురు. పసుపు, ఎరుపు రంగులు కలిపి సున్నిగాపూసి, కళ్ళకు, కంటి రెప్పలకు నల్లని కాటుక పెట్టబడును.

2) పచ్చ:– ఆకుపచ్చని రంగుతో ముఖము, కండ్లకుకాటుక, పెదవులకు ఎరుపు, గండములు ఎడమవైపుగుడు, గడ్డము చివర సున్నము కలిపి, సన్నని గీతలతో, అందముగా ముఖముచుట్టు దిద్దబడును.
రాముడు, కృష్ణుడు, పాండవులు మొదలగు గొప్పవారికే ఈవేషము వేయుదురు.

3) కత్తి:– ముక్కునకు రెండువైపుల నుదుటివరకు, కనుబొమలపై ఎరుపురంగు, తక్కిన ముఖభాగమునకు పచ్చ రంగు, నాసాగ్రమున, ఫాలమున తెల్లనిచుక్క యుంచుదురు. ఇది అసురుల వేషము.

4) తాడి (దాడి).– ఇందు తెలుపు, నలుపు, ఎరుపు రంగులుండును.

తెలుపుతాడి:– తెల్లని గడ్డము, తెల్లనిబొచ్చుతో చేసిన అంకి (Coat) నాలికయందు, లలాటమందు తెల్లని, గుండ్రని చుక్క. (హనుమంతవేషము, కోతి, శ్రేష్ఠుడు, మునులకు గూడ)

ఎరుపుతాడి:– ఎఱ్ఱని గడ్డము, ఎఱ్ఱనిబొచ్చు, కోటుముఖ్యము. (బలి మొదలైన రాజులు, వాలిసుగ్రీవులు మొదలగు వారి వేషములకు.)

కరిదాడి (నలుపుదాడి):– నల్లగడ్డము, నల్లనిబొచ్చుకోటు (కలిపురుషుడు, శని మొదలగు వారికి)

ముఖముమీద రంగులకు తగినట్లు మార్పులుండును?

విదూషకుడు:– నవ్వు పుట్టునట్లు అన్నిరంగులుచేర్చి వ్రాసుకొనును. కండ్లెర్రబారుటకై అందరును కంట్లో 'వేతగింజల'ను వేసికొందురు.

పచ్చ – సాత్వికమును, ఎఱుపు – రాజసమును,
నలుపు – తామసమును సూచించును.
పసుపు – సత్వరజస్సులను తెలుపును.

## ఆభరణ విశేషాదులు

ప్రాచీన శిల్పగ్రంథములందలి దేవతల శిల్పముల, అలంకరణ విషయముల ననుసరించి అలంకారములను కథకళివారు గ్రహించినట్లు మనకు విశదమగుచున్నది. శిరోవేషము, శిరోమణి, కుండలములు, కంకణములు, భుజకీర్తులు, ఉంగరములు, వెండి గోళ్ళు, కంఠహారములు, పూలమాలలు, పడాణము లేక మొలత్రాడు, ఉదరప్రదేశమునకు గొలుసువంటి ప్రేలాడు ఆభరణములు గజ్జెలు, మ్రోగునట్టి అందెలు, ఇవి వారి ఆభరణములు. దేహమంతటను అత్తి కంచుకమువంటి దుండును. మెడపైని యొకటి యెఱ్ఱని. రెండు మూడు తెల్లని ఉత్తరీయములుండును. వానిచివరల యందు తలక్రిందైన పద్మాకారములుండును. మొలచుట్టు తెల్లని నక్కతో చేయబడిన పేరికలు ఎక్కువగాను, రెండు మూడు మాత్రమే యెఱ్ఱని పేలికలను ప్రేలాడగట్టబడి యుండును. ఇవినాట్యమునకడ్డురావు. మరియు ఇందలి దుస్తుల స్వరూపము కొన్నిట మహమ్మదీయ పద్ధతి ననుకరించినదా యనిపించును. ముఖ్యముగా స్త్రీ వేషములయందు మరియు ఆ పోలికలగుపడును. 'మోహినీ' స్త్రీ వేషములను పోలియుండును. ఆలయపుగోడలమీద వ్రాయబడిన చిత్తరువులను, చెక్కబడిన శిల్పములనుబట్టి, పూర్వనాటకములనాడు సామాన్యజనుల వేషములనుబట్టి, ఈవేషధారణ మేర్పడి యుండవచ్చును.

## కథకళి నాటకపు జట్టు

సాధారణముగా ముప్పదిమంది యుందురు.

12 గురు నటకులు

4 గురు పాటకులు

4 గురు భేరి, మద్దెల మొదలగు వాద్యముల వాయించువారు,

ఇతరులు సేవకులు.

కొన్నేండ్ల క్రిందటివరకు జమీందారులు, సంపన్నులు వారివారి ఆధీనములలో ఒక్కొక్క జట్టును పోషించెడివారు. నేటివరకు తిరువాన్కూరు మహారాజులు, కొచ్చిన్ సంస్థానాధీశులు, ఈకళను పోషించుచూవచ్చిరి.

ఈ కళలో మహాపండితులు 'కుంజ కురుప్'గారు. వీరి వయస్సు సుమారు 70 సంవత్సరములు. శాస్త్రమును బాగుగా నెరిగిన కథకళి నర్తకుల నెందరినో తయారుచేసిరి. విశేషించి నాకు కథకళి నృత్యము నేర్పిన గురువులు.

కథకళినృత్యము, ఆంధ్రదేశములో వివిధ నాటకముల వంటిదే అయినను దానిని ప్రస్తుతకాలపు రంగస్థలమునకు (Stage) పనికివచ్చు కళగా తయారుచేసిన వారిలో స్వర్గీయ గురుశంకర నంబూద్రి, "వల్లథోల్" మహాకవి ముఖ్యులు.

—o—

# బౌద్ధభిక్షువుల ఆవృతజీవనము

(ప్రాచ్యనృత్య సాంప్రదాయములద్వారా నాటికను ప్రదర్శించు విధానము.)

## ఓరియంటల్ నృత్యము

"నేటికాలమునకనుసరించి నవీన పద్ధతులలో చేయబడే నృత్యము"

ప్రాచ్యప్రపంచ నృత్యము అనేక సాంప్రదాయములలో వర్ధిల్లినది. అభినయము భరతనాట్యమును పోలియుండవచ్చును. అంగ సంచలనము మణిపురి పద్ధతివలె, రమణీయముగ, కోమలముగ నుండవచ్చును. పాద సంచలనము కథక్‌నృత్యమువలె చిత్రగతులను కలిగి యుండవచ్చును. నృత్య నాటిక కథకళి పద్ధతిలో ఆడవచ్చును. కథననుసరించి అచ్చటచ్చట 'ఉప్పా' నృత్యమునందువలె ముఖములకు తొడుగులనుకూడ ధరించి, కొందరు నృత్యమాడుదురు. ఆహార్యము–ఆభరణములు, దుస్తులు, సిగకట్టు, రంగాలంకారము అజంతా చిత్రకళ ననుసరించుటకు అభ్యంతరములేదు. ఇక సంగీత విషయమునందుగూడ శ్రోత్రపద్ధతుల నవలంబించుటకు స్వేచ్ఛకలదు.

ఉదయశంకరుడు మొదలగు ప్రఖ్యాత నర్తకులు, తమ నృత్య ప్రదర్శనములతో ఈపద్ధతిని అమలులోనికి తెచ్చిరి. ఓరియంటల్ పద్ధతిని చేయబడు ఒక నృత్యనాటికను యిట ఉదహరింతును.

'బుద్ధం శరణం గచ్ఛామి'

ప్రపంచములో తన దివ్య బోధనతో ప్రేమవాహినులను ప్రవహింపజేసిన బుద్ధదేవుని యుగము. ప్రజల హృదయమందు బుద్ధదేవుని దివ్యసందేశములు నాటుకున్నవి. వేలకొలది సామాన్య ప్రజలు సంసార బంధములనుండి విముక్తిచెంది ఆ పరమపురుషుని స్మరించుచూ తరించిరి. రాజులు తమ రాజ్యములను వదలి సన్యసించిరి. పసికందులు ఆ జ్ఞానమూర్తిని స్మరించుచు మోక్షము నొందిరి. అప్పుడు అజాతశత్రువు మగధను పాలించుచుండెను. అతడుబౌద్ధమత విరోధి. తను రాజైన వెంటనే తనరాజ్యములో బుద్ధుని ఆరాధన నిషేధించుచూ శాసించినాడు. 'బుద్ధం శరణం గచ్ఛామి' అనిస్తుతించుచు, మందహాస వదనములతో యెందరో భిక్షువులు అతని క్రూరహింసలకు బలియైరి. బుద్ధదేవుని స్మారకోత్సవమునాడు బోధి వృక్షముకడ అనేకవేలమంది జనులు చేరిరి. అజాతశత్రువు దర్బారునర్తకి శ్రీమతిగూడ యుత్సవమునందు పాల్గొనకుండునట్లు రాజు బోధివృక్షముక్రింద దర్బారుజరిపి అందు శ్రీమతి నృత్యముచేయునట్లు ఆజ్ఞాపించినాడు. శ్రీమతి రాజాజ్ఞను యెదురాడక అలంకరించుకొని బోధివృక్షము క్రిందకు వచ్చి భగవంతుని తన నృత్యకళతో ఆరాధించినది. అజాతశత్రువు ఆమె నృత్యమునుజూచి ఆనందించెను. కాని శ్రీమతి జేయునది

నృత్యము మాత్రమేకాదు. ఆమె సమాధి దీక్షలో బోధివృక్షము క్రింద కూర్చొనియున్న బుద్ధభగవానుని జీవితలీలలు తన నేత్రముల యెదుట గాంచుచుండెను. నృత్యముచేయుచు ఒక్కొక్కదుస్తును, అలంకారమును, తీసివేయుచు నృత్యము ముగియులోగా బౌద్ధభిక్షువుగా మారినది. ఆమె బోధివృక్షమునకు నమస్కరించి

బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి

అని బుద్ధదేవుని కీర్తించినది.

♦ ♦ ♦

ఇందు అజాతశత్రుని దర్బారు. బుద్ధుని జీవితము, ఒకే స్టేజిమీద ప్రదర్శింపబడును. బుద్ధుని జీవితమును, శ్రీమతి, ప్రేక్షకులు చూచెదరు. కాని ఆసమయములో అదేరంగముపై అజాతశత్రువున్నను మనము కనపడము. ఆ స్టేజి యేర్పాటులను గూర్చి కొంత వ్రాయుదను.

ఇట్టి ప్రదర్శనములలో 'ట్రిక్‌లైట్లు' ఉపయోగింపబడును. స్టేజికూడ మన నాటకములందువలె చౌకముగా గాక అర్ధచంద్రాకారముగనుండును. దానిని రెండుభాగములుగాజేసి, ఒకభాగములో అజాతశత్రువు దర్బారు యేర్పాటుచేయబడును, రెండవ భాగములో బుద్ధుని జీవితమును చూపబడును. జీవితము చూపబడిన ప్రదేశముపై 'స్పాట్ లైటు' వేయబడును. మధ్య మధ్య శ్రీమతి ఆ దృశ్యమును చూచుచున్నట్లు చూపించుటకు మరొక చిన్న 'స్పాట్‌లైట్' ఆమె ముఖముపై వేయుదురు.

బుద్ధుని జీవితలీలలు చూపుట ముగిసినతర్వాత రంగస్థలమంతయూ లైట్లువేయబడును. అప్పుడు అజాతశత్రువు దర్బారు ప్రేక్షకులకు కనబడును. కొన్నిసమయములందు 'రొటేటింగ్' లేక రివాల్వింగ్ స్టేజి ఉపయోగపడును. ఇందు స్టేజి చక్రమువలె గుండ్రముగ తిరుగును. ఒకస్టేజీని రెండు భాగములుచేసి ఒకభాగములో బుద్ధుడు, రెండవ ప్రక్క అజాతశత్రువు దర్బారు, చూపబడును. బుద్ధుని చూపవలసి వచ్చినపుడు స్టేజి త్రిప్పగా అజాతశత్రువున్న భాగము ముందుకు వచ్చును. అజాతశత్రువును చూపవలసి వచ్చినపుడు అటులనే చేయబడును. కొన్నిసమయములందు మరొక విధమైన స్టేజి యేర్పాటు చేయబడును.

బుద్ధుడు అరణ్యములో సంచారము చేయుచున్నట్లు చూపవలెననుకొందము. అట్టితరి—ముందు ఆ ఘట్టమునకు కావలసిన అరణ్య దృశ్యములు, వృక్షములు, నదులు, కొండలు మొదలగునవి—

తెరమీద చిత్రించి స్టేజికి యిరుప్రక్కల రెండు స్తంభములకు, ఆ పొడుగుపాటి తెర రెండుకొనలను చుట్టుదురు.

బుద్ధుడు అరణ్యములో సంచారము చేయుచున్నట్లు చూపవలసి వచ్చినప్పుడు ఆపాత్రధారి రంగస్థలముపై, తెరకు ముందుకు వచ్చి ఒక చోట నిలబడును. ఆ తెరను ఒక ప్రక్కనుంచి చుట్టుదురు. అప్పుడు అరణ్యములోని వివిధ దృశ్యములు కదలుచుండుటచే, చూచువారికి బుద్ధుడు అరణ్యములో సంచారము చేయుచున్నట్లు కనబడును. ఇటువంటి క్రొత్తరకము స్టేజి యేర్పాటులు జపాన్, ఫార్మోజా మొదలగు ప్రదేశములలో యెక్కువగానున్నవి. మనదేశములో కలకత్తాలో కొంతవరకు యిట్టి స్టేజి ఏర్పాట్లు చేయుచున్నారు.

పై కథను నాటికగా అభినయించుక్రమము వర్ణించెదను.

ధ్ధంగ్....
ధంగ్ తర ధంగ్ ధంగ్....
ధంగ్ తర ధంగ్ ఫంగ్....
ధంగ్ తడ ధంగ్ లిడ ధంగ్....
తడ ధంగ్

ఈ గీతను 'నగారా' పలికినది.

దినసక దినసక — దినక దినక దినక
దినసక దినసక — దినక దినక దినక
దినక దినక దినక
దిదాన తక తకదా

'నగారా' గతలోచేర్చి 'నగపోత'పై, ఈ ముకదా వాయించబడినది. ఇది ముగియగనే

ధిరక్ ధిరక్ ధిరక్ — ధి త్రాంతన్
త్రాంధిరన్ — ధిత్రాంతిన్
తళాంగ్ తక — తదాంగ్ తక తక
తద్ధితళాంగ్ — తాంధిణాంగ్
గిటగిటగిట — త్రాంధిరిక్‌త్రాం

కథకళి 'చెండ' వాయిద్యము గర్జించినది. వెంటనే

దాకిటకిట — ధీకిటకిట
దిన కిటకిట — తటకిటకిట
దాకిట — ధికిట — ధినకిట. కిటకిట — దా
దా దీ దినకిట — కిటకిట — తిట తిట — దా
తిటకిట — కిటకిట

'కోలు' వాయిద్యము — పెనముపై మొక్కజొన్నపేలాలు వేయించినట్టి శబ్దమువలె చటపట ధ్వనులు చేసినది.

దాగె దిరకిట — తునాకత్తా — తిరకిట — తునాకత్తా — తిరికిట
తాగే తిరకిట — తునాకత్తా — తిరకిట — దా
తునాకత్తా — తిరకిట

తబలా అతి సుకుమారంగా ఈ మొహరాను పలికినది. తరువాత

రింఝు రింఝు రిఝా — రింఝు రింఝు రిఝ
రింఝు రింఝు — రిరి రింఝు — రిక రింఝు
రిరి రిరి రింఝు — రిరి రింఝు

తరి రింఝు తరి – తరి రింఝు
తరి రింఝు తరి – తరి రింఝు తరి రింఝు తరి
తరి రింఝు – తరి రింఝు
రాంతల ఈవిధముగా రావపెట్టినది. వివరకు
ధతగిడ్త – తరికిట తక
ధరిలగిడ్త – తరికిట తక
ధిలగిడ్త – తరికిట తక
తధిత్తాం తధిగిణతి ధిత్తాం తధిగిణతాం
తధిగిణతోం తధిగిణతోం తధిగిణతోం
[illegible] ఈ [illegible]
[illegible] వాద్యములన్ని ఒకసారి [illegible] ఈ [illegible] పలికినవి. హాలు నలుమూలలా ఈ నాదమే ప్రతిధ్వనించుచున్నది. హాలులోని ప్రేక్షకులు నిశ్శబ్దముగా చూచుచున్నారు.

తద్ధంగ్....

వేదమధ్యమున్న నీలిరంగు తెర తొలగిపోయినది. రంగస్థలముపై అరణ్య దృశ్యము, ఒక బోధి వృక్షమున్నది.

(అరణ్యమని సూచించుటకు, ఇంగ్లీషు ఆర్కెస్ట్రా, తూర్పు దీవుల సమ్మేళన మందువలె, పక్షుల సంగీతములు, జంతువుల అరుపులు బృందగానమునందు పలికించబడినవి.)

తరువాత కాషాయ వస్త్రములను ధరించి చేతులలో జ్యోతులను పట్టుకొని కొందరు బౌద్ధ సన్యాసులు వచ్చి వృక్షమును పూజించి నిష్క్రమించిరి.

"నింద సి యజ్ఞవిధే రహహశ్రుతి జాతం
సదయ హృదయ దర్శిత పశుఘాతమ్
కేశవ: దృతబుద్ధశరీర: జయజగదీశహరే"

తెరలోపల పదిమంది స్త్రీ పురుషులు ఆర్కెస్ట్రా సంగీతముతో కంఠము జేర్చి పాడిరి. గీతాంతమున
ధంగ్ – ధంగిత – తంగ్ – తంగ్, ఛంప్, ధంగ్‌త – తంగ్‌త, తంగ్

అని నగార వాయిద్యము మ్రోగించున్నది. ఆ నాదముతో మిళితముగునట్లు శంఖము పూరింపబడినది.

రంగస్థలమునకు ఒకప్రక్కనుండి పదిమంది బాలికలు అజంతా గుహలలోని చిత్రములవలె అలంకారములు ధరించి ఆర్కెస్ట్రా సంగీతమననుసరించి నృత్యమాడుచు

"జయదేవ జయదేవ జయబుద్ధదేవ
అహింసతత్వ స్వరూపా విరూపా"

అను గీతమును పాడుచు బోధివృక్షమును సమీపింతురు. ఇది గౌతమముని ఆరాధన నృత్యము.

ఒక బాలిక, చేతనున్న వింజామరతో విసరుతున్నది. ఇంకొక నర్తకి హారతి నిచ్చుచున్నది. మరి యొక కోమలి పూవులతో పూజించుచున్నది. నాల్గవ యువతి ఫలముల నివేదించుచున్నది. ఐదవ లతాంగి బౌద్ధ ధర్మ గ్రంథమును సూత్రపీఠికను కన్నుల కద్దుకొనుచున్నది. ఆరవ భక్తురాలు నృత్యపూజతో ఆరాధించు చున్నది. ఇట్లు వీరందరు నృత్యము పూర్తిజేసి పోయినపిదప ఒక నిమిషము నిశ్శబ్దముగా గడిచినది.

"దయాసిద్ధిరే వ్యాసహింసాస్తులోకే
వదాన్తిస్వశాంతి స్వనీతిస్సదాపి
స్వరాదిప్రసక్తి: పునస్సమ్మహేతు
స్పజదం నిరాకార నిర్వాణమేకమ్"

ఈ శ్లోకం. కాషాయాంబరధారియైన బౌద్ధభిక్షువు లోపల నుంచి పాడుచు వేదికపై ప్రవేశించును. శ్లోకము ముగియులోపల రంగస్థల మధ్యమునకువచ్చి బౌద్ధమతగ్రంథము సూత్రపీఠికలోని

'కమ్మనా వత్తతే లోకో
కమ్మనా వత్తతే పజా
కమ్మనా బంధనాసత్తో
రదస్యా జీవయామతో'

పై శ్లోకము చదువుచూ దానిభావము 'కథకళి' నందువలె ప్రతిపదమును ముద్రలతో అభినయించి, ప్రేక్షకులకు అర్థమగునట్లు బోధించి అదృశ్యమగును.

తెరలో మంగళవాద్యములు ధ్వనించును. ఇద్దరు భటులు రాజలాంఛనములను చేతగొని రంగస్థలము ప్రవేశించి,

'శ్రీ శ్రీ అజాతశత్రువు మహారాజాగారు వేంచేయుచున్నా రని' ప్రేక్షకులకు చెప్పి పోవుదురు.

ఆర్కెస్ట్రా విలంబిత లయలో పాడుచుండును.

అజాతశత్రువు, అతని పరివారము, రాజఠీవితో సంగీతము ననుసరించి అడుగులువేయుచు బోధివృక్షమును సమీపించి ఒకప్రక్కనే అమర్చబడిన ఆసనములపై కూర్చొను చున్నారు.

ఇంతలో నటుడు

తక్కదిమ్మిదత – తత్తైత తకతక
తక్కదిమ్మితక – తత్తైత తకతక

అని మృదంగము పలుక ఆ గతిననుసరించి నృత్తమాడుచు సభలోనికివచ్చి రాజుకు నమస్కరించి 'ఆజ్ఞ' అనుభావము నేత్రములతో స్ఫురింపజేసి ముగ్గురు స్త్రీలు నిలబడిరి.

"ఇక నృత్యము ప్రారంభింపవచ్చును" అనునట్లు ముద్రలతో రాజు అభినయించును.

ధిమ్‌ధిమ్ ధిమ్‌కిటతక
ధిమికిట కిటకిట తక

'కోట' పలుకుతున్నది.

ముగ్గురు స్త్రీలు మణిపురి పద్ధతిలో అడుగులు వేయుచూ రంగస్థలముపైకి వచ్చిరి.

'ధిమికిట కిటదా'

సభకు నమస్కరించి సమభంగిములో నిలబడిరి. వారు సిరెకేళా నృత్యము నందువలె ముఖములకు తొడగులను ధరించి యున్నారు.

'దాగేతిరకిట దా తిరకిట దినక దినకదిన్
తానే తిరికిట తా తిరకిట తినక తినకతిన్'

కథక్ పద్ధతి ననుసరించి 'తబలా' గత్‌ను నృత్తమాడుతూ ముగ్గురు యువకులు వచ్చి ఆ జవ్వనుల ముఖముల పైనున్న తొడుగులను తీసుకొని లోపలికి పోవుదురు. అంత నా జవ్వనులు సభకు నమస్కరింతురు.

"తైతై దిత్తై - తై
తై దిత్తై - తైదిత్తై
తై".

పిమ్మట భరత నాట్యమందలి 'అలంకరింపు' నృత్యమాడిరి.

తాంజితాం - తైతతై - తాంజితాం - తైతతై
తాంజితాం - తైతతై - తాంజితాం - తైతతై
తతై తాహ - దితై తాహ
తతై తాహ - దితై తాహ
తాంకిణ్ణకణక - తకతధిగిణతోం

దీని తరువాతి పటుదు

"నా హృదయ పీఠిపై నాట్యమాడే దేవా
వన్నేలుకోరా నా దేవా"

అని పాడుచూ తాళమువేయుచుండగా, ఆ ముగ్గురిలో మధ్య నిలబడిన నర్తకి శ్రీమతి అభినయించును.

గీతము ముగియగానే-

శ్రీమతి మణిపురి పద్ధతిలో ఆర్కెస్ట్రా ననుసరించి చేయు పూజానృత్యమును రాజుచూచి ఆనందించును. శ్రీమతి చేయునది అతనికి నృత్యము మాత్రమేగాని, ఆమె సమాధి దీక్షలో బోధి వృక్షము క్రింద కూర్చొనియున్న బుద్ధుని జీవితలీలలను తన నేత్రముల యెదుట చూచుచున్నది.

ఇక్కడ 'సీన్' మార్పు వచ్చినది.

అంతఃపురము - పాలరాతితో కట్టబడిన సభామందిరము మధ్య బంగారు సింహాసనమున గౌతముడు ఆసీనుడై యున్నాడు. అతని ప్రక్కన యశోధర యున్నది. ఒక దాసి పాదముల నొత్తుచున్నది. ఇద్దరు దాసీలు వింజామరలు వీయుచున్నారు.

వారికి యెదురుగా కొందరు గణికలున్నారు. అందొక గణిక

మనసే గెకొనరా - నా చక్కని సామి
మమతమీర యున్నానురా - వినరా
శ్రీ కపిల వస్తేశ - గౌతమ నరేశా

అని పాడుచుండగా ... పస స్త్రీలు, వీణ, మృదంగము, వేణువు వాయించుచుండగా, తనువెనుక నిలబడి యింకొక స్త్రీ పాడగా అభినయించుచున్నది.

ఇది శ్రీమతి జూపిన రెండవ ఘట్టము.

## పరిత్యాగము

గౌతముడు సర్వాభరణములను తీసివేసి చెన్నుని ఇంటికి పంపి కాషాయాంబరములను ధరించి అరణ్యములలో సంచారము చేయుచున్నాడు.

## తపస్సు

బోధి వృక్షము క్రింద తపస్సుచేయుచున్న బుద్ధుడు, నిద్రాహారములు మాని, అనేక దినములు తపస్సుచేయును. చిక్కి శల్యమగును. ఒక భక్తురాలు వృక్షమును పూజించుటకు తెచ్చిన పాయసము నతని కర్పించి భక్తితో ప్రణమిల్లును.

## జ్ఞానోదయము

దీర్ఘసమాధిలోనున్న గౌతమమునిలో - గగనమునుండి ఒక ప్రకాశము దిగివచ్చి లీనమగును.

"కాయమస్థిరము
సత్కర్మాచరణమే మోక్షమునకుత్రోవ
సర్వదుఃఖములకు తృష్ణయే కారణము."

ప్రేమచే క్రోధమును,
మంచిచే దొసగును,
పేరాసను దాతృత్వము చేతను
అనృతమును సత్యముచేతను
జయింపవలెను.

ఈ దివ్యసందేశము లోకమునకు చాటుటకు ప్రయాణమగును. సిద్ధార్థుడు బుద్ధుడని పిలువబడెను. బింబిసారుని బుద్ధుడు యజ్ఞశాలలో కలియును.

రాజా! అహింస పరమ ధర్మము.

హింసయే సర్వదుఃఖములకు కారణము. విషయవాంఛను జయింపలేని మానవుని, వస్త్రవిసర్జనము, జటామండలధారణము, ఉపవాసదీక్ష, ధూళి దూసరిత దేహము, నిశ్చలసమాధి, కఠినశయ్య పవిత్ర మొనర్పజాలవు.

బుద్ధదేవుని ఈ దివ్య బోధన బింబిసారుని ఆకర్షించును' అతడు వెంటనే బౌద్ధమతము స్వీకరించును.

వేలకొలది స్త్రీలు, పురుషులు, ఈ దివ్య సందేశముచే ఆకర్షింపబడి సంసారములను వీడి సన్యసించిరి.

అట్టితరి

ఒక తల్లి – చనిపోయిన తనపుత్రునిగొని బుద్ధుని యొద్దకు విలపించుచు వచ్చి బ్రతికింపమని వేడుకొనగా–

'బిడ్డా! జనన మరణములు ప్రాణులకెల్ల స్వభావికములు. దుఃఖముచే ముక్తినొందని జనులీలోకమునలేరు. దీనికై యతలుట యవివేకము, అని ఓదార్చి ఆమెకు జీవిత రహస్యమునుదెల్పును.

బుద్ధ నిర్యాణము

"బుద్ధం శరణం గచ్ఛామి"

చేత పూలుగొని, స్తుతించుచు భక్తులు ఆదేవ దేవుని భౌతిక దేహముపై పూలనుంచి పోవుచున్నారు.

శ్రీమతి నృత్యము చేయుచు తన నేత్రముల ముందు పైన పేర్కొనిన దృశ్యములన్నిటిని చూచినది. తనుధరించిన అలంకారములన్నిటిని నృత్యము చేయుచు ఒకటొకటిగా తీసివేసి నృత్యాంతమున బుద్ధ భిక్షువు దుస్తులలో ప్రత్యక్ష మగును.

"రాజా బాహుబలము, ఆయుధశక్తి, మానవుని బహిశ్శరీరమును బంధింపఁగలవు. అతనిని వశపర్చుకొనునది అహింసా ధర్మమొక్కటియే."

"బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి"

అని బుద్ధదేవుని కీర్తించును.

వెంటనే ఇద్దరు రాజభటులువచ్చి ఆమెను బంధింతురు. 'శిరచ్ఛేదము చేయ' మని నట్లు రాజా సంజ్ఞచేయును.

తక్షణమే బౌద్ధసన్యాసి ప్రవేశించును. "రాజా! హింస వల్లను, మరణదండనవల్లను, జీవియొక్క స్వాతంత్ర్యేచ్ఛను రూపు మాపగలవా? ఇది కేవలము మూఢత్వము. మరణదండన ఈ శరీరమును అంత మొనరించునుగాని ఆత్మను అంటగలదా! అహింసాత్మకులు, నిరాయుధులయిన బౌద్ధ సన్యాసులను జయించితినని ఆనందించుచున్నావు. కాని జీవుడు, ఈ ప్రపంచములోనికి వచ్చినది మొదలు ప్రతిక్షణము అతని మ్రింగుటకు కాచుకొని యున్న గర్వశత్రువైన మృత్యువును జయింపగల్గితివా?

రాజు నేత్రములలోనికి చూచుచు సంబోధించును, ఆ బౌద్ధ సన్యాసి.

అజాతశత్రువు ఒక్కనిముషము రెప్పనార్పక తీక్షణముగ భిక్షువును చూచుచు, ఎడమచేతితో భటునకు 'కర్తరీముఖ' ముద్ర పట్టి చూపును,

రెప్పపాటుకాలములో బౌద్ధసన్యాసి శిరము అజాతశత్రువు కాళ్ళముందు పడును. ఆ త్యాగజీవి రక్తము – బౌద్ధ మతద్వేషి పాదములను తడపును. చూచుచున్న ప్రతివానిలోను భీభత్స, భయానకరసము లుద్భవించును. సభ నిశ్శబ్దముగ నున్నది. రెండు నిముషములు తదేక దృష్టితో సభను తిలకించి,

"ఆ హహ!" అని పెద్దగా అజాతశత్రువు నవ్వును.

"ధంగ్ తం ధంగ్ ధంగ్
ధంగ్ తద ధంగ్ ధంగ్
ధంగ్ తర ధంగ్ ధంగ్
ధంగ్ తద ధంగ్ ధంగ్

– అని విజయభేరి మ్రోగును.

అవనిక జారును.

సాధారణముగా

## మన నృత్యములో నుపయోగించు వాద్యములు

**భరత నాట్యము.**

మద్దెల, తాళము, పిల్లనగ్రోవి, వీణ, వయోలిన్, ముఖవీణ, క్లారినెట్.

**కథకళి**

చండు, మద్దెల, ముఖవీణ, ఫ్లూట్, పెద్దతాళములు, వయోలిన్.

**కథక్**

తబలా, సారంగి, పక్వాజ్, ఢోలక్, ఫ్లూట్, దిల్‌రుబా.

**మణిపురి**

కీల్, ఇస్‌రాజ్, మృదంగ్, తబలా, మాదల్, ఫ్లూట్, తాళం. గాత్రము అన్ని నాట్యములకు ముఖ్యము.

ఆర్కెస్ట్రాతో నుపయోగించు వాయిద్యములు.– మద్దెల, మాదల్, పక్వాజ్, కోలు, చండ, ఢోలక్, కంజిర, నగారా, ఢోలు, తిబలా, ముఖవీణ, ఫ్లూట్, తాళము, జలతరంగము, కాష్టతరంగము, గంటలతరంగము, తబలా, తరంగము, సరోద్, వీణ, సితార, సారంగి, దిల్‌రుబా, ఇస్రాజ్, శంఖము, క్లారినెట్, సాక్సఫోన్, గుల్లచేయబడిన కొబ్బరికాయతో గులకరాళ్ళుంచిన వాద్యము ఉపయోగింతురు.

నాట్యములో వేయు తాళముల జత:– ఒకటి ఉక్కుది. రెండవది కంచుది అయి యుండవలెను. చర్మ వాద్యములన్నిటిలో పురాతనమైనది శంకరుని ఢమరుకము.

• • •

# ఆంధ్రలో జానపద ఆరాధన నృత్యములు

నృత్యకళ కొన్ని ప్రత్యేక తెగల వారిచే నభ్యసింపబడి, పాండితీ ప్రకర్షకు అనువైన కళగా రూపొంది, ప్రతిభావంతులచే ప్రదర్శింపబడుచుండే ఈ తరగతులకు జెందిన స్త్రీలు, పురుషులు—తాము గూడ పండుగ పబ్బములందు అందరూ ఒక చోట జేరినప్పుడు వినోదముగా ప్రొద్దుబుచ్చుటకు కొన్ని నృత్యముల నేర్పరచుకొనిరి. అవియే జానపద నృత్యములు. ఈ నృత్యములు ఎక్కువ కష్టముగా నుండక ప్రత్యేకముగా సాధనచేయ నవసరము లేకుండనే అందరూ పాల్గొనుటకు వీలైన బహు సులభరీతిలో నుండును. గనుకనే పల్లెలందరి ప్రతి యొక్కరూ యిందు పాల్గొనుచున్నారు. ఈ పద్ధతికి చెందినట్టివే గొబ్బి, కోలాటము, బతకమ్మలాట, చిరుతల భజన, తప్పెటగుండు మొదలయినవి....

**గొబ్బి:** ధనుర్మాసమునందు ఆంధ్రదేశములో బాలికలు వీధి గుమ్మములను చిత్రవిచిత్రములైన ముగ్గులతో చక్కగా సలంకరించి, గోమయముతో చిన్నచిన్న కందుకము లంటివి ముద్దలనుజేసి, వానిని పసుపు, కుంకుమ, పుష్పములతో శృంగారించి, పూజించి, ధూప, దీప నైవేద్యాదికముల సర్పించి అలంకార ప్రాయముగా నా రంగవల్లులందుంచి తదనంతరము బాలికలందరు గూడి వానిచుటూ తిరుగుతూ, గొబ్బి పాటలను పాడుచూ నాడుదురు. ఈవిధముగా ధనుర్మాసమంతయునూ గొబ్బి దేవతను పూజింతురు. దీనికే 'గొబ్బియాట' అని పేరు.

**బతకమ్మలాట:** దేవీనవరాత్ర సమయములందు వివిధ రంగుల పుష్పములను గోపురాకారముగ పేర్చి వీధిగుమ్మమును ముగ్గులతో సలంకరించి ఆ పుష్ప శిఖరమును అచ్చటనుంచి, పూజించి, స్త్రీ లందరూ గుమిగూడి బతకమ్మ పాటలను పాడుచూ, వంగుచూ లేచుచూ, వలయాకారముగ తిరుగుచూ, తాళయుక్తముగ చప్పట్లను చరచుచూ నృత్యమాడుదురు. దీనికే 'బతకమ్మలాట' అని పేరు. ఈ ఆరాధన విరివిగా హైదరాబాద్ ప్రాంతమునందున్నది. ఈరీతిని తొమ్మిది రోజులు దేవిని ఆరాధించి, పదవ రోజున చలుల బతికమ్మ పూజతో ముగింతురు. ఈ రోజున వారు పుష్పములను మనిషియెత్తున గూడ అలంకారప్రాయముగ పేర్తురు. ప్రతి దినమును పూజానంతరము ఆ పుష్పశిఖరమును నీటిలో వదలి వేయుదురు. ఇది యొక విధమైన గౌరిదేవి యారాధన అని పేర్కొనవచ్చును.

**కోలాట కోపులు:** కోలాటము వేయునప్పుడు అందు వివిధ రకములైన గతులకు చెందిన పాటలు పాడుతూ, ఆ పాటలకు తగిన విధముగా నృత్యమాడుటకు 'కోపు' అని పేరు. కోలాటము స్త్రీలు, పురుషులు గూడ వేయుదురు. ఈ విద్యయందు నిపుణులైన వారు కరీంనగర్ జిల్లాలో నున్నారు. కర్షకులు ఎక్కువగా యిందు పాల్గొందురు. దినమంతయును కష్టించి, చేలలో పని చేసి, సంధ్యవేళ యింటికి వచ్చి, భోజనాదుల ముగించుకొన్న పిదప వినోదముగ కాలముగడుపు నాటలలో కోలాటము ముఖ్యమయినది. సుమారు నలుబది లేక యేబది రకముల కోపులను తెలిసిన వారు కూడ ఆ ప్రాంతములో నున్నారు.

**తప్పెటగుండ్లు:** గుండ్రముగా డబ్బారేకులతో చేయబడిన చిన్నచిన్నతప్పెటలను మెడలందుధరించి, పాడుతూ, ఆపాట ననుసరించి తప్పెటలపై తాళ, లయ గతుల ప్రదర్శించుచూ, వలయాకారముగా తిరుగుచూ నృత్యమాడుదురు. పురుషులు మాత్రమే యీ నృత్యమందు పాల్గొందురు. అమ్మవారి కొలువులందు సాధారణముగ యీ నర్తకులు పాల్గొందురు. వీరు విశాఖజిల్లాయందెక్కువగ నున్నారు.

**జోగాట:** తెలంగాణా ప్రాంతంలో హరిజనుల తెగకు జెందిన వారిలో జోగువారను నొక నర్తకులశాఖవారున్నారు. వారు డప్పుల వాద్యము నాధారముగా నృత్యమాడుదురు. ఈ జాతివారిలో ఎవరైన చనిపోయినప్పుడు శవమును శ్మశానవాటికకు గొనిపోవునప్పుడు జోగాట ఆడుచూ వెళ్ళుదురు. వీరి నృత్యము లన్నింటిలోనూ 'పిండోత్పత్తి క్రమము' తెల్పునట్టివి ప్రత్యేకంగా పేర్కొనతగ్గవి. ఈ నృత్యములలో — జీవుడు తల్లి యొక్క గర్భములో బిందురూపమున ప్రవేశించినది మొదలు, వివిధ మాసములందు ఆ పిండము పెరుగు విధానము, ప్రసవము, అటుపై జీవితములోని వివిధ ఘట్టములను వారు చక్కగా నాడుదురు. ఇట్టి క్రమమే వేదాంతచర్యలతో నిండియున్న 'గొల్లకలాపము' నందలి గొల్లభామ, శ్రుతి, స్మృతుల ఆధారములతో నెన్నియో యుదాహరణముల నిచ్చుచూ వర్ణనల జేయుచూ అభినయించును.

**వీరనాట్యము:** ఆంధ్రలో వీరశైవము విరివిగా ప్రచారములో నున్నప్పుడు ఆలయములందు దేవదాసీల నృత్యారాధనయే గాక, శివభక్తులు తాండవ పద్ధతికి జెందిన వీరావేశము గల్గించునట్టి నాట్యములను జేసెడివారు. వీరు వీరరసప్రధానమగు వచనలు 'ఖడ్గములు' జదువుచూ, నొకచేత ఖడ్గమును, ఇంకొకచేత డాలును ధరించి నృత్యమాడుదురు. దీనికి 'వీరనాట్య' మని పేరు. ఈ నాట్యము యుద్ధనాట్యములను బోలియుండును.

**వీరుల కొలుపు:** పల్నాటియుద్ధమందు పాల్గొని వీరస్వర్గమలంకరించిన ఆంధ్ర వీరుల సంస్మరణార్థము చేయబడే వీరుల కొలుపునందు ప్రదర్శించునట్టి ఆరాధన నృత్యములుగూడ తాండవ పద్ధతికి జెందినట్టివే. కారెంపూడి, మాచెర్ల, గురజాలలలో ఏటేటా యివి జరుగును.

**సేవ:** ఇత్తడిరేకులతో చేసిన పెద్ద పెద్ద తాళములను చేత ధరించి సింహాచల నృసింహస్వామిని కీర్తించుచూ, నెమలి కుంచెను చేతబట్టిన నాయకుడు 'నాయం' చెప్పుచుండగా అంద

రుమా కలిసి పాడుచూ వలయాకారముగ తిరుగుచూ నృత్యము చేయుదురు. దీనినే 'సింహాద్రి అప్పన్నసేవ' యందురు.

"హరిహరి నారాయణాది నారాయణా
కరుణించవయ మమ్ము కమలలోచనుడా"

**గరగలు:** దేవీ నవరాత్రంలో అమ్మవారి జాతర్లలో పంచ శిరస్సుల నాగుతోడను, రంగు రంగుల వస్త్రములతోడను అలంకరింపబడిన కరండములను శిరముపై ధరించి, డప్పుల వాద్యమును అనుసరించి చేసే భక్తిరస ప్రాధాన్యమైనట్టి నాట్యములకే 'గరగల నృత్యము'లనిపేరు.

పైన జెప్పినవన్నియూ వివిధ తరగతులకు జెందిన జానపద ఆరాధన నృత్యములే.

**అశ్వనృత్యము:** ఈ నృత్యము గుంటూరుజిల్లాలో ఎక్కువగా ప్రచారములో నున్నది. పల్లెప్రజలు యీ వినోదమునందు ఎక్కువ ఉత్సాహమును జూపుదురు.

గుఱ్ఱము యొక్క బొమ్మలు తయారుచేసి వానిని తళతళ మెరిసే రంగులతో చిత్రించి ఆ బొమ్మలపై స్వారిచేయుచున్నట్లు తోచుటకుగాను ఆ బొమ్మల లోపలనుండి నడుముభాగమందున్న కన్నము ద్వారా పైకివచ్చి నర్తకులు స్త్రీ, పురుష వేషముల ధరించి ప్రేమగాధలను నృత్యమాడుట దక్షిణదేశములో నొక వినోదకళగా ప్రచారము నందున్నది. ఆంధ్రయందు సజీవమైన గుఱ్ఱమునకే తాళ, లయల ననుసరించి ముక్తాయింపులను సహితము కాళ్ళతో పలికించువిధముగా శిక్షణను యిచ్చి ఆ గుఱ్ఱముల ముందు కాళ్ళకు గజ్జెలుగట్టి దానిని చక్కగా నలంకరించి ప్రక్కన నర్తకి యాడుచుండగా, నటుడు పాడుచుండగా వాద్యసంగీతము ననుసరించి గుఱ్ఱము నృత్యమాడును. ఈనృత్యములు వివాహసమయము లందును, యితర ఉత్సవములందును వినోదమునకుగాను ప్రదర్శింతురు. ఈ విద్యయందు పల్లెలందలి ప్రజలలో నెంత యుత్సాహ మున్నదనగా ప్రతి మోతుబరి రైతూ యిట్టి ఆట గుఱ్ఱము నొక దానిని కలిగియుండును.

**జముకుల కథ:** కుంచము ఆకారము గలిగి, యడుగు భాగము తోలుతో కప్పబడి (మూయబడి) లోపలిభాగమునదానిమధ్య నుండి యొక నరమును బిగించి దాని చివరను యొక కర్రముక్కను ముడివైచి, ఆ కర్రముక్కను ఒకచేతితో బిగించి పట్టుకొని, శ్రుతి బద్ధముగా దానిని లాగుచూ, రెండవ చేతితో ఆ నరముపై తాళ గతులను పలికించుచూ, వీరగాథలను పాడుచూ, కాలిమువ్వలను ముచ్చటగా కదిలించుచూ నవరసంబు లొలుకునట్లు నాట్యమాడే వారే జముకుల కథకులు – అట్టివారు వాయించెడి వాద్యమునకే జముకులని పేరు.

**పాండవులవారు:** హైదరాబాద్ ప్రాంతములందు పాండవులు అనునొక తెగవారున్నారు. వీరిస్త్రీలు పచ్చబొట్లుపొడిచి ద్రవ్యార్జన చేయుదురు. పురుషులు పాండురాజుకథను మాత్రం గానం చేయుదురు.

**జంగంకథ** – పిచ్చుకకుంట్లవారి కథాగానము:– ఈరెండూ యించు మించు ఒకటిగానే వుండును. తెగలుమాత్రం వేరు. వీరు కామమ్మకథ, బాలనాగమ్మకథ, కాంభోజరాజుకథ, సర్వాంగపకథ, దేశింగురాజుకథ యిత్యాది మరెన్నో గాథలను గానముచేయుదురు. వీరు యెక్కువగా చదువుకున్నవారు గాకపోయినను, ఆ కథా గానము చేయునప్పుడు వివిధ రసముల నొప్పించు తీరు అద్భుతము.

**బవనీలు:** వీరు అతి ప్రాచీన కాలమునుండి 'మల్లన్న' దేవునికథ నృత్యగానములతో ప్రదర్శించు ఒక తెగవారు – 'మల్లన్న' కథ అనగా శివసంబంధమైన కథలు.

**గంటెభాగవతులు:**– ఇతరభాగవతులవలె వీరును భాగవతము నాడుదురు. గాని నర్తన సమయంలో ప్రతినర్తకుడూ ఒక గరిటెలో నూనెదీపం పెట్టుకొని చేతిలో పట్టుకొని వచ్చును. వారు అభినయం ప్రదర్శింపవలసిన సమయంలో ఆ దీపం ముఖంవద్దకు తెచ్చి అభినయం ప్రదర్శింతురు. అందువల్ల నర్తకుని హావభావములు ప్రేక్షకులు దర్శించుటకు యెక్కువ అవకాశముండును. ఇట్టి నర్తనరీతి భారతదేశంలో మరెచ్చటనూ కన్పించదు. గుజరాత్‌లో నర్తకులు కొవ్వొత్తులను చేతిలో ధరించి హావభావములు ప్రదర్శించు రీతి ఒకటున్నది. గాని దీనికి ఆరీతికి తేడావుంది.

చిలుకల భాగవతులు, బహురూపులు, భరతులు – వీరందరూ భాగవతముల నాడు తెగలవారే. రామచిలుకను (గుడ్డతో తయారు చేసింది) భాగవతంలోని స్త్రీ పాత్ర తన యెడమభుజంపై ధరించును అలంకారంగా. గాన వారిని చిలుకల భాగవతులందురు. అనేక వేషముల ధారణ చేయుదురు గనుక బహురూపులని పిలువబడిరి. భరతకేళిక చేసి జీవించువారు భరతులుగా పిలువబడిరి.

**చిన్న మాదిగలు:** వీరు పగటివేళ భాగవతము గట్టుదురు. పంచములకు వినోదము చేకూర్చే ఒకతెగ భాగవతులు.—
వీరందరూ ప్రదర్శించే ఆటక్రమము, దరువులు అన్నీ ఒకేరీతివి – వారి వారి సంస్కారమును బట్టి ప్రదర్శనతీరు ఆట క్రమములో మార్పులున్నవి.

**విప్రవినోదులు:** యక్షిణీవిద్యలను సాధించి తద్వారా ప్రజలకు వినోదము కల్గించి ద్రవ్యార్జన చేయునట్టివారే విప్రవినోదులు, సాధనాశూరులు.

**చిరుతలభజన:**– తెలంగాణాప్రాంతంలో అభివృద్ధిచెందిన ఒక నూతన వినోదక్రీడ. చిరుతలభజన, భాగవతం రెండింటిని చేర్చి ఒక నూతన పద్ధతిలో నృత్యకేళికగా రూపొందించబడినట్టిదే

చిరుతలభజన. రామాయణ మహాభారతకథలలోని పాత్రల వేషములు ధరించి నర్తకులు చిరుతలు వాయిస్తూ గుండ్రముగా తిరుగుతూ నర్తనమాడుదురు. తమ తమ పాత్రలు వచ్చినప్పుడు ఆ వలయము మధ్యలోనికి వెళ్ళి ఆయాపాత్రల నభినయించి తిరిగి బృంద నృత్తమును సల్పుదురు. ఇదొక విచిత్రమైన నర్తనరీతి.

**దప్పుల ఆట:** మణిపుర దేశంలో 'పంగ్‌చోలమ్' అనే నర్తనమున్నది. అందు నర్తకులు మృదంగములను మెడలో వేసుకొని నాట్యమాడుదురు వాటిని మ్రోగిస్తూ. అట్లే ఆంధ్రలో డప్పులను అనేక విచిత్రరీతుల మ్రోగిస్తూ నర్తనమాడేరీతియే దప్పుల ఆట. నానా గతి, జతి విన్యాసాలను మ్రోగించే నమూనాలున్నాయి. ఈ వాయిద్యం వింటుంటే, పాశ్చాత్య దేశాలలో 'సైడ్ డ్రమ్ము' వాయిద్యం జ్ఞప్తికి వస్తుంది.

# కేరళ దేశంలోని జానపద నృత్యరీతులు

ఈ నృత్యములన్నీ ముఖ్యంగా బృంద నృత్యములుగా నున్నవి. కొన్ని పురుషులచే ప్రదర్శింపబడునవి. కొన్ని స్త్రీలు ప్రదర్శించునట్టివి. కొన్ని యుద్ధానుకరణ నర్తనములు.–

కోల్‌కళి, పరిచకళి, తట్టిన్ మేల్ కళి, చువ్వత్తుకళి–పురుషులచే ప్రదర్శింపబడే బృందనృత్యములు.

ఈ నృత్యము ఆంధ్రలోని కోలాటము ఆటను పోలి ఉంటుంది. చేతుల్లో చిన్న చిన్న కర్రలను (కోలలను) పట్టుకొని ఆడుదురు. కొన్నివేళలందు ఆ కోలలకు గజెలుకూడా కట్టబడి ఉండును. ఈ నృత్యము ప్రాచీన కాలంలో పులయా, చెరుమాన్ తెగలవారిచే చేయబడేది. కాని ఈ రెండు తెగలవారు చాలామంది మహమ్మదీయమతం స్వీకరించారు. అయినను వీరిపాటలు యితివృత్తం చాలావరకు హిందూదేవతలకు సంబంధించినదై వుండును. కాని మాప్లా (మహమ్మదీయులచే) చేయబడుటచే [illegible] కొన్ని అరబ్ పదాలు చేర్చబడుతూ [illegible].

ప్రారంభంలో నర్తకులు [illegible] ఆడుదురు. [illegible] పోయియుందురు.

పరిచకళి నృత్తంలోగూడా నర్తకులు చేతులను తట్టుతూ సంచారంగా తిరుగుతూ నర్తనమాడుదురు. పై నాట్యము [illegible] ఒకేరీతిగా వుండినను ఆ క్రమములో, పాటల్లో తాళవిన్యాసాల్లో భేదమున్నది. ఇవి ప్రత్యేకతెగలవారిచే ప్రదర్శింపబడుటచే ఆయాతెగల వారి సంస్కారమునుబట్టి ఆలోచనా మార్పు కన్పట్టును.

తట్టిన్ మేల్ కళి నృత్తం, పులియన్ తెగచే కోతలు ముగిసిన తరువాత 'భాగవతి'–ఆరాధనగా ప్రదర్శింపబడును. నర్తకులు దేవిని స్తోత్రముచేస్తూ చప్పట్లుచరుస్తూ వలయాలుగా తిరుగుతూ నర్తనమాడుదురు.

చువ్వట్టి కళి– పల్లెవారు (బెస్తలు) చేసే నృత్యం. ఇందునూ నర్తకులు వలయాలు తిరుగుతూ నర్తనము చేయుదురు. ఈ వలయములుగ తిరుగుటలో వీరినృత్తం శోభాయమానంగా ప్రకటితమవుతున్నది.

కైకొట్టుకళి, తిరువాదిరకళి, మలయాళ వనితలచే ప్రదర్శింపబడే జానపద నృత్యములు.

చేతులుతట్టుతూ, పాటలుపాడుతూ, గుండ్రంగాతిరుగుతూ నాట్యమాడుట కైకొట్టుకళి. ఇది ఆంధ్రలోని గొబ్బి, బతుకమ్మలాట, చెమ్మచెక్క, తమిళనాడులోని 'కుమ్మి'ని పోలియుండును. ఆంధ్రప్రాంతంలో సంక్రాంతి సమయంలో గొబ్బిఆడినట్లూ, తెలం

# తమిళ దేశంలోని జానపద నృత్యములు

**పిన్నల్ కోలాటం:** యువతులచే చేయబడే కోలాటము. ఆంధ్రదేశమందువలెనే వీరి ఆటలోనూ అనేక రకములైన కోపులుండును. సంగీతము దేశీయమైనా కర్ణాటక బాణీకి చాలా దగ్గరగా పోలియుండును. ఘటన నర్తనం — ఇది ఆంధ్రలోని చేపను పోలియుండును. ఇది పుణ్యతిథులందు ఆలయాల్లో చేయబడును. పెద్ద దీపపు సెమ్మాచుట్టు నిలిచి భక్తిగీతములు పాడుతూ నర్తనం చేయుదురు. ఇది సంకీర్తన సంప్రదాయము.

**ఒయిల్ ఆట్టం:** మురుగ (సుబ్రహ్మణ్యుడు) అతని దేవేరి వల్లిని స్తోత్రంచేస్తూ చేయబడే నర్తనం — యిందు సుమారు యిరువదిమంది నర్తకులు పాల్గొందురు, వీరి నాయకుని వడయరు అందురు. ఇతడు ఈ నర్తకులకు శిక్షణిచ్చి — కేళిక జరిపించును. వల్లి అమ్మను, మురుగను గూర్చిన పాటలు పాడుతూ ఆ పాటల భావ ప్రకటనగా గాన, మధ్య మధ్య నర్తన మాడుదురు. యిది పురుషులు చేసే నర్తనం.

**వైయిన్ తన్నై:** పురుషులచే చేయబడే ఒక కోలాటరీతి — దేవారు ఆట. తేవారు గీతాలు పాడుతూ నర్తకులు నర్తనం చేసే విధము.

**చక్క—ఆటల:** అమ్మనాథస్వామి, మురుగ, ముత్తు మరియమ్మ దేవతలను స్తోత్రంచేస్తూ ప్రదర్శింపబడే నృత్యము. ఈ స్తోత్ర గీతాలు సాధారణంగా ఆదితాళం. ఏకతాళాల్లో గానం చేయబడును. యిందులో చిన్నచిన్న కోలలు పట్టుకొని నర్తకులు కోలాటము ఆటవలె ఆడుదురు.

**కుమ్మి:** స్త్రీలచే ప్రదర్శించు నర్తనం. ఇది ఆంధ్రలోని గొబ్బి ఆటను పోలియుండును.

**బొమ్మలాట:** ఆంధ్రదేశంలో తోలుబొమ్మలాట విశేషంగా ప్రచారంలో వుంది. తమిళనాడులో కర్రతో చేయబడిన బొమ్మలనాడించు విధానం ప్రసిద్ధిగా వుంది. ఈ బొమ్మలాట వారు రామాయణం, మహాభారతం యిత్యాది పురాణగాథలను ఆడుటయే గాక, కొందరు భరతనాట్య ప్రదర్శనం గూడా చేయింతురు. వీరి సంగీతం చక్కని కర్ణాటక బాణీలో వుండును. ఈ బొమ్మలాట మైసూరు ప్రాంతంలో గూడా వున్నది. ఆంధ్రలో హిందూపూర్ యితర రాయలసీమ ప్రాంతంలో వుండేదట. ప్రస్తుతకాలంలో మరుగుపడిపోయింది.

**పావై కుత్తు:** ఛాయానృత్య ప్రదర్శనం. తెరచాటున బొమ్మలనాడించే రీతి — ఆంధ్రలోని తోలుబొమ్మల ఆటను పోలినట్టి నర్తనం.

**పురవిఆటం:** వెదురు కర్రలతో గుర్రముల ఆకారములను చేసి వాటిపై కాగితం అతికించి, అందముగా రంగులతో అలంకరించి, దాని వీపుపై నున్న కన్నముగుండా మనిషి బైటకు కనిపిస్తూ ఆటగట్టును. మనిషి నడుమువరకే కనిపించును గనుక గుర్రముపై స్వారి చేస్తున్నట్లు తోచును. నాగస్వర సంగీతమునను సరించి నర్తకుడు నర్తనమాడును. వీరు చరిత్రాత్మక కథలను నర్తనములు చేయునప్పుడు, స్త్రీ పురుష నర్తకులు రాజు రాణిగా అలంకరించుకొని కథను గానంచేస్తూ ఆడుదురు.

**తెరుకుత్తు:** వీధి నాటక సంప్రదాయము. బిందు, కురవంజి — యివి గూడా తమిళదేశంలోని భాగవతరీతులుగా చెప్పవచ్చును. వీధుల్లో ఆటగట్టుదురు గనుక తెరు = (వీధి) కుత్తు = (ఆట) అనబడుతుంది. వీరూ పురాణకథలను ఆడుదురు. బిందు ఆట యక్షగాన పద్ధతిలో వుండును. ఒక కథను గానంచేస్తూ మధ్య మధ్య నర్తన మాడు సంప్రదాయం. కురవంజి కూడా జానపదనృత్య సంప్రదాయమే.

**కరగం:** గరగల నృత్యము— మట్టికుండను తలపై దాల్చి అది పడిపోకుండా చాకచక్యముతో నర్తనం చేయుదురు. ఇది ఆంధ్రలోని గరగల ఆటవంటిది. మరియమ్మ దేవత ఆరాధనలో ఈ నర్తనము ఆడబడుతుంది. ఇదిచాలా ప్రాచీనమైన నర్తనరీతి. 'సంఘం' సాహిత్యంలో కూడా ఈ నర్తనం గూర్చి వర్ణించబడింది. వర్షముల కొరకు, మశూచియు యిత్యాది అంటువ్యాధులను పారద్రోలుటకు ద్రవిడ దేశంలోని ప్రజలు అమ్మవారిని పూజింతురు. ఆ పూజల సందర్భంలో ఈ నాట్యం ఆడుదురు. ఆంధ్రదేశంలో కూచిపూడి నర్తకులు పళ్ళెము అంచులమీదనిల్చి, తలపై నీటితో నిండిన చెంబును పెట్టుకొని నాట్యము చేయుదురు. ఆ ఆటకంటే యిది కష్టమైన ఆట — ఇది జానపద నృత్యకళయైననూ ప్రస్తుత కాలంలో యిందు యెన్నియో శాస్త్రీయ నర్తన విన్యాసములను యీ నర్తకులు ప్రదర్శించుచున్నారు.

**కావడిచిందు:** పళని సుబ్రహ్మణ్యస్వామి ఆరాధనలు చేయబడే అతి ముఖ్యమైన నాట్యము కావడి చిందు. భక్తులు స్వామికి అర్పించు కళాకానుక — ఈ కావడి ఆటను వృత్తిగాగలవారు అత్యద్భుతముగా కావడిని (అలంకారములతో తయారు చేసినట్టిది) శిరముపై భుజములపై ధరించి, చేతులతో



పట్టుకోకుండా పడిపోకుండా నర్తనమాడుదురు. ఇందలి వాద్య బృందాన్ని నయాండి మేళమందురు. రెండు సన్నాయిలు. రెండు డోళ్ళు, పంబ, తుముకు వాద్యం పాల్గొనును.

**పగల్ వేషము:** ఆంధ్రలోని పగటి వేషాలను పోలినట్టిది. యిందు నర్తకులు వివిధ తెగలను, మనుష్యులను అనుకరింతురు.

**కురవన్, కురత్తి:** ఆంధ్రలోని యక్షగాన భాగవతులలోని సింగి సింగడు; బోడిగాడు, బంగారక్క యిత్యాది పాత్రలవంటివి. వీరు కేవలం హాస్యరసం పోషించుటకుగాను నాట్యం చేయుదురు. వీరి నృత్యములన్నీ హాస్యకేళికలే.

—0—

# కర్ణాటక ప్రాంతంలోని జానపద నృత్యరీతులు

**కరగం, పూజాకున్నిత :** స్త్రీలు దేవతలయొక్క విగ్రహముల రూపములనుగాని, మట్టికుండనుగాని శిరముపై ధరించి నర్తనమాడురీతులు కరగం, పూజాకున్నితి యిత్యాదులు. ఆంధ్రలోని గరగలు, తమిళనాడులోని కరగం, కర్ణాటకలోని కరగం మూడు ఒకేరీతిలో వున్ననూ, ఆటలో తేడావుంది. ఈ మూడు నాట్యాలూ అమ్మవారి పూజలందు చేయబడేవే. కరావళి దేశంలో— కోతలు ముగిసిన తరువాతగాని, వర్షఋతువు ఆరంభాన పంటల అభివృద్ధికిగాని అమ్మవారిని ఆరాధిస్తూ చేయబడుతుంది. కరగం— (మట్టికుండలో) బియ్యముంచి, దానిని చక్కగా అలంకరించి, శిరముపై దాల్చి నర్తనమాడుదురు. ఆంధ్రలో కుంచకిరీటాల నాగేంద్రుని అలంకారముగా నుంచుదురు. సాధారణంగా కరగ నృత్యము ముగిసిన పిదప నిప్పులమీద నడుచుట గూడా ప్రదర్శింతురు. ఆంధ్రలో ధర్మరాజు ఉత్సవాలప్పుడు 'అగ్గి తిరునాళ్ళ'ని ప్రత్యేకంగా నిప్పులమీదనడిచే విధానముంది. దేవీ తిరునాళ్లలో దక్షిణాది నంతటనూ నిప్పులగుండం త్రొక్కుట ఒక ఆచారంగా వుంటుంది. మహారాష్ట్రలో రెండు మూకుళ్ళలో నిప్పులు వేసి దానిపై గుగ్గిలంజల్లి మంటలు మండుచుండగా ఆ మూకుళ్ళను చేతుల్లో పట్టుకొని పల్లెప్రజలు భవానిని స్తోత్రంచేస్తూ నర్తనమాడు ఆచారం కలదు. వంగదేశంలోని ఒక సంప్రదాయం. గ్రహదోషములు, దీర్ఘవ్యాధులచే పీడింపబడు ప్రజలు దేవికి అగ్ని ఆరాధన మొక్కుకుందురు. దుర్గాపూజ సమయమందు — దేవీనవరాత్రం, దసరా— వేళల పూజారులు అట్లు మ్రొక్కుకున్నవారి శిరములపై మూకుళ్ళలో అగ్నినుంచి, మంత్రోచ్చారణ చేయుచూ అందు గుగ్గిలము వేయుదురు. అది మంటలు మండును. నిప్పులు త్రొక్కుట మహమ్మదీయులు పీర్ల పండుగప్పుడు చేయుదురు. ఈ సంప్రదాయం భారతదేశంలో అంతటను వున్నట్లు చెప్పవచ్చును. జ్యోతి కరగం—లో కుండపై దీపములు వెలిగించి పెట్టుదురు. ఇది తెలంగాణంలోని బోనాల పండుగ, పోతరాజు నృత్యాన్ని పోలినట్టిది.

పూజాకున్నిత నృత్యములో గుడిపూజారి అమ్మవారి విగ్రహం గల పెట్టెను తలమీదపెట్టుకొని నర్తన మాడును. ఆవిధంగా నాట్యమాడగా వారిని ఆ యా దేవతలు ఆవేశించిన సమయాల్లో అచ్చట చేరిన ప్రజలకు ఫలితాలు చెప్పుట గూడ కలదు. వివిధ దేవతలకు సంబంధించిన ఆరాధనల్లో యీ నాట్యం ఆడునప్పుడు ఆ యా దేవతల పేర్లతో ఆట పిలువబడును. అవే ఎల్లమ్మకున్నిత, దేవరకున్నిత, కళశదకున్నిత యిత్యాదులు.

బీజపూరు తుంగభద్రను ఆనుకొని వుంది. అక్కడ యెల్లమ్మ ఆలయముంది. ఆలయంలో పురుషులు పూజారులైన వారు స్త్రీ వేషాల ధరించి పూజింతురు. మరియు ఆ అమ్మవారి మంత్రోపదేశం

పొంది సేవలో వున్న వారందరూ స్త్రీ వేషంలోనే వుందురు. అమ్మవారి ప్రీత్యర్థం ఈ నర్తనం చేయుటలో వారు ముఖ్యులు. సంవత్సరాని కొక్కసారి ఆ వూరిలో అమ్మవారి జాతర చేయుదురు. అప్పుడు యాపిల్కుర్తాటక ప్రాంతం నుండి, ఆ దేవి పూజారులు అచ్చట చేరుదురు. ఈ నాట్యాల్లో నాగస్వరం, కొంబు, కహాలె, నగరి, ఉమ్మెట మొదలైన వాద్యాలు వాయించబడును. వాద్యకులు కూడా నర్తకుని నాట్యాన్ననుసరించి ఆడుతూ, వాయింతురు.

**భూతనృత్యము :** (భూతకున్నిత) పొంబాద, నలికె జాతులవారు ప్రత్యేకంగా యీ నర్తనమాడుదురు. ఇది చాలా ప్రాచీనమైన నర్తన విశేషం. ఈ నాట్యము, ఈ నర్తకులు మొహంజోదారో, హరప్పా సంస్కృతి కాలంనాటికి వున్నట్లు చరిత్రకారులు చెప్పుదురు. మరి కొందరు సుమేరియన్ సంస్కృతితో యీ కళారీతికి సంబంధమున్నట్లు అభిప్రాయం వెలిబుచ్చుతున్నారు. యిదొక విశిష్టమైన ఆరాధన నృత్యరీతి – తుళవజాతివారి జీవితవిధానంతో సంపూర్ణ సంబంధంగల్గినది.

గ్రామాల్లో ఒక భూతాలయ ముండును. ఆ ఆలయ పూజారి ఈ నర్తనం చేయును. ప్రాచీన తుళవజాతికి చెందిన వీరుల యొక్క జీవిత చరిత్రలను గానము చేస్తూండగా, పూజారి ఈ నర్తనం చేయును. ఆ వీరులు అతని ఆవేశించెదరని వారి నమ్మకము. వెన్నెల రాత్రులందు ఈ నర్తన మాడబడును. ఈ నర్తకులు ముఖాలకు పసుపు పలదుకొని, కుంకుమబొట్లు పెట్టుకొని, లేత పోకచెట్ల ఆకులు, కొబ్బరి ఆకులతో చేయబడిన ఆభరణములు ధరించి శిరసుపై వెండి కిరీటం పెట్టుకొని నర్తనమాడును.

**బీసుకంసాలె :** ఆంధ్రలో సింహాద్రికొండకు జాతరగా వెళ్ళేప్పుడుగాని, కోటప్పకొండ తిరునాళ్ళకు వెళ్లునప్పుడుగాని, మహాదేవునికొండకు వెళ్లునప్పుడుగాని భక్తబృందములు పాటలు పాడుతూ, వాయిద్యములను వాయిస్తూ, నర్తన మాడుతూ వెళ్లునట్టి నర్తన రీతియే, 'బీసుకంసాలె'. దక్షిణ మైసూరు ప్రాంతంలోని మహాదేవుని కొండకు వెళ్లేటప్పుడు నర్తకులు ముఖ్యంగా యీ నృత్యగానాలతో వెళ్లుదురు. ఇది బృంద నృత్తములుగానూ ఒకే నర్తకుడుగాని చేయుదురు. శైవారాధనకు సంబంధించిన దగుటచే యిందు వీరావేశముగాక, తాండవపద్ధతి నృత్తకేళిక ప్రదర్శిత మగును. మైసూరు రాష్ట్రంలో ముఖ్యంగా శైవము, దేవి ఆరాధన యెక్కువగా వుంది. ఆ వాద్యఘోష, నృత్యములు ఆవిధంగానే వీరావేశము గల్గించునట్టివిగా వున్నవి.

తమిళ, ఆంధ్ర, కర్ణాటక, మళయాళదేశ జానపద నృత్యముల్లో మనకొక ప్రత్యేక పోలిక కన్పించును. గ్రామప్రజలు ముఖ్యంగా ఆరాధించే దేవతలు– అమ్మవారు, భాగవతి, అంబ, దేవి–ఇవన్నీ శక్తి యొక్క విభిన్న రూపాలే– మరొక్క ముఖ్య దేవుడు– శివుడు. ఈ దేవుళ్ళను ఆరాధించే నృత్యరూపములు గూడా ఒకేరీతిగా కన్పించును– కర్ణాటక ప్రాంతంలో వీరశైవము ప్రచారములో వుండుటవల్ల వాద్యఘోషతో కొంత ఉధృతం గోచరించును.

---

# ఆటవికుల నృత్యభంగిమలు

## ఒరియనుల నృత్యజాతరలు :

ఒరియనులు ఒక ద్రావిడ తెగకు చెందినవారు. ఛోటానాగపూర్ పీఠభూములలోను, జాష్‌పూర్ సర్‌గూజా సంస్థానముల లోను వీరు నివసింతురు. 'నృత్యజాతరలు' వారి తెగ నృత్యోత్సవాలు. ఈ పండుగ సమయములలో వేలాది ఒరియనులు ఒక స్థలములోచేరి నృత్యము చేయుదురు. ఇలాంటి జాతరలు హిందూదేశములో మరేప్రాంతములోనూ చూడలేము. సంవత్సరమున కొక్కసారి పల్లెలకు దగ్గరగానున్న మామిడితోటలో ఈ జాతరలు జరుగును. వీనిలో ఒరియనుల తెగకు చెందిన స్త్రీ పురుషులు, యువతీ యువకులు, బాలురు, వృద్ధులు అందరు పాల్గొందురు. వేలాది జనులు ఒకేసారి ఒకే విధముగా ఒకే కంఠంతో పాడుతూ చేసిన నృత్యం చూచిన కళారాధకుడు తన జీవితములో ఆ దృశ్యమును మరచిపోలేడు.

తెల్లవారుచున్నదనగా జాతర – నృత్యజాతర ప్రారంభమగును. సుమారు పదిమంది కుఱ్ఱవాండ్రు మామిడితోటకు పోవు దారిలో నాటబడిన జండాలనుచూచి ఆనందముతో పెద్దగా కేకలిడుచూ పల్లెలోనికి పరుగెత్తెదరు. ఆ చుట్టుప్రక్కలనున్న గ్రామాలవారికి తెలియుటకై ఆ పల్లెజండాలను తెచ్చి నృత్యం జరిగే ప్రదేశానికి (మామిడితోటకు) పోయే దారిలో నాటుదురు.

'జాతర నృత్యజాతర' వార్త పల్లెలలో ప్రాకిపోవును. ఐదు నిముషములక్రితం నిశ్శబ్దముగానున్న ఆ ప్రదేశమంతయు జాతర జాతర యను శబ్దములతో ప్రతిధ్వనించును. ప్రతి యువకుని నోటిలోను జాతర, ప్రతి స్త్రీ నోటిలోను జాతర, ప్రతి ముసలివాని నోటిలోను జాతర– ఎక్కడవినాచునను ఈ శబ్దమే. ఎవరు మాట్లాడినా నృత్యజాతరను గురించియే.

కొందరు తమ దినకృత్యములను తొందర తొందరగా ముగించుచున్నారు. కొందరు తమ పెట్టెలలో అతి భద్రముగా దాచుకొనిన తమ జాతర దుస్తులను తీసి మూటగట్టుకొనుచున్నారు. సాధారణముగా జాతరస్థలమునకు దూరముగా నున్నవారు దుస్తులను మూటగట్టి తీసికొనిపోయి అక్కడే ధరించుచున్నారు. దగ్గరగా నున్నవారు యిండ్ల వద్దనే ధరించి వెళ్ళుచున్నారు. గుంపులు గుంపులుగా జనులు అన్ని పల్లెలలోనుండి ఆ తోటను చేరుచున్నారు. అందరు ఆ తోట దగ్గరనున్న చెఱువు గట్టున చేరినారు.

సుమారు రెండు గంట లయినది. వారు తమ ముస్తాబులు మొదలుపెట్టిరి. –

స్త్రీలందరు ఒకే స్థలములోచేరి కిలకిల నవ్వుచు, ఒకరితో నొకరు హాస్యములాడుచు, ఆనందముతో కూనరాగములు తీయుచు, తమ అలంకారములను ధరించుచున్నారు. యువకులందరు కొంత దూరంలోకూడి తయారగుచున్నారు. వారి ముస్తాబు ముగిసినది.

"డాయి తడదా – దారెతడా – దారెతడదా" మద్దెలలు మ్రోగడము మొదలుపెట్టినవి. కొమ్ములధ్వని వినవచ్చినది.

ఒక్కొక్క పల్లెవారు ఊరేగింపుతో ఆ నృత్యస్థలమునకు తరలి వచ్చుచున్నారు. అందఱకు ముందు యువకులు కత్తులు, డాలులు మున్నగు ఆయుధములు, తమ తమ పల్లెలకు చెందిన జండాలు పట్టుకొని నడచుచున్నారు. చిన్న చిన్న బాలురు కొందఱు పింజామిడలను, పొడుగుపాటి కర్రలకు పూలమాలలు మున్నగునవి అలంకరించి పూర్వము రాజులకు పట్టిన గొడుగుల వలె పట్టుకొన్నారు. ఒక పల్లెనుండి వచ్చిన వారిలో ఒకడు రాజు వలె ముస్తాబు చేసికొని కఱ్ఱ గుఱ్ఱముపై స్వారీ చేయుచున్నాడు. మరి కొందఱు యువకులు ఆ గుఱ్ఱమును భుజముల మోయుచున్నారు. వారినందఱి కొందరు మేళతాళములతో అలంకరించుకొని నడచుచున్నారు. వారి వెనుక స్త్రీలు పురుషులు పంక్తులుదీర్చి నడచుచున్నారు.

అందఱును మామిడితోట చేరిరి. వారందఱు కలసి ముందుకు వంగుచు, వెనుకకు వంగుచు సముద్ర తరంగమువలె ఒక్కసారి కాళ్ళనెత్తి అడుగులు వేయుచు ఉగ్రాకారముగ తిరుగుచు నృత్యముచేసి మరల నిలబడి, అతి రమణీయముగా శరీరమును కదలించుచు కొంతకాలము నృత్యమాడిరి. దీని పేరు ఖరియా నృత్యము. ఇందు రెండువేల జనం స్త్రీలు. పురుషులు, వృద్ధులు, అందఱు వరుసగా నిలబడి ఒక్కసారి మద్దెల తాళముల ననుసరించి కాళ్ళనెత్తి భూమిపై కొట్టిరి. తరువాతి నృత్యములో వారికి వాద్యములతో పనిలేదు.

వేలాది జనులు ఒకే కంఠముతో పాడుచు, కాళ్ళలో తాళలయలను చూపుచు ఒకరి నొకరు అంటుకొని నిలబడి గుండ్రముగా తిరుగుచు నృత్యమాడిరి. కొంతకాలమట్లు నృత్యమాడి అలసిపోయి అందఱు 'హర్ర్' అని సినాదంచేసిరి. వెంటనే అందఱు శిరస్సులను ముందుకు వంచి, రెండు కాళ్ళను జేర్చి, 'పైకెగిరి' భూమి దద్దరిలునట్లు అడుగువేసి దూకొన్నారు. ఇది నృత్యము యొక్క అంతిమ అభినయము. ఒక నిముసము విశ్రాంతి తీసికొన్నారోలేదో, ఒక మూలనుంచి యొకడు ఉద్రేకపూరితముగా ఓ– అని పిలిచినట్లు పాడడం మొదలుపెటినాడు. ఆ రాగం అందుకొని అందఱు తిరిగి నృత్యంచేయడం మొదలుపెట్టిరి.

పచ్చని ఆకులతో నిండిన ఆ మామిడితోటలో వేలాది యువతులు, యువకులు రంగురంగుల దుస్తులను ధరించి ఏక కంఠముస పాడుచు చేయుచున్న నృత్యమును ఏకవి వర్ణించగలడు? రంభ, ఊర్వశి, తిలోత్తమ, మున్నగు అప్సరసలు, తుంబురుడు మున్నగు గంధర్వ గాయకులు, కిన్నరులు మున్నగు నృత్యకళా కోవిదులు నిండియుండిన ఇంద్రసభగూడ ఆ ప్రకృతి బిడ్డలు చేసిన నృత్యమునకు దీటురాదు.

వారు అలసిపోవువరకు నృత్యముచేసి తరువాత పల్లెవారీగా విడిపోయి సంధ్యవేళ వరకు వేఱువేఱుగా నృత్యముజేసి యింటలకు పోవుదురు. కొన్ని సమయాలలో వారు రాత్రియంతయు నృత్యము చేయుదురు.

## సార్‌హుల్ ఉత్సవము :

వీరు సార్‌హుల్ పండుగను (ఉత్సవమును) ఇప్పచెట్లు విరగపూసినప్పుడు చేయుదురు. భూమినృత్యం (May day) వలె నాడు ఋతువసంతముగానున్న కాలములో చేయుదురు. ఈ సమయములో భూమినృత్యము చేసినయెడల పంటలు చక్కగా ఫలించునని వీరి దృఢవిశ్వాసము. 'కనిహారి' యనునది పైరులు పండి కోత అయిన తరువాత చేసికొను పండుగ.

భూమినృత్య సమయమున కొందఱు యువకులు అడవులనుండి పెద్ద ఇప్పకొమ్మను (ఇప్పచెట్టు) కొట్టుకొనివచ్చి పల్లెలోని 'అఖాడా' మధ్య నాటుదురు. మరునాటి ప్రొద్దున యువకులు, పెద్దలు అందఱు రంగురంగు దుస్తులను ధరించి అఖాడాకు వచ్చుచున్న వారందఱిని చేరుదురు. యువతీ యువకులు చేతులు పట్టుకొని గుండ్రముగా ఆ ఇప్పవృక్షము చుట్టు తిరుగుచు నృత్యము చేయుదురు. ఆ చెట్టును రంగురంగుల గుడ్డలతో, గాజులతో, రంగురంగుల పరిగడి దండంతో పూలదండలతో అలంకరించుదురు. అటి అలంకారములతో, చెట్టుచుట్టి నవ్వుచు, ఉత్సాహముతో ప్రకృతి గీతములను పాడుచు స్త్రీలు, పురుషులు నృత్యము చేయుచున్న సమయములో మన పూర్వులు చెప్పిన కల్పవృక్షము జ్ఞప్తికి వచ్చును. దీనిని ఆంగ్లేయుల 'మేపోల్' తో పోల్చవచ్చును.

సార్‌హుల్ పండుగ సూర్యదేవునికి, భూమాతకు పెండ్లి చేయుట. ఇప్పపూవులు ఈ పూజకు ముఖ్యము గనుక, ఇప్పచెట్లు పుష్పించిన తరువాత ఈ పూజ చేయుదురు. సాధారణముగా ఈ పూజ ఏప్రిల్ నెలలో జరుగును.

ఒక తెల్ల కోడిపుంజును సూర్యదేవునిగా, ఒక నల్ల కోడి పెట్టను భూదేవిగా భావించి– ఈ రెండింటికిని పెండ్లి జరుపుదురు. పసుపు కుంకుమలతో పూజించిన పిదప ఆ రెండింటిని కోయుదురు. తరువాత ఆ పల్లెలోనివారందఱు జేరి వారి పూజారి – పాహా – 'పహన్' తో కలిసి 'సర్న' కు పవిత్రభూమికి వెళ్ళుదురు. ఇది సాధారణముగా సాల ఇప్ప మొదలగు చెట్లతోగూడిన అరణ్య ప్రదేశమై యుండును. 'సర్నబురాహి' ఒక వృద్ధస్త్రీ నివాస స్థలమని, ఆ స్థలము వరమును స్వాధీనములో నుంచుకొనునని వీరి నమ్మకము. అరణ్యములు వర్షముల నాకర్షించునను సిద్ధాంతము వారికి తెలియదు. కాని వాని అవినాభావ సంబంధమును గుర్తించి అరణ్య దేవత వర్షమును తన చేత నుంచుకొనునని యెంచి ఆమెను పూజించి తృప్తిపరచినచో వర్షము బాగుగ కురియునని వీరి నమ్మకము. ఈ పండుగలో వీరు సూర్యుని, ధరిత్రిని, వరుణుని పూజించెదరు. పంటలు చక్కగా పండుటకు వర్షము అవసరము. ఈ పంటలను పండించుటకు భూమి అవశ్యకము. అందువలన సుగ్గురను సంతోష పెట్టుటకు వీరు ఈ పండుగ చేయుదురు.

చంపిన రెండు కోళ్ళను ఆ పవిత్రస్థలములో పాతి పెట్టెదరు. అరణ్యదేవరకు మఱియు ఐదుకోళ్ళను బలియిచ్చిన తరువాత, వారా కోళ్ళను విందారగించి నృత్యగీతములతో దినమంతయు అచ్చటనే గడపి, ఇప్ప పూగుత్తులను చేతులతో పట్టుకొని నృత్యము చేయుచు ఇండ్లకు వత్తురు. మరునాడు బైగా (పూజారి) ఇప్ప పువ్వులు చేత పట్టుకొని ప్రతియింటికి రాగా, స్త్రీ లెల్లరు తమ తమ గుమ్మములలో రెండు చేతులలో రెండు దొన్నెలు [ఒకటి ఖాళీది, రెండవది బియ్యమునుండి తీసిన సారాకలది. (బైగాకోసం)] పట్టుకొని నిలువబడుదురు. ఖాళీ దొన్నెలో అతని వద్దనుండి పవిత్రజలం (తీర్థం) తీసికొందురు. బైగా ప్రతి యింటిముందు నిలువబడి యింటిపై కొన్ని పూవులను జల్లి స్త్రీల తలలో కొన్ని పూవులుంచును. తీర్థమును ధాన్యముపై జల్లుచు "మీయిండ్లు ధాన్యముల గోతములతో నిండునుగాక!, బైగా దీవెన ఫలించుగాక!" యని మంత్రము పఠించును. తరువాత ప్రతియింటి స్త్రీ, అంటిపటకు అతి భక్తి గౌరవములతో చూచిన బైగాపై విలాసంగా నవ్వుచు కుండెడు నీళ్ళుపోయును. దీనిని ఒక విధమైన వర్షతంత్రమని చెప్పవచ్చును. తరువాత అందఱు విందారగించి, తమ మిఱ్ఱుపన్నె శరీరములకును, జీడిగింజ నలుపు తలవెంట్రుకలకును శోభనిచ్చు లేత గోధుమరంగు ఇప్పపూలతో అలంకరించుకొని 'అఖాడా' వద్దచేరి నృత్యములతో రాత్రి గడపెదరు. మన దేశమందలి అతి పురాతనమైన ఒక తెగప్రజల సంఘాచారములు, వారి నృత్యకళ— వీనిని యింతవరకు వర్ణించితిని.

---

# ద్రావిడుల నృత్యభంగిమలు

కోలులు ద్రావిడులలోని ఒక తెగవారు. వీరు ముఖ్యముగా ఛోటా నాగపూర్, సింగభూమి, మధ్యరాష్ట్రం, మధ్య భారతులలో నివసించుదురు. ఆటవికుల నిత్యజీవిత కృత్యములలో నృత్యమొక విశేషము. ఇప్పటి మన నాగరక సంఘములోవలె ఏ కొందఱికోసొమ్మోగాదు. కోలులకు నృత్యమన్న అత్యంత ప్రీతి. ఈ తెగవారందఱు ఒకచోట కూడినప్పుడుగాని, ఒక పల్లెలోనివారు మఱియొక పల్లెలోనికి తమ బంధువులను చూడబోయినప్పుడుగాని నృత్య గీతములతో కాలము గడుపుదురు. ప్రతి ఋతువునందు సమయమునకు సరిపోవు నృత్యము లెన్నిటినో వీరు చేయుదురు. వీరి నృత్యములు అతి నెమ్మదిగాను, స్వాభావికమై సుకుమారముగాను ఉండును. తాళ లయలలో వీరికి మంచి ప్రావీణ్య ముండుటచేత, నృత్యములు తాళము తప్పక చక్కగా లయ ననుసరించి యుండుటచేత హృదయరంజకముగా నుండును.

వీరి నృత్యములలో వరికోతల నృత్యము చూడతగినది.

మద్దెలలు మ్రోగుచుండును. ఆ తాళము ననుసరించి వీనుల విందైన వేణుగానము వినబడుచుండును. స్త్రీలందఱు వరుసగ నిలుచుందురు. వారు యేదో ఒక గీతమును పాడుచు తాళలయల ననుసరించి అడుగులు వేయుచు, అందఱు ఒక్కసారిగా వంగి చేతులతో కొన్ని ముద్రలను చూపుదురు. అది అచ్చముగా పొలాలలో వరి నాటినట్లనిపించును. తరువాత కోతలు కోసిన పైరును కట్టగట్టి, కొట్టి, దులిపి, కుప్పలు వేయడము, మున్నగునవి తాళ లయలు తప్పకుండా మధురముగా పాడుచు అభినయింతురు. కుప్పలుగా వేసిన ధాన్యమును పేర్పరచి, చేటలతో చెరుగుచు శుభ్రపరచి పోయుదురు. తాను యేడాది చెమటనోడ్చి కష్టపడిన శ్రమ ఫలితమును కనులారచూచునట్టి రైతురాజు ఆనంద మెంతని చెప్పగలము. ఆ సంతోషమున త్వరత్వరగా ప్రతి అవయవమును కదల్చుచు అభినయింతురు.

ఈలాగున వర్షఋతు ప్రారంభములో పొలము దున్నుట మొదలుకొని, ఆయేటి కృషిఫలితమైన క్రొత్తవడ్ల బియ్యము విందారగించే వఱకు జరిగే దృశ్యములను వివిధ ఘట్టములుగా వారు నృత్యముచేయుదురు.

శాస్త్రమనిన నేమో తెలియకపోయినను, నృత్యకళారాధకుల వలె ఏండ్ల తరబడి నృత్యము అభ్యసించకపోయినను వీరి నృత్యమెంతో సున్నితమై, భావప్రకటన మిక్కిలి సహజమైయుండును. వారి పాటలు అర్థంగాకపోయినను, వారి చక్కని అంగచలనము వలన వారేమి చేయుచున్నది కడు సులభముగా అర్థమగునట్లు నృత్యము చేయుచున్న వారు. కేవలము తాము నృత్యముచేయుచున్నట్లు, తలపక ఆ భావములలో లీనముకావడమే ముఖ్యమైన కారణము. శాస్త్రము తెలియకపోయినను నృత్యము [illegible], సహజముగా చేయుటచేతనే ఆ నృత్యము ప్రతివాని [illegible]

ముగా అర్థమగును. అతి కష్టమై సామాన్యుల కర్థముకానట్టి ఒక విషయమును, లేదా ఒకానొక భావమును మిక్కిలి సులభముగా సామాన్యులకు, పసి బిడ్డలకుకూడా అర్థమగులాగున ప్రదర్శించుటయే శాస్త్రముయొక్క ముఖ్యధర్మమని, అతి సామాన్యమైన భావమును చిక్కుగా అన్యుల కర్థముగాని విధముగా ప్రదర్శించడము శాస్త్రధర్మముగాదని వీరి నృత్యమును చూచిన తర్వాత నేను గ్రహించగలిగితిని.

మధ్యరాష్ట్రములోని కోలలు, గోండులు ఖర్మనృత్యము చేయుదురు. కాని వీరి నృత్యము గోండుల ఖర్మనృత్యముకన్న సున్నితముగాను, చక్కగాను ఉండును.

స్త్రీ పురుషులు ఒకరి కెదురుగా నొకరు పంక్తులు దీర్చి, చేతులు పట్టుకొని నిలువబడుదురు. వాద్యగాడు ఒకడు స్త్రీల ప్రక్కకు తిరిగి మఱియొకడు పురుషుల ప్రక్కకు తిరిగి నిలువబడుదురు. నృత్యము చేయువారు ముందునకు వచ్చిన ముందునకు, వెనుకకు పోయిన వెనుకకు పోవుచు వారి ననుసరించి నడుచుచు వాద్యములను వాయించెదరు. కొంతకాలము వారందఱు నృత్యము చేసిన తర్వాత స్త్రీ పురుషులందఱు కలసి వక్రాకారముగా తిరుగుచు నృత్యము చేయుదురు. అప్పుడు వాద్యగాండ్రు మధ్యలో నిలువబడి తమవాద్యములను వాయించెదరు. స్త్రీలు, పురుషులు, కలసి చేయు నృత్యమిది.

## కోరువాల నృత్యము

ఒక పెద్దచక్రము వలె ఒకరినొకరు దగ్గఱగా అతుకుకొని పోయినట్లు నిలువబడి చేతులలో వివిధ ఆయుధాలను, ఎడమచేతితో విల్లు, కుడిచేతిలో తళతళ మెరిసే గొడ్డళ్ళు పట్టుకొని నృత్యము చేయుదురు. వీరు 'కోలారి' అనే తెగకు చెందిన "కోరువాలు"

వీరు ఛోటానాగపూర్ పీఠభూములలో నివసింతురు. కొందఱు రణభేరి నాదమువంటి నాదముచేసే మద్దెలలు వాయించుదురు. పురుషుల చక్రములో ఇంకొక చక్రముగా స్త్రీలు నిలువబడుదురు. వీరు ఒకరిని అంటిపెట్టుకొని ఇంకొకరు అతుక్కొని పోయినట్లు మిక్కిలి దగ్గఱగా నిలువబడుట చూచినచో చుట్టచుట్టుకొని పండుకొన్న పాము జ్ఞాపకము వచ్చును. అందఱు పాడుచు నృత్యము చేయుదురు. అందఱకు మధ్యలో 'చోరగస్' కూర్చొని తన తంత్రీవాద్యము వాయించుచు, పాడుచు, అభినయించుచు నృత్యముచేసి అలసిపోయినవారిని ఉత్సాహపరచుచు వారి నృత్యమునకు జీవముపోయును. నృత్యము చేసే పురుషులు కొందఱు తమ పొడుగాటి పెండ్రుకలను సిగముడి వేసి దానిలో అమ్ములు ఉంచుదురు. వారు నృత్యముచేయుచు కదలినప్పుడు అవికూడ వారితో కలసి కడుచక్కగా మూగుచుండును. మఱి కొందఱు పెండ్రుకలను జడలుగా వేసికొని వానిలో ఒక్కొక్క అమ్ముమంచుదురు. వారు నృత్యముచేసినప్పుడు ఆ జడ యాడును. దానితోపాటు ఆ అమ్ములు అటునిటు వాడుట చూచినచో హృదయాహ్లాదకరముగా ఉండును. స్త్రీలు, నంతాల వనితలవలె ఎఱ్ఱరంగుతో నుండిన ప్రత్తిపూవులతో తమశిరోజములను అలంకరించుకొందురు. ఇవిగాక మఱి యే సొమ్ములును వారికిలేవు.

వీరు ఖర్మనృత్యము గ్రీష్మ ఋతువులో చేయుదురు. ఆ నృత్యము,చేసినచో పంటలు బాగుగా పండునని వీరి ఉద్దేశ్యము. ఇది ఒక విధమైన ఆరాధనా నృత్యము, భగవంతునిపై స్తోత్ర గీతములను పాడుచు ఈ నృత్యము చేయుదురు. వర్షము లేక పోయినచో వీరీ నృత్యము ప్రతిరాత్రియు చేయుదురు. ఈ విధముగా నృత్యగీతములతో భగవంతుని ఆరాధించిన, అతడు సంతృప్తుడై వర్షము కురిపించునని వీరి దృఢ విశ్వాసము.

## కవురుల నృత్యము

చతీస్‌గడ్ జిల్లాలోను,| మహానదికి ఉత్తరమున నున్న ప్రదేశాలలోను కవురులు నివసింతురు. వీరినృత్యమునకు సంతాలుల కోలుల నృత్యమునకు ఏ విధమైన సంబంధములేదు. కొందఱు పురుషులు చక్రాకారముగ నిలువబడి మన దేశములోని కోలాటమువలె తిరుగుచు చేతులలోని కఱ్ఱలను కొట్టుచు మద్దెల లయ ననుసరించి పాడుచు, దానికి తగినట్లు అడుగులు వేయుచు, ఆ తాళమునకు తగినట్లు చేతులలోని కఱ్ఱలను కొట్టుచు నృత్యము చేయుదురు.

కొన్ని నృత్యములలో వారు ఒక పెద్ద తంబురవంటి వాద్యమును చేతపట్టుకొని, గుండ్రముగా తిరుగుచు వాయించుచు బహు సులభమైన, సున్నితమైన గీతాలను పాడుచు నృత్యము చేయుదురు. వారి కెదురుగా స్త్రీలు నిలువబడి శిరస్సులు కప్పుకొని శరీరాలను ఒక ప్రక్కకు వంచి యుద్ధభూమికి వచ్చు సైనికుల వలె నిలువబడి (చేతులు పట్టుకొనరు, కోలులవలె చేతులనాడించరు) నృత్యము చేయుదురు. ఇది బైగాల 'సేల', 'రేనా' నృత్యములను చాలమట్టుకు పోలియుండును. బైగాలు కొన్ని ఆటవిక జాతులకు పూజారులు.

'సేల' నృత్యము బైగా పురుషులు చేయునది. వీరు కూడ గుండ్రముగ తిరిగి నృత్యము చేసినను, కవురులవలె తంబురలు వాయించక చేతులలో కఱ్ఱలు పట్టుకొని కోలాటము వేయుచు నృత్య మాడుదురు.

అదే విధముగా బైగా స్త్రీలు 'రేనా' నృత్యము చేయుదురు. స్త్రీలు ఒకరికి దగ్గఱగా ఒకరు నిలువబడి చేతులు పట్టుకొనక ముందుకు వచ్చుచు, వెనుకకు వెళ్ళుచు, వంగుచు నృత్యము చేయుదురు. ఇటీవల గోండులుకూడ సేల, రీనా నృత్యములను చేయుచున్నారు. కాని అవి తాము బైగాలవద్ద నేర్చుకొన్నామని అంటారు.

—0—

## కళయే జీవితమైన కోయలు – వారి వృషభనృత్యము

సుమారు ఇరువదిమంది పురుషులు మెడలో పొడుగుపాటి పెద్ద పెద్ద మద్దెలలు వ్రేలాడ వేసికొని నిలువబడి తల వెంట్రుకలను గోపురములవలె ఎగగట్టి, వానిపై తలపాగలను చుట్టి తలకు రెండుప్రక్కల ఎద్దుకొమ్ములను అలంకారముగ ధరింతురు. శరీరముపై దుస్తులు ధరించరు. మోకాళ్ళవరకు పంచెమాత్రము కట్టుకొందురు. పురుషులు మద్దెలలు వాయించుచు గుండ్రముగా తిరుగుచు నృత్యము చేయుచుందురు. స్త్రీలు వారికి కొంత దూరములో నిలువబడి ఒకరిచేతుల నొకరు పట్టుకొని నృత్యమాడుదురు. ఈ రీతిగా కొంతవరకు నృత్యము చేసిన తర్వాత పురుషులు రెండు భాగములుగా జీలి ఒకరి కెదురుగా నొకరు నిలువబడుదురు. ఒకనిమిషము నిశ్శబ్దము.

"ధంగ్ ధంగ్ – ధంగ్ తకిట – ధంగ్ ధంగ్"

ఇరువది మంది ఇరువది మద్దెలలు తీసికొని ఒక్కసారిగా తుపానులో మేఘ గర్జనల వలె పలికింతురు. అందరిలోను ఏదో యుద్రేకము, ఆవేశము పుట్టును. శరీరము చలించుచు, మద్దెలను ప్రయోగించుచు, నృత్యము చేయుచు వెనుకకు వెళ్ళి, అతి తొందరగా అడుగులు వేయుచు, తలలను దగ్గరగా జేర్చి, కొమ్ములతో పొడుచుకొనునట్లు అభినయించుచు, గిర గిర తిరుగుచు తాళము తప్పక నృత్యము చేయుదురు.

తరువాత పరుగు పరుగున వెనుకకు అడుగులు వేయుచు వెళ్ళుదురు. తిరిగి ముందుకు పక పకమని మద్దెలలు వాయించుచు పరుగెత్తుకొని వచ్చి ఢీకొందురు. ఇలాగు నృత్యము చేయుచు, అలసి పోవుచు నర్తకులను ప్రేక్షకులుగా నిలువబడిన పురుషులు స్త్రీలు, యేక కంఠముతో "హే – హే" అని కేకలు వేయుచు ఉత్సాహపరచెదరు. ఈ లాగున కొంతకాలము నృత్యముచేసి, మరల స్త్రీ పురుషులుకలసి ప్రకృతి గీతములు పాడుచు నృత్యము చేయుదురు.

ఇది "రామన్న, లక్ష్మన్న, మేము కోయదొరలమండీ, కోయరాజులం" అని మన తెలుగు జిల్లాలకు వచ్చెడి కోయరాజుల వృషభనృత్యము.

ఆంధ్రదేశమంతయు దట్టముగా లతలు అల్లుకొనిన చెట్లతో ఎత్తయిన పర్వత పంక్తులతో అలరారుచుండును. ప్రక్కనే గోదావరీనది పర్వతశ్రేణులనుండి పల్లపు భూములకు మధురధ్వనులు చేయుచు ప్రవహించుచున్నది. నిశ్శబ్దముగా నున్న ఆ అడవిలో తమ బిడ్డలను తెల్లవారుజామున 'కో కో' యని నిద్ర లేపు పక్షుల పలుకులు, నిద్రలేచి రెక్కలను విదుల్చుకొని, బద్ధకము తీర్చుకొని ఆకసముపై ఎగిరెడి పక్షుల రెక్కలచప్పుడు మాత్రం వినపడుచుండును. లేడిపిల్లలు, కుందేటికూనలు పొదలలో గంతులిడుచు విహారము చేయుచున్న అడుగుల చప్పుడు, సన్నాయి పాటలో లయతెలుపుటకై వేయు తాళపు మధురధ్వనిని జ్ఞాపకము చేయుచు పరుచును. ప్రభాతభానుని లేతకిరణములు చెట్ల యాకులపైని నీటి బిందువులను హరించుటచే మంచుచే వంగిన ఆకు లొక్కొక్కటిగా తలలుపైకెత్తి ప్రపంచమును చూచుచుండును.

ఆ ప్రశాంతసమయములో గోదావరి నంటిపెట్టుకున్న కోయల గూడెములలోని ప్రజలు విశాల ప్రదేశములో గుమిగూడి చేసిన నృత్యాన్ని చూచిన ఏ కళారాధకుడు తన జీవితములో ఆ దృశ్యాన్ని మరచిపోగలడు?

ఈ నృత్యమును నేను భద్రాచలందగ్గర అడవులలోనివసించే కోయలు చేయగా చూచితిని. చూచినప్పుడు డార్విన్ 'మానవ పరిణామ సిద్ధాంతము' లో వ్రాసిన 'బిసన్ ఫైట్' (వృషభ యుద్ధము) జ్ఞాపకం వచ్చినది.

## గోండలీల గోండల్ నృత్యము

గోండలీలు ఆంధ్రప్రదేశములోని జంగముల వంటివారు. వీరు పెండ్లి మున్నగు శుభకార్యముల సమయములో 'గోండల్' నృత్యము చేయుదురు. నలుగురు మనుష్యులు ఈ నృత్యములో పాల్గొందురు. అందులో నృత్యము చేయువాడు పాదములవరకు పొడుగాటి ఒక కుచ్చుల కుడితిని, మెడలో గవ్వలపేరు, కాళ్ళను గజ్జెలను ధరించును. తలకు మార్వాడీలు కట్టుకొనునటి తలపాగ పెట్టుకొనును. మిగిలిన ముగ్గురు అతని వెనుక నిలువబడియుందురు. అందులో యిదరు మద్దెలలు వాయించెదరు. మూడవవాడు దివిటీ (జ్ఞాన జ్యోతితో) నిలువబడును. దివిటీ పట్టుకొని నిలువ బడిన వాడు విదూషకుడుగా వ్యవహరించును. వీరు భవానీ స్తోత్రములో నృత్యముచేయుదురు.

రంగస్థలములోని యొక కొయ్య బెంచీమీద ఒక తెల్లని గుడ్డ కప్పి, ఆ గుడ్డమీద గోధుమలు పరచి, వానిపై నీళ్ళతో నింపిన ఇత్తడి చెంబునుంచి, దానిపై కొబ్బరికాయ నుంచుదురు. ఇది భవానీదేవిగా భావింపబడును. నృత్య ప్రదర్శనము ముగి



వీరిని సాధారణముగా పెండ్లిండ్లకు, రజస్వలానంతర శాంతి పూజా సమయములకు పిలిపించి, కొన్ని జాతులవారు నృత్యము చేయించెదరు. వినోదార్థము నృత్యము చేయునప్పుడు భవానిని ఆరాధింతురు.

నే నెవరిని? ఎచ్చటనుంచి వచ్చితిని? ఈ పరమరహస్యమును యింతవరకు ఎవరును తెలుపలేక పోయిరి. తల్లి, తండ్రి, అక్క, తమ్ముడు, వీరందరు మాయ. వీరందరు నావారే యని తలచి స్వార్థము కోసము, జీవితమును వృథా పుచ్చుచున్నాము. విషయ వాంఛ నరకమునకు మొదటిమెట్టు. మానవుడు ఏకారణము లేకుండ దీనిలో చిక్కుకున్నాడు. ఓయి నరుడా! నీ గురువును తలుచుకో సిన పిమ్మట, ఆ కొబ్బరికాయనుకొట్టి గోధుమలను కొబ్బరి ముక్కలను ప్రసాదముగా స్వీకరింతుము.

(గురువనగా జ్ఞానమిచ్చేవాడనిఅర్థం) అతని యొద్దకువెళ్ళి పాదాలపై పడు. దయ, క్షమ ఈ రెండు కవచములను ధరించు. జ్ఞానము సంపాదించుకో. భగవంతుడు ప్రతి మానవుని హృదయములో వెలుగుచున్నాడు. ఈవిధమైన వేదాంత గీతాలను వీరు నృత్యములో గానము చేయుదురు.

## హల్బా - వేట నృత్యము

రాత్రి తొమ్మిది గంటలవుచున్నది. నేను చిన్న దీపం ముందు కూర్చొని వ్రాసికొనుచున్నాను. ఆ పూరింటి తలుపు చప్పుడు కాకుండా తెరచి దుర్రా బైగా (పెద్దపూజారి) లోనికి వచ్చెను. అతని చేతిలో ఒక చిన్న దీపమున్నది.

"ఈ రాత్రి ఒకవింత జరుగును. త్వరగా రండి పోదాము" అని నన్ను తొందరపెట్టెను. అయిదు నిమిషముల తరువాత ఇద్దరము కాలిబాటను నడచి వెళ్ళుచున్నాము. ఆనాడు అమావాస్య. ఆ ప్రదేశమంతటా చీకటి. చేతిలోనున్న చిన్న దీపముతో దారి చూపుతూ అతడు ముందు నడుచుచున్నాడు. అతని ననుసరించి నేను వెళ్ళుచుంటిని. ఆదారి ఒక పొలములోనికి వెళ్ళినది. గటునే యున్న మంచెమీద ఇద్దరము కూర్చొన్నాము. అతడు చేతిలోని దీపము నార్పివేసెను. ప్రశాంతముగా నున్న యా ప్రదేశమును చీకటి కప్పివేసినది. మధ్య మధ్య పొదలలో కదులుచున్న జంతువుల చప్పుడు మాత్రము వినబడుచున్నది. అతడు మాట లాడకుండా కూర్చొన్నాడు. నేనును అలాగునే కూర్చొన్నాను. కొంతకాలమునకు దూరమునుంచి "చున్ చున్ చున్ చున్" అని శబ్దము వినబడినది. మరి కొంతసేపటికి అదియును ఆగి పోయినది. అతడు చీకటిలో ఆ శబ్దము వచ్చిన వైపునకు చూచుచు కూర్చున్నాడు. మరల ఆ ప్రదేశమంతా నిశ్శబ్దము. పదునైదు నిముషములైన తర్వాత ఆ వైపునుండి "చం చం చం చం" అని వినబడుట మొదలు పెట్టినది. ఆ శబ్దము రాను రాను మమ్ము లను సమీపించుచున్నట్లనిపించింది. దూరములో ఒక దీపము వెలుగు, దాని నీడలో కొందఱు మనుష్యులు నడుచుచున్నట్లని పించినవి.

"ఇదేమిటి దుర్రా?" అని ఆతురతతో అతనిని అడిగితిని. అతడు 'ఉష్' అని నోటిపై వ్రేలువేసుకొని మాట్లాడ వద్దన్నట్లు సైగచేసెను.

అది అరణ్యప్రదేశము. బందిపోటు దొంగలేమోనని నాకు భయమువేసినది. నా గుండె దడదడ కొట్టుకొన మొదలు పెట్టినది.

ఆ వెలుగుక్రమేణ మాకు అయిదు గజాల దూరమునకు వచ్చినది. సుమారు ఏడుగురు మనుష్యులు, వాళ్ళకు గుంగినియాలు (మనస్త్రీలు ధరించే అందెలవంటివి) ధరించిరి. అందులో ఒకడు దీపము పట్టుకొని నడచుచున్నాడు. మిగిలిన వారందఱు ఆ దీపము నీడలో నిలువబడి నృత్యములోవలె అందఱు ఒక లయలో అడుగులువేయుచు నుండుటచేత వారి కాళ్ళ గుంగినియాలు "చం చం చం చం" అని కర్ణ మధురముగా ధ్వనించు చున్నవి. ప్రక్కనే యున్న పొదలలో పడుకొనియున్న కుందేటి కూనలు ఆ మధురధ్వనిచే ఆకర్షింపబడి, అటువైపునకు పరుగుతో వచ్చినవి. కాని ఆ దీపపు వెలుగులో వాని వెనుకనున్న మనుష్యులను చూడలేక మినుకు మినుకు మని వెలుగుచున్న దీపము ముందుకు వచ్చి దానిని చూచుచు నిలుపబడినవి. అవి దీపము ముందుకు రాగానే వెనుక నిలువ బడియున్న మనుష్యులు వానిని పట్టుకొని మరునాటి విందునకు గాను బుట్టలో వేసికొనిరి. ఈ విధముగా తమ కాళ్ళ గుంగినియాల ధ్వనిచే ఆకర్షింపబడి దీపము ముందుకు వచ్చిన కుందేలు మొదలగు చిన్నచిన్న జంతువులను పట్టుకొనుచు వెళ్ళిపోయిరి. వీరు 'హల్బా' అను ఒక రైతు తెగకు చెందిన వారు.

ఈ విధముగా వీరు జంతువులను రాత్రులందు వేటాడుదురు. వీరు రాయపూరునకు దక్షిణముగా కాంకేరు, బస్తరు సంస్థానము లలో నివసింతురు.

"చూచారా? హల్బాల వేట"

"బుర్రా ఇదివేటా? లేక నృత్యమా?

"నాగరిక ప్రపంచములో నివసించు మీ నిత్య జీవితము లకు కళకు సంబంధములేదు. కాని ప్రకృతి బిడ్డలమైన మాకు జీవితమే కళ. కళయే మా జీవితము. సెలయేళ్ళ మధురధ్వనియే మా సంగీతము. వసంతములో తమ ప్రియురాండ్రను ఆకర్షించు టకై నెమళ్ళు మొదలగు పక్షులుచేయు అభినయమే మా నృత్యము. వర్షఋతువు మేఘగర్జనలే మా మృదంగ వాద్యము. కోయిల పల్కులే మా మురళీగీతము." అని పకాలున బుర్రాబైగా నవ్వెను.

ఈ దృశ్యాన్ని నేను కొన్ని సంవత్సరముల క్రిందట మధ్య పరగణాల ఆటవిక నృత్యకళ నభ్యసించిన సమయములో చూచితిని.

# గోండుల ఖర్మనృత్యము

ఆర్యులు మనదేశమునకు రాకపూర్వము ద్రావిడులు మన దేశములో నివసించుచుండిరి. ఆర్యులు వచ్చి వివిధ ప్రాంతములలో నివాసము లేర్పఱచుకొనుట మొదలుపెట్టిన పిమ్మట దేశములోని ఆదిమనివాసులగు ద్రావిడతెగలకు ఆర్యులకు అనేక యుద్ధములు జరిగినవి. వానిలో ఓడిపోయిన ద్రావిడులలో స్వేచ్ఛాప్రియులు అరణ్యములలోనికి పోయి కొండగుహలను, అన్యులు చొరలేని పర్వత ప్రదేశములను నివాసములుగా నేర్పఱచుకొని స్వేచ్ఛగా జీవింపసాగిరి. కాని ఆర్యులకు "దాసోహం" అన్నవారు అనేక కష్టములను పొందిరి. వారికి స్వేచ్ఛా స్వాతంత్ర్యములు లేవు. ఆర్యులు వారిని నీచముగా చూడసాగిరి. వారు ఆర్యుల దేవతలను పూజింప నర్హులుగారు. ఆర్యుల పూజలలోను హోమములలోను పాల్గొనరాదు. ఆర్యులు నివసించు పల్లెలలో నివసించరాదు. ఊరి వెలుపల కొంతదూరమున తమ నివాసము లేర్పఱచుకొనవలయును. ఇట్టి నిర్బంధము లెన్నింటికో వారు గుఱియైరి. ఆర్యులు మన దేశమునకు క్రొత్తవారు కనుక ఈ దేశము గుఱించిగాని, ఆయా ప్రదేశములలోని గ్రామదేవతలను గుఱించిగాని వారికి సరిగా తెలియదు. కావున ఆ ప్రాంతీయ దేవతలను తృప్తిపఱచుటకు పూజలు అనార్యులచే చేయించెడివారు. ఈ సిద్ధాంతము ననుసరించియే ఇప్పటికి కొన్నిప్రదేశములలో గ్రామదేవతల (అమ్మవార్ల) పూజారులు మాలమాదిగ మొదలైన జాతులవారున్నారు. చాలవఱకు మన ప్రదేశములో పంచములని పిలువబడేవారిని ఈ తెగలో చేర్చవచ్చును.

కాని అరణ్యములోనికి పోయినవారు మాత్రము తమ స్వేచ్ఛకు ఎట్టి భంగము కలుగనీయక స్వతంత్రముగా జీవింపసాగిరి. వారే రాజులు. వారే ప్రజలు. వారు తమ ఆచారవ్యవహారములను, సాంఘికమైన కట్టుబాట్లను, ఎన్ని యుగములైనను మఱచిపోలేదు. ఇదియే వారి సంఘీభావమునకు, ఐకమత్యమునకు ముఖ్యకారణము. అట్లు అరణ్యములకు వలసపోయిన తెగలకు చెందినవారే గోండులు, ఆదివాసులు, బైగాలు, శంతాలులు, బరియనులు మొదలైనవారు.

ద్రావిడులతో ఆర్యులతో యెట్టిసంబంధము లేక తమ జీవితమును తాము స్వేచ్ఛగా గడుపుచు, గొప్ప గొప్ప సామ్రాజ్యములను స్థాపించి మహా వైభవముతో యేలిన దాక్షిణాత్యులున్నారు. వీరు ఉత్తరదేశములోని ఆర్యులతో సమానముగా మెలగుటయే గాక వారితో సంబంధ బాంధవ్యములను యేర్పఱచుకొనుట గూడా తటస్థించినది. రెండు తెగలవారు కలసి మెలసి యుండుటచే వారి సంస్కృతి, ఆచారములలో పూర్తిగా మార్పులు వచ్చినవి. ఇట్లు కొంతకాలమునకు రెండు సంస్కృతులు, రెండు తెగలు యేకమగుటచే ఈ కాలములో ఆర్యులెవరో, ద్రావిడులెవరో (ఆటవికులు తప్ప) సామాన్యముగా తెలిసికొనుట కష్టము.

## గోండులు

వీరు చాందాజిల్లా, సాత్పురా పీఠభూమి, బేతూలు, సివనీ, మాండ్లాజిల్లా మొదలైన ప్రదేశములలో నివసించుచున్నారు. వీరికి గోండులని, కోండులనిపేరు. ఇప్పటి మధ్యరాష్ట్రము (సి.పి.) గోద్వానా (గోండుల రాజ్యం) అని పిలువబడి యుండెడిది. వీరి భాష తెలుగు, తమిళం, కన్నడభాషలను చాలవఱకు పోలియుండును. ఒకప్పుడు వీరు పెదరాజ్యములను స్థాపించి పాలించిరి. 'చిద్వాంద' వద్దగల 'దేవుగల్' జబ్బల్‌పూర్ వద్దగల గర్హమాండ్ల, చాందా మొదలగు ప్రదేశములను చాలవఱకు గోండురాజులు పాలించిరి. పురుషవేషమును ధరించి తన శిశువును వీపుకు కట్టుకొని, తనస్వాతంత్ర్య రక్షణకై శత్రువుతో పోరాడి వీరస్వర్గ మలంకరించిన వీరనారి, మహారాణి అయిన దుర్గావతి ఈతెగకుచెందినదే.

గోండుల నృత్యకళనుగూర్చి చెప్పుటకు ముందు వారికి సంబంధించిన ఒకపుక్కిట పురాణగాథ చెప్పుట అవసరము.

ఆదిలో ప్రపంచమంతయు జలమయము — భగవంతుడొక్కడే తామరాకుపై శయనించి యుండెను. ఒకరోజున తనచేతిని నలిపి ఆ మట్టితో ఒకకాకిని సృష్టించినాడు. అది ఎగిరి అతని భుజముపై వ్రాలినది. తరువాత ఆయన యొక ఎండ్రకాయను సృష్టించినాడు — అది నీళ్ళలో ఈద మొదలుపెట్టినది. కాకిని ఎగిరి కొంతమన్ను తీసికొనిరమ్మని భగవంతుడు ఆజ్ఞాపించెను. కాకి చాలసేపు వెదకినది. కాని మన్ను ఎచ్చటను కన్పించలేదు. చివఱకు ఒకకాలు సముద్ర గర్భమునుపైనుంచి, విశ్రాంతి తీసికొనుచున్న ఎండ్రకాయను చూచినది. ఆ కాకి అలసిపోయి ఎండ్రకాయ మెత్తని వీపుపై వ్రాలినది. ఆ కాకి పాదముయొక్క గీఱలే ఎండ్రకాయ వీపుమీద యేర్పడినవి. కాకి ఎండ్రకాయను "మన్ను ఎక్కడ దొరుకునని" యడుగగా, ఎండ్రకాయ తన శరీరమును భగవంతుడు గట్టిగా చేసినచో తానే మన్ను తెచ్చిచ్చెదననెను. భగవంతు డందులకు అంగీకరించి దానివీపును గట్టిగా చేసెను. అందువల్లనే ఎండ్రకాయయొక్క పైభాగము గట్టిగా నుండునదట. అది నీళ్ళలోనికి పోయి భూగర్భములో ఎఱను చూచి దానిమెడను గట్టిగా పట్టుకొన్నది. అందువల్లనే ఎఱమెడ చుట్టూ నల్లని మచ్చలేర్పడినవట. ఎఱ తననోటిలోనుండి మన్ను బయటకు తెచ్చినది. ఎండ్రకాయ ఆ మన్నును తెచ్చి భగవంతున కీయగా అతడు దానిని సముద్రములో చల్లెను. అప్పుడక్కడ భూమి యేర్పడినది. భగవంతుడు దానిమీద నడిచెను. అతనిచేతిలో ఒక బొబ్బయెక్కినది. దానిలోనుండి పార్వతీ పరమేశ్వరులు పుట్టిరి.

మహాదేవుని రేతస్సునుండి అనేక విధములైన చెట్లు, చేమలు మొలచినవి. పార్వతి వానిని భక్షించి గర్భవతియై పదునెనిమిది హిందూదేవతలను, పదునెనిమిది గోండుదేవతలను కన్నది. గోండుదేవతలు అరణ్యమునంతయు నాక్రమించిరి. వారు హిందువులవలె భగవద్భక్తి కలవారై ప్రవర్తించక అతినీచముగ కము. కొందఱు కుందేటి పేడతో పిడకలుచేసి కాల్చి దానితో

జీవించుట మొదలుపెట్టిరి. ఆ ప్రదేశమంతయు వారుచంపిన మృగములయొక్క క్రుళ్ళువాసనతో నిండినది. వారు స్నానపానాదులు, జపహోమాదులు మానివేసిరి. ఈ విధముగా జీవించే గోండులమీద మహాదేవునికి ఆగ్రహము కలిగినది. వారినంత మొందింపవలెనని తలచి, వారినందరిని ఒక స్థలమునకు పిలిచి, వారి మధ్యలో ఒక ఉడుతను సృష్టించెను. వారు దానిని చంపి తినుటకుగాను దాని వెనుక పరుగెత్తుట మొదలుపెట్టిరి. అదియొక కొండగుహలోనికి పోయినది. వారు దానివెనుకనే ఆ గుహలోనికి పోయిరి. శివుడు ఆ గుహద్వారము నొకపెద్దరాయితో మూసివైచెను. కాని పార్వతి తనకు ప్రియమైన గోండుల దుర్గంధము అరణ్యములో లేకపోవుటకు కారణము తెలిసికొని తపస్సుచేయ మొదలుపెట్టినది. ఆరునెలలు నిద్రాహారాలు మాని తపస్సుచేసినది. ఒకనాడు భగవంతుడు ఊయెలలో నూగుచుండగా పార్వతి తపస్సు ఆయనను కలవరపరచినది. ఆయన నారాయణుని (సూర్యుని) తపస్సెవరు చేస్తున్నది చూచిరమ్మని పంపెను. నారాయణుడు పార్వతిని కలసికొని, ఆమె తపస్సునకు కారణమడుగగా, ఆమె "గోండులు నాకు కావలె" నన్నది. నారాయణుడు భగవంతునికి దానినెఱింగించెను. భగవంతుడు గోండులను తిరిగి యిచ్చివేయుటకు ఒప్పుకొనెను. ఈ విధముగా గోండులు తిరిగి ప్రపంచములోనికి వచ్చిరి.

## గోండుల నృత్యకళ



గోండుకోయల నృత్యాలంకరణ

గోండులలో అవివాహితులైన యువతీ యువకులు నృత్యగానములతో కాలము గడుపుటకై ఒకగృహము యేర్పరుప బడును. దానిని "గోటల్ ఘర్" అందురు. అది భారీ నృత్యమందిర మన వచ్చును. కొన్ని ప్రదేశములలో స్త్రీ పురుషులకు వేఱు వేఱుగా నృత్యగృహము లుండును. 'చత్తీస్ ఘర్' లో గోండు పల్లెలలో పెండ్లిగాని యువతీ యువకులు, "గోటల్ ఘర్" లో రాత్రిళ్ళు చేరి నృత్యగీతములతో కాలము గడుపుదురు.

ప్రతిరోజు రాత్రిభోజనమైన తరువాత పెండ్లిగానియువకులు ముందుగా నృత్యగృహము చేరుదురు. వారి తర్వాత యువతులు వెళ్ళెదరు. "కోట్వారు" అనబడు గురువు బాల బాలికల నాహ్వానించి బాలికలయొక్క నాయకునికి (సర్దార్ కు) వారిచే ముందుగా మ్రొక్కించును. తరువాత యొక్కొక్క యువతి, తనకునచ్చిన యువకుని యేరుకొని అతని తలనుదువ్వి కాళ్ళు చేతులు మర్దించి నృత్యము మొదలుపెట్టును. అలసిపోవునంతవఱకు పాడుచు నృత్యముచేసి తరువాత విశ్రాంతి తీసికొందురు. ఇష్టమైనచో తమ యిండ్లకు పోవచ్చును. కాని సాధారణముగ తనతో నృత్యము చేసిన యువకుని యింటనే రాత్రి గడిపెదరు. ఈ విధముగా ప్రతి రాత్రియు నృత్యము చేయుటచే యువతీ యువకులలో పరస్పరానురాగ మేర్పడును. తలిదండ్రులు వారిపెండ్లికి ఒప్పుకొననిచో వారు అరణ్యముల లోనికి పారిపోవుదురు. అప్పుడు వారిద్దరు భార్యాభర్తలుగ జీవించుటకు సంఘము ఒప్పుకొనును. అనగా పెండ్లి అయినట్లు అర్థము. కొన్నిప్రదేశములలో బాలికలను 'గోటల్ ఘర్' కు పంపరు.

ఇదే విధముగ 'భయ్యా'లు గలరు. వీరు బైగాజాతికి చెందినవారు. (బైగాలు ఆటవికుల పూజారులు) పెండ్లిగాని యువతులు బియ్యమును పువ్వులతో నలంకరించి, తమ పల్లెలనుండి మఱియొక పల్లెకుపోయి, ఆ పల్లెలోని ముసలివారిముందు దానినుంచి, "దీనిని తీసికొనుడు లేనిచో నీళ్ళలో వేయుడు" అనియందురు. వారంగీకరించినచో ఆ పువ్వులనెత్తి తమ చెవులపైనుంచుకొందురు. సాయంత్రము ఆ పల్లెలోని పెండ్లిగాని యువకులందఱు వచ్చి ఈ పడుచులతో కలిసి, రెండు గుంపులుగా విడిపోవుదురు. మొదటి గుంపువారు నృత్యముచేసి అలసిపోయినప్పుడు రెండవ గుంపువారు నృత్యము చేయుదురు. ఈ విశ్రాంతి సమయమే వారు ఒకరితో నొకరు పరస్పరానురాగము పెంపొందించుకొను సమయము. వారి ప్రేమ వెల్లడించుకొనుటకు ఒక అవకాశము. ఇటుల రాత్రి అంతయు నృత్యములతో గడిపి తెల్లవారు లోగా అందులో ఎవరైనా భార్యాభర్తలుగ జీవించుట కిష్టపడినచో ఇద్దరు గలసి రెండు మూడు రోజుల వఱకు అరణ్యములకు పారిపోయెదరు. అనగా వారికి పెండ్లయినట్లర్థము.

గోండులలో పురుషులు తమ మోచేతులకు, మోకాళ్ళకు, మనికట్టులకు 'హోలీ' అగ్నిలో మండుచున్న మోదుగు కట్టెలతో చురకలు వేసికొందురు. అటుల చేయుటవలన నృత్యమునకు కావలసిన విధముగా వారి అవయవములు వంగుననియు, ఈ కట్టెలవలె తమ దేహము కూడ మిక్కిలి తేలికగా తయారవుననియు, మండుచున్న మంటలయొక్క జ్వాలలవలె వారియొక్క దేహము కూడ కదులుననియు, అతి తొందరగ మండు మంటలవలె తమ అందములలో చురుకుదనము వచ్చుననియు వారి నమ్మ

మోచేతులు, మోకాళ్ళమీద చురకలు వేసికొందురు. కుందేటి కాళ్ళ వలె తమ యంగములు చక్కగా వంగుననియు, చలనము కుందేటి వలె చురుకుగా నుండుననియు వారి నమ్మకము.

నృత్యగీతములు గోండుల నిత్యజీవితములో ఒక ముఖ్యాంశము. వారి నృత్యములలో ముఖ్యమైనది కర్మనృత్యము.

వర్షఋతు ప్రారంభములో (భాద్రపదము) గోండులు చిగిర్చిన ఇప్పకొమ్మ నెచ్చి, క్రొత్తగుడ్డతో చుట్టి యిండ్లలో నుంచెదరు. ఆనాడు పెద్ద పండుగ చేసెదరు. విందారగించిన తర్వాత భజంత్రీలు, మద్దెలలు మ్రోగించుచుండ స్త్రీ పురుషులు కలిసి ఆ కొమ్మ చుట్టును తిరుగుచు ప్రేమగీతములనో, ప్రకృతిగీతములనో పాడుచు నృత్యము చేయుదురు. ఇదియే కర్మనృత్యము. ఇది గోండులకే గాక ఇతర అరణ్యజాతులవారికి గూడ ముఖ్యమైన నృత్యము. ఇటుల నృత్యగీతములతో కర్మవృక్షము నారాధించి, భగవంతుని సంతోషపెట్టినచో పంటలు బాగుగ పండునని వారి దృఢనమ్మకము. కర్మనృత్యము ఒకవిధమైన (పశుప్రజల) పైవారాధన నృత్యము.

ఈవిధమునవే కార్తీకము లేక మార్గశిర మాసములందు 'భయ్యా' తెగవారు ఒక కర్మవృక్షపు కొమ్మను అడవి నుండి తెచ్చి దానిని పల్లెలో నుంచి దానిముందు కర్మనృత్యముచేయుదురు. ఇట్టి నృత్యగీతములతో కూడుకొనిన పూజవలన ఇప్ప, మామిడి, పనస మొదలైన చెట్లు చక్కగా ఫలించునని వారి నమ్మకము. సోమ, బుధ, శుక్రవారములు వారు పూజచేయుటకు శుభదినములు.

ఆశ్వయుజ లేక కున్‌వార్ మాసములో గోండు బాలికలు కొందఱు ఒక కుండకు చిల్లులు పొడిచి, ఒక దీపమును, పావురపు బొమ్మను దానిలో నుంచి, దానిని యొక బాలిక తలపై నుంచి యింటికి పోయి దానిని యింటిముందు వాకిటిలో నుంచి పాడుచు వంగి గుండ్రముగా తిరుగుచు చప్పట్లు చరచుచు నృత్యమాడుదురు.

ఇవి కర్మనృత్యమేగాక ఇతరసమయములలో – శీత, గ్రీష్మ కాలములలో, ఇతర విశ్రాంతి సమయములలో నృత్యగీతములతో ప్రొద్దుపుచ్చుదురు. మఱియు గోండు స్త్రీలు, పురుషులు కలిసి నృత్యము చేయుదురు. ప్రతి పురుషుడు తనకు ఒక ప్రక్కనున్న స్త్రీ మెడచుట్టును చేయివేసి పట్టుకొనును. రెండవ స్త్రీ ఛాతిని (వక్షమును) చుట్టి అతని రెండవ చేయినుంచును. తాళలయల ననుసరించి ఒకకాలు తర్వాత రెండవకాలు నెత్తుచు, భూమిపై కొట్టుచు, చక్రాకారముగ తిరుగుచు నృత్యము చేయుదురు. ఈ నృత్యములో పెండ్లికాని యువతులేపాల్గొందురు. పెండ్లయినవారీ నృత్యములో పాల్గొనరాదు. పురుషులు నృత్యసమయములలో పులులు, చిఱుతలు, లేళ్ళు మొదలైన జంతువుల చర్మముతో తమ శరీరముల నలంకరించుకొందురు. కొన్ని వేళలందు నెమలిపుఛ్ఛముతో శిరముల నలంకరించుకొందురు. వారు కదలినప్పుడు మోగుటకు గాను ఒకటి రెండు గంటలను వీపు ప్రక్కకు ధరింతురు. వాద్యగాండ్రు మధ్యను కూర్చొని ''టాం టాం''లు మద్దెలలు వాయింతురు. కొన్ని సమయములలో వీరి నృత్యములో ముప్పది మంది వాద్యగాండ్రు కూడా పాల్గొను వాడుక కలదు.

ఒక్కొక్క సమయమున స్త్రీలు పురుషులు ఒకరి కెదురుగా నొకరు నిలువబడి నృత్యము చేయుదురు. వారి మధ్యలో వాద్యగాండ్రు నిలువబడుదురు. ముందుకువచ్చుచు వెనుకకు పోవుచు ఒకకాలు ముందునకు వేయుచు, దాని వెంటనే రెండవకాలునె గంతులు వేయుచు నృత్యము చేయుదురు. నృత్యము ననుసరించియే వాద్యగాండ్రుకూడ నర్తకులు ముందునకు వచ్చి ముందునకును, వెనుకకు పోయిన వెనుకకును, పోవుచు వాద్యములను వాయింతురు. ఈ నృత్యములలో స్త్రీలను పురుషులు పట్టుకొని నృత్యమాడరు కనుక యువతులుకూడా దీనిలో పాల్గొందురు.

గోండుల గీతములు కొన్ని వేదాంతసంబంధములు, కొన్ని ప్రేమగీతములు, కొన్ని స్త్రీ పురుషుల మధ్య సంభాషణలుగను ఉండును. వాని భావములు ఈమాదిరిగ నుండును.

నీశరీరమును జూచి పొంగకయ్యా
అది యొకరోజు పైకి పోవలసిందేగా!
నీ తల్లీ, దండ్రీ, చుట్టములు, బంధువులు
అందఱిని విడిచి పోవాలి
నీ యింటిలో నున్న లక్షల ఆస్తిని గూడా
మరణకాలములో వదలిపోవాలి

వాద్యములు పలుకుచుండగా సంగీతముననుసరించి పాదవ భూమిపై నృత్యముచేయును. మార్దంగికులు వాయించుచుండగా భూమి, నర్తకుల అడుగుల చప్పుడులతో ప్రతిధ్వనించును.

* * *

పురుషులు

"ఆ యువతి, నిద్రపోవుచున్నది
ఆమె రాజు ఆమె తొడపై పడుకొని నిద్రపోవుచున్నాడు
ఒక రొట్టెముక్క ఆమె యొడిలో నున్నది
ఒక ముంతలో నీళ్ళున్నవి
ఆమె నేత్రములలోనికి చూచి చెప్పవయ్యా!
నన్ను కలియునో లేదో!" ఇట్లనగా

స్త్రీలు

"నా ఆవును ఆమె దొడ్డిలో వదలినాను
దూడను కొట్టుదగ్గరుంచాను
నా బిడ్డను ఆమెకు వదిలాను
(అనగా అన్ని బంధాలు తెంచుకొని)
నేనొక్కతినే వచ్చితినయ్యా
నిన్ననుసరించి వెళ్లుటకు."

గదబల యొక్క "ఇటికెల సంబరము" నృత్యమును "తోడాజాతి" వారి నృత్యజాతరలు, చెంచుల నృత్యములు మొదలైన వన్నియు పైన వర్ణించిన విధముగనే యుండును. గనుక వీనిని గుఱించి ప్రత్యేకముగా వ్రాయక కొన్ని ప్రత్యేక నృత్యములను గూర్చి మాత్ర మిందులో తెలిపితిని.

# భరతనాట్యము

ప్రస్తుత కాలములో దక్షిణభారతములో (ఆంధ్ర, తమిళ, కర్నాటక ప్రాంతములందు) ప్రచారములోనున్న నట్టువ మేళసంప్రదాయమునకు 'భరతనాట్య' మని పేరు. ఇందు స్త్రీలు నాట్యమాడుదురు. పురుషులు ఆచార్యులుగా హంగుదారులుగా మాత్రముందురు. ఈ నాట్యమునకే మలయాళ దేశములో "మోహిని ఆట్ట" మని పేరు. ఒరిస్సా ప్రాంతములోని "ఒడిస్సీ" ఈ తరగతికి చెందినటిదే. అచ్చటి "మహర్" నృత్యము ఆలయాల్లో దేవదాసీలు చేసే ఆరాధన నృత్యము. ఈ నాట్యము లాస్యపద్ధతికి చెందినట్టిది. ఇందు ఒకే నర్తకి నృత్తనృత్యాభినయములను చక్కగా పోషించుతూ నర్తనము నల్పుటకు అనుకూలముగా సంగీత రచనలు చేయబడి నాట్యక్రమము రూపొందించబడినది.

'అలరింపు, జతిస్వరము, శబ్దము, వర్ణము, అభినయము (పదము, జావళీ, శ్లోకము)' అను విభాగములు యిందుండును.

**1. అలరింపు:—** భరతనాట్య ప్రదర్శనము అలరింపుతో ప్రారంభింపబడును. ఈ అలరింపే – అలంకరింపు, అలరిప్పు, అలరిప్పం, అలహరి, అలారి యని గూడ పిలువబడును. అలరింపు యనగా పుష్పించుట లేక వికసించుట. శిలామూర్తివలె రంగస్థలముపై సమభంగిమలో నిలబడియున్న నర్తకి 'ఓం' కార నాదముతో నిండిన సంగీతము చెవులకు సోకినంతనే కరగి, చైతన్యము కలిగి నృత్యము మొదలిడును. శరీరములోని ప్రతి అవయవము (ముందు కనుబొమలు, తరువాత నేత్రములు, అటుపై గ్రీవము, పిమ్మట హస్తములు, ఆఖరున పాదములు) చైతన్యము చెంది తాళలయలననుసరించి నర్తించును. ఇదియే అలరింపు.

సంగీతమునకు సప్తస్వరములు యెటుల జీవమో, మృదంగ వాద్యమునకు 'త, దీ, తో, నం' యెటుల బీజాక్షరములో, అట్లే నృత్యమునకు "తాం, తై" బీజాక్షరములు. అందుచే ఈ 'అలరింపు'లో బీజాక్షరములతో కూడిన గీతము 'తాऽऽतैऽऽतैऽऽताऽऽ' అని "తాం ది తాం, తై తతై" అని ప్రారంభింపబడి, కాలపై కాలములందు నృత్యమాడబడి, ఒక చిన్న తీర్మానములో ముగింపబడును.

**2. జతిస్వరము :—** ఇది రసభావములు లేకుండ తాళలయలననుసరించి చెయబడే అంగవిన్యాసము; నృత్తము.

జతులతో గూడిన స్వరమును నృత్తమాడుటచేత జతిస్వరమనబడుచున్నది. పాదసంచలనములో, గతులలో, శరీరభంగిమల ప్రదర్శనములో, నర్తకునకు గల ప్రావీణ్యమంతయు నిందు ప్రదర్శింపబడును.

ఈ జతిస్వరమందు స్వరకల్పనలకు మాత్రమేగాక మృదంగ జతులకు గూడ నృత్తము ప్రదర్శింపబడును.

కొన్ని మృదంగ శబ్దములను చేర్చి, ఒకటి లేక రెండు ఆవృత్తములు వాయించి,

'తదిగిణతోం' అను శబ్దముతో ముగించుటకు జతియని పేరు.

ఉదా :—

"తాదిమి దిమి దిమి తా తి తోం।, దిమి దిమి తా ం తోం।
ధిర్ర్ధిం తధిమి ధిమిత ధీమి। తా త త్తోం।
ధిమిత ధిమి తా త తోం। త తోం। తదిగిణ తోం॥"

* * *

జతిస్వరములో వాడబడే తాళగతులు 5 విధములు.

తిశ్ర – 3 అక్షరములగతి – గిణత

చతురశ్ర – 4 అక్షరములగతి – దిగిణత

ఖండజాతి – 5 అక్షరములగతి – తదిగిణత

మిశ్రగతి – 7 అక్షరములగతి – తక తదిగిణత

సంకీర్ణజాతి – 9 అక్షరములగతి – తకదికి తదిగిణత

ఈ ఐదు జాతుల నడకలు, వానికి తగిన తీర్మానములు జతిస్వరములో ప్రదర్శింపబడును.

**తీర్మానము :—**

ఒక జతిని – 'తదిగిణతోం – తదిగిణతోం – తదిగిణతోం అని మూడుసార్లు పలికించి ముగించుట తీర్మానమనబడును.

నృత్తముగాని, నృత్యముగాని యెప్పుడును ముక్తాయితో మొదలై, తీర్మానముతో ముగియును.

**ముక్తాయింపు :—**

'తదిగిణతోం – తదిగిణతోం – తదిగిణ' మాత్రమే వాయించుట ముక్తాయి

**ముక్తాయికి, తీర్మానమునకు గల భేదము :—**

తీర్మానమునందు – 'తదిగిణతోం' అని మూడుసార్లు వాయించినప్పుడు ఆ ధ్వని అంతతో ఆఖరై తరువాత నేమియూ లేదని సూచించును.

ముక్తాయింపు నందు – 'తదిగిణతోం – తదిగిణతోం – తదిగిణ' అని వాయించినప్పుడు ఆ నాదము అంతతో ఆఖరుగాక 'ఇంకా యేమిటి? ఇంకా ఏమిటి' అని అతృప్తతకలిగించును. కనుక ఒక గతిలో నుండి యింకొక గతిలోనికిగాని, ఒక జతి నుండి యింకొక జతిలోనికి గాని మారునప్పుడు, ముక్తాయి ఆ మార్పును సూచించి మనలను మరల యింకొక జతిలోనికి తీసికొనిపోయి.

వదలును. 'తదిగిణతోం' అని వాయించినప్పుడు నాదము పరిపూర్ణత చెందుచున్నది. 'తదిగిణ' అన్నప్పుడు నాదము సంపూర్ణము గాక ఇంకను యేదియో మిగిలియున్నట్లు గోచరించును. కనుక నృత్యమెప్పుడును ముక్తాయితో మొదలై తీర్మానముతో ముగియును.

ఈ జతిస్వరమునందు ప్రదర్శించు కొన్ని ప్రత్యేక అడవులు :-

**1. కుంచితము :** మొనవ్రేళ్ళపై నిలబడి మడమలచే తట్టుచు నృత్తమాడుట.

**2. అంచితము :** మడమలపై నిలబడి మునివ్రేళ్ళ నెత్తి నృత్యము చేయుట.

**3. పార్ష్ణిగము :** మడమలను, మునివ్రేళ్ళను ఒకదాని తరువాత యొకటి యెత్తి నృత్తమాడుట.

**4. ఘట్టితోత్సేదము :** అరికాళ్లు నేలకు తగులకుండ, ముడుచుకొని మడమలు, మునివ్రేళ్ళు భూమికి తగులుచు నృత్యమాడుట.

**5. సూచీపాదము :** ఒకపాదము నేలనానించి, రెండవ పాదము మడమ నెత్తి ఆ కాలి బొటనవ్రేలిపై ఆనించి నృత్యమాడుట.

**6. పార్శ్వగము :** పాదముయొక్క వెలిప్రక్కలు నేల నానించి, లోప్రక్కలు భూమికి తగులకుండ నిల్చి నృత్యమాడుట.

**7. శకటవదనము :** రెండు పాదముల బొటన వ్రేళ్ళను ఒకదానితో నొకటి పట్టి నటించుట.

**8 చక్రమండలము :** మునివ్రేళ్ళపై నిలబడి గజ్జెలను గుండ్రముగ కదిలించుచు కాలు కదలించుట.

(ఇంకను యెన్నియో రకముల అడవులున్నను, సాధారణముగ కొన్నింటిని మాత్రమే భరతనాట్యనర్తకులు ప్రదర్శించుచున్నారు. వీనికి శబ్దములను - అడవులు, అభ్యాసపద్ధతి యను శీర్షికలో వ్రాసితిని.)

* * *

## నృత్తములో హస్తవిన్యాసములు ఐదువిధములు

(1) హస్తములు క్రిందనుండి పైకెత్తుట.
(2) పై నుండి క్రిందికి దించుట.
(3) కుడి ప్రక్కకు విసురుట.
(4) ఎడమ ప్రక్కకు విసురుట.
(5) వృత్తాకారముగ త్రిప్పుట.

హస్తములెప్పుడును పాదముల ననుసరించవలెను. కుడికాలు కుడి చేతిని, ఎడమకాలు యెడమ చేతిని అనుసరించును.

## నృత్తములో వుపయోగించునట్టి పదమూడు హస్తములు

స్వస్తిక, దోల, అంజలి, కటకావర్ధన, శకట, కీలక, కపిత్థ, శిఖర, కూర్మ, హంసాస్య, అలపద్మ, పతాక, పాశ, - ఈ పదమూడు హస్తములు నృత్తములో వినియోగింపబడును.

* * *

## నృత్తములో తాళలయలను గురించిన వివరములు

కాలము యొక్క కొలతయే 'తాళము' (Time Measure). ఒక తాళము యొక్క దురము గమనము (Speed) ను తెలుపునది లయ.

విలంబిత, మధ్య, ధృత యని లయ మూడు విధములు. మనము ఒక గీతమును పాడునప్పుడు చేతితో అతి నెమ్మదిగ తాళము వేయుచు పాడుటకు, ఆడుటకు సుళువుగ నుండునది విలంబిత లయ. విలంబితమును రెట్టింపు చేసిన మధ్యలయ, మధ్యలయను ద్విగుణీకృతము చేసిన ధృతలయ అగును. ధృతలయ కంటె యెక్కువ తొందరగనున్నది 'జలద్‌లయ' అనబడును.

**ఆవృత్తము :-** ఒక తాళములో పాడుచున్నప్పుడు మొదటి అక్షరము నుండి మొదలుపెట్టి పాడుచు మరల మొదటి అక్షరమునకు వచ్చుట 'ఆవృత్త' మన బడును.

ముక్తాయి, తీర్మానము గురించి వ్రాయబడినది.

**జతి :-** మృదంగ శబ్దముల కూర్పు.

**గతి :-** తాళములో జతులయొక్క నడకలను తెలుపునట్టిది.

**ఉదా :-** ఆదితాళములో నృత్తమాడునప్పుడు, అందు-

(1) తకిట దికిట తాంత ధీంత ఝంగిణత.
(2) తత్తైయ్ తాహత దిత్తైయ్ తాహత.

ఇటి శబ్దముల కూర్పునకు నృత్తము సల్పుదుము. ఈ శబ్దములు ఏ నడకలో - అనగా 3 అక్షరముల నడకయందో లేక 5 అక్షరముల నడకయందున్నదో, విషమగతి యందున్నదో, సమగతి యందున్నదో నిర్ణయించునదే గతి.

'దినతక - దినకిట' - లేక 'తాం తాం - తత్తోం, కుందరి కిటతక - తత్తోం' మొదలైన శబ్దములను జేర్చి యేదియో ఒక జాతిలో (3, 4, 5, 7, 9 అక్షరముల జాతిలో) కొన్ని ఆ వృత్తములు వాయించి 'తదిగిణతోం' తో ముగించుట గూడ 'గతి' యనబడును.

చతురశ్ర జాతి నడక గల తాళములో ఖండ జాతిని నడుపుట - త్రిశ్రములో మిశ్రము నడుపుట గూడ 'గతి' నడుపుట యనబడును.

ఈ క్రింది విధముగ మృదంగ శబ్దములను కూర్చి వాయించుట కూడ గతి నడపుట యనబడును.

తై తరికిట - తరికిట - తక తరికిట
దిగుగుడు తాకిట తరి - తత్తై తక తరికిట.

క్రాం క్రాం తరి – తకై తక తరికిట
తరితరి కుంతరి – తైత తక తరికిట
కుంత కుంతరి కిట – దగాంగ్ తక దదిగిణతోం॥

**తక్కారము :–**

త, జం తరితక జం తకతజం దదిగిణతోం

ఈ విధముగ కొన్ని శబ్దములను చేర్చి ఒక ఆవృత్తములో తీర్మానముతో ముగించుట తక్కారము.

ఉదా :–

**తిక్కారము :–**

తద్ధి తక తరి జం – జం ధీ తకతరి జం
తక తరిజం – తదింగిణతోం

జతి :– కుందరి । కుంద । కుకుందరి । తకుంద
కుకుంద । ఓకుంద । తక । తకుందరి । కిటతక

తీర్మానము
ధీం దత ధ్రోం । దిద్ధిగు ఓర్తోం ।
తాంతక । ధీంతక । తకుందరి । కిటతక
తాంతతోం । ఓకతోం । తతోం
ధిర్గుడుత్తోం । ఓతోం । తోం తోం } మూడుసార్లు
ధిరుడు ధిరుడు తోం }

జతిస్వరములోని విశేష వివరములు :–

**మోహనరాగము–ఆదితాళము**

పల్లవి॥ రీ । సా, ధపా గారీ ధా । పా, గా । రీ సా ధారీ ।
సా, ధస ధప రీ, గా, పా, దా॥

స్వరము.

గరిగ సస గసస పపస గగ రి । రిగ
సరి రిగ గప । పద దస దారీ॥

**జతి :–**

ఝం తారి తక్కుకు ద్రింకుకు
జంతద్ధి కుంతద్ధి ద్రింకుకు
ధణకు జం దిత్త తక జం
తకుంద దికుంద దీ తాత్త ధీంత తోం
తారి తారి కిటతక ధిర్గుడు । తారి త కిట తక
తా తరికిట తరికిటతోం॥

**స్వరము :–**

సారిగ రిస రీ, సరిసదసా, దసదప దా గపపదదస
రిరిగ దా, । ససరి పా, । పపద రీ, రిరిగ సా
రిగపద సద

పై విధముగ పల్లవి, కొన్ని స్వరముల కూర్పు, మృదంగ శబ్దముల కూర్పులతో కలిసియుండునది జతిస్వరము – ప్రతి స్వరము, ప్రతి జతి, ముగించిన తరువాత మరల పల్లవి పాడబడును. ఇందు వివిధ కరణములు, అంగహారములు, చారులు, రేఖలు, తాళలయల ననుసరించి ప్రదర్శింపబడును. ప్రతి జతి, స్వరము ఒక తీర్మానముతో ముగియుచుండును.

* * *

'శబ్ద' పల్లవిలో స్వరములు లేక కేవలము మృదంగ శబ్దములతో గూడిన జతులకు మాత్రము నృత్తమాడబడును. 'స్వర పల్లవి' యందు మృదంగ జతులుండవు. కేవలము కల్పన స్వరములకు మాత్రము నృత్తమాడబడును.

**శొల్లుకట్టు జతుల నృత్తము**

మృదంగ శబ్దములతో గూడిన జతిని రాగములో పాడుచు నృత్తమాడుట. (దీనిని గూర్చి కూచిపూడి నృత్తకళలో వివరముగ వ్రాసితిని.)

**దరువునకు జతికి గల భేదము**

జతులు తాళలయల ననుసరించి వ్రాయబడిన శబ్దముల కూర్పు. దరువులు అట్లుగాక పాటకచ్చేరీలలో సంగీత విద్వాంసులు పాడు స్వరముల వలె స్వేచ్ఛగా నృత్యము చేయుటకు అవకాశముండును. నర్తకుడు తనకు గల పాండిత్యమును (అడవులందు, తాళలయలందు) పూర్తిగ ప్రదర్శించుటకు దరువులందు అవకాశమున్నట్లు జతులయందుండదు. కనుక దరువులలోని నృత్తము యెప్పటికప్పుడు నూతనముగా నుండును.

**కైవార గీత ప్రబంధములు**

**1. కైవార ప్రబంధము**

**నాటరాగము – రూపక తాళము**

పపసాసా – నిపసాసా – ననననివ –
ఝుఝుఝొంఝొం – తత్తఝొంఝొం – ఝొంతఝొంతత్త –
* * *
ససరిససరి – పసనసనిప – మపనిపా మమమమ
తత్తత త్తధిక్కి – తధిం ధిం క్కు – జకకుఝొం – ఝుఝుఝుఝు
* * *
మప – మపమమరిస – మపమమమరిస –
ఝుఝు – ఝొంతరి త్తకిట – ఝొంతరి తకిట –
* * *
సపససనస – మరిససనిన – రినససరిస –
ధాకిధాధాకిధ – ధళంధళం – ఝుఝుఝొంత్రఝొం –
* * *
సనిపస్పస – రీమామా – మరిససనిప –
త్రఝొంతరి – తంద్దాం – తాదిమికిట –
* * *
సపపపపప – పససససస – మాపా –
తుతుదుదుదుదు – తొడిడిడిడిడి – ధాంధాం –
* * *

మరినసరిగ – మరిసనిప – సససససని –
తుత్తరుత్తుత్తురు – ఝెంత్తరి త్తరిక్కి – తొద్గిటి ద్గిద్గిద
* * *

పనిపాపా – పపనినిసస – నినిసస్సని
ఝటిఝెం – ద్గణ ణ ణ ణ ణ ణ – ణ ణణంకిణ –
* * *

పససస్సని – పసపసపని – పమమమరిస
కిణణంక్కిణ – గంణంక్కిణ – కిణం త్తరితి
* * *

సస్సమపమమ – మరిసరిని – పమమమరిస॥
రి త్తరితలధ – ళంకుఝెంత్రి – ఝెంత్రిఝెంత్రి॥
* *

2 గీత ప్రబంధము

శంకరాభరణము [illegible]
సస్సని – సరిరిని – సాధపధప –
దిక్కిచిక్కిటిధిమి – ధిధిమిధిమి – తాక్కితక్కిథాం –
* * *

ధనిసా – సనిసరిగా – గరిగా – రిసరీ –
ధాంగా – ఝెంత్రా – ఝెంఝెం – వందాం –
* * *

సనిసా – ససపపపప – మపగమరిస –
డిండీం – తిణ ణ ణ ణ ణ – దుత్తుకుటుత్తుకు –
* * *

సనిధపమగ – గామాపప – పాపపీ –
తజజజజజ – భాక్తజన – పోషణా –
* * *

సాసనిధని – సరిగమరీ – గగరిసనీ – స్సరీసని –
రాజిత్రాయ్య – అత్యద్భుత – నరసింహం – శిత కే ఎఎ
* * *

పనినీసని – సధపమగమ – గమపద్దని – పద్దనిసా –
హోటఝరె – శరణ అగటి – జనరక్కిణ – పక్కిణతే –
* * *

సరిగమ్మరి – గరిమారిస – రీసనిసా – సాధపప్ప –
తెఎసత్తైన – తెంనాంతె – నాంతెంనాం – తేసతెన్న –
* *

పమగరిసని – సాసనిధని॥
తెఎఎఎసం – తేనంతెన॥
* *

పాపధాని – పాధనీస – నీసరిగ॥ నమ్మగరిగ–
తేఎతేన – తేసతేఎ – తెఎనఅ॥ అత్తైనతెఎ–
* *

సనిసరిగమ – పమగమప – ధ్దనిసా॥ పపసాదప–
తెఎఎనఅఅ – తెఎఎనఅ – తెఎనా॥ మునిసేవిత–
*

మపగరిసని – సరినిసదప – పామగరిస॥
మననహృదయ – అఅఅఅంత – రంగురెఎరే॥
* * *

గీతక్తైవాం ప్రబంధములందు మృదంగ శబ్దములతో కూడిన పదుసలు పాట రూపములో పాడబడును. ఆ పరుసల కను గుణముగ నృత్యమాడుదురు. ఇందు విశేషమేమనగా పాడునప్పుడు యెట్లయిన రాగములలో ఆరోహణ, అవరోహణ యుండునో, దాని ననుసరించి తాళ వాద్యములలో గూడ ధ్వనిలో ఆ భేదములు చూపబడును. ఆ విధముగనే నృత్తమందు గూడ ఆ ధ్వనిని గజ్జల యొక్క ధ్వనితో ననుసరించి హెచ్చు తగ్గుల భేదములు ప్రదర్శింప బడును. క్తైవారమందు మృదంగ శబ్దములు మాత్రము రాగములో పాడబడును. గీత ప్రబంధమందు పాటగూడ యుండును.

## జతిస్వరము, ప్రబంధము, శొల్లుకట్టు నృత్యములలోని భేదము

ఉదా:– 'తకిట, దికిట' అని గాని

'తక – తక' యని పలికించవలసివచ్చినప్పుడు ఆ అక్షరములను విడివిడిగ పలికింతుము. ప్రబంధములందట్లుగాక,

ఉదా:– పపసాసా – నిపసాస

ద్గుద్గుఝెంఝెం – తత్తఝెంఝెం

ఈ ప్రబంధమును పాడునప్పుడు 'ప' – 'ప' యే స్వరమున కా స్వరము విడివిడిగ పలుకక యెట్లు ఒక స్వరములో యింకొక స్వరమును ధ్వనిమూలకముగచేర్చునో, ఆ విధముగనే నర్తకుడు కూడ

'ద్గుద్గు ఝెం ఝెం'

అని నృత్తమాడినప్పుడు 'ద్గు' కు వేరుగ పాదముతట్టి ఆ పాదము అంతతో అఖరుయగునట్లు గాక 'ద్గు, ద్గు' లు రెంటికిని మధ్య విరామము లేకుండ ఏకమైన ధ్వనిని కాలితో పలికించుచు నృత్తమాడును. కనుక యిందలి శబ్దముల నృత్తము కేవలము పొటి అక్షరములవలె వినిపించక వీణా ఝుంకారము వలె వినిపించును. ఇట్లే 'శొల్లుకట్టు' నృత్యముగూడ యుండును.

నృత్తములో అంగవిన్యాసములు కూర్చు విధానము

మృదంగముపై కొన్ని జతులను పలికించునప్పుడు ఆధ్వని గాలిలో విస్తరించు విధమును బట్టి – అనగా ఆ ధ్వని వలయాకార

ముగ విస్తరించిన (Spreading) వలయాకార అంగవిన్యాసము. కోణాకారముగ విస్తరించినట్లున్నయెడల కోణాకార విన్యాసము. యెట్టి వంపులు లేక ఒక తిన్నని గీతవలె యుండిన ఆ విధము గను. అంగ విన్యాసము కూర్చబడును.

ఉదా :–

"తకిట దికిట తకిట దికిట"

ఆ ధ్వని

MΛ

ఈ విధముగ యెక్కుచు దిగుచు ఉన్నట్లుండును. కనుక యిట్టి నడకలన్నింటికి కోణాకార అంగవిన్యాసముండును.

"తరికిటతక దిరికిటతక"

G G

ఈ ధ్వని చక్రాకారముగ విస్తరించినట్లున్నను ఆరంభించు చోట కలియక ముందుకు సాగుచుండును.

" ధిర్గుడు ధిర్గుడు "

O O

ఇది వలయములుగ చుట్టుకొనును.

త ధీం గిణతోం

1 2 3

1 2 3

పై వి – మార్దంగికుడు మృదంగముపై శబ్దములను పలికించి నప్పుడు – ఆ ధ్వని గాలిలో యేవిధముగ ప్రస్తారము చేయుచు మన చెవిని చేరునో తెలుపుటకుగాను కొన్ని శబ్దముల యొక్క ఆకారములు చూపితిని. ఈ విధముగ ధ్వని ననుసరించి దాని యొక్క సంచార విధానము తెలిసికొని దానిని నృత్తములో అంగ విన్యాసమందు ప్రదర్శింపవలెను.

♦ ♦ ♦

## నృ త్య ము

### శ బ్ద ము

జతిస్వర నృత్తము తరువాత శబ్ద నృత్యమాడబడును ఈ శబ్దమందు –

కాంభోజ – త్రిపుట

తాకుఝంతరి । తకుంద । కుకుంద రి ।
కుకుంద । తకుందరి । తకుంద । కిట్రతక ఝంతరి ।
తకిట । కిటతక । తగిణ । ఝంతరి ।
తక్కిఝాంకిణ । తోంగిణ । తక ।
తక్కిఝాంకిణ । తోంగిణ ।

ము క్తా యి –

కిటతక ఝంఝం । కిటతిక ఝంతరి తా॥
సరసి జాక్షుడు । జలకమాడే । సమయమున ।
నీ వపుడకు చని । సరిగె చీరలు । మెల్ల చేకొని ।
పరుగువెత్తుట । న్యాయమా ? పరుగులెత్తుట
న్యాయమా ? తిరుపు లెక్కుట ధర్మమా ?
ఓరోరి నీ వగలేలరా ? ఔరౌరా నీ వగలేలరా?

♦ ♦ ♦

తోధిమ్మి గిణతిక । తతాతై య్యతక ।
తకుందరి । దికుందరి । తత్తాతై య్యతక॥

♦ ♦ ♦

పై విధముగ ప్రతి చరణమునను మృదంగ శబ్దములతో కూడిన జతులున్న పాటలును,

సురటి – ఆదితాళము

ప॥ చేరీ వినవె శౌరి చరితము – గౌరీ సుకుమారీ
గిరి వర కుమారీ॥

అ॥ వారిజాక్షుడంతటను శ్రీ మీరి వేడ్కతో నయోధ్యకు
గోరి పోవుదారిలో నృపవైరి యైన పరశురాముడు
కారు మొగుల కరణి చాపధరుడై
కాలమృత్యువో యనగ బంకిరథు
గేరి హరి యెదుట నిలిచి పలికెను
వీరాధి వీరుడని యెఱుంగక॥

♦ ♦ ♦

ఇట్లు ఆంగికాభినయమునకనుకూలముగ నుండునట్టి శివ, దేవి, రామ, కృష్ణ మొదలైన దేవతల వర్ణన గీతములు శబ్ద మందు పాడబడును. వానికి తగిన హస్తాభినయము ప్రదర్శింప బడును.

శబ్దనృత్యమందు సాత్వికాభినయము కన్న ఆంగికాభి నయమే యెక్కువగా నుండును. ఆంగికమునందు మనము పాడు పాటలలోని అర్థము హస్తములతో (ముద్రలతో, భంగిమలతో ప్రదర్శింపబడును.

'గోపాలా' అని అభినయించుచున్నామను కొందము. అట్టి తరి 'గోపాలా' అను పదము నెన్నియో విధములైన అర్థములు వచ్చునట్లభినయింపబడును.

గోపాల – గోవులను కాచువాడా

వెన్నదొంగా
కాళీయమర్దనము చేసినవాడా
గోపికా వస్త్రాపహారీ
గోవర్ధన గిరిధారి
పూతన సంహారి

బృందావన విహారి
గోపికా మనోహరి
మల్లయుద్ధ నిపుణా
కంసుని సంహారించిన బాలా
మురారీ
విచిత్రశాయి
శేషశాయి
రాధారమణ
నందకుమార

మత్స్య, కూర్మ, వరాహ, నృసింహ, వామన, పరశురామ, రామ, కృష్ణ, బుద్ధ, కల్క్యావతారములు ధర్మసంరక్షణార్థమెత్తిన వాడా!

పై అర్థములు వచ్చునట్లు హస్తములు పట్టబడును. వానికి తగిన భంగిమలు, చారి, కరణులు ప్రదర్శింపబడును.

**అటుపై కృష్ణునియొక్క బాలక్రీడలన్నియు వర్ణింపబడును.**

**ఈ విధముగ కీర్తనలలోని ప్రతిమాటయొక్క అర్థమును ఆంగికాభినయముతో ప్రదర్శించుట శబ్దములో చూచెదము. మధ్య మధ్య ఆ భావమున కనుగుణ్యముగ నృత్తము గూడ ప్రదర్శింపబడును.**

శబ్దనృత్యములోని అభినయమునకు, పదములు, వర్ణముల లోని అభినయమునకు భేదము తెలియక కొన్ని వేళలందు మనము రెంటిని ఒకటిగా భావించి భ్రమపడెదము. ఆ రెంటింటిలోని భేదములు కొన్ని చోట్ల అతి సూక్ష్మముగ నుండును. ఈ భేదములను వివరించుటకు ఉదాహరణముగ ఈ క్రింది శ్లోకమును పరిశీలింతము.

శ్లో॥ కస్తూరీ తిలకం లలాట ఫలకే
వక్షఃస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం
కరే కంకణం
సర్వాంగే హరిచందనంచ కలయన్
కంఠేచ ముక్తావళిం
గోపస్త్రీ పరివేష్టితో విజయతే
గోపాల చూడామణిః.

(1) "కస్తూరి తిలకం"

అన్నప్పుడు నర్తకుడు ముందు 'కటకాముఖ' హస్తములతో **కస్తూరి కలిపినట్లు అభినయించి, 'మయూర' హస్తముతో నొసట తిలకము ధరించినట్లు చూపును. శాస్త్రరీత్యా అభినయము సరిపోవును. శబ్దనృత్యమందు యింతవరకే చూపబడును.**

**కాని అభినయమునందు**

**(2) నర్తకుడు ఒక భక్తునిగామారి, ఆ భక్తుడు కృష్ణుని జూచినప్పుడు తనయందు గలుగు ఆనందము ఉల్లాసనేత్రములతో వెలిబుచ్చును. శ్రీకృష్ణ భగవానుడు కస్తూరి తిలకమును నొసట** ధరించియున్నాడని 'కటకాముఖ, మయూర' ముల సహాయముతో భక్తి భావము లొలుకునట్లు అభినయించును.

1వ అభినయమందు ఆంగికమునకే యెక్కువ ప్రాముఖ్య మివ్వబడుచున్నది. కాన శబ్దనృత్యమగుచున్నది.

2వ దానియందు ఆంగిక సాత్వికములుండుటచే నది అభినయమగుచున్నది.

శబ్దములో 'పక్కాణి దరువులు', 'సలాము దరువులు' గూడ నృత్యమాడబడును. (వీనిని గూర్చి 'కౌస్తుభ నృత్యము'లో వ్రాయుదును.)

◆ • ◆

**శబ్దములో నృత్యమాడబడే 'మండూక' శబ్దమును గూర్చి వ్రాయుచున్నాను.**

**"పొన్నమల్లెలు, పొగడపూవులు, సన్నజాజుల సంపతీ - పూల వాసన చాల గలిగిన" అను కూచిపూడివారి పాటతో గూడిన శబ్దముకంటె ఆనందగజపతిపై వ్రాయబడిన 'మండూక' శబ్దము చాల చక్కని రచన.**

**ఈ రచనను పాడునప్పుడు గాని, మృదంగములో పలికించునప్పుడు గాని కప్పల బెక బెక నాదములు, వడిగా వీచు గాలి ధ్వని, భయంకర మేఘ గర్జనలతో గూడిన వర్షపాతముల యొక్క చప్పుడు మనకు వినిపించును.**

**ఈ శబ్దము నాలుగు భాగములుగ నున్నది.**

1వ భాగము - జతితో ప్రారంభమై రాజునకు చేయబడిన అంకితముతో ముగియును.

2వ భాగములో వర్షము రాబోవు చున్నదని ఆనందముతో కప్పలు చేయు బెక బెక ధ్వనులు.

3వ భాగములో యుద్ధ మాదిరము.

1వ భాగము రెండు విభాగములుగా నుండి ప్రారంభములో వినబడే ధ్వనులు:

తరువాత వర్షము, గాలి, కప్పల బెక బెక ధ్వనులు, ఉండును.

అటుపైని వర్మాసముతో ముగియును.

ఈ రచన యొక్క నృత్యము అతి కష్టమైనది కనుకనే సాధారణముగ నెవ్వరును ప్రదర్శింపరు. ఇందులోని అడవులు. భంగిమలు, అంగవిన్యాసములు చూచినప్పుడు కప్పల యొక్క **నృత్యము. సుడులు తిరిగే గాలి యొక్క వేగము, వెండి తీగెలవలె ఆకాశము నుండి భూమికి జారు వర్షధారల అభినయము, అన్నియు మనకు కనులకు కట్టినట్లుండును.**

**ఈ రచనలోని కొన్ని జతులను మాత్రము యిచ్చట వ్రాయుచున్నాను.-**

**1వ భాగము.**
**తాంత । తక తదిమిత కిటదిమి ।**
**ధీంత । తక ధీంత । తక**

తదిమిత కిటదిమి।
తకిత। కిటకు। ధిమి.
తధీంగిణత। తధీంగిణత। తధిగిణ
రాజా। రవికులతేజా। విద్యల భోజా।
మహారాజ। ఆంధ్ర భోజా।
మండూక భరతనాట్య విశారద।
రాజాధిరాజ। పూసపాటి
ఆనందరాజ గజపతి। మహారాజ। జయ జయ॥

**మండూక శబ్దము**

టక్కు। ధిక్కు। దధింకుకు। దటి టీకు।
దధింకు। దటిటికు। ధింకుకు। ధటిటికు
ధెకుకు। ధెకుకు। ధెకు। ధెక్కుకు। దడి డికు
------------------------------------
------------------------------------
టకుధెకు। టకుధెకు। టకుధికు। టకుధెకు
ధెకుధెకు। ధెకుధెకు। ధెకుధెకు। ధెకుధెకు।
టకుధికు। ధింకుకు, దెకుకు। టకుకు।
దధింకు। దటిటికు
దధింకు। దటిటికు ధిం।

**ఝుంఝూ మారుతము**

రింఝు। రింఝు। రిరి। రింఝణ। రింఝణ
రిరింఝు। రింఝణ। రింఝణ। ఝణఝణ
------------------------------------
------------------------------------
రిర్రిరి రింఝురి। రిరింఝ। రింఝరి
రిర్రిరి। రిర్రిరి। రిర్రిరి। రిర్రిరి
.................................
ఝేకు। ఝేకురే। ఝగణ। ఝఝగిణ
ఝగగణ। ఝగనగ। ఝగఝ ఝఝగిణ
గణగణ గణగణ। గణ ఝక్కుణ కిణ
కిణకిణకిణ గణగణ గణగణ
------------------------------------
------------------------------------

**వర్షము హోరు**

రేహుంరేహుంరే। రేహుంరె। రేహుంరె
------------------------------------
హుంరే హుంరే హుంరే హుంరే
రేహుంరే రేహుంరే రేహుంరే రేహుంరే
హుంరే రేహుంరే హుంరే రేహుంరే
.................................
.................................

**కప్పలనాదము**

తగనగ నగనగ – డెగడెగడెగడెగ
ఝగఝగఝగఝగ – ఢీకుఢికుఢింకుకు
.................................
తగం – నగం – డెగం – ఝగం

**వర్షము**

గణగణగణగణ – ధళాంగ్ ధళధళధళ
ఛళఛళఛళఛళ – ధిరుదు ధిరుదు
ధళధళధళ –
.................................
.................................

**తీర్మానము**

టక్కుట కిటతక – ధిక్కుట కిటతక
తాంగిట కిటతక – ఝంగిట కిటతక
ధళత ధళత ధళ – ధళధళధళధళ
ధళ్లం ధళాంగ్ ధళత దదింగిణ తోం.

ఈ రచన చాల పెద్దది యగుటచే పూర్తిగ వ్రాయక దాని సొగసును తెలుపుటకుగాను అక్కడ కొన్ని జతులను యెత్తి వ్రాసితిని. మరియు దీనికి స్వరము (పాడువిధము) గూడ వ్రాయ లేదు.

♦ ♦ ♦

**లావణి**

అంత్యప్రాసగలిగి లయప్రాధాన్యత గల ముచ్చటైన రచన లావణి. ఇట్టి రచనలు మహారాష్ట్ర భాషలో విరివిగా నున్నవి. ఈ రచనలు ముఖ్యముగ నృత్యమున కుపయోగించునట్టివి.

తమాషైనది రా చిన్నది
దాని తలంపు నీపై నున్నది
అది నమామి నీకే నన్నది
మంచి నాణ్యమైన మేల్వన్నెది ॥ రా బల్ ॥

♦ ♦ ♦

నమూనైన తానమూ
గలయు గానమూ
స్వాభిమాన మూదిరా
తమూలంబు చిత్తము
మిసిమి అమృతము
మదన ప్రాంతముదిరా ॥బల్॥

♦ ♦ ♦

నడాహంస – గున్నడాయు పిడికిట
నడాడుగా వన్నెడాగుగా
బడాయించు – గబ్బిడాలు ఛమల
విడారు తుమ్మెద – విడారు ॥బల్॥

♦ ♦

ఇంత పరాకేల నిలుపరా
మనసు సాపరాధి యెశ
దాపరాదురా
పరావ శ్రీ వెసం పట్నా మేశ్వర
వినుత దేవరాజ పూజిత ॥చర॥

* * * *

శబ్దనృత్యము యొక్క విశిష్టతను తెలుపుటకుగాను వసంత వర్ణన గురించిన గీతమును వ్రాసి ముగించెద.

గీతము

"విపి శాంతి సుఖ నిరంతరం
వసంత సమయం"

వసంతాగమము —

సంపూర్ణముగ నిశ్చలముగ నున్న ప్రకృతిలో చైతన్యము గలుగును.

వసంతశోభ —

(1) మోడ్లుగానున్న చెట్లు చిగుర్చును.

(2) వృక్షములు, లతలు, పుష్పలు, మొగ్గలలోనిండి కనులపండువుగా నుండును.

(3) చెట్లు మొగ్గలు దాల్చుట, మొగ్గలరేకలలో ఒక్కటొక్కటే వీడి పుష్పములు వికసించుట (ఇందు నేత్రముల, హస్తముల అభినయము గమనింపదగ్గది)

(4) మలయమారుతము లేతరెమ్మల, ఆకుల, పువ్వుల కదలిక

(5) పుష్ప పరిమళములు ప్రకృతిలో ప్రసరించుట

(6) పుష్పమకరందము గ్రోలుటకు భ్రమరములు వచ్చుట.
భ్రమరి నడకలు — నృత్తము.
భ్రమర హస్తము — మార్పులు ప్రదర్శింపబడును.
భ్రమరములు తేనెనుగ్రోలుట

(7) గుబురు కొమ్మల మధ్యదాగిన కోయిల కోకోరవములు,

(8) మామిడిచెట్టువద్ద రమణులమన్మథపూజ —
కౌరంగి నృత్యము.

(9) మన్మథ ప్రవేశము.

(10) పంచబాణ ప్రయోగము (సంధించు విధానము)

(11) బాణములు పడునప్పుడు నాయిక అవస్థలు

♦ ♦ ♦

పైన వ్రాసిన అంశములన్నింటిని అభినయించుటకు ప్రతి అర్థమునకు కొన్నిముద్రలు, చారులు, భంగిమలు, కరణులు, అంగహారములున్నవి. శబ్ద నృత్యమునందు ఆ భంగిమలు, గతులు అన్నియు ప్రదర్శింపబడును.

ఉదా :-

మన్మథ ఆగమనము

మన్మథ హస్తము పట్టి — అతని ఆగమనము తెలుపుటకు ఒక ప్రత్యేక గతిలో నృత్యమాడవలెను. ప్రతి బాణమును సంధించునప్పుడు ముద్రలే గాక శరీరగతి. భంగిమలు కూడ మారును. ఇట్టి నిబంధనలు శబ్ద నృత్యమందు మాత్రమే పాటింపబడును.

ఇదియే మన్మథాగమనము. అభినయము (పదాభినయము) ప్రదర్శించునప్పుడు నృత్యమాడరాదు. మరియు చారి, కరణ నిబంధనలు పాటింపక స్వభావికమైన సాత్వికమునకు ప్రాముఖ్యమువ్వవలెను.

—0—

## (వర్ణము) పదవర్ణము

శబ్దము తరువాత చేయబడు ముఖ్యమైన నృత్యవిశేషము పదవర్ణము.

ఇది అభినయ, నృత్య, నృత్తములతో గూడిన సంగీత రచన. పల్లవి, అనుపల్లవి, ముక్తాయి, స్వరము, చలనములు గలిగి పల్లవి, అనుపల్లవికి అభినయము, ముక్తాయిలోని చరణములోని స్వరములకు నృత్తము, సాహిత్యమునకు నృత్యము యుండును.

ఉదా :-

శంకరాభరణము — రూపక తాళము

ప॥ వనజాక్షిరో । వాని పనకు రమ్మనే ॥
అ॥ ఘనుడైన అమర సింహేంద్రుని
పర తనయుడౌ శ్రీ ప్రతాప సింహేంద్రుని ॥

ముక్తాయి

రీరీరీ । రిగమపసా ॥ పామగరిస । సరీగమప
వేవేవే । గమెయిటురా । రాదయనుచు । ప..శగొని
రిగామపధ । గమాపధని । మపాధనిస ।
విరానగని । కరానపిల । వినాగరిమ ।
సీగ్గ రి । నీ్రన । నీస్వని । పాదని ।
ఏలర । సామిగ । యింతనే । వేడితె ।
సాధపామా । పామాగారి । గారిసాని ॥ } వన జాక్షిరో
జాలమిక । చేయతగు । నాయిపుడు ॥ }

♦ ♦ ♦

చ॥ రావే మనవి దెలిపి నా వాడెటుల బలికె ॥
(2) ఈ మారుని వెతనే నయిప తరమ విను ॥
(3) దురుసుగ అరవిరి శరములు విరతము గురియగ నా తరమ ॥
(4) ఈ మలయమారుతముడు యుదియ వేళనుచు
చిలుకలు కలకల మనుచును కూయగ విని తాళవశమ ॥

♦ ♦ ♦

ఇందు పల్లవికి అనుపల్లవికి సాత్విక ప్రధానమైన అభినయము ప్రదర్శింప బడును. ముక్తాయి స్వరము
'వేవేవే । గమెయిటు ..........'
సాహిత్యమునకు నృత్యము

ముగిసిన చరణములలోని స్వరములకు నృత్తము, సాహిత్యమునకు నృత్యము చేయబడును. ఈ పదవర్ణములు విలంబిత లయలో నుండును.

పదవర్ణమునకు —

ఒక గీతములో వర్ణింపబడిన నాయికా భావమును స్పష్ట పరచుటకు మరికొన్ని వివరములను సంచారులతో వర్ణించుట.

ఉదా :- 'వనజాక్షిరో వాని సరసకు రమ్మనే

ఎందులకు ?

"ఈ మారుని వెత నే సయిప తరమ"

మరియు దురుసుగ అరవిరి శరములు వేయగ నే తాళలేను అందుచేతను

"మలయ మారుతము హాయిగ వీచుచున్నది.

చిలుకలు కలకలమని కూయుచున్నవి."

ఇట్టి సమయమున నేను ఈ యెడబాటును సహింపలేను — కనుక ఓ చెలీ ! వాని రమ్మనే —

'ఏలనె । యిటుల । చలము । నాపై । వెలుప । మననె ।
ఏమి । నేరము । నే జేసినా । నమ్మచు ।
ఇంత । పంతము । సాధించి నట్లాయె ।
అతడే నాపై దయతలచినచో —
"ఇంక । నాపై । దయ । వచ్చి । నన్నే । లితే
పచ్చ । విత్తి । డెట్లు । వచ్చునె । చెలియ ।
కనుక

"ఓ చెలీ ! నా నాధుని రమ్మనవే

ఈ విధముగ ఆ నాయిక యొక్క అవస్థలన్నియు వివిధ సంచారులతో వర్ణింపబడి నృత్త, నృత్య, అభినయములతో గూడిన సంగీత రచన పదవర్ణ మనబడును.

* * *

## తానవర్ణము

ఒక భావమును ముందు గానముచేసి, దానినే స్వరము లతో వివరించుట తానవర్ణము. ఈ రచనలు పాటకశ్రేణిలలో సాధారణముగ పాడుదురు. ఈ రచనకు పల్లవి, అనుపల్లవి, చరణ ములందు మాత్రము సాహిత్యముండును. తరువాత స్వరము లుండును.

ఉదా:- ప॥ వనజాక్షిరో ఈ విరిహమోర్వనె
వాసుదేవుని తోడి తేవే॥

అ॥ వినవే నాగపురమున వెలయు సౌందర్యరాజుని॥

చ॥ నిలుపరాని మోహమాయె॥

"వనజాక్షిరో" అని ప్రారంభములో ఆ విరహోత్కంఠిత నాయిక యొక్క విరహవేదన, ఆత్రత, ప్రియుడు ఇంకను రాలే దను విసుగు, రాడేమోనన్న శంక, విచారము, దుఃఖము, నిస్పృహ యలి, నిరాశ ఇటి భావములన్నియు అభినయించి చరణాంత భావములను రంజింపజేయు విషయమగ — చరణ మభినయించి తరువాత పాడబడే స్వరములకు నృత్తమాడవలెను.

అనగా —

చ॥ నిలుపరాని మోహమాయె॥

(1) పా మాగారీ — ధా మాగారీ — నీ సారీ — గామా పాధా॥

(2) పా ధపా మగమ — పామగారి సని —
సారి నీ సదని — సారి గామ దని॥

ముందు

'నిలుపరాని మోహమాయె'

ఈ మాటలలోని భావము నభినయించి — ఈ భావమును పోషించు విధమున — (1), (2) స్వరములకు నృత్తమాడవలెను. ఇందు వివిధ భావములు ప్రదర్శించుటకు అభినయమునకు జీవమైన పాట వుండదు. కనుక స్వరములనే (ధ్వని లేక నాదము) ఆధారము జేసికొని నృత్యము చేయవలెను. అందువలన తానవర్ణము విజయవంతముగ నృత్యమాడవలెనన్న కేవలము స్వరజ్ఞానము, రాగ తాళలయ జ్ఞానమేగాక ఆ స్వరముల యొక్క ప్రభావము (effect) - ఆ స్వరముల నొకటొకటిని పాడునపుడెటువంటి భావోత్పత్తి కలుగునో, వివిధ విధములుగ జేర్చి పాడిన నెట్టి భావ ముత్పన్నమగుచున్నదో, ఈ విజ్ఞానము సంపూర్ణముగ గలిగి యుండవలెను.

ఉదా :-

సరిగమపదని —

ఈ సప్త స్వరములు ఒక్కటొక్కటే పలికినచో నెటువంటి భావము పుట్టునో వివిధ విధములుగ చేర్చి పాడిన నెట్టి భావ ముత్పన్నమగునో ఒక ప్రత్యేక భావము ప్రేక్షకులలో కలుగవలె నన్న స్వరములను ఏ విధముగ పాడవలయునో మొదలగు ధ్వనిని గూర్చిన సమగ్రమైన జ్ఞానము గలవాడే, ఆ స్వరములలోని భావ మును నృత్యమును ప్రదర్శింపగలడు.

## స్వరజతి

ఇది వర్ణముకన్న కడు సులభమైన సంగీత రచన. ఇందు నృత్త నృత్యములు పదవర్ణము నందు వలె యుండును.

కల్యాణిరాగ స్వరప్రస్తార వర్ణము

నీ సాటి రాజ శిఖామణిని నిఖిల ధ । రాస్థలి గానరా
పూసపాటి సీతారామ రాజేంద్ర । భోగదేవేంద్ర
సద్గుణ సాంద్ర ।
నిసగా । రిధణం । తక పధమప ధీనుతకిట । పధనిప ।
ద్రిమి । దనిద ఝెణుత । గమపధ । తకధణాం త్తధా । ధనిసరి ॥

తదిమిత । కిటతక । ఝం [illegible]॥ సా॥
సారిగమప । [illegible] । గమపద । [illegible] । [illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible] । [illegible] । మగరీ । [illegible]॥
నిఖిల॥ [illegible] । [illegible] । [illegible] ।
సారిగమప॥ ధరాస్థి॥
గమప । [illegible] । గగనిధపప । గధపమ నిధపధమప ।
గమపధ । [illegible] । గాసరా । [illegible] । గగరీమమగా ।
దదపా । ససని । రిరిస । గగరి । సనిదనిదప । పమగరి ।
సాప్పా । మగరీ । గమప । పమగమరిగ । సరిగమపధ ।
పమగారీ । గమ॥ పాటసీతారామ॥ గమపా । ధపధా । ధపమ
గమపధపమ । గగరి । పపద । దదప।నిదపపదా॥రాజేంద్ర॥ఖో॥
గరిరిగ । సరినిస । దనిదసనిసరిస । గరిసనిద । గరిసని। ధనిసని॥
గ॥ దేవేంద్ర॥సరిసని।ధనిసరినిస । ధనిసాస్సా నిధపమగరిగిసని।
సారిగమపధని॥ సద్గుణ॥ సనిధప । నిధపమ । గమపధ॥
గామపధని । పధని । పధని । ధనిసరి । ధరిసని॥ సాంద్ర॥

* * *

## పెద్దవర్ణము లేక చౌకవర్ణములు

పద వర్ణముల కంటె విలంబితలయలో నుండి, పద వర్ణముల కన్న యెక్కువ చరణములు గలిగి తాళ, లయల యందు బిగి యుండి, నర్తకుడు అభినయ నృత్య నృత్తములందు తన పాండి త్యము జూపుట కనుకూలముగ నుండునట్టి సంగీత రచనలు. ఈ పెద్దవర్ణము సమర్థుడైన నర్తకుడు మూడు నాలుగు గంటలు నృత్తమాడవచ్చును. ఇందనేక గతులలో రచింపబడిన స్వరము లుండును. ఈ వర్ణములోని పల్లవిని త్రికాలములలో నాడెడి వాడే పండితుడు.

ప్రఖ్యాతి వహించిన 'మోహన' రాగములోని పెద్దవర్ణమును గురించి యిక్కడ కొంత వ్రాసెదను.

## మోహన — ఆదితాళము

ప॥ సరిగా దానిపై నెనరుంచి నీ సరసకు రమ్మనరా॥
అ॥ సారసాగ్రేసా సద్గుణ సాంద్ర భూమి
శ్రీ వెంకట పెరుమాళ్ రాజేంద్ర

* * *

ము క్తా యి —
గగరీగ । సరిగ । సరిసగరి । రీస । ధసపాస । దాసపదధగగ ।
విరిబోణి।నెనయ। మికచెలిమి। మీర। విటరాయ। లేరచనువానగ।

* * *

రీసరిగరీగ । దగరిరీస । సపధ సారిగరి । రిగపరిరిగస ।
లేర కరుణించి । కవుగిలిస । పలుకతేనెపై । [illegible] ।

* * *

రిరిగ [illegible] । [illegible] । [illegible] । [illegible] । [illegible] ।
[illegible] । [illegible] । [illegible] । [illegible] । [illegible]

* * *

రిసాసరీ । గదపధస । పగరధప । పధాసాస ।
ధిరంబుచే । నెరచి నిను । కరుణించ । విచారించ ।

* *

సరిగరీ । రి । సధపగరి । గపధగరీ సరిస ।
పవురయొం । త । విరిచినను । పలుకవదే మిసామి ।
సరిసధా । ధసధదపా । దధసదధరి । ధగరిగరిస ।
నెరలనమా । దొరతనమా । అలుకపలదు । చలముతగదు ।

* * *

రీరిసద । పధగరిస । సాధసా । సపా । దగాగపా । పగరిసధా ।
నీమొతల । సదినిరప । రాధిరా । ధరా । పురందరా । నరసకురా ।

* * *

గరిసదా । ధసపధగప । గధపసధపగరి॥
రసకరా । యికచెలువున । మునుపటివలెనె॥ సరిగా॥

* * *

## స్వరము, సొల్లు

గగరీగ । సరిగ । సరిసగరిరీస । ధసపాస । దదాస ।
లిలరొయుంత । దణత । జెణుతకుదణాంత । రితిరొయుం । తకుంత ।

* * *

పదదగిగరిస । రిగరీగ । దగరిరీస । సపదసా ।
లికకిణతయుంత । దణయుణ । కిణత్తరొయ్యి । తకకిణా ।

* * *

రిగరిరిగ । పరిరిగ । సరిరిగ ।
తకదణత । తయొణుత । తదిమిత ।

* * *

పూర్వము వెంకటగిరి సంస్థానములో ఈ పెద్ద వర్ణమునకు చర్మకట్టు వాద్యము తోడ నృత్యము సలుపబడేది.

చర్మకట్టు వాయిద్యమనగా —

దేవుని ఊరేగింపు సమయములో — సుమారు పండ్రెండు గురు డోళ్లు, పండ్రెండుగురు సన్నాయి, రోడ్డున కిరుప్రక్కల ఒకరి కెదురుగా నొకరు బారులు తీర్చి నిలబడెదరు. వారికి మధ్య యేబది, అరువది మంది దేవదాసీలుందురు. వారికి వెనుక నట్టువులు తాళము వేయుచు నిలబడుదురు. సన్నాయి పాటకులతి విలంబిత లయలో,

'సరిగా దానిపై నెనరుంచి — నీ సరసకు రమ్మనరా' అను పల్లవిని ప్రారంభింతురు. డోలు వాద్యకులు ఆ లయలోనే మొదలు

పెట్టి పల్లవి ముగియులోగా మూడు కాలముల శబ్దములు పలికించి జాగాకు వత్తురు. మధ్య నిలబడిన దేవదాసీలు ముందా భావము నభినయించి తరువాత దోళ్ళలో పలుకుచున్న కాలపై కాలములలో నృత్తమాడి మరల పల్లవికి వచ్చి అభినయము చేయుదురు. పంద్రెండు దోళ్ళు, సన్నాయిలు, నర్తకులు అందరు కలసి ఒకే సారి త్రికాలములను ప్రదర్శించి ఒక్కరు గూడ లయ తప్పక జాగాకు వచ్చుట యెంత కష్టమైన పనియో మనకందరకు తెలిసిన విషయమే. ఈ విధముగ వాయించగలవారు నేటికినీ వెంకటగిరిలో నున్నారు.

—0—

# అభినయము - సాత్వికప్రధానము

శృంగార రసప్రధానమై, నాయికా వర్ణనలతో కూడియుండి, సాత్విక సంచారి భావముల నభినయించుట కనువైనట్టి విలంబిత లయలో నుండు సంగీత రచనా విశేషములు పదములు.

క్షేత్రయ్య, అన్నమయ్య, సభాపతి, మాత్రు భూతేశులు, వీరభద్రయ్య, సారంగపాణి మొదలైన వారి పదములు,

పరిమళ రంగ, మన్నారు రంగ, యువ రంగ, కస్తూరి రంగ, వెంకటేశ, శివరామపుర, ఉడుపల్లి గోపాల ముద్రగల పదములు,

జయదేవుని అష్టపదులు, కృష్ణకర్ణామృత శ్లోకములు, పుష్పబాణ విలాసములోని శ్లోకములు, త్యాగయ్య, పురందరదాసుల కీర్తనలు; జావళీలు మొదలైన సంగీత రచనలలోని భావము సాత్విక ప్రధానమైన అభినయము ద్వారా ప్రదర్శింపబడును.

* * *

**పదములు – వాని నభినయించు విధానము**

పదాభినయమందు మనము ముఖ్యముగా గమనింపవలసిన విషయములు –

అభినయ విధానములు – లోకధర్మి, నాట్యధర్మి.

**చతుర్విధాభినయము –**

ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్వికము.

కావలసిన హంగులు – రంగస్థలము, రంగాలంకారము, వంతపాట.

* * *

**(1) ఆంగికాభినయము**

పదాభినయమందు సాత్వికము ప్రాధాన్యము వహించును. ఆంగికమునందు ముఖ్యమైన హస్తాభినయము (ముద్రలు) యెక్కువగా నుండవు. భంగిమలు ప్రదర్శించు సమయములందు గూడ అవి కదలుచున్న శిల్పముల వలె నుండును. కాని నృత్యమునందు వలె యెక్కువగ కోణములను గలిగియుండవు. అశ్రువులు, స్తంభము, స్వరభేదము, స్వేదము, కంపము, వైవర్ణ్యము, ప్రళయము, రోమాంచము – ఈ యెనిమిది సాత్విక భావములు ముప్పదిమూడు (33) సంచారులయొక్క ప్రదర్శనతో శృంగార రసప్రధానమైన పదాభినయము నిండియుండును.

శబ్దనృత్యమందు ఆంగికముతో ఆగీతములోని భావములు ప్రకటింపవచ్చును. పదములందట్లుగాక ఆంగికము, సాత్వికము కలసినగాని అభినయము సంపూర్ణత్వము నొందదు.

* * *

**(2) వాచికము**

పదములను భావపూరితముగ అభినయించుటకు వాచికము చాల ముఖ్యము. పాటకుడు పదము పాడునప్పుడు రాగతాళములకే

ప్రాధాన్యమివ్వక, ఆ పదములోని భావమునకు తగినట్లు కంఠమును హెచ్చు తగ్గులుగ సవరించుచు, ధ్వనిలో మాధుర్యమును కనబర చుచు, పదములోని భాష ప్రేక్షకులకు అర్థమగునట్లు పాడవలెను. (Emotional type of Music).

ఉదా :— "కమ్మ విల్తుని గన్న చక్కని మువ్వ గోపాలుని
రమ్మనవే సముఖాన రాయబారములేలే"
వితర్కం దైన్యం

"రాయబారము లేలే"

అన్నప్పుడు వితర్కం, దైన్యం. — ఈ రెండు సంచారులను పాటకుడు ఒక గాత్రములో చూపవలెను గదా — కనుక 'రాయ బారము లేలే' అన్నప్పుడు ఆ రాగ స్వరూపము మారకుండ ప్రథమ ములో గొంతును కొంచెమెత్తి పాడి మరల దీనత్వ మొలుకునట్లు గొంతును తగ్గించి పాడినచో నర్తకి చేయు అభినయములోని రసము గానము ద్వారా పోషింపబడి, ప్రేక్షకుల కభినయ మతి సులభముగ నర్థమై, నానా రసము ననుభవింపగలుగుదురు. అభి నయమెంత ముఖ్యమో, దాని ననుసరించి పాడు పాటకుని గానము కూడ అంత ముఖ్యమే. పాటకుడు రాగ తాళ లయలనే గాక సాహిత్యములోని మాధుర్యము నర్థము జేసికొని, అనుభవించి అభినయములోని సంచారులను బాగుగ నెరిగినవాడై అనుసరించి పాడవలెను. (ఇది నట్టువపని) మార్దంగికుడు లయ ప్రధానముగ మాత్రముగాక ధ్వని ప్రధానముగ మృదంగము పలికింపవలెను.

* * *

## (3) ఆహార్యము

పదాభినయమందు నేటి భరత నాట్యాచార్యులు నాయికకు తగిన ఆహార్యమును ధరింపజేయుటలేదు. ఏదియో ఒక చీరెను గట్టి ఆ పదములోని నాయిక కినువుగ యున్నదని ఊహించుకొన మనుచున్నారు. అందుచేత ఆ పదములలోని నాయికల స్వరూ పము యిట్టిదని స్పష్టముగ మన మూహింపలేకపోవుచున్నాము. కనుకనే అభినయము చూచినప్పుడు పొందవలసిన రసానుభూతి కొరతపడుచున్నది.

ఉదా:—

జ్యోత్స్నాభిసారిక అభినయమందు — తళ తళ మెరసే టిస్యూ (Tissue) చీరె యే రంగుదైన కట్టి, తన కున్న ఆభరణ ములు ధరించి అభినయించుటకు బదులు, జ్యోత్స్న — శ్వేతాంబర ధారిణియై చందన మలదుకొని, ముత్యాలసరములు, మల్లెపువ్వులు, అలంకరించుకొని —

ఆ పదము నభినయించిన, నాయిక యొక్క స్వరూపము మన హృదయములో హత్తుకొని మనకు పరిపూర్ణానందమునిచ్చును.

ఒక్కొక్క పదములోని భావమునకు, నాయికకు సరిపడు నట్లు ఆభరణములు, వస్త్రములు, కేశాలంకారములు, ముఖమునకు రంగు, రంగాలంకారము మొదలైన విషయములలో శ్రద్ధ వహిం చనిచో ఆ నాయిక యొక్క వాతావరణమును సృజింపలేము. కనుక ఆహార్యము నాయికాభినయమందు ముఖ్యము.

* * *

## రంగస్థలము

పూర్వ కాలమునందు వలె దేవళములలో నభినయించుటకు గాని, ఏదో ఒక చోట పందిరి వేసి కాగడల వెలుగులో నాట్య మాడుటకు గాని, మేజువాణీలుగాని నేడులేవు. ప్రదర్శనమిచ్చిన చోట మనము స్టేజిని యేర్పాటు చేయుచున్నాము. విద్యుచ్ఛక్తి దీపముల ముందు ప్రదర్శన మిచ్చుచున్నాము. కాని సాధారణముగ తెరల యేర్పాటులో నలుపు లేక ముదురు నీలపు రంగులలో తప్ప యింకొక రంగు మీదికి మనస్సు పోవుటలేదు. పై రంగుల తెరలు యితర నృత్యముల కెంత అనుకూలముగ నున్నను, రసభరితమైన పదాభినయమందు మాత్రము తెరల యొక్క రంగుల విషయమై కొంత ప్రత్యేక శ్రద్ధ వహించవలసిన ఆవశ్యకత యున్నది. పదములలో ప్రధానరసము, స్థాయీభావము, సంచారుల కనుకూల మైన వాతావరణము సృష్టింపవలయునన్న, ఆ రసమునకు తగిన రంగులలో తెరలు తయారుచేసికొనవలెను.

## (4) సాత్వికము

నాట్యధర్మి, లోకధర్మి నెరిగిన వాడే పదాభినయము చక్కగా చేయగలడు. సాత్విక భావముల నభినయించుటకు లోకధర్మి సహాయ మత్యావశ్యము.

నాయికాభినయములో ఒక సంచారి భావమును యెంతవర కభినయించిన ఉచితమో, ఆ నాయిక యొక్క స్వరూపము చెడ కుండ పోషించుట కుపకరించునో, అంతవరకు తీసికొనవలయును గాని శాస్త్రములో చెప్పిన విధానము లన్నిటిని అభినయించినచో రసాభాసయగును.

ఉదా :— కమ్మవిల్తుని గన్న చక్కని మువ్వగోపాలుని
రమ్మనవే సముఖాన రాయబారము లేలే''

రమ్మనవే సముఖాన రాయబారము లేలే

ఔత్సుక్యం గర్వం వితర్కం దైన్యం

ఇందు 'దైన్యము' నభినయించుచున్నామనుకొందము. మనస్సులో ఉత్సాహము లేకుండుటయే దైన్యము. దీనత్వమే దైన్యము. దైన్యము — దుఃఖము, మనోవ్యాధి, రోగము, దారి ద్ర్యము, మనస్సు వ్యాకులపడుట వీని వల్ల గలుగును. వీని నభిన యించు విధము.

(1) బలము విడుచుట (2) అతిశయపడుచుకొనుట.
(3) మాటలయందు, నేత్రములందు పేదరికము.
(4) శరీరము ముకుంచుకొనుట.
(5) నమస్కరించుట (6) వేడుకొనుట.

పైన జెప్పిన ఆరు విధములలోనే యే భావముల నభిన యించిన 'రమ్మనవే సముఖాన రాయబారము లేలే' అన్నప్పుడు మన కుపయోగించునో ఆలోచితము.

*ఖండిత నాయిక*

సామాన్య, ప్రౌఢ, వక్రోక్తి, గర్విత.

అభియోగమునకు వైన్యమునకు ముందు 'వితర్కము' నభిన యించుచున్నాము. కనుక పైన చెప్పిన ఆరు విధముల నభినయిం చుట సమంజసముగ నుండదు.

కనుక (1), (2), (3), (4), (5), (6) ఈ నాయిక వర్ణ్య మునకు సరిపడవు.

ఇక మిగిలినది మాటల యందు, నేత్రముల యందు పేదటి కము. మాటల యందు పేదటికము వాచికమునకు సంబంధించినది. కనుక వంత పాటకుడు అనుసరించవలెను. కావున నేత్రములందు పేదటికము మాత్రమొప్పును. కాని ఈ నాయికయందు రేఖా మాత్రముగనైన దైన్యమొప్పునా? అని సంశయము కలుగ వచ్చును. ఇట్టి సమయమునందే మనకు 'లోకధర్మి' ఉపకరించును. ఈ నాయిక యందు మనము ఔత్సుక్యములో ప్రారంభించి, గర్వం, వితర్కం అభినయించితిమి. తరువాత పసిపిల్లలు గారాబము చేయు నట్లు ముద్దుగ ఒక్కసారి 'రాయబారము లేదే' అని ముఖము పెట్టి కొంచెము జాలిగ ద్రుక్కులనుంచి అభినయించి ముగించిన నాయిక మరింత చక్కగ పోషింపబడును. ఈమె సామాన్య గనుక ఆ భావము పట్టిన గూడ దోషముండదు.

పదాభినయము కూర్చునప్పుడు మనము ముందుగ ఆ పదము నంతయు బాగుగ చదివి, ఆ పదములో వర్ణింపబడిన నాయిక, స్థాయి, సాత్విక, సంచారి భావములను గూర్చి క్షుణ్ణముగ నాలో చించి, ఏ యే సంచారులను, ఆ సంచారులలోనే యే భాగముల నెంతవరకు అభినయించిన ఆ నాయికను పోషించుట కనుకూలిం చునో గుర్తుంచుకొని వంత పాటకునికి గూడ ఆ భావము ననుస రించి కంఠము సవరించి పాడునట్లు అభ్యసింపజేసి అభినయించుట చాల ఆవశ్యకము. అట్లు చేయనిచో ఆ నాయిక యొక్క స్వరూప మును సృష్టించలేము.

* * *

హస్తాభినయములో కొన్ని సమయములందు చేయు పొర పాట్లు :- అందు సాధారణముగ పట్టెడి శిఖర హస్తమును గూర్చి వ్రాయుదుము.

అభినయమునందెవరినైన ప్రశ్నించునప్పుడు ఎవరు, ఏమిటి, మొదలైన మాటలయందు కుడిచేత శిఖరము పట్టి, తలను ప్రక్కలకో ముందునకో, ఆడించి బొమ ముడితోనో, బొమల నెగురవేయుటతోనో ముగింతుము.

ఉదా :- "వివరింపుమమ్మా యీ విధము దెలిపి యిపు
దెవరి వల్ల దుడుకు?"

"ఎవరి వల్ల" – అన్నప్పుడు శిఖరహస్తమును ప్రదర్శిం చుట సమంజసముగనే యుండును.

కాని

"మువ్వగోపాలుడు మోడి చేయుచున్నాడు
*మొన్నటాల నుండి రాడు, నీ తోడు.*
నే నెవ్వరి నందుదు"

ఇప్పుడు – "ఎవ్వరి" – అన్నప్పుడు [illegible]
[illegible]

[illegible] 'ఎవ్వరి' [illegible]
ప్రారంభించి [illegible]
వికసింపజేసి [illegible]
లకు మెల్లగ నాటించిన ఆ భావము చక్కగ వెల్లడి యగును. అభిన యము కూడ సహజముగ నుండును.

సాత్విక భావములైన – గగుర్పాటు, అశ్రువులు – మొద లైన వానిని,

(1) రంగస్థలముపై నభినయించునప్పుడు,

(2) ఏదైన హాలులో నాట్యము చేయు పాత్రకు దగ్గరగ ప్రేక్ష కులు కూర్చుండి నప్పుడు – అభినయించవలసిన విధానము.

స్టేజిమీద అభినయించునప్పుడు ప్రేక్షకులు మనకు దూర ముగ నుందురు. రోమాంచము మొదలగు భావముల నభినయించు నప్పుడు ఆఖరులో కూర్చున్న వారికి మన శరీరముపై గలుగు మార్పులు గనపడక, అర్థముగాక కొన్ని వేళలందు విసుగుదోచును. ఇది సహజమే. ఎందుకనగా సామాన్యస్థితిలో నున్న శరీరమును పులకాంకితము వరకు నభినయించుటకు తయారవవలెనన్న కొన్ని యవస్థలు మారుటకు కొంత సమయము పట్టును. కొన్ని భావము లను క్రమేణ అభినయించిన గాని ఆ స్థితికి పోలేము. దగ్గరగ నున్న వారికి ఈ మార్పులన్నియు చక్కగ కనబడినను, దూర ముగ నున్నవారు వాని ననుభవింపలేకపోవుటచే విసుగుదోచుట సహజమేగదా! కాని స్టేజీ సమయములందు భంగిమలయొక్క ఆంగికాభినయ సహాయము తీసికొనవలెను.

ఉదా :- 'అశ్రువుల' నభినయించుచున్నామనుకొందము.

ప్రేక్షకులు దగ్గరగ నున్న – నిశ్చేష్టముగ నున్న నేత్రము లలో క్రమేణ నీరు యెట్లు క్రమ్మునో, ఆ నీరు బిందురూపమును దాల్చు విధానము, కొలకులందు మంచి ముత్యముల వలె యెట్లు నిలచునో, చివరకు కొలకుల నుండి ధారగ యెట్లు ప్రవహించి చెక్కిళ్ళ నుండి జారి పడునో – దీనిని ఒకటి తరువాత యొకటి మన మభినయించిన, ప్రేక్షకులు ఆ సాత్విక భావములను జూచి ఆనందించగలుగుదురు.

కాని స్టేజిమీద యిట్టిది సాధ్యమా?

కనుక అట్టి సమయములందు దీనత్వము కనబరచు భంగి మను పట్టి చీరె చెంగుతో కన్నుల నద్దుకొన్నట్లు, లేక మయూర హస్తముతో కన్నీటిని యెగజిమ్మునట్లు అశ్రుపూరిత నేత్రములు, జాలిచూపులు, వీనిని సహాయముగ తీసికొనవలసిన అవసరము గలుగు చున్నది. ఇట్లు జేసిన అందరు అభినయము జూచుటకు వీలుండుటచే ఆనందించగలుగుదురు.

(1) పండితుల సభలందు,

(2) అన్ని తరగతుల ప్రేక్షకులతో గూడిన సభలందు అభినయించు విధానము.

పండిత సభయందు అభినయించునప్పుడు —

'నాట్యధర్మి', 'లోకధర్మి' ననుసరించి అభ్యసించిన అభినయమును జూచుటతో పండితులు తృప్తి పడరు. లలిత కళలకు సంబంధించిన శాస్త్ర పురాణములందు గూడ నర్తకులకెట్టి పాండిత్యమున్నదో తరచి జూచిన గాని వారు తృప్తిచెందరు. అట్టితరి మనము సామాన్యముగ రంగస్థలముపై అభినయించునట్లు యెక్కడికక్కడ సంక్షిప్త పరచి క్లుప్తముగ ప్రదర్శించిన అభినయము రుచింపదు. పూర్వము ఒక్కొక్క పదము గంటలతరబడి అభినయించిరనిన కేవలము ఆ పదములోని స్థాయి భావము, దాని ననుసరించి సాత్విక, సంచారులను మాత్రమే అభినయించినగాదు.

ఉదా :— కమ్మవిల్తుని గన్న 'చక్కని మువ్వగోపాలుడు'

'చక్కని' అన్నప్పుడు

నల్లని మేనువాడు, మెరుగు చామన ఛాయవాడు, కుటిల కుంతలుడు, విదియ చందురుని బోలు నొసలు, కమల రేకుల వంటి కన్నులు —

ఇటుల కృష్ణుని నఖశిఖ పర్యంతము వర్ణించి

గోపాలునికి —

గోవులు కాయువాడు, మురళీధరుడు, కౌస్తుభ భూషణుడు, శిఖిపింఛధారి, కాళీయ మర్దనుడు, గోపికావస్త్రాపహారి, నవనీత చోరుడు, నందకుమారుడు, బృందావన విహారి, గోవర్ధన గిరిధారి, రాధికాలోలుడు యిత్యాది లీలల నభినయించి —

అంతటితో ఆగక —

'పిలరాయుడు'

'నయములెన్నో జేయువాడు'

నవరసము వాని సొమ్ము (యిక యిచ్చట నఖక్షతము, ఆలింగనము, చుంబనము మొదలైన శృంగార చేష్టలెన్నో)

'కళలంటి నేర్చిన వాడు'

మొదలైన వానిలో ఆ పదములోని స్థాయి భావమును రంజింప జేయుచు సాత్విక సంచారి భావములందు విజృంభించి అభినయించుచుండిరి.

ఇక ఈ విధమును రంగస్థలముపై ననుసరించిన ప్రేక్షకులకు విసుగుజనించక తప్పదు.

భగవదారాధనకొరకు దేవళములో నృత్యముజేయు కళారాధకులు తప్ప — ఇతర నృత్య కళోపాసకులందరు ప్రేక్షకుల యొక్క మెప్పుబడయుటకు కొంతవరకైన ప్రయత్నింతురుగదా! కనుక శాస్త్ర విషయములను నర్తకులు సంపూర్ణముగ నభ్యసించినను, ప్రదేశమును ప్రేక్షకుల ననుసరించి వారికానందమునిచ్చు విధముగ శాస్త్రీయ దృక్పథము చెడకుండ క్లుప్తపరచి అభినయించుటవసరము.

నాయిక యొక్క స్వభావముగ నున్న పదములెక్కువగ అభినయమునకు పనికివచ్చును. చెలి యొక్క వాక్యములుగ నున్నవి అంతగ రాణించవు.

ఉదా :— చేసట్లు కావచ్చునా ? మీలో మీకు
చేసట్లు కావచ్చునా ?
యేపట్లకైనను నెంచదగును మిమ్ము
ఈపట్ల మీకింత తాలిమి లేక"

మొదలైన పదముల అభినయమందు నర్తకికి తన అభినయ సామర్థ్యమును చూపుటకవకాశముండదు.

* * *

కొన్ని పదములు వర్ణనలతో నింపియుండి చిత్రములు గీయుటకు, చదువుకొని ఆనందించుటకు పనికివచ్చును. సాత్వికాభినయములో విజృంభించుట కవకాశముండదు.

ఉదా :—

మగువ తన కేళికా — మందిరము వెడలెన్
వగకాడ! మా కంచి — వరద తెల్లవారెననుచు ॥ మగువ॥
విరజాజి గొజ్జంగి — విరిదండ జడతోను
కడుచిక్క బిగివెనగు — కంటసరితోను
విడుద కన్నులదేరు — నిదుర మబ్బుతోను
తొవరి పదయుగమున — దడబడెడు నడతోను, ॥ మగువ॥

* * *

మరికొన్ని పదములందు

సమర్థుడైన నర్తకుడు తన ప్రతిభను వెల్లడిచేయుటకు జాగాలెన్నో యుండును.

ఉదా :—

కలికి సొగసైన నీ కనులు వ్రాసితిగాని
బెళుకు చూపులు వ్రాయ విధమెరుగనైతి

సొగసైన కనులు —

హరిణాక్షి, కమలాక్షి, తరళాక్షి, మదిరాక్షి, మీనాక్షి, యింతకు మించి యెక్కువ అవకాశముండదు.

కాని 'బెళుకు చూపులు'

అన్నప్పుడు సమర్థుడు, అనుభవజ్ఞుడైన నర్తకుడెన్నో విధముల గంటలతరబడి అభినయింప మనల నానంద సాగరమున ముంచి తేల్చగలడుగదా !

కవి, నర్తకుని యొక్క పాండిత్యమును ప్రదర్శించుటకవకాశము కల్పించుటచే యిట్టి 'నెరవు' నేర్పాటు చేసెనేమో ?

* * *

పదసాహిత్యమునందే పదమును తీసికొన్నను, ఒక్కొక్క పదము ఒక్కొక్క ఖండకావ్యమగుచుండును. కనుక యేదైన ఒక పదములోని నాయికకు తగిన వాతావరణము రంగస్థలముపై మనము సృష్టింపవలెననిన, ఆ పదమును ప్రారంభించు విధానమందు, ముగింపునందు మనము ప్రత్యేక శ్రద్ధ వహించవలెను.

ఉదా :–

భామరో ! యూరికి – బయలుదేరెడువేళ
ప్రేమ మీఱ నా సామి – పిలిచి చెప్పిన మాట
ఏమని తెలుపుదు నేలాగు తాళుదు – నేమి
చేతునే ? చెలియా ?

ఈ పదము నభినయింపవలయునుకొందము. ఇందు నాయిక స్వీయ, ప్రోషిత భర్తృక. అనగా పతి దేశాంతరమున యుండగ ఆ వియోగము ననుభవించుచున్న స్త్రీ. విప్రలంభ శృంగారము.

ఈ నాయికాభినయమందు

తెరమెత్తగానె రంగస్థలముపై ఒక ప్రక్కను ఒక తులసి కోట, దాని ముందు అంజలి ఘటించి కూర్చుని యున్న స్త్రీ (నల్లని గాజులు, నల్లని చీర, రవికె ధరించి) – ఈ విధముగ మనకు ప్రత్యక్షమై –

ఒక నిమిషము నిశ్శబ్దముగ నున్న తరువాత సన్నని వీణా లాపము –

తులసిదేవిని పూజించిన పుష్పమొకటి యెత్తి ఆ నాయిక తలలో నుంచుకొని, మెల్లగ లేచి నిలబడి, మెడలోని మాంగళ్య మును కళ్ళకద్దుకొని –

సన్నగ – భామరో ! యూరికి బయలుదేరెడువేళ,

అని వంత పాటకుడు పాడుచుండగ, మెల్లగ నర్తకి అభి నయము ప్రారంభించిన. ఆ నాయిక అభినయము యెంత సక్రిగ, సహజముగ నుండునో మనము కొంతవరకూహించుకొనిన తెలియ గలదు.

అలాగుననే పసుపుపచ్చని చీర, రవికె, పుష్యరాగములు పొదిగిన ఆభరణములు, తలలో పచ్చ చేమంతులు ధరించి, గులాబి రంగు తెరలతో నలంకరింప బడిన రంగస్థల మధ్యమున మేలిమి బంగారు శిలావిగ్రహమువలె నర్తకి నిలబడి యుండగ తెర మెత్త బడి క్షణకాలము రంగస్థలమును నిశ్శబ్దముగ నుంచి అటుపైని వీణపై తానము వంటి ఒక మధుర ఝుంకార ధ్వని పలికించి, తరువాత గాయకుడు

" శ్రీపతి సుతుబారికి నే నోపలేక నిను వేడితె
గోపాలా ? మువ్వగోపాలా ? "

అని ప్రారంభించిన, చైతన్యము లేని శిలవలె నిలబడిన ఆ నర్తకి మన్మథ బాణములొకటి తరువాత యొకటి తనపై బడినట్లు –

మెల్లమెల్లగ ముందు కనుబొమలను కదిలించి, ఆనందముతో జ్యోతులవలె వెలుగుచున్న తన నేత్రములను వికసింపజేసి, చలింపజేసి, అటుపై అధరము కదిలించి, శిరమును కంపించి, క్రమేణ వక్షమును వణికించి, తరువాత ఝుంఝూమారుతపు తాకిడికి తాళలేక తల్లడిల్లు తీగవలె శరీరమునంతయు అల్లల్లాడించి అటుపై –

ప్రేక్షకుల హృదయములు ఝల్లన తన కాలి మువ్వల ఝణంఝణా రవములు మృదంగము యొక్క మధుర ధ్వనులతో మేళవింపజేసి బాణహస్తము పట్టి, మెఱుపు తీగవలె అభినయమున కుపక్రమించి నప్పుడు మనలో కలుగు రసానుభూతిని మన మూహించుకొనిన యెడల పదములను ప్రారంభించునట్టి విధాన ములు యెంత ముఖ్యమో బోధపడును.

పదములందు కల్పన స్వరములను పాడుటగాని, ఆడుటగాని తగదను విధానము నేడు ప్రచారములో నున్నది. కాని భావపూరిత ములగు స్వరములతో కొన్ని తీర్మానములను రచించి పదముల ప్రారంభమునందు, చరణముల ముగింపునందు నృత్తమాడిన కొన్ని పదములందు మనోరంజకముగ నుండును.

ఉదా :–

" రమ్మనవే సముఖాన రాయబారము లేలే
కమ్మవిల్తుని గన్న చక్కని మువ్వగోపాలుని "

* * *

" ఎటువంటి వాదే ? వాడు ఓయమ్మ – వాడెన్నడు –
ఈ వీధిని రాడు
కుటిల కుంతల మువ్వగోపాలుడట పేరు "

* * * *

ఈ పదములందు నాయిక సామాన్య. ఇందు పదారంభము నందు, చరణముల ముగింపునందు, కొన్ని స్వరములతో గూడిన తీర్మానములుగాని, 'శొల్లుకట్టు' విధానములోని తీర్మానములుగాని, ఈ ధ్వని ననుసరించి నేత్రములందు భావము ప్రదర్శించుచు నృత్త మాడిన ఆ నాయిక యింకయెను యెంతో రాణించును.

పదములను పాడు విధానము :–

సాధారణముగ పదములను పల్లవితో ప్రారంభించుట వాడు కలో నున్నది. కొన్ని కొన్ని అనుపల్లవితోను, మరికొన్ని చరణ మధ్యములోనుండి ప్రారంభించినగాని భావస్ఫురితముగ నుండవు.

ఉదా:–ప॥ ఏమని తెలుపుదు యేలాగు తాళుదు
యేమిచేతునే చెలియా !

అ॥ భామరో ! యూరికి బయలుదేరెడు వేళ
ప్రేమ మీరగ నా స్వామి – పిలిచి చెప్పినమాట

పై పదము అనుపల్లవితో ప్రారంభించిన, మనకు వెంటనే అర్థమై ఆ రసమును అనుభవించగలము.

* * *

కొన్ని చరణములు మధ్యమునుండి మొదలు పెట్టినగాని సొంపుగ నుండవు.

ఉదా :–

ప॥ ఎవరివల్ల దుడుకు మా – యిద్దరిలో సఖియ
అ॥ వివరింపు మమ్మా ! యీ విధము దెలిసి యిపుడు
చ॥ రమణి ! బంగారు మంచముపై నిద్దరు వాల
మమతతో సరసంపు మాటలాడే వేళ
కమలాక్షి పేర నన్ను ఘనుడు బిల్వగా కోప
శమనము లేక వా జడకొద్ది గొంటినమ్మా !

* * *

ఇందు పల్లవి, అనుపల్లవితో గాక చరణములో 'కపలాక్షి పేర నన్ను' నుండి ప్రారంభించిన సొంపుగ నుండును.

ఎట్లన –

'కపలాక్షిపేర నన్ను ఘనుడు బిల్వగా కోప
శమనము లేక నాదు జడకొప్పు గొంటినమ్మా
వివరింపుమమ్మా ! యీ – విధము దెలిసి యిపుడు'
యింతవరకు పూర్తిగ పాడి

'ఎవరిపల్లె డుడుకు మా యిద్దరిలో సఖియ' అనుచోట నుండి అభినయమందుకొన్న బహు ముచ్చటగా నుండును.

* * *

పదములలో సంచారుల నభినయించు విధానము తెల్పుటకు మచ్చునకొక క్షేత్రయ్యపదము నిచ్చట ఉదహరించుచున్నాను.

పదము – ఆనందభైరవి – ఆదితాళము
శ్రీపతి సుతుబారికి నే నోపలేక
నిను వేడితే
గోపాలా ? మువ్వగోపాలా !

ఇందు నాయిక **ఆహార్యము**

పసుపు పచ్చని చీర, రవికె.

మేలిమి బంగారు కాంతితో మెరయుచున్న జరీలంగా.

కురులు నున్నగ దువ్వి జాడముడి, అందు చేమంతుల అలంకారము, పాపిడబిందు.

కనులకు సన్నగా కాటుక, రెప్పల వెంట్రుకలు నల్లగ ఉండి రెప్పలు బరువుగ మూతలు పడునట్లుండవలెను.

కొంచెముగ యెక్కుబెట్టిన విల్లువంటి అధరము
ఎఱ్ఱని గుండ్రని బొట్టు

చెవులకు ఝుంకాలు, మెడకు, చేతులకు పుష్యరాగముల ఆభరణములు.

నడుమునకు బిళ్ళల వడ్డాణము – బాజుబందులు;
కాళ్ళకు పారాణి, అరచేతులందు లేత యెరుపురంగు
కుడిప్రక్క పెదిమపై నోటి నానుకొని పుట్టుమచ్చ
గోళ్ళకు లేత గులాబిరంగు

* * *

ఈ పదమందు నాయిక పరకీయ.
శృంగార రసము, కరుణ రసము.
సంభోగ శృంగారము.

సంచారులు – మోహము, హర్షము, దైన్యము, ఔత్సుక్యము, నిర్వేదము, ఖేదము, ఆవేగము, అమర్షము, అసూయ, వితర్కము, రోషము.

శృంగార రసము, కరుణ రసము, సంభోగ శృంగారము.

* * *

రంగాలంకారము – పసుపువన్నె తెరలు.

* * *

ఆనందభైరవి – ఆదితాళము.

శ్రీపతి సుతు బారికి నే – నోపలేక నిను వేడితే
కోపాలా ? మువ్వగోపాలా ! ||శ్రీపతి
ఏ పొద్దు దానింటిలోనే – కాపై యుండి నీ సరస స
ల్లాపాలా ? మువ్వగోపాలా ! ||శ్రీపతి
పై పూత మాటల నేర్పు – జూపు దాని రతిపై నింత
తీపేలా ? మువ్వగోపాలా ! ||శ్రీపతి
చూపుల నన్యుల దేరి – చూడని నాతోలేని క
లాపాలా ? మువ్వగోపాలా ! ||శ్రీపతి
నా పొందెల్ల దాని కబ్బి – యే పొందులేక యుసురనుచే
నాపాలా ? మువ్వగోపాలా ! ||శ్రీపతి

♦ ♦ ♦

ఈ పదములో ఒక్కొక్క చరణములో ఒక్కొక్క సంచారి భావమునకు ప్రాముఖ్యమునిచ్చి అభినయించిన చూ ముచ్చటగా నుండును.

**అ భి న య ము**

(1) శ్రీపతి సుతు బారికినే నోపలేక నినువేడితే
మోహము హర్షము దైన్యము ఔత్సుక్యము దైన్యము,నిర్వేదమ
1 2 3 4 5 6
ఆవేగము
7
కోపాలా ? మువ్వగోపాలా !
ఖేదము.
(ఈ పాదములో దైన్యమునకు ప్రాధాన్యము).

**సాత్వికాభినయము**

(1) **మోహము – వియోగము, సంతోషముతో కూడినబాధ చేత సొమ్మసిల్లుట లేక హృదయము ఆందోళన చెందుట.**

నిమీలిత నేత్రములు
శరీరము మరచుట
మెరయుచున్న నేత్రములు
కన్నులు మూతబడుట
శరీరము కంపించుట
క్రిందికి ఒరగుట
చమర్చుట
చేష్టలు లేమి
అధరము వణకుట

(2) **హర్షము, ముదము.**

ముఖము, నేత్రములందు వికాసము
శరీరముపొంగుట
శరీరము గగిర్పొడుచుట
పులకరింపు

(3) **దైన్యం.**

ముఖమందు, నేత్రములందు వికాసము
శరీరము కుంచుకొనుట
వేడుకొనుట
అశ్రుపూరిత నేత్రములు

(4) ఔత్సుక్యము

నిమిషమాత్రము కూడ ఓర్వలేక త్వరపడుట.

కోరిన వస్తువు లభింపక క్షణమైన తాళలేక పోవుట.

| | | |
|---|---|---|
| ...న్మథ తాపము | తొందరపాటు | పడకనుండిలేచుట |
| ...ట్టూర్పు | వేగముగ నడచుట | శరీరము బరువెకుట |
| ...వస్సు కాకజెందుట | శయనించుటయం | చింతించుట |
| ...ళలేక పోవుట | | దభిలాష |

(5) నిర్వేదం

కన్నీటి నడ్డగించుట

(6) ఆవేగము: (అగ్న్యావేగము)

వినరుకొనుట

చెమట బిందువులు తుడుచుకొనుట

నేత్రసంకోచము

వ్యత్యాసముగ అడుగులు వేయుట

(7) ఖేదము

చేతులు పిసుకుకొనుచు యిటునటు తిరుగుట

ముఖము విచారము పొందినట్లు కనబర్చుట

చింత

భ్రమను పొందుట

ఆంగికాభినయము

శ్రీపతి సుతు బారికి

| | |
|---|---|
| (1) అలరు విల్తుడు | (6) చందమామ అల్లుడు |
| (2) కమ్మ విల్తుడు | (7) వలరాజు |
| (3) రాచిల్క నెక్కెడురాయరౌతు | (8) అంగహీనుడు |
| (4) మీనకేతనుడు | (9) లచ్చికొమరుడు(లక్ష్మీ పుత్రుడు) |
| (5) మకరకేతనుడు | (10) జమిలిముక్కాలి నారి విలుకాడు |

(1) అలరువిల్తుడు

కుడిచేత అర్ధపతాకముపట్టి, తరువాత బాణహస్తముపట్టి, పిమ్మట కుడిచేత శుకతుండము బాణముతో సంధించినట్లు పట్టవలెను.

(2) కమ్మవిలుడు

కుడి ఎడమల శిఖరములు పట్టి, ఒకదానిపై నొకటి మోపి బాణహస్తము పట్టవలెను.

కుడిచేత శిఖరము, ఎడమచేత శుకతుండము పట్టిన బాణ హస్తము లేక మన్మథ హస్తమునకు ఒప్పును.

(3) రాచిల్కనెక్కెడు రాయరౌతు

ఎడమచేత రాచిలుక, కుడిచేత శిఖరము దానిపై నుంచ వలెను. రాచిలుక – తామ్రచూడ పట్టి, అందు చిటికెనవ్రేలు వాచి పట్టిన రాచిలుకకు చెల్లును.

(4) మీనకేతనుడు

పతాకము కుడిచేత పట్టి, తరువాత మత్స్యహస్తము పట్ట వలెను.

(5) మకరకేతనుడు

పతాకములను స్వస్తికముగ పట్టవలెను.

(6) చందమామ అల్లుడు

అర్ధచంద్రహస్తము పట్టి, ఎడమచేత అర్ధచంద్ర, కుడిచేత సంతంశము పట్టి మరల కుడిచేత శిఖరము పట్టవలెను.

(7) వలరాజు

త్రిపతాకము పట్టి కుడిచేత శిఖరము పట్టవలెను.

(8) అంగహీనుడు

రెండు చేతులందు అలపద్మములు పట్టి శరీరమువద్దనుండి క్రిందికి లాగి – కుడిచేత కర్తరీముఖము పట్టవలెను.

(9) లచ్చికొమరుడు

రెండు చేతులందు అలపద్మములుపట్టి, ఇరు పార్శ్వము లందు కపిత్థములుపట్టి మాతృహస్తము పట్టవలెను.

(10) జమిలి ముక్కాలి నారి విలుకాడు

కుడిచేత భ్రమరహస్తము పట్టి – ఎడమచేత శిఖరముపట్టి విల్లు నారి జూపవలెను.

* * *

## మన్మథ పంచబాణ ప్రయోగస్థలములు

| | బాణము | ఆంగికము | సాత్వికము |
|---|---|---|---|
| (1) | అరవిందము | స్తనములు | ఉన్మాదము |
| (2) | అశోకము | అధరము | రోదనము |
| (3) | చూతము | శిరసు | సమ్మోహము |
| (4) | నవమల్లిక | నేత్రములు | దేహము శుష్కించుట |
| (5) | నీలోత్పలము | గుహ్యము | మృతి |

(నీలోత్పలము నభినయించ గూడదు పూర్వవరకు నభి నయించి బాణము సంధించక యూరకుండవలెను).

* * *

శ్రీపతి సుతు బారికి

బాణహస్తము పట్టి సంధించి తరువాత రెండు చేతులందు కటకాముఖ హస్తములు పట్టి, వానిని హృదయము వద్దకు తెచ్చిన బాణము తగిలినట్లు భావము – అటుపై చేతుల అల పద్మములు అరచేతులు చేర్చి పట్టి వ్రేళ్ళు వణికించిన,

'నేనోపలేక' అనుటకు చెల్లును.

నినువేడితే –

రెండుచేతులందు ముకుళముల పట్టి కుడిప్రక్కకుగాని, ఎడమప్రక్కకుగాని పొడిగించి, జాలి చూపుల జూచుచు ఆ హస్తము వికసింపవలెను.

కోపాలా ?

సాత్విక సహాయముతో

మువ్వగోపాలా ?

ఎడమచేత హృదయమున కెదురుగ అలపద్మము పట్టి, కుడిచేత సూచిముఖము పట్టి తలపైకి చేయినెత్తి కొంచెముగ త్రిప్పిన ఊరునకు జెల్లును.

గోపాలా ! – వేణువు జూపవచ్చును.

లేక

ఎడమచేత సింహముఖము కుడిచేత సూచి గోవులను తోలునట్లు పట్టుట.

*　　*　　*

(2)
ఏ పొద్దు దానింటిలోనే కాపై యుండి ఏ సరస
అమర్షము అసూయ ఉగ్రత వితర్కము
సల్లాపాలా ? మువ్వగోపాలా ?
(ఇందు అసూయకు ప్రాముఖ్యము)

| అమర్షము, రోషము | అసూయ |
|---|---|
| (1) చింతించినట్లు | (1) మోము త్రిప్పుకొనుట |
| (2) చెప్పుచున్నట్లు | (2) కనుబొమ్మలు, ముఖము లేక నొసలు చిట్లించుట |
| (3) చెమర్చుట | (3) అధిక కోపముచేతగాని, ఓర్వలేకగాని నిస్పృహయత్వము వల్లగాని కంటతడి బెట్టుట |
| (4) శిరఃకంపనము | |
| (5) తలవంచుట | |
| (6) తర్జన భర్జన | |

ఉగ్రత

కనులెఱ్ఱబడుట

వితర్కము

కనుబొమల నెత్తుట, ఎగరవేయుట
తలముందుకు ఆడించుట
ఆలోచించుచున్నట్లు కనబరచుట

సరస సల్లాపాలు

1) కులుకు గుబ్బలు చూపుమని కులుకుట
(2) తలయూచి నవ్వుట
(3) తాళజాలనని వేడుట
(4) వలరాజుపై పదము పాడుకొనుట
(5) నినుబాసి కంటికి నిదుర రాదనుట
(6) నిముసమైనగాని పొదుపోదు
(7) మరుబారి కోర్వగరాదు
(8) కామశాస్త్రము చదివి కథలు చెప్పమనుట

ఆంగికము

ఏ పొద్దు

కుడిచేత పతాకము ముఖము ముందునుండి క్రిందికి తీసికొని రావలెను.

దాని

మెటికలు విరుచు భావము

ఇంటిలో

రెండు చేతులందు పతాకముల తలపై చేర్చి గోపురాకారముగ పట్టవలెను.

కాపై యుండి –

మృగ శీర్షము ముఖము ముందునుండి క్రిందికి తీసికొనిరావలెను.

ఏ సరస సల్లాపాలు

కుడిచేత అలపద్మము పట్టి తలను, చేతిని ప్రక్కలకు కాడించుచు అడిగినట్లు

గడము క్రింద యెడమ చేయినుంచి బొటనవ్రేలి, ఎడమ చేయి నడుముపై నుంచి, కుడిచేయి జూపుచు తలను ముందు వెనుకలకు ఆడించుట.

సరస సల్లాపాలు :

(1) సోలపద్మము కాని, ముకుళము కాని పట్టి, తరువాత కుడిచేత చతురములోని చిటికెనవ్రేలితో కంటిని జూపి పిమ్మట ముకుళమును వికసింపజేసి వేడికొనుట కనబరచవలెను.

(2) తలయూచి నవ్వుట.

(3) రెండు చేతులందు పతాకముల వికసింపజేసి హృదయమున కెదురుగ కదిలించుట. శరీరము కంపించుట.

(4) చిలుక వాహనుని జూపి, వీణ మీటుటగాని, మురళి నూదుటగాని జూపవలెను.

(5) సూచీతో చూపి, తరువాత కర్తరీ ముఖహస్తమును జూపి, చతుర హస్తములోని చిటికెన వ్రేలితో నేత్రముల జూపి, ఎడమచేత పతాకము చెంపకానించి నిద్రనభినయించి పతాకముతోను ముఖమున కెదురుగ విప్పారిన నేత్రములు, అడ్డముగ తల కదిలించుచు ప్రక్కల కాడించవలెను.

(6) చిటిక వేసి పతాకము పట్టవలెను.

(7) బాణహస్తము, బాణముల సంధించుట చూపి, శరీరము కంపించుట.

(8) వలరాజు హస్తము పట్టి, రెండు పతాకములు చేర్చి అడ్డముగ పట్టి తాళపత్రము చదువు చున్నట్లభినయించి – కుడిచేత హంసాస్యము పట్టవలెను.

*　　*

(3) పై పూతమాటలనేర్పు జూపు దాని రతిపై
అమర్షము ఉగ్రత రతులు
ఇంత తీసేలా ? మువ్వగోపాలా !
అసూయ, వితర్కము.
(ఇందు వితర్కము ప్రధానము).

ఆంగికము

పై పూత మాటల నేర్పు

ఎడమ చేత ముకుళము పట్టి, కుడిచేత చతురముతో దానిపై వ్రాసినట్లభినయించి, తరువాత కటకాముఖమును వాకిపద్దనుండి నోటివద్దకు తెచ్చి, అటుపై కుడిచేత శిఖరము పట్టవలెను.

చూపు — దృష్టి భేదములు

దాని — మెటికలు విరుచునట్లు, దూషించునట్లు.

రతిపై — రతులు.

1) ఎడమచేత పతాకము పట్టి — చెక్కిళ్లకు తగులునట్లుంచి కుడి చేయి జారవిడచి నడక నభినయించి —
కుడిచేత కర్తరీములో చూపుడు, నడిమివ్రేళ్ళు కలుపవలెను.

2) అల్పహస్తము పట్టి — కుడిచేత పట్టబడిన అర్ధపతాక చూపుడు, నడిమివ్రేళ్ళ మధ్యలో ఎడమచేతి అర్ధపతాక వ్రేళ్లను దూర్పించవలెను.

3) రెండు సర్పశీర్షములు స్వస్తికాకారముగ పట్టి కర్కట హస్తము పట్టవలెను.

4) రెండు చేతులందు శిఖరములు స్వస్తికాకారముగ పట్టి పాశ హస్త పట్టవలెను.

ఇటుల పదయానుకూలముగ హస్తముల నేర్పరచుకొని అభినయించుట.

ఇంత . పతాకము.

శ్రీలోలా . శిఖరము పట్టి ముందు వెనుకలకు పావురాయి వలె తల నాడించుట.

4. చూపుల అన్యులతేరి చూడని నాతోలేని
గర్వము ఖేదము
కలాపాలా ? మువ్వగోపాలా.
రోషము.
(ఖేదమునకు ప్రాముఖ్యము).

| గర్వం | ఖేదము |
|---|---|
| చూడక యుండుట | ఉత్సాహము లేక యుండుట |
| తన అవయములను పర్యాయముగ జూచుకొనుట | మిక్కిలి చింతించుట |
| | తలయెత్తి చూడకుండుట |
| మోము త్రిప్పుకొనుట | జాలి చూపు |
| నిర్లక్ష్యము | అశ్రుపూరిత నేత్రములు |

కలాపాలా

| | |
|---|---|
| వేడుకతో ఆకుమడుపువిసురుట | ముంగురులు చేతదువ్వి, నొసలు కళ్ళు ముద్దిడుట |
| పలుగాట్లు మోవిపై నుంచుట | ఉరముపై నుంచుకొనుట |
| పందుగొని మరుకేళి సలుపుట | చౌసీతి రతుల నేలుట |
| కాదమ గుబ్బలమీద క్రొన్నెల లుంచుట | పుక్కిటి విడెమిచ్చి చెక్కిలినొక్కి |
| కౌగిట జేర్చుకొనుట | కళలంటి మోవితేనె చప్పరించుట |

రొమ్మున గుబ్బలాని ముద్దుపెట్టుకొనుట
ఇదుగో యని ఆకుమడుపులిచ్చుట
తిలకము అందముగ నొసట దిద్దుకొనుట
బలిమి సుగంధము పన్నీరు మర్దించి బాగుగ అలముట —
చెక్కిళ్లు కొసరి కొసరి ముదాడుట

మోమున మోము చేర్చి మోవితేనె పీల్చుట
బంగారు తూగుటుయ్యాలలో నూగుట
(వీనిని క్షేత్రయ్య తన పదములలో పేర్కొనెను)

(5) నాపొందెల్ల దానికబ్బి — యేపొందులేక ఉసురనుట
ఖేదము అమర్షము నిర్వేదము
నిర్వేదము అసూయ
నాపాలా ? మువ్వగోపాలా
దైన్యము వితర్కము

ఇందు దైన్యము, వితర్కము, ఖేదము, అసూయ నాలింటిని విజృంభించి అభినయించి ముగించవలెను.

పదాభినయమందు ప్రతిపదమునకు ఆ నాయికకు తగిన ఆహార్యము (ఆభరణములు, వస్త్రములు, కేశ అలంకారము మొదలైనవి) ధరించవలెనని వ్రాసితిని. అట్టి వేమియు లేక ఆ నాయికను పోషించగలిగినవాడే గొప్ప నర్తకుడని కొందరి మతము. అదియును నిజమే. కాని అట్టిది కేవలము పాండిత్య ప్రదర్శనమునకు, కొందరు పండితులయెదుట అభినయించుటకు పనికివచ్చును రంగస్థలము మీద ప్రదర్శనము లిచ్చినప్పుడు అనేక ప్రజలు ఆ ప్రదర్శనలను జూచుటకు వత్తురు. కాన అందరును నర్తకుని కున్న పాండిత్యము నర్థము జేసికొను విజ్ఞానవంతులుగ నుండరు. కనుక తమ ముందు ఆ నాయిక యొక్క సంపూర్ణ స్వరూపమును జూచిన గాని రసానుభూతి పొందలేరు. కనుక నర్తకులెంత విద్యావంతులైనను ఆహార్యము యొక్క అవసరమెంతయో గవబడుచున్నది.

పదములలో రాగముల విలువ :

రాగములయొక్క పరిపూర్ణ స్వరూపము పదములయందు గనబడునట్లు మనకు మరియే యితర సంగీత రచన యందును గోచరింపదు. రాగములలోని గంభీరత, భావము పదములలోని నాయికలలో ప్రత్యక్షముగ నృత్తమాడును. పదములు విలంబిత లయలో నుండుటచే ఆ రాగములలోని అతి సున్నితమైన, మధురమైన ధ్వనులను గూడ ఆ నాయిక యొక్క విరహమో, దుఃఖమో మరియే యితర సంచారీ భావముల ద్వారానో ప్రదర్శించుట కనుకూలముగ నుండును. ఇట్టి అవకాశము కీర్తనలందు, కృతులందు నంతగా కానరాదు.

శ్లోకాభినయములో విశిష్టత —

ఒక రాగమును మన మాలపించి వదలినప్పుడా ధ్వని యొక్క ప్రభావము కొన్ని క్షణముల వరకు ప్రేక్షకులపై నుండునట్లు, శ్లోకాభినయమునందు గూడ వెంటనే ఒక సంచారి నుండి యింకొక సంచారి లోనికి పరిగెత్తక క్రమేణ మార్చుకొని పోవుటచే ఆ రాగములోని సొంపులు, సొగసులన్నియు మన కన్నులకు గట్టినట్లుండును. మరియు పదముల, జావళీల అభినయము తాళలయబద్ధమై యుండుటచే, ఆ తాళలయల ననుసరించి రాగమును కొన్ని నిబంధనలతో బంధించవలసి యుండును. కొన్ని శ్లోకముల అభినయములో రాగాలాపమునందు స్వేచ్ఛయుండుటచే రాగమును మన యిష్టము వచ్చిన చోట విరచుటకవకాశముండును.

పదములు కొన్ని ఆంగికప్రధానమైనవిగా నున్నవి.

సాత్విక ప్రధానమైన పదరచనలు.

ఉదా —

ప॥ అక్కరో! యెవ్వని వారు సరసుడు గాడని —
యాడుకొంటే ఆడుకొనేరు

అ॥ మ్రొక్కదగిన వాని ముద్దుమాటల వాని
మువ్వగోపాల సామిని యెవరైనగాని ॥అక్కరో॥

చ॥ రామ వాని దలచి నపుడే — రవిక చిక్కజిసి గుబ్బ
లేమో రొమ్మెల్ల నిండునే — వాని మాటంటే
నా మనసు పైపై నుండునే — వాని జూచితే
నవనిధులబ్బినట్లుండునే — యెవరైనగాని ॥అక్కరో॥

ఈ పదాభినయమందు సంచారుల యొక్క, ఆంగికము క్క అవసరమెక్కువగ నుండదు. సాత్విక భావము (స్తంభము, స్వేదము, గగుర్పాటు, రోమాంచము) మొదలైన వానిపై ఈ నాయిక అభినయమాధారపడి యుండును.

'రామ వాని దలచినప్పుడే —'

ఇప్పుడు అభినయము ఉచ్ఛ్వాస నిశ్వాసములతో ప్రారంభ మైనను శరీరము యొక్క పొంగును ప్రదర్శించుటకు సాత్వికమే శరణ్యము. అట్లే పదమంతయు సాత్విక భావముల యొక్క ప్రదర్శనపై నాధారపడి యున్నది.

కేవలము సాత్విక సంచారుల యొక్క సహాయముతోనే ప్రదర్శించుటకు చక్కని అవకాశమున్న పదములు మరికొన్ని —

"ఎందు దాచుకొందు నిన్ను ఏమిసేతునేను ?
అందమైన నీమోము — అయ్యలూ! ముద్దు గుల్కుచున్నది"

ఈ పదములో

"ఎందు దాచుకొందు నిన్ను"

అన్నప్పటి ఆత్రత, అసహాయత, కంగారు మొదలైనవి ప్రదర్శించునప్పుడును,

'అందమైన నీమోము — అయ్యలూ! ముద్దుగుల్కుచున్నది"

ఇందు ప్రదర్శించునట్టి ఆనందమునకు ఆంగికము యొక్క అవసర మెంతమాత్రము నుండదు. ఆనందము, ఆత్రత, కంగారు, నేత్రముల యొక్క గతి ద్వారా ప్రదర్శింపవచ్చును.

ఆంగిక ప్రధానమైన పదము

"ఏ తీరున రమణిని గెలిచి నీ — వెట్ల రూపొందువో ?
మాటలువిరారా! సుదతి! నీ
చేత బలిమి నా చెలిమి బలిమి ॥ఏ తీరున॥

రాతిరనే యేనుగనెక్కి — రాకాచంద్రుడు గొడుగుగాను
లేక తెమ్మెర మొదలైన బలముల — చేత గెలిచెదనంటివా?
పోతుటేనుగుకుంభములే—పాలతిగుబ్బలు మోముచంద్రుడు
నాతి ప్రాణములె చలువ తెమ్మెర
జాతి వారిలో పగలు గలదా! ॥ఏ తీరున॥

*   *   *

ఇందు సాత్వికము కన్న ఆంగికాభినయమే (హస్తాభినయము) ప్రాధాన్యత వహించునని పదము చదివినంతనే తెలియు చున్నది.

పదములు - రాగములు

కర్ణాటక సంగీతములో కొన్ని వందల రాగములున్నప్ప టికి క్షేత్రయ్య సుమారు నలభై రాగముల కంటే యెక్కువ రాగముల్లో పదరచన జేయలేదు. అతనికి మిగిలిన రాగములు రాకగాదు. పదముల్లోని నాయిక, సాత్విక, సంచారులను వికసింప జేయుటకు సంగతులు వేసి పాడుటకు అనుకూలించినట్టి రక్తిరాగ ములనే ఏరుకొన్నాడు. నాయికలు కొన్ని వందలైనప్పటికీ — అష్టవిధ నాయికలెట్లు ప్రాముఖ్యంతో పరిగణింపబడుతున్నారో అట్లే రాగములుగూడా అతడు ఏరుకున్నాడు. అంతేగాక ఒక్కొక్క రాగము దాని స్వర సంచారము ననుసరించి, భావసంచారమునకు అనువైనట్టి వాటియందే ఏరికూర్చాడు. కాని ప్రస్తుతకాలములో కొందరు రాగములు మార్చుటకదు. దానివల్ల నాయిక స్వరూపానికి భంగము కలుగుతుంది. సంచారి వికాసానికి ఉపకరించదు. భాషకు రాగపోకడకు అతకుటలేదు. కనుక వీలైనంతవరకూ అతడు రచన జేసిన రాగములందే పాడుట ఉత్తమము.

ఉదా :- ఎటువంటి వాడే వాడు! ఓయమ్మ వాడు ఎన్నడూ ఈ వీధిని రాడు.

ఈ పదము నీలాంబరి రచన చేయగా కొందరు కళ్యాణిలో పాడుతున్నారు. ఈ నాయికాభినయంలో శృంగారము, అద్భుతము రెండు రసాలును పోషింపబడుటకుగాను క్షేత్రయ్య ముగింపు మాటలు, రాగము యొక్క ముగింపుధ్వనికి సరిపోవునట్లు రచన జేసినాడు: "డు" — "ట" ఈ రెండు అక్షరాలు ఆ రాగము యొక్క ముగింపులో కలిసి అంతమైనప్పుడు ఒక విధమైన ఆశ్చర్య రసోత్పత్తి, తన్మయాభావపుష్టి కలుగుతుంది. కళ్యాణిగాని మరేరాగ ములో పాడినా ఆ భావస్ఫురణ కలుగదు.

పదములు — లయ, తాళములు

పదములు విలంబిత లయలో పాడితేనే అభినయం చక్కగా ప్రదర్శించుటకు అవకాశముంటుంది. కొందరు లయమించి కీర్తనల పోకడలో పాడుతున్నారు. అది అభినయానికి ఒప్పదు. మరి కొందరు కళాకారులు పదవర్ణములందువలే త్రికాల అడుగులు గూడా పట్టుతున్నారు. అడుగులు వర్ణములు, జావళీలందు ఒప్పును. అభినయమందు కేవలము తాళము గతి తెల్పుటకు మాత్రము అడుగులుగాని, నర్తకి చరణ కాలిలోగల పాండిత్యం జూపుటకు గాదు. ముఖంలోని భావపాండిత్యం ముఖ్యంగా అభినయంలో నర్తకి ప్రదర్శించాలి. ఇక కాలి పాండిత్యము నృత్త నృత్యాము లలో చూపవచ్చును.

కొందరు కళాకారులు తాళములు మార్చి పాడుదురు :-

ఉదా :-

"రమ్మనవే సముఖాన

రాయబారము లేలే" – ఈ పదము త్రిపుట తాళము, కేదార రాగములో వుంది. దీనిని రూపక తాళములో గానము జేయుదురు.

అట్లే,

"మగవ తన కేళికా మందిరము వెడలెన్"

ఇది ఝంపెలో వుండగా – రూపకంలో పాడుదురు.

తాళము లెక్కకు సరిపోయిననూ, నరక యొక్క అందము కుంటువడును. కావలసిన భావగంభీర్యతి, నాయిక రూపకల్పన జరుగదు.

*  *  *

## పదములు – రాగమాలికలు

పల్లవి, అనుపల్లవి ఒకరాగమందును మిగిలిన మూడు చరణములు మూడు రాగములందును రాగమాలిక కొందరు విద్వాంసులు పాడుచున్నారు. ఆవి పల్లవి అనుపల్లవిలో నాయికను నిరూపించి మిగిలిన చరణముల్లో ఆమె పూర్తి అవస్థలను తెల్పియున్నాడు. పదము పూర్తిగా పాడినగాని ఆ నాయిక, ఆమె అవస్థా బాధలు తెలియవు. అట్టితరి రాగముల మార్పు, భావ పోషణకు ఆటంకముగా నుండును. ఒక రాగములోని వివిధ భావముల పోషణకు రాగము సంచార చేసి పాడుట ఉత్తమ అభినయం ప్రకటించుటకు ఉపకరించును.

(1) నాయిక భావము నభినయించుట; (2) నాయిక తానై అభినయించుట :–

ఈ రెండు విధములైన అభినయముల్లో 2 వ తరగతి అభినయం శ్రేష్ఠమైనది. అది యెంతో సంస్కారవంతులకుగాని అట్టి అభినయం పట్టుపడదు. అదే నిజమైన కళ. అట్టి కళాకారులే, సంపూర్ణమైన రసాస్వాదన సభికులకు కలిగించగలరు. మొదటి తరగతి అభినయం సాధనవల్ల అలవడును. అది అర్థాభినయము మాత్రమగును. తానే నాయికయై అభినయించునట్టి విద్యయందు శాస్త్రము తెలియుటయే గాక అభినయించుపాత్ర తానా భావముల ననుభవించుతూ ఇతరులకు ఆ రసభావములను పంచునుగాన సంపూర్ణ నాయికా స్వరూపమును నిరూపణ చేయగలదు. దేశంలోని ఉత్తములైన అభినయ కళావేత్తలందరూ ఈ తరగతికి చెందినవారే.

## పొగసైన కొన్ని పద రచనలు

### (సారంగపాణి పదములు)

రాగముల పేర్లుగల పదము

ప॥ ఈ సీమల హరిణాక్షులవలెగా – దీ మోహనాంగి॥

అ॥ కాశిపురినుండి వచ్చినదీ – కళ్యాణి వేణుగోపాల॥

కన్నడ పేయక నీ దరబారు – గాచియున్న నాట నుండి

అన్నమెరుగదని యాహరి పాదము – లావతిట్టిరా

*  *  *

క్రింద గుర్తులు పెట్టిన పన్నియు రాగముల పేర్లు. ఇట్లే పదమంతయు వివిధ రాగముల పేర్లిమిడియుండునట్లు చమత్కారముగ రచింపబడినది.

*  *

స్వరస్థానములు గల పదము

ప॥ దాని ప్రాయము పదా రేండ్లు నీ – దాని నేలుకోర

సానిదా పనికి వొంతకారి – సామి వేణుగోపాల రాయ॥

*  *  *

కొమ్మల పేర్లు గల పదము

తరుణికేమని ఝూరిబోసి వచ్చెనె మద–దంతికొమ్మా–ఎంతా

మురిపెము లేకనే యచ్చున మరుపంపు మొలకకొమ్మ

♦  ♦  ♦

మందుల పేర్లు గల పదము

ఆ వాలుగంటి మాటలతిని కతి మధురమాయె

నన్నింత మోదిసేతురా ?

రావే యూర్దక పాద – రసము వలె తిరిగేవు

భావము దెలిసి యిప్పటి కోర్పుచే బగు॥

*  *  *

మానుల పేర్లు గల పదము

పడతి నే స్తము వేణు గోపాలమాను

తడబడక నీ వికన – దాని చింతమాను

*  *  *

ఔషధముల పేర్లు గల పదము

చ॥ పొలతి నెమ్మోము సం – పూర్ణ చంద్రోదయము

అలకాళి రుచివినో – దాంజనంబు

♦  ♦  ♦

మెరటూరు వెంకట్రామ శాస్త్రిల వారి పదము

నాదనామక్రియ – ఆదితాళము

ప॥ తళుకు బెళుకు కులుకుగల మితారి – యేరా – నా సామి

అ॥ తళుకు బెళుకు కులుకు గల మితారి – వలపు దెలుపు

సొలపు జూపుల దారి – కలికి చిన్నారి పొన్నారి

వయ్యారి – ఘనుడ మల్లాజేంద్రా విను గోరి॥

చ॥ అల పగడాలు సొలపు జిగిడాలు – అలరు జాతికెంపులు

నగజాలు – చిలుక నజికి కెంజేయన జాలు – చిలకల

కొలికి వాతెర జిగిడాలు – నలలిత నయగుణములు

గల – ఇంతిరా – వలరాజు దంతిరా – చెలువలరిన

చెంగలువల బంతిరా – రతనాల దొంతిరా – యిలగల

లలనలలో – మేలి బంతిరా – వెన్నెలవి కాంతిరా –

తెలివగు మెరుపులలో వడి తంతిరా పొంటగెన గొంతిరా

తెలికలువల చెలువుని మేనల్లునిగిండ్లూ–వారెదేసి కండ్లూ–

(కాని – నీ ఆనందము నాది యగునా? నా కష్టములు, నా దుఃఖములు నీవగునా స్వామీ? అని శంక నభినయించుట గూడ గలదు. ఇది అభినయమును రంజింపజేయుటకు ప్రదర్శింప బడును)

(7) మన మనస్సులు ఒక్కటగుటచే మన యిష్టాయిష్టములు ఒక్కటే గదా!
(8) నా పెదవులు నీవి.
(9) నా చెక్కిళ్ళు నీవి.
(10) నా సర్వస్వము నీది.
మన శరీరములు ఒక్కటని నీవు ఆనబెట్టిన రీతి.
(11) కాంతితో ప్రకాశించుచున్న దీపము మనకు సాక్షి.
(12) నీ మాటలు నిజమాయె. ముందులకంటివా, నీ వచ్చుట నర్పిన శృంగార క్రీడలలోని ఫలితమును నే ననుభవించితిని గాన.
(13) నీవు ధరించిన ఆహారము మనకు సాక్షి.
(14) ప్రక్కపై శయనించుచుండు బంగారు గిన్నెతో నే నందిచ్చిన పాలు నీ పెదిమల వద్దకు తెచ్చి ఆ క్షీరములు సాక్షి యంటివి.
(15) నే నిచ్చిన విడెము సేవించుచు ఆ పుక్కిట విడెముపై ఆన బెట్టితివి.
(16) పంచ భూతములు సాక్షి అంటివి.
(17) మన యిద్దరి మేనులు ఒకటని స్పష్టముగ పలుక్కుచు నా చేతిని ముద్దాడితివి.
(18) చేతిలో చెయ్యి వేసితివి.
(19) నా పైట కొంగు భూమిపై నుంచ దానిపై కాలునిడి మన యిద్దరి మేనులు ఒకటంటివి.

'స్వామి అదె నిజమాయె, నిజమాయె –'

ఇచ్చట నాయిక అమర్షము, శంక, వితర్కము, ఆవేగము మొదలైన సంచారుల అభినయము గుప్పించును

నాయిక మధ్యధీర యగుటచే అభినయమందు అవహేళనతో గూడిన భావ ప్రకటన గూడ యుండును.

ఎటన –

ఉదా :–

''నా ఆనందము నీది'' అన్నప్పుడు నిజముగ 'నా ఆనందము నీది' అను భావము వచ్చునట్లు అభినయింప బడును.

లేక

'నా ఆనందము నీది యగునా –' అని ధ్వనించునట్లు గూడ అభినయింపబడును.

అంతియెగాదు –

అతని యొక్క మాటలతో అతనినే దూషించును –

మన యిద్దరి మేను లొకటంటివి. కాని నన్ను మోసగించితివి, వంచించితివి.

'నిజమే నయ్యా, మన కష్టసుఖాలొకటే. నేను కాదనను.' కనుక నే

''నా నేత్రములు గూడా –''

కారణం – ఇచ్చట అభినయము చమత్కారముగ నుండును.

'నీ నేత్రములు యెర్రబడినవి – రాత్రి అన్యస్త్రీతో క్రీడలు సలుపుటచే నిద్రలేక (ఆనందము).

నా నేత్రములు – నీ రాకకు వేచి యుండుటచే.

(నిర్వేదము, వైవశ్యము).

నీకు నిదుర లేదు కనుక నీ నేత్రము లెర్ర బడినవి.

(సహజము)

నీవు మోసగించినందున నా మనస్సు శోక మంది నా కన్ను లెర్రబడినవి. (సహజము)

* * *

నిన్నెవతో గిల్లి యురము జూచి
నన్ను వేదన జేయుచున్నది గదరా

''సరస సల్లాపములో ఉరము మీద అది గిల్లి నందుకు నీకు వేదన గలిగి యుండును.''

నీవు వానితో రాత్రి గడిపి నందులకు నా ఉరము – హృదయ వేదన జెందుచున్నది.

ఈ విధముగ లభినయింపవలెను.

ఖండిత – నుక

(1) మన చెక్కిళ్ళపై నఖక్షతములున్నవి.
(2) మన పెదవులపై దంతక్షతములున్నవి. మోముపై వలు కెంపు.
(3) సందిట చందురు పిల్లలతో అందము దోచుచున్నది.
(4) మననేత్రము లెర్రనై కనురెప్పలు నిద్రలో బరువెక్కినవి.
(5) మన ముఖములకు పసుపయినది.
(6) మన వక్షస్థలము చందన మలది యున్నది.
(7) నీ వీపు మీద గాజుల నొక్కులు గానవగును.
(8) స్వామి నీవు సంతోషముతో రాత్రి గడిపిన అదే నాకు పదివేలు
(9) ఆ మాయలాడిని సుఖపెట్టితివిగదా – నామనస్సు తృప్తి
(10) కాక చెందిన నా మనస్సు చల్లారినది.
(11) నా తప్పులు మన్నించు. నన్ను క్షమించుము.
(12) నిజముగ నేను పుణ్యాత్మురాలిని. లేక నాకిట్టి భర్త ప్రాప్తించునా?
(13) స్వామీ! నేను నీ పవిత్ర మూర్తిని కన్నెత్తి చూడనైన అర్హురాలినా?
(14) ఇది నా పూర్వ జన్మ సుకృతము.
(15) పూజాఫలము.
(16) నా తప్పులు మన్నించి నన్ను నీ దానిగ చేపట్టుమని వేడు కొనుచున్నాను.

"నను పాలింప నడచివచ్చితివో
నా ప్రాణనాథ
వనజనయన మోమును జూచుటే జీ
వనమని నెనరున మనసు మర్మము దెలిసి"

ఈ త్యాగరాజ కృతిని అభినయించునప్పుడు
'నను పాలింప నడచి వచ్చితివో'
అన్నప్పుడు
వివిధ తాళగతులతో గూడిన నృత్తము, నృత్యము ప్రదర్శింప బడుచున్నది గాని –

తను ఎంతో కాలమునుండి దర్శనము కొరకు పరితపించుచున్న దైవము తన ముందు ప్రత్యక్షమై తనను బ్రోచుటకు కాలినడకను చల్లని చూపులతో చేర వచ్చినప్పుడా భక్తుడు పొందే ఆనంద పారవశ్యమును మాత్రము ప్రదర్శింపబడుటలేదు –

* * *

III. మరియొక ఉదాహరణనిచ్చి ముగిస్తాను.
"క్షీర సాగర శయన" అను కృతి అభినయములో
'నారీ మణికి చీర లిచ్చినది నాడే నే విన్నానురా'
అన్నప్పుడుగాని,
'ధీరుడౌ రామదాసుని బంధము దీర్చినది విన్నానురా'
అను మొదలైన భాగాలలో
"నారీమణికి చీరలిచ్చినది"
ఇచ్చట
పాండవులు జూదమాడుట, ఓడుట, ద్రౌపదిని సభకీడ్చుకొని వచ్చుట, చీరలు విప్పుట, ఆమె కృష్ణుని వేడుకొనుట –

ఇట్లు ఆ కథ లన్నింటిని ఆంగిక ప్రధానముగ ప్రదర్శింపబడును గాని,

"నీ భక్తులను, నిన్ను నమ్మిన వారందరిని బ్రోచితివి గాని ఓ క్షీర సాగర శయనా! నన్నెందుకు చింతల పెట్టుచుంటివి?" అని దీనముగ ప్రార్థించునప్పటి,

నిర్వేదము, వితర్కము, దైన్యము మొదలైన సంచారుల అభినయము సంపూర్ణముగ ప్రదర్శింపబడుటలేదు.

ఇదే నేటి అభినయకళలోని లోపము.
నర్తకుడు అభినయించునప్పుడు –

(1) తన్ను తా మరచి తా నభినయించు పాత్రలో లీనమైనప్పుడే ఆ పాత్రను చక్కగ పోషింపగలడని కొందరి పండితుల అభిప్రాయము.

(2) నర్తకుడు కేవలము ఆ పాత్రలోని భావమును ప్రదర్శించు నట్టి యంత్రము వంటి వాడే గాని, ఆ పాత్రలోని రసము ననుభవించుటకు అర్హతలేదని మరికొందరి అభిప్రాయము.

ఈ రెండు మతములందు కొంత సత్యమున్నను వీనిని యెక్కువగ ననుసరించినచో రెండు విధములందును రసభంగము కలుగుచున్నది.

ఉదా :–

(1) రామకృష్ణ పరమహంస జీవితములో నుండి చిన్న ఘట్టము నిచ్చట వ్రాయుచున్నాను.

రామకృష్ణుడు బాల్యములో – శివరాత్రి ఉత్సవ సమయములో శివలీల నాటకము నాడునప్పుడు శివుని పాత్ర వేయునట్టి పిల్లవాడు అకస్మాత్తుగ జబ్బుపడుటచే రామకృష్ణ పరమహంసను శివుని పాత్ర నాడమనిరట – ఆయన శివుని వేషము ధరించి, ఆ పాత్రను మననము చేయుచు పూర్తిగ తన్ను తా మరచి ... బడలేరు గని భక్త్యావేశములో దీర్ఘ సమాధినొందుటచే శివుని పాత్ర రావలసిన సమయమునకు వారికి దేహముపై తెలివి లేక ఆ పాత్ర నభినయింపలేకపోయిరట. ఇచ్చటవారు భక్తి పారవశ్యములో శివుని పాత్ర నభినయింపవలసి యున్నదనియు, శివస్వరూపమును చక్కగ నర్తము జేసికొని ప్రేక్షకులను రంజింపజేయవలసి యున్నదనియు మరచిపోయిరి. కనుకనే వారు సమయమునకు అభినయింపలేకపోయిరి. ఇట్టి ఆటంకములు కలుగుననియే కొందరు పండితులు, నర్తకుడు ఒక పాత్రలోని భావమును ప్రదర్శించు వరకే గాని అనుభవించుటకు అర్హుడు గాడను అభిప్రాయము వెలిబుచ్చిరి.

కాని ఆ పాత్రలో లీనమైనను, తను రంగస్థలముపై అభినయించుచున్నట్లు మరువక అభినయించు సామర్థ్యముగల నర్తకులు నెప్పుడు పాత్రలో లీనమైనను యెట్టి హానియు నుండదు.

హరిప్రసాదరావుగారు హరిశ్చంద్రుని పాత్రనభినయించునప్పుడు – కాటికాపరి ఘట్టములోని అభినయమతి సహజముగ నుండెనట. కాని వారి ప్రక్కను చంద్రమతి పాత్ర నభినయించుచున్న వారు తానభినయించునట్లు మరచి రంగస్థలముపై నిజముగ యేడ్పుట మొదలుపెట్టెనట. ప్రసాదరావుగారు అతి సహజముగ నభినయించినను, తను నిజముగ హరిశ్చంద్రుడు గాడనియు – ఆ పాత్రలోని భావగంభీరతను మాత్రము ప్రేక్షకులకు ప్రదర్శింపవలెనన్న దృఢసంకల్పముతో ప్రదర్శించుటచే ప్రసాదరావుగారు తన్ను తాను మరచినను రసభంగము కలుగలేదట. ఇట్టి సామర్థ్యముగల నర్తకులే పాత్రల యొక్క భావములో లీనమై సహజమైన అభినయము ప్రదర్శింపగలరు.

ఇట్టి సామర్థ్యము నాయికాభినయమునకు ముఖ్యము.

* * *

పదాభినయము తరువాత 'జావళీలు' అభినయింపబడును. రసభావములందు తక్కువబడి, మధ్యలయలో పాడబడే శృంగార రచనలు జావళీలనబడును. పదములు విలంబిత లయలో నుండుటచే సాత్విక సంచారుల నభినయించుట కవకాశముండును. జావళీలు త్వరితగతిలో నుండుటచే యిందు సాధారణముగ రెండు మూడు భావములు ప్రదర్శించి ముగింతురు.

ఛత్రపురివారి, ధర్మపురివారి, జావళీలు ప్రఖ్యాతిచెందినవి.

జావళీల తరువాత నేటికాలములో భావగీతములు, జానపద గేయములు అభినయింపబడుచున్నవి.

తెలుగునాడులో – కృష్ణశాస్త్రి, బసవరాజు అప్పారావు, అడవి బాపిరాజు మొదలైనవారి గేయము లభినయింపబడుచున్నవి.

తమిళదేశములో – భారతియార్ – పాపనాశనమ్, శివన్ మొదలైనవారి రచనలు అభినయింపబడుచున్నవి.

జానపదగేయములలో

తెలుగుదేశములో –

వండూరివారి ఎంకిపాటలు

కొనకళ్ళవారి 'బంగారుమామ' పాటలు.

మరియు యితర రచనలు నృత్యమాడబడుచున్నవి.

అరవదేశములో –

వారి కత్యంత ప్రియమైన

"తీరాదవిళై యాటుపిళ్లై

కణ్ణన్ తెరివితే

పణ్ గళుక్కొయాదె తొల్లై

ఆడుపాంబే

నృత్యమాడబడుచున్నది.

శాస్త్రీయమైన అభినయము జూచిన తరువాత ప్రేక్షకులకు కొంత మార్పు, ఉత్సాహము గలిగించుటకు, ఈ తేలిక పదముల కభినయము ప్రదర్శింపబడుచున్నది.

అటుపై –

శివతాండవ వర్ణనగల తమిళ పాటలకు నృత్యమాడబడుచున్నది.

"నటనం ఆడినార్ – వెగునాగరిక మావె

కనక సభయిల్ – ఆనందనటనం"

నడకయిల్ లయిల్ – మన్నాళ్ మాటిని

కరుల్ చైద పడిత వరామల్ తిల్లై

పదనిల్ వందు – తె మాన తిల్ గురు

పూనతి పగల్ నే తతిల్...."

లేక

'నటమాడి తిరిందా ఉమకిడదుకా

ఉదహమల్ ముదమాన దేవేంద్రు

బొల్లు వీరయ్యా" అను పాటను

లేక

"ఆనంద నటనం ఆడినార్

సచ్చిదానంద నటనం ఆడినార్

పరాశక్తి నటనం ఆడినార్"

వానుం భూవియుం వణంగి మహిందిర

జ్ఞాన వెలియల్ వీణై ఓం ఓం అంద్రోశియె॥"

మొదలైన శివగీతములు నృత్యమాడబడుచున్నవి.

* * *

'తిల్లాన'తో నృత్యప్రదర్శనము ముగియును

**తిల్లాన –**

నృత్త నృత్యములతో గూడి యుండునట్టి రచనా విశేషము తిల్లాన యనబడును. ఈ రచన పల్లవి, అనుపల్లవి, చరణము గలిగియుండి, పల్లవి అనుపల్లవియందు 'తోం, తాం, దిరి, దిగి, దిగు" మొదలైన మృదంగశబ్దముల కూర్పును, చరణము సాహిత్యమే యుండును.

ఈ తిల్లాన జతి తిల్లాన (తిల్లాన దరువు), సాహిత్య తిల్లాన, తిరానా అని మూడు విధములుగ నుండును.

## జతి తిల్లాన

స్వరపల్లవులందునవలె

'నా, దిగి, దిరి, తిల్లాన, తిరికిట'

మొదలైన శబ్దములతో గూడిన పల్లవి గలిగి దానికి వివిధ గతులలో జతులను చేర్చిచి నృత్యమాడుటకు వీలైన 'జతి తిలాన' లేక 'తిలాన దరువు' అనబడును.

ఉదా :–

ప॥ ధీంత నారె నాదిర దిరనా

నాద్ర ధీం తనారె॥

ఈ పై పల్లవికి జతులు

(1) తతైతా । దితైత । తకతైత । దితైత ।

తధీం గిణత । తధీంగిణత॥

(2) తతైతాహ । దితైతాహ । తతైతాహ । తకతైతాహ

తతైతాహ । దితైతాహ । తదిగిణతోం । తదిగిణతోం ।

తదిగిణతోం॥

(3) త ss జ ెss త s తదిగిణ

తదిగిణత । దిగిణత । తక తదిగిణత ।

(4) తోం తరి । ధీం తరి । తోంత । ధీంత । తరి

తరి తారి ది త్తంతరి । తరికిట ది త్తంతరి ।

తా ధీం గిణత । తాధీం గిణత । తాధీం గిణత

ఇట్టి జతులను కాళ్లతో పలికింపుచు జతిస్వరము నందువలె హస్తపాద విన్యాసములను ప్రదర్శించుట 'జతితిల్లాన' లేక తిల్లాన దరువు అనబడును.

## సాహిత్య తిల్లాన

**కాఫీరాగం – ఆదితాళం**

ప॥ ధీం ధీం తనన ధీం తనన ధీం తనన ధీం తనన తరిధీం॥

అ॥ తనదిమి దానితరి

ఉదని తానద్రెద్రె । నాదిర్ దిత్తోం తనన

తరితా s జంతరి ధీం

తజ్ఝణు ధళంగ్ । తకదిమి తకతరి

తాకు ధీకు తక । తరికిట జం తరికిట తక
త ధీం గిణతోం । తధీం గిణతోం ।
తధీం గిణతోం । తకతోం

పై కాలము

తాహత । జంతరి । కిటతక । తకజణు
తదిమిత । కిటతక । తకదిమి । తరితక

ముక్తాయి

తద్ధి కిటతక ధిగ్గుడు తోం
కిటతక ధిగ్గుడు తోం
ధిగ్గుడు ధిగ్గుడు । తరికిట తోం

చ॥ మహామోహన కారుడే ॥ చెలి ।
మనసాంగ సౌందర్య రాశియే
నవయుడు మదినిన్ను । పది పది దలచగ
నవరుట తగునటె మగువ । శ్రీ మాధవునితో

ఈ తిల్లాన యందు పల్లవి, అనుపల్లవికి నృత్తము ప్రదర్శింపబడి చరణమునకు నృత్తమాడబడును. వీనిని సాహిత్య తిల్లాన లందురు.

తరాన మెస్సాగ 'హిందూస్థానీ' వారు పాడుదురు. ఇందులో 'దిర్ దిర్ దిర్ దిర్ – తెరాన – తరాన' మొదలైన శబ్దములతో కూడిన పాటను 'తరాన' అనియు, 'తరికిట త్రోం – ధిగ్గుడుతోం – ద్రాన్ – కతాన్ ।' మొదలైన శబ్దములతో గూడియున్న దానిని 'తిరికిట' లనియు పిలుతురు. నేటికాలములో కొందరు భరత నాట్యనర్తకులు 'తరానలు' గూడ నృత్యమాడుచున్నారు. ఇందు నర్తకి పాదపంచలనములో తనకు గల నేర్పు, వేగము (Speed) ప్రదర్శించుటకు చక్కని అవకాశముండును. ఇది హిందూస్థానీ పద్ధతి ననుసరించి స్థాయి (మన పల్లవి) అంతర (అనుపల్లవి) మాత్రము గలిగి యుండును. ఇందు సాహిత్యము లేక అభోగి, సంచారి (చరణము) లందు పై కాలములో మృదంగ శబ్దములతో గూడిన జతులు పాడబడును.

ఉదా :-

**బేహాగురాగము – ఆదితాళము**

స్థాయి – నాదిర్ దిర్ దిర్ । దిత్తోం దిత్తోం
నాధిన్నా దిన్నా ॥

అంతర – నాదిన్ ధిన్నా । తిత్తం ధిన్నా
నాధిన్నా తకతక ధిన్నా ॥

అభోగి – త, తకిట తకత్తె । ధిం కా తకట తక తోం
ధిం తకిధత జం । ధీ తక్కడిత తోం
దిగిత్త తగిత్త । తకదది గిణతక ॥

సంచారి – తరాన తరికిట త త తరికిట
తరికిటతక దిరి కిటతక దిన్నా
తిరి కిటతక దిరి కిటతక
తర కిటతక తత తోం తర కిటతక తత్త తోం
తరకిటతక త త తోం
ధిగ్గుడు ధిగ్గుడు తోం । ధిగ్గుడు ధిగ్గుడు తోం
ధిగ్గుడు ధిగ్గుడు ॥ నా ॥

* * *

పైన జెప్పిన విధముగ శాస్త్రీయ భరతనాట్య ప్రదర్శనము 'అలరింపు' తో ప్రారంభమై 'తిల్లాన' తో ముగియును.

* * *

పండిత సభలందు బహుకొద్దిమంది రసజ్ఞుల ముందు మాత్రమే ప్రదర్శింపవగిన నృత్యవిశేషములు

**(1) రాగభావ అభినయము**

ఏదైన ఒక రాగమును వీణపైగాని, మురళిపైగాని ఆలపించు నప్పుడు ఆ ధ్వనిలోని మాధుర్యమును, ఆ రాగములోని ముఖ్యరసమును పోషించుచు ఆలాపన ననుసరించు క్రమేణ దానిలో నిమిడియున్న భావమునంతయు సాత్విక సంచారుల ద్వారా అభినయించుట రాగాభినయమనిరి. ఇట్టి అభినయ... నాదమును, దాని యొక్క ప్రభావమును గుర్తించి బాగుగ నభ్యసించి పరిశోధన ఒనర్చిన నర్తకులు మాత్రమే యభినయము చేయగలరు. ఇది పదాభినయము, శ్లోకాభినయము కంటెను చాల కష్టమైనది. పదముల అభినయములో కొన్ని మాటల యొక్క చేరిక వల్ల యేర్పడే అర్థమునకు మనము భావప్రకటన చేయుదుము. రాగాభినయమందు ధ్వని యొక్క కూర్పు యందు గల ప్రతి స్వరమును పలికించి ఆ ధ్వని మన చెవికి సోకినప్పుడు మన హృదయములో గలిగెడు మార్పుల నభినయింపవలసి యుండును. ఈ అభినయము సామాన్య ప్రజానీకమున కర్థముగాదు. కనుకనే బహుకొలది మంది రసజ్ఞుల ముందు మాత్రమే ప్రదర్శింపవలెను.

**(2) తిహానమునకు అభినయము**

రాగమునందు ప్రతిస్వరమునకు ప్రాముఖ్యము నిచ్చి ఆలపింతుము. ఇందు స్వరము, ధ్వని ప్రాధాన్యము. గతి యుండదు. తహనము నందు స్వరములు వివిధ గతులందు పలికింపబడును. కనుక రాగమునం దభినయించిన సంచారులనే వివిధ గతులలో ప్రదర్శింపవచ్చును. గతి మార్పులనుబట్టి సంచారి అభినయ స్వరూపము గూడ కాలవరకు మారుచుండును.

**(3) భావప్రధానమైన మృదంగ శబ్దముల అభినయము**

సాధారణముగ నాట్యకచ్చేరీలలో మార్దంగికుడు పలికించు మృదంగ శబ్దములకు నర్తకుడు నృత్త, నృత్యముల నాడుచున్నాడు గాని అభినయము ప్రదర్శించుటలేదు. మార్దంగికుడు కూడ గతి

ప్రధానమైన మృదంగము వాయించునుగాని, రసప్రధానమైన వాద్యమును వినుట బహు అరుదు. అట్లుగాక మృదంగ శబ్దములలో గూడ నాదములో కుడి యెడమలను హెచ్చుతగ్గులుగ సవరించుచు కూర్పులు చేయుచు వాయించిన, అట్టి వాద్యములో మనకు కావలసిన రసమును పుట్టింపవచ్చును. అట్టి వాద్యములోని భావమును సాత్విక సంచారుల ద్వారా ప్రదర్శింపవచ్చును.

## (4) రాగ స్వరూపమును దెలుపు నృత్యము

హిందూస్థానీ సంగీతములో ప్రతిరాగము ఒక్కొక్క చిత్రములో చిత్రింపబడినవి.

ఉదా :– రాగిణి భైరవి –

ఒక నర్తకి శివాలయ ప్రాంగణములో రెండు చేతులందు చిన్ని చిట్టి తాళముల ధరించి నృత్యమాడుచుండును. ఇరుప్రక్కల యిద్దరు స్త్రీలు వీణ మృదంగము వాయించుచుందురు.

తన నాధుడెచటనో దూరదేశములో నున్నాడను విచారము తోను, తప్పక తిరిగివచ్చి తప్పక తనను చేరునను ఆశతో గూడిన దృఢ నిశ్చయము ఆమె ముఖముపై గోచరించును. ఇది ఆ చిత్తరువులో మనకు కనబడు విశేషము.

భైరవి రాగిణి ఆలపించినప్పుడుగాని, ఆ ఆలాపనకు తగు విధముగ నృత్యమాడునప్పుడుగాని, మనకు చిత్తరువులో ప్రదర్శింపబడిన ఆవేదన, దైన్యము మొదలగు భావములన్నియు మన హృదయమునకు తట్టును.

అనగా నాదము యొక్క ప్రభావము నెఱిగిన గాయకులా రాగము నాలాపించినప్పుడు, ఆ ధ్వని ననుసరించి నర్తకుడు నాట్యమాడినప్పుడు, మనలో తప్పక ఆ భావముతో నిండిన ఒక స్వరూపము మన నేత్రముల ముందు నృత్యమాడును.

## (5) రాగ తత్వమును దెలుపు నృత్యము

ఉదా :– దీపక్ రాగము –

ఈ రాగము పాడిన, దీపములు వెలుగుననియు, వెలిగెడి వనియు శాస్త్రములు తెలుపుచున్నవి.

ప్రతి రాగమునకు కొన్ని రాగిణులుండును–
అనగా 'రాగములు' – పురుషులు
రాగిణులు – స్త్రీలు
('దీప' అనగా 'కాంతి' లేక 'వెలుగు')
వెలుగును విభజించిన ఏడు రంగులు వచ్చును–
(పసుపు, ఆకుపచ్చ, ఎరుపు మొదలైన రంగులు)

ఈ ఏడు రంగుల యొక్క ప్రభావము ననుసరించి, వానికి తగిన 'రాగిణులు' కల్పించి (అనగా ఆ రంగు ఆహార్యముతో) ఆ భావమునకు తగిన తాళములో వేరు వేరు నర్తకులు నృత్యమాడుదురు –

ఈ ఏడు రాగములలోని భావములను జతపరచి తాళములను చేర్చి ఆడిన దీపక్ రాగ ప్రభావము మనలో కలుగును– అట్లే ప్రతి రాగము నభినయింపబడును–

## (6) నృత్తములో విశేషములు

నర్తకులు నృత్తమాడు ప్రదేశములో కుంకుమగాని ముగ్గుగాని పరుపబడును– నర్తకులు దానిపై నృత్యమాడుదురు. నృత్యాంతమందా ప్రదేశమును మనము తిలకించిన, ఏ కథను నర్తకులు నృత్తమాడిరో – అనగా రాధాకృష్ణ నృత్యమాడిన రాధాకృష్ణ చిత్తరువులను, పద్మనృత్యము సల్పిన పద్మము భ్రమరముల యొక్క చిత్తరువులు అచ్చట చిత్రింపబడియుండును.

కొన్ని సమయములందు నాట్యమాడు ప్రదేశమంతయు బతాసాల (పంచదార పొంగులు) తో కప్పబడి యుండును– నర్తకులు వానిపై నృత్యమాడుదురు– నృత్యాంతమందా ప్రదేశమును జూచిన యెక్కడ 'బతాసా' అక్కడనే యుండును– ఒక్కటి గూడ పగులుటగాని, నుక్కలగుటగాని యుండదు.

వీనిని బట్టి నర్తకులకు పాదసంచలనమునందుగల నేర్పును తెలిసికొనగలము– మరికొందరు నర్తకులు వాడియైన కత్తులపై గూడ నృత్యము జేయుట గలదు.

కాని యివన్నియు రసజ్ఞులైన యే కొద్దిమంది పండితుల ముందునో ప్రదర్శింపడగును. సామాన్య ప్రజానీకము ముందు గాదు పూర్వమిట్టి నృత్యమును దర్బారులలో సల్పెడివారని నాకు కథక్ నృత్యము నేర్పిన అచ్చన్ మహారాజుగారు, భరతనాట్యము నేర్పిన పందనల్లూరు మీనాక్షి సుందరంగారు చెప్పిరి.

♦ ♦ ♦

## భరతనాట్య ప్రదర్శనము

ప్రదర్శించు విధానము – అట్లు ప్రదర్శించుటకు గల కారణములు.

మనము భరతనాట్య ప్రదర్శనము (దర్బారు ఆటను) జూచినప్పుడు నృత్యక్రమము ఈ క్రింది విధముగ నుండుట సాధారణముగ చూచుచున్నాము.

(1) అలరింపు
(2) జతిస్వరము (నృత్తము)
(3) శబ్దము (నృత్యము)
(4) వర్ణము (నృత్యము)
(5) పదము (అభినయము)
(6) తిల్లాన

ప్రతి భరతనాట్య ప్రదర్శనము ఈ విధముగ 'అలరింపు'తో ప్రారంభమై 'తిల్లాన' తో ముగియును. కొందరు విమర్శకులగు కళారాధకులు ఈ యేర్పాటు బాగుందని మెచ్చుకుందురు– మరి కొందరు ఈ యేర్పాటు పూర్వపు నర్తకులకు అనుకూలముగ

యుండి యుండును. మనము ఈ పద్ధతినే అనుసరించవలసిన అవసరములేదు. 'శబ్దము' ముందు చేసి తరువాత 'జతి స్వరము' ఆడినందువల్ల నష్టమేమున్నది? 'అలరింపు' ఆడగానే పదము నెందుకు అభినయించ గూడదు? అట్లభినయించుట శాస్త్ర విరుద్ధము గాదుకదా! అందుచే ఈ క్రమపద్ధతిని మార్చిన దోషమేముండునని విమర్శింతురు.

ఈ పద్ధతి ఆలయ సంప్రదాయములోని 'పేరిణి' విన్యాసము ననుసరించి, ఆనాటి పండితులచే ఏకపాత్ర నృత్యానికి అనుగుణ్యముగా, నృత్త, నృత్యాభినయములు ఎక్కుగా పోషింపబడే పద్ధతిలో అభివృద్ధి పరుచబడినది. 'పేరిణి' క్రమము గురించి దేవదాసీల నృత్యాల గురించి వ్రాసిన భాగములో విపులంగా చర్చించాను. ఈ సంప్రదాయము అభివృద్ధి జెందుటకు ముఖ్యంగా, సహకరించిన వారు తంజావూరు నందలి నాట్యాచార్యులు చిన్నయ్య, పొన్నయ్య, వడివేలు, శివానందము – అను నలుగురు సోదరులు. తిల్లానాలు మన సంగీతమునకు క్రొత్తవి. జక్కిణి జతులు, పొణ్ణంగి దరువులు కైవారగీత ప్రబంధములు మాత్రము నృత్తమాడెడివారు. తిల్లాన రచన ఉత్తర హిందూస్థాని సంగీతమునుండి మన సంగీతములోనికి వచ్చిన తరువాత తిల్లానాను గూడ నాట్య కచ్చేరీలలో చేర్చిరి, నృత్యమాడుట మొదలు పెట్టిరి.

'నట్టువ సంప్రదాయ నృత్యము. ఈ క్రమపద్ధతిలో ప్రదర్శించుటకు కారణమేమి? దాని యొక్క విశిష్టత యెట్టిది?' అని మనము ఆలోచించవలెను. ఈ క్రమపద్ధతిలో చేయబడు నృత్య ప్రదర్శనము చూచినప్పుడు ప్రజలు పొందు ఆనందము యెట్టిది? క్రమపద్ధతిలో ప్రదర్శింపబడని యితర నృత్యములు చూచునప్పటి ఆనందమెట్టిది? ఈ విషయములన్నియు ఆలోచించినచో దానిలోని విశిష్టత మనకు తెలియును.

మొదట 'అలరింపు' తీసుకొందము.

ఈ అలరింపు ప్రార్థనా నృత్యము. ప్రతి నృత్య ప్రదర్శనము ప్రార్థనతో మొదలగును. కాని ఈ అలరింపులో ఒక విశిష్టత ఉన్నది. ఈ అలరింపు శబ్దములు 'తా, తై' అని గాని లేక 'తాం, ది, తాం' అని గాని 'నటువుడు' చక్కగ పాడుచు అన్ని వాద్యములు సమశ్రుతిలో వాయించి మార్దంగికుడు మధురముగ మృదంగముపై వరుసలను పలికించినచో 'ఓం' కార మిశితమైన సునాదము ప్రేక్షక గృహము నంతను క్రమ్మివేయును. ప్రేక్షకుల హృదయములు పవిత్ర భావముతో నిండిపోవును. 'ఓం' కారము యొక్క ప్రభావమెట్టిదో మనకందరకు తెలిసినదే కదా!

'ఇదంతయు మీ స్వయం కల్పన' అని కొందరు కళారాధకులు నన్ను విమర్శింపవచ్చును.

కాని ధ్వని యొక్క ప్రభావము నెరిగి 'నటువుడు' చక్కగ పాడి మృదంగము పలికించినచో తప్పక అట్టి అనుభూతి ప్రేక్షకులకు కలిగితీరును. నేడు నాట్యాచార్యులు దీని విషయమై ప్రత్యేక శ్రద్ధ తీసికొనక పోవుటచే మనకట్టి యనుభూతి కలుగకున్నది. దీనికి నేటి నర్తకులు, నాట్యాచార్యులే కారణము. పూర్వము ఈ శబ్దముల నేర్పరచిన నాట్యకళావేత్తలు మాత్రము ఆ ధ్వనుల యొక్క ప్రభావము నెరిగి అనుభవించిన తరువాతనే కూర్చిరని నా అభిప్రాయము.

'అలరింపు' తరువాత 'జతిస్వరం' ఆడబడును.

జతిస్వరమే యెందుకాడవలెను?

నర్తకుడు అభినయమందు నవరసములను పోషింపవలెను. అందు అతి సూక్ష్మమైన భావభావములను ప్రదర్శింపవలెను గదా! ఆ భావములను ప్రదర్శించుటకు ముందు తన శరీరములోని అవయవము లన్నింటికి కొంత కదలిక కలిగించవలెను. వ్యాయామము నివ్వవలెను. అంగ ప్రత్యంగోపాంగములను తన స్వాధీనములో నుంచుకొనవలెను. అందులకు జతిస్వరము పయోగపడును. అదియుగాక ప్రదర్శనము మొదలు పెట్టడముతోనే అంత తొందరగ రసాభినయముల ననుభవించి ఆనందించలేరు. కనుక ప్రేక్షకులను క్రమేణ రసనిలయమగు అభినయమునకు మార్గమేర్పరచి గొనిపోవలెను. దానికిగాను వారి మనస్సులను తయారుచేయవలెను. కనుక ప్రప్రథమములో రసభావములు లేనట్టి తాళలయల ననుసరించి చేయబడే అంగవిన్యాసమును 'జతిస్వరము' ప్రదర్శింపబడును. ఇందు మృదంగ దరువులకు సరిపోవునట్లు అడవులు వేయుచు నర్తకి కాళ్ళను, చేతులను, మెడను, నేత్రములను కదిలించును. ఇది నృత్తము. ప్రేక్షకులను ఉత్సాహవంతులుగ చేయును. నర్తకి తన శరీరములోని ప్రతి అవయవమునకు వ్యాయామము నిచ్చి తన స్వాధీనములో నుంచుకొనగలుగును.

**శబ్దము**

ఇందు నూటికి యేబది పాళ్ళు నృత్తముండును. ఇందు వర్ణనా గీతములు, వానికి తగిన ఆంగికాభినయము ప్రేక్షకులు జూతురు. శబ్దములో మొదటిసారిగ కొంత అభినయము ప్రవేశ పెట్టబడును. అదియును ఆంగిక ప్రధానము.

**వర్ణము**

ఇందు పల్లవి, అనుపల్లవికి సాత్విక ప్రధానమైన అభినయము వుండును. ముక్తాయి స్వరమునుండి ఆంగికాభినయము, నృత్తము వృద్ధిచెందును. ఇందు సాత్వికాభినయము క్రమేణ వృద్ధి చెంది ఆంగికము తగ్గును. ఈ విధముగ అభినయము క్రమేణ వృద్ధి చెంది 'పదము' వచ్చునప్పటికి ప్రేక్షకుని అభినయము అనుభవించి ఆనందించుటకు తయారుచేయును.

ఈ క్రమము ననుసరించినందువల్ల లాభము – ప్రేక్షకుడు ప్రప్రథమములోనే సూక్ష్మమైన భావములను గ్రహించి అనుభవించి, ఆనందించే పరిస్థితిలో నుండనక్కరలేదు. క్రమేణ అంగహారముల ద్వారా అతని మనస్సు ఈ విధముగ తయారుచేసినప్పుడు 'మార్గ' నర్తకుని ఆనందమును పొందగలుగును.

పదములో ఒకపాలు నృత్తము తొమ్మిది పాళ్ళు సాత్వికాభినయముండును. అభినయము నాయికా ప్రదర్శింప గలిగినవాడు

నృత్యకళలోని విశిష్టత ఈ ముఖ్యాంశము వచు నప్పటికి ప్రదర్శనము మంచి పట్టు (climax) లో నుండును. అప్పుడు నృత్యమాడువారు గాని, ప్రేక్షకులుగాని ఆ భావములను అనుభవించి నేసికొని ఆ రసములో ప్రవేశించి అభినయించగలరు.

తరువాత జావళీలు, జానపద గీతములు మొదలైనవి అభినయింపబడును.

ఇంతవరకు కట్టుదిట్టమైన శాస్త్రీయమైన విద్య ప్రదర్శింపబడును కనుక తరువాత తేలికగా నుండు భావగీతములు, జానపద గీతములు, జావళీలు మొదలైనవి ప్రదర్శింతురు.

తిల్లానతో ప్రదర్శనము ముగియును. ఇది ప్రదర్శనాంతమందు చేయబడునది కనుక ప్రేక్షకులు ఇండ్లకు పోవు ముందు వారిని ఉత్సాహ పరచుటకు మంచి నృత్తప్రధానమైన 'తిల్లాన' ప్రదర్శింపబడును. ఇందు చిత్ర విచిత్రమైన తాళగతులను పాద విన్యాసములో నర్తకి ప్రదర్శించును.

*　　*　　*

## నర్తకుని యొక్క పాండిత్యమును పరీక్షించు విధము

ఎవరైనను నర్తకులు మన వద్దకు వచ్చినప్పుడు వారి విద్య యొక్క లోతును తెలిసికొనుటకు పెద్దలు చెప్పిన కొన్ని సూత్రములు.

### (1) నృత్యము

'మార్గ' పద్ధతి (శాస్త్రీయ పద్ధతి)

'దేశి' పద్ధతి (ఎక్కువగ శాస్త్రములపై ఆధారపడక 'లోకధర్మి' ననుసరించునది.)

— అని రెండు విధములు.

నర్తకుల విద్యను పరీక్షించునప్పుడు ఈ రెండు భేదములను మనసులో నుంచుకొనవలెను.

'మార్గ' పద్ధతిలో నృత్యకళ నభివృద్ధిపరచినవాడే పండితుడు. ఎందుకనగా 'మార్గ'లో 'నాట్యధర్మి', 'లోకధర్మి' — రెండును యిమిడియున్నవి. 'దేశి' పద్ధతిపై ఆధారపడిన నర్తకుడు మధ్యముడు.

### (2) అభినయము

'శృంగార రసము' నభినయించుచున్నాడను సమయములో అతనిని కరుణగాని, భీభత్స మింపుమని అడిగినచో అతడు శృంగారము ఈ రసములను గూడ వెంట వెంటనే తనిని పండితునిగా నెంచవలెను.

### (3) నృత్తము —

నర్తకుడు నృత్తమాడునప్పుడు మృదంగ గతి ననుసరించును. అది గాక మయూర, మరాళ, సింహ, హరిణ, మీన, మత్తేభ మొదలైన వాని నడకల నాడమని అడుగవలెను. మరియు 'పటవాటము, పటవము, సూరిపటము, లకాడిమము, సిరిబిరము, హలాభిదము మొదలైన అడవుల కొల్లిచ్చి నృత్తమాడమనవలెను. ఇవి యన్నియు క్రమము దప్పక నృత్తమాడిన వాడే ఉత్తముడు. లేక ప్రదర్శించిన గతినే త్రిప్పి త్రిప్పి ప్రదర్శించినచో అట్టి నర్తకుడు మధ్యముడు. నృత్తములో పాదము భూమిపై తట్టి గజ్జెలన్నిటిని పలికించి నృత్తమాడుట సాధారణముగ ప్రతి నర్తకుడు చేయుపనియే. అట్లుగాక నర్తకులను పది గజ్జెల నాదము, ఐదు గజ్జెల నాదము, ఒక గజ్జెను మాత్రము పలికించుమని అడుగవలెను. మరియు మనము కొన్ని గజ్జెలపై గుర్తులు నుంచి ఆ గజ్జెలను మాత్రము పలికించుమని కోరవలెను. అట్లు చేయగలిగిన వాడే నాట్యశాస్త్ర కోవిదుడు.

### (4) తాళము, లయ

సాధారణముగ ప్రతి నర్తకుడు తన వెంట నొక మార్దంగికుని తెచ్చుకొనును. ఆ మార్దంగికునితో కొన్ని తాళములు, జతులు, తిర్మానములు, అభ్యాసముచేసి వానినే మనముందు ప్రదర్శించును. అట్లుగాక మనము వేరొక మార్దంగికుని యేర్పాటుచేసి అతని వాద్యమునకు నృత్తమాడమని కోరవలెను. మరియు మనకు తోచిన గుప్త తాళములు, రుద్ర తాళము, లక్ష్మీ తాళము, మరియే యితర తాళమునో నృత్తమాడి చూపవలెను. ఇందు నర్తకునకు, తాళ శాస్త్రమునందు గల పాండిత్యమును కనుగొనవచ్చును. కాలపై కాలములు, మూడు కాలములలో నృత్తమాడుట సామాన్య నర్తకులు చేయుపని అట్లుగాక $1\frac{1}{4}$ లయ, $1\frac{1}{2}$ లయ, $\frac{1}{3}$ లయలో నృత్యమాడు మని అడుగవలెను ఇట్లు నృత్తము సల్పిన నర్తకుడు తాళ లయ లందు పండితుడు.

### (5) నృత్యము

నృత్యములో హస్తవిన్యాసము, నేత్రముల దృష్టి, భ్రూపుట, గ్రీవముల యొక్క చలనములను పరీక్షింపవలెను. మాటిమాటికిని ఒక విధముననే ప్రదర్శించిన అతడు మధ్యముడు. అట్లుగాక వివిధ గతులను వెను వెంటనే జూపగలిగిన యతడు సమర్థుడు.

ఆంగిక ప్రధానమైన అభినయము జూచుటకు (ముద్రల అభినయము గూడ) అధ్యాత్మరామాయణ కీర్తననో, కృష్ణలీలా తరంగములనో, దీక్షితార్ కృతినో యిచ్చి నృత్యమాడమనవలెను. వీని యందు సాత్వికము తక్కువ యైనందున ఆంగికము ద్వారానే పాటలోని అర్థమును ప్రదర్శించుట కవకాశమున్నది. ఆంగికమందు దిట్ట అయిన వాడు మాత్రమే పై కీర్తనల నభినయింపగలడు.

హస్తము (ముద్ర) ల అభినయమునకు పినతల్లి, అమ్మమ్మ, మేనమామ, తోడల్లుడు, తల్లి తరపున బంధువులు, మేనత్త కొడుకు మొదలైన మాటల నిచ్చి హస్తములను పట్టమనవలెను.

దీనికి వెంబనే పట్టుటకు హస్తములు లేవు. కొన్ని హస్తములను చేర్చినగాని ఆ మాటలకర్థము రాదు గనుక నర్తకునకు ముద్రలయందు గల పాండిత్యము తెలియును.

(కాని పండితుల కొక చిన్న మనవి. భరతశాస్త్రములో వచియింపబడినవి గదా అని శకటాస్యము, చక్రమండలము, మయూర మొదలైన కరణములను నర్తకుల నభినయింపమని కోరిన ఒక్కొక్కప్పుడు వారు వాటి నభినయింప లేకపోవచ్చును. ఏమనవలెననగా అవి నేటి కాలములో ప్రచారములో లేక పోవుటయే గాక వాని యుపయోగము ప్రస్తుత నృత్యములలో లేదు. కనుక నర్తకులు అట్టి కరణముల యొక్క లక్షణ లక్ష్యములను తెలిసి యుండిన చాలును.)

కొందరు నర్తకులు ఒక చెవినో, లేక చేతిలోని కొన్ని కండరములనో ఆడించుట అభ్యాసము జేసి మన ముందు ప్రదర్శింతురు. అట్టి అభ్యాసము కేవలము ప్రజలను భ్రమపెట్టుటకు, మోసగించుటకు పనికివచ్చును గాని, దానిని బట్టి విద్యలో నెట్టి అభివృద్ధియు నుండదు. అట్టి అభ్యాసము నృత్యకళను పెంపొందించుటకే విధముగను తోడ్పడదు.

ఈ సందర్భములో రామకృష్ణ పరమహంస జీవితములో నుండి ఒక చిన్న ఉదాహరణ నిచ్చుచున్నాను.

రామకృష్ణుడు దక్షిణేశ్వర ఆలయములో నుండునప్పుడతని యొదకొక యోగివచ్చి గంగానదిపై ఒక యొడ్డునుండి మరి యొక్క యొడ్డునకు నడచివెళ్లి—

"నీవు యోగివైనచో నీయోగ ప్రభావముతో నావలె నడువు" మని ప్రశ్నించెను.

అంత రామకృష్ణుడు "ఓయీ! యిన్ని సంవత్సరములు నీవు సాధనజేసిన యోగవిద్య విలువ ఒక అణాయేనా? అణా యిచ్చిన పడవవాడు అవలి యొడ్డుకు చేర్చునే!" యని నవ్వి యూరకుండెను.

అట్టిదే ఈ పింకి సాధనల యొక్క ఫలితము. ఒక కానీ యిచ్చిన బిచ్చమెత్తుకొను దొమ్మరివాండ్రు యింతకంటె యెక్కువ వింతలు చూపుదురు. కనుక పండితులు యిట్టి సాధనలకెక్కువ విలువనీయరాదు. ధీరోదాత్తుడు, ధీర లలితుడు మొదలైన నాయకులను వివిధ నాయకులను, వివిధ నాయికలను నృత్యమాడునప్పుడా పాత్రలకు తగు విధముగ అడుగులు వేయుట, హస్తాభినయము ఉన్నదా, లేదా అని మనము చూడవలెను.

## (6) నృత్యభేదములు

పురుషుల నృత్యము చేయునప్పుడు స్త్రీల ఛాయలు,
స్త్రీల అభినయము చేయునప్పుడు పురుష ఛాయలు

నృత్యములో యున్నవేమో చూడవలెను. అట్టివి యున్నచో నర్తకుడు సమర్థుడుకాదు.

స్త్రీ పురుష అభినయము, నాయిక చెలికత్తెల అభినయము కలిసియుండే పదములనిచ్చి అభినయింపమని కోరవలెను.

ఉదా:— ఏమని తెలుపుదు నేలాగు తాళుదు
నేమి చేతునే? చెలియా!
భామరో! యూరికి బయలుదేరెడు వేళ
ప్రేమ మీర నా సామి పలిచి చెప్పిన మాట॥
ఇంతవరకు నాయిక వచనము.

తరువాత

"అన్నమందక — అతివేత నొందకు
కన్నీరు నింపకు — కలువరింపకుమని
ఇది ఆమె నాధుని వాక్యము
ఎన్నెన్నో విధముల — హితవులు దెలుపుచు
కన్నీరు నించుచు — గాంతుడు చెప్పిన మాట॥"
మరల ఆమె మాటలు

ఇందులో నాయిక తన యొక్క దుఃఖము చెలితో చెప్పుకొనును. అంతేగాక నాధుడెట్లు చెప్పెనో ఆ విధము గూడ తెల్పుటచే నాధుని వాక్యముల వద్ద పురుషాభినయ ఛాయలు కనబరుపవలెను.

తరువాత నాయిక అభినయమే.

ఈ భేదముల కనబర్చుచు విద్వాంసుడైన నర్తకుడే అభినయింపగలడు.

"ఎవ్వరి సంపద నేమి సేయుదు
నీదే యిది బుద్ధి వినవమ్మా"
మువ్వగోపాలుడు మోడి జేసుకున్నాడు
మొన్నటాల నుండి రాడు నీ తోడునే ॥నె॥
"అతివ చులకనని — యందు బోరాదని
యతని బిలువనని — యంపే నామదిలోన"

ఇచ్చట మధ్యగల మాటలు చెలి పలుకుచున్నట్లు నాయిక అభినయింపవలెను.

ఇట్టి పదములనిచ్చిన నర్తకుని పాండిత్యము బోధపడగలదు.

(7) ముగ్గు, ఇక్కమువూడ్చుట, మ్రుగ్గి, పిలుచుట, వెళ్లుట, ఏదైన ఒక వస్తువును పట్టుకొనుట, వేయుట, నేలకొరుగుట మొదలైన అభినయములందు సామాన్యముగ మనము దినచర్యలలో చేయునట్లు చూపిన అతడు 'దేశి' నర్తకుడగును. కరణ అంగహారముల యొక్క ప్రయోగముద్వారా ప్రదర్శించిన 'మార్గి' నర్తకుని గాను గుర్తింపవలెను.

గతుల నాడునప్పుడు ప్రతి గతిలోను మార్పు ననుసరించి శరీరము యొక్క కదలికలలో మార్పులు ప్రదర్శింప గలిగినవాడు పండితుడు. లేనిచో మధ్యముడు.

ఇంతవరకు 'మార్గి' పద్ధతిని (నాట్యధర్మి) గూర్చి చెప్పితిని. ఇక 'దేశి' పద్ధతి యందు పరీక్షించువిధము గురించి చెప్పెదను.

ఉదా :- నర్తకుడు.

"నన్నిడిచిపెట్టిల్లి నాదే నారాజా
మొన్న తిరిగొస్త నన్నాదే"

అను ప్రోషిత నభినయించు చున్నాడనుకొందము. ఇందులో 'నారాజా' అన్నప్పుడు

మెడలోని మాంగల్యమును తీసి కనుల కద్దుకొనుట
నొసట నున్న బొట్టును జూపుట ఇది సహజము.

చేతనున్న గాజులు, తలలోని పువ్వులు జూపుట 'దేశి' పద్ధతిలో విద్వత్తు ప్రదర్శించుట, కాని

'నారాజా' అన్నప్పుడు
కుడిచేత శిఖరము పట్టుట
మీసము దువ్వుట

ఎడమచేత శిఖరము, కుడిచేత మృగశీర్షను పట్టి భర్త హస్తమును చూపుట 'మార్గి'కి చెందును. 'దేశి' పద్ధతిని చక్కగా నభ్యసించిన నర్తకుడు యెప్పుడును యిట్టి అభినయము చేయడు. ఒకవేళ యిట్టి అభినయము ప్రదర్శించిన, ఆ నర్తకునికి 'దేశి' అభినయములో అనుభవము లేదని గ్రహింపవలెను. 'దేశి' అభినయము అతి సహజముగ నుండును కనుక నర్తకునికి 'దేశి' అభినయమందున్న పాండిత్యము పరీక్షించుటకు జానపదగేయముల నిచ్చి అభినయింపమనవలెను.

ఇన్ని విధముల పరీక్షలో నెగ్గిన వాడే నాట్యాచార్యుడు. అట్టి నాట్యాచార్యులే దేశములో సత్సంప్రదాయముతో కూడిన కళను ప్రచారము చేయగలరు. అట్టి వారిచే నారాధింపబడిన లలిత కళలు అమరత్వము నొందగలవు.

# నాట్యవేదము



## భరతనాట్యశాస్త్రమందలి విభిన్న ప్రకరణముల వివరణము

'అభినయదర్పణమ్', 'నాట్యశాస్త్రము,' 'హస్తలక్షణ దీపిక'– అను ఈ మూడు గ్రంథములు ప్రస్తుతము మనదేశములో యెక్కువ ప్రచారములో నున్నవి.

'హస్తలక్షణ దీపిక' కథకళి నృత్యమునకు ముఖ్యగ్రంథము' భరతనాట్య శాస్త్రము, అభినయ దర్పణము – ఆంధ్రప్రదేశ్, తమిళ నాడు, బెంగాల్, మణిపూరులందు యెక్కువగా ఉపయోగములో నున్నవి. నాట్యశాస్త్రము కల్పతరువు వంటిది. దాని యందు నాట్య కళకు సంబంధించిన ప్రతి చిన్న విషయమును గూర్చి కూడ వ్రాయబడినది. 6000 శ్లోకములు, 37 అధ్యాయములు గల మహా గ్రంథమది.

### 1 వ అధ్యాయము

నాట్యశాస్త్రము యొక్క పుట్టుకను గూర్చి. దాని యొక్క విశిష్టతను గురించి వ్రాయబడినది. హృదయమునకు, ఆత్మకు ఆనందమిచ్చునట్టిది, చతుర్వర్ణములవారికి అందుబాటులో నుండు నట్టిది అయిన పంచమవేదము 'నాట్యశాస్త్రము'. (నాలుగు వేద ముల నుండి – వాద్యము, గీతము, అభినయము, రసములను గ్రహించి (బ్రహ్మసృష్టించి) ఈవిద్య భరతునికి నేర్పెను.)

### 2 వ అధ్యాయము

'నృత్యమందిర' నిర్మాణమును గురించి వ్రాయబడినది. అవి మూడు రకములు.

విక్రిత (రెక్టాన్‌గ్యులర్) – చతురస్ర (స్క్వేర్) త్రియాని (ట్రయాంగ్యులర్). ఇవి తిరిగి వాని వాని కొలతలనుబట్టి జ్యేష్ఠ, కనిష్ఠ, మధ్యమ అని మూడు తరగతులుగా విభజింపబడినవి. మధ్యమరకము పురుషుల కుపయోగించును. జ్యేష్ఠ 54 గజములు, మధ్యమ 32 గజముల పొడవుండును. అభినయము చక్కగా చూచుటకు గాన, వాద్యములను వినుటకు, భరతుడు మధ్యమ రకమే శ్రేష్ఠమని పేర్కొనెను.

నేపథ్యము (గ్రీన్ రూమ్) – ఎనిమిది గజములు – రంగశీర్ష – నాలుగు గజములు, రంగపీఠము నాలుగు గజములు – ప్రేక్షక గృహము 16 గజములు.

గ్రీన్‌రూమ్‌కు రెండు తలుపులు, ప్రేక్షక గృహమునకు మూడు ద్వారములుండవలెను. రంగశీర్ష, రంగపీఠములకు మధ్య తెర యుండవలెను. నర్తకులు రంగశీర్షమందు పూజచేయుదురు. ఇది రంగపీఠము కంటే కొంచెము యెత్తుగా నుండవలెను.

చుట్టును గోడలు పెట్టి సున్నము వేసి, లతలు జంతువులు మొదలైన వానిని గోడలపై చిత్రించవలెను. ప్రేక్షకులు కూర్చొను టకు ఆసనములను యేర్పాటు చేయవలెను. రంగపీఠమునకు అద్దమువలె నున్నగా మెరుగుపెట్టవలెను. రంగస్థలము ఒక గుహ వలె నుండవలెను.

### 3 వ అధ్యాయము

ఇందు రంగ దేవతారాధనను గురించి వివరముగా వ్రాయ బడినది.

### 4 వ అధ్యాయము

'అమృత మంథన్' అను రూపకము "సమవకార్" పద్ధ తికి చెందినది – దీనిని బ్రహ్మ లిఖించెను. భరతుడు నాట్య మండపములో అభినయించెను. తరువాత "త్రిపురదాహ" డిమ పద్ధతిని భరతుడు ప్రదర్శించెను. అది చూచి ఈశ్వరుడు తాండవ నృత్యమును భరతునికి నేర్పుమని తండుని ఆదేశించెను.

నృత్యకరణములు, 'అంగహారములు – నృత్యమంత హస్తమును, పాదమును సంయోగము జేసి కదల్చిన 'కరదు' మగును.

(హస్తపాద సమాయోగో నృత్యస్యకరణం భవేత్)

ఆరు, లేక ఆరు కంటే యెక్కువ కరణములు కలిగిన, ఒక అంగహారమగును.

### 5 వ అధ్యాయము

పూర్వరంగము – తెర యెత్తక ముందు నర్తకులు వాద్యము

లను శ్రుతి జూచుకొనుట గురించి, వాద్య బృందము కూర్చొను విధానమును గురించి, పూజావిధానము తెలుపబడినది.

తరువాత తెర యెత్తబడును. ప్రార్థన ముగిసిన పిదప సూత్రధారుడు, విదూషకుడు, పారి పార్శ్వకుడు, రంగస్థలముపైకి వచ్చి చతుర్విధ పాలకుల నారాధింతురు. నాల్గవ నర్తకుడు ప్రవేశించి ఇంద్రుని పతాకమునకు వందన మర్పించును. పిదప సూత్రధారుడు 'నాంది' పఠించి కథను గూర్చి, కథను రచించిన కవిని గూర్చి తెలుపుచు ప్రేక్షకులను ప్రశాంతముగా చూడమని ప్రార్థించి నిష్క్రమించును. శుద్ధ పూర్వరంగమందు స్త్రీలు కూడ రంగస్థలముపైకివచ్చి తాండవ నృత్యమాడి – అంగహారములు, రేచకములు ప్రదర్శింతురు.

**6–7 అధ్యాయములు**

ఇందు అభినయమునకు జీవమైన రసభావములను గురించి చర్చింపబడినది.

శృంగార, రౌద్ర, హాస్యాదినవరసములు, సంచారిభావములు, చతుర్విధ అభినయములు, నాట్యధర్మి, లోకధర్మి, వృత్తులు, ప్రవృత్తి, వాద్యములు, గానము – వీనిని గూర్చి తెలుపబడినది.

నర్తకుడు రంగస్థలముపై ప్రవేశించునపుడు, నిష్క్రమించునపుడు, రంగముపై అటునిటు సంచారముచేయునపుడు, రసభావములలో మార్పు గలిగినపుడు, యెట్టి సంగీతము పాడవలయునో వివరముగ తెలుపబడినది.

**8 వ అధ్యాయము**

ఆంగికాభినయము – అంగ, ప్రత్యంగ, ఉపాంగముల సంచలనము గురించి, నాట్యమందు వాని ఉపయోగము గూర్చి తెలుపబడినది.

**9 వ అధ్యాయము**

సంయుత, అసంయుత హస్తములు –

వానిని ఉపయోగించు పద్ధతి గూర్చి వ్రాయబడినది. అగ్రజాతులకు లలాటము ముందర హస్తములు పట్టవలెను. సరిసమానులకు వక్షమునకు యెదురుగను, తక్కువ జాతులకు క్రిందుగను పట్టవలెను.

ఇందు వక్షము, యిరుపార్శ్వములు, ఉదరము, కటి మొదలగు అవయవముల సంచలనము, వాని యొక్క వినియోగము మొదలైన విషయములను గూర్చి వ్రాయబడెను.

మూర్ఛ, నిరాశ జెందుట, విచారము, అలసట, నిదుర, నిస్పృహ, లజ్జ మొదలగు వానిని అభినయమందు హస్తములతో చూపక, ఒక్క సాత్వికాభినయముతోనే ప్రదర్శింపవలయునను విషయము వివరింపబడెను.

**10–11 అధ్యాయములు**

ఒక్కకాలు కదిలించుట, చారీ అనబడును. రెండు కాళ్ళు కదిలించిన 'కరణ' మగును. కొన్ని కరణులుచేరి 'ఖండ' మగును. మూడు, లేక నాలుగు ఖండములు చేర్చిన 'మండల' మగును. 'చారులు' యుద్ధమందు బాణమును సంధించుట యందు ముఖ్యముగా నుపయోగపడును.

మండలములు 24. ఇవి సంగీతము యొక్క సహాయముతో ప్రదర్శింపవలెను.

**12 వ అధ్యాయము**

గతిప్రచారము– ఇందు రంగస్థలముపైన నడుచువిధానమును గురించి తెలుపబడినది. రాజులు, సేవకులు, స్త్రీలు, వివిధ దేశీయులు యెటుల వ్యవహరింపవలయునన్న విషయము, వివిధ భావములను ప్రదర్శించునపుడేయే గతిననుసరింపవలెనో తెలుపబడినది. సప్తక – ఒకటి, రెండు, మూడు, నాలుగు గతులను గరిగి యుండును.

నర్తకుడు, శృంగార రౌద్ర శోకములందు, రథము నెక్కునప్పుడు, విమానము నెక్కునప్పుడు, మేడమెట్లు దిగునప్పుడు, అశ్వారోహణమందు అభినయించు విధానమును, ముసలివానిగా, విటునిగా, నిస్పృహయునిగా, మరుగుజ్జుగా, విదూషకునిగా యెట్లభినయించవలయునో వ్రాయబడినది.

స్త్రీల గమనము – యువతులు కోపమునందు, శృంగారమునందు యెటుల నిలబడవలెనో విశదీకరింపబడెను.

వీనిని చెప్పుచు మిగిలిన విషయములను నర్తకుడు లోకమునందు చూచి నేర్చుకొనవలయునని భరతుడీ యధ్యాయమును ముగించెను.

**13 వ అధ్యాయము**

ఇందు వివిధ ప్రాంతములలోని (అవంతి, పాంచాల, దక్షిణ పథ, మగధ మొదలగునవి) – ప్రజలు, ఆ పాత్రల, అభినయ విధానము గురించి విపులముగా వ్రాయబడెను.

**14–15 అధ్యాయములు**

ఛందస్సు, కావ్యములకు రమణీయతను గూర్చు వృత్తములను గురించి వ్రాయబడినది.

**16–17 అధ్యాయములు**

కావ్యమునకు భూషణములగు 'లక్షణములు' వర్ణింపబడినవి. ఉపమా, దీపకము, రూపకము, యమకములు ఉదాహరణముతో వివరింపబడెను.

నాటకము ప్రేక్షకులకు అర్థమగు సులభశైలిలో యుండవలెను. ప్రాకృత భాషలు – వాని నుపయోగించు విధానము; బ్రాహ్మణుడు, రాజు, పట్టమహిషి, సమానులు మొదలగు వారిని సంబోధించు విధములు వ్రాయబడినవి.

**18 వ అధ్యాయము**

రూపకములు పది విధములు – నాటక ప్రకరణ, భాణ,

ప్రహసన, వ్యాయోగ, సమవాకార, వీధి, డిమ, అంకము, ఈహా మృగము.

ఇవి కథానాయికను బట్టి, ప్రధాన రసమును బట్టి మారు చుండును.

## 19–20 అధ్యాయములు

కావ్యము, చతుర్వృత్తులను గూర్చి తెలుపబడినది.

## 21 వ అధ్యాయము

ఆహార్యాభినయము – రంగాలంకారములు, పాత్రలు ధరించు అలంకారములను గురించి వివరములన్నియూ వ్రాయబడినవి. కొండ జంతువులను, ఆయుధములను, రథములను, విమానము లను, కొండలను కూడ రంగస్థలముపై ప్రదర్శింప వచ్చునని తెలుపుచు, ఆ విధానము వర్ణింపబడినది.

## 22 వ అధ్యాయము

సామాన్యాభినయమును గూర్చి చర్చింపబడినది.

సాత్వికాభినయము – హావ, భావ, హేల, శృంగార మందు స్వభావసిద్ధమగు అనుభవములు – లీల, విలాసా, విభ్రమ, కిలికించిత, మొట్టాయితము, కుట్టమిత బిబ్బోకము, లలితము, మొదలగు వానిని గూర్చి వ్రాయబడెను.

## 23 వ అధ్యాయము

దూతిక గురించి దెల్పుచు, స్త్రీ తన ప్రియుని అనుగ్రహము బడయుట, స్వాధీన పరచుకొనుట, మొదలగు విషయములను గురించి చర్చింపబడినవి. ఆకార, గతి, చేష్ట, భాష, నేత్ర, వక్త్ర వికారాదులతో పరుల మనముల నెటుల గ్రహింపగలమో వర్ణింప బడినది.

## 24 వ అధ్యాయము

నాయికా నాయకులు, విదూషకుడు, సూత్రధారుడు, నర్తకి, మొదలగు నాట్యమందు వచ్చు పాత్రల లక్షణములు విశదీకరింప బడెను.

## 25 వ అధ్యాయము

చిత్రాభినయము – రాత్రి, పగలు, వెన్నెల, సంతోషము, ఉత్సాహము, సూర్యుడు, సింహము, కోతి, పెద్దపులి, పెద్దలకు నమస్కరించు విధానము, పక్షుల నభినయించుట, చనిపోవుటకు సిద్ధముగానున్న మనుష్యుని అభినయించుట, మొదలగు విషయములు చర్చింపబడినవి.

## 26 వ అధ్యాయము

ప్రకృతి వికల్పము – (1) అనుపము (2) విరూపము (3) రూపాను రూపము అను మూడు విధములు.

స్త్రీ, స్త్రీవేషము; పురుషుడు, పురుషుని వేషము ధరించుట అనుపము.

కుర్రవాడు వృద్ధుని వేషము, వృద్ధుడు యువకుని వేషము ధరించుట విరూపము.

పురుషుడు స్త్రీ వేషము వేయుట, రూపాను రూపమగును. ప్రతి నటుడు ఒక పాత్ర అభినయించవలసి వచ్చినప్పుడు తన్ను మరచి ఆ పాత్రయందు లీనమగుట ముఖ్యము.

## 27 వ అధ్యాయము

ప్రదర్శనము విజయవంతముగా చేయు విధానము– నర్తకులు ప్రేక్షకుల మనస్తత్వమును గ్రహించి రంగస్థలముపై అభినయించ వలెను.

ఒక ప్రదర్శనము విమర్శించునప్పుడు (1) సమాత్వము (2) అంగ మాధుర్యము (3) పత్యము (4) ప్రాకృతి (5) రస (6) గుణ (7) వాద్య (8) నేపథ్యము ఈ యెనిమిది అంశములు ముఖ్యముగా గమనించవలెను.

కైశికవృత్తి, శృంగార రసము, ప్రధానమై నృత్యగీతము లతో పూర్తిగా నిండియున్న నాట్యము ప్రదోషకాలమందు ప్రదర్శించవలయును.

పాత్ర, ప్రయోగము, సమర్ధన శక్తి, ఈ మూడు గూడ ప్రదర్శన విజయమునకు కారణమగుచున్నవి.

## 28–33 అధ్యాయములు

సంగీతము – స్వర, రాగ, తాళ, వాది, సంవాది, స్వరములు, తాళ జతులు, గ్రామ, జాతి – వీనిని రసములందు వినియోగించు విధానము. వాద్యముల నుపయోగించు పద్ధతి, తాళ పరిమాణము, లయ, ధ్రువము మున్నగు వానిని గూర్చి వివరింపబడినది.

## 34 వ అధ్యాయము

ఏ యే రసమునకు, యెట్టి వాద్యము లుపయోగింపవలెనో, వాద్యకులు, గాత్ర పాటకులు రంగస్థలముపై కూర్చొను విధానము వివరింపబడినది.

## 35 వ అధ్యాయము

నాట్యమునకు పాత్రలను నిర్ణయించు విధానము గురించి చర్చింపబడినది.

## 36 వ అధ్యాయము

ఇందు పూర్వరంగ ప్రయోజనము గూర్చి వ్రాయబడెను.

పూర్వ రంగము – రంగస్థలము నుంచి, క్షుద్ర దేవతలను పారద్రోలి రంగస్థలమును పవిత్ర పరచుట.

నాట్యము, వాద్యము – వేదముతో సమానము.

## 37 వ అధ్యాయము

పూర్వము నహుషుని కాలములో నాట్యకళ ప్రపంచము

గోవికి యెట్లు తీసికొని రాబడినదో తెలుపబడినది. భరత శాస్త్రమును కీర్తించుచు భరతుడు గ్రంధమును ముగించెను.

* * *

## నాట్యశాస్త్రమును గూర్చి కొన్ని వివరములు

భరతశాస్త్రము రచించిన భరతముని యెవరో నిశ్చయముగ తెలలేదు. జడ భరతుడా, రాముని సోదరుడా, శకుంతలా తనయుడా ? ఇతురులా ? ఈ సమస్యను పండితులే యింకను పరిష్కరింప లేకున్నారు. 'సంకల్ప సూర్యోదయ'మను గ్రంధమందు శ్రీ వేదాంత దేశికులవా రిట్లన్నారు. "భావ, రాగ, తాళముల యొక్క మొదటి అక్షరముల చేరిక 'భరత' మగుచున్నది. ఈ యీడింటి సమ్మేళనమని అర్థము కావచ్చును.

### భరతమునికి ముందున్న యితరనాట్య గ్రంధములు :

తనకు ముందుగా యితర నాట్యగ్రంధములున్నట్లు భరతముని చెప్పుచుండును. పాణినివ్యాకరణములో శిలాలి, కృశాశ్వమను యిద్దరు నట సూత్రకర్తలపేర్లు చెప్పియున్నాడు. ఆ కాలమునకున్న భిన్నగ్రంధములలోని, వ్యవహారములలోని విషయములను క్రోడీకరించి, సూత్రప్రాయముగా వివిధ విషయములను భరతముని వ్రాసియుండును.

### అభినవ గుప్తాచార్యుడు

కాశ్మీరదేశపు బ్రాహ్మణుడు, గొప్ప విద్వాంసుడు. భరతశాస్త్రమునకు గొప్ప వ్యాఖ్యానము వ్రాసెను (క్రీ. శ. 1014).

### నాట్యశైలి :

నాలుగు విధములు.

కైశికవృత్తి – అతిసుకుమారము, నాగరికము అగు శయ్యతెన్నదైనది.

ఈ నాట్యము చేయువారు చక్కని వస్త్రములను శోభించు వస్త్రధారణ చేయవలెను. యౌవనులగు స్త్రీలకే – ఈ నాట్యమొప్పును. భారతి – అలంకారములతోను, సొగసైన వాక్చాతుర్యపు విసురులతో నొప్పియుండును.

సతతి – భావప్రకటన మెండు.

ఆరిభటి – ఆడంబరము, శబ్దము, హెచ్చుగా నుండు సందర్భములం దుపయోగపడును.

*

ప్రతి అభినయమునకు నియామకము గలదు. ఎవరి యిష్టము వచ్చినట్లు వారు చేయుటకు వీలులేదు. ఒక భావమునకు ఒక అభినయము, ఒక రీతి, పద్ధతి, కొలత – భంగిమయందు చేతులు కాళ్లు పగె రాలు నిర్దేశించినట్లు కొలతలతో సరితీర్చినట్లుండవలెను. ఎంత మాత్రము వ్యత్యయమునకు తావులేదు. అట్లు చేయనిచో అది శాస్త్ర విరుద్ధము. మాట యెంత నిశితమో, మార్పు చేయ వీలులేదో, అట్లే దాని భావప్రకటన చేయు అభినయమునూ.

### ఒక నిర్ణీత విషయమును అభినయించుట

కృష్ణుని బాలక్రీడలు మొదలైనవి అభినయించునప్పుడు నర్తకి యొక్క విద్యా విశేషముచేత కరణములు, అంగహారములు, యేవేవి యెట్లు యెప్పుడుపయోగింపవలెనో తెలిసి, విషయమునకు తగిన రీతిని లాస్యముగాని, తాండవముగాని సందర్భోచితముగా అభినయింపవలెను.

నియమములు

కట్టుబాట్లు

(1) లలితమును, మిక్కిలి లావణ్యమును గల తాండవ నృత్యము వలన శృంగార రసోత్పత్తి యగును. ఆ తాండవము వర్థమాన తాళయుక్తముగా చేయవలెను.

(2) కుతప విన్యాసము:– నర్తక బృందము కుతప విన్యాసము చేయవలెను. అభినవ గుప్తుడువాఖ్యానములో యిట్లు పేర్కొన్నాడు.

'మృదంగము వాయించువాడు, పాటపాడువాడు దక్షిణముగ, ఉత్తరముఖముగాను, ఇతనికి కొంచెము త్తరముగా పాటపాడు స్త్రీ దక్షిణాభిముఖముగాను, వీణవాయించువాడు ఈ స్త్రీకి యెడమవైపున, తరువాత పిల్లనగ్రోవి వ్రాయించువాడు.'

దీనిపేరు 'కుతపము' పాటపాడు వారిలో స్త్రీ లేనిచో రసకూటమునకు రసమే యుండదు. కళావిహీ సమైరక్తిగట్టదు.







పణవ

వీణవాడు

పిల్లనగ్రోవివాడు

రంగపీఠము

పాటస్త్రీ

పాటవాడు




నందికేశ్వరుని అభినయదర్పణములో –

రంగమంటపము నడుమ పాత్రయుండగా, ఆమె వెంబడి, నటోత్తముడు, కుడిప్రక్క తాళగాడును, యిరుప్రక్కల మద్దెల గాండ్రును, వారి నడుమ పాత్ర ననుసరించి గాయకులును, వారికి వెనుక శ్రుతి పోయువాడును, వరుసగా నుండవలెనని యున్నది.

పాత్ర బహిఃప్రాణములు – మృదంగము, మంచి నాదము గల తాళములు, పిల్లనగ్రోవి, పాట, శ్రుతి, వీణ, గజ్జెలు, ప్రఖ్యాతుడైన నటుడు. పాత్ర అంతః ప్రాణములు – వడి, నిలకడ, సమత్వము, ప్రసన్నతిగల చూపు, శ్రమలేమి, బుద్ధి, శ్రద్ధ, మంచి మాటలు, పాట.

(3) తరువాత 'ఆసారిత' (పాటగుదారులందరు) పద్ధతులకు పొందగవలెను. కలకలము గావింపవలెను. అట్టి ఆసారితము చేయు సమయమున నర్తకి ఉపోహనము జేయుచు ప్రవేశింపవలెను. (పాడదలచిన పాటను ఝంకరించుచు).

గీతము సర్వవస్తు సంపూర్ణమైనదిగ, భగవంతుని స్తుతిగ నుండవలెను.

(4) పాటసభినయించినచో వాద్యసంగీతముండరాదు. అంగహారముల జూపునపుడు భాండవాద్యముండి తీరవలెను. భాండము మద్దెల విశేషములలో నొకటి యగు పుష్కర యనునది యని వ్యాఖ్యానకర్త వ్రాయుచున్నాడు. శుద్ధ వాద్యములలో భాండమని పేర్కొనబడుటచేత మట్టితో చేయబడి, మూతి బిగిగల తోలుతో మూత వేయబడిన వాద్య విశేషమై యుండవచ్చును. ఇట్టి వాద్యములు చిదంబర దేవాలయము, కంచి, కైలాసనాథ ఆలయము, తంజావూరు బృహదీశ్వరాలయములలో మన్న కరణ చిత్రముల దగ్గర చెక్కబడి యున్నవి.

(5) తాండవ నృత్యము చేయునపుడు వాద్యములతో సంగీతమును నిపుణులైన వారు పాడవలెను. అది పరస్పర మాధుర్యము గలిగి, సర్వశుద్ధము, తాళబద్ధమునై, వినసొంపు గలిగి, నృత్తానుగుణమై శోభిల్లవలెను. ఈ నృత్యము చేయునపుడు కూడ విషయము పై పాటలోనిదే అయి యుండవలెను.

(6) ఈ విధముగ పాట, ఆట (తాండవము) అయిన తరువాత నర్తకి రంగము నుండి నిష్క్రమింపవలెను. ఇతరులగు నాట్య స్త్రీ పాత్రలు 'పిండి' గట్టి నిష్క్రమింపవలెను. ఈ సమయమునందును తగినట్లుగ వాద్యసంగీతముంపడవలెను. నర్తకి నిష్క్రమించునప్పుడును ఆసారితము చేయవలెను. అది ముగించి నిష్క్రమింపవలెను.

(7) నర్తకి ముఖ్యురాలు. ఆమె నిష్క్రమించిన తరువాత నలుగురు నాట్యము చేయుస్త్రీలు ప్రవేశింపవలెను. పైన చెప్పిన రీతినే సంగీతము, భాండవాద్యము జరుగుచుండగా, ఆస్త్రీలు మొదట ఒకరు, తరువాత వరుసగా యిద్దరు, ముగ్గురు, నలుగురు, పాడవలెను. నాలుగు పిండి బంధముల ననుసరించి నాట్యము సలుపవలెను.

### నాలుగు పిండి బంధముల పేర్లు

(1) పిండి – పిండాకారము గలది.

(2) శృంఖలిక – ముళ్ల దుబ్బుల ఆకారము గలది.

(3) లతాబంధ – తీగెవలె అల్లుకొనునది.

(4) భేద్యక – నృత్తముతో కూడినది.

ఇందు

భేద్యకము ప్రారంభములో, శృంఖలికము లాస్యమునకు, లాస్యమునకు మధ్యను, లతాబంధము నృత్యభాగమందు, పిండి బంధము నాట్యాంతమందు ప్రదర్శింపవలెను.

(8) ఆరంభములో ముందుకు, వెనుకకు నడచుచు, మొదటి ఆవృత్తమున అభినయమును, తరువాత ఆవృత్తములలో నృత్యమును గూడ కలిపి జూపవలెను

(9) నృత్తము చేయ నొప్పు సందర్భములు

(a) అంగవస్తు నివృత్తి యందు, వస్తు నివృత్తి యందు (స్థాయీ భేదము) అభ్యుదయమందు (ఉత్సాహము) నృత్తము సలుపవలెను.

(b) దంపతుల శృంగార స్థితులను జూపు సందర్భములందు నృత్తము చేయవలెను. దాని వలన సంతోషము కలుగవలెను.

(c) స్వాధీన భర్తృక (నాయిక) సందర్భములలో ఉచితముగ నృత్తముండవలెను. నాయకుడున్నప్పుడు పాట గూడ పాడవలెను

(d) ప్రోషిత, ఖండిత, విప్రలబ్ధ, కలహాంతరిత నాయికలు నృత్తము చేయరాదు.

(e) విరహిణియై బాధపడుచు, చెలితో యేకాంతమున నున్నప్పుడు – తన మనస్సును వెల్లడించును. అట్టి సమయములో నృత్తము చేయకూడదు.

(f) అంతరంగురాలైన సోకత్తె దీనురాలుగా నున్నప్పుడు. శరీరము అనారోగ్యముగా నున్నప్పుడు నాయిక నృత్తమాడరాదు.

(g) నాయికను సంతోషపెట్టవలసిన సమయములందు నృత్తము క్రమముగా ప్రారంభింపవలెను.

(h) దైవస్తుతి చేయు సమయములందు శివునికి ప్రీతికరమగు అంగహారములతో నాట్యము చేయవలెను.

(విద్యుద్భ్రాంత, గజప్లుత, విజృంభిత, తలపుష్పపుట, లీన, నితంబ మొదలైనవి.)

(i) స్త్రీ, పురుష ప్రణయ సంబంధమగు పాటల యందు చేయ దగు అంగహారములు మాత్రమే నాట్యమందు ప్రవర్తింప వలెను.

ఇట్టి నిబంధనల ననుసరించి నృత్తము చేయవలెను.

## నృత్తములో హస్త విన్యాసములు

నృత్తములో హస్త విన్యాసములు 5 విధములు.

(1) హస్తములను క్రిందినుండి తలపైకెత్తుట.

(2) తలపైనుండి క్రిందికి దించుట.

(3) కుడిప్రక్కకు విసురుట (వాచుట).

(4) ఎడమప్రక్కకు విసురుట.

(5) వృత్తముగా తిరుగుట.

హస్తము లెప్పుడును పాదముల ననుసరింపవలెను. ఎల్లప్పుడు కుడిచేయి, కుడికాలును, ఎడమ చేయి, ఎడమ కాలును, అనుసరించి యుండవలెను.

## నృత్తములో ఉపయోగించెడి హస్తములు

(భరతముని ప్రకారము)

స్వస్తిక, డోల, అంజలి, కటకావర్ధని, శకట, కీలక, కపిత్థ, శిఖర, కూర్మ, హంసాస్య, అలపద్మ, పతాక, పాశ, — ఈ పదమూడు హస్తములు నృత్తమునందుపయోగింపబడును.

## నృత్తములో ఉపయోగించు గతులు

మరాళ, మయూర, హరిణ, మత్తేభ, అశ్వ, సింహ, సర్ప, మండూక, వీర, మనుష్య అని పది విధములైన గతి భేదము లుపయోగింపబడును.

## వీని నభినయించు విధానము

(1) మరాళగతి :- రెండు చేతులందు త్రిపతాకములు పట్టి, కాళ్లను ఒకదానితరువాత ఒకటి అడుగు దూరములో వేయుచు, యిరుప్రక్కలకు వంగుచు నడువవలెను.

(2) మయూరగతి :- బొటనవ్రేళ్ళపై నిలబడి రెండుచేతులందు కపిత్థములను బట్టి మోకాళ్లు కదిలించిన, మయూరగతి యగును.

(3) హరిణగతి :- రెండు చేతులతో యిరుపార్శ్వములందు త్రిపతాకములు బట్టి ముందుకుగాని, యిరుప్రక్కలకు గాని బెదురు చూపులతో పరుగులిడవలెను.

(4) మత్తేభగతి :- రెండు చేతులతో యిరుపార్శ్వములందు పతాకములు బట్టి సమపాదములతో మెల్లగా నడువవలెను.

(5) అశ్వగతి :- కుడికాలు నెత్తి తొందరగా గాలిలోనికెగిరి, ఎడమచేత శిఖరము, కుడిచేత పతాకము పట్టవలెను.

(6) సింహగతి :- బొటనవ్రేళ్ళపై నిలబడి, తరువాత తొందరగా ముందుకు దుముకుచు పోవుచు శిఖరములను రెండు చేతులతో పట్టవలెను.

(7) సర్పగతి :- త్రిపతాకములు రెండుచేతుల యిరుపార్శ్వములందు బట్టి తొందరగా నడువవలెను.

(8) మండూకగతి :- రెండుచేతులందు శిఖరహస్తము బట్టి తొందరగా నడువవలెను.

(9) వీరగతి :- వీరగతియందు కొంత దూరమువరకు నడచి వచ్చి, ఎడమచేత శిఖరము, కుడిచేత పతాకము పట్టవలెను.

(10) మనుష్యగతి :- గుండ్రముగా త్వరితగతిని తిరుగుచు, ఎడమచేతిని గుండెపైనుంచి కుడిచేత కటకాముఖ హస్తము పట్టవలెను.

## భ్రమరములు 7 విధములు

నర్తకి నాట్యమందు తన శరీరము పలు విధములుగా వెను దీయముగా కదిలించుట భ్రమరము లనబడును.

ఉత్ప్లుత, చక్ర, గరుడ, ఏకపాద, కుంచిత, ఆకాశ, అంగ అని భ్రమరములు 7 విధములు.

(1) ఉత్ప్లుత :- సమపాద భంగియందు నిలబడి శరీరమంతయు పూర్తిగా కదిలించుట ఉత్ప్లుతము.

(2) చక్ర :- కాళ్ల భూమిపైనుంచి త్రిపతాకములు రెండు చేతులందు పట్టి, శరీరమంతయు పూర్తిగా కదిలించుట చక్రము.

(3) గరుడ :- కుడికాలు మెడమ ప్రక్కను, ఎడమకాలు కుడిప్రక్కను వుంచి, మోకాళ్లు భూమిపై నానించి రెండుచేతులను చాచి త్వరితగతిని నడువవలెను.

(4) ఏకపాద :- ఒక కాలుతో తరువాత రెండవకాలుతో గిరగిర తిరుగుట.

(5) కుంచిత :- మోకాళ్లు వంచి గుండ్రముగా తిరుగుట.

(6) ఆకాశ :- గాలిలోనికి యెగిరి కాళ్లు మెడముగానుంచి శరీరమును గుండ్రముగా త్రిప్పుట.

(7) అంగ :— రెండుకాళ్లను లర అడుగు యెడముగా నుంచి గాలిలోనికి యెగిరి నిలబడుట.

## 8 'చారి' భేదములు, వాని ఉపయోగములు

నాట్యమందు ఒక కాలును కదిలించుట 'చారి' అనబడును. చారులు లేని నాట్యమేలేదు. చారులు — చలన, చక్రమణ, సరన, వేగిని, కుట్టన, లుంఠిత, లోలిత, విషమ, అని యెనిమిది విధములు

(1) చలన :— స్వస్థలము నుండి కాలును ముందుకు పంచుట.

(2) చక్రమణ :— రెండుకాళ్లను చేర్చి, మెత్తి యిరుప్రక్కలకు యెగురుట.

(3) సరన :— ఒక కాలి మడమను, యింకొక కాలి మడమతో అడుగడుగునకు చేర్చి నడచుట.

(4) వేగిని :— నటుడు పాదపు వ్రేళ్లపై గాని, మడమలపై గాని, లేక పూర్తి పాదమును వేయుచుగాని త్వరిత గతిని నడుచుచు, అలపద్మ త్రిపతాక హస్తములు ఒకదాని తరువాత యింకొకటి పట్టవలెను.

(5) కుట్టన :— భూమిని ఒక కాలి మడమతోగాని, కాలి ముందలి భాగముతోగాని, పూర్తి పాదముతోగాని తట్టుట.

(6) లుంఠిత :— స్వస్తికముగా కాళ్లనుంచి గుట్టనము ప్రవర్తించుట.

(7) లోలిత :— కాలును భూమికి తాకకుండా కదిలించి కుట్టనము ప్రవర్తించుట.

(8) విషమ :— కుడికాలు కుడిభాగమునకు, ఎడమకాలు ఎడమ భాగమునకు తగులునట్లుంచి నడచుట.

## 5. ఉత్ల్పవ భేదములు

నాట్యమందు గాలిలోనికి యెగురుట ఉత్ల్పవ మనబడును. అలగ, కర్తరి, అశ్వ, మోట్టిత, క్రిపల్గ — అని 5 విధములు.

(1) అలగ :— రెండు కాళ్లను చేర్చి పైకెగిరి, శిఖరహస్తము నడుముపై నుంచవలెను.

(2) కర్తరి :— ఎడమకాలు వెనుక భాగమున కర్తరి హస్తములనుంచి పాదపువ్రేళ్లతో పైకెగురుట.

(3) అశ్వ :— ముందు రెండు కాళ్లతో పైకెగిరి, తరువాత ఆ కాళ్లను దగ్గరగా చేర్చి నిలబడి, రెండు చేతులతో త్రిపతాకము పట్టవలెను.

(4) మోట్టిత :— ఇరుప్రక్కలకు కర్తరి యందువలె యెగురుట.

(5) క్రిపల్గ :— రెండు కాళ్ల మడమలను ఒకదాని తరువాత యింకొకటి కటిప్రదేశమందుంచి, రెంటింటికి మధ్య అర్థ చంద్ర హస్తము పట్టుట.

## 6 విధములైన భంగిమలు

సమపాద, ఏకపాద, నాగబంధ, ఐంద్ర, గరుడ, భ్రమర అని భంగిమ లారు విధములు.

(1) సమపాద :— రెండుకాళ్లను చేర్చి నిలబడుట.

(2) ఏకపాద :— ఒక కాలుపై నిలబడి, రెండవది మోకాలి నానించుట.

(3) నాగబంధ :— సర్పమువలె రెండుకాళ్లను పెనవేసి నిలబడుట.

(4) ఐంద్ర : ఒక కాలు వంచి, రెండవది మోకాలు వద్ద వంచి చేతులను సహజముగ నుంచుట

(5) గరుడ :— ఆలీఢ మండలములోని ఒక మోకాలు భూమి నానించి రెండు చేతులు చేర్చి పట్టవలెను.

(6) భ్రమర :— పద్మాసనము వేసికొని కూర్చొనుట.

## 108 కరణములు

నాట్యమందు ఒక కాలును కదిలించుట 'చారి', రెండు కాళ్లను కదిలించిన 'కరణ' మనబడును.

వీనిని గూర్చి విపులముగా వేరొక చోట వ్రాసితిని.

## 10 విధములైన మండలములు

మండలమనగా కొన్ని కరణములు, చారుల చేరిక.

స్థానక, ఆయాత, ఆలీఢ, ప్రత్యాలీఢ, ప్రేంఖణ, ప్రేరిత, స్వస్తిక, మోట్టిత, సమసూచి, పార్శ్వసూచి అని పది విధములు.

(1) స్థానక :— సమపాదముతో నిలబడి అర్థచంద్ర హస్తములను నడుముకు ఆనించి పట్టవలెను.

(2) ఆయాత :— రెండు కాళ్లను రెండున్నర అడుగులు యెడముగా నుంచి, మోకాళ్లను వంచి ఒక కాలిని రెండవ దానిపై నుంచుట.

(3) ఆలీఢ :— ఎడమ కాలును కుడి కాలుకు ముందరగా ఒకటిన్నర అడుగు దూరములో నుంచి — ఎడమచేతి శిఖరము, కుడిచేతి కటకాముఖమును పట్టవలెను.

( ) ప్రత్యాలీఢ :— ఆలీఢలోని చేతులను, కాళ్లను మార్చి పట్టవలెను.

(5) ప్రేంఖణ :— ఒక కాలు యొక్క మడమ వద్ద రెండవ పాదము నుంచి కూర్మ హస్తము పట్టవలెను.

(6) ప్రేరిత :— ఒక కాలును గంభీరముగ భూమిపై తట్టి, రెండవ కాలునకు ఒకటిన్నర అడుగులోనుంచి మోకాళ్లనువంచి,

ఒక కాలును రెండవదానికి అడ్డముగా (స్వస్తికముగా) నుంచి, శిఖర హస్తము వక్షస్థలము నందుంచి పతాకము చాచి పట్టవలెను.

(7) స్వస్తిక :- కుడికాలు ఎడమకాలికి అడ్డముగా - కుడిచేయి, ఎడమచేతికి అడ్డముగా నుంచవలెను.

(8) మొట్టిత :- మునిగాళ్లపై నిలబడి, ఒక్కొక్క మోకాలితో భూమిని తాకుచు త్రిపతాకములు రెండు చేతులందు పట్టవలెను.

(9) సమసూచి :- బొటనవ్రేళ్లపై మోకాళ్లతో భూమినితాకుట.

(10) పార్శ్వసూచి :- బొటనవ్రేళ్లతో, మోకాళ్లతో ఒకప్రక్క భూమిని తాకుట.

## అడవులు - వాని అభ్యాస పద్ధతి

(1) త - కుడికాలు పూర్తిపాదము వేయవలెను.

(2) ది - ఎడమకాలితో పలికించవలయును.

నృత్యము చేయునప్పుడు యెప్పుడును 'త' తో మొదలు పెట్టిన శబ్దములు కుడికాలుతోను, 'ది' తో మొదలిడినవి యెడమ కాలితోను ప్రారంభింపవలయును.

ఉదా :- (1) తత్తై తాహ

(2) దిత్తై తాహ

మొదటిది కుడికాలుతో ప్రారంభింప వలయును.

రెండవది యెడమకాలితో మొదలు పెట్టవలెను.

(2) తత్తై :- ఈ రెండక్షరములే నృత్యమునకు జీవము. వీని నుండియే నృత్యములోని సర్వజతులు పుట్టుచున్నవి.

వీనిని రెండు విధములుగా పలికించవచ్చును.

(i) తత్తై :- ఈ రెండు శబ్దములు ఒకేకాలుతో పలికించుట: అప్పుడు పాదము ముందరి భాగము తట్టిన 'త' పలుకును. మడమ తట్టిన 'త్తై' పలుకును.

(ii) రెండు శబ్దములను కుడి, ఎడమలందు పలికింపవలసి వచ్చినప్పుడు 'త' కుడికాలుతో, పూర్తిపాదము తట్టవలయును. 'తై' ఎడమకాలుతో వేయవలెను.

ఎడమపాదమునందు గూడ 'త' వలె ధ్వనించినను, అది సాధన చేయుటకు క్రమముగా యేర్పరుపబడినది.

'త - తై - తై - త'

ఇందు 'త' కుడి పాదముతో పలికించి 'తై - తై' ఎడమకాలితో పలికించి, మరల 'త' కుడిపాదముతో పలికింపవలయును.

మరొక పద్ధతి

'త - తై - తై - త'

(i) 'త - తై' - ఈ రెండక్షరములు కుడిపాదముతో పలికించి, మిగిలిన -

(ii) 'తై - త' - ఎడమకాలుతో పలికింపవలయును.

(1) ఇందు 'త' ముందు భాగముతోను, 'తై' మడమతోను పలికింపవలయును.

(2) ఇందు, ముందు మడమ తట్టి తరువాత ముందర భాగముతో తట్టవలెను.

(3) తదిత్త.

'త' - కుడికాలు
'ది' - ఎడమకాలు
'త్త' - కుడికాలు

ఇందు 'త' - 'త్త' భేదము చూపుటకు 'త్త' చెప్పినప్పుడు పాదము గట్టిగా భూమిపై తట్టిన ఒత్తుపలుకును.

(4) తైతతై - ఇందు 'తై' కుడికాలుతో ప్రారంభించినచో మధ్యనున్న 'త' ఎడమకాలుతోను, మిగిలిన 'తై' కుడికాలు తోను పలికింపవలయును. లేక 'తై' ఎడమకాలుతో మొదలు పెట్టినచో 'త' కుడికాలుతో పలికింపవలయును. ఈ క్రమము కేవలము సాధనచేయుటకు మాత్రము వ్రాయబడుచున్నది. ప్రయోగము నందు కొంత భేదముండును.

(5) తత । తైతై । తైతై । తత - ఇందు రెండేసి అక్షరములు ఒక్కొక్క కాలితో పలికింపవలయును. ఇందు క్రమము సూత్రము 2 యందలి (ii) ను అనుసరింపవలెను.

(6) (అ) తతత । తైతైతై । తైతైతై । తతత । తిశ్రగతి.

ఇందు మూడేసి అక్షరములు ఒక్కొక్క కాలితో పలికింప వలయును (5) నందువలె.

(ఆ) తతైత । దితైత - ఇవి గూడ తిశ్రగతియే.

'త' పాదము ముందరి భాగముతో 'తై' మడమతో, 'త' పూర్తి కాలితో మూడక్షరములు చొప్పున పలికింపవలెను. 'త' - కుడికాలితో - 'ది' ఎడమకాలితో ప్రారంభింపవలెను.

(7) (1) తతతత । తైతైతైతై - చతురశ్రగతి నాలుగేసి అక్షరములు ఒక్కొక్క కాలితో పలికింపవలయును.

త - కుడికాలితో
తై - ఎడమకాలితో

(2) తతై తతై । తైతతైత - చతురశ్రగతి

(అ) కుడికాలితో పలికింపవలయును
'త' - ముందరి భాగము
'తై' - మడమ

(ఆ) ఎడమకాలితో ప్రారంభింపవలయును
'తై' - మడమతో ప్రారంభింపవలెను
'త' - ముందరి భాగముతో వేయవలెను

(8) తతై । తతైత - ఖండగతి
(1 2 । 3 4 5)

ఈ ఐదు అక్షరములు ఒక కాలితో పలికింపవచ్చును. లేక 1, 2 – ఒక కాలితో, 3, 4, 5 – రెండవ కాలితో పలికింపవచ్చును.

ఒక కాలితో ఐదక్షరములు పలికించినప్పుడు 1, 3 అక్షరములకు ఖండగతి విస్పష్టగా తెల్పుటకుగాను గట్టిగా తట్టవలెను.

1 2 3 4 5 6 7
(9) త త్త త । త ద్ది । త ద్ది – మిశ్రగతి
ఈ యేడక్షరములు ఒక కాలితో పలికింపవచ్చును.

**రెండవ విధము**

1 నుండి 5 వరకు ఒక కాలితో
6 నుండి రెండవ కాలితో పలికింపవచ్చును.

**మూడవ విధము**

1 – 3 వరకు ఒక కాలితో పలికించి
4 – 5 రెండవ కాలితోను
6 – 7 మొదటి కాలితోను పలికింపవచ్చును.

సంకీర్ణజాతి వేరుగ చెప్పుటలేదు. తిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్రగతులు అభ్యాసముచేసిన సంకీర్ణజాతి వచ్చివేయును. చతురశ్ర, ఖండగతులు కలిపిన సంకీర్ణమగును.

(10) (1) 'రోం' – 'త్రై' యందువలె పాదము తట్టుచు పాదము ముందరి భాగము భూమికి తగులునట్లు తట్టవలెను.

(11) 'తాం' – 'తై' యందు వలె పూర్తి పాదము తట్టి నెమ్మదిగా మడమనెత్తవలెను.

(12) 'త్రాం' – రెండుకాళ్ళు చేర్చిపట్టి ముంగాళ్లపై గాలిలోనికి యెగిరి భూమిపైకి వచ్చి కాళ్లు జారవిడువ వలయును.

(13) 'ప్లాం' – పైకెగిరి గాలిలో నుండగనే ఒక కాలి గజ్జలకు యింకొక కాలు తగులునట్లు రెండు కాళ్ళను చేర్చవలెను.

(14) 'ఝం' – రెండుకాళ్లు చేర్చి యెగిరి నిలబడవలెను.

(15) 'ద్రీం' – 'త్రాం' యందు వలె యెగిరి భూమిపైకి వచ్చినప్పుడు పాదములను గుండ్రముగా త్రిప్పవలెను.

(16) 'ధీం' – పైకెగిరి సమపాదములను భూమిపై మోపవలెను.

(17) 'ద్రే' – 'తై' 2 యందువలె రెండు పాదములు తట్టి భూమిని రాయుచు నడువ వలెను.

(18) 'తరికిట' - (కుడికాలు) పాదము ముందరి భాగముతో మొదలుపెట్టి కాలును యెడమనుండి కుడివైపునకు చక్రాకారముగ త్రిప్పవలెను.

(19) 'దిరికిట' తరికిట యందు వలెనె చేయుచు కుడినుండి యెడమ వైపునకు చక్రాకారముగా త్రిప్పవలెను.

(20) 'తరికిట । దిరికిట' – కాలి ముందరి భాగముతో 'తరికిట' మొదలుపెట్టి ముగించి – 'దిరికిట'కు మడమతో మొదలు పెట్టవలెను.

(21) 'కిటతక' – పాదమునెత్తి 'తత' వలె 'కిట'కు పాదము ముందుకు జరిపి 'తక' వెనుకకు జరుపవలయును.

(22) 'దిగ్గుడు' – ముందు పాదము భూమిపై తట్టి గాలిలోనికి యెగిరి గుండ్రముగా తిరిగి మరల భూమిపైకి రావలెను. లేక మడమలు భూమినానించక నృత్యము చేయుట.

(23) 'తిరికిటతోం' – గుండ్రముగా తిరుగునప్పుడు, ప్రారంభములో కాలెత్తి గుండ్రముగాతిరిగి 'తోం'కు కాలునుగట్టిగా భూమిపై తట్టవలెను.

(24) 'దిర్ దిర్' – రెండు కాళ్లను చేర్చి పైకెగిరి, భూమిపై కాళ్లను రాయుచు త్వరితగతిని నడువ వలెను.

(25) 'దిదదిద' 24 నందు వలెగాని, మడమలపై నడువవలెను.

(26) కిణ్ ణ్ – ముంగాళ్లపై నిలబడి కాళ్లు వణికించవలెను,

(27) చణణన – బొటనవ్రేళ్లపై నిలబడి కాళ్లు వణికించవలెను. లేక భూమికి రాయుచు నడువవచ్చును.

(28) 'దగ' – రెండు పాదములను భూమిపైనుంచి, ఒక పాదము మాత్రము రెండవ పాదాంగుళుల నానించి తట్టుట.

(29) 'తక' – మడమలు భూమియందు మోపి తట్టవలెను.

(30) 'గిణతోం' – 'గి' – మడమ
'ణ' – ముందరి భాగము
'తోం' – రెండవ పాదము

(31) దిగిణతోం – ది – ఎడమ పాదము
గి – కుడి పాదము
ణ – ముందరి భాగము
తోం – ఎడమ పాదము

(32) తదిగిణతోం – త – కుడి పాదము
ది – ఎడమ పాదము
గి – కుడి మడమ
ణ – ముందరి భాగము
తోం – ఎడమ పాదము

(33) తక తదిగిణతోం
'తక' – 'తత' వలె కుడి పాదము
త – కుడి పాదము
ది – ఎడమ పాదము
గి – కుడిపాదము
ణ – కుడి ముందరి భాగము
'తోం' – ఎడమ పాదము

(2) ఆలోకితము :- వడిలో తిరుగుడుగల స్పష్టమైన చూపు ఆలోకితము. కుమ్మరి, సారె తిరుగుట, అన్ని వస్తువులను జూచుట, ఇష్టము — వీనియందుపయోగించును.

(3) సాచి :- స్వస్థానము నుండి కడకంటి వరకు అడ్డముగా ఉంచు దృష్టి సాచి.

అభిప్రాయము. మీసము దువ్వుట, గురిపెట్టుట, శస్త్రము, తలచుట, సైగచేయుట, వేశ్యల స్తోత్రము. — వీనియందుపయోగపడును.

(4) ప్రలోకితము :- రెండు ప్రక్కలయందు ఉంచు దృష్టి ప్రలోకితము.

యిరు ప్రక్కలనుండు వస్తువులను జూచుట, సైగజేయుట, కలుట, కలసి పడుట, — వీనిలో నుపయోగించును.

(5) నిమీలితము :- సగము కన్ను తెరచి చూచుట.

ఋషి వేషము, పరవశత్వము, జపము చేయుట, ధ్యానము, నమస్కరించుట, మనస్సు చలించుట, సూక్ష్మదృష్టి — వీనియందుపయోగించును.

(6) ఉల్లోకితము :- మీదికి నిక్కించి పంచబడిన దృష్టి.

ధ్వజాగ్రము, గోపురము, పూర్వజన్మ, దేవమంటపము, వెన్నెల — మొదలగు వానియందు చెల్లును.

(7) అనువృత్తము :- వడిగా క్రిందికి, మీదికి జూచుట,

కోపముతో జూచుట, ప్రేమతో నిలుచుట — వీనియందుపయోగపడును.

(8) అవలోకితము :- క్రిందికి చూచే చూపు, అవలోకితము.

నీడను జూచుట, విచారము, నిద్రపోవుట, చదువుట, అవయవములను జూచుకొనుట, నడచుట, — వీనియందు చెల్లును.

### గ్రీవాభేదములు

సుందరి, తిరశ్చీన, పరివర్తిత, ప్రకంపిత అని గ్రీవాభేదములు నాలుగు.

(1) సుందరి :- అడ్డముగా కదలించిన సుందర గ్రీవము.

స్నేహారంభము, ప్రయత్నము, సరేననుట, తలచుట, సరసము, అనుమోదము — వీనియందు చెల్లును.

(2) తిరశ్చీనము :- రెండు ప్రక్కల పైభాగములందు సర్పగతివలె కదలించుట తిరశ్చీన గ్రీవము.

కత్తి త్రిప్పుట, పామునడక — వీనియందుపయోగించును.

(3) పరివర్తితము :- కుడి ఎడమలకు అర్ధచంద్రాకారముగ కదలించుట పరివర్తితము.

శృంగారనటన, స్త్రీల చెక్కిళ్లను ముద్దుపెట్టుకొనుట, — వీని యందుపయోగపడును.

(4) ప్రకంపితము :- పావురము మెడ కదిలించినట్లు ముందుకు, వెనుకకు కదిలించుట ప్రకంపితము.

నీవు, నేను అనుట యందు, దేశినాట్యము, ఉయ్యాలయందు, వెక్కిపెట్టుట యందు, — ఉపయోగించును.

### భ్రూభేదములు

సహజ, పతిత, ఉక్షిప్త, చతుర, రేచిత కుంచిత అని భ్రూభేదములు ఆరు.

(1) సహజము :- ముఖమునందు మెట్టి వికారము లేక స్వాభావికముగనుండెడి కనుబొమ్మలు 'సహజభ్రువన' మనబడును.

(2) పతిత :-నిశ్చలమైన కనుబొమ్మలనువాల్చిన 'పతితభ్రువన' మనబడును.

జుగుప్స, ఆశ్చర్యము, ఓర్వలేని తనము. — వీనియందుపయోగించును.

(3) ఉక్షిప్తము :- కనుబొమ్మలు రెంటినిగాని, ఒక దానినిగాని మీదికి నిక్కించిన 'ఉక్షిప్త భ్రువన' మగును.

స్త్రీల కోపమునందు, సత్యవచనమందు, శృంగార భావము, లీలయందు చెల్లును.

(4) చతుర :- రెండు కనుబొమ్మలను చేర్చి కొంచెముమెల్లగా కదిలించిన 'చతుర భ్రువన' మగును.

ముఖము తాకుట, హృదయానందము, సంభాషణ — వీని యందుపయోగించును.

(5) రేచితము :- అందముగాను, సొగసుగాను, ఒక కనుబొమ్మ వంచిన అది 'రేచిత భ్రువన' మగును.

రహస్య శ్రవణము, మంచిదనుట, పదవీక్షణము — వీని యందు చెల్లును.

(6) కుంచితము :- ఒకటి, లేక రెండు కనుబొమ్మలను ముడిచిన 'కుంచిత భ్రువవ' మగును.

మొట్టాయితము, కుట్టమితము, విలాసము, కిలికించితము, మొదలైన శృంగార చేష్టల యందు చెల్లును.

### నృత్యహస్తములు

హస్తభేదములను గూర్చి వ్రాయుటకు ముందు హస్త ప్రాణము, పుట్టుక, జాతి, వర్ణము, ఋషి, అధిదేవత, మొదలగు వివరములు తెలెపెదను.

అసంయుత హస్తములు

పతాక, త్రిపతాక, అర్ధపతాక, కర్తరీముఖ, మయూర, అర్ధచంద్ర, అరాళ, శుకతుండ, ముష్టి, శిఖర, కపిత్థ, కటకాముఖ, సూచి, చంద్రకళ, పద్మకోశ, సర్పశీర్ష, మృగశీర్ష, సింహముఖ, లాంగూల, సోలపద్మ, చతుర, భ్రమర, హంసాస్య, హంసపక్ష, సందంశ, ముకుళ, తామ్రచూడ, త్రిశూల –అని యిరువది యెనిమిది అసంయుత హస్తములు.

(1) <u>పతాక హస్తము</u>

అన్ని వ్రేళ్లను చేర్చి, చాచి, బొటనవ్రేలిని దగ్గరగా వంచి పట్టిన పతాక హస్తమగును. పూర్వము బ్రహ్మ ఒంటరిగా పరబ్రహ్మను చేరబోయినప్పుడు పతాకాకృతిగా చేయి చాచి 'జయ విజయీ భవ' అని స్తోత్రము చేసెనట. అట్లు పట్టబడిన చేయి నాటి నుండి లోకములో పతాకమని పిలువబడినది. ఇది అన్ని హస్తములకు మాతృక మొదటిది. ఇది బ్రహ్మవలన పుట్టినది. బ్రాహ్మణ జాతి, తెలుపు వర్ణము. ఋషి శివుడు. అధిదేవత బ్రహ్మ.

<u>ఉపయోగము</u> :– నాట్యారంభము, మేఘము, అడవి, వస్తు నిషేధము, ఏనుగు, కుంభస్థలము, రాత్రి. దేవతల సమూహము, గుఱ్ఱము, ఖండించుట, గాలి, నిద్రించుట, గమనము, ప్రతాపము, ప్రసాదము, చంద్రకాంతి, ఎక్కువ ఎండ, తలుపు నెట్టుట, ఏడు విభక్తులు, అలలు, వీధిలో ప్రవేశము, సమముగ నుండుట, గంధము పూయుట, 'తాను' అని చెప్పుట, అంతము, ఊరకుండుట, ఆశీర్వదించుట, నృపతిని జూపుట, తాటాకు, డాలు, పదార్థములను స్పృశించుట, ఇచ్చుట, అప్పుడు అనుట, సముద్రము, యితరులను, సంబోధించుట, కత్తియొక్క ఆకారమును జూపుట, నేల, పత్ని, రసము, వర్షము, దినము, దుముకుట, మొదలగు వానియందు పతాక హస్తము చెల్లును.

(2) <u>త్రిపతాక హస్తము</u> :– పతాక హస్తమునందలి చిటికెన వ్రేలి ముందలి వ్రేలు (అనామికము) వంచబడినచో త్రిపతాక హస్తమగును.

పూర్వము ఇంద్రుడు వజ్రాయుధము నెత్తినప్పుడు పతాకము యొక్క అనామికమును వదలి, గ్రహించుటచే అది త్రిపతాక మనబడినది. ఇది ఇంద్రుని వలన పుట్టినది. ఎరుపువర్ణము. క్షత్రియ జాతి. ఋషి గుహుడు. అధిదేవత శివుడు.

<u>ఉపయోగము</u> :– మకుటము, చెట్టు, వజ్రాయుధము, ఇంద్రుడు, మొగలిపువ్వు, దీపము, అగ్నిజ్వాలా విజృంభణము, చెక్కిలి, మకరణ పత్రరేఖ, అమ్మ, మార్పు, స్త్రీ పురుషుల చేరిక,– వీనియందు ఈ హస్తము చెల్లును.

(3) <u>అర్ధపతాకము</u> :– త్రిపతాకములోని చిటికెనవ్రేలు కూడ వంచిన యెడల అర్ధపతాక హస్తమగును.

<u>ఉపయోగము</u>:– చిగురు, ఫలక, తీరము, ఇద్దరు అని చెప్పుట, వాలుకత్తి, గంపము, ధ్వజము, గోపురము, శృంగము, – వీని యందీ హస్తము చెల్లును.

(4) <u>కర్తరీముఖము</u> :– అర్ధపతాకములోని చిటికెన వ్రేలును చూపుడు వ్రేలును, బయటకు చాచిపట్టిన కర్తరీముఖ హస్తమగును.

పూర్వము శివుడు జలంధరాసుర సంహారమునకై భూమి మధ్యలో నుండి తర్జనితో చక్రము వ్రాసెనట. ఆ కారణమున శివుని వలన పుట్టినది. క్షత్రియజాతి. ఋషి పర్జన్యుడు. రక్త వర్ణము. అధిదేవత చక్రపాణి.

<u>ఉపయోగము</u> :– స్త్రీ పురుషుల యెడబాటు, వ్యత్యస్త ప్రదేశము, పొంగిపొరలుట, కన్ను, దొచ్చుట, భేదభావము, మెరపు, ఏకశయ్యా విరహము, క్రిందపడిపోవుట, లత, అపని – వీని యందు ఈ హస్తము చెల్లును.

(5) మయూర హస్తము :– కర్తరీముఖహస్తములోని అనామికమును అంగుష్ఠముతో చేర్చి తక్కిన వ్రేళ్లను వంచిపట్టిన మయూర హస్తమగును.

<u>ఉపయోగము</u> :– నెమలి ముఖము, లత, పక్షి, క్రక్కుట, కురులను దిద్దుట, నొసట బొట్టు, కన్నీరు నెగజిమ్ముట, శాస్త్రమును గూర్చి చర్చ, ప్రసిద్ధి – వీనియం దీ హస్తము చెల్లును.

(6) <u>అర్ధచంద్రహస్తము</u>:– పతాకహస్తములోని అంగుష్ఠమును చాచిన అర్ధచంద్రహస్తమగును.

ఈ హస్తము అవిసె మొగ్గను బోలియుండును. భూషణములపై అధిక ప్రేమగల శివుని కొరకై చంద్రుని నుండి పుట్టినది. వైశ్యజాతి. ఋషి అత్రి. గౌరవర్ణము. అధిదేవత మహాదేవుడు.

<u>ఉపయోగము</u> :– కృష్ణాష్టమి నాటి చంద్రుడు, మెడపట్టి గెంటుట, భల్లాయుద్ధము, దేవతాభిషేకము, తినుకంచము, పుట్టుక, మొల, విచారము, తననుగూర్చి చెప్పుకొనుట, ధ్యానము చేయుట, ప్రార్థించుట, అవయవములను అంటుకొనుట, నమస్కారము – వీనియం దీ హస్తము చెల్లును.

(7) <u>అరాళహస్తము</u> :– పతాక హస్తములోని చూపుడువ్రేలు వంచబడినచో అరాళ హస్తమగును.

పూర్వము అగస్త్యముని సప్తసముద్రములను ఆపోశనము చేసినప్పుడు అతని వలన పుట్టినది. మిశ్రజాతి. అగస్త్యముని ఋషి. పాటల వర్ణము. వాసుదేవుడు అధిదేవత.

<u>ఉపయోగము</u> :– విషము, అమృతము మొదలగు వానిని త్రాగుటయందు, గాలియందు ఈ హస్తము చెల్లును.

(8) <u>శుకతుండహస్తము</u> :– అరాళహస్తమునందలి అనామికమును గూడ వంచినచో శుకతుండహస్తమగును.

ఇది మహాదేవునిపై పార్వతికి ప్రణయకోపము గల్గినప్పుడు ఆమెవల్ల పుట్టినది. బ్రాహ్మణజాతి. ఋషి దుర్వాసుడు. రక్త వర్ణము. మరీచి అధిదేవత.

ఉపయోగము :- బాణప్రయోగము, ఈటె, మర్మమైనమాట, ఉగ్రభావము, వీనియందీహస్తము చెల్లును.

(9) ముష్టిహస్తము :- నాలుగు వ్రేళ్లను చేర్చి అరచేతిలోనికి వంచి అంగుష్ఠము మీద చేర్చిన ముష్టి హస్తమగును.

ఇది పూర్వము విష్ణువు మధుకైటభులతో యుద్ధము చేసినప్పుడు విష్ణువలన పుట్టినది. శూద్రజాతి. ఋషి అమరేంద్రుడు. నీలవర్ణము. అధిదేవత చంద్రుడు.

ఉపయోగము :- స్థిరమగుట, సిగపట్టుకొనుట, దృఢత్వము, వస్తువులను స్వాధీనము చేసికొనుట, మల్లయుద్ధము – వీనియందీ హస్తము చెల్లును.

(10) శిఖరహస్తము :- ముష్టిలోని బొటనవ్రేలు చాచిపట్టిన శిఖరహస్తమగును

పూర్వము శివుడు త్రిపురాసురులతో యుద్ధము చేసినప్పుడు మేరు పర్వతమును విల్లుగా చేసికొని దాని మధ్యభాగమును పట్టినప్పుడు అతని వలన పుట్టెను. గంధర్వజాతి. ఋషి జనుడు. పాండురవర్ణము. అధిదేవత మన్మథుడు.

ఉపయోగము :- మన్మథుడు, విల్లు, స్తంభము, నిశ్శబ్దము, పతిభావము, పెదవి, ఛత్త్ర, దంతము, ప్రవేశించుట, ప్రశ్నించుట. లయము, లేదు అని చెప్పుట, తలంచుట, ఇతరాభినయము, సిద్ధము, కట్టునీడ్చుట, కౌగిలించుట, ప్రియుడు, శక్తి, తోమరాయుధమును ప్రయోగించుట, ఘంటానాదము – మొదలగు వానియందు చెల్లును.

(11) కపిత్థహస్తము :- శిఖరహస్తము అంగుష్ఠముపై చూపుడు వ్రేలుంచిన కపిత్థ హస్తమగును.

పూర్వము సముద్రము చిలుకుటకు అనుకూలముగ మంధర పర్వతమును విష్ణువు పట్టినప్పుడు ఈ హస్తము అతనివలన పుట్టినది. ఋషి జాతి. ఋషి నారదుడు. తెలుపు వర్ణము. అధిదేవత పద్మ గర్భుడు.

ఉపయోగము :-లక్ష్మి, సరస్వతి, చుట్టుట, తాళమును పట్టుట, కాటుక పెట్టుకొనుట, వినోదముగ పూవుల చెండ్లను తాల్చుట, కొంగు మొదలైనవి పట్టుకొనుట, ముసుగు వేసికొనుట, ధూప దీప సహితముగ అర్చన –వీనిలో ఈ హస్తముపయోగపడును.

(12) కటకాముఖహస్తము:-కపిత్థహస్తములో చూపుడువేలు, నడిమివ్రేలుతోను, బొటనవ్రేలితోను, చేర్చిపట్టిన కటకాముఖ హస్తమగును.

శివుని యొద్ద కుమారస్వామి విలువిద్య నేర్చుకొనునప్పుడు కటకాముఖ హస్తము పుట్టినది. దేవజాతి. భార్గవుడు ఋషి. స్వర్ణ వర్ణము. అధిదేవత రాఘవుడు.

ఉపయోగము :- పువ్వుల కోయుట, ముత్యాలదండలు, పూలహారాలు ధరించుట, బాణముల మెల్లగ ఆకర్షించుట, ఆకు మడుపులందిచ్చుట, కస్తూరి మొదలగు సుగంధ ద్రవ్యములను కలుపుట, వాసన ద్రవ్యములను చేర్చుట, మాట, చూపు – వీనిలో ఈ హస్తముపయోగపడును.

(13) సూచీహస్తము :- కటకాముఖహస్తములోని చూపుడు వ్రేలు పొడుగుగ చాచిన సూచీహస్తమగును.

పూర్వము బ్రహ్మ తానొక్కడనే నని నిర్దేశించినప్పుడు అతని వలన ఈ హస్తము పుట్టినది. దేవజాతి. ఋషి సూర్యుడు శ్వేత వర్ణము. అధిదేవత విశ్వకర్మ.

ఉపయోగము :- ఒకటి, నూరు అనుట, సూర్యుడు, పర బ్రహ్మను నిరూపించుట, నిగమము, అట్లు యని చెప్పుట, ఎవరు, ఘనచక్ర, సమర్థించుట, కృశించుట, శరీరము, ఆశ్చర్యము, జడను చూపుట, గొడుగు, నేర్పరితనము, మూలయనుట, శరీరముపై రోమములు, భేరీమ్రోగించుట, కమ్మరిచక్రము త్రిప్పుట, బండి చక్రము, జనసమూహము, వివరణ, సంధ్యవేళ – వీటిలో ఈ హస్తముపయోగపడును.

(14) చంద్రకళ : సూచీ హస్తములోని బొటనవ్రేలు చాచి పట్టిన చంద్రకళ హస్తమగును.

ఉపయోగము :- ఇది చంద్రుని కళలు నిరూపించుట యందు చెల్లును

(5) పద్మకోశహస్తము :- అయిదువ్రేళ్లు యెడముగ చాచి కొంచెము వంచి అరచేయి పల్లమగునట్లు పట్టిన పద్మకోశ హస్త మగును.

పద్మాయుధము కెంపు కమలములతో శివుని పూజచేసిన విష్ణువు వలన ఈ హస్తము పుట్టినది. యక్షజాతి, ఋషి పద్మ ధరుడు. భార్గవుడు అధిదేవత.

ఉపయోగము :- మారేడు పండు, వెలగపండు, స్తనములు, వర్తులవ, బంతి, ఫలహారము, మొగ్గ, మామిడిపండు, పుష్పవర్షము, పూగుత్తి, సంపెంగ పువ్వు, ఖంటానాదము, పాములపుట్ట, నల్లకలువలు, గ్రుడ్లు – వీని యందు చెల్లును.

(16) సర్పశీర్షము :- పతాకహస్తము అరచేయి కొంచెము పల్లముగ బట్టిన సర్పశీర్షహస్తమగును.

పూర్వము బలిచక్రవర్తికి భయపడి తనను శరణు వేడిన ఋషులకు విష్ణువు తను వామనావతారమెత్తి వారిని రక్షింతునని

(24) హంసపక్షము :- సర్పశీర్షములోని చిటికెనవ్రేలు చాచి పట్టిన హంసపక్ష హస్తమగును.

శివునివద్ద తండువు తాండవ నృత్యమభ్యసించువేళ చేతిని హంస రెక్కలవలె పట్టెను. అతని వలన ఈ హస్తము పుట్టెను. అప్సరజాతి. ఋషి భరతుడు. నీలవర్ణము, మన్మథుడు అధిదేవత.

ఉపయోగము :- శుభనాట్యము, వీణ వాయించుట, ఆరు అని లెక్క, కట్టకట్టుట, గోటి నొక్కు, గురుతు, ఏదైన ఒక పని చేయుట, పక్షి రెక్క, పలుపు, పన్నె, అప్సరజాతి — వీని యందు ఈ హస్తము చెల్లును.

(25) సందంశహస్తము :- పద్మకోశహస్తపు వ్రేళ్ళను మాటి మాటికి చేర్చి విడిచిపెట్టిన సందంశహస్తమగును.

సరస్వతి అక్షమాల ధరించినప్పుడు ఆమె వలన ఈహస్తము పుట్టినది. విద్యాధర జాతి. ఋషి విశ్వావసుడు. గౌరవర్ణము. వాల్మీకి అధిదేవత.

ఉపయోగము :- ఉదారత్వము, బలినిచ్చుట, పుండు, పురుగు. మనస్సులోని భయము, అర్చన, అయిదనుట, సన్నె, ఈగ, సూక్ష్మము, [illegible], విషము, పట్టుపురుగు, టీక, జ్ఞానముద్ర — వీని యందు ఈ హస్తము చెల్లును.

(26) ముకుళ హస్తము :- పద్మకోశము యొక్క ఐదు వ్రేళ్లను చేర్చి పట్టిన ముకుళహస్తమగును.

ఆంజనేయుడు [illegible] తను శంకరునితో [illegible] [illegible] పుట్టినది. సంకీర్ణజాతి. విశాఖుడు ఋషి. కపిలవర్ణము. చంద్రుడు అధిదేవత.

ఉపయోగము :- కలువ పువ్వు, తామర మొగ్గ, దీనవాక్యము, భోజనము చేయుట, మన్మథుడు, [illegible] మాటలు, ముద్రలను ధరించుట, [illegible], అరటిపువ్వు, అయిదనుట, ఆత్మ — వీనిలో ఈ హస్తము చెల్లును.

(27) తామ్రచూడ హస్తము :- ముకుళహస్తములోని తర్జనిని వంచి పట్టిన తామ్రచూడ హస్తమగును.

ఆకృతిని ధరించి మూడు వేదములు బ్రహ్మముందు నిలిచి తమ యొక్క అభిప్రాయములను తెలుపునప్పుడు వానివలన ఇది పుట్టెను. దేవజాతి. దేవేంద్రుడు ఋషి. శంఖవర్ణము. అధిదేవత బృహస్పతి.

ఉపయోగము :- ముల్లోకములు, మూడు వేదములు, మూడవి లెక్కపెట్టుట, మారేడు పత్రి, శూలాయుధములు, కన్నీరు తుడుచుట, కోడి, కొంగ, కాకి, ఒంటె, దూడ, వ్రాయుట — వీనియందు ఈ హస్తము చెల్లును.

(28) త్రిశూలము :- బొటనవ్రేలు, చిటికెన వ్రేలు వంచి, తక్కినవి చాచి పట్టిన త్రిశూల హస్తమగును.

ఉపయోగము :- మారేడు పత్రి, మూటి కూడిక, — వీని యందు ఈ హస్తము చెల్లును.

## బాంధవ్య, నవగ్రహ, దశావతార, దేవ, చతుర్వర్ణ, పవిత్రనదీ హస్తములు

అసంయుత హస్త సంయోగము వలనే సంయుత హస్తములు కలుగుచున్నవి. కాని అధిదేవతలు వేరు.

అంజలి, కపోతము, కర్కటకము, స్వస్తికము, డోల, పుష్పపుట, ఉత్సంగ, శివలింగ, కటకావర్తన, కర్తరీ స్వస్తిక, శకట, శంఖచక్ర, సంపుటి, పాశ, కీలక, మత్స్య, కూర్మ, వరాహ, గరుడ, నాగబంధ, ఖట్వ, భేరుండ, అవహిత్థ అని సంయుత హస్తములు యిరువది నాలుగు.

(1) అంజలి :- రెండు పతాకముల అరచేతులు చేర్చినచో అంజలి హస్తమగును. అధిదేవత క్షేత్రపాలుడు.

ఉపయోగము :- దేవతలకు, గురువులకు, బ్రాహ్మణులకు నమస్కరించుటకు. తాళము వేయుట. శివస్వరూప నిరూపణము, ధ్యానము చేయుట, కింకరుదనుట యందు చెల్లును.

(2) కపోతము :- అంజలి యొక్క మొదలు, తుది, పార్శ్వభాగములు, చేర్చి పట్టిన కపోత హస్తమగును. అధిదేవత చిత్రసేనుడు.

ఉపయోగము :- ప్రమాణము, పెద్దలతో మాట్లాడుట, వినయముగ ఒప్పుకొనుట, అంగీకారము, టెంకాయ [illegible] చలి, మాదీఫలము, సంపుటము — వీని యందు ఈ హస్తము చెల్లును.

(3) కర్కటహస్తము :- కపోత హస్తములోని వ్రేళ్ళ [illegible] లందు, రెండవ చేతివ్రేళ్ళు దొప్పించి పట్టిన కర్కట హస్తమగును. అధిదేవత విష్ణువు.

ఉపయోగము :- గుంపును జూపుట, లావైన కడుపును జూపుట, దుఃఖము, ఆవులింత, కొట్టుట, [illegible], శంఖము నూదుట, ఒడలు విరిచుట, చెట్టుకొమ్మను వంచుట, స్త్రీలు మెటికలు విరుచుట — వీనియందు చెల్లును.

(4) స్వస్తికహస్తము :- రెండు పతాకముల మణికట్టులను చేర్చి పట్టవలయును.

ఉపయోగము :- మొసలిని తెలుపుటకు, భయముతో మాట్లాడుట, వాదులాడుట, పొగడుట — వీని యందు ఈ హస్తము చెల్లును.

(22) ఖట్వ హస్తము :– చతురహస్తముపై చతుర హస్త ముంచి, చూపుడు వ్రేలు, బొటన వ్రేలు చాచిపట్టిన ఖట్వహస్త మగును.

మంచము, మంచె, మొదలైన వానియందు చెల్లును.

(23) భేరుండ హస్తము :– కపిత్థ హస్తములు, మణి కట్టులతో చేర్చి పట్టవలయును.

ఇది భేరుండ పక్షి దంపతులను సూచించును.

(24) అవహిత్థ :– రెండు సోల పద్మహస్తములు రొమ్మున కెదురుంగ పట్టవలయును. శృంగార నటనము, పూబంతిని పట్టుట, స్తనము, అపని యందు చెల్లును.

## బాంధవ్య హస్తములు

(1) దంపతీ హస్తము :– ఎడమచేత శిఖరము, కుడిచేత మృగ శీర్షము పట్టవలయును. ఇది భార్యా భర్తలయందు చెల్లును.

(2) మాతృ హస్తము :– ఎడమచేత అర్ధచంద్ర, కుడిచేత సందంశ హస్తముబట్టి, తరువాత యెడమచేత స్త్రీ హస్తము నాభి కెదురుగ పట్టవలయును.

ఇది తల్లి, మాతురులయందు చెల్లును.

(3) పితృహస్తము :– మాతృ హస్తములోని కుడిచేత శిఖర హస్తము పట్టవలయును. ఇది తండ్రికి, అల్లునికి చెల్లును.

(4) శ్వశ్రూ హస్తము :– [illegible] హంసాస్య హస్తము [illegible] సందంశ [illegible] నాభి [illegible] యెడమచేత శిఖర హస్తము పట్టవలయును.

ఇది అత్తకు చెల్లును.

(5) శ్వశుర హస్తము :– శ్వశ్రూహస్తము కుడిప్రక్క శిఖర హస్తము బట్టిన శ్వశుర హస్తమగును.

ఇది మామకు జెల్లును

(6) భర్తృ భ్రాతృహస్తము :– ఎడమచేత శిఖరము, కుడిచేత కర్తరీ ముఖముపట్టి, దానిని రెండుప్రక్కలందు పట్టిన భర్తృ భ్రాతృ హస్తమగును.

ఇది భర్త తోడబుట్టిన వారికి చెల్లును.

(7) ననందాహస్తము :– భర్తృ భ్రాతృహస్తము పట్టి, శిఖర హస్తము కుడిచేతబట్టిన ననంద యగును.

ఇది ఆడబిడ్డకు చెల్లును.

(8) జ్యేష్ఠ కనిష్ఠ భ్రాతృ హస్తము :– మయూర హస్తము ముందు ప్రక్కను, వెనుక ప్రక్కను పట్టవలయును.

ఇది అన్నదమ్ములయందు చెల్లును.

(9) స్నుషా హస్తము :– జ్యేష్ఠ కనిష్ఠ భ్రాతృహస్తము పట్టి తరువాత కుడిచేత శిఖరహస్తము పట్టిన స్నుషాహస్తమగును.

ఇది కోడలికి చెల్లును.

(10) భర్తృహస్తము :– కంఠమువద్ద, హంసాస్యములనుంచి. కుడిచేత శిఖరహస్తము పట్టవలయును.

ఇది మగనికి చెల్లును.

(11) సపత్నీ హస్తము :– పాశహస్తము చూపి రెండుచేతు లందు స్త్రీ హస్తములు పట్టవలయును.

ఇది సవతులయందు చెల్లును.

## దేవహస్తములు

1. బ్రహ్మహస్తము:– ఎడమచేత చతుర, కుడిచేత హంసాస్య పట్టవలయును.

2. శంభుహస్తము: ఎడమచేత మృగశీర్ష, కుడిచేత త్రిపతాకను పట్టవలయును.

3. విష్ణుహస్తము : రెండు చేతులందు త్రిపతాకములు భుజముల వద్ద పట్టవలయును.

4. సరస్వతి హస్తము :– కుడిచేత సూచి, యెడమచేత కపిత్థ హస్తములు వాయించునట్లు పట్టవలెను.

5. పార్వతి హస్తము :– చేతుల క్రిందుమీదుగాచేసి అర్ధ చంద్రహస్తములు పట్టిన అభయముద్ర యగును.

ఇది పార్వతియందు చెల్లును.

6. లక్ష్మీ హస్తము :– బహుమూలలయందు రెండు కపిత్థ హస్తములు పట్టవలెను.

7. విఘ్నేశ్వరహస్తము :– ఎదురుగా రెండు కపిత్థ హస్త ములు పట్టవలెను.

8. షణ్ముఖహస్తము:– ఎడమచేత త్రిశూల, కుడిచేత శిఖర హస్తముయెత్తుగా పట్టవలెను.

9. ఇంద్రహస్తము : రెండు త్రిపతాకములు మణికట్టుల వద్ద చేర్చిపట్టవలయును.

10. అగ్నిహస్తము :– కుడిచేతియందు త్రిపతాకము, ఎడమచేత లాంగూలము పట్టవలయును.

**11. యమహస్తము :-** ఎడమచేత పాశహస్తము, కుడిచేత సూచీ పట్టవలయును.

**12. నైఋతిహస్తము :-** ఖట్వహస్తము, శకటహస్తము పట్టవలయును.

**13. మన్మథహస్తము :-** ఎడమచేత శిఖరహస్తము, కుడిచేత కటకాముఖము పట్టవలయును.

**14. వరుణహస్తము :-** కుడిచేత పతాకము. ఎడమచేత శిఖర హస్తము పట్టవలయును.

**15. వాయుహస్తము :-** కుడిచేత అరాళము, ఎడమచేత అర్ధపతాకము పట్టవలయును.

**16. కుబేరహస్తము :-** ఎడమచేత పద్మహస్తము, కుడిచేత గదాహస్తము పట్టవలెను.

## నవగ్రహ హస్తములు

**1. సూర్యహస్తము:-** భుజ శిరస్సులవద్ద రెండుచేతులతో సోలపద్మ, కపిత్థ హస్తములు పట్టవలెను.

**2. చంద్రహస్తము :-** ఎడమచేత సోలపద్మము, కుడిచేత పతాక హస్తము పట్టవలయును.

**3 అంగారకహస్తము :-** ఎడమచేత సూచీ, కుడిచేత ముష్టిహస్తముపట్టవలెను.

**4. బుధహస్తము :-** ఎడమచేత అడ్డముగ ముష్టిహస్తము, కుడిచేత పతాకహస్తము పట్టవలయును.

**5. బృహస్పతిహస్తము :-** రెండుచేతుల శిఖరహస్తము లనుపట్టి యజ్ఞోపవీతము ప్రదర్శించునట్లు పట్టవలయును

ఇది ఋషులకు, బ్రాహ్మణులకుకూడ చెల్లును.

**6. శుక్రహస్తము :-** ఎడమప్రక్క మీదుగ. కుడిప్రక్క క్రిందుగ ముష్టిహస్తము పట్టవలెను.

**7. శనిహస్తము :-** ఎడమచేత శిఖర, కుడిచేత త్రిశూల హస్తము పట్టవలయును.

**8. రాహుహస్తము :-** ఎడమచేత సర్పశీర్షము, కుడిచేత సూచిహస్తము పట్టవలయును.

**9. కేతుహస్తము :-** ఎడమచేత సూచీ, కుడిచేత అర్ధ పతాక పట్టవలెను.

## దశావతార హస్తములు

**1. మత్స్యావతారము:-** మత్స్యహస్తము చూపి, రెండు త్రిపతాకములు భుజములకు సమముగ పట్టవలయును.

**2. కూర్మావతారము :-** కూర్మహస్తము జూపి, భుజ శిరస్సులకు సమముగ త్రిపతాకములు పట్టవలెను.

**3. వరాహావతారము :-** వరాహహస్తము జూపి, పిరుదుల యందు చేతులుంచవలయును.

**4. నృసింహావతారము :-** ఎడమచేత సింహముఖ, కుడిచేత త్రిపతాకము పట్టవలెను.

**5. వామనావతారము :-** క్రిందు మీదుగ కుడి ఎడమ చేతులందు రెండు ముష్టి హస్తములు పట్టవలెను.

**6. పరశురామావతారము :-** ఎడమచేతిని నడుముపై నుంచి, కుడిచేతితో అర్ధపతాకము పట్టవలెను.

**7. రామావతారము :-** కుడిచేత కపిత్థహస్తము. ఎడమ చేత శిఖరహస్తము క్రిందుమీదులుగ పట్టవలెను.

**8. బలరామావతారము :-** కుడిచేత పతాకము, ఎడమ చేత ముష్టిహస్తము పట్టవలెను.

**9. కృష్ణావతారము :-** రెండు మృగశీర్షములను భుజ శిరస్సుల సమీపమున ఎదురెదురుగ పట్టవలెను.

**10. కల్క్యావతారము :-** కుడిచేత పతాకము, ఎడమ చేత త్రిపతాకము పట్టవలెను.

బుద్ధునకు న్యాసముద్ర చెల్లును.

**రాక్షసహస్తము :-** రెండు చేతులతో ముఖమునందు శకట హస్తము పట్టవలెను.

**ఊరనాభహస్తము :-** పద్మకోశము యొక్క వ్రేళ్ళను వంచిపట్టిన ఊర్ణనాభ హస్తమగును.

నృసింహస్వామి హిరణ్యకశ్యపుని పొట్టను నఖములతో చీల్చినప్పుడు ఆతనివలన పుట్టినది

క్షత్రియజాతి, ఋషిశార్దూలకుడు ఋషి, పచ్చవర్ణము, ఆదికూర్మము అధిదేవత.

**ఉపయోగము :-** నరసింహుడు. సింహము, మృగము యొక్కముఖము, కోతి, తాబేలు. స్తనము. భయము, దొంగతనము. వీనియందుపయోగించును.

**బాణహస్తము :-** చూపుడువ్రేలు మొదలు మూడువ్రేళ్ళను బొటనవ్రేలితో చేర్చి, చిటికెనవ్రేలు చాచిపట్టిన బాణహస్త మగును.

ఆరు అని లెక్కపెట్టుటకు, నాళనృత్యములోను, ఈ హస్త ముపయోగించుట.

**అర్ధసూచీహస్తము :-** కపిత్థహస్తము చూపుడువ్రేలు పొడవుగ యెత్తిపట్టిన అర్ధసూచి యగును.

మొలక, పక్షిపిల్ల, పెద్దపురుగు- వీనియందీ హస్తము చెల్లును.

## చతుర్వర్ణ హస్తములు

1 బ్రాహ్మణహస్తము :- రెండుచేతుల శిఖరహస్తము లనుపట్టి, కుడిచేతితో అడ్డముగ యజ్ఞోపవీతమును చూపవలెను.
ఇది బ్రాహ్మణజాతియందు చెల్లును.

2. క్షత్రియహస్తము :- ఎడమచేత శిఖరమును, అడ్డముగాపట్టి, కుడిచేత పతాకమును పట్టిన క్షత్రియహస్తమగును.
ఇది క్షత్రియజాతియందు చెల్లును.

3. వైశ్యహస్తము :- ఎడమచేత హంసాస్యము, కుడిచేత కటకాముఖమును పట్టిన వైశ్యహస్తమగును.
వైశ్యజాతియందు చెల్లును.

4. శూద్రహస్తము :- ఎడమచేత శిఖర, కుడిచేత సూచీ హస్తము బట్టవలయును.
ఇది శూద్రజాతికి చెల్లును. ఇతర వర్ణములకు వారి వారి పనులనుబట్టి హస్తముల నేర్పరుపవలయును.

## పవిత్రనదీ హస్తములు

తామ్రచూడ గంగానదికి. రేఖాహస్తము యమునకు, సింహముఖ కృష్ణకు, చతురహస్తము కావేరీనదికి, పతాక తుచర హస్తములు సరస్వతినదియందు, అర్ధపతాకము నర్మదయందు, హంసాస్యము తుంగభద్రానదియందు, బాణవతి శరావతియందు, వేత్రవతియందు సూచీహస్తము, చలించు పతాకములు చంద్రభాగయందు, అలపద్మ హస్తములు సరయూనదియందు, అరాళము భీమరథినదియందు, అర్ధచతురము స్వర్ణముఖియందు, పాపనాశనీ నదియందు శుకతుండ హస్తము చెల్లును. సాధారణముగ అన్ని నదులకు పతాకహస్త ముపయోగించును.

ఊర్ధ్వలోకములకు ఉద్వేష్టిత పతాకహస్తము, అధోలోకములకు అపవేష్టిత పతాక ముపయోగపడును.

1. సింహము :- సింహము మొదలైన మృగముల హస్తములు, కుడిచేత సింహముఖ హస్తముబట్టి, దానికి వెనుకతట్టు పతాకము ఎడమగా వ్రేళ్ళను గలిగినట్లు పట్టిన స్లిష్టసింహముఖమగును. ఈ హస్తము సింహమున కుపయోగించును.

2. వ్యాఘ్రము :- అర్ధచంద్రము అధోముఖముగ బట్టిన పులి కుపయోగించును.

3. సూకరము :- మత్స్య హస్తమందు దక్షిణ హస్తమును వంచి కదిలించుచు వ్రేళ్ళ నైదింటిని విరళముగ నుంచిన అది సంకీర్ణమకర మగును. ఇది పందికి చెల్లును.

4. కపి :- ముష్టిహస్తమునకు మధ్యమ, అంగుష్ఠములచేర్చిన అధోముష్టి ముకుళమగును. ఈ హస్తము కోతికి చెల్లును,

5. భల్లూకము :- వామహస్తమున పద్మకోశమును అధోముఖముగబట్టి దక్షిణహస్తమున పతాకమును దానిపై నుంచునెడ పద్మకోశ పతాకమగును. ఇది ఎలుగుగొడ్డునందు చెల్లును.

6. మార్జాలము :- ముష్టిహస్తముయొక్క అనామిక అంగుష్ఠములనుచేర్చి పట్టిన అర్ధముకుళమగును. ఇది పిల్లియందు చెల్లును.

7. కురంగము : మృగశీర్షహస్తము జింకకుపయోగించును.

8. శశము :- తలపతాకము అడ్డముగ త్రిప్పిన కుందేటికి వినియోగించును.

9. వృశ్చికము :- అధోముఖముగ కర్కటహస్తమును బట్టి చలింపజేసిన తేలునకు చెల్లును.

10. శునకము :- పతాకములో చిటికెనవ్రేలు ముడిచిన మధ్యపతాకమగును. ఇది కుక్కకుపయోగించును.

11. ధేనువు :- నడిమివ్రేలువంచి తక్కినవి చాచిపట్టిన సంకీర్ణముద్రహస్తమగును. ఇది ఆవునకుపయోగించును.

## పక్షిహస్తములు

1. కపోతము :- కపోతహస్తమును పుంఖితముగా బట్టిన పావురమందు చెల్లును.

2. ఉలూకము :- గరుడహస్తముల మొనలను జేర్చి బట్టిన గుడ్లగూబయందుపయోగించును.

3. కుక్కుటము :- త్రిశూలహస్తము కోడియందుచెల్లును.

4. చాతకపక్షి :- అరాళమును పుంఖితముగ బట్టిన కోకిలయందువినియోగించును.

5. శుకహస్తము :- శుకతుండమును పుంఖితముగ బట్టిన చిలుకయందుచెల్లును.

6. భ్రమరము :- భ్రమరహస్తమును పుంఖితముగ బట్టవలెను.

7. మయూరము :- మయూరహస్తమును పుంఖితముగ బట్టిన నెమలియందుచెల్లును.

ఇవిగాక హరిశ్చంద్ర, నల మొదలగు ప్రసిద్ధరాజులు, సప్తసముద్రముల, వృక్షముల హస్తములుగలవు. కాని ప్రస్తుత కాలముయందు నృత్యమునకుపయోగపడు వానిని గూర్చి మాత్రమే వ్రాయబడెను.

# శాస్త్రపరిచయము

శివుడు, పార్వతి, బ్రహ్మ, విష్ణువు, నందికేశ్వరుడు, దత్తిలుడు, కోహలుడు, యాజ్ఞ్యవల్క్యుడు, నారదుడు, ఆంజనేయుడు, విఘ్నేశ్వరుడు, కుమారస్వామి, బృహస్పతి, అర్జునుడు, రావణుడు, ఉషాకన్య అను పదునారుగురు భరతశాస్త్రకర్తలుగా లోకప్రసిద్ధి జెందిరి.

## 24 విధములైన నాట్యభేదములు

శృంగార, ఉగ్ర, భృంగీ, చిత్ర, చారీ, చాళియ, శుద్ధహస్తచాళియ, మార్గ, అంగహార, పాదచారి, పార్శ్వక, ముఖ

వాళీయ, లవణీ, ఫేరిణీ, దేశీ, లీలా, తాండాళిక, సంధి, ప్రాంత, ఘూనారి, ఆవృత్త, విద్యుద్భ్రమర, పుష్పాంజలి అని యిరువది నాలుగు పథములగు నాట్యములు ప్రసిద్ధము చెందినవి. (భరత సార గ్రంథకర్త చంద్రశేఖరుని మతప్రకారము) ఇందు శుద్ధ - దేశీ సంగీత ప్రబంధములు.

నాట్యకాలమున పాత్రయొక్క వివిధ అవయవముల యందు దేవతలాశ్రయించి యుందురు.

బ్రహ్మరంధ్రములో సదాశివుడు, లలాటమున క్షేత్రపాల కుడు, కటియందు బుద్ధదేవుడు, మోకాళ్లలో మహాదేవుడు, హస్త ములందు స్థిరశక్తి, హస్తముల చివరలందు పార్వతి, వక్షము నందు విష్ణువు, స్తనద్వంద్వమందు-మేరుమందరములు; నాభియం దు-లక్ష్మి; జఘనమున-భూదేవి; ఊరువులందు-ఇంద్రుడు; జంఘ ములందు - బ్రహ్మ; జానువులందు - వాయువు; దృష్టులందు మన్మ థుడు - ఉభయ పాదములందు సూర్య చంద్రులాశ్రయించి యుందురు.

నాట్యము చేయుచుండగ మధ్యలో కాలిగజ్జెలుజారి భూమి మీద పడినయెడల, లక్ష్మీ సరస్వతుల స్మరించిన దోషముండదు. కాలినుండి గజ్జెలు తెగి పడిపోయినచో గురుదేవునికి నమస్కరించి నృత్యము సల్పవలెను.

## శరీరావయవములకు పట్టవలసిన హస్తములు

పాదములు, నుదురు - పతాకము; చీలమండలు, నడుము- ముష్టి; చంకలు, పిరుదులు, మోకాళ్ళు - అర్ధచంద్రము; పొట్ట, పిక్కలు-కపోతము; తొడలు-కరిహస్తము; యోని-కటకాముఖ శిశ్నము - మృగశీర్ష; గోళ్లు, ముంగురులు, శిరము, చెక్కిళ్లు; వృష ణములు - త్రిపతాక; దంతములు - శుకతుండము; గుదము - సందంశ; దృష్టి, కనుబొమలు బొడ్డు, ముక్కు, క్రింది పెదవి, గుణము, బుద్ధి - సూచీహస్తము.

జడ-కర్తరీస్వస్తిక; మనోవికారము-కర్తరీముఖ: స్తన ములు-నళినీపద్మకోశము; గోళ్లు-బాణహస్తము; వెంట్రుకలు- అలపల్లవము; హృదయము-స్వస్తికము; స్తనాగ్రములు, గోరు- ముకుళము; నుదురు - సర్పశీర్షము; చెవులు, మాటలు-హంసా స్యము చేత అభినయించవలెను.

**నవరత్నములు :-**

లాంగూల - పుష్యరాగము; సింహముఖ - వజ్రము
అర్ధచంద్ర - చంద్రకాంతమణి; హంసాస్య - ముత్యము
కటకాముఖ నీలము; చతుర - మరకతము
సందంశ - పద్మరాగము; శిఖర - పగడము
అర్ధపతాక - గోమేధికము; అలపల్లవ - సూర్యకాంతమణి
సింహముఖ - వైఢూర్యము

**లోహములు :-**

ధనము-త్రిపతాక
బంగారము-చతుర
వెండి-పతాక
కంచు-సింహముఖ
ఇనుము-ముష్టి
సత్తు, తగరములు-సూచీ
సీసము-లాంగూలము
ఇత్తడి-చతుర

లోహభేదములగు—లోహముల ప్రయోగములకు అర్ధపతాకము చేత చూపవలెను.

**నవరసములు :**

రేఖాచంద్ర — పద్మకోశ — శృంగారము; త్రిపతాక—వీర; ముకుళ — కరుణ; సందంశ — అద్భుత; ఊర్ణనాభ — భయానక కర్తరీ, త్రిపతాక—భీభత్స; శుకతుండ—రౌద్ర; హంసపక్ష—శాంత హంసాస్య — హాస్య.

**వారములు :-**

| | |
|---|---|
| అలపల్లవ - ఆదివారము | పతాక - శుక్రవారము |
| అర్ధచంద్ర - సోమవారము | ముష్టి - శనివారము |
| త్రిపతాక - మంగళవారము | సూచీ - గడియలు |
| సందంశ - బుధవారము | హంసాస్య-యామములు, నిమిషములు |
| శిఖర - గురువారము | పతాక - దినము, నెల, వత్సరము |

**స్వరములు :-**

మయూరము—షడ్జమము; మృగశీర్షము—ఋషభము; సింహ ముఖ—గాంధారము; హంసాస్య—మధ్యమము; శుకతుండ—పంచ మము; అర్ధపతాక—ధైవతము; కరిహస్త, సందంశ-నిషాదము.

**సంఖ్యలు :-**

ఒకటి-సూచీముఖము; రెండు-కర్తరీముఖ, అర్ధపతాకములు; మూడు-తామ్రచూడము; నాలుగు-త్రిపతాక, లాంగూల; ఐదు- లాంగూల, శిఖరము; ఆరు-బాణము; ఏడు-సందంశ; ఎనిమిది- హంసాస్య; తొమ్మిది - పతాక, కటకాముఖ; పది - అర్ధచంద్ర హస్తములు.

**షడ్రసములు :-**

తీపి-ఉద్వేష్టిత, అలపల్లవములు; చేదు-కుడిచేత సింహముఖ పట్టి, బొటనవ్రేలు కదలించవలెను.
పులుపు-లాంగూల ఊర్ధ్వముగ చలించవలెను.
వగరు-పతాక లేక చతుర; కారము-ఖండచతుర
ఉప్పు-ముకుళము ఉద్వేష్టితముగ చలించవలెను.

## కరణులు - వాని వినియోగము

నృత్యములో ఒక భావమును ప్రదర్శించుటకుచేయు అంగ, ప్రత్యంగ, ఉపాంగముల తాళ లయబద్ధమైన విన్యాసమే, కరణ మనబడును. ఆంగికమువల్ల అనుకున్న భావము ప్రదర్శింపబడ నప్పుడు సాత్విక భావములుకూడ చేర్చబడును. 'ఈ కరణులు' నృత్యములో ఉపయోగపడినంతగా పదాభినయములో పనికిరావు.

ఈ కరణములు 108 గ భరతాచార్యులు చెప్పిరి. ఏదైన ఒక భావమును ప్రదర్శించుటకు ముందు నర్తకియొక్క శరీరగతి యెట్లుండవలెనో, క్రమేణ ఆ భావములో నిమగ్నమగునప్పుడు హస్త పాదముల విన్యాస మెట్లుండవలెనో, ఆఖరుకు ఆ భావము పూర్తిగ ప్రదర్శింపబడినప్పటి భంగిమ యెట్లుండునో, క్రమ క్రమముగ గలుగు మార్పుల వివరముగ చెప్పబడి యున్నవి. ఆ ముగింపు భంగిమలకే 'కరణ' లని పేరు. అట్టి కరణములే చిదంబరములోని నటరాజస్వామి ఆలయమునందు, తంజావూరు బృహదీశ్వరాలయమందు, కంచి కైలాసనాథాలయమందు చెక్కబడి యున్నవి. ప్రతి కరణము ఒక్కొక్క ప్రత్యేక భావమును, రసమును ప్రదర్శించుట కుపయోగించును. ప్రతి కరణమునకు ప్రత్యేక శబ్దములతోకూడిన మృదంగ వాద్యముండవలెను.

ఉదా:- 'తలపుష్పపుట'

ఇది భరతముని పేర్కొన్న మొదటి కరణము. నృత్యారంభములో పుష్పములను రంగముపై జల్లుట, దేవతలకు పుష్పాంజలి సమర్పించుట మన నృత్య సాంప్రదాయములో ముఖ్యమైన క్రియ. ఈ క్రియ ప్రదర్శించునప్పుడు నర్తకుడు 'తలపుష్పపుట' నృత్యకరణి నాడును.

ఈ కరణము ప్రదర్శించు విధానము:

నర్తకుడు సమభంగిమందుండి, రెండు చేతులనుచేర్చి అంజలి పట్టును-(హస్తములలో పుష్పములున్న భావము స్ఫురించును)

తరువాత కుడికాలి మడమను సుందరముగ నెత్తుచు బొటనవ్రేలిపై భారమునుంచి, యితర వ్రేళ్ళను పైరుపరచి, శరీరము రమణీయముగ ఒక ప్రక్కకు కొంచెముగ వంచును.

**దృష్టి :—** ప్రారంభములో సమదృష్టి – క్రమేణ రెప్పలు కొంచెముగ మూతలుబడి నేత్రములు వికాసవంతముగనుండును. ఇందు భక్తిభావము స్ఫురించును.

ఇది 'తలపుష్పపుట' అనబడును. ఈ కరణి ప్రదర్శించునప్పుడు మార్దంగికుడు కూడ ప్రత్యేక శబ్దములను పలికించును.

దో—హం తంగిణ దొంగిన దొంగిటకిట
నంగ్రిట కిటత్రక తరికిట తా. వ ఝాం ఝాంత
ఝం॥ ఝం॥

ఇట్లు 108 కరణములను ప్రదర్శించు విధానము – భరతశాస్త్రములో చెప్పబడిన గ్రంథవిస్తరభీతిచే అన్నికరణముల వివరములు విపులముగ వ్రాయుటలేదు. చిత్రమైనట్టి కొన్నిటిని (లలాటతిలక, మయూర లలిత, చక్రమండల, గంగావతరణ) మాత్రము వర్ణించుచున్నాను.

## 108 కరణముల పేర్లు

1. తలపుష్పపుట 2. వర్తిత 3. వలితోరు 4. అపవిద్ధ 5. సమనఖ 6. లీన 7. స్వస్తిక రేచిత 8. మణ్డలస్వస్తిక 9. నికుట్టక 10. అర్ధనికుట్టక 11. కటిచ్ఛిన్న 12. అర్ధరేచితక 13. వక్షఃస్వస్తిక 14. ఉన్మత్త 15. స్వస్తిక 16. పృష్ఠస్వస్తిక 17. దిక్స్వస్తిక 18. అలాత 19. కటీసమ 20. ఆక్షిప్తరేచిత 21. విక్షిప్తాక్షిప్త 22. అర్ధస్వస్తిక 23. అఞ్చిత 24. భుజఙ్గత్రాసిత 25. ఊర్ధ్వజాను 26. నికుంచిత 27. మత్తల్లి 28. అర్ధమత్తల్లి 29. రేచితనికుట 30. పాదాపవిద్ధక 31. వలిత 32 ఘూర్ణిత 33. లలిత 34 దణ్డపక్ష 35. భుజఙ్గత్రాసితరేచిక 36. నూపుర 37. వైశాఖరేచిత 38. భ్రమర 39. చతుర 40. భుజఙ్గాఞ్చిత 41. దణ్డరేచిత 42 వృశ్చికకుట్టిత 43 కటిభ్రాన్త 44. లతావృశ్చిక 45. ఛిన్న 46 వృశ్చికరేచిక 47. వృశ్చిక 48. వ్యసిత 49. పార్శ్వనికుట్ట 50. లలాటతిలక 51. క్రాంత 52. కుఞ్చిత 53. చక్రమండల 54. ఉరోమణ్డల 55. ఆక్షిప్త 56. తలవిలాసిత 57. అర్గళ 58. విక్షిప్త 59. ఆవృత్త 60. దోలపాదక 61. వివృత్త 62. వినివృత్త 63. పార్శ్వక్రాంత 64. నిశుమ్భిత 65. విద్యుద్భ్రాన్త 66. అతిక్రాన్త 67. వివర్తిత 68. గజక్రీడిత 69. తలసంస్ఫోటిత 70. గరుడప్లుత 71. గణ్డసూచి 72. పరివృత్త 73. పార్శ్వజాను 74. గృధ్రావలీనక 75. సన్నత 76. సూచి 77. అర్ధసూచి 78. సూచీవిద్ధ 79. అపక్రాన్త 80. మయూరలలిత 81. సర్పిత 82. దణ్డపాద 83. హంసప్లుత 84. ప్రేంఖోలిత 85. నితమ్బ 86. స్ఖలిత 87. కరిహస్త 88. ప్రసర్పిత 89. సింహవిక్రీడిత 90. సింహాకర్షిత 91. ఉద్వృత్త 92 అపసృత 93 తలసంఘట్టిత 94 జనిత 95. అవహిత్థ 96. నివేశ 97. ఏలకాక్రీడిత 98. ఊరుద్వృత్త 99. మదస్ఖలిత 100. విష్ణుక్రాన్త 101. సంభ్రాన్త 102. విష్కంభ 103. ఉద్ఘట్టిత 104. వృషభక్రీడిత 105. లోలిత 106. నాగాపసర్పిత 107. శకటాస 108. గంగావతరణ.

**లలాటతిలకము :—** నొసటన తిలకము ధరించుట.

ఒక కాలిని వెనుకనుండి వంచి, నొసటి యొద్దకుతెచ్చి బొటనవ్రేలితో నొసట తిలకము పెట్టుట.

'లలాట తిలకము' – ఇది చాల కష్టమైన కరణము ఇది మూడు విభాగములు గలిగి యుండును.

కుడికాలును ఎత్తి వెనుకనుండి తెచ్చి నొసటికి బొటనవ్రేలు తగిలింపవలెను.

ఎడమచేయినెత్తి నొసటి పదకు తేవలెను. కుడికాలి యొక్క బొటనవ్రేలిని ఎడమచేతబట్టి నొసటతిలకము దిద్దించవలెను. కుడిచేత పతాకముద్ర పట్టవలెను.

**మృదంగశబ్దము :—**

కిణకిణ కిణకిణ । రింఝణ కిణకిణ । గింతాంగిదాం
తికగిణ తత్ తైయ్యా । కిటకిట కిటకిట । గిణతత
తైత్యక । ఝుంత ఝుంత తత తఝుం కంత ఝం॥

**మయూరలలిత :—** చేతులను భూమిపైనానించి కాలుపైకెత్తి నెమలిపురివిప్పునట్లు ప్రదర్శించుట.

కుడికాలును వంచి వీపు ప్రక్క పైకెత్తవలెను. చేతులను భుజములపై నుంచవలెను.

తరువాత చేతులను పైకెత్తి చక్రాకారముగ త్రిప్పుచు ముగించి, కటిభాగమును గుండ్రముగ త్రిప్పవలెను.

మృదంగ శబ్దములు :-

ఖర్‌ర్‌ర్ కిన్ దే త్రాంS గణ గణ గణ రింఖణ
కణ కణ గిడకు గిడకు గిడకు గిడకు గిడ గిణ
గిడ గిన ద్రీం

చక్రమండల :-

భూమిపై పాదముల నానించి నిలబడి మొగ్గవాలినట్లు వెనుకకు వంగి భూమిపై చేతులానించిర వలయముగ శరీరమును త్రిప్పుట.

మృదంగ శబ్దములు :-

దడాన్ కిటల : ధళధళ దిర్గుడు ధిర్గుడు
ధిర్గుడుత ధిర్గుడుత దిరి గిడాన్ కిటతరి ఝణ
దిడకిట దిరికిట దిక్కిట తోం

గంగావతరణము :-

శరీరమును యిరుప్రక్కలకు నాపవలె వంచి కదిలించుట. గంగ భూలోకమునకు దిగుట.

చేతులు భూమిపై నానించి, కాళ్లను పైకెత్తవలెను. తల పైపుకానునట్లు యెత్తి పైకి జూడవలెను.

గడ గడ గడ గడ రిందు రిందు రిహ
రిటాకు రింఖణ గణ గణ గణ గణ
ఝణ ఝణ ఝణ ఝణ ధళ ధళ ధళ ధళ
ధళాంగ్ దదిగిణతోం

ఇటుల ప్రతికరణమునకును నృత్యమాడవలసిన వివరములు, దానియొక్క వినియోగములు చెప్పబడినవి. కరణములకు నాట్యాచార్యులు మృదంగశొల్లు వానిలో వచ్చు సాత్విక సంచారులను గురించిగూడ వ్రాసిరి. ఈ వివరములన్నియు వ్రాసిన వేరొక పెద్ద గ్రంధమగును. కనుక మచ్చునకు కొన్నిటికి వివరములు మాత్రమే వ్రాసితిని.

## అంగహారములు

(1) అపరాజిత – ఎదురించుట
(2) సూచికావిద్ధ – సూచివలె శరీరమును సన్నముగా చేయుట
(3) పరిచ్ఛన్న – నర్తకి వినయాకృతిని కొడ్డిగా చేసికొనుట,
(4) విష్కంభ – ఆకృతిని విస్తరించుట.
(5) రేచిత – చెంగలించుట – మొదలైనవి.

## భానుమండలములు_3

ఆస్కందితము, భ్రమరము, శకటాశ్యము.
ఇవి నిలబడియున్న చోటనె తిరుగుటయందుపయోగపడును.

## దైవమండలములు_4

అజాత, దండవాత, లలిత, విచిత్ర.

ఇవి నాట్యమాడుచు వలయముగ తిరుగుటయందు, చిత్ర విచిత్రముగ తిరుగుటయందు, ఉపయోగపడును.

## నాసాచలన భేదములు_2

1. వికాసము :– సంతోషసమయములో ముక్కుపుటము ఉబ్బించుట.

2. సంకోచము :– కోప అసూయాది సమయములందు ముక్కు నదిరించుట, అదరుట.

## అధరోష్ఠ చలన భేదములు_3

1. స్పందము :– కోపము, మొదలైన సమయములలో పెదవి వణకుట,

2. సంకోచము :– మూతి ముడుచుట.

3. వికాసము :– హాస్య, అద్భుతములందు విప్పుట

## ఉరశ్చాలన భేదములు_4

1. నిర్భుగ్నము :– ఎదుటికి రొమ్ముతో గ్రుమ్ముట

2. పార్శ్వసంఘట్టనము :– ఇరుప్రక్కలకు రెండురొమ్ములతో మార్చి మార్చి గ్రుమ్ముట

3. భ్రామణము :– రొమ్ముతో యెదిరించి వెలయుట. ఇది ఆలింగనాదుల యందుపయోగపడును.

4. ఆభుగ్నము :– రొమ్ము గుంటగా జేయుట

## కటిచాలన భేదములు_3

1. రేచిత :– పిరుదులు వెనుకకు పోవునట్లు కటిభాగము వెనుకకు యెత్తుట

2. భిన్న :– పిరుదులు యిరుప్రక్కలకు పోవునట్లు కటిని అడవుల యందు (జతుల నృత్తమందు) ఆడించుట

3. ఉచ్ఛ్వాసిత :– విలాస గమన మందలి కటి యొక్కగతి

## ఊరుచాలన భేదములు_3

1. కంపిత :– మల్లామునందు రెండుతొడలు లయానుసారముగ ఆడించుట

2. నాగబంధము :– రెండుతొడలు పెనవేయుట

3. సంస్కృత వికృతము :– ఆసన భేదాదులందు ఒంటించుట, విప్పుట

—0—

# నాయికా - నాయకులు

రసాలంబనులగు స్త్రీ పురుషులు నాయికానాయకు లన బడుదురు.

స్వీయ, పరకీయ, సామాన్య అని నాయికలు మూడు విధములు.

**స్వీయ** :- తన స్వామియందే అనురాగముగల పతివ్రత స్వీయ.

స్వీయలో మూడు విధములు :

ముగ్ధ, మధ్య, ప్రగల్భ.

ముగ్ధలో నాలుగు విధములు :

1. అజ్ఞాత యౌవన : యౌవన ప్రారంభమును తెలిసి కొనలేనట్టిది.
2. జ్ఞాత యౌవన : యౌవన ప్రారంభమును తెలిసికొన గలిగినది.
3. నవోఢ : క్రొత్తగా వివాహమగుటచేత సిగ్గు, భయము గలది.
4. విస్రబ్ధనవోఢ : బెదురుతీరి, వినయముతో వ్యవహరించునది.

'మధ్య' ఆరు విధములుగా నుండును.

1 మధ్యధీర, 2. మధ్యాధీర, 3. మధ్యధీరాధీర, 4 మధ్య ధీరాజేష్ఠ కనిష్ట, 5 మధ్యాధీరాజేష్ట కనిష్ట, 6. మధ్యధీరాధీర జేష్ట కనిష్ట

ప్రగల్భ ఎనిమిది విధములు;

1. ధీర, 2. అధీర, 3. ధీరాధీర, 4. ధీరాజేష్ట కనిష్ట, 5. అధీరాజేష్ట కనిష్ట, 6. ధీరాధీరా జేష్ట కనిష్ట, 7. రతిప్రియ, 8. సురతానంద మోహిత.

## వివరములు :

1. ముగ్ధ : అంకురిత యౌవన.
2. మధ్య : లజ్జ, మన్మధోత్సాహము సమానముగా గలది.
3. ప్రగల్భ : సకలకేళి కలాప కోవిద, లజ్జను జయించి నది. కామేచ్ఛ గలది. ప్రౌఢ

## మధ్య

1. **ధీర** :- అన్యస్త్రీ సంభోగముగల పతిని వ్యంగ్యముగా కోప వచనములు పలుకునది.

2. **అధీర** :- అన్యస్త్రీ సంభోగియైన పతిని పరుష వాక్యము లాడునది.

3. **ధీరాధీర** :- అన్యస్త్రీ సంభోగియైన పతిని ఎత్తి పొడుపు మాటలచేత, దుఃఖముచేత కోపమును ప్రకాశింపజేయునది.

4. **జేష్టకనిష్ట** :- నాయకుడు యిద్దరు భార్యలను గలిగి యున్నప్పుడు ఒక నాయికకంటె మరియొక నాయికయందు అధిక ప్రేమ కనబరచుటవలన ఈ భేదము ఏర్పడును. అది యెఱిగి కోపము ప్రకాశింపజేయునప్పుడు ధీరాధీరాది లక్షణములు గలిగి యుందురు.

## ప్రగల్భ (ప్రౌఢ)

**ధీర** :- అన్యస్త్రీ సంభోగముచేసి వచ్చిన పతియందు రత్యుదాసీన భావముగల నాయిక. ధైర్యము ప్రధానము. వ్యంగ్య వచనము లాడునది.

**అధీర**:- అన్యస్త్రీతో కూడి వచ్చిన పతిని వ్యంగ్య రహితముగా పరుషవాక్యము లాడునది. అధైర్య ప్రధానము

**ధీరాధీర** :- పరస్త్రీతో రతికేళి సల్పి వచ్చిన పతియందు రత్యుదాసీన భావము గలిగి వ్యంగ్యముగాను, స్పష్టముగాను కోపమును జూపునది. ధైర్య అధైర్య మిశ్రితం.

జేష్ఠ కనిష్ఠ మొదలైన భేదములు ప్రగల్భకుకూడా గలవు.

## పరకీయ

పరకీయ - పర పురుషుని యందుగల అనురాగమును, వ్యక్తముగాకుండ నుండునట్టిది.

పరకీయలో కన్య, పరోఢ అని రెండు విధములు ;

**కన్య** :- అవివాహితురాలై తలిదండ్రుల అధీనములోనుండి జార వ్యాపారము చేయునది.

**పరోఢ** :- వివాహితురాలై గూడా జార వ్యాపారము గలది.

ఈ నాయికలలో కొన్ని ముఖ్య భేదములు ;

1. గుప్త 2. విదగ్ధ, 3. లక్షిత, 4. కులట, 5. అనుశయాన, 6. ముదిత - (i) సాహసిక (ii ప్రతిభావచతుర (iii) అపలాపచతుర.

1. **గుప్త** :- జార సురతమును గోప్యము చేయునది.

గుప్త మూడు విధములు :

**వృత్తసురత గోపన** :- అనగా జరిగిన జార సురతమును మర్మ పరచునది.

వర్తిష్యమాణ సురత గోపన :- జరుగబోవు జార సురతమును గోపనము చేయునది

వృత్త వర్తిష్యమాణ సురతిగోపన :- జరిగిన జార సురతమును, జరుగబోవు నట్టిదానిని మర్మపరచునది.

2. విదగ్ధ :- తన మనోభిప్రాయము నితరులకు తెలుపకుండ జారునికి మాత్రము తెలుపునది.

ఈమె వాగ్విదగ్ధ, క్రియావిదగ్ధ, అని రెండు విధములు :

వాగ్విదగ్ధ - వాక్చాతుర్యముతో తెలియపరచునది.

క్రియావిదగ్ధ :- క్రియలచేత దెలుపునది. అంగప్రత్యంగోపాంగములయొక్క సంజ్ఞలచేత తన కోరిక తెలియపరచునది.

3. లక్షిత :- తన చర్యలు యితరులు కనిపెట్టుచున్నారని తెలిసికొనునది.

4. కులట :- బహుపురుషులతో సురతము గోరునది.

5. అనుశయాన:- సంకేతస్థాన సందర్భమును చింతించునది.

(i) వర్తమాన సంకేత స్థల సందర్భమును గూర్చి చింతించునది.

(ii సంకేతమందు కార్యము లభింపకుండుట చేత చింతించునది

(iii) తాను నిశ్చయించిన సంకేత స్థలమునకు ప్రియుడు రాకుండుటచేత యితర స్థలమునకు వెళ్లినట్లు తెలిసి అనుతాపము బొందునది. అని అనుశయాన మూడు విధములు.

6 ముదిత :- తనకు సమయము దొరికినదని ప్రియునికి దెల్పుటకు ఉత్సాహపడునది.

7. సాహసిక - పతి సమీపమందున్నను అతనిని వంచించి ప్రియుని గూడునది. భర్త, అత్త, మామలు లేనిసమయమును గూర్చి సాహసించి చెప్పునది.

"ఇది మంచి సమయమోయి ! గోపాల
యికనైన లేచి రావోయి
మదన జనక నాదు
మామ యింటను లేదు
పదిన గార్లిపుడే పల్లె
వదలి అవతల కేగే"

8. ప్రత్యుత్పన్నమతిచతురః :- తన వ్యభిచారము కొంత బయలు పడినను వాక్చాతుర్యముచే బొంకునది.

9. అపలాపచతుర :- తను అమాయకురాలని రోదనముచేసి పతిని వంచించి తనయందు పతికి కనికరము పుట్టించునది.

## సామాన్యా భేదములు

ద్రవ్యముకొరకు సకల పురుషులయందు అనురాగము ప్రదర్శించునది సామాన్య.

జాతిసామాన్య, ఆగంతుక సామాన్య, గూఢ సామాన్య అని సామాన్య మూడు విధములు.

జాతి సామాన్య :- అవివాహితురాలై తన కులవృత్తిని అనుసరించునట్టి స్త్రీ.

ఆగంతుక :- వివాహితయైనతరువాత పతిని విడచి విచ్చలవిడిగా ద్రవ్యముకొరకు వ్యభిచరించునది.

గూఢ సామాన్య :- వివాహితయైగాని, కాకగాని పతిని విడిచి యింటివారియొక్క అనుమతిపై సంచరించి ద్రవ్యము సంపాదించునది.

గూఢ సామాన్యను పండితులు ఒప్పుకబోయినను, ఇట్టివారు గూఢ సంఘములో నున్నారు. కనుక పేర్కొనబడినది

## అష్టవిధనాయికలు-
## లక్షణములు - లక్ష్యములు

1. ప్రోషిత భర్తృక, 2. ఖండిత, 3 కలహాంతరిత, 4. విప్రలబ్ధ, 5 విరహోత్కంఠిత, 6. వాసక సజ్జిక, 7. స్వాధీన పతిక, 8. అభిసారిక.

1. ప్రోషిత భర్తృక :- పతి దేశాంతరము బోయి యుండగా వియోగముచే చింతించునది.

### ఈ నాయికయొక్క దశావస్థలు

| | |
|---|---|
| 1. దృక్సంగము | 6. అరుచి |
| 2. మనస్సంగము | 7. హ్రీత్యాగము |
| 3. సంకల్పము | 8. ఉన్మాదము |
| 4. జాగరము | 9. మూర్ఛ |
| 5. కృశత | 10. మరణము |

ఈ నాయికయందు మరణముతప్ప మిగిలిన అవస్థలు అభినయించవలెను.

### ప్రోషిత భర్తృక-క్షేత్రయ్య పదము

ప॥ ఏమని తెల్పుదునే-నేలాగు తాళుదు
నేమి చేతునే చెలియా !

అ. ప. ఖామారో ! మూరికి-బయలుదేరెడు వేళ
ప్రేమ మీర నా సామి పిలిచి చెప్పినమాట ॥ఏమని॥

(1) "అన్న మిందక-అతివెత నొందకు
కన్నీరు నింపకు-కలువరింపకు"మని
ఎన్నెన్నో విధముల-హితవుల తెలుపుచు
కన్నీరు నించుచు-కాంతుడు చెప్పినమాట ॥ఏమని॥

... ... ... ...
... ... ... ...

**2. ఖండిత :-** ప్రియునియం దన్య స్త్రీ సంగమ చిహ్నములను జూచి ఈర్ష్యబొందునది. కోపించునది ఖండిత.

నాయకుడు చెంతనే యుండును.

ఇందులో భావ ఖండితయును గలదు. అనగా పతి అన్య స్త్రీతో కూడెనని తెలిసి పతి యేతెంచినపిదప దండించ నుద్యుక్తురాలై యుండునది.

### ఈ నాయిక చేష్టలు - 6

1. దృఢములేని మాటల నాడుట
2. విచారము
3. కాక నొందుట. అనగా కోపము చెందుట.
4. నిట్టూర్పు పుచ్చుట
5. తెలతెలబోయి యూరకుండుట
6 కన్నీరు నించుట.

### ఈ నాయిక వ్యాపారములు - 6

| | |
|---|---|
| 1. నిట్టూర్పు | 4. భ్రమించుట |
| 2. పలుక కుండుట | 5. ఖేదపడుట |
| 3. కన్నీరు నించుట | 6. మూలుగుట. |

## (స్వీయ) ఖండిత నాయిక - క్షేత్రయ్య పదము

ప॥ తగిలితివిక నిన్ను-తరలపీయ నోయి
అ॥ప॥ పగకాడా ! మా మువ్వ గో-పాలా ! నా సామి ॥తగిలితి॥
చ॥ 1) గంధము చాటున ఘనమైన జిడవేటు
కందియున్న సొగసు-కనుగొంటినోయి !
నందిట మన్న ఈ-చందురు పిల్లలు
అందమాయె నోయి-అధుకేమోయి ॥తగిలితి॥

... ... ... ...
... ... ... ...
... ... ... ...

## 3. కలహాంతరిత

పతి నవమానించి, తరువాత తాపపడునది.

ఈ నాయికకు, నాయకుడు చెంతనే యుండును. లేనియెడల రాయబార మంపును.

| ఈ నాయిక చేష్టలు | | ఈ నాయిక వ్యాపారములు |
|---|---|---|
| 1. తొందరపాటు | | నిర్వేదము |
| 2. విచారము | | విషాదము |
| 3. నిట్టూర్పు | | మదము |
| 4. మోహముచేత | తల్లడించుట | ఔత్సుక్యము |
| 5. దుఃఖముచేత | | మోహము |

మొదలైన సంచారులు
ఈ నాయిక వ్యాపారములు.

## (స్వీయ-ప్రౌఢ)- కలహాంతరిత -క్షేత్రయ్య పదము

ప॥ మేరకాదు రమ్మనవే ! నా సామిని
అ॥ ప॥ మోరతోపుపేయక - మువ్వగోపాల సామిని ॥మేర॥
(1) అలిగేవారలు లేరో ! అంతలోనె సమ్మతించి
కలిపేవారలు లేరో ? కలికిరో ! యిపుడు
చలపట్టి యిందురాదు - చాల మ్రొక్కిన వినదు
పలరాజు బారికోర్వ - వశముగాదో యమ్మా ॥మేర॥

## 4. విప్రలబ్ధ

సంకేత స్థలమున పతిని గానక వంచింపబడి వ్యాకులబడునది.

### ఈ నాయిక చేష్టలు 5.

| | |
|---|---|
| 1. మిక్కిలి విచారము | 3. సఖీ జనుల దూషించుట |
| 2. నిట్టూర్చుట | 4. కన్నీరు నించుట |
| | 5. మూర్ఛిల్లుట. |

### వ్యాపారములు

| | |
|---|---|
| 1. నిర్వేదము | 5. అశ్రువులు |
| 2. చింత | 6. నిట్టూర్పు |
| 3. ఖేదము | 7. మూర్ఛ |
| 4. దైన్యము | |

— మొదలైన సంచారు లీ నాయిక వ్యాపారములు.

## (స్వీయ-ప్రౌఢ) విప్రలబ్ధ క్షేత్రయ్య పదము

ప॥ ఈ పేము లీవునను-వెంత ప్రియమాయెన్
అ॥ భామ ! మా మువ్వ గో-పాలు కౌగిట లేని ॥ఈ పేము॥

(1) సదతి ! నే నొకచోట-ప్రాణేశు డొకచోట
ఎడబాసి మరునిచే-యిడుములకు లోనై
కడలేని విరహాగ్ని-గ్రాగియున్నది చాల
పుడమిలో వేరె జన్మము లేదె సుదతి ! ॥ఈ మేమ॥
.... ... ... ...
... ... ... ...

## 5. విరహోత్కంఠిత

ప్రియుడు రాడాయెనని విరహముచేత చింతించునది. నాయకునికి రాయబార మంపును.

### ఈ నాయిక చేష్టలు - 6

1. దుఃఖము
2. తాపము నొందుట
3. ఆవలించుట
4. శరీరము చిక్కుట
5. శరీరము వణకుట
6. తన దుఃఖమును చెలులకు చెప్పుకొనుట.

### ఈ నాయిక వ్యాపారములు

1. సంతాపము
2. దేహము వణకుట
3. చిన్నబోవుట
4. కన్నీరు విడుచుట
5. పములయందు ప్రీతిలేమి
6. తన అవస్థను చెలులకు తెల్పుకొనుట

-మొదలైన వ్యాపారములు గలుగును.

### విరహోత్కంఠిత

### ( స్వీయ - మధ్య ) - - క్షేత్రయ్య పదము

ప॥ ఎందుకు వగ జేసెనో ? కమలజు - డికనైన లెస్స వ్రాయడో ?

అ॥ ప॥ అందుకందుకు చెలు లమరికతో నున్నారు
చందమామ - ఈరేయి - చల్ల నుండదే దైవమా !
॥ఎందుకో॥

1. బలిమి నేమంటినో ? నా సామిని తెలియక బొమ్మంటినో
కలకంఠిరో ! నిననే - కలలోన వాని గంటి
చెలిమి చెలువుదేల - చేరదీయదు దైవమా ? ॥ఎందుకో॥
... ... ... ...
... ... ... ...

## 6. వాసకసజ్జిక.

ఆ సమయమునకు ప్రియుడు రాగలడని సురత సామగ్రిని సన్నాహము చేయునది. తా నలంకరించుకొనునది; పడకయిల్లు శృంగారించి యెదురు చూచునట్టిది.

నాయకునికి రాయబార మంపును.

### ఈ నాయిక చేష్టలు

1. కోరికలు
2. చెలికత్తెతో విలాసముగా గడుపుట
3. ప్రియుడు వచ్చే దారిని చూచుట.
4. అనుభవింపదగిన పూలు, గంధము, మధుర పదార్థములు జాగ్రత్తచేయుట.
5. వచ్చేవారిని ప్రియు డెప్పుడు వచ్చునో చెప్పుమని అడుగుట, ఆతృత.

### వ్యాపారములు

1. నాయకునితోటి క్రీడను గూర్చి యోచించుట
2. సఖులతో వినోదము సల్పుట.
3. అడుగడుగునకు చెలికత్తెను సాభిప్రాయముగ జూచుట.
4. తన దగ్గరకు వచ్చేవారిని నాయకుడని భ్రమతెందుట.

### (స్వీయ-మధ్య) వాసక సజ్జిక - క్షేత్రయ్య పదము

ప॥ అవునమ్మ ! మీకేమి ?-అందరు బోధించెదరు

అ॥ప॥ నవుగాదు వాని గుణము-నాటివలెనే లేదు ॥అవునమ్మ॥

(1) ఎదురుగా తల వాకిట నే-నెంత పేపైనాను
ఇదే వచ్చునో యనుచు-హితవుతో నేను
పదములమీద కడుగ-పన్నీరు చేబూని
సుదతి నంపిన రాక చులకనగా జూచేగాని ॥అవునమ్మ॥
... ... ... ...
... ... ... ...

## 7. స్వాధీనపతిక

తాజెప్పినట్టు విని, కోరినట్టు చేయు నాయకుడు గలది. పతిని స్వాధీనమందుంచుకొని సంతోషించునది

### ఈ నాయిక చేష్టలు

1 వన విహారము.

2. మన్మథ సంబంధమైన ఉత్సవాదులను చేయుటయందు, చూచుటయందు కోరిక.

3. మదించి యుండుట

4. కాక నొందుట.

5. తా కోరిన కోరికలు చెల్లించుకొనుట.

### వ్యాపారములు

1. మన్మథ పూజలు చేయుట కనుట.
2. వనవిహారము.

3. జలక్రీడ
4. పుష్పావచయము.
5. శుభ్ర వస్త్రములను ధరించుట.

## (స్వీయ-మధ్య)- స్వాధీన పతిక -క్షేత్రయ్యపదము

ప॥ అమ్మా ! యిటువంటివాని - కేమి సేయుదునే
అ॥ కొమ్మ ! మువ్వగోపాలుని - గుణము చెప్పెద వినవమ్మ ॥అమ్మా॥

1. సయ్యెద జేపట్టుకొని - పాదుకాలనని వాడు
సయ్యాటలాడుచు నన్ను - చాలవలపించునమ్మ
... ... ... ...
... ... ... ...

## 8. అభిసారిక

ప్రియుడుండు సంకేత స్థలమునకు బోవునది.
ప్రియుని తనవద్దకు రప్పించుకొనునది

### ఈ నాయిక మూడు విధములు

(1) జ్యోత్స్నాభిసారిక
(2) తమోభిసారిక
(3) దివసాభిసారిక

**జ్యోత్స్నాభిసారిక:-** వెన్నెలలో దిరుగునది.

ఈ నాయిక చల్లని చలువ వస్త్రములు ధరించి, కర్పూరము, గంధము, మల్లెపూలు, రవల సొమ్ములు, ముత్యాల సరులు ధరించి వెన్నెలలో ప్రియుని జేరబోవును.

**తమోభిసారిక:-** చీకటి రాత్రులలో ప్రియుని జేర బోవునది.

ఎఱ్ఱని, నల్లని, లేక నీలిరంగు దుస్తులు, నల్లకలువలు, నీలాల లేక కెంపుల సొమ్ములు, కస్తూరి గంధము ధరించును

**దివసాభిసారిక:**

పగటివేళ జనసమూహ మున్నప్పటికి వారినందరిని తప్పించుకొని ప్రియుని గలయునది

### చేష్టలు

సమయోచితముగ వేషము వేయుట- ప్రజ్ఞ, శంక, నైపుణ్యము, బుద్ధికుశలత, కపటము, సాహసము మొదలగు లక్షణములు గలది.

ఈ లక్షణములు సాధారణముగ సామాన్య నాయికయందే యుండును.

## సామాన్యాభిసారిక - క్షేత్రయ్యపదము

ప॥ పిలువనంపె నన్నీ వేళ-ప్రేమ మీరగ నిపుడు
అ॥ప॥ చెలియ మువ్వ గోపాలుడు-చిత్తము రంజిల్ల నేడు ॥పిలువ॥

1. వినవోచెలిరో రమ్మని-విరుల జడను జుట్టి
వరువమైననాటికి-పైడి యిదే నమచు
మరువకు మీ మాట-మనకిద్దరికి పూట
చెరుకువిల్తుడే సాక్షి-చెలియవిన నా సామి ॥పిలువ॥

### కులాంగనాభిసారిక

దేహము మిక్కిలిగా కుంచుకొని భయపడుచు నలుప్రక్కల జూచుచు శరీరమంతయు ముసుగుతో కప్పుకొనిపోవును.

ప॥ చూడరే అదినడిచే హొయలు-సుదతిచేయు జాడలు
అ॥ ఆడది కులకాంత అత్తింటి కోడలు-అల గోపాలుని విడిదికి వెడలెను.

1. కొండంత కాపురమె-రామపోను కోమలి కందలమె
దండున గెలచె మగడు తక్కువేమె-తలవ్రాత లేరికి తప్పింప వశమే.
... ... ... ... ...

వీ రెనమండుగురు గాక ఆధునికు లేర్పరచిన - ప్రవత్స్యత్పతిక, ప్రవసత్పతిక, సమాగమిష్యత్పతిక, సమాగచ్ఛత్పతిక అని నల్గురుగలరు.

**1. ప్రవత్స్యత్పతిక :-** ప్రియు డూరికి పోవుచున్నాడని, ఆ వియోగమును దలచుకొని దుఃఖించునది.

### ఈ నాయిక చేష్టలు ఎనిమిది

1. రెండర్థములు వచ్చునట్లు మాట్లాడుట.
2. భయమిశ్రితమైన చూపులు
3. ప్రయాణము నిలచిపోవుటను అభిలషించుట.
4. విచారము.
5. తాపపడుట. 6. విరాళి.
7 నిట్టూర్పు. 8 కన్నీరు నించుట.

### ఈ నాయికను దెల్పు క్షేత్రయ్య పదము

### స్వీయ - ప్రౌఢ - ప్రవత్స్యత్పతిక

ప॥ చాల ఇందుకే నా మనసు-జాలి బొందెరా !
అ॥ప॥ తాళగలవా ! కంచి వర-దా ! నే విన్న నెడబాయ ॥చాల॥

1. ఇంతింత నా మోవితేనె-ఎచ్చి నోరు దడవగ
వింతలో సొమసిల్లె- వింక యెలాగో

కంతుజనక నేవిచ్చిన-కౌగిలి వదిలీనవి
యింతగా కన్నీరు నించే-వింక యెలాగో?      ॥చాల॥
...   ...   ...   ...
...   ...   ...   ...

2. ప్రవసత్పతిక :- దేశాంతరము బోయెడి ప్రియుని జూచి దుఃఖించెడిది.

3. సమాగ మిష్యత్పతిక :- ప్రియుడు దేశాంతరమునుండి వచ్చుచున్నాడని తెలిసి సంతసించునది.

4. సమాగ గచ్ఛత్పతిక :- ప్రియు దూరినుండి రాగా చూచి సంతోషించునది.

### ఈ నాయిక చేష్టలు ఎనిమిది

1. అప్పటికప్పుడు కలిగిన సంతోషము
2. హటాత్తుగా గలిగిన గగుర్పాటు.
3. ఆశ్చర్యముగల చూపు.
4. వెనుకటి విరహమును పోగొట్టుకొనుట.
5 ముఖము వికసించుట
6. ఆనందాశ్రువులు.
7. సంతోషపు పలుకులు.
8. కోరికలు తీర్చుకొనుట.

### సమాగచ్ఛత్పత్తిక

(స్వీయ-మధ్య)      క్షేత్రయ్య పదము

ప॥ నిన్ను జూడగలిగె-నే యిన్నాళ్ళకు
అ॥ప॥ నిన్నుజూచి నాలుగైదు-నెలలాయె మువ్వ గోపాల ॥నిన్ను॥

1. విన్నరేయి కలలో నా-కన్నుల గట్టినట్లుండే
వెన్నుడా దిగ్గున లేచి-వెదకి కానక
కన్నీరుచే పైట దడిపి-కరగి చింత నొందితి
నన్ను దలచితో లేదో-నా నోము ఫలమా      ॥నిన్ను॥
...   ...   ...   ...
...   ...   ...   ...

### నాయికలో మతాంతర భేదములు

మానవతి :- ప్రియునియందు అన్యస్త్రీ ప్రయుక్తముగా కోపించును. ప్రియుడు చేయు మనశ్శాంతివిబట్టి ఊరడిల్లును.

ఈ నాయిక లఘుమాన, మధ్యమాన, గురుమాన అని మూడు విధములు.

1. లఘుమాన :- అన్యస్త్రీయందు కోరిక గలుగుటచే ప్రియునియందు కోపము గలది, ఇందు ప్రియు డుపలాలించుటచే మనశ్శాంతి కలుగును.

2. మధ్యమాన :- పతి అతిశయముచే మరియొకస్త్రీ పే రుచ్చరించిన గోపించునది. నాయకు డాన పెట్టుకొనుటవలన మనశ్శాంతి కలుగును.

3. గురుమాన :- అన్యస్త్రీ సంభోగ చిహ్నముల చూచి గోపించునది. పాదప్రణామంబుల విలువైన బట్టలు, ఆభరణములు యిచ్చుట వలని ఎంతో ప్రయాస తరువాత శాంతించును
...   ...   ...   ...

మరియు

తృప్త, అతృప్త, తృప్తాతృప్త అను మూడు విధముల నాయికలు గలరు.

తృప్త :- పురుష రతిచే తృప్తిచెందునది.

అతృప్త :- పురుషరతిచే తృప్తిచెందనిది.

తృప్తాతృప్త :- రతిచే కొంత తృప్తయైకూడ ఆశచేత యతృప్తిగా నుండునది.

(వీనిగూర్చి వివరములు కళాశాస్త్రమునందు విపులముగా యివ్వబడి యున్నవి.)

### గర్వితా - 5 విధములు

గర్విత యనగా గర్వించు నాయిక.

1. సౌందర్య గర్విత :- తనయొక్క చక్కదనమును జూచుకొని గర్వించునది.

2. ప్రేమ గర్విత :-నాయకునికి తనయందు గల ప్రేమ వల్ల గర్వించునది.

3. విద్యా గర్విత :- తను పండితురాలనని గర్వించునది.

4. యౌవన గర్విత :- పడుచుదనముచే గర్వించునది.

5. కుల గర్విత :- తను యెక్కువ కులముదానని గర్వించునది.

ఇందు మొదటి రెండును ప్రాచీనులొప్పుకున్నారు గర్వితకు వక్రోక్తి యుండవలసినట్లు ప్రాచీనుల యభిప్రాయము.

వక్రోక్తి గర్వితకు క్షేత్రయ్య పదములలో చక్కని ఉదాహరణము.

ప॥ రమ్మనవే సముఖాన రాయబారము లేలే॥

అ॥ప॥ కమ్మవిల్తుని గన్న చక్కని మువ్వ గోపాలుని ॥రమ్మనవే॥

1. సొగసు జేసుకవచ్చి – సుదతులందరు జూడ
పగలుచేసి తల – వాకిట నిలిచి
తెగనాడే విధమేమో – దినదినము క్రొత్తలాయ
యిగురు బోణిరో ! వచ్చి – యెంత సేపాయనో ॥రమ్మనవే॥
... ... ...

అన్యాసంభోగ దుఃఖిత :- తనయొక్క ప్రియుడు మరియొక స్త్రీతో క్రీడించుటచేత ప్రియునియెడగాని, అన్య స్త్రీ యందుగాని కలిగిన క్రీడా చిహ్నములను జూచి దుఃఖించునది.

ప॥ ఏరీతి బొంకేవురా ఓరోరి ఏరీతి బొంకేవురో

అ॥ ప॥ ఏరీతి బొంకేవు ఇదుగో నీ భుజమునదేరిన పసుపుదిగ్గులు
నీ మేనను జారిన కుంకుమ జిక్కులు – నీ రెప్పలపై
పేరిన కాటుక కగ్గులు – వేఱంగి రారా యేటికి సిగ్గులు.
... ... ... ...

## (స్వీయ)-అన్యా సంభోగ దుఃఖిత-క్షేత్రయ్య పదము

ప॥ ఏమో యీ వింతలు – యెక్కడిదే నీకు

అ॥ ప॥ భామా మా మువ్వగోపాలు విన్నగూడెనో ? ॥ఏమో॥

1. చిక్కుపడిన హారములు – చెదరిన ముంగురులు
కక్కసమై నీ మోవి చాల - గంటియున్నదిపుడు
పుక్కిటి విడెమున – బుగులుకొను వాసనలు
నిక్కు చనుదోయిపై – నెలవంక గురుతులు ॥ఏమో॥
... ... ... ...
... ... ... ...

ఉత్తమ :- అనగా ప్రియుడహితము జేసినను తాను హితమే చేయునది.

మధ్యమ :- ప్రియుడు చేయు విధముగా తానును ప్రవర్తించునది.

అధమ - ప్రియుడు హితము చేసినను, తా నహితము చేయునది.

దివ్య :- దేవతా స్త్రీ

అదివ్య :- మనుష్య స్త్రీ

దివ్యాదివ్య :- దేవతా స్త్రీ మనుష్య స్త్రీగా బుట్టినది.

## (స్వీయ-ప్రౌఢ) దివ్యాదివ్య - క్షేత్రయ్య పదము

ప॥ లేమారో మా మువ్వ గోపాలు డెందైన
లెస్స యుండితే చాలునే !

అ॥ప॥ వేమారు దూరేది తగవా ? బావిలో నీరు
వెల్లువ బొయ్యీవటవే ? యెంతటి దిటవే ॥వేమరో॥

1. నా పుణ్యము చక్కనౌ నాటి దినములెల్ల –
నన్ను చేపట్టలేదా ?
యీవట్ల విడనాడె వెన్నెల చీకటి–
యెవరికైన లేదా ? వానితో వాదా ? ॥లేమరో॥
... ... ... ...

పద్మిని, చిత్తిని, శంఖిని, హస్తిని అను స్త్రీ జాతులను గూర్చి విపులముగా కళాశాస్త్రములో వర్ణింపబడి యున్నది. మరియు ఈ జాతులకు అనుగుణములగు పురుష జాతులు పద్మినికి పాంచాలుడు చిత్తినికి కూచిమారుడు, శంఖినికి భద్రుడు, హస్తినికి దత్తుడు గురించి గూడ తెలుపబడి యున్నది.

ఈ వివరములనుగూడ నర్తకుడు విధిగా చదువవలసి యున్నది ఎందుకనగా నాయికాభినయము చేయునప్పుడు ఈ నాయికలు ధరింపవలసిన ఆహార్యమును గురించి కళాశాస్త్ర మెక్కువగా నుపకరించును. నాయికలయొక్క గుణములనుబట్టి వారి యొక్క దుస్తుల రంగు, ఆభరణములు, అవయవముల తీరు మొదలైన విషయములన్నియు చర్చింపబడియున్నవి. క్షేత్రయ్య మొదలైన పద రచయితల పదముల నభినయించవలసి వచ్చి నప్పుడు ఆహార్యములో ఈ నాయికలయొక్క వర్ణన సరిపోవును.

ఉదా :- పద్మిని జాతియొక్క ఆహార్యము, అవయవముల తీరు స్వీయ నాయికకు వుపయోగించవచ్చును. ఇట్లే యితర నాయికల విషయంలోకూడ

పై నాయికలయందు సూక్ష్మమైన భేదములవల్ల యెన్నో భేదములు పుట్టుచున్నవి.

మరియును ఒకే నాయిక రెండు మూడు నాయికా భేదములను పొందుట గలదు

ఉదా :- కలహాంతరిత నాయిక, ఖండితయై గోపించి, భర్త వెళ్ళిన తరువాత విరహోత్కంఠితావస్థతో పశ్చాత్తాపము చెందును.

ప॥ మానిని వినవే నే మందబుద్ధితోను మాటాడ యుంటినే ॥

అ॥ప॥ మానమే భూషణము మానవతులకెల్ల
మాన మడలిన వెనుక ప్రాణమేటికె చెలియ ॥

1. ఇరుగు పొరుగు వార్త హితవుగ నేవించి
నరసునితో పొందు చాలు పొమ్మంటినే
మరుగేల చేపటుల మాటలు నేలిని
తెరవాన బ్రతుకిట్టి తెరగాయె వికనేల ॥
... ... ... ...

3. భావసంధి :- ఒకరికిగలిగిన భావము యిద్దరి మనస్సులలో భిన్న భిన్న రసగత భావములుగా దోచుట.

4. భావ శబలత :- ఏకరసగత భావములు గావి. భిన్న రసగత భావములుగాని పుట్టుచు, ఉపశమించుచు, మరల పుట్టుచు ఉపశమించుట. ఈ రీతిగ అనేక భావములు గలుగుట.

## సాత్విక భావములు

1. స్తంభము :- కదలకుండుట, చలించకుండుట, ఏమియూ తోచక నిశ్చేష్టులగుట (ఇది పాదములందు పుట్టును)

2. స్వేదము - చమర్చుట.

చమటను తుడుచుకొనుట

గాలిని ఇచ్ఛించుట

వ్యజన గ్రహనము మొదలైన అనుభావములు గలుగును.

3. రోమాంచము :- గగుర్పాటు. పులకరింత- ఇది సుఖాద్యతిశయమువలన కలుగును. (గగుర్పాటు శరీరమందంతటను పుట్టును).

4. స్వర భేదము - డగ్గుత్తిక, గద్గద స్వరము.

ఇందు మాటలయందు స్వరభంగము గలుగును.

5. వేపదు :- కంపము, వణుకు, స్మరించుట, దేహము వణుకుట అధరోష్టమందు బుట్టును)

6 వైవర్ణ్యము :- వెలవెల బోవుట, తెలతెలబోవుట, కాంతి మారుట. (చెక్కులయందు బుట్టును)

7. అశ్రువులు :- కన్నీరు. ఇందు కన్నీరు విదిలించుట, కన్నులను తుడుచుకొనుట మొదలైనవి గలుగును.

8. ప్రళయము :- మూర్ఛ. ఇది మనస్సుయందు బుట్టును.

### పైన జెప్పిన సాత్వికములలో వుండే సంచారులు

| సంచారి | సాత్విక భావములు |
|---|---|
| శ్రమ | స్వేదము |
| త్రాసము | స్తంభము, రోమాంచము, స్వరభేదము, వేపదు. |
| శంకలో | స్వరభేదము, వైవర్ణ్యము. |
| ఆర్తిలో | స్తంభము, వేపదు. |
| రోషములో | స్వేదము. |
| ఆవేగములో | రోమాంచము. |
| ఉగ్రతలో | స్వేదము. |
| విషాదములో | అశ్రువులు |
| మదములో | స్వరభేదము. |
| నిద్రలో | స్వేదము, ప్రళయము. |
| మృతిలో | వేపదు |
| మదములో | స్వేదము. రోమాంచము |
| మోహములో | ప్రళయము |
| అపస్మృతిలో | స్తంభము వేపదు |

## మన్మధ పంచ బాణములు

1. అరవిందము :- స్త్రీ కుచములయందు దీని ప్రయోగము. ఉన్మాదము కలిగించును.

2. అశోకము :- ప్రయోగస్థలము అధరము. రోదనము చేయుట దీని కార్యము.

3. చూతము - ప్రయోగస్థలము శిరస్సు - దీని కార్యము సమ్మోహము.

4. నవమల్లిక :- ప్రయోగస్థలము నేత్రములు. దీని కార్యము దేహము శుష్కించుట.

5. నీలోత్పలము :- ప్రయోగస్థలము గుహ్యము - దీని కార్యము మృతినొందుట.

ఈ పంచ బాణ ప్రయోగము నభినయించు నప్పుడు మరణోద్యోగమును గమనించి బాణప్రయోగము నిలుపవలెను. మరణము నభినయించకూడదు గనుక.

## నవరసములు

శ్లో॥ శృంగార హాస్య కరుణా రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుత శాంతస్య రసాః పూర్వే ప్రకీర్తితాః

శృంగారము, హాస్యము, కరుణ, రౌద్ర, వీర, భయానక, బీభత్స, అద్భుత శాంతములని రసములు తొమ్మిది.

## 1. శృంగారరసము

శృంగార రసము - సంభోగ శృంగారము, విప్రలంభ శృంగారము అని రెండు విధములు

**సంభోగ శృంగారము :-** బాహ్యాభ్యంతర రతులుగలది.

ఆలింగన, చుంబన, దంతక్షత, నఖక్షతాది భేదములు గలది అభ్యంతర రతి.

**విప్రలంభ శృంగారము :-** అభిలాష, విరహము, ప్రవాసము, మానము మొదలైన భేదములు గలిగియుండును.

1. అభిలాష :- సంభోగానికి పూర్వము గలుగు మోహము.

2. **విరహము :-** కలసిన తరువాత యెడబాటుచే గలిగే పరితాపము.

3. **ప్రవాసము :-** ప్రియుడుగాని, తానుగాని దేశాంతరములో నుండుటచే గలుగు విరహము.

4. **మానము :-** ఇది రెండు విధములు.

**ప్రణయ మానము :-** ఇతర హేతువుచే ప్రియుని యందు కోపము గల్గుట.

**ఈర్ష్యా మానము :-** అన్యస్త్రీ భోగముగల ప్రియుని యెడ గలిగెడు కోపము.

ఈర్ష్యామానము పురుషులకు గలుగదు కలిగినయెడ రసాభాసమగును.

### సంభోగ శృంగారములోని సంచారులు

| | | | | |
|---|---|---|---|---|
| దైన్యము | గర్వము | ఉగ్రత | నిద్ర | సుప్తి |
| జడత | ఆవేగము | అవహిత్థ | మోహము | అసూయ |
| గ్లాని | ధృతి | వ్రీడ | విబోధము | ఆధ్యానము |
| త్రాసము | స్మృతి | ఔత్సుక్యం | ముదము | |
| శంక | చాపలము | మతి | వితర్కము | |

### ఇందు అనుభావములు

1. వికసించిన కనుబొమలచేత అందమైన చూపు.
2. సుందరమైన, మృదువైన వస్త్రములు ధరించుట.
3. తియ్యని పలుకులు.
4. స్తంభాది సాత్త్విక భావములు.
5. లీలాది చేష్టలు.
6. ప్రసన్నమైన ముఖ కాంతి.

కోరికవల్ల శృంగారము పుట్టును.

### శృంగారము వలన పుట్టు సంచారులు

| | | | |
|---|---|---|---|
| భయము | ఈర్ష్య | ఉన్మాదము | మదము |
| గ్లాని | నిద్ర | జడత | అవహిత్థ |
| శంక | విస్మయము | వ్రీడ | |
| చింత | ఆవేగము | ఔత్సుక్యము | |
| ధృతి | విషాదము | చాపలము | |
| వ్యాధి | స్మృతి | మృతి | |

## 2. వీరరసము

ఉత్సాహము వలన బుట్టును.
పరేంగిత మెరుంగని అపకారులయందు పుట్టినది.

ఈ వీరము—

| | | |
|---|---|---|
| యుద్ధ వీరము | దాన వీరము | దయా వీరము |

అని మూడు విధములు.
ఇది ప్రసన్నమైన ముఖ కాంతిచే ప్రకాశించును.

### వీరరసములో పుట్టు వ్యభిచారులు

| | | | |
|---|---|---|---|
| మరణము | ఆవేగము | విబోధము | వితర్కము |
| రోషము | మోహము | ధృతి | ఉగ్రత |
| ఈర్ష్య | క్రోధము | గర్వము | హర్షము |

## 3. కరుణ రసము

ఇష్టజన వియోగములందు బుట్టును.
దుఃఖము వలన కరుణ రసము పుట్టును.

### ఈ రసములో పుట్టు సంచారులు

| | | | |
|---|---|---|---|
| నిర్వేదము | సుప్తి | చింత | శంక |
| దైన్యము | నిద్ర | స్మృతి | మరణము |
| ఆలస్యము | మోహము | అపస్మారము | |
| ఉన్మాదము | శ్రమము | విషాదము | |
| వ్యాధి | గ్లాని | జాడ్యము | |

## 4. అద్భుత రసము

ఎన్నడును చూడని దృశ్యము చూచినప్పుడు పుట్టును. అద్భుత రసము ఆశ్చర్యము వలన పుట్టును.

### ఇందలి సంచారులు

వితర్కము
చాపలము
ఆవేగము
హర్షము

## 5. హాస్య రసము

వికృతాది చేష్టలు చూచినప్పుడు గలుగునది, జనులను నవ్వించునది హాస్యము.

### ఇందలి సంచారులు

| | | |
|---|---|---|
| ఔత్సుక్యము | స్మృతి | గర్వము |
| చాపలము | మదము | విబోధము |
| వ్రీడ | శ్రమము | విస్మయము |
| హర్షము | మతి | |

### హాస్యము - 5 విధములు

**1. స్మితము :-** చిరునగవు.

**2. హసితము :-** సహజమైన నవ్వు.

**3. ప్రహసితము :-** ఒడలెరుగని నవ్వు.

**4. అపహసితము :-** పరిహాస యోగ్యమగు నవ్వు.

**5. ఉపహసితము :-** ప్రథమములో నవ్వు కలిగినదానికి కారణమును దలచుకొని మాటిమాటికి నవ్వుట.

## 6. భయానకరసము

భయంకరముగా నుండు దృశ్యమును జూచినప్పుడు పుట్టును. భయమువల్ల భయానకము పుట్టును.

### ఇందలి సంచారులు

| | |
|---|---|
| త్రాసము | చాపలము |
| ఆవేగము | మోహము |
| శ్రమము | చింత |
| మృతి | జాడ్యము |
| విషాదము | అపస్మారము |

ఈ భయములో సాత్విక భావము లన్నియు గలవు

## 7. బీభత్సరసము

ఈ భీభత్సము విచారము వలన పుట్టును. పూర్వోత్తరము కానక చేసి, పశ్చాత్తాపబడుట.

### ఇందు కలుగు సంచారులు

| | | |
|---|---|---|
| నిర్వేదము | విషాదము | మోహము |
| శంక | జాడ్యము | |
| అపస్మారము | దైన్యము | |

## 8. రౌద్రరసము

తనకు బాధ కలిగించే శత్రువుల యందు పుట్టును. రౌద్రము కోపమువలన పుట్టును.

### ఇందు కలుగు సంచారులు

| | | |
|---|---|---|
| అమర్షము | ఆవేగము | చాపలము |
| మదము | మోహము | ఉగ్రత |
| స్మృతి | గర్వము | |
| ఔత్సుక్యము | ఈర్ష్య | |

## 9. శాంతరసము

నిరాపేక్షయై విరాగము బొందుట

### నవరసముల పుట్టుక

1. కోరిక వలన శృంగారము.
2. నవ్వు వలన హాస్యము.
3. దుఃఖము వలన కరుణ
4. రోషము వలన రౌద్రము.
5. ఉత్సాహము వలన వీరము
6. భయము వలన భయానకము
7. విచారము వలన భీభత్సము.
8. ఆశ్చర్యమువలన అద్భుతము.
9. శాంతము వలన శాంతము.

## 33 సంచారీ భావములు

## వాని నభినయించు విధానము

శా॥ నిర్వేద శ్రమదైన్య జాడ్యములు గ్లాని త్రాస శంకార్తి రు
ద్గర్వావేగ ధృతి స్మృతుల్చపలతో గ్రాత్యా వహిత్థా త్రాప
తశ్చైవక్లబ్యమ దోత్సుకత్వమతి నిద్రామోహ బోధాంతము
త్స్రర్వాలస్య వితర్క సుప్త్యతాధ్యాన భ్రమాప స్మృతుల్.

| | | |
|---|---|---|
| 1. నిర్వేదము | 12 ధృతి | 23. మోహము |
| 2. శ్రమ | 13. స్మృతి | 24. విబోధము |
| 3. దైన్యము | 14 చాపలము | 25. మరణము |
| 4 జడత | 15 ఉగ్రత | 26. ముదము |
| 5 గ్లాని | 16. అవహిత్థ | 27. ఆలస్యము |
| 6 త్రాసము | 17. త్రప | 28 వితర్కము |
| 7. శంక | 18 విషాదము | 29. సుప్తి |
| 8. ఆర్తి | 19. మదము | 30. అసూయ |
| 9. రోషము | 20. ఔత్సుక్యము | 31. ఆధ్యానము |
| 10. గర్వము | 21. మతి | 32. భ్రమ |
| 11. ఆవేగము | 22. నిద్ర | 33. అపస్మృతి |

## 1. నిర్వేదము - దుఃఖము

గత శోక కృత్యములను తలచినప్పుడు పుట్టును. విరాళ జేసికొనుటయే నిర్వేదము.

నిర్వేదము నభినయించవలసిన పద్ధతి.

1. విచారము
2. నిట్టూర్పు
3. దైన్యము.

### వివరములు

1. కన్నీటి నద్దగించుటచేతను. లేక అశ్రుపూరిత నేత్రముల చేతను
2. నిట్టూర్పులు
3. నమస్కరించుట. వేడుకొనుట. శరీరమును కుంచుకొనుట
4. మాటలయందు, ముఖమునందు పేదరికము
5. దగ్గుత్తిక 6. వైవర్ణ్యము 7. వెలవెలబోవుట. వీనిచే అభినయించవచ్చును

కరుణ. భీభత్స రసములలో నిర్వేదము పుట్టును.

## 2. శ్రమము

శ్రమము :- ప్రయాసము.

### శ్రమ నభినయించు విధానము

1. చెమటబిందువుల తుడుచుకొనుట
2. నిట్టూర్పులు
3. నీడయందు నిల్చుండుట
4. నిమీలిత నేత్రములు
5. నిసురుకొనుట
6. మందముగ నడచుట

శ్రమ - హాస్య కరుణ రసములయందు పుట్టును.

## 3. దైన్యము - దీనత్వము

### అభినయించు విధానము

1. బలమును విడుచుట
2. అతిశయము నణచుకొనుట
3. మాటలందు, నేత్రములందు పేదరికము, హీనస్వరము
4. శరీరమును కుంచుకొనుట
5. నమస్కరించుట. వేడుకొనుట.

## 4. జడత - వ్యాధి, మాంద్యము

ఇష్టమునుగాని, అయిష్టమునుగాని అనుభవించుట (మొదలైనవాని) చేత తమ్మును దా మరచుట.

### అభినయించు విధానము

1. రెప్పపాటు లేక యుండుట (స్తంభము)
2. పరవశమగుట
3. ఊరక యుండుట, చెవులు వినబడకుండుట

భయానక, భీభత్స. కరుణ. శృంగార రసములందు పుట్టును

## 5. గ్లాని - బాధ

### అభినయించు విధానము

1. దేహము చిక్కుట
2. సన్నని పలుకులు
3. మెల్లని పనులు, ఉత్సాహము లేక యుండుట
4. వెలవెలబోవుట
5. గుడ్లు తిరుగుట

భయానక. కరుణ. శృంగారములందు పుట్టును.

## 6. త్రాసము - భయము

1. శరీరము వణకుట
2. శరీరము ముడుచుకొనుట
3. రోమాంచము
4. చిత్తభ్రాంతి
5. భ్రమ

మొదలైన వాని నభినయించవలెను

త్రాసము - భీభత్స. భయానక శృంగారములందు పుట్టును.

## 7. శంక - సంశయము

1. వర్ణము మారుట 3. దిక్కులు జూచుట
2. స్వర భంగము 4. ముసుగిడుకొనుట

మొదలైన వానిచే నభినయించవలెను.

శృంగార. కరుణ, భీభత్స రసములందు పుట్టును.

## 8. ఆర్తి - వ్యాధి

1. దేహము స్తంభించుట 4. ముఖము వంక బోవుట
2. అంగముల బిగి సడలుట 5. నిట్టూర్పు
3. అరచుట

మొదలైనవానిచేత నభినయించవలెను

కరుణ, శృంగారములందు పుట్టును.

## 9. రోషము - అమర్షము

1. స్వేదము 4. ఉపాయము వెదకుట
2. తల వంకించుట 5. ఉత్సాహపడుట
3. చింతించుట 6. తర్జన భర్జనలు

వీనిచే కనబర్చవలెను

వీర, రౌద్ర రసములందు పుట్టును.

## 10. గర్వము

1. అహంభావము
2. అనుగ్రహ ప్రధానము
3. మోము త్రిప్పుకొనుట
4. మాటాడక యుండుట
5. తన అవయవములను జూచుకొనుట
6. ఒడలు విరుచుట

మెదలగువానిచే ప్రదర్శింపవలెను

వీర, రౌద్ర, శృంగార, హాస్య రసములందు బుట్టును.

## 11. ఆవేగము

ఇది 8 విధములు

1. ఉత్సాహ వేగము 5. మత్తకుంజర దర్శనావేగము
2 వాతావేగము 6. ప్రియశ్రవణావేగము
3 వర్షావేగము 7. అప్రియ శ్రవణావేగము
4. అగ్న్యావేగము 8. శాత్రూపవ్యసనావేగము

ఇష్టాయిష్ట జ్ఞానమువల్ల పుట్టిన ఆతురత - తొందరయే ఆవేగము. ఇందు - ఇష్టప్రాప్తివల్ల గలిగిన హర్షాదులవల్లను అయిష్టప్రాప్తివల్ల గలిగిన శోక, స్తంభాదులచేతను అభినయించవలెను.

ఆవేగము - అద్భుత, వీర, శృంగారములందు పుట్టును.

## 12. ధృతి - ధైర్యము

1. సంతోషము
2. చింత లేకయుండుట
3. లభించిన దానిని అనుభవించుట

వీర, శృంగారములయందు పుట్టును.

## 13. స్మృతి - జ్ఞాపకము

1 కనుబొమలు యెగరవేయుట
2. తల ఆడించుట

పూర్వమందు అనుభవించిన వానిని స్మరణచేయుట స్మృతి.

అద్భుత, కరుణ రసములయందు పుట్టును.

## 14. చాపలము - చపలత్వము

రాగద్వేషము వలన నిలకడ లేకయుండుట, చపలత్వము.

1. చెలులను దండించుట
2. దృష్టియందు చంచలత్వము
3. విలాసమైన చిరునవ్వు
4. కంఠాభరణములను కదల్చుట
5. ఆజ్ఞాపించుట

మొదలైనవి చెల్లును

రౌద్ర, శృంగారములయందు పుట్టును.

## 15. ఉగ్రత

1. రుదిపించుట 2. కొట్టుట, కట్టుట
3. కళ్లెర్ర జేయుట, కన్నులు, ముఖము యెఱ్ఱనగుట

మొదలైన వభినయించవలెను

వీర, రౌద్ర రసములయందు పుట్టును.

## 16. అవహిత్థ - అంగ గోపనము

1. బొంకుట 2. ధైర్యము కనబరచుట
3. తలవంచి కాలి బొటనవ్రేలితో నేలను వ్రాయుట, వేరొక విధముగ పలుకుట, చూచుట

మొదలైన వభినయించవలెను.

## 17. త్రప - లజ్జ

1. మరుగుమాటలు 2. తలవంచుట, ఓరచూపు
3. యోచించుట, బయటకు రాకుండుట
4. ముసుగిడుట 5 గోళ్ల గిల్లుట, నేల గీరుట
6. చూపులందు యెక్కువగా రెప్పపాట్లు

వీనిచే వభినయించవలెను

శృంగారమందు పుట్టును.

## 18. విషాదము

1. ఏమియు తోచక ఉపాయమును వెదకుట.
2. చేతులు పిసుకుకొనుట 3. ముఖమున విచారము

మొదలైనవి అభినయించవలెను.

బీభత్స, శృంగార రసములందు పుట్టును.

## 19. మదము

1. మాటలలో తొట్రుపాటు, పెద్దగ నవ్వులు. ఏడుపు.
2. శరీరము తూలుట.

మొదలైన వభినయించవలెను.
వీర. భీభత్స. రౌద్ర. శృంగారములయందు పుట్టును.

## 20. మతి

1. బోధనముచేయునట్లు కనబడుట.
2. సంతోషము
3. శంక వివారణమైనట్లు కనబడుట
4. కనుబొమల నాడించుట.
5. సంశయముల బోగొట్టుట.

వీనినభినయించవలెను.
భీభత్సరసమునందు పుట్టును.

## 21. ఔత్సుక్యము - ఉత్సాహము

1. వేగముగ నడచుట.
2. శరీరము బరువెగుట.
3 శయనించుట యం దభిలాష.
4. తాళలేకపోవుట.
5. నిట్టూర్పు
6. చింత, సంతాపము.

మొదలైనవి కనబరుపవలెను.
భీభత్స. రౌద్ర. శృంగారములయందు చెల్లును

## 22. నిద్ర

1. శరీరము విరచుకొనుట.
2. ఆవలించుట.
3. కన్నులు మూయుట.
4. తెలివిలేక యుండుట
5. దేహమందు చెమటబోయుట

మొదలైనవి అభినయించవలయును.
శృంగార. హాస్యములయందు పుట్టును.

## 23. మోహము

1. నిద్రజెందినవానివలె కనబడుట.
2. గుడ్లు తేలవేయుట
3. శరీరము పడిపోవుట.
4. దేహము మరచియుండుట.

మొదలైనవి అభినయించవలెను.
అద్భుత. వీర రసములయందు పుట్టును.

## 24. విబోధము

### ఎరుకను చెందియుండుట

1. భుజములు పైకి ఆడించుట.
2. చిటికెలు వేయుట 3. ఒళ్లు విరుచుకొనుట.
4. కన్నులు నలుపుకొనుట, క్రమముగా తెరచుట.
5. ఆవలింతలు.

వీరరసమందు పుట్టును.

## 25. మృతి - మరణము

### శరీర త్యాగము

1. ఎక్కిళ్లు 2. శ్వాసలు
3. వెన్నెలసేవ చేయుట
4. మలయమారుతమునకు శరీరము నర్పించుట

మొదలైనవాని నభినయించవలెను.
భయానక, శృంగార, వీర రసములయందు పుట్టును.

## 26. ముదము - హర్షము

1. ముఖమందు, నేత్రములయందు వికాసము
2. పులకలు పుట్టుట
3. చెమట వేయుట

అభినయించవలెను
వీర, అద్భుత, రౌద్రముల యందు పుట్టును.

## 27. ఆలస్యము - జాగు

1. శరీరము విరుచుకొనుట
2. ఆవలించుట
3. పనులు చేయుటయందు బద్ధకము
4. కూర్చుండుట యందాసక్తి

మొదలైనవి అభినయించవలెను.
శృంగార, అద్భుత, కరుణలయందు పుట్టును.

## 28. వితర్కము - సంశయము

1. కనుబొమల నెగుర వేయుట
2. తల నాడించుట
3. ఆలోచించుచున్నట్లు కనబరుచుట

అభినయించవలెను
వీర రసమందు పుట్టును.

## 29. సుప్తి

1. ఉచ్ఛ్వాస నిశ్వాసములు
2. ఇంద్రియములయందు నిశ్చలత్వము
3. కన్నులు మూసుకొనుట

కనబరుపవలెను

హాస్యమందు పుట్టును.

## 30. అసూయ

1. మోము త్రిప్పుట
2. నిందించుట, భ్రూభేదము
3. గర్వము
4. తిరస్కారము
5. దౌర్జన్యము

మొదలైనవి అభినయించవలెను

వీర, రౌద్ర, శృంగార హాస్యములయందు పుట్టును.

## 31. అధ్యానము - చింత

1. మేను చిక్కుట
2. తలవంచుట
3. సంతాపము
4. నిట్టూర్పు

కరుణ, శృంగార, భయానకముల యందు పుట్టును.

## 32. భ్రమ

### చిత్త విభ్రమము, వెఱ్ఱితనము

1. నిమిత్తము లేని నవ్వు
2. సంబంధము లేక మాట్లాడుట
3. హేతువు లేక పరుగిడుట
4. కూర్చుండుట, లేచుట, ఏడ్చుట
5. జీవముగల మనుష్య, పశు, పక్ష్యాదులతోను జడపదార్థములతోను, సమానముగ మాట్లాడుట

వీని నభినయించ వలెను.

కరుణ, హాస్యముల యందు బుట్టును.

## 33. అపస్మృతి - అపస్మారము

1. పండ్లుకొరుకుట
2. వణకుట
3. పరుగెత్తుట
4. స్తంభము
5. తిరుగుట
6. నోటి చొల్లు కార్చుట
7. నోటి నురుగు గలుగుట

మొదలైనవి అభినయించవలెను

33. సంచారుల అభినయమును గూర్చి సంక్షిప్తముగ వ్రాయబడినది.

# నాట్యశాస్త్రములు

భరతుని నాట్యశాస్త్రముగాక యింకను యెన్నియో గ్రంథములు, అతని తరువాత వచ్చిన పండితులచే రచింపబడినవి.

సంగీత రత్నాకరము, హస్తరత్నావళి, బలరామ భరతము, హస్తోదయము, నృత్తరత్నావళి మొదలైన గ్రంథములు.

ఈ గ్రంథము లన్నిటికి మూలము భరతుని నాట్యశాస్త్రమే. భరతశాస్త్రమును ఆధారముగా తీసికొని దేశకాల భేదములనుబట్టి భరతుని కాలములో లేని కొన్ని క్రొత్త విషయములను చేర్చి గ్రంథములను రచించినారు పండితులు. ఈ శాస్త్రములన్నియు చదివినప్పుడు కొన్ని సమయములందు ఒకే విషయమునుగూర్చి వివిధ రచయితలు వివిధములైన అభిప్రాయముల నిచ్చుటచే యేది ప్రమాణముగా తీసికొనవలెనో తెలియక చిక్కులేర్పడు చున్నవి.

ఉదా:- 'హస్తలక్షణ దీపిక' ఇది కథకళి నర్తకుల ప్రమాణ గ్రంథము. ఇందలి ఒక చిన్న విషయమును పేర్కొనుచున్నాను. భరతుని నాట్యశాస్త్రములోని త్రిపతాకము, కథకళి వారు నృత్యములలో పతాకముగ నుపయోగింతురు. అది కొంత అసహజముగ నున్నను వారి శాస్త్రరీత్యా అది తప్పుగాదు. కనుక ఈ రెండు శాస్త్రములు చదివినతరువాత యే శాస్త్రము ననుసరించవలెనో తెలియక నర్తకుడు చిక్కుపడుట సహజమే. కాని, యిట్టి సమయములో నాట్యశాస్త్రము ననుసరించుటయే క్షేమకరము. ఎందుకనగా భరత ఋషి చెప్పిన హస్తములు వానియొక్క వినియోగములు విపులముగ వర్ణింపబడుటయేగాక సహజత్వముతో విలసిల్లుచుండును. కనుక ఈ గ్రంథములన్నియు నృత్యకళయందు పరిశోధన చేయువారి కుపయోగపడును. గాని ప్రారంభదశలోనున్న నర్తకుల కుపయోగపడవు. కనుకనే అందరికి అందుబాటులోనుండే విధముగ సంక్షిప్తపరుపబడిన 'అభినయ దర్పణము' విశేషముగ ప్రచారములోనికి వచ్చినది.

విద్యానాధుని 'ప్రతాపరుద్రీయము', పండితరాయల 'రస గంగాధరము', భానుని 'రసమంజరి', ధ్వన్యాలోకము మొదలైన గ్రంధము లన్నియు మనకు నాయికాభినయమందు, రసాభినయ మందు నెక్కువగా ఉపకరించును.

## నాట్యకళనుగూర్చి పురాణ పురుషుల అభిప్రాయములు

### అర్జునాభిప్రాయము

శ్లో॥ భకారో భావ సంయుక్తా రేఫోరాగేణ మిశ్రితః
తకారతాళ మిత్యాహుర్భరతార్థ విచక్షణైః ॥

### నారదుడు

శ్లో॥ ఉత్తమం భరతశాస్త్రం
జ్ఞాన వైరాగ్య సాధనం ॥

### రావణుడు

"ఉత్తమం భరత శాస్త్రమ్ భక్తిముక్తి ఫలప్రదమ్
జ్ఞానవైరాగ్య సద్బోధ కారణం మోక్ష దాయకమ్"

### కోహలుడు

'నృత్యగీతాభినయై రాజానాం
దైవతం గురుం తోష ద్భరతమ్ శాస్త్రతమ్
భక్తి ముక్తి ఫలప్రదమ్ ॥"

## భరతుని నాట్యశాస్త్రమునకు పూర్వము మన నృత్య కళయొక్క స్వరూపము

భరతునికి పూర్వము గూడ నృత్యశాస్త్రములు రచించిన శాస్త్రకారులున్నట్లు మనకు తెలియుచున్నను ఆ గ్రంధములు మనకు లభ్యమగుటలేదు కాని మనము ముఖ్యముగ ఒక విషయము గ్రహించవలసియున్నది. 'నాట్యశాస్త్రము'న కాధారము 'లోకధర్మి'. లోక ధర్మిఆధారముగ శాస్త్రీయకళ పెంపొంది 'నాట్యధర్మి'యగుచున్నది.

నాట్యశాస్త్రములోని 25వ అధ్యాయములోని 128, 129, 130 శ్లోకములలో భరతుడిట్లు చెప్పియున్నారు

శ్లో॥ యాని శాస్త్రాణి యే ధర్మా యాని శిల్పాని యాః క్రియాః ।
లోక ధర్మ ప్రవృత్తాని నాట్యమిత్యభి సంజ్ఞితమ్ ॥ 128

శ్లో॥ నచశక్యంహి లోకస్య స్థావరస్య చరస్యచ
శాస్త్రేణ నియతం కర్తుం నానాచేష్టా విధింప్రతి ॥ 129

శ్లో॥ నానా శీలాః ప్రకృతయః శీలే నాట్యప్రతిష్ఠితం
తస్మాల్లోక ప్రమాణంహి జ్ఞయం నాట్యంప్రయోక్తృభిః॥ 130

ఏ శాస్త్రములు, ఏ ధర్మములు, ఏ శిల్పములు లోక ధర్మము ననుసరించి యుండునో దానిని నాట్యమందురు.

స్థావర జంగమాత్మకమైన లోకము యొక్క చేష్టావిధుల నన్నిటిని శాస్త్రముచే నరికట్టుట సాధ్యము కాదు.

ప్రకృతులు పెక్కు శీలములు గలవి. శీలమందే నాట్యము నిల్చియున్నది. కావున నాట్యమునకు లోకమే ప్రమాణమని నాటకముల ప్రదర్శించువారు తెలుసుకొనవలెను. పర్యవసానములో చెప్పదగిన దేమనిన - నాట్యమును చక్కగా నభ్యసించి, దానినే పట్టుకొని ప్రాకులాడక, ప్రపంచ జ్ఞానము గలవాడై, లోక వ్యవహారమును బాగుగ పరిశీలించి అనుసరించుట నటనకు యుక్తము అని, నేర్చిన విద్యకు మించినది లోకానుభవమని.

## దేవాలయ శిల్పములోని నృత్య భంగిమలు

1. నాగార్జున శిల్పములలోని భావ భంగిమలు.
2. ఎల్లోరా గుహలలోని నటమహాశేఖరుడు నటరాజు నృత్య విన్యాసములు.
3. పల్లవుల ఆది శిల్పవైభవమును వెల్లడించునట్టి కంచి కైలాసనాధుని ఆలయంలోని నృత్య కరణములు.
4. తంజపురి బృహదీశ్వరుని ఆలయంలోని తాండవ భంగిమలు
5. చిదంబరములోని నటరాజస్వామి ఆలయములో నృత్య కరణములు.
6. రామప్ప గుళ్లలోని నృత్య భంగిమలు.
7. తాడిపత్రి ఆలయంలోని కరణ విన్యాసములు.
8. అజంతాలోని బుద్ధభగవానుని జీవితచరిత్రకు సంబంధించిన చిత్రలేఖనము.

నర్తకులకు తమ భావప్రకటన పెంపొందించుటకు, నృత్త నృత్య, విన్యాసములను పరిదిద్దుకొనుటకు యెంతగానో ఉపకరించును.

ఈ శిల్పకళ అంతయు మనకు ఒక్కొక్క భంగిమనెట్లు పట్టవలయునో తెలుపుచున్నది. ఆ భంగిమయొక్క సంపూర్ణ స్వరూపమునుగూర్చి మనము చక్కగ తెలిసికొనగల్గుదుము. కాళ్లు చేతులు, తల యొక్క రీతి యెట్లుండవలెనో, వానియొక్క కొలతలు మొదలైన వివరములన్నియు చక్కగ పాటించి మలచబడిన శిల్పఖండములగుటచే మనకు చాల నుపయోగకరముగా నుండును. ఈ శిల్పములోని నృత్య భంగిమలను పరిశోధించునప్పుడు మనము ముఖ్యముగ గుర్తుంచుకొనవలసిన విషయములు కొన్ని యున్నవి. ఈ భంగిమలన్నియు ఒక నృత్యకరణియొక్కగాని, నృత్యము యొక్కగాని ముగింపు భంగిమలు మాత్రమే. దీనిని ప్రారంభించునప్పటి భంగిమలుగాని, మధ్య ప్రదర్శింపవలసిన (చారి) భేదములుగాని అందు చిత్రింపబడవు కనుక ఆరంభమందలి భంగిమల యొక్క స్వరూపమును, తరువాత వచ్చు భంగిమలలోని అంగ విన్యాసమును ఊహించుకోవలసి యుండును.

## నాగార్జున శిల్పము

నాగార్జునలో ప్రతి భంగిమయు ఒక్కొక్క రసమును పోషించునట్టివిగా యున్నవి. రసాభినయమందు వివిధ సంచారుల నెట్లు పోషింపవలెనో, గురు ముఖముగ అభ్యసించిన పిదప నర్తకులు ఈ శిల్పములోని ప్రతి చిన్న భంగిమను చక్కగ తిలకించి ఆ భావములను పట్టుటకు ప్రయత్నించినచో సాత్విక ప్రధానమైన వారి యభినయ విద్య యెంతగానో వృద్ధి జెందును

## ఎల్లోరా

ఎల్లోరాలోని శిల్ప భంగిమలు మహ దేవుని యొక్క తాండవమును గూర్చి విశేషముగ తెల్పునట్టివి ఆ భంగిమల నన్నిటిని జేర్చి మధ్యనకొన్ని 'చారి' భేదములను, గతులను జతపరచి నృత్యమాడిన శివలీల లన్నియు ప్రదర్శింప నచ్చును ఈ భంగిమలు శివ కధలకు నెక్కువగ నుపకరించును

## కంచి, తంజపురి, చిదంబర ఆలయములలోని

## నృత్యకరణములు

భరత శాస్త్రములోని 108 కరణములు యిందు చెక్కబడి యున్నవి. తంజపురి ఆలయమందు 86 మాత్రము చెక్కి విలిపి వేసిరి.

కంచి కైలాసనాధుని ఆలయంలోని కరణములు బహు సుందర మంతమగు చక్కని భావ ప్రకటనతో గూడి కనులకు పండువను గొల్పును. ఇందు నటరాజస్వామి నర్తన మాడుచున్నట్లు చెక్కబడి యున్నవి చిదంబరాలయములోని త్రిమూర్తి నాట్యమాడునట్లు చెక్కిరి ఆ కాలములో నుపయోగించిన వివిధ వాద్యములయొక్క స్వరూపములు గూడ మనము యిందు నుండి కొంతవరకు తెలిసికొనగలము

పై రెండు ఆలయములలోని భంగిమలు ఒక్కొక్క కరణముయొక్క ముగింపు స్వరూపములు మాత్రమే ప్రారంభ విధానము, విన్యాసక్రమము మాత్రము యిందులేదు. తంజపురి బృహదీశ్వరాలయమందట్లుగాక ఒక్కొక్క కరణమును విన్యాసము జేయు పద్ధతిని తెలుపు విధముగ శిల్పులు మలచినారు.

కరణములకు సంబంధించిన ఒక అతి ముఖ్యమైన భంగిమ నేను పాలకొల్లు ఆలయం 'క్షీరామర'లో జూచితిని. ఆ భంగిమను ఈ గ్రంధములో పొందుపరచితిని 'అది 'లలితకరణము'నకు సంబంధించినట్టిది ఆ కరణము పట్టునప్పుడు పాదముయొక్క గతిని తెల్పుటకుగాను వివిధ కోణములలో పాదమును చిత్రించి జూపినారు, శిల్పి. అట్టి భంగిమలవల్ల వివిధ కరణములు పట్ట వలసిన శాస్త్రీయ పద్ధతులను బహు సులభముగ తెలిసికొనవచ్చును.)

రామప్ప, తాడిపత్రి ఆలయములలో నృత్యకళకు, ముఖ్యముగ దేశి సాంప్రదాయమునకు చెందిన అనేక భంగిమలు రూపకల్పన చేయబడియున్నవి దీని ఆరాధనవల్ల శాస్త్రీయ పద్ధతులే గాక దేశి సాంప్రదాయములలోని విశిష్టత గ్రహించ గలుగుదుము

లేపాక్షి దేవళములో పద్మినీ జాతిస్త్రీ, పాంచాలజాతి పురుషుని విగ్రహములు ముఖ్యముగ చూడవలసినవి ఇటుల ప్రఖ్యాతి వహించిన ప్రతి దేవాలయములోని శిల్పము మనకు నృత్యకళకుపయోగ పడునట్టిదిగ నుండును

శిల్పములోని భంగిమలు మనకు నృత్యమునకుపయోగపడినంతగా అభినయమునకు తోడ్పడవు శిల్పములోని ఆహార్యము గూడ నృత్య నాటికలకు, నృత్యములకుపయోగపడును.

అభినయ కళను వృద్ధిపొందించుకొనుటకు ప్రతి నర్తకుడు కొంతకాలము అజంతా గుహలలోని చిత్రలేఖనమును ఆరాధించవలెను. శృంగారము, వీరము, రౌద్రము, భయానకము మొదలైన యే రసములైనను చక్కగ నభినయించు విధానము తెలిసికొనుటకు, ఆ యా రసములలోని దృష్టి, గ్రీవా భేదములు, శరీరముయొక్క గతిభేదములు మొదలైన వివరములన్నిటితో గూడిన చిత్రములు మనకు అజంతా గుహలలో కనబడును నృత్య మభ్యసించిన ప్రతి నర్తకుడు తన అభినయమును సరిదిద్దుకొనుటకు కొన్ని నెలలైన విధిగా అజంతా గుహలలోను నాగార్జున శిల్పములవద్ద గడుపవలెను అందలి ఆహార్యము గేయనాటికలందు మన కుపయోగపడును మరియు బుద్ధుని గాధలకు సంబంధించిన శిల్పములలో భావపూరితమైన అభినయమునకు పనికివచ్చు భంగిమ లెన్నియో కనిపించును. ఇట్లు శిల్పకళగూడ నృత్యకళకు బహుముఖముల తోడ్పడుచున్నది.

... ... ...

## నవరస అంగహారములు

భరతవిద్యలో 'నవరస అంగహార' ప్రదర్శనక్రమము బహు ప్రాచీన కాలమునుండియు ప్రచారమునందుండినది. ఈ క్రమమునుగూర్చి భరతుడు తన నాట్యశాస్త్రమందంతగా తెలపక పోయినను యితర శాస్త్రవేత్తలు విపులముగ చర్చించిరి.

పాట, మాట లేక వాద్య సంగీత సహకారముతో రసభావములను ప్రదర్శించుటకు అనువైన హస్తపాద విన్యాసములు, గతి భేదములతో గూడిన నృత్యక్రమము 'నవరస అంగహార' విన్యాసము.

ఆలయములందు దేవదాసీలు ప్రదర్శించెడి అష్టదిక్పాలక ఆరాధన నృత్యములందు, ముఖ్యముగ శివదాసీలు ప్రదర్శించు ఆరాధన నృత్యక్రమమందు ఈ విన్యాసము పూర్తిగ కాంచనము సభలయందు ప్రదర్శింపబడు కేళికా విద్యలో ఈ క్రమమంతగా వృద్ధిజెందినట్లు గాన్పించదు. ఆచార్యులు ఈ పద్ధతిని పూర్తిగ మరచిరనియే చెప్పవచ్చును ఈ సంప్రదాయము ననుసరించి మలచబడిన శిల్ప భంగిమలగుటవల్లనే నాగార్జునలోని శిల్పములు నవరసము లొలుకుతూ కన్నులకు పండువ గూర్చుచుండును.

# భారతావనిలోని నర్తనరీతులు

## సంక్షిప్త సింహావలోకనం

ప్రాచీనకాలంనుండీ నేటివరకూ భారతదేశంలో అభివృద్ధి చెంది, ప్రచారములోనికి వచ్చిన నాట్య సంప్రదాయాలను ఐదు విధాలుగా విభజించవచ్చును.

అవియే ఆలయాల్లోని ఆరాధన నృత్యములు, రాజుల ఆస్థానాల్లో ప్రదర్శింపబడిన 'దర్బారు - కచేరి' నాట్యములు, సామాన్య ప్రజలకొరకు చేయబడిన భాగవతములు, సామాన్యప్రజల జానపద నర్తనములు, గిరిజనులు నృత్త రీతులు -

ఈ నృత్యములన్నియూ మార్గి, దేశి సంప్రదాయముల ననుసరించి లాస్య తాండవములుగా, నాట్యనృత్త నృత్యాభిన యములుగా రూపొందినట్టివి -

శాస్త్రముల్లో దెల్పిన విధముగా కరణాంగహారస్థానక రేచక చారి గతి విధానములను ప్రదర్శించుట, 'మార్గి' సంప్రదాయము.

ఆయా ప్రాంతీయ కళాభిమానుల, కళావేత్తల అభిరుచుల ననుసరించి రూపొందించబడి ప్రచారములో పెట్టబడిన నర్తనము 'దేశి' సంప్రదాయము.

శాస్త్రీయ, సంప్రదాయ విద్యల్లోని భేదములు - నాట్య శాస్త్రముల ననుసరించి రూపొందించబడిన నాట్య, నృత్త నృత్య అభినయాదులను గల్గియుండి పండిత పామర జనరంజకంగా సంస్కరించబడిన విద్యాపద్ధతి శాస్త్రీయము

సామాన్య ప్రజల అభిరుచుల ననుసరించి రూపొందించబడి, పిదప పండితుల, కళావేత్తల అభిమతానుసారముగా శాస్త్రీయ పద్ధతులతో తీర్చి దిద్దబడినట్టిది సంప్రదాయ విద్య.

ఈ రెండింటిలో శాస్త్రీయ పద్ధతుల సమ్మేళన ముండినను వాటి ప్రయోగ వినియోగములందు భేదమున్నది. సంగీత రచన లందు, అభినయ తీరులందు, నృత్య గమనమందు చాలా తేడా వుండును.

ఉదా : భరతనాట్య భాగవత నర్తక రీతులు ; వానియందు వయోగించే సంగీత రచనలు

స్వరవల్లవులు, స్వరజతులు, వదవర్ణములు, పదములు, జీవ కళలు, తిల్లానలు - ఇత్యాది రచనలు శాస్త్రీయ పద్ధతుల ననుసరించి రూపొందించబడిన వగుటచే కర్నాటక సంగీతమందంతటనూ ఒకే తీరున గానముచేయబడి, వువయోగింపబడుచున్నవి. ఈ రచనలే భరతనాట్యమందు వువయోగింపబడుచున్నవి.

ఇక భాగవతమందువయోగించబడునట్టివి-దరువు, ద్విపద, కందార్ధము, ఏల, ధవళం, అర్ధచంద్రిక యిత్యాది రచనలు భాగవత సంప్రదాయంలో వువయోగపడును. ఇవన్నియూ 'దేశి' సంప్రదాయ రచనలు - వీటియందు రాగము, తాళము వుండును - భావ ప్రకటనకు నృత్తనృత్యాలకు ఈ రచనలుపయోగపడినను ఇవి యెక్కువగా ప్రాంతీయతను మాత్రమే ప్రతిబింబించుచుండును. ఈ రచనలుగూడా కర్నాటక సంప్రదాయములో గానము చేయ బడినను - మార్గి సంప్రదాయములో గానము చేయబడినను - మార్గి సంప్రదాయములో నుండవు. ప్రాంతీయయాస, విశిష్ట తను ప్రతిబింబించుచుండును అట్లే తమిళ ప్రాంతములందలి - బిందు గీతములు, తిరువుగళ్, తేవారములు, తిరుపాళై యిత్యాది రచనలన్నీ దేశి సంప్రదాయ రచనలే - ఇవన్నియూ ప్రాంతీయ బాణీలే

ఈ సంగీత రచనలవలెనే నృత్యబాణీలోగూడా. శాస్త్రీయ బాణీ - ఏ ప్రాంతమైననూ ఒకే రీతిగా - ఎక్కువ భేదములు లేక వృద్ధిచెంది యున్నది. సంప్రదాయ విద్య అట్లుగాక ఆయా ప్రాంతీయ తీరులననుసరించి ప్రదర్శితమవుటచే అటక్రమము నందే మార్పు కన్పట్టును.

మరియు 'మార్గి' సంప్రదాయము - కాలానుగతంగా మార్పులు చెందక - ప్రాచీన రూపమునందే విరాజిల్లుచుండును.

'దేశి' విద్య కాలానుగుణ్యముగా మార్పులను చెందుచుం డును

గనుకనే పండితులు కళావేత్తలు మార్గి విద్యకే విలువ నెక్కువగా విచ్చియున్నారు అది దేశ సాంస్కృతిక చరిత్రను, ప్రాచీనతను తెలిసికొనుటకు యెంతయో ఉపకరించును.

శాస్త్రము తప్పుటకు వీలులేదు. తప్పయిన అది శాస్త్రమే గాదు. సంప్రదాయ విద్య అట్లుగాదు. అది ఒకరినుండి మరియొక రికి అందినప్పుడు ఆ కళావేత్తల అభిరుచుల ననుసరించి ప్రవేశ పెట్టబడిన నూతనాంశములు, మార్పులు చేర్పులవల్ల కొన్ని పొర పాట్లు జరుగుట కవకాశముండును. శాస్త్రమందు అట్టి మార్పులకు వీలుండదు గనుక అదే తన స్వచ్ఛతను కాపాడుకొనుటకు అవకాశ మున్నది - అందులకే ప్రాచీనులు శాస్త్రీయ విద్యలకిచ్చిన విలువ సంప్రదాయ విద్యలకీయరైరి.

### లాస్యము, తాండవము -

సుందర సుకుమార భావవికాసము, కోమలకరణాంగహార విన్యాసము గల్గినట్టి నృత్యవిశేషం లాస్యకతియనియూ,

ఉద్ధత గంభీరభావవికాసము - కరణాంగ విన్యాసము గల్గి నట్టి నర్తనరీతి తాండవమని శాస్త్రజ్ఞులు పేర్కొన్నారు.

కాని నట్టువమేళ నర్తకులు, నాట్యమేళనర్తకులు, లాస్య తాండవములను మరొక విధంగా వ్యాఖ్యానించియున్నారు.

లాస్యము స్త్రీల నర్తనమనియు, తాండవము పురుషుల నర్తనమనియు సాధారణ పండిత వ్యాఖ్యానమైయుండగా-

కూర్చొని పదములు,శ్లోకములు,పద్యములు, జావళీలు యిత్యాది సంగీత రచనలకు సాత్వికాభినయము, అంగికాభినయము ప్రదర్శించుట లాస్యమనియు, నిలబడి తాళలయల ననుసరించి నృత్తమాడుట తాండవమని, నట్టువ మేళ నర్తకులు వ్యాఖ్యానింతురు. నట్టువ మేళమనగా కేవలం స్త్రీలు మాత్రము ఆడే నాట్యరీతి.

నాట్య మేళములో స్త్రీ పురుష పాత్రలు పురుషులే ధరింతురు. స్త్రీ పురుష పాత్రలు రెండునూ ఆ సంప్రదాయంలో ప్రదర్శింపబడుటచే లాస్యం తాండవం రెండునూ అందు ప్రదర్శితమగునని ఒక అభిప్రాయం కలుగవచ్చును. అది సరిగాదు వారు ప్రదర్శించేది తాండవ రీతియే ఈ సంప్రదాయ నర్తకులు పాత్రలందు ప్రదర్శించే లాస్యం నట్టువ మేళమందువలే శుద్ధ లాస్యం గాదు. తాండవమందలి కొన్ని కోమల విన్యాసములు మాత్రము వీరి నృత్త నృత్య పద్ధతి యంతయూ పురుష ప్రకృతికి అనుకూలించు తాండవ రీతిని వుండును.

అట్లే స్త్రీ నర్తకీమణుల సంప్రదాయంలో ప్రదర్శించే అడవులు జతిఆట గొంతవరకు గంభీరంగా, వుదృతంగా కల్పించినా అది తాండవంమాత్రం గాదు లాస్యంలోని కొంత గంభీరత గల్గిన అంగచలనము గనుక తాండవమును పోలి యుండును

అందువల్లనే పూర్వులు కొన్నికొన్ని సంప్రదాయాలు ప్రత్యేకంగా స్త్రీలకొరకు, కొన్ని ప్రత్యేకంగా పురుషులకొరకు నిర్దేశించారు.

ఉదా :- భరతనాట్యము పురుషులు ప్రదర్శించిన వారింత చతురతతో ప్రదర్శించినా ఆ భావాభినయం, అడవుల తీరికలు స్త్రీలు ప్రదర్శించినప్పటి సహజ సౌకుమార్యంతో కూడియుండదు.

అట్లే కథకళి (పురుషుల నాట్యం) స్త్రీలు యెంతటి గంభీర భావ ప్రకటనతో ప్రదర్శించినా అసహజంగా కనిపించును.

సాము, పొందిక, తగ్గు, నిగ్గులు- అభినయ తీరులను కొంతవరకు మార్చి చేర్చుకొందురు కళావేత్తలు; స్త్రీలు, పురుషులు ఈ సంప్రదాయాలను ప్రదర్శించుచున్నారు. అట్టి సమయాల్లో అవి ఆ సంప్రదాయాలుగాక నూతన సంప్రదాయాలుగా రూపొందును

## నృత్త నృత్యములు

రసభావములు లేని తాళ లయల నాశ్రయించియున్నట్టి అంగ విక్షేపము నృత్తమనియూ, రసభావములు కల్గి తాళ లయల ననుసరించి ప్రదర్శించే హస్తపాదముల విన్యాసము నృత్యమనియు 'అభినయ దర్పణ' రచయిత నందికేశుని మతము.

భరతుడు నృత్త నృత్యములను పర్యాయ పదములుగా వుపయోగించినాడు. వీటిని వేరువేరుగా గాని, వీటి ప్రయోజనములు వేరుగాగాని పేర్కొనలేదు దీనివల్ల భరతుని కాలంనాటికి నృత్తం, నృత్యం వేరుగా లేవని, తరువాత కాలంలో అవి రెండుగా విభజింపబడినవని కొందరు కళావేత్తల అభిప్రాయము దీనివల్ల భరతుడు ముందా, నందికేశుడు ముందా అనే ప్రశ్న వుద్భవించును

ఈ వాదములతో నిమిత్తంలేకుండా ఈ రెండు శాస్త్రములను మనం చక్కగా పరిశోధించి మన దేశంలో వృద్ధిచెందిన నర్తన సంప్రదాయములను తిలకించిన ఒక సంవత్సరము తెలిసికోగలము.

భరతుడు నృత్య నాటకములను గూర్చి ఆ సంప్రదాయ విద్యను గూర్చి తన నాట్యశాస్త్రములో విపులీకరించాడు

నందికేశుడు ఏకపాత్ర నృత్య సంప్రదాయం గూర్చి వివరించాడు

నృత్యనాటకమనగా కేవలం నేటి కాలంలో ఆడబడుతున్న యక్షగాన భాగవతముల పద్ధతియేగాక నేటి పాశ్చాత్యదేశాల్లో ప్రచారములో నున్న 'బెలె' పద్ధతినిగూర్చిగూడా నాట్యశాస్త్రములో తెలిసికోవచ్చును. వాచికగానము లేక వాద్య సంగీత సహాయము, కరణాంగహార విన్యాసములతో ఒక కథను ప్రదర్శించుటయే 'బెలె' నర్తనరీతి ఈ రీతి ఆట మన ప్రాచీన భారతదేశంలో వుండింది. ఇందులోనే శివుని 108 కరణములు, వాని చేరికవల్ల ఏర్పడే అంగహారములు, ఖండములు, మండలములు, ప్లవనములు వుపయోగించి ఒక కథ నాడుదురు. ఈ రీతి ఆటయొక్క పద్ధతిని కూర్చే భరతుడు నృత్త నృత్యములనుగూర్చి చర్చించినప్పుడు రెండింటినీ చేర్చి చెప్పినాడు. అందువల్ల అతనికి రెండింటినీ విడదీసి చెప్పవలసిన అవసరము కల్గియుండలేదు

భరతుని నాట్యశాస్త్రము ననుసరించి రూపొందిన నాట్యరీతి భారతదేశంలోని నాట్యమేళ సంప్రదాయం లేక భాగవత సంప్రదాయం. నృత్యము (నృత్త నృత్యము), అభినయము (చతుర్విధాభినయమును) వుపయోగించి ఒక కథను ఏవిధముగా ప్రదర్శింపవలెనో తెల్పిన నాట్యరీతియే భరతసంప్రదాయం

అభినయంలో వాచికం, ఆహార్యములు - పాత్రలభాష మాట - వేషధారణకు సంబంధించి వుండీ - అంగికము అర్థాభినయము ప్రదర్శించునట్టిదీ - సాత్వికం భావాభినయమును దెల్పునదిగానూ వున్నది.

నందికేశ మతము ఏకపాత్ర నృత్య రీతిని గూర్చి తెల్పియున్నదని తెలియజేసినాను. ఒకే నర్తకి నృత్త నృత్య అభినయములను ప్రదర్శించుటకు అనువైన రీతి, అభివృద్ధి చెందిన సంప్రదాయం ఈ సంప్రదాయమును ఆరాధించినవారు స్త్రీలు. వీరిదే నట్టువ మేళ సంప్రదాయం. వీరినే దేవదాసీలు, రాజదాసీలందరు వీరు పురాణ కథలను నాట్యమాడక, కొన్నికొన్ని రసవత్తర ఘట్ట

ములు, ముఖ్యమైన సంగీత రచనలు చేయబడిన వాటిని మాత్రం నాట్యమాడుదురు. మరియు యక్షగానమనే ఒక ప్రాచీన బాణీని ప్రచారములోనికి తెచ్చినవారు ఈ నట్టువమేళమువారే. యక్షగాన క్రమమెట్టిదనగా ఒక కథ వర్ణనాత్మక గేయరూపంలో రచన చేయబడి వుండును. ఆ రచనను నర్తకుడు గానంచేస్తూ, అందలి ఘట్టాలను ఆంగిక సాత్విక భావప్రదర్శనతో (అర్థాభినయం, భావాభినయంద్వారా ప్రకటిస్తూ నృత్యము సల్పును కథ పెద్ద దీర్ఘకాలం గానము చేయుటవల్ల ప్రజలలో విసుగు దోచకుండుటకు గాను ప్రతిఘట్టము ముగింపునందునూ తాళముల ననుసరించి కొన్ని విన్యాసములు ప్రదర్శించును. ఇది కథకు సంబంధము లేని శుద్ధ నృత్తము. కథలోని అన్ని పాత్రలూ తానేయై నర్తించుటవల్ల ఒక ప్రత్యేక పాత్ర ననుసరించి ఆహార్యం ధరించిక తన సౌందర్యాన్ని ద్విగుణీకృతం చేసే అలంకారము మాత్రం ధరించి రంగస్థలం ప్రవేశించును. అన్ని ఘట్టములు తానే అభినయించును గనుక ప్రతి ఘట్టము విపులంగా తెలియ జేయుటకు గూడా. అనగా ఒక భావములోని ఇంకొక భావములోనికి మారుట, ఒక సంఘర్షణలోనుండి ఇంకొక సంఘటనలోని కథను సులభంగా మార్పుచేయుటకు వీలు కల్గుటకు రసభావములు లేనట్టి శుద్ధ నర్తనము (నృత్తము) అవసరమైంది గాన యీ నర్తకులు ప్రత్యేకంగా నృత్తాన్ని, నృత్యాన్ని విడదీసి వేరువేరు కళలుగా ఏర్పాటు చేసుకున్నారు.

అయితే మన కింకో సందేహము కలుగును. భాగవత సంప్రదాయం పూర్తిగా – నాట్యశాస్త్రముపై ఆధారపడి కేళిక, నట్టువమేళ సంప్రదాయం – అభినయదర్పణంపై ఆధారపడి అభివృద్ధి చెందినదా ? అని. ఆ అభిప్రాయము సరిగాదు – రెండు సంప్రదాయములవారు ఈ రెండు శాస్త్రములపై ముఖ్యంగా ఆధారపడి తమ నర్తనమును వృద్ధిపరిచినను, తమ సంప్రదాయమునకు పుష్టిని చేకూర్చుటకు ఎన్నియో 'విషయాలను ఇరువురు ఇతర శాస్త్రాలనుండి చేర్చుకున్నారు. అందువల్లనే నాట్యశాస్త్రములో వర్ణించబడని కొన్ని అంశములు భాగవతరీతియందునూ; భారతార్ణవ, అభినయ దర్పణములందు వర్ణించబడని విషయాలు కచ్చేరి నాట్యమందునూ గాంచెదము.

మనకు మరియొక సంశయము కల్గుటకవకాశమున్నది – నాట్యశాస్త్ర, అభినయదర్పణములపై ఆధారపడిన స్త్రీ, పురుష నర్తనరీతులు యావద్భారతదేశంలో ఒకే రీతిగా వుండగా విభిన్న రూపముల నెట్లు దాల్చినవి.

శీతోష్ణస్థితిగతి, ప్రజల భాష, రాజకీయ పరిస్థితులు, మత సాంఘిక విషయాల ప్రభావము ఆ నర్తనరీతిపై బడి వేరు వేరు పద్ధతుల్లో అభివృద్ధి చెందినది. అవియే వివిధ సంప్రదాయములైనవి – కాని మూలమొక్కటే గనుక అనేకత్వములో మనకు ఏకత్వము కాన్పించును. శీతోష్ణస్థితి, మార్పులవల్ల ప్రజలు ధరించే ఆహార్యంలో మార్పులు కల్పించును.



భాషవల్ల సంగీతములో మార్పులు వచ్చినవి. ఆ సంగీతములోని మార్పులవల్ల తాళముల ప్రమాణము లొక్కటే అయినా వాద్యక్రమములోనే మార్పులు వచ్చినవి. అదియే ఉత్తరాది, దక్షిణాది సంగీత బాణీలు ఏర్పడుట కారణమైనది.

రాజకీయ పరిస్థితులవల్ల నృత్యశైలిలో మార్పులు (ప్రదర్శన తీరులో) కల్గినవి. పాలించు ప్రభువుల అభిరుచుల ననుసరించి అదియే భరతనాట్యము. కథక్ వంటి నృత్యరీతులు వృద్ధిపొందుటకు అవకాశము కల్గించినది

మతము– కొన్ని మతములు పూర్తిగా నృత్యాన్ని, సంగీతాన్ని నిషేధించితే కొన్నింటిలో దైవారాధనలో నృత్య సంగీతాలొక భాగమై విరాజిల్లినవి మరియు శైవ, వైష్ణవమత సంప్రదాయములవల్ల మన దేశంలో నూతనరీతి నర్తనములు రూపొందుటకు అవకాశము కల్గినది. అట్టివే దక్షిణాదిన సప్తతాండవములు యిత్యాదులు, ఉత్తరదేశంలోని రాసక్రీడ మహారాస యిత్యాది నాట్యములు

ఇన్నింటికీ అతీతమై నాటినుండి నేటివరకూ ఒకేవిధముగా చెక్కుచెదరక తన ప్రాచీన విశిష్టతను పోషించుకుంటూ జీవకళలుట్టిపడే కళారీతిగా నిలిచింది మాత్రము ఆలయ సంప్రదాయ నర్తన రీతియే

దశాబ్దాలు శతాబ్దాలు గడిచిపోయినవి. రాజులు రారాజులు గతించారు. దేశ చరిత్రలో ఎన్నో మార్పులు కల్గినవి. కాని కవుత నృత్తములు, పంచభూత ఆరాధన నర్తనములు, అష్టదిగ్బంధన ఆరాధన నృత్తములు – ఇవిమట్టుకు తమ ప్రాచీన మార్గములోనే ప్రదర్శింపబడుతున్నవి ఇవి శుద్ధ నృత్తరీతులు. వీటిని మార్చుటకు, నూతనాంశములు చేర్చుటకు వీలులేదు. వీటి క్రమము సంపూర్ణమైనట్టిది గనుక శాస్త్రముల నెరిగిన కళావేత్తలు భారతదేశంలోని నాట్యరీతు లన్నింటిలో ఆలయరీతికి యెక్కువ ప్రాముఖ్యత నిత్తురు. కాని మరొకవింత ఏమనగా– యిట్టి విశిష్ట నర్తనరీతి ఆలయాల్లో వుండినదని చాలామంది కళాభిమానులకే గాక కళాకారులకు కూడా తెలియదు అందులకే నేటి కాలంలో ఆలయాల్లో వుత్సవాది వేడుక సమయములందు భరతనాట్య ప్రదర్శనాలు భాగవత ప్రదర్శనాలు ఏర్పాటుచేసి సంతృప్తి చెందుచున్నాము భరతనాట్యానికి, భాగవతానికి ఆలయ సంప్రదాయానికి ఏవిధమైన సంబంధం లేదు ప్రాచీనులు ఈ నాట్యాలను ఆలయం వెలుపలనేగాని దైవ సాన్నిధ్యంలో ప్రదర్శింప నిచ్చేవారుగాదు. ఆగమ శాస్త్రానుసారంగా మంత్రశాస్త్ర ఛందోరీతుల ననుసరించి ప్రత్యేక విశిష్ట తాళములందు కూర్చబడిన జతులను సుగాత్రము, సుస్వరములో గానము చేయుచూ నర్తకులు ఆలయ నృత్యాలను ప్రదర్శించేవారు"

ఈ నాట్యరీతుల ననుసరించియే భరతుడు తన నాట్యశాస్త్రములో వృత్తులను పేర్కొన్నాడు. కైశికి, ఆరభటి, భారతి, సాత్వతి అని వృత్తులనాల్గు భారతదేశంలోని వివిధ ప్రాంతా

ల్లోని ప్రజలు వారివారి అభిరుచుల ననుసరించి కళలను అభివృద్ధి పరుచుకున్నారు. భారతావనిలోని నర్తనరీతులన్నీ ఈ నాల్గింటిలో ఏదో ఒకదానిలోనికి చేరుతుంది ఆంధ్రులు శృంగారప్రియులు గనుక శృంగార రసప్రాధాన్యత గల్గిన కైశికీ వృత్తిననుసరించి వారి నర్తనరీతి వృద్ధిచెందినదిగా చెప్పవచ్చును.

మన నృత్యసాహిత్యం - అభినయపదములుగాని, భాగవత కథలుగాని ముఖ్యంగా అన్ని శృంగారవర్ణనలతో నిండివుంది - ఇతర రసములకు అంతటి ప్రాధాన్యత వుండదు.

అల్లే మలయాళ దేశ నృత్యాలు జూచినవారు వీర, భయానక, భీభత్స, రౌద్ర రసాలను యెక్కువగా అభిమానిస్తారు - అది ఆరభటి ప్రాధాన్యత గల్గిన కేళికారీతి

ఈ విధంగా వృత్తులు నిర్ణయించబడినవి కనుకనే భారతీయ నర్తనరీతి మూలం ఒక్కటే అయినా ఇంద్రధనస్సులా అనేక కాంతుల్తో ప్రకాశిస్తుంది.

అభినయము :- గద్యము, పద్యము, గీతము, పదము యిత్యాదుల్లోని భావమునుగాని, అర్థమునుగాని, రాగతాళములతో అంగ ప్రత్యంగోపాంగముల ద్వారా ప్రదర్శించుట అభినయము

అభినయమును ఒక ప్రత్యేక కళగా నట్టువమేళ నర్తకులు వృద్ధిపరిచినారు. నాట్యమేళములందునూ అభినయమున్ననూ అది పాత్రలననుసరించి వుండుటచే సంక్షిప్తంగా సంచారీ భావ ప్రకటన వుండును - కచ్చేరీ నాట్యరీతియందు పూర్తిగా సంచారీ భావములకు అభినయమేగాక పదార్థాభినయము, విశేషాభినయము ఇత్యాదులుగూడా ప్రదర్శింపబడును.

... ... ... ...

శివసంప్రదాయ తాండవ నర్తనరీతి, కృష్ణసంప్రదాయ తాండవనర్తనరీతి - అని తాండవము రెండు రీతులుగా రూపొందినది.

శివసంప్రదాయనృత్యము దక్షిణ దేశమందును కృష్ణ సంప్రదాయము ఉత్తరదేశమందును ప్రచారములోనున్నది.

వసంతోత్సవ సమయమందు శివుడు పార్వతి కోర్కెపై ఒకనాడు సాయంత్రము కైలాసంపై నృత్తమాడెను అదియే శృంగనర్తనరీతి - అందునుండే చారి అలంకార విధానము ఏర్పడినది - అదియే దక్షిణదేశ "శుద్ధనృత్త"మునకు ఆధారమైంది

కాళీయుని మదమడచుటకు, ఆ ఫణిరాజు శిరముపై నిల్చి శ్రీ కృష్ణుడు నర్తనమాడెను. అదియే ఉత్తరదేశములో ప్రచారమందున్న నృత్తమునకు మూలము శివపరముగనుకనే దక్షిణాది నృత్తము కొన్నిపాళ్లు ఉద్ధతభావము యెక్కువగా కల్గియుండును. కృష్ణపరనృత్తము లలితముగా లాలిత్యంతో నిండియుండును.

శివ విష్ణు సంప్రదాయములు రెండూ ప్రచారమునందున్న మణిపుర ప్రాంతమందు నృత్తము పూర్తిగా వికాసము చెందియున్నది. ఈ రెండు సంప్రదాయముల మేలు కలయికవల్ల.

## ఆరాధన నృత్యకళ

దేవతల ప్రీతికొరకు పూజాసమయములందు ప్రదర్శించే నృత్యములు; దేవతలు చేసిన నృత్యములు ఈ రెండు విధములైనవీ ప్రదర్శింపబడును

ఇవన్నియు 'మార్గ' నృత్యములు

ఇందు శివాలయాల్లో ప్రదర్శింపబడునట్టివి, విష్ణాలయాల్లో ప్రదర్శింపబడునట్టివి, దేవీ ఆలయాల్లో ప్రదర్శింపబడునట్టివి వేరువేరుగా నున్నవి. ఇవన్నియు వినాయక, రుద్ర, బ్రహ్మ, శక్తి, హంసనాద హంసలీలా, లక్ష్మీ, తురంగలీలా యిత్యాది అపూర్వ తాళములందు ప్రదర్శింపబడును. ఈ తాళములు సాధారణ నృత్య ప్రదర్శనములందు ప్రయోగించబడవు.

ఆలయాల్లో అధిష్టాన దేవతలకు ప్రదర్శించే నాట్యాలు గాక, అష్ట దిక్పాలురకు, నవగ్రహములకు ప్రదర్శింపబడే కొన్ని ప్రత్యేక నృత్యాలు కూడా వున్నవి.

శివాలయాల్లో వినాయకునికి, మహాసేనునికి ప్రత్యేక నృత్య పూజ వుండును విష్ణాలయాల్లో గరుత్మంతునికి ప్రత్యేక తాళము నర్తన చూడబడును

ఏవిధ పూజా సమయములందు ప్రత్యేకంగా కవుతము, శుద్ధ నర్తనము లాడబడును ఈ నృత్యములు ముఖ్యముగా కరణాంగ హారన్యాసములు నవి నాట్యశాస్త్ర భారతార్ణవముల ఆధారంగా రూపొందించబడినట్టి నృత్తములు.

భారతీయులు ఆరంభములో యజ్ఞయాగాది క్రతువులద్వారా పృథ్విలో జీవకోటికి కారణభూతమైనట్టి పంచభూతములను ఆరాధించి సంతృప్తిపరచేవారు. అట్టి సమయమందు నృత్యగాన పూజ గూడా వుండినట్లు ప్రాచీన శాస్త్రములు తెల్పుచున్నవి. కోమల గాత్రులైన స్త్రీలు వీణాగానము చేయగా పురుషులు ఉద్ధత స్వభావము కలినట్టి నర్తన మాడినట్లు వర్ణించబడినది. అటుపై హైందవ శిల్పులు దేవళ్ళకు ఆలయాలు కట్టినప్పుడు ఈ నాట్యములు ఆలయాల్లో ప్రదర్శింపబడినవి. పంచభూత ఆరాధన జతులను మనము పఠించినచో వాని ప్రాచీనత మనము కనుగొనవచ్చును. వేదాలను గానము చేయు విధముగా నుండును. ఆ జతుల పదక్రమము ఈ జతులు అతి ప్రాచీనములై మంత్రశాస్త్రమునకు కూడా సంబంధించియున్నట్టివి

శివాలయాల్లో ప్రదర్శింపబడునట్టి నృత్యములన్నియూ ముఖ్యంగా శివుని 108 కరణముల్లోనివి : భుజంగ, భుజంగత్రాస యిత్యాదులు

విష్ణు సన్నిధిలో ప్రదర్శితమయ్యే కమల నృత్తము, భ్రమర నృత్తము, మర్కటి.

అష్టదిక్పాలకులకు ప్రదర్శించే త్రిపతాక, దండపాద, స్వస్తిక, కైశిక యిత్యాదులన్నీ ప్రత్యేక నృత్తములు.

మరియు శుద్ధ, దేశి యిత్యాది వృత్తములు. స్థానక, చారి, కరణ, గతి, భ్రమణ విన్యాసములు గల్గినట్టి శాస్త్రీయ వృత్తములు.

ఇవన్నియూ సామాన్య మానవుల వినోదార్థం చేయబడే నాట్య విశేషములు గావు. ప్రత్యేక దేవతారాధనకు సంబంధించినట్టివి.

గ్రామదేవతలకొరకు చేయబడే నాట్యాలు కొన్ని వున్నవి. అవియే మణిపుర ప్రాంతమందలి 'మైచీ' నర్తనము; ఆంధ్రలోని గరగల, వీరనాట్యము; తమిళనాడులోని చిందు, కావిడి చిందు; కేరళలోని పులియన్ నర్తనము; మహారాష్ట్రలోని అగ్ని ఆరాధన నాట్యములు మొదలైనవి ఇవన్నియూ సంప్రదాయ నర్తన రీతులు

బలిహరణ, నవసంధి నాట్యములు అష్టదిగ్బంధన సమయములందు ఒక తీరుగను. ప్రహరి (అనగా రాత్రివేళ స్వామి నవ్వాళింపు సేవ ముగిసిన పిదప ఆలయాన్ని అష్టదిక్పాలకులకు అప్పగించి సెలవు దీసుకొనే) సమయమందు వేరొక తీరుగనూ వున్నవి.

ఈ ఆరాధన నృత్యములుగాక ఆలయంలో స్వామి కళ్యాణ మంటపమువద్ద కొలువు తీరినప్పుడు ఆయన దర్బారులో కేళిక, వినోద నృత్య ప్రదర్శన జరిగేది ఇది వినోదమగుటచే ఇందు నృత్తము, నృత్యము అభినయము గూడ ప్రదర్శించబడేది. ఈ రీతి ఆటయే రాజుల ఆస్థానములందు కొద్ది మార్పులతో కచ్చేరి ఆస్థానము అనే పేరుతో ప్రదర్శించబడేది. అదియే నేటి కాలములోని భరతనాట్యము.

దేవాలయాల్లో ఈ నాట్యాలను దేవదాసిలనే ఒక ప్రత్యేక తెగవారు చేసేవారు. ఇతరులకు అవకాశముండెడిదిగాదు. ఈ దేవదాసీలు 'ఊర్వశి' వంశీయులు- ఈ 'ఊర్వశి' నారాయణుని పుత్రిక. నరనారాయణుని బదరికావనంలో తపస్సు చేసిన సందర్భంలో - వారి తపస్సుకు భంగం కల్గించుటకు, ఇంద్రుడు రంభనంపెను. నారాయణుడు ఇంద్రుని దుష్టకృత్యమును గ్రహించి తన ఊరువుల్లో నుండి అతిలోక లావణ్యవతి, జగదేకసుందరి ఒక జవ్వనిని సృష్టించెను. ఊరువుల్లో నుండి పుద్భవించుటవల్ల ఊర్వశి ఆయెను ఆ జవ్వని ఇంద్రుడు సిగ్గుపడి తన తప్పిదమునకు మన్నించమని వేడగా, దయామయుడు అతనిని క్షమించుటయేగాక, ఊర్వశిని కానుకగ సమర్పించెను. ఆమె ఇంద్రలోకానికి ఒక అలంకారంగా విరాజిల్లింది. ఆమె సంతతియే దేవదాసీలగుటవల్ల వారిలో నారాయణాంశ వుండుటవల్ల - ఆలయాల్లో స్వామిసేవలో ఛత్రచామరములు వీచుటకు, కుంభహారతి విచ్చుటకు, ఉపచారములందు పాల్గొనుటకు, నృత్య గాన కేళిక సల్పుటకు నియోగింపబడిరి. రంభ, మేనక యిత్యాది దేవనర్తకీమణుల సంతానము రాజాస్థానములందు, పండిత సభలందు కేళిక జరిపెదరు. ఇచ్చట ఒక ముఖ్యవిషయము గమనించవలసియున్నది ప్రాచీన భారతదేశంలో - నృత్య సంగీతములు, ఆరాధన రీతులు, సాంఘిక వ్యవస్థలు అన్నీ ఒకే తీరుగా వుండినవి. కాని అనేక మత రాజకీయ కారణాలవల్ల వుత్తరదేశంలోని కళలందు, మత ఆరాధన రీతులందూ యెన్నో మార్పులు వచ్చినవి - ముఖ్యంగా హైందవ నాగరికత: సంస్కృతి యొక్క ఔన్నత్యాన్ని తెలియని మంగోల్, మొగల్ యిత్యాది తురుష్కులు ఆ దేశంపై దాడి జరిపి - ఆ నాటి నాగరికతకు సంస్కృతికి యెంతో హానికల్గించారు. తరుచూ దాడులకు గురియైన భారతీయులు ఆ పాలకుల అభిమతానుసారంగా, అభిరుచుల ననుసరించి తమ సంస్కృతిని చక్కదిద్దుకోవలసివచ్చింది. దానివల్ల ఒక నూతన శిశారీతి సంస్కృతి దేశంలో పెరిగినను, ప్రాచీన హైందవ సంప్రదాయాలు అంతరించిపోతూ వచ్చినవి. దక్షిణాపథానికి అట్టి విపత్తు తరుచూ సంభవించనందున ప్రాచీన హైందవ నాగరికత, లలితకళలు తమ పూర్వ స్వరూపముగోల్పోక నిల్పుకోగల్గినవి గనుకనే ప్రాచీన సంగీత బాణీ, నర్తన రీతులు దర్శించవలెనన్న, వినవలెనన్నా మనం దక్షిణదేశంలోనే గాంచగలము

ఆంధ్రదేశం ఉత్తర దక్షిణ ప్రాంతాలకు మధ్యగానుండుటవల్ల విదేశీయుల దండయాత్రలు వుత్తరాన ముగిసిన పిదప ఆంధ్రను దాటిగాని పూర్తిగా దక్షిణాపథానికి రాలేకపోయేవి. అందువల్ల ఆంధ్రలో గూడా సాంస్కృతికంగా కొద్ది మార్పుల కవకాశముండినను రెండు చాలా శక్తివంతమైన మహా సామ్రాజ్యములు ఆంధ్రలో వెలిసి హైందవ నాగరికతను, కళలను, సంస్కృతిని కాపాడినవి. అవియే కాకతీయ మహా సామ్రాజ్యము, విజయనగర సామ్రాజ్యము.

కాకతీయులు శైవులు అందును వీర శైవులు, పశుపతి సంప్రదాయ శైవమతావలంబీకులు మహమ్మదీయులెంతటి పరమత అసహనముతో ఉగ్రతతో హైందవ మతమును సంస్కృతిని నిర్మూలించుటకు పూనుకొనిరో అంతకంటే ఎక్కువ ఉగ్రతతో వారి నెదుర్కొనే శక్తి, సంఘటన పటుత్వము గల్గిన మత మొకటి హిందూదేశీయులకు అవసరమైనది. ఉత్తర హిందూస్థానములో పదియవ శతాబ్ది నాటికే అచ్చటి రాజన్యులకు విదేశీయులకు తలవొగ్గినారు అందువల్ల ఆ మత రాజకీయాలకు వారు అలవాటుపడి జీవించుట నేర్చుకొన్నారు. దక్షిణాపథము ఆ దాడులను యెదుర్కొనుటకు సన్నద్ధమైనది. ఆ కాలంలో యెక్కువగా వుపయోగ పడిన మతవిశ్వాసము, దైవము.

"అల్లాహో అక్బరు" అని తురుష్కులు రణరంగములో దూకి భారతీయులను ఎదుర్కొంటే "హరహర మహాదేవ" అని హైందవులు వారిని ఢీకొనేవారు. ఈ విధంగా మతయుద్ధము లెట్లున్నను, పశుపతి సంప్రదాయంవల్ల ఆంధ్రదేశంలో తద్వారా దక్షిణాదిని అనేక ప్రాచీన సంస్కృతీ వికాసము చెందిన కళలు ధ్వంసము గాకుండా నిలువగల్గినవి

తురుష్కులకు ముందుగా యవనులు, యిత్యాదులెందరో భారతదేశంపై దాడి జరిపినను వారు భారతీయ సంస్కృతిని విధ్వంసము చేయవలెననే సంకల్పం గల్గినవారు గారు. అందువల్ల వారి సంస్కృతిలోని ఉన్నతాశయములను ఏరి చేర్పుకొని భార

తీయ విజ్ఞానము మరింత కాంతివంతమైనది ప్రాచీన ఆర్య ధర్మముయొక్క సంస్కార పునరుద్యమముగా ప్రారంభించబడిన బౌద్ధము, మహాయాన, హీనయాన సంప్రదాయములుగా చీలిన తరువాత దక్షిణాపథంలో ముఖ్యంగా ఆంధ్రలో మహాయానం విరివిగా ప్రచారమందుండి శిల్పము సంగీత నృత్యకళలు విశేష ప్రోత్సాహము పొందినవి. ఆ తరువాత బౌద్ధము పూర్తిగా ఆంధ్ర నుండి దక్షిణదేశంలోనుండి తూర్పుదేశాలకు వలస పోయింది మరల నూతన రీతుల్లో నూతన తేజస్సు హైందవ మతము ప్రచారములోనికి వచ్చింది. దానినే కాకతీయ పరిపాలన కాలముగా పేర్కొనవచ్చును ఆ కాలంలో ఉత్తరాదినుండి మహమ్మదీయ దాడులు జరుగుటయేగాక, దక్షిణాన జైనమత వ్యాప్తి విరివిగా వుండుటవల్ల జైనులకు ప్రాచీన హైందవమత అవలంబీకులకు అభిప్రాయభేధాలు అంతఃకలహాలు ఎక్కువగా వుండినవి బౌద్ధము దక్షిణ దేశాన్ని వదలిపోయిననూ, జైనము స్థిరనివాసము యేర్పరచుకొన్నది. జైనులవల్ల సుందర శిల్పముతో గూడిన యెన్నియో ఆలయాలు వెలిసిననూ నృత్య సంగీత కళలకు ప్రోత్సాహ మెక్కువగా లభించలేదు. మరియు ఈ అంతః కలహాలవల్లనే విదేశ మూకలకు మహాసామ్రాజ్యమును కూలద్రోయుటకు సులభసాధ్యమైనది. కాకతీయ సామ్రాజ్య పతనముతో దక్షిణాపథంలో కళలకు కొంతవరకు ప్రోత్సాహము తగ్గినది. అయిననూ పూర్తిగా మహమ్మదీయ ప్రభావము దక్షిణ దేశంపై పడలేదు ఆంధ్ర ప్రాంతంపై కొంతవరకు వుండిననూ ద్రావిడ దేశంలో ప్రాచీన కళలు తమ ప్రాశస్త్యాన్ని నిల్పుకోగల్గినవి.

ఆ తరువాత విజయనగర మహాసామ్రాజ్యము స్థాపనవల్ల హైందవ కళలకు విపరీతంగా ఆదరణ లభించింది.

కాకతీయుల కాలంలో శైవ సంప్రదాయ కళారీతుల అభివృద్ధికి అవకాశముండినట్లే విజయనగర రాజులకాలంలో వైష్ణవ సంప్రదాయానికి ప్రాముఖ్యత హెచ్చింది. ఈ సంప్రదాయాలవల్ల రాజకీయ పరిణామాలెట్లున్ననూ కళా సాంస్కృతిక విషయాల్లో చూచిన – అనేక నూతన విన్యాసాలు, నూతనరీతుల్లో కళలు అభివృద్ధి చెందినవి. విజయనగర సామ్రాజ్య పతనము తరువాత దక్షిణాదిని మహమ్మదీయ ప్రభావము పెరిగిననూ ఛత్రపతి శివాజీ వంటి మహాపురుషులు సామ్రాజ్యమును స్థాపించి హైందవ సంప్రదాయాలకు రక్షణ చేకూర్చారు

అటుపై క్రైస్తవ మతావలంబీకులైన పాశ్చాత్యులు మన దేశాన్ని పాలించారు. వారు ఆర్థికంగా మనదేశాన్ని కొల్లగొట్టి వుండవచ్చుగాని సాంస్కృతికంగా మనకు నష్టము కల్గించ లేదనే చెప్పాలి. అపూర్వ శిల్పసంపదను లండన్, పారిస్ మ్యూజియములకు తరలించుకొనిపోయినది వాస్తవమేగాని సుందర శిల్పాలను తురుష్కుల వలె మతం పేరిట ధ్వంసం చేయలేదు. కొందరు మిషనరీలు క్రైస్తవంలోనికి భారతీయులను చేర్చికొనివున్ననూ బలవంతర మతాంతీకరణచేయలేదు. మన సంస్కృతిని అభివృద్ధి పరచలేదుగాని విధ్వంసం చేయునటకాలను అవలంబించ లేదు. భారతీయ దేవతలకు నూతనాలయాలు ఆ ప్రభుత్వం నిర్మించలేదు. క్రైస్తవ దేవతలకు మందిరాలు నిర్మించుకున్నారు. కాని హిందూ దేవాలయాలను నిర్మూలించి వాటితో వారి దేవతలకు మందిరాలు నిర్మించలేదు.

అందువల్ల మన సంస్కృతిలో అనేక మార్పులు చేర్పులు మహమ్మదీయుల పరిపాలనాకాలంలో జరిగినంతగా క్రైస్తవ పాలకుల కాలంలో జరుగలేదు అందునా ఉత్తర భారతంలో జరిగినంతగా దక్షిణాదిన జరుగలేదు. కనుకనే భారతీయ ప్రాచీన సంగీత నృత్యరీతులను మనం దక్షిణాదినే ప్రాచీన సంప్రదాయ స్వరూపాల్లో చూడగలము

దేవదాసీ సంప్రదాయము, నృత్యపూజా విధానం దక్షిణ దేశంలోనే ప్రాచీన పద్ధతిలో నిలిచింది ఉత్తరదేశంలో అనేక పెద్ద ఆలయాలున్ననూ – అందు కేళికా విధానమున్ననూ – ఆగమ శాస్త్రరీత్యా నృత్యపూజ మనకు విశేషించి కన్పించదు.

సౌరాష్ట్రంలోని సోమనాథఆలయంలో నృత్యపూజ వుండినట్లు చరిత్రలు తెల్పినా ఆ ఆలయమెన్నియోసార్లు పరమతస్థులచే విధ్వంసము గావింపబడినందున అచట పూజా వర్తనరీతులు మనకు మిగులలేదు

హిందువులకు అత్యంత పవిత్రమైన యాత్రాస్థలము వారణాసి. అక్కడ విశ్వేశ్వరుని ఆలయముండినది. ఆ పట్టణము ప్రాచీన హైందవ సంస్కృతికి నిలయమై విరాజిల్లినది. గాని అచ్చట ప్రాచీన ఆరాధన వర్తన రీతులు మనకు గన్పించవు. అచ్చటి ఆలయం శివాలయమైననూ దక్షిణాదియందువలె నృత్య వేదిక యెచ్చటనూ మనకు గాన్పించదు. ప్రస్తుతపు ఆలయంలో – పూర్వపు ఆలయం మహమ్మదీయులు ధ్వంసంచేసి మసీదుగా మార్చారు. ప్రస్తుతపు ఆలయం నూతనమైనట్టిది. ప్రాచీన ఆలయంలో నృత్యపూజ నృత్యవేదిక లుండి యుండవచ్చును.

నృత్యగాన ప్రియుడు, వేణుగాన లోలుడు శ్రీకృష్ణుని జన్మస్థలము, విహారభూమి మధుర బృందావనంలోని ఆలయాల్లోనూ మనకు శాస్త్రీయ నృత్య గాన పూజ గాన్పించదు సంప్రదాయ నృత్యములు 'రాసలీలా' యిత్యాదులు మాత్రము ప్రజల్లో ప్రచారమందున్నవి.

మన సంస్కృత కావ్యాలు, నాటకాలందు సుందర కాశ్మీరానికి ఒక విశిష్టత వుంది కళలకు కవిత్వానికి ఆ ప్రాంతము గూడా పేరుగాంచింది. కాని ఆనాటి ఆలయాల శిథిలాలు మాత్రం తమ ప్రాచీన ఔన్నత్యాన్ని తెల్పుటకు విషాదంగా నిట్టూరుస్తూ నిల్చియున్నవి. అవంతీపుర అవంతీశ్వర ఆలయంలో, మార్తాండ వర్మ యిత్యాదులచే నిర్మించబడిన మార్తాండ ఆలయంలో నృత్య పూజ వుండినది. దేశంయొక్క చరిత్రయే, స్వరూపమే పూర్తిగా మారిపోయింది. ఇక ఆ ప్రాచీన వర్తన రీతు లెక్కడ వుండును.

కాళిదాసు తన మేఘసందేశంలో ఉజ్జయిని పట్టణం, దేవదాసీల సంధ్య పూజా నర్తనం గూర్చి వర్ణించియున్నారు. ప్రాచీన ఉజ్జయిని శిథిలములుగూడా మిగులకుండా భూగర్భంలో నిద్రపోతున్ననూ, కొన్ని ప్రాచీనాలయాలు మనకు మిగిలివున్నవి. అందునూ నృత్యపూజ గాన్పించదు. ఈ విధంగా ఉత్తర భారత దేశంలో ఆగమశాస్త్రరీత్యా ప్రదర్శింపబడే పూజానర్తనం ఏనాడో అంతరించిపోయినను, రెండు దశాబ్దాల క్రిందటివరకూ దేవదాసీ బిల్లు కాంగ్రెసు ప్రభుత్వం ప్రవేశపెట్టేవరకు శాస్త్రీయ నృత్యపూజ దక్షిణాదిని జరుగుతూనే వుండినది నేటికినీ ఆ శాస్త్ర నర్తనం తెలిసిన పెద్దలు కొందరు దేశంలో మిగిలియున్నారు అస్సాం, మణిపుర ప్రాంతాల్లో దేవాలయాలకు సంబంధించిన 'ఘోట్ పురా' లున్నవి. సంకీర్తన నృత్య సంగీత బృందాలున్నవి. కాని వారునూ యిట్టి ఆలయ సంప్రదాయ విన్యమ ప్రదర్శించరు.

ఒరిస్సా, ఆంధ్ర దేశంలో నృత్తరీతులకు చాలా దగ్గర సంబంధం కనిపిస్తుంది. ఆంధ్ర యందువలే ఒరిస్సాలోని స్త్రీ నర్తకినులు "మహరి"లు గూడా రంభ, ఊర్వశి వంశీయులమని చెప్పుతారు ఒరిస్సా ఆలయాల్లో నృత్యపూజ వుండింది. ప్రతాప రుద్రదేవ అనే ఒక రాజు నృత్య సంగీతములందు విద్వాంసురాండ్రయి నట్టువ రాండ్రను జగన్నాధుని సేవనిమిత్తం సమర్పించినాడట. పూరిలోని జగన్నాధుని ఆలయంలో నృత్యపూజ వుంది. నర్తకినులు ఉపచార సమయములందేగాక స్వామి మహానైవేద్యం ఆరగింపు సమయంలో 'మహరి' నర్తనమాడే విధమొక్కటుంది. దీనివల్ల మనం తెలిసికోగల్గిన దేమనగా, ఒరిస్సా, ఆంధ్ర, తమిళ, కర్నాటక, కేరళ ప్రాంతములందు ఆలయాల్లో ఆగమాల ననుసరించి నృత్యపూజ వుండినది. ఇతర ప్రాంతములందు, రాజకీయ మత కారణాలవల్ల ఆ పూజా పధానం మరుగుపడింది. ఆలయాల్లో నృత్యముండినను అది ఆగమవిధానం గాదు.

జయదేవ, చండీదాస, విద్యాపతి, గౌరంగప్రభు, శంకరదేవ యిత్యాది మహాపురుషులు నృత్య సంగీతాలను గోపాలుని ఆరాధనలో ఒక ముఖ్య అంశముగా పేర్కొన్ననూ, వారే అనేక కీర్తనలు రచనచేసిననూ – అవి ఉత్తమ సంగీత రచనలు, గీతికలైననూ – అవన్నియూ సంకీర్తన సంప్రదాయములుగా వృద్ధిచెంది ప్రచారములోనికి వచ్చినవి. అట్టివే దక్షిణాపథంలోని అన్నమయ్య, చిన్నయ్య సంకీర్తన పదములు; పురందరదాస పదావళి ఇత్యాదులు.

ఇవన్నియూ వేరు, ఆలయాల్లో నున్న 'శుద్ధనృత్త' రీతి వేరు

## ఆస్థాన నర్తన రీతులు

ఆలయాల్లో దేవుళ్ళకొరకు యెన్నియో నృత్యములున్నట్లు తెల్పినాను, అవి పూజలో ఒకభాగంగా ప్రదర్శింపబడేవి కొన్నియునూ, వినోదార్థం ప్రదర్శింపబడేవి కొన్ని యున్నట్లునూ తెలియజేసినాను.

అట్లే రాజుల ఆస్థానాల్లో ప్రదర్శింపబడుటకు; పండితులు, విద్యావేత్తలు కవులు, గాయకులు, యిత్యాది విజ్ఞానవంతుల వినోదార్థం ప్రదర్శించుటకు ఒక కళారీతి వృద్ధిపరచబడింది. అదే భరత నాట్యమనియు, సాదిర్ అనియు, దర్బారు ఆటనియు, ఒడిస్సీ అనియు, మోహిని ఆటయనియు, కర్నాటక మనియూ, కథక్ అనియు భారతదేశంలోని వివిధప్రాంతాల్లో వివిధ పేర్లతో పిలువబడుతుంది. ఈ నాట్యముగూడా నట్టువమేళ పద్ధతికి చెందినట్టిదే. అనగా స్త్రీలచే చేయబడే నృత్య సంప్రదాయం. కావ్యములు, ప్రబంధములు, అలంకారశాస్త్రము, రసశాస్త్రము, సంగీతశాస్త్రము, భరతశాస్త్రము, శిల్పశాస్త్రము, కళాశాస్త్రముల సారమే ఈ భరత విద్య. ఇన్నింటియందు సంపూర్ణ విజ్ఞానము గలవాడే భరతవేత్తయగును. సభలో నిల్చి గజ్జెకట్టుట కర్హత సంపాదించును. పండితులతో విద్వాంసులతో వాదించే, చర్చించే, ఒప్పించే, మెప్పించే వారు కోరిన పదము కోరిన రీతిని అభినయించే శక్తిని కలిగియుండును. అడిగినంతనే అభినయం ప్రదర్శించే ప్రతిభను సంపాదించును. తాళ, గతి జతి, జతి ననుసరించి నృత్తమాడగల్గును. నృత్త నృత్యములను, నృత్యఆంగికములను, ఆంగిక సాత్వికములను విశదపర్చి అభినయించగల్గును నవరసములనే గాక వ్యతిరేక రసములను వెంటవెంటనే ప్రదర్శించ సాహస ముండును. రాగము, రాగభావము, సాహిత్యభావము నెరిగి గానముచేయగల్గియుండును. అర్థము తెలిసి అభినయించగల్గు అనుభవం సంపాదించును అట్టి కళావేత్త కళ నిత్య నూతనకాంతులతో ప్రకాశవంతమై వెలుగొందుచుండును. అట్టి పండితులే ఆస్థాన నాట్యాచార్యులుగాను, నర్తకినులు ఆస్థాన నర్తకీమణులుగానూ స్వీకరించబడేవారు.

ఈ భారత ప్రదర్శనము కేవలము వినోదంకొరకు గాదు. అదొక విజ్ఞానవిందు. పాండిత్యపరీక్ష రాజుల ఆస్థానాల్లో ఒక్కొక్క విద్యలో ఒక్కొక్కరు పండితులు వుండగా– యిన్ని విద్యలందూ పాండిత్యం సంపాదించి, ఇందరిలో నిల్చి కేళికజరిపి అందరి మన్ననలను బడసిన నర్తక నర్తకీజనం యెంతటి విజ్ఞానవేత్తలో వూహించిన సంభ్రమాశ్చర్యాలు కల్గును. ఇంతటి విజ్ఞానంతో గూడిన విద్యగనుకనే యిది సామాన్యప్రజల విద్యగాగాక పండిత ప్రకాండుల విద్యగా నిల్చిపోయింది. అన్నిశాస్త్రముల నిగ్గుయై యావత్ప్రపంచంలో భారతీయ నృత్యకళ ఒక మహోన్నత కళగా నేటి కాలంలో గౌరవింపబడుటకు కారణం ఆనాటి కళాకారుల కృషి, సాధన, పరిశోధన, ఆరాదనా, ప్రభువుల ఆదరణ ప్రోత్సాహములే

నృత్తము, నృత్యము, అభినయము, ఆంగికము, సాత్వికము ఏవిషయము తీసుకున్నా వారు సంపూర్తిగా తరిచితరిచి చూడనిది, పరిశోధించనిది, ప్రయోగముచేసి సంతృప్తి చెందనిది అంగీకరించేవారుగాదు, స్వీకరించేవారుగాదు. పరిశోధనకు, సాధనకు, అభ్యాసానికి, ప్రదర్శనకు అన్నివిధాల ప్రోత్సాహముండేది. పోషణ వుండినది అవకాశ ముండినది నూతనరీతుల కల్పనలకు, ప్రదర్శనకు సరస్వతీపీఠము రాజుల ఆస్థానము.

అయితే ఈ విద్య సామాన్య ప్రజానీకానికి యెంతవరకూ వుపయోగపడినదనే ఒక వాదన బయలుదేరవచ్చును.

ఇది శాస్త్రీయవిద్య. శాస్త్రముల నెరిగిన పండితులు, కళావేత్తలు మన కళకొక వున్నతస్థాయి కల్పించి ప్రపంచ కళా చరిత్రలో, సంస్కృతి ప్రవంతిలో ఒక వుత్తమకాంతి పుంజముగా నిల్చుటకు వుపయోగపడునట్టిది.

సామాన్య ప్రజల వుపయోగార్థం, వారి వినోదముకొరకు, వారి విజ్ఞాన ప్రబోధమునకుగాను ఏర్పాటుచబడినవే భాగవత నర్తన రీతులు. సమస్త శాస్త్రములందు పాండిత్యము సంపాదించి, నిరంతర సాధన కృషివల్ల తమ విద్యకు పదునుబెట్టి — పండితుల సమక్షాన కేళిక జరిపి — కత్తిమీద సామువలె తమ జీవితాల నడిపిన ప్రజ్ఞావంతులైన ఆస్థాన కళాకారుల కెట్టి ప్రోత్సాహము, ధన సహాయం ప్రభువులు కల్పించారో అంతకంటే తక్కువ పాండిత్యముతోటే భాగవతముల ప్రదర్శించే అవకాశ ముండిన నాట్య మేళములవారికి అంతటి ప్రోత్సాహము కల్పింపబడింది. ప్రజలు ప్రజల వినోదము, ప్రజలకళారీతులను ప్రభువులు మరువ లేదు ప్రతి ఆలయానికి దేవదాసీమాన్యాలేగాక భాగవతులకు కూడా కొన్ని మాన్యముల నేర్పరిచారు భగవంతుని రాబడిలో కొంతభాగం లలితకళలకొరకు వెచ్చించేవారు.

ఆలయాల్లో నృత్యపూజవల్ల దేవుళ్ళు సంతృప్తిచెందితే, కేళికవల్ల పండితులు, విద్వాంసులు కళల ఔన్నత్యాన్ని కాపాడితే, ఆలయం వెలుపలవేసే భాగవతులవల్ల సామాన్య ప్రజల్లో విజ్ఞానం పంచబడుటయేగాక వినోదంగూడా కల్పింపబడేది. దేశచరిత్ర, పురాణేతిహాసములసారము, సాంఘిక వ్యవస్థలు వీటన్నింటిగూర్చి ప్రజలకు నృత్య గానముల ద్వారా అతి సులభశైలిలో ప్రబోధం చేయబడేది. గ్రంధపఠనద్వారా, ఉపన్యాసములద్వారా, ప్రవచనముల ద్వారా, ప్రబోధము ద్వారా, తర్కవితర్కములద్వారా పండితుల బహు పరిశ్రమవల్ల తెలిసికొనే హైందవ సంస్కృతిసారాన్ని సామాన్య ప్రజలు బహు సులభంగా ఆటపాటల ద్వారా తెలిసికొనేవారు. రాజనర్తకీమణులకు, ఆస్థాన విద్వాంసులకు మాన్యము లిచ్చి పోషించినట్లే రాజులు భాగవతులకుగూడా ఎన్నో గ్రామములను మాన్యములుగ యిచ్చి పోషించిరి.

భాగవత కళారూపము మాత్రము ఆస్థానకేళికకంటే తక్కువ స్థాయికిచెందిన విద్యగా మాత్రం చెప్పవలసి వుంది.

భాగవతులు విద్యావంతులు గారని నా అర్థం గాదు. ఆ సంప్రదాయ నర్తకులకు విశేష పాండితీప్రతిభ గల్గియుండవలసిన అవసరంలేక యుండినది, వారి ఆటపాటలు సామాన్య ప్రజలగూర్చి నిర్దేశింపబడినవగుటచే.

## భాగవత కళ

భరతనాట్యము, కేళికారీతి పూర్తిగా స్త్రీల నర్తనరీతి అయినట్లే నాట్యమేళము భాగవతము పూర్తిగా పురుషుల విద్యయై, పురుష నర్తకుల శరీర సౌష్ఠవమునకు అనువగు రీతిని కూర్చబడిన విద్యావిశేషము. ప్రస్తుత కాలంలో కొందరు కళావేత్తలు భరత నాట్యము, భాగవతం రెండూ ఒక్కటే సంప్రదాయమైనట్లు పేర్కొనుచుందురు. అది పొరపాటు. ఈ రెండింటికీ ఆటపాటల్లో చాలా తేడా వుంది. భరతనాట్యము శాస్త్రీయవిద్య. భాగవతము సంప్రదాయ విద్య ఒకటి శాస్త్రీయ బాణీలో వృద్ధిచెందగా రెండవది 'దేశి' బాణీపై ఆధారపడి వృద్ధిచెందినది భరతనాట్యము ముఖ్యంగా తాళవిన్యాస ఆట భాగవతము లయవిన్యాస పద్ధతి గనుక ఈ రెండునూ, ఒకటనుటసరిగాదు. ప్రాచీనకాలంలో వీరిని నాట్యమేళములని పిలిచేవారు. భాగవత, పురాణ కథలను ఆడుట మొదలుపెట్టిన తరువాత వీరు భాగవతులైరి వీరి ఆటలు భాగవతములైనవి. వీధులందాడుటచే వీధి భాగవతములు, వీధి నాటకములు, బయలు ఆటలు, అని పిలువబడినవి. వీధి అనగా రహదారి అనే అర్థమే. గాని సంస్కృత నాటకములందు తెల్పిన 'వీధి' ప్రత్యేక నాటక రీతి గాదు. ఈ నర్తకులను భరతులు, బహురూపులు అనిగూడా పిలుతురు. ఈ నర్తకులు ఒకచోటనుండి వేరొకచోటకు సంచారము చేస్తూ కేళికచేసి ప్రజలకు వినోదము కల్గించు బృందములవారు.

ఆంధ్రదేశంలోని కూచిపూడి భాగవతులు, గొల్ల, జంగం, దాసరి భాగవతులు; ద్రావిడదేశంలోని భాగవత మేళములు, కురవంజి నర్తనబృందములు; కర్నాటక దేశములోని యక్షగాన బృందములు; కేరళలోని కథకళి బృందములు, ఉత్తరాది రామలీలానవటంకి మేళములు — ఇవన్నియు భాగవత సంప్రదాయానికి చెందినట్టివే. వీరందరూ సంచార నర్తన బృందాలకు చెందిన నర్తకులే.

## జానపద నృత్యములు

ఆలయాల్లో ఆరాధన నృత్యాలు, ఆస్థానాల్లో కేళికా నర్తనము, సామాన్య ప్రజల భాగవత రీతులు కొందరు ప్రత్యేకంగా శిక్షణపొంది వృత్తిగా స్వీకరించి ప్రదర్శించే నృత్తరీతులు. అట్లుగాక పల్లెసీమలందలి ప్రజలు వారివినోదము వారే చేసే నృత్య రీతులే జానపద నర్తనములు. ఇవన్నియు సంప్రదాయ నృత్యములే సాధారణంగా యివన్నియూ బృంద నృత్యములుగా వుంటవి. కొన్ని ప్రత్యేకంగా స్త్రీలచే ప్రదర్శింపబడునట్టివి, కొన్ని పురుషులచే ప్రదర్శింపబడునట్టివి, కొన్ని స్త్రీలు పురుషులు కలిసి చేయునట్టివిగా వుండును. ఇందు కొన్ని పూజానృత్యములుగా, కొన్ని వినోద నర్తనములుగా నున్నవి. గొబ్బి, బతకమ్మలాట, కుమ్మి, కైకొట్టుకళి కోలాటము, రాస, దండియారాస, గర్బ, బిహు, సంకీర్తన మొదలైనవన్నియు ఈ తరగతికి చెందినట్టివే వీటికి

శిక్షణ క్రమమున్ననూ శాస్త్రీయ నృత్యమంతటి కష్టతరమైనట్టిది గాదు. కేవలము సంప్రదాయ లయ ఆటలు మాత్రమే.

## ఆటవికుల నర్తనరీతులు

సవరలు, గదబలు, చెంచులు, కోయలు, తోడాలు, గోండులు, భిల్లులు, ఒరియనులు, ముండాలు, బైగాలు, నాగవాసులు యిత్యాది గిరిజనులు ప్రదర్శించే నర్తనములన్నీ వున్నవి. వీరి జీవితాలే రసవంతమైన నృత్య నాటకాలుగా పేర్కొనవచ్చును. మనుష్యుడు లోకంలో పుట్టినది మొదలు మరల జీవితం ముగియు వరకూ అతని జీవితంలో ముఖ్యఘట్టము లన్నింటిలో నృత్యవేడుక లుండును.

బిడ్డ పుట్టినప్పుడు నృత్యము, బారసాలప్పుడు నృత్యవేడుక, పెరిగి తన అర్ధాంగిని ఎన్నుకొను సమయమందు 'ఘోటల్ ఘర్' నృత్యములు, వివాహంలో నృత్యము, మరల పుత్రోత్సవములో నృత్యము, ఆఖరికి అలసిన శరీరాన్ని విడలి జీవుడు స్వర్గానికి పయనించు సమయంలో అలసట జెందక పయనించుటకు నృత్య వేడుకలతో సాగనంపుదురు.

అతిథులెవరైన వారి గూడెములకు వెళ్ళినప్పుడు వారినాహ్వానిస్తూ నృత్యము, వారివినోదముకొరకు నృత్యము, వారికి వీడ్కోలిస్తూ నృత్యము.

పంటలు పండించుటకు ముందుగా 'ధరిత్రిమాత'ను పూజిస్తూ నృత్యము, వానదేవుని ఆహ్వానిస్తూ నృత్యము, పంటలు పండుటకు సత్యపూజలు (కర్మనృత్యము) క్షుద్ర దేవతలను పంటచేలనుండి పారద్రోలుటకు నృత్యములు, పండిన ధాన్యమును యిల్లుజేర్చి దేవతల కొలుస్తూ నృత్యము, ఆపై నృత్య వినోదాలు, ఈ విధంగా నృత్యము వారి జీవితాల్లో ఒక భాగమై పోయింది. వర్షాకాలంలో "ఘోటల్ ఘర్'లో నృత్యాలు, వెన్నెల రాత్రుల్లో ఆరుబయట నృత్యాలు, వసంత ఋతువులో పూచిన మామిడి తోపుల్లో నృత్య వినోదాలు - సంవత్సరము పొడుగునా వారు చేయుటకు, వేరువేరు ఋతువులందు వేరువేరు సందర్భములందు, వేడుక సమయము లందు వివిధ రకములైన నృత్యములున్నవి.

ఇవి అన్నిటిలోనూ ముఖ్యంగా బృందనృత్యాలు, అనుకరణ నృత్యాలు, లయ ఆట వీరు ప్రదర్శింతురు

మధ్యప్రదేష్ నందూ దక్షిణ భారతమందు అతి ముఖ్యులైన వారు 'గోండులు'. వీరిది అతి ప్రాచీనమైన సంస్కృతీ సంప్రదాయము వీరు అనేక సంస్థానములుగా ఏర్పడి రాజ్యంచేసినవే అదే "చత్తీస్ ఘర్" ప్రదేశము అనగా ముప్పయి ఆరు కోటలతో కూడిన ప్రాంతము. ముప్పదిఆరు రాజవంశాలు ఆ ప్రాంతాన్ని పాలించేవారు ఈ గోండుల నాట్యాల్లో చాలా ప్రసిద్ధి గాంచినది, "కర్మ" నృత్యము. మన దేశంలోని నాట్యశాస్త్రిల్లో వర్ణించబడిన 'గొండ్లి' నర్తనము వేరుగా వున్నది.

ఒరియనులనే ఒక తెగవారి నర్తనం కడు చిత్రముగా వుంటుంది. అందులో వేలకొలది జనం స్త్రీలు, పురుషులు, వృద్ధులు, యువకులు ఒకేసారి పాల్గొని నర్తనమాడుదురు. ఇట్టి నర్తనం భారత దేశంలో మరెచ్చటనూ చూడము.

ఈ నాట్యము లన్నియు రసభావములు లేక తాళ లయాశ్రిత ములైన శుద్ధ నృత్త రీతులుగా పేర్కొనవచ్చును.

చతురశ్ర (నాల్గు అక్షరములగతి) తిశ్ర మూడక్షరముల గతి) ముఖ్యంగా ఈ రెండుగతులందు వీరు నర్తన మాడుదురు. ఏకతాళితాళమందుకూడా కొన్ని నర్తనరీతులు ప్రదర్శింపబడును.

భారతదేశంలో శాస్త్రీయ నర్తన రీతులు అభివృద్ధి చెందిన ప్రాంతములు :-

ఆంధ్ర, తమిళ, కర్నాటక, కేరళ, ఓఢ్ర, మణిపుర, అస్సాము, ఉత్తరప్రదేశములు.

జానపద నర్తనరీతులు విశేషముగా అభివృద్ధి చెందిన ప్రాంతములు :-

కాశ్మీరము, పంజాబు, రాజస్థాన్, సౌరాష్ట్ర, గుజరాత్, మధ్యప్రదేశ్, మహారాష్ట్రములుగనూ పేర్కొనవచ్చును.

తోలుబొమ్మల భాగవతము ఆంధ్రదేశమందు మాత్ర మున్నది. ఆంధ్రమందే తూర్పుదేశాలకు వ్యాపించినదని కళావేత్తల అభిప్రాయము.

బొమ్మలాటను (చెక్కబొమ్మలాట), రాజస్థాన్, ఆంధ్ర, తమిళ, కర్నాటక ప్రాంతములందు ప్రచారమందున్నది.

కలాప సంప్రదాయము ఆంధ్రదేశమందు మాత్రము కన్పించుచున్నది. కురవంజ ఆట తమిళ ప్రాంతములో ప్రత్యేకంగా వుంది. ఆంధ్రలో ఈ ఆట (ఎరుకత ఆట) భాగవతాల్లో ఒక భాగంగా చేర్చివేయబడింది. ప్రాచీన దరువు బాణీ (భరతుడు దెల్పిన ధ్రువగాన వాద్య రీతి) నేటికినీ ఆంధ్రలో నిల్చియున్నది. ఉత్తర దేశంలో దువద సంగీత సంప్రదాయం ప్రచారంలో వున్ననూ, ఆ బాణికి ప్రాచీన బాణికి కొంత భేదమున్నది

ఇంతవరకూ భారతావనిలో అభివృద్ధి చెందిన నృత్యకళ గూర్చి తెల్పియున్నాను.

భారతదేశంలోని వివిధ ప్రాంతాల్లో అభివృద్ధిచెందిన శాస్త్రీయ నర్తన రీతులగూర్చి తెల్పే ముందు ఉత్తర భారత దేశం, దాక్షిణాత్యుల బాణీలగూర్చి తెలిసికొనుట చాలా అవసరము.

సంస్కృతం, భారతీయ సాంస్కృతిక బాషగావున్న కాలంలో ఉత్తర దక్షిణ భారతావనిలో సంగీతరీతి ఒకే పద్ధతిలో వుండింది. అటుపై ప్రాంతీయ భాషలకు ప్రాముఖ్యత హెచ్చుతూ వచ్చిన పిదప ఉత్తరదేశంలో హిందీ (బ్రిజభాషకు , దక్షిణాన

తెలుగు, సాంస్కృతిక భాషలుగా వృద్ధిపొంది, నృత్య, సంగీత రచనలు ఈ రెండు భాషలందే చేయబడినవి. గనుకనే ప్రాంతీయ భాష యేదియైననూ శాస్త్రీయ సంగీతము, నృత్యము ఈ రెండు భాషలననుసరించే వుండును.

భరతుడు, నందికేశుని కాలమునాటికి ఒక్కటిగానేవుండిన కళాస్వరూపము. సంగీతరత్నాకరము (సారంగదేవ విరచితము) నాటికి పూర్తిగా రెండు బాణీలుగా విడిపోయి రూపొందినది. ఆ నాటికి మహమ్మదీయ ప్రభువుల పరిపాలనా ప్రభావముగూడా ఉత్తరదేశముపై వుండినది

ఆకాలమునాటి అత్యంత ముఖ్యమైన సంగీత రచనయే జయదేవ మహాకవి గీతగోవిందము. అంతకంటే ప్రాచీనమైన సంగీత రచనలు మనకు లభ్యమగుటలేదు. ఈ రచన భారతదేశమంతటను ప్రచారమందున్నది. ప్రాంతీయ యాసతో, ప్రాంతీయ బాణీలో నృత్యము చేయుదురు గానముచేయుదురు. కొన్ని ప్రాంతములందు గీతగోవిందములోని అష్టపదులకు నృత్యమాడుదురు. కొందరు అభినయింతురు. కొందరు సంకీర్తన సంప్రదాయము ననుసరించి గాన నృత్యముల ప్రదర్శింతురు.

అష్టపదుల ఆట - అస్సాం, మణిపురము, బెంగాలు, ఒరిస్సా, మళయాళ, తమిళ ప్రాంతములందు చూచే అవకాశము నాకు కల్గింది. అష్టపదుల ఆటక్రమము, అందు పట్టవలసిన హస్తములు, అభినయ పద్ధతులు, చారీరేచకాదుల తంజావూరు సరస్వతీ మహల్‌లో ఒక ప్రత్యేక రచనగూడా వుంది కృష్ణభక్తి, మధుర భక్తి సంప్రదాయం విరివిగా ప్రచారం వున్న మణిపుర నృత్య సంప్రదాయంలో - 'మహారాస'లో గీతగోవిందకధనే కేళికగా ప్రదర్శింతురు. పూరీ జగన్నాధుని ఆలయంలో ప్రత్యేక గీతగోవిందసేవ జరుగుతుంది అదే తీరున శ్రీరంగనాధుని ఆలయమందునూ గీతగోవిందం కేళిక జరుపబడుతుంది.

ఇందరి ఆట క్రమముకంటే ఆంధ్రలోని కళాకారులు, ముఖ్యంగా దేవదాసీలు వృద్ధిపరచిన, 'గీతగోవింద కేళిక సంప్రదాయమే అత్యుత్తమంగా వున్నది. అష్టపదులు నృత్యమాడుట, ఆంగిక ప్రాధాన్య కేళిక జరుపుట సామాన్యరీతి అష్టపదులకు సాత్వికాభినయ ప్రాధాన్యత గల్గిన కేళిక చేయుట వుత్తమ స్థాయి కళారీతి ఈ కళా సంప్రదాయం భారత దేశంలో మరెచ్చటనూ కాన్పించలేదు.

కొన్ని అష్టపదుల అభినయమందు ఆ గీతంలోని చెలికత్తె భావము నభినయించి, వెంటనే నాయిక యొక్క అనుభూతుల్ని గూడా ప్రదర్శించే క్రమము ఆంధ్రదేశంలో మాత్ర ముండినది.

ఉదా :- ధీరసమీరే యమునాతీరే వసతి వనే వనమాలి.

దూతిక యీ విధముగా నాయికకు విన్నవించినప్పుడు ప్రారంభంలో దూతిక భావాల్ని గీతము ననుసరించి ప్రదర్శించి పిమ్మట - రాధయొక్క అనుభూతులు, కృష్ణునిగూర్చి విన్నప్పుడు ప్రదర్శించేవారు.

ఇది చాలా ఉత్తమ స్థాయికి చెందిన కళారీతి నర్తకులు చక్కగా సంస్కృత భాషాధ్యయనం, అలంకార, రస శాస్త్రములు, అభినయశాస్త్రము నభ్యసించినగాని అలవడదు. కళాకారులకు కల్పనా చాతుర్యం, పాండితీ ప్రతిభ వుండవలెను ఇట్టి విద్వాంసులు విద్వాంసురాండ్రు ఆంధ్రలో పూర్వం వుండేవారు వీరు ప్రత్యేకంగా అభినయ కళను ఆరాధించేవారు. శృంగార మంజరి, అమరుకము, పుష్పబాణ విలాసం, కృష్ణ కర్ణామృతము; గీతగోవిందము, క్షేత్రయ్య పదములను ప్రత్యేకంగా అభినయించేవారు.

ఒరిస్సా, మణిపుర ప్రాంతాల్లో కళాకారులు నాట్యప్రాధాన్యతగా ప్రదర్శింతురు. అందువల్ల వారి ఆటలో సాత్విక సంచారుల అభినయ వికాస ముండదు.

ఒరిస్సా రాష్ట్రంలో మయూర్‌భంజ ప్రాంత నర్తకుల గీతగోవింద కేళిక ఒక ప్రత్యేక పద్ధతిలో వుంటుంది.

సాధారణంగా నృత్యములో గీతములకు ఆట ప్రదర్శించునప్పుడు చరణమునకు చరణమునకు మధ్య వేసే జతులకు (మృదంగ) శుద్ధనృత్తము ప్రదర్శింపబడును కాని వీరు రాబోయే చరణములోని భావమునకు సరిపోవునట్టి చారీ విన్యాసములకూర్చి ఆట ప్రదర్శింతురు. ఇదొక చిత్రరీతి నర్తనము. భరతనాట్యమందుగాని, కూచిపూడి కథకళి నర్తనములందుగాని ప్రతి చరణము ముగియగానే కొన్ని తీర్మానము లాడుట. నడకలు జతి:నాడుట, కలాపములాడుట ఆచారము కాని ఈ విశిష్టపద్ధతి కళాకారులు గమనించదగ్గది. భరతార్ణవము, నాట్యశాస్త్రాల్లో, నవరస అంగహార నర్తనరీతి, అంగహార నర్తనరీతి అనే ఒక క్రమమందు పాటలేకుండా వాద్యసంగీత ఆధారంతో ప్రత్యేక క్రమంతో హస్తపాదముల విన్యాసములు చేసి మనకు కావలసిన తీరున రసభావములు ప్రదర్శించు క్రమము నవరస అంగహార క్రమము ఈ క్రమమును ఈ నర్తకులు ప్రత్యేకంగా ప్రదర్శింతురు

ఆంధ్రలో కళాకారులు సాత్వికాభినయం వృద్ధిపరచినట్లు వీరు నవరస అంగహార నర్తనం అభివృద్ధి జేసినారు.

ఉ॥ ప్రళయ పయోధిజలే ।
ధృతవానసి వేదం
విహిత వహిత్ర చరిత్ర మఖేదం
కేశవ ! ధృతమీన శరీర !
జయ జగదీశ హరే ! ।

దశావతారముల్లోని మత్స్యావతార వర్ణన. ఈ అవతారము నృత్యముచేయుటకు ముందు ఒక జతి ఆది, అవతారముల

ముగించి పిదప ఒక తీర్మానమాడి మరొక అవతారము నెత్తు కొందము

ప్రారంభంలో అదే జతికిగాని, అటుపై అదే తీర్మానముకు గాని మన ప్రాంతాల్లో రసభావములేని శుద్ధనృత్తము ప్రదర్శింతుము. వారట్లుగాక ఆ అవతారములోని భావమును స్ఫురింపచేయు నృత్తము ఆడుదురు. ఆ మృదంగ జతుల శబ్దముల కట్టుబాట్లునూ ఆ రసపోషణకు తగినరీతిలో నుండును

మణిపురివారు ప్రదర్శించే నాట్యకేళిక :- గీతగోవిందము ఆధారంతో రాధామాధవుల ప్రణయం కథగానల్లి రాధాకృష్ణులు, సఖి, గోపికలు వీరందరియొక్క నృత్యములతో నృత్యనాటక రూపంలో ప్రదర్శన చేయుదురు. వీరిది నృత్యనాటక రూపం.

ఒరిస్సా నర్తకులు అష్టపదులు ప్రత్యేకంగా ఒక్కటి నృత్తమాడినప్పుడు ఆ ఆట ఆంగిక ప్రాధాన్యతగల్గిన నృత్యముగా మన దేశంలోని ఆటకు దగ్గరగా నుండును. ఉత్తరదేశమందు, కాశ్మీర, పంజాబు మొదలైన ప్రాంతములందు గీత గోవిందం ఆట గాని పాటగాని ప్రత్యేకంగా కన్పించదు

ఒకే సంగీత రచన వివిధ ప్రాంతీయులు ఏ విధంగా ప్రదర్శించుచున్నారో తెల్పుటకు గాను ఈ విషయమై యింత వివరంగా వ్రాశాను మరియు ఆంధ్రలో సిద్ధేంద్రులు వ్రాసిన భామాకలాపమునకు ఆధారం గీత గోవిందమనే చెప్పవచ్చును భామ కలాపంలో నాయిక మాటనైనా, కథావస్తువు మాత్రము యించుమించు ఒక్కటే. ఈ విషయం ఆంధ్రుల నృత్యకళ గూర్చి తెల్పినప్పుడు వివరంగా వ్రాయుదును.

కాళిదాసు మహాకవి యిత్యాది మహాకవుల నృత్య వర్ణనలు, ప్రయోగాలు ప్రాచీన పద్ధతుల్లో ప్రదర్శించ నెరిగిన వారు దక్షిణాదినే వున్నారు.

ఉదా :- మాళవిక అగ్నిమిత్రలోని 'చలిక' నృత్తము.

"దుర్లభః ప్రియోమే తస్మిన్

భావహృదయః నిరాశం"—

ఈ శ్లోకానికి అభినయము; విక్రమోర్వశీయంలోని కొన్ని సన్నివేశాలు ప్రదర్శించుటలోనూ దాక్షిణాత్యులు చూపు పాండితీ ప్రతిభ, నిపుణత, శాస్త్రీయ పద్ధతులు వుత్తరాదివారిలో లేవని చెప్పవచ్చును ఆ ప్రాచీన సంప్రదాయ నర్తన రీతులు పూర్తిగా ఆ ప్రాంతాల్లో అంతరించి పోవుటయే దానికి కారణం.

భరతుడు, నందికేశుడు తమ నాట్యశాస్త్రాల్లో తెల్పిన పూర్వ రంగము, ఆసారితము, పంచముఖ తాళములకు, ఖండ నర్తన రీతి యివన్నియూ నేటివరకు దక్షిణాదినే నిల్చియున్నవి. 'అందోళికా' నృత్తము కర్నాటక ప్రాంతములో యక్షగాన నర్తకులు ఒక్కరే ప్రదర్శించుచున్నారు

జయదేవకవి తరువాత వచ్చిన భక్తులు చాలామంది కృష్ణ వత్సల కథను ఆధారంగా శృంగార కేళిక రచన చేసినారు. అదే కృష్ణ పారిజాతము కథ కాని అది ప్రాంతీయంగా మాత్రము నిల్చిపోయింది. రాధా మాధవునంతటి ప్రసిద్ధిగాంచలేదు తీర్థ నారాయణ యతి - కృష్ణలీలా తరంగిణి పేరుతో కృష్ణజననం మొదలుకొని రుక్మిణీ కల్యాణంవరకూ కాను రచన చేశాడు అది యునూ సంస్కృతమందే యున్ననూ, దక్షిణ దేశంలో విశేష ప్రచారం గాంచినను, ఉత్తర దేశీయుల నాకర్షించ లేదు.

కేరళ దేశంలో "కృష్ణ నాటక" మనే మరియొక కృష్ణకథ సంస్కృతంలో రచింపబడినది కథకళి నాట్యంలో ప్రచార మందున్ననూ అది కేరళ దేశమునకు మాత్రము పరిమితమై యున్నది.

సారంగదేవుడు తన సంగీత రత్నాకరములో, కొన్ని ప్రాచీన నృత్య సంగీత రచనలు వాటి ఛందస్సు మొదలయిన వివరాలతో లక్షణ లక్ష్యాలతో తెల్పియున్నాడు అవియును దక్షిణాది ఆలయ నర్తన రీతులందు మాత్రము కొన్ని నిల్చియున్నవి సాధారణ కేళికయందు ప్రచారములో లేవు.

యావద్భారత దేశాన్ని ఆకర్షించిన; ఆరాధింపబడే సంగీత రచన జయదేవుని గీత గోవిందమొక్కటియే.

భారతదేశ మంతటనూ భరతుని నాట్యశాస్త్రం, అభినయ దర్పణం, భరతార్ణవం గ్రంథములే ముఖ్యంగా ఆచరణలో వున్ననూ నాట్యసంప్రదాయాల మాత్రమొక్కటిగా లేదు ఆ శాస్త్రాల ననుసరించి వివిధ ప్రాంతాల్లో వివిధ రూపాల్లో అభివృద్ధి చెందింది నృత్యకళ.

దక్షిణదేశం - ఆంధ్ర తమిళ, కర్నాటక ప్రాంతంలో దర్బారునాట్యం, నట్టువమేళరీతి భరతనాట్యం ఒకేరీతిగా వృద్ధిచెందినది. దానికి కారణము విజయనగర సామ్రాజ్యముయొక్క పాలకులు, వారి సామంతులు మధుర, తంజావూరు ఇతర ప్రాంతాల నేలిన పాలకులందరూ ఆంధ్రులగుటయే దక్షిణదేశాన్ని ఆంధ్రులు పాలించిన కాలంలోనే ప్రస్తుత కాలంలో భరతనాట్య మనే పేరుతో ప్రచారమందున్న నర్తనరీతి రాజదర్బారుల్లో వృద్ధిచెందింది. ముఖ్యంగా అచ్యుత, రఘునాథరాయ, విజయరాఘవ నాయకులు, తంజావూరునేలిన కాలంలో ఈ ప్రదర్శనరీతి ఒక క్రమపద్ధతిలో అభివృద్ధిచెంది తెనుగు నాయకుల తరువాత వచ్చిన మహారాష్ట్రుల కాలంలో పూర్తిగా వికాసం చెందింది. మహారాష్ట్రుల తరువాత దక్షిణాపథంలో భరతనాట్యం ఏవిధంగానూ అభివృద్ధి చెందలేదనే చెప్పాలి ఆ సంప్రదాయమే నేటికి ఆచరణలో వున్నది. నాయకరాజులకు పూర్వం తమిళదేశంలో వున్న నృత్యం గూర్చి భరత సేనాపతీయం, శిలప్పదికారం ఇత్యాది గ్రంథాల్లో వర్ణించబడింది. గాని ఆ కళకు నేటికాలంలో ప్రచారంలో వున్న భరతనాట్యానికి యెట్టిసంబంధం లేదు. ఆంధ్ర, తమిళ, కర్నాటక ప్రాంతాల రాజనర్తకి నాట్యసంప్రదాయమేగాక ఒరిస్సా, మలబారు ఈ ఐదు ప్రాంతాల్లోని నట్టువ మేళవిద్యలో ప్రదర్శన క్రమంలో చాలా పోలిక లున్నవి.

ఆంధ్ర తమిళ ప్రాంతాల్లోని భాగవత సంప్రదాయాలు ఒకే రీతిగా వున్నవి. కర్నాటక, మళయాళ ప్రాంతాల్లోని విద్య వేరొక విధంగా వున్నది. ప్రస్తుతకాలంలో కొందరు రచయితలు తెనుగు దేశంలోని భాగవతులు (ముఖ్యంగా కూచిపూడి భాగవత రీతి) తంజావూరు ఆహ్వానింపబడి, అచ్చటి భరతనాట్యం అభివృద్ధిపరి చారని వ్రాస్తున్నారు. అది వాస్తవానికి దూరము - భరతనాట్య సంప్రదాయము వేరు. భాగవత రీతి వేరు. అచ్యుతప్ప నాయకుని కాలంలో ఆహ్వానింపబడిన అచ్యుతాపురంలో స్థిరపడి, భాగవత మేళ ములుగా ఏర్పడి. భాగవత విద్యను ప్రచారముచేసినారు గాని, కేళికారీతిని గాదు. ఆ కళను ప్రచారముచేసినవారు రాజనర్తకీమణులు, దేవదాసీలు. నేటికిని మేలట్టూరు (ప్రాచీన అచ్యుతాపురం)లో వున్న భాగవతులు భాగవతం ఆటనే ఆడుతారు గాని భరతనాట్యం గాదు. ఈ రెండు సంప్రదాయాల భేదాలు తెలియని వారు ఒకదానితో యింకొకటి కలిపి పొరపాట్లు చేస్తున్నారు. ఇది కళా చరిత్రకు చాలా హాని కలిగించుచున్నది నేటికినీ తమిళ ఆంధ్ర కర్నాటక దేశాల్లో పదవర్ణములు, శబ్దములు, పదాభినయం, తిల్లానలు మొదలైన కచేరి సంప్రదాయపు ఆట దేవదాసీలు ఆడుతున్నారుగాని భాగవతులు గాదు. భాగవతులది కలాప యక్షగాన, నృత్యనాటక సంప్రదాయం ఆట. రెండింటికీ అడవసాము, గతి, జతి విన్యాసాల్లో అభినయ రీతిలో యెంతో భేద మున్నట్లు యిదివరకే తెల్పి యున్నాను. విజయనగరరాజుల దర్బారులందు, తంజావూరు, మధుర నాయకుల దర్బారులందు వుండిన రాజనర్తకీమణులు, ఆలయాల్లోని దేవదాసీలు, వారి నాట్యాచార్యులు భరతనాట్యము నభివృద్ధి పరిచారు ఆటక్రమము, సంప్రదాయ పద్ధతులు, అభినయరీతులు తెలియని రచయితలు కొందరు అన్నీ ఒకటిగనే భావించుచున్నారు. తంజావూరుకు సమీపంలో వున్న మేలట్టూరు, వూత్తుకాడు, శూలమంగళం, నల్లూరులో నున్న మేళముల వారందరూ యక్షగానముల నాడుదురేగాని ఏకపాత్ర భరతనాట్య కేళిక గాదు అట్టిదే కూచిపూడి సంప్రదాయము, తూర్పు భాగవత సంప్రదాయం. వీరును ముఖ్యంగా యక్ష గానములు, కలాపములనే ఆడుదురు

ఆంధ్రదేశానికి ఒక చివరగావున్న బొబ్బిలి సంస్థానం మొదలుకొని విజయనగరం, మాడుగుల, తుని, పిఠాపురం, పెద్దాపురం, మందపేట, ఏలూరు, నెల్లూరు, వేంకటగిరి, కాళహస్తి, కార్వేటినగరం, తంజావూరు, మధుర, పుదుక్కోట, రామనాథపురం, మైసూరు ఈ అన్ని సంస్థాన ప్రాంతాల్లోనూ దేవదాసీల, రాజనర్తకీమణుల కేళికరీతి ఒకేరీతిగా వుంది. కొద్ది ప్రాంతీయ ఆట క్రమ మార్పులతో- ఇందులో భాగవత సంప్రదాయ మెచ్చటనూ కలియదు.

ఈ అన్ని ప్రాంతాల్లో సంచారముచేసే భాగ్యం కళను పరిశోధించి ఆరాధించే అదృష్టము నాకు కలిగింది. ఆ కళారీతులను వివరంగా తెలిసికున్నతరువాత ఈ నిశ్చితాభిప్రాయానికి రాగల్గినాను.

ఆటక్రమమార్పు లెట్టివనగా : తంజావూరు, తమిళ ప్రాంతీయ నర్తకులు. అలరింపుతో ప్రారంభించి జతిస్వరము, శబ్దము, వర్ణము, పదములు, తిల్లానతో ముగింతురు. అలరింపు శుద్ధనృత్తము, అట్లే జతిస్వరమూ, శబ్దము దేవతలపై వర్ణన గీతములుగాని, రాజులపై స్తోత్ర గీతములుగాగాని రచించబడి యుండును. పదవర్ణము నృత్య, నృత్తాలు ప్రదర్శించుటకు అనువగు రచన, పదములు జావళీలు అభినయము చేయబడును తిల్లాన నృత్తముతో ముగియును.

తెనుగునాట, కర్నాటదేశ దర్బారు ఆటలో అలరింపులేదు. మరియు దర్బారులో కేళిక చేయునప్పుడు నర్తకి ముందుగా శబ్దమును ఆది ప్రమొగ్గినతరువాత జతిస్వరము వర్ణనము ఆడేవారు, తిల్లాన అంత ముఖ్యంగా ఎంచక అభినయంతో ముగించేవారు, ఆంధ్రలో నర్తకీమణుల అభినయానికి ప్రాధాన్యత యిచ్చేవారు.

ఈ క్రమమునే ఒడిస్సీ నృత్యము, మలబారులోని మోహిని ఆట్టము చాలావరకు పోలివుంటుంది

ఆ యా రాజులపై స్తోత్రములుగా రచన చేయబడిన శబ్దములుతప్ప మిగిలిన రచనలన్నియూ ఒకటిగానే వుండును.

## ఆంధ్రదేశంలో నృత్యకళ

ఆంధ్రదేశంలో ఆలయ నృత్యము, భరతనాట్యము, భాగవత నర్తనము ఈ మూడు శాస్త్రీయ నృత్య రీతులు వృద్ధిపొందినవి, భాగవతపు ఆట పురుషుల నర్తనమని తెల్పియున్నాను. భారతదేశంలో మరెచ్చటనూ లేని ఒక విశిష్ట సంప్రదాయం ఆంధ్రలో వుంది. అదే స్త్రీ నర్తకీమణులు భాగవత కేళిక చేయుట, భామా కలాపం, గొల్ల కలాపం, రాధామాధవం, జీవ యెరుకల కురవంజి ఆట యివన్నియూ దేవదాసీలు గూడా భాగవతాన్ని అభ్యసించి ఆడుతున్నారు తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలకు చెందిన వారే యెక్కువగా ఆడుదురు

శివాలయాల్లో, విష్ణు ఆలయాల్లో, దేవి ఆలయాల్లో నృత్య పూజ వుండింది. కాకతీయుల కాలంలో నృత కేళికకు గాను, ప్రతి శివాలయంలోనూ మూలవిరాట్టుకు యెదురుగా ఒక వలయాకారపు పీఠము రాతిది ఏర్పరచి ఆలయాలు నిర్మించినారు వాటినే బలి పీఠములంటారు. ఆ పీఠము నర్తకి నృత్యపూజకు వేదికగా వుపయోగపడేది. ఆనాటి నృత్యరీతుల గురించి జాయపసేనాని 'నృత్త రత్నావళి' చదివిన మనం కొంతవరకు గ్రహించగలము, మరియు ఆ కాలంలో ఆలయ నర్తనరీతి, భరతార్ణవము ననుసరించి చేయబడింది శివుని ఆరాధనలో నృత్య మొక భాగమై వుండింది. దేవదాసి తెగకు చెందిన నర్తకికి ఆగమశాస్త్రముల ననుసరించి నర్తన విద్యలో శిక్షణిచ్చిన పిదప లింగధారణ చేసి ఆలయముల్లో నృత్యపూజల్లో పాల్గొనే అర్హత కలిగించేవారు. విష్ణాలయాల్లోని

వ_ర్తకీమణులు శంఖము. చక్రం. నాభముతో గూడిన చక్రం. ఈ మూడు ముద్రలు వేసిన పిదప ఆలయాల్లో నాట్యం చేసేవారు. మన ప్రాంతంలో దేవదాసీలు వేరు. సాధారణంగా నృత్యకేళిక జేసే వారకాంతలు వేరు వృత్తినే అందరూ ఒకే తెగగా కన్పట్టి నమా అందరికీ ఆలయ కేళికలో పాల్గొనే అర్హత వుండేదిగాదు. అట్టి సంప్రదాయం తమిళనాడు, కర్నాటక ప్రాంతాల్లో కన్పించదు.

యక్షులు, నాగాసులు అనే రెండు తెగలవారు అతి ప్రాచీన కాలంనుండీ ఆంధ్రదేశంలో వున్నారు. వీరు గంధర్వజాతికి చెందిన వారు. నృత్యము సంగీతము వీరి ముఖ్యవృత్తి. యక్షులు యక్షగాన కేళిక చేయగా నాగాసులు దర్బారు ఆట నాడేవారు. ఈ యక్షులనే జక్కులవారనిగూడా అందురు. యక్షగానము పదపదగాన రీతి. ప్రస్తుతకాలంలో జక్కులవారు అంతగట్టకపోయిననూ యక్షగాన రీతి మాత్రం మనదేశంలో ప్రచారంలో వుంది. ఇది సంగీత ప్రాధాన్యత గల్గిన వర్తన రీతి. ఒక కథను గానముచేయుచూ, వర్తనమాడి ప్రేక్షకులకు వినోదము చేకూర్చుట ఈ బాణీలోని విశేషము. జక్కుల పురంధ్రి వర్తనముగూర్చి కవిసార్వభౌమ శ్రీనాథుడు చక్కగ వర్ణించినాడు. ప్రస్తుతకాలంలో ఈ బాణి తూర్పుప్రాంతంలోని భాగవతులలో ప్రచారములో వుంది.

## దేవళములో దేవు నెదుట ఆట

సంధ్యవేళ హారతి ముగియగానే 'పుష్పాంజలి'మై వర్తకి స్వామి కెదురుగా నిల్చిన తరువాత వాద్యబృందమువారు అంబర విన్యాసము, మేళప్రాప్తిజేసెడివారు. అటుపై చూర్ణికలు పఠించి పుష్పములు సమర్పించి కేళిక జేసెడి అదొక క్రమము ననుసరించి ప్రదర్శించబడేది. ఇవంతయూ శుద్ధనృత్త పద్ధతి. ఇందు అభినయము. నృత్యము ప్రదర్శించరు. కళ్యాణమంటపమువద్ద స్వామి కొలువై యున్నప్పుడు దర్బారుచేతురు. అప్పట నృత్తము, నృత్యము, అభినయము ప్రదర్శింతురు.

ఈ శుద్ధ నృత్తములో అన్నింటికంటే అతిముఖ్యమైనట్టివి ప్రాచీనమైనట్టివి కొన్ని జతులకు (మృదంగశబ్దములకు) ఆట క్రమము. ఈ జతులను రాగవరుసలో గానముచేస్తూంటే వేదగానము చేస్తున్నట్లు, ఋక్కులను పఠిస్తున్నట్లు ఏదో ఒక విధమైన దివ్యానుభూతి, ఆధ్యాత్మికానందం కల్గుతుంది.

త్రిమూర్తులు, వారి దేవేరులు, అష్టదిక్పాలకులు, నవగ్రహాదులకేగాక పంచభూతములు ,వీటన్నింటి కతీతమైన పరబ్రహ్మ స్వరూపమును నాదరూపంలో స్తుతిస్తూ ఆ నాదముయొక్క వివిధ శబ్దరూపములను మృదంగముపై ధ్వనింప కేయుచూ ఆ శబ్ద రూపమును న_ర్తకులు తమ హస్తపాద విన్యాసములద్వారా ప్రదర్శించుటే యుందలి ముఖ్య విశేషము.

1. ఆఽహోం-అ హోంఽ

... ... ... ...

2. దోఽహం దొద్దోఽహం

... ... ... ...

3. తాంఽలెహియం దత్తాం

... ... ... ...

ఇట్టి శబ్దజాలములను ఉదాత్త, అనుదాత్తముల ననుసరించి గానము చేయుచూ ఆ శబ్దముల గానములో మిళితమగు రీతిని మృదంగమును, శుద్ధమద్దెలను వాయిస్తూ ఆ లయకు తగురీతిని చారి రేచక విన్యాసముల ప్రదర్శిస్తూంటే వేదకాలంలో ఋష్యాశ్రమాల్లో సంధ్యహోమ సమయాల్లో పంచభూతములను స్తోత్రము చేయుచూ చేసిన వేదగానమువలె ఆత్మకు ప్రబోధించును.

ఈ జతిమార్పులు శబ్దజాలముల కల్పనంతయూ తాళ చందస్సు ననుసరించి కూర్చబడినట్టిది మంత్రశాస్త్రమునందు వలె ఏ అక్షరము దీర్ఘము, ఏ అక్షరము హ్రస్వము వాటిని పలికే పద్ధతి, క్రమము తూకము అన్నీ వివరంగా గురుముఖంగా అభ్యసించవలసి యున్నది. కొన్ని బంధరచనలై చక్రాకార, త్రిశూల, ముక్తపద, డమరుక, నాగబంధ యిత్యాది రూపములో నుండును.

అష్టదిక్పాలుర ఆరాధనలో ఉపయోగించే తాళములుగూడా యిట్లే వుండును.

అగ్ని, వరుణ, వాయువు మొదలైనవారి తాళజతులు పలికిస్తుంటే నిప్పునెరుసలు మిలమిలమెరిస్తూ గాలిలోని కెగియుచున్నట్లు అగ్ని ఆరాధన జతులందూ,

మలయపవనుడు మందరములో వీచుట నారంభించి ఉధృతరూపం దాల్చినట్లు వాయుజతు.

మేఘ ఘర్షణలు, మెరుపు తీగెల తళతళలు. చిటపట చినుకులు - కుండపోతవర్షము, వరుణ తాళములో ఇట్టి అనుభూతులు మనకుకల్గును.

ఈ ఆటక్రమము ఆరాధన పద్ధతి) రెండు విధములుగా నున్నది పూర్తిగా, తత్కారం, జతి, చందస్సు, తీర్మానముల యివన్నియూ ఆడినప్పుడే ఈ అనుభూతులు కల్గుచున్నవి. కొన్ని ప్రాంతములవారు తత్కార జతి, చందస్సులలోని కేవలం పల్లవి తీరికలు మాత్రము ఆడెదరు. అసలు బీజాక్షరములతోగూడిన జతి కట్టుబాట్లన్నియూ చందస్సునందే యిమిడి వున్నవిగాన తీరికలు మాత్రమే ఆడిన లాభ ముండదు శైవ సంప్రదాయము - శ్రీ కాళహస్తీశ్వర ఆలయ సంప్రదాయము ననుసరించి కాళహస్తి యందునూ, వైష్ణవ సంప్రదాయం శ్రీ కుంతి మాధవస్వామి సంప్రదాయం ననుసరించి పీఠికాపురమందునూ నే నభ్యసించి యున్నాను. దాక్షిణాత్యుల్లో నేటికాలంలో కొందరు తీరికలభాగం

మాత్రము ప్రదర్శించుచున్నారు. అష్టదిక్పాలుర ఆరాధన, నర్తనములను 'బలిహరణ' సమసంధి నర్తనము లందురు

మూలవిరాటు ముందు ఆడే ఆటల్లో ముఖ్యమైనట్టిది "అడిత చారి" అధిష్టాన దేవతకు అంతిరాగంలో చూర్ణిక పఠించి, పుష్పాంజలి సమర్పించి నాట్యరాగములో రెండు విభాగములు గల్గిన ఐదు అక్షరముల తాళగతిలో –

'తాం తాతై - తైజగ దత్తాం'

అనే అక్షరముల కూర్పుగల్గిన సంగీత రచనకు నృత్తమాడబడును ఇది చారీనర్తన విశేషం. ఐదు అక్షరముల తాళగతిలోనే యెందుల కాడెదరని ఒక సందేహము కల్గవచ్చును.

సమ, విషమ అని గతులు రెండు విధములు –

2 అక్షరములది సమగతి

3 అక్షరములది విషమగతి

ఈ రెండుగతులయొక్క విన్యాసములే నాట్యసంగీతముల్లోని వివిధ తాళ, గతి, జతి, జాతి, యతి విన్యాసములు. అందువల్ల (2 + 3 = 5 అక్షరముల గతిలోనే (సమవిషమముల మేళవించగా ఏర్పడిన గతిలో) ఈ ఆదినర్తనము కూర్చబడింది.

5 అక్షరముల గతిలో 'అడిత చారి' ఆట వున్నది గనుకనే ఆ ఆటను పోలిన 'అలరింపు' నృత్తము. 3 అక్షరములు త్రిశ్రజాతిలోనూ, 7 అక్షరములు మిశ్రజాతిలోను కూర్చి ఆడుతూ వచ్చారు ప్రస్తుతకాలంలో ఆడుతున్నారు

'అడితము' తరువాత ప్రదర్శించే ముఖ్య నృత్త విశేషము "శుద్ధము" దీనినే శుద్ధ నృత్తమని గూడా అందురు

ఈ శుద్ధ నృత్తము :– దక్షిణాభ్రమన వామభ్రమన, లీలా భ్రమన, భుజంగ భ్రమన, విద్యుద్భ్రమన, లతా భ్రమన, ఊర్ధ్వ తాండవము అను ఏడు విధములైన భ్రమనముల గల్గి –

మయూరగతి, మరాళగతి కురంగగతి, గజగతి, సింహగతి, శుకగతి అను ఆరు విధములైన గతి విన్యాసముల గల్గి –

మయూర లలిత. గంగావతరణ కరిహస్త, సింహ విక్రీడిత, కీరయూషణ ఐదు కరణముల ప్రదర్శన గల్గి–

శిరావర్త, ఉరుధృత, వక్త్రిబంధ, స్యంధిత, ఉస్యంధిత, చారీ విన్యాసములు గల్గి –

ఆ తాళములు భూచారి ప్రదర్శనమునకు

ఆ తాళములు ఆకాశచారి ప్రదర్శనమునకు–

వినియోగించబడిన నృత్త విశేషము

మల్లికామోద, హంసనాద, ఝంప, ద్వితీయ, పూర్ణ కంకాల, ఉద్ఘట్ట, అభంగ, సింహవిక్రమ, శరభలీల, ఝంప, కోకిల ప్రియ, ఝంప ఈ తాళములు ఈ నృత్తమందుపయోగించబడును.

ఇందు ఝంపతాళము ఛందోభేదముతో మూడుసార్లు ప్రయోగములోనికి వచ్చును.

... ... ... ...

కవుతము ఆలయాల్లో ప్రదర్శించబడే ఒక ప్రత్యేక నృత్తము ఈ కవుతములు ఆ యా దేవతలకు సంబంధించిన తాళములందు ప్రదర్శింపబడును. కవుతములో ఆ యా దేవతలకు సంబంధించిన స్తోత్రగీత ముండినను అది యును శుద్ధ నృత్తమే మృదంగ జతులతో చేర్చి దేవతా స్తోత్రము రచన చేయబడును. కవుతము ఆడునప్పుడు ఆ తాళ విభాగముల ననుసరించి నృత్తమాడుదురు భాగవత సంప్రదాయ నర్తకులు కవుతముల నాడునప్పుడు సాహిత్యానికి నృత్యము ప్రదర్శింతురు. కాని శాస్త్రీయ ఆలయ సంప్రదాయం ననుసరించి ఆదే ఆటలో తాళముయొక్క చందస్సు ననుసరించి (లఘు, గురువు, ప్లుత యిత్యాది విభాగములు) కరణచారీలు మాత్రము ప్రదర్శింతురు ఇదియే శాస్త్రీయపద్ధతి

ఉదాహరణ - వినాయక "కవుత"ము

ఈ వినాయక కవుతము 72 అక్షరముల వినాయక తాళములో ప్రదర్శింపబడును. ఈ తాళము యొక్క విభాగములు –

గ గ గ ల ల ప గ ల ల ప

గ = అనగా గురువు 8 అక్షరములు.

ల = లఘువు 4 అక్షరములు.

ప = ప్లుతము 12 అక్షరములు

8-8-8-4-4-12-8-4-4-12 = 72 అక్షరములు.

ఒక ఆవృత్తంలో 72 అక్షరము లుండును ఈ తాళము యొక్క విభాగము ననుసరించి ఆట ప్రదర్శించబడును. గురువుకు, లఘువుకు, ప్లుతమునకు వేరు వేరు విధమైన చారీరేచక విన్యాసమున్నది. దాని ననుసరించి మాత్రా ఛందస్సు ననుకూలించు రీతిని కూర్చబడును. ఇట్టి రచనలందు 'గణ' విభజన మాత్రా ఛందస్సు ప్రాముఖ్యత వహించును

కొన్ని ప్రాంతాల్లో "పంచముఖ" తాళనృత్తముతో కుంభ హారతి నిచ్చే పద్ధతిగూడా వుంది.

చాచ్చత్పుట, చాచపుట, షట్పితా పుత్రిక, సంపక్వేష్టక, ఉద్ఘట- ఈ తాళములు శివపంచముఖ తాళములనబడును. ఈ తాళముల ఆటగూడా అతి ప్రాచీనమైనట్టిది నృత్యనాటకముల ప్రదర్శనమందు పూర్వరంగములో ఈ తాళముల్లో ఆట ప్రదర్శింపబడేది

ఆలయ నృత్యపూజకు సంబంధించిన కొన్ని ముఖ్య నాట్యములగూర్చి మాత్రం యిందు సంక్షిప్తంగా తెల్పినాము.

దేవుని దర్బారులో జరిగే కేళిక ఆస్థాన నర్తనమునకే

నృత్తముతో ఆరంభించబడి నృత్యము. అభినయముతో ముగించబడును. ఈ రెంటి యందునూ కొద్దిమార్పులు మాత్రమున్నవి.

నాట్యశాస్త్రముల్లో 'పేరిణి' అనే ఒక నాట్యక్రమము వర్ణించబడింది. ఆ పద్ధతి ననుసరించి అభివృద్ధి చెందినట్టిదే దర్బారు ఆట 'పేరిణి' ఐదు భాగములను కలిగివుంటుంది. ఈ ఐదు భాగముల్లో నృత్త నృత్య అభినయములు ప్రదర్శింపబడుచున్నవి.

తంజావూరు నాయకరాజుల చరిత్రలో వారి ఆస్థానములో ప్రదర్శింపబడే నాట్యములు ముప్పయివరకూ వర్ణించియున్నవి. అందు ఒక్కొక్క నాట్యములో ఒక్కో నర్తకిమణి ప్రసిద్ధురాలైనట్లు తెల్పియున్నారు ఆ కాలంలో రాజనర్తకిమణులు నృత్యకేళిక జేయుటయేగాక కవిత్వ రచనగూడా చేసెడివారు. రామభద్రాంబ సంస్కృతంలో కవిత చెప్పగా మధురవాణి 'శతలేఖిని' గా ప్రఖ్యాతి గాంచినది రంగాజమ్మ పంచభాషలందు యక్షగాన రచన జేసింది.

ఆ కాలం దర్బారు నాట్యమేగాక, యక్షగానములు గూడా యెంతగానో ఆదరము పొందినవి. ప్రభువులు ఆ కళను ప్రోత్సహించుటయేగాక వారే ఎన్నియో యక్షగానముల రచించినారు. కృష్ణదేవరాయల కుమార్తె గూడా ఒక యక్షగానము రచన చేసినది. ప్రతాపరుద్ర మహారాజు ఆస్థాన నర్తకిమణి మాచల్‌దేవి తన జీవితకథయే యక్షగానముగా రచన చేయించి ఆడించినది. పల్నాటి వీరచరిత్ర శ్రీనాథకవి రాజాస్థానములో కేళికజేసే రీతిని చక్కగా వర్ణించియున్నారు పండితారాధ్య చరిత్ర, బసవపురాణాల్లో ఆ కాలంలోని 'మార్గ' 'దేశి' సంప్రదాయ నృత్యముల గూర్చిన వివరాలు యెన్నియో తెల్పియున్నారు

ఆస్థానముల్లో జరిగిన 'కేళికా' స్వరూపం, నృత్తముతో (రసభావములు లేనట్టి) ప్రారంభించి నృత్యము, అభినయంతో ముగించుటగాని, లేక మరల నృత్తం ప్రదర్శించి ముగించుట గాని శాస్త్రీయ రీతిగా పండితులు తెల్పియున్నారు. ఈ పద్ధతిలోనే ఆస్థాన కేళిక జరిగేది.

పేరిణి : గర్షర, విషమ, భావాశ్రయ, కవివారక, గీత మనే ఐదు భాగములనుగల్గి యున్నది

గర్షరమనగా నృత్యారంభంలో, నర్తకి పటవాటము, పటనము, నూరివట్టము, లకాదిమి సిరిచిరము, హలాభిదము అను ఆరు విధముల పాదముల విన్యాసము చేయుచూ, గజ్జెల ధ్వనింపచేయుచూ ఆడుట.

విషమము భావాశ్రయము :- రసభావములు లేక తాళము లయల ననుసరించి ప్రదర్శించబడే నృత్తము. రసభావములతో కూడి కరణాంగ విన్యాసము. ఈ రెండు విధములు యిందు ప్రదర్శింపబడును.

కవివారకములో - ఆంగిక ప్రాధాన్యత, సాత్విక భావ వికాసము గలిగిన రచనలకు అభినయము -

గీతము : మరల నృత్త ఛందస్సుతో ముగియును.

ఈ క్రమము నాడునప్పుడు. పూర్వకాలములో గర్షర విన్యాసము, బ్రహ్మానంద తాళములో-

"ధరికుకు - కుణాం - ఝుకుకు - కుజా -
కిటతరి - జగణం - తో తరికుతజం - కిటతక
తకఝుం ..............."

ఇత్యాది శబ్దములతో కూడిన జతికి పాదవిన్యాసము - బ్రహ్మస్థానముతో ప్రారంభించి కపిత్థ, శిఖర హస్తముల విన్యాసములు ప్రదర్శించేవారు ఈ నృత్తమే తరువాత కాలంలో అలరింపుగా రూపొందినది, కొన్ని మార్పులతో-

ప్రస్తుతకాలంలో ప్రచారంలో వున్నట్టి, రెండు మూడు వందల సంవత్సరాల క్రిందట నూతన రచనల చేరికతో ఏర్పడిన సంప్రదాయం -

అలరింపు, జతిస్వరము, శబ్దము, వర్ణము, అభినయం, తిల్లాన -

అలరింపు :- ఇది కేళిక ప్రారంభంలో చేయబడే చిన్న నృత్తము,

'పుష్పాంజలి' తరువాత చేసే 'అడ్డిగచారి' వంటిదే ఇందులోగూడా -

"తాం ది తాం" ఈ శబ్దాలతో కూడిన గానం చేయబడే రచనకు ఆట నృత్తము) ప్రదర్శించబడును

దీని తరువాత ప్రదర్శింపబడినట్టిది 'జతిస్వరం'. దీనినే పల్లవి ఆట అనిగూడాఅందురు. ఇదియునూనృత్తమే. ఒకప్రత్యేక రాగము యొక్క స్వరములుగాని, మృదంగ శబ్దములుగాని ఒక తాళములో బంధించబడి యుండగా, దానికి వివిధ గతి, జతి యతి, విన్యాసములు ప్రదర్శించుట జతిస్వరములోని విశేషము. ప్రాచీన కాలములో యతి నాట్యమని ఒక పద్ధతి నృత్తముండింది తమరుక యతి, మృదంగ యతి, ఇత్యాది రూపాల్లో మృదంగ శబ్దములు కూర్చబడి వాటికి చారీరేచకములు ప్రదర్శింపబడేవి ఆ [illegible] కొద్ది మార్పులతో జతిస్వరముగా ఆడబడుతుంది.

శబ్దము :- దేవతా సంబంధమైన వర్ణనా గీతాలు, లేక రాజులపై స్తోత్రగీతాలు మృదంగ శబ్దములతో చేర్చి పాటగా లిఖించబడి, 'సలాముర' అనో లేక "జోహార్ - పరాక్" అనో ముగింపబడిన పాటలకు ఆంగిక ప్రాధాన్యత గల్గిన నృత్యము, మృదంగ జతులకు నృత్తము ప్రదర్శించబడుట శబ్దము గనుకనే వీటిని 'సలాం' జతులని గూడా అందురు.

"సరసిజాక్షులు జలకమాడే
సమయమున సిగచుటుకు జని,
సరిగచీరెలు మెల్ల చేకొని

వరుగులెత్తుట న్యాయమా ?
తరువులెక్కుట ధర్మమా ?
ఓరోరి నీ వగలేలరా ?
ఔరౌర నీ ఎగలేలరా ?

... ... ... ...

ఇలను ఏమది తరిచి చూడగ,
నలుగురు విన్ వగుదురమచు
లలిత మలయాళమున దాగిన
భళిభళి శ్రీ పద్మనాభ సలామయా."

ఇది స్వాతి తిరునాళ రచన. కృష్ణుని బాల్యక్రీడల వర్ణనా గీతము.

"రాజశ్రీ భోసలకుల చంద్ర
రతిపతి సుందర రాజవరేంద్ర
రాజ తులజమహారాజ తనుజ
ప్రతాపసింహ సూత్రమా సలాం
తళాంగ్ తక ఝిమి తక తదిగిణతోం."

ఇటువంటి పాటలను జతులతో మృదంగ తీర్మానాలతో చేర్చి ఆడుట శబ్దము అట.

ప్రస్తుత కాలంలో కొందరు 'సలాం' అన్న పదము వారి చెవులకింపుగా లేకగాబోలు దాన్ని తీసివేసి "నమోస్తుతే" అని చేర్చి ఆడుతున్నారు. అది ఆ రచనకు మహాపచారము చేయుటయే గాక చరిత్రాత్మకంగా ఆ రచనలవిలువ తగ్గించుటయే అగును.

ఈ రచనలను మనము చక్కగా పఠించిన ఆ యా సంస్థానాధీశుల, వారి వంశచరిత్ర తెలిసికొనుటకు యివి యెంతగానో ఉపయోగపడుచున్నవి. మరియు ఈ రచనలయొక్క కాలముగూడా నిర్ణయించవచ్చును.

తంజావూరును మహారాష్ట్ర రాజులు పాలించే కాలంలో తొలిసారిగా ఈ రచనలు చేయబడినవి "సలాం" అనే మాట, దాని నభినయించు రీతి, తీరిక విధానం – ఆ కాలంలోనే ప్రత్యేకంగా హైందవనర్తనరీతిగా వుండిన భరతనాట్యంలో చేర్చబడింది.

అంత్య ప్రాసతోగూడిన సలాంజతి, రచనావిధానంగూడా మహారాష్ట్ర లావణీ రచనావిధానాన్ని పోలి వుంటుంది. ఈ విధమైన రచనను ఉత్తరాదిని ఛందోనర్తనరీతి అంటారు

ఉదా :– తక్కిట కిటతక తాండవ వినోద
ధిక్కిట కిటతక దరికిట కిటతక త్రిశూలడమరు–
ధిమిధిమి తదిమిత త్రినేత్ర శంకర.........
(తెలుగు శబ్దం)

దిగన నగన దిన్న-ధిన్నత ధీంకిట
గగన మగన నహ-నాదత శంకరు
దిదాంగ ధీంకిట ధిన్నదెత్
చంద్రత బనకతు హారతి............ (హిందీ)

ఈ రెండు విధములు ఇంచుమించు ఒకేరీతిగా వుండును. ఈ రచనలు తొలిసారిగా రచనలు చేసినవారు కాశీనాథ కవి, వీరభద్రయ్య. నేటి కాలంలో మహారాష్ట్ర రాజులపై సలాం జతులు, కూచిపూడి భాగవతులు రచన చేసిన వచ్చి రచించు చున్నారు అది సత్యదూరం తంజావూరు ఆస్థాన సంగీత నాట్యాచారులచే రచింపబడిన అవి దక్షిణాదిని ప్రచారంలోనికి తేబడినవి. అవి కూచిపూడివారుగూడా తమ కేళికలో ప్రదర్శించుచూ వచ్చారు. ఆ జతుల రచనతీరు, ఆట పద్ధతి యితర సంస్థానాధిపతుల నాకర్షించింది. వారును అట్టివి రచనలు చేయించి తమ ఆస్థాన నట్టువరాండ్రచే ఆడించి ఆనందించేవారు బొబ్బిలి, విజయనగరం, కార్వేటినగరం, కాళహస్తి యిత్యాది సంస్థానాల్లోని నర్తకినులు ఎన్నో సలాంజతుల నాడేవారు. ఈ పద్ధతి రచనలు నా పెద్ద రెండువందలవరకూ వున్నవి ఈ రచనలకు ముందుగా 'జక్కిణి' అనే ఒక రచననూ ఆడేవారు. ఇది ప్రాచీనమైనట్టిది ఇది శబ్దమును పోలివున్ననూ, ఆట క్రమము జతికూర్పులో భేదమంది రఘునాధ, విజయరాఘవ నాయకుల దర్బారులో 'జక్కిణి' ఆటలో ప్రసిద్ధిగాంచిన నట్టువరాండ్రు వుండినట్లు చరిత్రలు తెల్పుతున్నవి. పదములు (అభినయము) – అచ్యుతప్ప, రఘునాధ, విజయరాఘవ కాలంనుండే పదములను అభినయించుట (సాత్వికాభినయం) ఒక ప్రత్యేక కళగా అభివృద్ధి చెందినది.

వారికి ముందు 'పదవరవు' లనబడే రచనలను ఆడేవారు. అది పూర్తిగా సాత్విక ప్రాధాన్యతతో కూడిన అభినయం గాదు. అభినయం ముగిసిన పిదప వివిధ గతులను ఆడి ముగించే విధానమది. క్షేత్రయ్య అనే మహాకవి పదముల రచన చేసిన తరువాతనే సాత్వికాభినయం కేళికలో ఒక ప్రత్యేక అంశంగా అభివృద్ధి చెందింది. క్షేత్రయ్యకు ముందుగా అన్నమయ్య పదములు రచన చేసిననూ అవి సంకీర్తన సంప్రదాయంగానే చూడబడినవి గాని, అభినయ సంప్రదాయ రచనలుగా నాట్యాచార్యులు స్వీకరించ లేదు. ఈ క్షేత్రయ్య మువ్వపురివాసి ఈ మువ్వ కూచిపూడి గ్రామంకు దగ్గరగా వుంది మువ్వ చిత్తూరుజిల్లాలో వుందని కొందరు, ఉత్తర అర్కాటులో వుందని కొందరు రచనలు సాగించేవారు. కీ॥ శే॥ శ్రీ విస్సా అప్పారావుగారు విశేష పరిశోధన చేసి, మువ్వగ్రామం కూచిపూడివద్దనే అనియు, క్షేత్రయ్య ఆ మొవ్వలోని గోపాలుని పైనే తన పదరచనలు చేసినారనియు, ఇతరుల రచనలు తప్పనియు, నిరూపించి క్షేత్రయ్య చరిత్ర రచనకు మహోపకారం చేసినారు. ఈతడు తంజావూరు, గోలకొండ పాదుషాల దర్బారులు సందర్శించి తన పదకవితచే ఆ రాజులను, అచ్చట నర్తక నర్తకీ జనాన్ని సమ్మోహితుల చేశాడు. నాటినుండి వారా రచన

లకు అభినయం చేయుట ప్రారంభించారు. కాలక్రమేణ 'పదదరువు' కేళికను వీడి యక్షగానం శాశ్వతస్థానాన్ని సంపాదించుకుంది.

పదవర్ణము :- మహారాష్ట్ర రాజులకుముందు "పదవర్ణము" అట లేదు. 'జక్కిణి' 'పదదరువు' గీత ప్రబంధంతో కచ్చేరి ముగిసేది. వారి కాలంలోని ఆస్థాన నాట్యాచార్యులు ఈ నూతన రచనను సృష్టించారు. చిన్నయ్య, పొన్నయ్య, వడివేలు, శివానందం అనే నాట్యాచార్యులు ఈవిధమైన రచన ప్రచారానికి ముఖ్యులు. తాన వర్ణము వారి కాలంనాటికే గాత్ర సంగీతంలో ప్రచారంలోనికి వచ్చింది. పదవర్ణం తానవర్ణము వంటి సంగీతరచనయే. సాహిత్యపు పోకడలు, స్వరముల నడకలు తప్ప రచన క్రమమంతయూ ఒక్కటే. 'పదదరువు'లోని అభినయ క్రమము, నృత్తము, నృత్యము - ఈ మూడు చేర్చి ప్రదర్శించుటకు అనువగు నట్టి రచన రూపొందించ సంకల్పించి పదవర్ణన రచనచేశారు.

పద వర్ణము - పల్లవి అనుపల్లవి - దరువు ఆటవలె అభినయించుటకు అనుకూలించును. ముక్తాయిస్వరము, చరణములు, వాని స్వర సాహిత్యాలకు నృత్తము నృత్యము ప్రదర్శించుటకు అవకాశమున్నది. ఈ రచన పదములతరువాత ప్రచారంలోనికివచ్చింది. వీరి ఈ వర్ణములకంటే బహు కష్టమైన రచనలు కార్వేటి నగర సంస్థానానికి చెందిన గోవిందసామయ్య వ్రాశాడు. వాటినే పెద్ద వర్ణములందురు.

ఈ విధంగానే తిల్లానలు గూడ నృత్యకేళికలో ఒక భాగమైనవి. ఇందు ముఖ్యంగా నృత్తం ప్రదర్శింప బడును

ఈ విధంగా నేటి కాలంలో ప్రచారములో వున్న భరత నాట్యం రూపొందింది.

ఈ కళ యింతటి వృత్తమ కళాసంప్రదాయంగా రూపొందుటకు ఆ కాలంలోని తెలుగు, తమిళ, కేరళ, కర్నాటక, మహారాష్ట్ర ప్రభువులు, సంగీత నృత్యకళావేత్తల కళాతపస్సే కారణం. ఈ కీర్తి దక్షిణదేశంలోని అన్ని ప్రాంతాలవారికి చెందుతుంది గాని కొందరు అభిప్రాయపడుతున్నట్లు ఒక్క తమిళులకుగాని, తెలుగువారికిగాని, కర్నాటకులకుగాని కాదు. క్షేత్రయ్య తరువాత అతని శైలి ననుసరించి యెందరో పదములు, కొందరు జావళీలు రచించారు. అవియునూ ప్రచారంలోనికి వచ్చినవి. గాని క్షేత్రయ్య పదాలకిచ్చిన విలువ పండితులు వాటికివ్వరు. పదాలవల్ల సాత్వికాభినయం అభివృద్ధి చెందినట్లు తెల్పాను. ఈ అభినయంలో మాత్రం ఆంధ్రులు సిద్ధహస్తులు. వీరి స్థాయిని మరొకరు అందుకోలేదు. దక్షిణాదిని పందనల్లూరు, కంచివారిబాణీ, పుదుక్కోట నట్టువనార్ల బాణీ, మైసూరులో జెట్టితాయమ్మగారి అభినయ బాణీ అన్నీ చూచాను. కాని ఆంధ్ర నట్టువరాంధ్ర సాత్విక అభినయ విశిష్టత వీరెవ్వరి ఆటలో కాన్పించలేదు. అది ఒక్కొక్క జాతియొక్క ప్రత్యేకతగా పేర్కొనవచ్చును. అందుకే భరతుడు ఆంధ్రులది కైశికీవృత్తి ప్రధాన నాట్యరీతి అని పేర్కొని వుండవచ్చును

భరతనాట్యముగూర్చి యింత విపులంగా వ్రాయుటకు కారణము- ఆంధ్ర, తమిళ, కర్నాటక ప్రాంతములందు ఈ ఆట కొద్ది మార్పులతో యిదేరీతిని ప్రదర్శింపబడుతుంది. ఆ ప్రాంతములగూర్చి తెల్పినప్పుడు అచ్చటి ప్రాంతీయ ప్రత్యేక నర్తన రీతులగూర్చి మాత్రం తెల్పుతాను.

## భా గ వ త క ళ

పురుషులు ప్రదర్శించే నర్తనరీతి భాగవతం, నాట్యమేళము అనబడుతుందని యిదివరకు తెల్పాను కాకతీయుల కాలంలో వీరు దశవిధ శివలీలలు యిత్యాది శైవకథలను ఆడినారు. వైష్ణవము ప్రచారంలోనికి వచ్చినప్పుడు భాగవత కథలనాడ నారంభించారు. అప్పటినుండి నాట్యమేళమువారు భాగవతులని పిలువబడినారు. నేటికినీ తెలంగాణా జిల్లాల్లో భాగవతులను బహురూపులు, భరతులు అని పిలుతురు. బెంగాల్‌లోకూడా బహురూపులని నాట్యమేళములు పిలువబడును

సామాన్య ప్రజానీకముకు మన మతము, చరిత్ర, కళలను గూర్చి ప్రబోధం చేయుటకు ఏర్పాటు చేయబడినటివి నాట్యమేళములు. ఆనాటి ప్రభువులు ఈ కళాకారులను పోషించారు. మత ప్రవక్తకులు, వీరిని మత ప్రచారమునకు వినియోగించారు.

ఆంధ్రలో ఈ మేళముల్లో ముఖ్యమైనవి మూడు తెగల వారు ప్రదర్శించునట్టివి :-

1. బ్రాహ్మణ మేళములు
2. జంగమువారు
3. దాసరులు

ఈ మూడింటిలో బ్రాహ్మణ మేళములు చాలా శ్రేష్ఠమైనవి.

శైవ మత ప్రభావము తగ్గి వైష్ణవము విరివిగా ప్రబలిన కాలంలో సిద్ధేంద్ర యోగి "సత్యభామ కలాపం" రచనచేసి కూచిపూడి గ్రామంలోని బ్రాహ్మణ భాగవతులకు నేర్పినాడు తద్వారా కృష్ణభక్తి, భాగవతము ఆంధ్రలో ప్రచారము చేయుటకు సంకల్పించినాడు. వారికి గోల్కొండ పాదుషాలనుండి కూచిపూడి గ్రామం దానంగా యిప్పించాడు. మరియు ఆ కళ తరతరాలుగా వారిద్వారా ప్రచారము జరుగుటకు వారి కుటుంబాల్లో పుట్టిన ప్రతి బాలునికి భాగవతం ఆట నేర్పునట్లు వారినుండి వాగ్దానం గొనినాడు. ఇది కూచిపూడి భాగవతముయొక్క సంక్షిప్త చరిత్ర. ఈ భాగవతులు ఆ కలాపం నభ్యసించి దేశంలో ప్రచారము చేశారు. ఆకథ అందరినీ ఆకర్షించింది. అన్ని ప్రాంతాల భాగవతులు ఈ కళ నభ్యసించుటయేగాక తమ ప్రాంతాల్లోని కవులచేత నూతన రచన చేయించుకొని ఆడుట మొదలుపెట్టినారు. ఈ విధంగా "భామా కలాపం" సుమారు యిరవైరకముల రచనా

ప్రదర్శింపబడుతూ ఏది సిద్ధేంద్రులవారి రచనయో తెలిసికొనుటకు కష్టముగా వుంది కూచిపూడివారు ప్రదర్శించే కలాపంలోగూడా నగరికంటివారి, రంగపూడివారి, దాసువారి, వెంకటకవివి యెన్నియో రచనలు చేర్చి ఆడబడుచున్నవి.

కూచిపూడివారు ప్రదర్శించే కలాపంగాక యితర ప్రాంతాల్లోని భాగవతులు ఆడే కలాపములు నేను మొత్తం ఇరవై వరకూ సేకరించితిని వీటన్నింటిలో కొన్ని దరువులుమాత్రం ఒకటిగా వుండును. మిగిలినవన్నియూ ఆ యా ప్రాంతీయుల రచనలే. భాగవతం ఆటలో భామా కలాపానికి వున్న ప్రాముఖ్యత మరొక రచనకు లేదు. తూర్పు ప్రాంతాలలో భాగవతమంటే భామా కలాపమే

ఇంత ప్రఖ్యాతిగాంచిన కలాపం కథేమిటి? కథ చాలా చిన్నదే. కృష్ణుడు సత్యభామలమధ్య చిన్న ప్రణయకలహం. కృష్ణుడు అలిగి వెళ్ళిపోతాడు. అలిగిన కృష్ణుని మరల సత్యభామ తన యింటికి రప్పించుకుంటుంది. ఈ కథ ద్విపద; దరువులు, వృత్తములు, కందార్థములు యిత్యాది యెన్నో రచనల్లో వర్ణింపబడి పండిత పామర జన హృదయరంజకంగా ప్రదర్శింపబడుతుంది. అంతేగాక ఈ కథ ఆధారంగా శ్రీకృష్ణుని జీవితకథ పూర్తిగా ప్రజల్లో ప్రచారం చేయబడుతుంది.

భామాకలాపం గాక కూచిపూడివారు యక్షగానములనుగూడా ప్రదర్శింతురు యతినారాయణ తీర్థుని 'శ్రీకృష్ణ లీలాతరంగిణి' భజన సంప్రదాయంగా ప్రచారంలో వుంది. కూచిపూడి అంవలి తరంగములను ఆడుటలో ప్రసిద్ధులు– ఈ సంప్రదాయ నర్తకులు మాత్రము తరంగములను నృత్యమాడెదరు

గొల్లకలాపము - భామాకలాపం శృంగార ప్రబంధం, సత్యభామయొక్క విరహం, వియోగం, విప్రలంబ శృంగారంగా, అష్టవిధ నాయికల రూపంలో వర్ణింపబడింది. గొల్లకలాపము ఆధ్యాత్మిక తత్వ ప్రబోధం చేయునటి కేళిక ఒక గొల్లవనితకు విప్రునికి సంవాదం– ఇందు పిండోత్పత్తి క్రమం. కర్మకాండ, యజ్ఞ యాగాది క్రతువులు, ముక్తి మోక్ష మార్గములు యెన్నియో చర్చింపబడును. ఈ కలాపం ప్రదర్శించుటకు నర్తకులు సంస్కృత భాషలో పాండిత్యం కల్గియుండవలెను.

రాధా మాధవం :– ఈ కలాపం తూర్పు ప్రాంతంలో ప్రచారంలో వుంది ఇది భక్తి ప్రబోధాన్ని చేసే కలాపం రాధ కృష్ణుని యెడబాటుకు తపిస్తుంది. అతన్ని చూడాలని తహతహలాడుతుంది. ద్వారకకు కబురంపుతుంది. కనికరించి కృష్ణుడు వస్తాడు. కాని అతని చూచి–

'నే చూడగోరింది రేపల్లెలో పెరిగిన బాలకృష్ణునిగాని. యౌవ్వనంలో వున్న శృంగార పురుషుడు ద్వారకానాథుని గాదని'
వెళ్ళిపోతోంది. కరుణించి కృష్ణుడు బాల్యరూపంలో వస్తాడు.

"అల్ల అల్ల అల్ల అల్ల అల్లవాడే
నా వుల్లమున వెలసిన గోపాలుడే
వేణు గోపాలుడే"

అతని కౌగిట చేర్చుకొని ప్రేమతో ముద్దాడుతుంది. ఇది బహూ చక్కని రచన. ఉత్తమ స్థాయికి చెందినట్టిది.

రాధా మాధవుల ప్రణయం జయదేవకవి కేవలం శృంగారంగా వర్ణించినాడు కాని యిందులో రాధ ప్రేమ అదొక ఉత్తమ స్థాయికి చెందినట్టిది. ఇట్టి ఆదర్శవంతమైన రచన మరొక్క భాషలో లేదనే చెప్పాలి. ఆంధ్ర కళాకారుల అదృష్టము యిట్టి రచన తెనుగులో వెలసింది నరసింగపల్లి వేణుగోపాలుని అంకితమైనట్టిది ఈ రచన.

వల్లభుని రచనలందుగాని, సూరదాసు, రామదాసు, హరిదాసు యోగుల రచనలందు గాని, చండీదాసు, చైతన్యప్రభు, విద్యాపతి యిత్యాది కృష్ణభక్తుల యెవ్వరి రచనలందునూ యిట్టి ప్రత్యేక ప్రేమతత్వ ప్రబోధం గాంచము

జీవ యెరుకల కురవంజి :– ముక్తికాంత, జ్ఞాన ప్రబోధ రచన ఇది పూర్తిగా వేదాంతంతో కూడినట్టి రచన పండితులకు తప్ప సామాన్యుల కంతగా అర్థముగాదు గనుక యెక్కువగా ప్రచారములో లేదు

ఈ నాల్గు కలాపములు ఆంధ్రలో ప్రచారంలో వున్నవి.

ఆంధ్రదేశంలోని భాగవత మేళములు 4 భాగములుగా చెప్పవచ్చును.

తెలంగాణా ప్రాంతాల్లోవున్న నాట్య మేళములు.

రాయలసీమలోని భాగవతములు

తూర్పు భాగవతులు

కూచిపూడి భాగవతులు

తూర్పు భాగవతులు. కూచిపూడివారు కలాపములు (ముఖ్యంగా భామాకలాపం) యక్షగానముల నాడుదురు.

తెలంగాణ, రామలక్ష్మీనువారు యక్షగానములు, బయలాటలు ఆడుదురు.

కూచిపూడివారి విద్య శాస్త్రీయత వలనరునుకొని వృద్ధిచెంది ప్రసిద్ధికెక్కిన సంప్రదాయవిద్య అయిననూ భాగవతుల ఆట, భాగవత మేళములు తూర్పున వున్నన్ని గుంటూరు, కృష్ణాజిల్లాల్లో లేవనే చెప్పాలి భాగవతంలేని అమ్మవారి పండుగయేలేదు. ఈ భాగవతులు తూర్పుగోదావరిజిల్లా పెద్దాపురం మొదలుకొని ఒరిస్సాలోని బరంపురం, గంజాము జిల్లాలంతటనూ ఆటగట్టుదురు వీరు ప్రత్యేకంగా ఆడేది భామాకలాప మొక్కటియే. వీరిది సంగీతబాణీ.

కూచిపూడి బాణీ గురించి కళాకారులకందరకు తెలిసినదే. ఇందు ముఖ్యంగా అభినయం ప్రాముఖ్యత వహిస్తుంది. ప్రాచీన

దరువు బాణీ, ఆలాప పద్ధతి మార్చి నఫీన పద్ధతుల్లో కేళిక జరుప బడుతుంది. తూరు వారు యింకనూ ప్రాచీనతనే అభిమానిస్తున్నారు. రాయలసీమ, తెలంగాణాలందు కథాగానం గమనం యెక్కువ ప్రాముఖ్యత వహిస్తుంది.

తమిళ ప్రాంతమువందుగూడా భాగవత మేళములవారి ఆట ఆంధ్రలోని ఆటను చాలావరకు పోలి వుంటుంది. దరువులు పాడుటలోనూ, అభినయమందు కొన్ని మార్పులున్నవి. దాక్షిణాది వారు విలంబిత పద్ధతిలో గానము చేయుదురు. వీరు యక్షగానములను మాత్రము వేయుదురు.

కురవంజి, యెరుకలసాని ఆట : ఇది ప్రత్యేకంగా 'దేశి' సంప్రదాయపు ఆట. 'కురవలు' అనే జాతివారు తమిళనాడులో సోది చెప్పెదరు ఆ తీరునే ఆంధ్రలో యెరుకలజాతివారు సోది చెప్పెదరు. వారి వేషభాషలు, పాట మాట తీరుల్లో కేళిక జరుపుట కురవంజి ఆట తమిళ ప్రాంతంలో ఈ ఆట ప్రత్యేకంగా వున్ననూ ఆంధ్రలో యక్షగానాల్లో ఒక భాగంగా చేర్చివేయబడింది.

ఇవిగాక దాదినమ్మ వేషము, దాలింత వేషము యిత్యాది యెన్నో నృత్యాలు భాగవతులు ప్రదర్శిస్తారు

## తమిళనాడులోని నృత్యకళారీతులు

భరతనాట్యము, భాగవతకేళి తమిళ ఆంధ్ర దేశాల్లో ఒకే రీతిగా వృద్ధి బొందినట్లు తెల్పియున్నాను. తమిళ దేశానికి ప్రత్యేకమైన జానపదశైలి భాగవతం 'కురవంజి' ఆట ఇదే భాగవత రీతి యైననూ, కొంత తక్కువ తరగతికి చెందిన ఆట క్రమము. ఒక రాజకుమారైకు లేక కథానాయికకు సోది చెప్పుటయందలి ఇతివృత్తంగా వుంటుందని. ఈ ఆటగాక తమిళదేశంలో మరెన్నో ప్రాచీన నృత్యాలు వున్నవి. 'సంఘం' కాలంలోని తమిళ గ్రంథం 'కవిత్తొగై' నందుగాని, శిలప్పదికారం నందుగాని వర్ణించ బడిన నృత్యాలన్నీ కథల రూపంలో వున్నవి.

ఉదాహరణకు :- కొడుకొట్టు, పంద రంగం, కాపాలి వర్తనములు, లయకాలంలో రుద్రుడు ప్రదర్శించిన వర్తనరీతి కొడుకొత్తు. మహంకాళి రూపంలో పార్వతీదేవి తాళంవేసినది.

త్రిపురసంహారాంతమందు శివుడు ప్రదర్శించినది ఆనంద వర్తనం మహేశుడు బ్రహ్మదేవ శిరస్సు ఛేదించి ఒక చేతిలో ధరించి ఆడినట్టిదే కాపాలి నర్తనం నాటినుండే శివుడు కాపాలీకుడని పిలువబడినాడు

ఇదేరీతిని కృష్ణపరమైనవిగూడా ప్రదర్శింపబడేవి

అవియే అలియం, కుడం, పేడి మొదలైనవి. ఇవన్నియూ నృత్త నృత్యాలకు సంబంధించిన కథావస్తువును కలిగియున్నట్టివి. ఈ నృత్యములనుగూర్చి వివరంగా మనం పరిశోధించిన నేటి కాలంలో ప్రచారంలోవున్న శాస్త్రీయ రీతికి దీనికీ యెట్టిసంబంధం లేదు.

ఇవన్నియూ శాస్త్రానుసారంగా చేయబడినవనూ. సంప్రదాయాన్ననుసరించి అభివృద్ధి చెందినట్టివే కరగం నృత్యం, కణ్ణి గుఱ్ఱములఆట, బొమ్మలాట, కావడిచిందు యిత్యాది జానపద నర్తన రీతులుగూడా ఆ దేశంలో యెన్నో వున్నాయి. కర్ర గుర్రములాట తమిళదేశంలో ప్రసిద్ధిగాంచగా పటిప గుర్రములాట ఆంధ్రలో ప్రచారమందున్నది. కరిగమే ఆంధ్రలో గరగలాట అందము ఇట్టిది మైసూరుప్రాంతంలోగూడా ప్రచారంలో వుంది. బొమ్మలాట మైసూరు ప్రాంతంలోగూడా వుంది.

తమిళదేశంలో ప్రాచీన "దేశి" ఛందోరీతుల్లో గానము, వాద్య విశేషం నేటికినీ నిల్చియున్నది శిల్పంలో కన్పించే అనేక వాద్యములు ఆ దేశంలో నేటికినీ ప్రచారంలో వుండుట ఒక విశిష్టత. పంచముఖవాద్యము, ఉడుక్కువంటివిగూడా ప్రస్తుత కాలంలో వాయించుచున్నారుకాని అవి యెక్కువగా జానపద రూపంలో పచారంలో వున్నవి. ఇట్టి విశిష్టవాద్య విశేషానికి చెంది నట్టిదే ఆంధ్రలోని "రొంజ". కాని అదిగూడా జానపద రూపంలోనే మిగిలివుంది.

పంచముఖవాద్యం, సూర్యమండలం, చంద్రమండలం, ఉడుక్కు, మురజ, ధవళశంఖు యిత్యాది వాద్యాలన్నీ ఆలయాల్లో విశేషించి శివాలయాల్లో వుపయోగిస్తారు. ఇది దక్షిణాది వంతటను వుంది. శివారాధనలో సర్వవాద్య ఆరాధన అనే నృత్యపూజా క్రమంలో అనేక వాద్యాలు, అనేక ఛందస్సులు, అనేక నృత్త నృత్య రీతులు ప్రదర్శింపబడును.

## కర్నాటక ప్రాంతంలోనున్న నృత్య రీతులు

కర్నాటకంలో వున్న విశిష్టరీతి యక్షగానము ఇది అతి ప్రాచీనమై దేశీయమైన విశిష్ట సంప్రదాయము. ఆంధ్రలోని యక్షగానానికి ఈ రీతికి ప్రాచీన కాలంలో దగ్గిరసంబంధముండి వుండును. గాని ప్రస్తుతము వేరుగా కన్పించును. భాగవత,భారత, రామాయణ గాథలనే వీరునూ నృత్యనాటకములుగా ఆడుదురు. వీరి నాటకములను ప్రసంగము ఆడుదురు. కథాగానమప్పుడు వీరు పాడరు. సూత్రధారుడు వెనుకనుండి పాడును. వారు ఆడుదురు. ఆటుతరువాత వారు ఆ గానములో జరిగిన కథకు వ్యాఖ్యానం చెప్పుదురు. అది వారి స్వంతం. ఆ భాగం కథలో రచన చేయబడి వుండదు. వీరుగాని యితర భాగవతులుగాని పాడే సంగీతము, రాగ తాళములు పూర్తిగా కర్నాటక బాణీకి చెందినటివే అయిననూ పాట క్రమము, తాళ వాద్యరీతిమాత్రము కొంత భేదాలు వుండును. అందువల్లనే ఈ సంగీతబాణిని దేశి క్రమమందురు. సంగీత శైలిలో రాగమునూ స్వరమునకు ప్రాధాన్యత యివ్వబడినట్లే యక్షగాన భాగవత సంప్రదాయంలో భావ ప్రాధాన్యత గల్గిన సంగీతం గానం చేయబడును. ఈ యక్షగానము దక్షిణ కనరా ప్రాంతంలో విరివిగా ప్రచారంలో వుంది. సుమారు ఒక మూడువందలు ప్రసంగాలు ప్రచారంలో వున్నవి.

నృత్తము, నృత్యము, అభినయము ఈ మూడింటి యొక్క ప్రదర్శన యక్షగానంలో గాంచనగును. మరియు శివునియొక్క 108 కరణముల అటక్రమము చాలవరకు వీరి ఆటక్రమంలో గాంచనగును అదియే అంగహార నర్తనంగా పేర్కొనవచ్చును యక్షగానమును నడుపు సూత్రధారుని భాగవతులు అందురు. అతడు సంగీత, సాహిత్య, నృత్య శాస్త్రములందు పండితుడై వుండును యక్షగాన నర్తకులందరూ భాషలో పాండితీ ప్రతిభ గల్గి వుందురు పాత్రల సంభాషణలు వాచికము గ్రంధస్థము గాక వారి స్వయం ప్రతిభపై ఆధారపడియుండును గనుక ఇక వాద్యములవారు (మృదంగము) కేవలము తాళ లయ విన్యాసమును జూపుటయేగాక, ఆయా రసమునకు తగిన రీతిని మృదంగ నాదము నవరిస్తూ వాయించును. ఇది రసోత్పత్తికి రసానిష్పత్తికి యెంతో వుపకరించును యక్షగాన కథ ప్రదర్శించే క్రమము ప్రసంగముల, ఆ కథలోని పాత్రలను, సంఘటనలను అనుసరించి వివిధ తాళాల్లో, ఛందస్సులో ఒక వర్ణనాత్మక రచనగా సృష్టించబడి యుండును. అందులోని ఒక్కొక్క భాగమును, భాగవత్ గానము చేయును. ఆ గానము ఆయా రసములను పాత్రల స్వభావమును తెల్పు విధముగా ఆలాపముతో ఆరంభించబడి, గమక విన్యాసము, గీతముతో ముగియును భాగవత గానము చేయునప్పుడు నర్తకుడు ఆ పాట భాగమును నర్తన మాడును అది ముగిసినంతనే అందలి భావము ప్రేక్షకులకు మాటల్లో యెరుకజేయును. ఈ గానము మూడు భాగములు వుండును. ఆలాపము, గమకము, గీతము. ఆలాపము ఒక భాగము స్వరూపం వ్యక్తము చేయుటకు వుపకరించును. గమకము ఆ భావమును నిరూపణ చేయును. గీతము ఆ భావమును ప్రకాశవంతము చేయును. దీనితో మృదంగ వాద్యం చేరినప్పుడు ఆ భావవికాసం పూర్తియగును. నర్తకుడు ఆహార్యం ధరించి, దానికి తగిన నృత్త నృత్యములు ప్రదర్శించినప్పుడు పరిపూర్ణత చెందును.

ఈ యక్షగాన బృందాలను దేవాలయాలు పోషించుచున్నవి భక్తులెవరైన జబ్బుపడినచో తమకష్టములు తొలగిన భగవంతునికి ఒక యక్షగానము సమర్పింతుమని మ్రొక్కుకొని ఆ మొక్కును నెరవేర్చుకొనేవారు. ఇది ప్రాచీన కాలంనుండీ వస్తున్న ఆచారం. ఆ ధనముతో ఆలయాధిపతులు ఆ బృందములను పోషించుట వాడుకగా వుండింది.

## కేరళ దేశంలోని నాట్యవికాసము

కేరళ దేశంలో యెన్నో రకములైన నర్తన రీతులు శాస్త్రీయం, జానపదము, ఆరాధన రీతులున్నను అందు ముఖ్యంగా ప్రస్తుత కాలంలో యెక్కువగా ప్రచారం గాంచి, ప్రఖ్యాతి చెందినవి - కథకళి, మోహిని అట్టము. మోహినీ అట్టము - స్త్రీలుచేసే నర్తనం అడియును భరతనాట్యము. ఒడిస్సీవలె నృత్త నృత్య అభినయములతో కూడినట్టి యేక పాత్ర నర్తనం.

కథకళి :- 'కళి' అనగా ఆట. ఒక కథను నృత్య నాటకంగా ప్రదర్శించుట కథకళి. ఈ కథకళి ప్రాచీన రామనాటకం యొక్క, నవీన రూపంగా పేర్కొనవచ్చును కొట్టారక సంస్థానాధీశునిచే యీ నృత్యకేళి విశేష ప్రచారంలోనికి తేబడినది. చక్కియారులనబడే ఒక ప్రత్యేక తెగవారు ఆలయాల్లో నృత్యకేళిక చేయుదురు. వారి సంప్రదాయంలో విశేష ప్రజ్ఞతో కూడిన అభినయం వుంటుంది ఆ ఆట 'చక్కియారుకుత్తు' అనబడుతుంది కాని ఆ కళ ప్రత్యేకంగా ఆలయాలకే సంబంధించిన దగుటచే యితర చోట్ల వేయబడకపోవుటచే, కథకళి వలే ప్రచారం గాంచ లేదు. కథకళిగూడా పూర్తిగా నాట్య మేళానికి చెందిన నృత్యరీతి. ఇందు స్త్రీలకు అసలు స్థానం లేదు. ఈ విద్య పూర్తిగా పురుషులదే. కథకళి, ముద్రనాట్యం ఆంగిక ప్రాధాన్యత గల్గిన నృత్యం. ఒక కథను గాయకుడు గానం చేయగా, ఆ పాటయొక్క అర్థమును ముద్రల ద్వారా తెల్పుతూ తాళ లయలద్వారా చారీ రేచక కరణాదుల ప్రదర్శించును నర్తకుడు. ఇందులో 'నాట్యధర్మి' యేగాక 'లోకధర్మి' గూడా విశేషించి ప్రదర్శింప బడుతుంది.

కథకళి నర్తనంగాక కేరళలో జానపదసంప్రదాయ నృత్యాలనేకము లున్నవి. కోల్‌కళి, వట్టుకళి. తటిన్ మేల్‌కళి, చువత్తుకళి- యివి పురుషుల నర్తనములు. కైకొత్తుకళి, తిరువదిరకళి స్త్రీల బృంద నర్తనములు, వేలకళి, పులయార్‌కళి, పిటిచుకళి, పరవత్రికంకళి- యివన్నియూ వీర నాట్యాలుగా పేర్కొన వచ్చును.

కోళ్‌కళి- కోలాటముఆట. చిన్నచిన్న కర్రలు చేతుల్లో ధరించి యీ నర్తనం ప్రదర్శింపబడుతుంది. మలబారులోని మాప్లా ముస్లిములు యీ ఆటను విశేషించి ప్రదర్శింతురు.

వలయాకారంలో నిల్చి చేతులను తట్టుతూ గుండ్రముగా తిరుగుతూ నర్తనమాడే రీతియే వట్టికళి.

భగవతి ఆలయాల్లో కోతలు మాగిసినతరువాత ప్రదర్శింపబడే నాట్యరీతియే తటిన్ మేళ్‌కళి ఇది దేవస్తోత్ర గీతాలు పాడుతూ చేయబడును.

స్త్రీల నాట్యాల్లో 'కైకొట్టుకళి' కుమ్మిగొబ్బి ఆటను పోలియుండును. ఇదిగూడా బృందనర్తనమే.

తిరువాదికళి సంవత్సరాని కొక్కసారి యవ్వనంలోనున్న యువతులచే ప్రదర్శింపబడే నృత్యరీతి. ఈ నృత్యం తిరువాదిర వుత్సవ సమయంలో ప్రత్యేకంగా స్త్రీలు కామదేవుని పూజించి చేయుదురు. తమయొక్క కోరికలు తీరుటకుగాను జవ్వనులు కామదేవుని స్తోత్రంచేసే పూజానృత్యంగా పేర్కొనవచ్చును.

మిగిలినవి పురుషులచే యుద్ధ అనుకరణగా చేయబడే వీర నాట్యాలు- ఇవన్నియూ జానపదరీతులే.

## మహారాష్ట్రంలోని నృత్యకళ

మహారాష్ట్ర దేశంలో శాస్త్రీయ నృత్యకళ వృద్ధిచెందలేదు. సంప్రదాయ నృత్యములు, జానపద నృత్యములే ఈ ప్రాంతంలో ప్రసిద్ధిచెందాయి. ఛత్రపతి శివాజీ హైందవమత సంస్కృతి పునరుద్ధరణకు సామ్రాజ్యము స్థాపించినను ఆనాటి వారి ఆస్థాన కవులు, గాయకులు కళల అభివృద్ధికి అంతగా ప్రత్యేకశ్రద్ధ వహించినట్లు కాన్పించదు ఈ ప్రాంతాల్లోని సంప్రదాయ నాట్యగాన రీతులు - పొవాడ, తమాషాలు సామాన్య ప్రజల వినోద కళలుగా మాత్రం రూపొందినవి. కొందరు కళావంత స్త్రీలు ఠుమ్రీ, గజల్ యిత్యాది గీతాలు కథక్ అభినయ పద్ధతిలో ప్రదర్శించుట కద్దు. కాని అదేమంత విశేషముగాదు. పొవాడ సంప్రదాయం ప్రత్యేకంగా పురుషులకు చెందింది. వీరగాథలను గానంచేస్తూ సందర్భానుసారంగా కొద్దిమాత్రం నృత్తం ప్రదర్శించు సాంప్రదాయం - ఇది ఆంధ్రలోని బుర్రకథ, జంగంకథను పోలి వుండును. తమాషా స్త్రీలచే ప్రదర్శింపబడే నృత్త వినోద క్రీడ. గౌలన్ (గోపికాకృష్ణులకు సంబంధించిన గీతాలకు) లావణీ శృంగార రచనలకు) నృత్త నృత్యములు ప్రదర్శించుట తమాషాలో గాంచుదుము. గొండ్లి అంబాభవానిని ఆరాధిస్తూ ఆమె ప్రీతికొరకు చేయబడే నర్తనము గొండ్లి. ఇంకనూ కోల్లు యిత్యాది తెగలవారు ప్రదర్శించేవెన్నో జానపద నృత్యాలున్నాయి. పొవాడ గీతాలు వ్రాసినవారిలో ప్రఖ్యాతిచెందిన రచయిత హోనాజీ, లావణీ రచనల్లో ప్రసిద్ధిచెందినవారు రాంజోషే. మహారాష్ట్రను అనుకొనేవున్న గోవా ప్రాంతంలోను, కొంకణదేశంలోను కొన్ని నర్తనరీతులున్నవి గాని అవన్నియూ జానపద నర్తనములే. ఆంధ్రదేశంలో ఒకభాగమైన ఆదిలాబాదు జిల్లాలో ఆదిలాబాదుకు చెందిన శ్రీమతి రాధాబాయిభోద్ గాంకర్ బృందం తమాషా నర్తనం మహారాష్ట్రలో చాలా ప్రసిద్ధిచెందారు. రాష్ట్రపతి బహుమతులుగూడా సంపాదించారు. ఆమె కుమార్తెలు, కుమారులు ఆమె బృందములోని కళాకారులు. వారే సంగీతము పాడెదరు, నాట్యము చేసెదరు, వాద్యాలను వాయించెదరు

## గుజరాత్, సౌరాష్ట్ర, రాజస్థానమునందలి నర్తనకళ

శివభక్తుడు బాణాసురుని కుమార్తె ఉషాకన్య, లాస్య నర్తనానికి కర్త పార్వతీదేవివద్ద శాస్త్రీయ నృత్యకళ అభ్యసించినట్లును, శ్రీకృష్ణుని మనుమడు అనిరుద్ధుని పరిణయమాడి ద్వారకకు వెళ్ళిన తరువాత అచ్చటి రాజకన్యలకు శాస్త్రీయ నాట్యము నేర్పినట్లు తద్వారా శాస్త్రీయ కళలు ఆ ప్రాంతంలో ప్రచారమైనట్లును కళాకారులు అభిప్రాయ పడుదురు. గాని ద్వాపరం మాటైతేనేమి నవ్వును. ప్రస్తుత కాలంలోని కొన్ని జానపద బృంద నృత్యములు సంప్రదాయ నృత్యములు తప్ప శాస్త్రీయ కళరీతి అచ్చట గాంచము. స్త్రీలు చేసే గర్బ నృత్యము, దండియారాస్ (కోలాటము) ఇత్యాదులన్నీ సంప్రదాయ పంథాలో అభివృద్ధి పొందినట్టివే. ఉషాకన్య ఒక నాట్యశాస్త్రం - ఉషాభారతం రచనచేసిన దందురు.

అదంతయూ ఐదువేల సంవత్సరాల క్రిందటి విషయం ఈ ప్రాంతంలోని నర్తకులందరూ కృష్ణ కథలను అనేక రీతుల నృత్యకేళిక జేయుదురు. అవన్నియూ జానపద శైలి ననుసరించియే యున్నవి సాధారణ అనుకరణ నృత్యములు ప్రత్యేకంగా 'నాట్యధర్మి' ననుసరించి వృద్ధి చెందినట్టివి గావు. వీరులకు యుద్ధాలకు మనదేశ చరిత్రలో ప్రాముఖ్యత వహించిన రాజస్థానములో గూడ హైందవ శాస్త్రీయ నర్తన రీతి వికాసం అంతగా గాంచము. ప్రాచీనకాలమందుండినదేమో; నేటి కాలంలో మాత్రం జానపద నృత్యరీతులు మిగిలినవి. రాజుల దర్బారులందు, ఆస్థాన కేళిక కథక్‌ను పోలియుండును. రాజస్థానము నేలిన మహారాజులు నాట్యశాస్త్రము, అలంకార శాస్త్రములపై గొప్ప వ్యాఖ్యానాలు రచన చేసినను ఒక విశిష్ట నృత్య సంప్రదాయం వారి ప్రాంతంలో వృద్ధి పొందలేదు. దీనికి మహమ్మదీయులకాలంనాటి అస్థిర రాజకీయ వాతావరణం గూడా కొంతవరకు కారణమై యుండవచ్చును. హైందవ శిల్పకళ, చిత్రకళల్లోని విశిష్టతను ప్రబోధం చేసే యెన్నో కోటలు మందిరాలు యీ ప్రాంతంలో మిగిలినవి. వీరు ప్రదర్శించే జానపద, భాగవత రీతులు ముఖ్యంగా వీర రస ప్రాధాన్యత కలిగినట్టివిగా పేర్కొనవచ్చును. ఆస్థాన నర్తనం గూర్చి 'కథక్' నర్తనము గురించి తెల్పినప్పుడు వివరంగా వ్రాస్తాను.

## కాశ్మీరు, పంజాబు దేశాల్లో నృత్యకళ

అభినవ గుప్తుడు జన్మించిన కాశ్మీరము, సారంగదేవుని కాశ్మీరం, బిల్హణుని కాశ్మీరం, హైందవ సంస్కృతి అనేకవిధాల అలరారిన కాశ్మీరం.

ఆ కాశ్మీరము, నాటి కళలు వేరు; నేటి కాశ్మీరము వేరు. రాజకీయంగా కాశ్మీరులో ఎన్నో మార్పులు వస్తూవుండినవి. అక్కడి ప్రాచీన మతము, సాంఘిక వ్యవస్థలు మారిపోయాయి కళలు అంతరించిపోయాయి. కనుకనే ఆ ప్రాంతంలో శాస్త్రీయ నృత్యకళ యెచ్చటనూ మనకు కన్పించదు. ప్రస్తుత కాశ్మీరాన్ని మూడు భాగాలుగా చెప్పవచ్చును. పూర్తిగా పర్వతప్రాంతమైన లడక్ ప్రాంతము. వీరందరూ బౌద్ధులు. లడక్కీభాష మాట్లాడుదురు. లోయ ప్రాంతము - ఇదే సుందర కాశ్మీరలోయ. ఇచ్చట నూటికి ఎనభై మంది మహమ్మదీయులు. మిగిలినవారు పండిట్‌లు (కాశ్మీరీ బ్రాహ్మణులు). వీరు కాశ్మీరీభాష మాట్లాడుదురు. తురుష్క ప్రభావము పూర్తిగా ఈ ప్రాంతముపై వుంది. అభినవగుప్తుని నాటి సంగీత నాట్యాలెచ్చటనూ లేవు. కాశ్మీరుపండితుల స్త్రీలు వివాహాది సందర్భాల్లో అభినవగుప్తుని రచనలని కొన్ని గీతాలను ఆలపించుటమాత్రం సాంస్కృతిక చిహ్నంగా మిగిలింది. ముస్లింల పాలనలో 'హఫిజా'లనే ఒక తెగ, నర్తకీమణులు నృత్యాభినయాలు చేసేవారు. వారితరువాత పర్షియన్ ప్రభావం కాశ్మీరంపై పడిన

తరువాత యువకులే యువతుల దుస్తులు ధరించి నాట్యవినోదము చేకూర్చేవారు. దీన్నే 'బచ్ నగమా' అంటారు.

జమ్మూ ప్రాంతం పూర్తిగా హిందూ ప్రభావంతో అభివృద్ధి చెందిన ప్రదేశం. డోగ్రీ యీ ప్రజల భాష ఈ ప్రాంతంలోనూ అనేక విధములైన జానపద నర్తనరీతులే మిగిలినవి శాస్త్రీయ నాట్యరీతులు మాత్రం మనకు కన్పించవు ప్రస్తుతకాలంలో కొందరు యువ కళాకారులు కథక్ నర్తన మభ్యసించి ఆ ప్రాంతంలో ప్రవేశపెట్టుటకు ప్రయత్నించుచున్నారు. అయినను అది యెరువు తెచ్చుకున్న విద్యయే.

పంజాబునందు గూడా జానపద నృత్యకళయే అభివృద్ధి గాంచినది గాని శాస్త్రీయ విద్య మాత్రం లేదు. శిక్కుమత ప్రవక్తలవల్ల సంకీర్తన సంగీతము వృద్ధిలోనికి వచ్చింది. నృత్యా నికి అట్టి అవకాశము లేకపోయింది. పంజాబులోని పురుషులు ప్రదర్శించే నృత్యాల్లో ముఖ్యమైనట్టిది. 'బాంగ్రా'. ఇది అనుకరణ నృత్యం. రైతులు పొలం దున్నడం. ధాన్యం పండించడం. కోతలు మొదలైన దృశ్యాలు యిందులో ప్రదర్శిత మౌతూ. ఉత్సాహ వంతంగా యెగురుతూ ఆడుదురు. వీరు బలిష్ఠులు. వీరి వాయిద్యం ఉద్రేక పూరితమైన నాదాన్ని ప్రసరించును. ఆ నాట్యమూ అట్లే ఉద్రేకంతో నిండి యుండును. 'గిద్ద' అనే మరియొక నృత్యంలో స్త్రీలుగూడా పాల్గొందురు. ఇవన్నియూ బృంద నృత్యాలే. 'బచ్ నగమా' ఏకపాత్ర నృత్యము. మహారాష్ట్ర, గుజరాతు. సౌరాష్ట్ర రాజస్థాన్. కాశ్మీరు. పంజాబు ఈ ప్రాంతాల్లోనివారు యెవరైనా సంగీతము శాస్త్రీయంగా పాడాలంటే హిందుస్థానీ బాణీ నేర్చుకో వలసిందే. హిందుస్థానీ సంగీతము యీ పై ప్రాంతాలన్నింటిలో ప్రచారంలో వున్నను 'కథక్' నర్తనం (ఉత్తరదేశ శాస్త్రీయ నర్తన రీతి) మాత్రం అన్ని ప్రాంతాల్లో ప్రచారంలో లేదు. ఉత్తర ప్రదేశ శాస్త్రీయ సంగీత విధానంలో ముస్లిం సంప్రదాయాలను తొలిదొల్త ప్రవేశపెట్టి ప్రచారంలోనికి దెచ్చినవాడు అమీర్ ఖుస్రూ. వారికి ముందు ధ్రువద సంప్రదాయ సంగీతమే యెక్కు వగా ప్రచారంలో వుండింది. గంభీర భావ ప్రకటన గల్గి 'పకవాజ్, వాద్య సహకారంతో గానం చేయబడేది ఖుస్రూ కాలంలో 'ఖ్యాల్' పద్ధతి ప్రారంభమైనది. ఇది కోమలమై, లలితము లాలిత్యముల యొక్క సమ్మిళితమైన రీతి 'పకవాజ్' గంభీర నాదం యుగాయనీ పద్ధతికి అనుకూలించనందున తబలా వాద్యం కనిపెట్టబడి వుపయో గించబడింది. అట్లే వీణవంటి వాద్యం సితార్ గూడా ప్రచారంలోనికి వచ్చింది. హిందుస్థానీ గాత్ర సంగీతంలో సహకరించే వాద్యం 'సారంగి' కర్నాటకులు 'వాయులీనం' వుపయోగింతురు. కాని సారంగి వంటి వాద్యం మరొక్కటి మనకు కన్పించదు. మనుష్య గాత్రంతో మిళితమైపోయి ఆ గానానికి శోభ చేకూర్చేది 'సారంగి' ఒక్కటే. సారంగిలో వున్న నిండుదనం, మాధుర్యం. సంపూర్ణత వయొలిన్‌లో తక్కువనే చెప్పాలి. ఖుస్రూ కాలం తరువాతనే ధ్రువద్, ధమార్, ఖ్యాల్. టుమ్రీ, టప్పా. భజన్, గజల్ యిత్యాది యెన్నో విభాగాలుగా ఉత్తరప్రదేశ సంగీతం వృద్ధి చెందింది ఇందు కొన్ని నృత్యాభినయాలకు పనికివచ్చే రచ నలు. కొన్ని పూర్తిగా పాట కచ్చేరీలకు వుపయోగపడే బాణీలు. ప్రత్యేకంగా ఒక్కొక్క బాణీయందే విశేష పరిశ్రమ జేసి. ఆ గానము ద్వారా ప్రఖ్యాతిగాంచిన వారనేకులు ఉత్తరం దేశంలో వున్నారు.

ఉదా :- బాయి రసూలన్ బాయి, అక్తరీ బాయి, టుమ్రీ టప్పా గానంలో ప్రసిద్ధులు డాగరు సోదరులు ధ్రువదు గానంలో ఖ్యాతి గాంచినారు. జ్యోతికారాయి భజన సంగీతంలో ప్రపంచ ఖ్యాతి గాంచినది. ఆమె భజనలు తప్ప యితరము గానంచేయదు.

దక్షిణాదిని యిట్టి ప్రత్యేక సంప్రదాయాలు అభివృద్ధి చెందలేదు ప్రఖ్యాత విదుషీమణి వీణధనమ్మగారి మనుమరాండ్రు బృంద, ముక్త పదముల గానము చేసినా అది కర్నాటక సంప్ర దాయంలో ఒక భాగంగానే ప్రచారం గాంచినది. కర్నాటక సంగీత రీతిని పై విధంగా విభజించి అభ్యసించుట. ప్రదర్శించుట ఆచర ణలో లేదు.

ఋతువులకు సంబంధించిన సంగీతము. నవరసములకు సంబంధించిన సంగీత గానము, తాళములందు గీతము ఇట్టివి వుత్త రాది బాణీలో వున్నవి. దక్షిణాదిని శాస్త్రాల్లో చెప్పబడినను ఎక్కు వగా ప్రచారంలో మాత్రం లేదు త్యాగరాజు కీర్తనలతో దక్షిణాదిని పూర్తిగా గాత్ర సంగీతం యొక్క స్వరూపమే మారి పోయింది. గాయకులు ముఖ్యంగా కీర్తనలనే సాధన చేయుదురు గాని వివిధ రసాలకు, ఋతులకు సంబంధించిన గీత పద్ధతుల అభ్యాసం తక్కువ. రాగములను పాడే నియమము గూడా వుత్త రాదివారు పాటించినంతగా దక్షిణాదిని పాటించరు, ఆ నియమము పాటించుటవల్ల అనేక అపూర్వ రాగాలు, తాళాలు ప్రచారంలోకి వచ్చే అవకాశం కల్గుతుంది నవరస అంగహార నర్తనం గాని, ఋతువర్ణన నృత్యములు గాని. శివతాండవము కూర్చుటకు గాని ఉత్తరాది సంగీత, తాళ శైలిలో సులభంగా మనకు రచనలు శబ్ద జాలములు లభించినంతగా దక్షిణాది బాణీలో లభించవు ఆ వివిధ ఛందస్సుల్లో గీతాలు ప్రచారంలో వుండుటయే దానికి కారణము. దక్షిణాన అట్టి అవకాశము కనిపించదు

ఉదాహరణగా ఒక చిన్న అనుభవము ఇక్కడ పేర్కొం టాను :-

'పకవాజ్' వాద్య రీతిలో బహు ప్రఖ్యాతిగాంచినవారు. రాంపూరు సంస్థానానికి చెందిన అయోధ్యాప్రసాద్‌గారు. ఆయన వృద్ధులయ్యిపోయారు ఎందరో శిష్యులున్నారు. రాంపూరు వెళ్ళి నప్పుడు వారినే దర్శించే అవకాశం కల్గింది. వారి వాద్యం వినాలనే కుతూహలంతో కోరగా- ఆ వృద్ధ కళామూర్తి అనుగ్రహించారు :.

"హరహర ప్రమద గణాధిప దేవా
భవహర శంకర పరమశివా !"

శివతాండవ వర్ణనలతో గూడిన యీ ధ్రుపదమును ఒకరు గానం చేయగా వారు కొన్ని పరువలు పలికించారు. అదొక అపూర్వ దివ్యానుభూతి. ఆ నాదాలు వింటూంటే సంధ్యా సమయంలో శివుడు నర్తనమాడుతున్నట్లు గంధర్వులు, దేవతలు స్తోత్రం చేస్తున్నట్లు, పరమశివుని పాదాల మంజీరాలు పలుకుతున్నట్లు ఏదో ఒక కళాలోకంలో విహరిస్తున్నట్లు తోచింది. ఆ వాద్య బాణియే వేరు ఆ శబ్దాల కొలువు. ఆ నాదం పలికించే తీరు నిజంగా 'పకవాజ్' పరమశివుని నర్తనంకొరకే సృష్టించబడిందా అనిపిస్తుంది దక్షిణాన భరత నాట్యం, భాగవత సంప్రదాయాల్లో శివతాండవ నర్తనం యెక్కువగా చూస్తాము. కాని యిట్టి అనుభూతి అరుదుగా కల్గుతుంది. కొన్ని ప్రాచీన తాళ చందోరీతులు పకవాజు వాద్యమందు నేటికినీ ప్రచారంలో నుండుటయే కారణము తబలాబాణీ వేరు - పకవాజు తన ప్రాచీనతను నిల్పుకుంది. కనుకనే శబ్దంలో నిండుదనం, గంభీరత, ఔన్నత్యం నేటికినీ పోషింపబడుతుంది

పంజాబునుదాటి ఉత్తర పదేశ్‌లో ప్రవేశించి అచ్చటి శాస్త్రీయ నృత్యంగూర్చి తెల్పేముందు కులూ లోయలోని కళ గురించి కొద్దిగా తెల్పుతాను

## ఉత్తరప్రదేష్‌లోని నృత్యకేళికా రీతులు

హిమాలయాలతో చుట్టబడిన సుందర కులూలోయ దేవతలు నివసించే లోయగా ప్రఖ్యాతి గాంచింది ఈ లోయలోని ప్రజలు చక్కనివారు వీరి సౌందర్యంవేరు, కాశ్మీరీ సౌందర్యం వేరు. ఏడాది కొక్కసారి వీరు దేవతల వుత్సవాలు చేస్తారు. ఆ దేవతా వుత్సవాల్లో దేవుళ్ళ ప్రీతికొరకు యెన్నోరకాల నృత్యాలు ప్రదర్శిస్తారు ఇవన్నీ జానపద నృత్యరూపాలే అయినా ప్రత్యేక నృత్యకేళికగా పేర్కొనవచ్చును

ఔద్ నవాబు, లక్నోను పాలించిన నవాబులు నృత్య గాన ప్రియులు వీరు నృత్యకళను యెక్కువగా అభిమానించారు. పోషించారు వీరియొక్క ఆదరములోనే 'కధక్' నర్తనం, ఒక ప్రసిద్ధ కేళికగా రూపొందింది కళికాదిన్ బిందాదిన్ మహారాజు ఈ కళకు ఒక నూతనరూపం సృష్టించి ప్రచారంలోనికి తెచ్చారు. ఈ కధక్ లక్నో, జైపూరు, బనారస్ ఘరానాలని మూడు విధాలుగా వుంది. లక్నో పూర్తిగా తురుష్క ప్రభావానికి లోనైనట్టిది. జైపూరు, బనారస్ హిందూ సంప్రదాయాన్ని ప్రతిబింబిస్తాయి.

ఈ నృత్యరీతిగూడా ఏకపాత్ర నృత్య సంప్రదాయమే. నృత్తముతో ఆరంభమై నృత్యముల భావప్రదర్శన ముగింపులో మరల నృత్తముతో ముగియును

సలామీ- అనగా నర్తకి, సభ ప్రవేశించగానే ప్రభువులకు, కళాప్రియులకు వందన మాచరించుట. కొన్ని ముక్తాయింపులు అటు ఇటుపై సలాం చేయుదురు. 'గత్ భావ్'లో ఒక తాళము యొక్క గతక ననుసరించి ఆడుతూ ఒక కథలోని భాగాన్ని ప్రదర్శింతురు. సాధారణంగా హోలీ దృశ్యాన్నో లేక కృష్ణుని బాల్య క్రీడలో యిందు ప్రదర్శితమగును.

భావనృత్యములో టుమ్రీ, గజల్, భజన్ యిత్యాది పాటలకు అభినయం ప్రదర్శింతురు. ఈ అభినయం దక్షిణాదిని అభివృద్ధి పొందినంతగా విశేష విశిష్టతో వృద్ధిపొందలేదు.

ఛందోరీతి - ఛందోరీతిలో ఒక వర్ణనాత్మక గీతం మృదంగ శబ్దాలతో కలిపి రచన చేయబడినదాన్ని నృత్త నృత్యాలద్వారా ప్రదర్శింతురు.

గత్ తోరా - పల్లవికి అనేక విధములైన జతులు కల్పన జేసి వాటిని ఆడుట ఇందలి విశేషము. ఇదియునూ శుద్ధ నృత్తమే. ఆఖరి అంశము తత్కారం. ఇందులో నర్తకుడు లయలో తనకు గల సాధన సంపత్తి ప్రదర్శించును. దక్షిణాది దర్బారు ఆట భరతనాట్యం) వలే ఈ విద్యగూడా నృత్త నృత్య అభినయాలు ప్రదర్శించుటకు అనువైన రీతిని రూపొందిన సంప్రదాయం. ఆట పద్ధతిలో మార్పులున్నా క్రమము మాత్రము యించుమించు ఒకేరీతిగా నున్నది. ఈ నర్తన రీతి గాక రామలీలా, నౌటంకి నర్తన బృందాలున్నవి వీరు భాగవత సంప్రదాయ నర్తకులు. ఇందు రామాయణ, మహాభారతాది పురాణ కధలు నాట్యమాడబడును.

రామలీల :- ప్రత్యేకంగా రామాయణాన్ని ఒక నృత్య కేళికగా, మత విషయంగా దసరా సమయంలో ప్రదర్శించు ఒక సంప్రదాయం గలదు. ఈ నర్తనం, నాట్యబృందాలు వేరు వీరు వృత్తిగా నాట్యం చేయువారు గాక, రామకధ నాడుట ఒక దైవ సేవగా తలంచిన బృందాలు. ఇట్టి బృందాలే మేలట్టూరు (తంజావూరు సద్ద) నర్తన మేళములవారు, రామలీల నర్తకులు దసరా సమయమందు మాత్రం కేళిక జేతురు. ఇతర సంచార బృందాలు గూడా అదే పేరుతో పిలువబడుచున్నవి. ఉన్నావ్, ప్రతాప్ ఘర్ జిల్లాల్లో ముఖ్యంగా ఈ బృందాలువారు (సంచార నర్తన బృందాలు) యెక్కువగా వున్నవి. వీరు మధ్యప్రదేష్ గూడా పర్యటింతురు.

ముస్లిం పాలకుల యొక్క ఆస్థానాల్లో రూపొందుట వల్లనేమో కథక్ విద్యలో అభినయం కంటే నృత్య నృత్తాలే యెక్కువగా వృద్ధి పొందినవి. గీతములు విశేషించి భాగవతం (కృష్ణ సంబంధమైనవిగా) ననుసరించిన రచనలగుటచే వాటి అభినయం కంటే నృత్త నృత్యాలే ఆ ప్రభువులు యెక్కువగా అపేక్షించియుందురు దీనివల్ల వీరి కళలో విశేషించి లయ విన్యాసము, తాళ విన్యాసము ఆట యెక్కువగా వృద్ధిపొందినది. పక్‌వాజ్ ఆట, తబలా ఆట వేరువేరుగా వృద్ధిపొందినది. గంభీర అంగ విన్యాసము పక్‌వాజ్ ఆటల్లోనూ, సుందర విన్యాసాలు తబలా ఆటలోనూ గోచరించును.

బీహార్‌లో ప్రత్యేకంగా ఒక నృత్యసంప్రదాయం లేదు. సెరైకేళా సంస్థానంలోమాత్రం ఒక విశిష్ట నృత్యరీతి వృద్ధిచెందింది: అట్టి నృత్యరీతిగాని, వాద్యపద్ధతిగాని మరే ప్రాంతంలోనూ

గాంచము నృత్యం చేసేటప్పుడు యీ వర్తకులు ముఖాలకు తొడుగులు ధరింతురు అందువల్ల అభినయానికి ముఖ్యమైన ముఖం కప్పివేయబడుతుంది రసభావములు ప్రదర్శించుటకు వారి అంగ విన్యాసములు, వారి వాద్య సంగీతమే ఆధారము. గనుక వీరు శరీరంలో వివిధ భాగాలు చక్కగా ఆ యా భావాలు పలుకుటకు గాను ప్రత్యేక శిక్షణ, వ్యాయామము చేయుదురు. ఈ సంస్థానాధీశులు ఈ కళాపోషకులేగాక, ఈ కళారాధకులుగూడా. ఇట్టి నర్తన రీతిని మయూర్‌భంజ్ జిల్లా (ఒరిస్సా)లో వున్నవారు ముఖాలకు తొడుగులు ధరించరు. వాద్య సంగీతము (మర్దలం)లో పలికించే శబ్దజాలంగూడా ప్రత్యేక విశిష్టత, తూకముతో వుంకుమ ధ్వనిలో రసము, భావము స్పష్టమగుచుండును. వీరు కొన్ని ఏకపాత్ర నృత్యములు. కొన్ని ద్విపాత్ర నృత్యములు. కొన్ని బృంద నృత్యములుగా ప్రదర్శింతురు. అభినయం వీరి విద్యలో లేక పోయినా నృత్య నృత్తాలు చక్కగా వృద్ధిచెందినవి. పురాణకథలను నృత్యముద్వారా ప్రదర్శింతురు.

పాటలీపుత్రం - ఆనాటి రాజవంశములు, అచ్చట అభివృద్ధి చెందిన కేళికారీతులు యెంతటి ఘనతవహించినవోగాని నేటి కాలములో మచ్చునకైన విశిష్ట నర్తనరీతుల్లోని కొన్ని భాగాలైనా మనకు మిగులలేదు శిల్పాల్లోమాత్రం కొన్ని భంగిమలరూపాల్లో నిల్చిపోయినవి.

బౌద్ధులకు పుణ్యక్షేత్రము గయ - ఇచ్చటనేవున్న బౌద్ధుల సంగీత నర్తనరీతులు గూడా యీ ప్రాంతంలో మిగులలేదు. టిబెట్టు దేశ భూత నృత్యాలు కొన్ని అచ్చటచ్చట ప్రదర్శితమైనవి. అవి వుత్తమశ్రేణికి చెందిన విద్యారీతులు గావు.

బీహారు దాటిపోయిన అస్సాం చేరుదుము. అస్సాంలో వున్నన్ని ఆటవిక, జానపద నృత్యరీతులు మరే ప్రాంతంలోను గాంచమనే చెప్పాలి.

నాగజాతివారు, మిజోలు అనేక రకముల నృత్యాలను ప్రదర్శింతురు. ముఖ్యంగా యివన్నీ అనుకరణ నృత్యాలుగానే చెప్ప వచ్చును నాగజాతివారి నృత్యాల్లో యుద్ధ నృత్యము ప్రాముఖ్యత వహిస్తుంది ఇది యుద్ధానుకరణ. వీరరస ప్రాధాన్యత కల్గినట్టిది. జానపద నర్తన రీతుల్లో 'బిహూ' చాలా అభిమాన నృత్తము. అస్సాంలో ప్రచారంలో మన్న భాగవత సంప్రదాయ నర్తన రీతియే. అంకియానట, ఓజపాలీ ఈ నర్తన రీతికి మూలపురుషుడు శంకరదేవ అనే వైష్ణవ యోగీశ్వరుడు. ఈతడు కృష్ణభక్తుడు. ఈ భక్తి తత్వమును సామాన్య ప్రజల్లో ప్రచారం చేయు నిమిత్తం నృత్య సంగీతాలను వినియోగించాడు. ఇతడు పీఠాధిపతి. స్వయంగా యెన్నో భాగవత కథలను నృత్య నాటకములుగా రచన చేసినాడు. తన తరువాత పీఠాధిపతులైన ప్రతి ఒక్కరూ, తమ జీవితంలో ఒక్క నృత్య నాటకమునైనా వ్రాసినవారుగా వుండవలెననే నియమము పెట్టాను. అందువల్ల అస్సాం భాషలో యెన్నో నృత్య నాటక రచనలు జరుగుటకు అవకాశము కల్గినది. ఇదియునూ భాగవత సంప్రదాయ మగుటచే ప్రత్యేకంగా పురుషులే యిందు పాల్గొందురు. ప్రతి ఆలయానికి ఒక నృత్య మందిరముంటుంది. ఈ పీఠాధిపతులకు వారి శిష్యులకు ప్రత్యేక మాన్యాలున్నవి. కృష్ణ భక్తి ప్రబోధమే జీవితంలో వారి పరమావధి కేళీ గోపాల్, కాళీయ మర్దన, పారిజాతకథ యిత్యాది కృష్ణసంబంధమైన కథలన్నీ వీరు నాట్యమాడుదురు.

మణిపుర, బెంగాలు, అస్సాం లందు కృష్ణ భక్తి విరివిగా ప్రచారమందుండుటచే సంకీర్తన సంప్రదాయం. బృందగాన సంప్రదాయం ఒకేరీతిగా కన్పించును. నృత్యమందు కొన్ని పోలికలు కన్పట్టును. వంగదేశంలో మాత్రం శాస్త్రీయ నృత్య వృద్ధి చెందలేదు. కళావంత నర్తకీసులు అభినయ కేళిక ప్రదర్శించినమూ అది వుత్తమ రీతిగాదు. వంగదేశీయులు గూడా మణిపుర నర్తనమునే ప్రదర్శింతురు.

విశ్వకవి రవీంద్రుడు ఒక ప్రత్యేక నృత్యరీతిని శాంతి నికేతనంలో వృద్ధిలోనికి తెచ్చారు. ఆ కళరీతియే పూర్తిగా వికసించి ప్రచారంలోనికి వచ్చిన దేశంలో ఒక నూతన సంప్రదాయం వర్ధిల్లగలదు. కథకళి, మణిపుర నృత్యరీతులయొక్క కలియకలతో, జానపద రీతులయొక్క చేరికతో తమయొక్క నృత్య నాటకాలను విజయవంతంగా ప్రదర్శించినారు. ఆ పద్ధతి ఒక నూతన శోభతో విరాజిల్లినది కాని ఒక విశిష్ట సంప్రదాయంగా ప్రచారంలోనికి రావడానికి కాలం పట్టును. అట్లే రవీంద్ర సంగీతరీతి - వ్రతాచారి సంఘము - శ్రీ దత్తుగారు ఈ సంఘమును స్థాపించినారు. ఈ సంస్థద్వారా వంగదేశంలోని అనేక జానపద నృత్య రీతులు ప్రచారంలోనికి వచ్చినవి అనేకమంది విద్యావంతులైన యువతీ యువకులు జానపదవిద్యల నభ్యసించారు ప్రచారం చేశారు. ఇందుమూలంగా జానపదనృత్యాలు కళలుగా గుర్తింపబడి గౌరవంగా చూడబడే అవకాశం యేర్పడుటయేగాక మరుగునపడిన రీతులన్నీ మరల ప్రచారంలోనికి రావడానికి అవకాశ మేర్పడినది.

ఆంధ్రదేశంలో సిద్ధేంద్రులవారు 'భామాకలాపం' రచన చేసి భాగవత సంప్రదాయం కూచిపూడివారిచే ప్రచారం చేయించారు. కూచిపూడి భాగవతులు ఆ విద్యను వృత్తిగా స్వీకరించారు. శంకరదేవ తమ మతానికి చెందిన శిష్యవర్గమందరూ ఈ విద్యను విధిగా అభ్యసించి కృష్ణకథలను నర్తనమాడి, ప్రచారంచేసి - ఆ విధంగా ముక్తిని పొందాలని ఆదేశించాడు. అందువల్ల భక్త బృందములవారే యీ విద్యను చేపట్టి ప్రచారం చేయుచున్నారు

వెతాళ నర్తనం - వంగదేశ ప్రాంతం నాగుల్లా అనే ఊరి తెగవారు ప్రత్యేకంగా ప్రదర్శించే నృత్తవిశేషం. నాగ వంశము

నాటి రాత్రి ముఖ్యంగా ప్రదర్శింతురు. బెహూళ ఒక రాజకన్య - మహా పతివ్రత - ఆమె భర్తను నాగుపాము కరచి ప్రాణములు గోల్పోవగా ఆ శవముతో నాగలోకం పయనించి నాగరాజును సందర్శించి, అతనికి ప్రీతిగొల్ప నర్తనంచేసి తిరిగి తన భర్త ప్రాణాలను సంపాదించుకుంటుంది.

## మణిపుర నర్తన కేళి

భారతదేశంలో నృత్యకళ పుట్టినతీరు, దాని ప్రచారంగూర్చి అవలోకించిన మనకు ముఖ్యంగా ముగ్గురు మహా పురుషులు గోచరిస్తారు.

నట మహానటుడు నటరాజమూర్తి, నర్తన మురళీ శ్రీ కృష్ణుడు, భారత యుద్ధ వీరుడు అర్జునుడు.

భారతీయులు తమ శాస్త్రీయ నృత్యానికి మూలపురుషుడు శివునిగా తెల్పుతారు. నటరాజమూర్తిగా అతని ఆరాధిస్తారు తరువాత వచ్చిన మహాపురుషుడు సంపూర్ణ అవతారమూర్తి వేణుగాన లోలుడు శ్రీకృష్ణుడు. వీరిద్దరూ నృత్యకళకు మూలపురుషులైననూ వీరు ప్రత్యేకంగా ప్రచారం చేసినట్లు గోచరించదు. ఆ కీర్తి అర్జునుని కొక్కనికే దక్కినది. అర్జునుడు దేశ సంచారం చేస్తున్నప్పుడు మణిపుర ప్రాంతంలో సంచరించిన సమయాన ఆదేశ రాజకన్య అతన్ని వలచి, పరిణయమాడినప్పుడు, వారిద్దరికలియక ద్వారా ఆ ప్రాంతంలో శాస్త్రీయ నర్తనం ప్రచారంలోనికి వచ్చినదట. అజ్ఞాతవాస సమయంలో విరాటరాజు దర్బారులో బృహన్నల రూపంలో ఆ రాచకన్యకు అతడు నాట్యం నేర్పినాడు. ఆ విధంగా మధ్యప్రదేశ్ లోని కొన్ని భాగాల్లోనూ, మళయాళ దేశ రాణి ప్రమీల అను పరిణయమాడిన సందర్భమున కేరళ దేశములోనూ అర్జునుని ద్వారా శాస్త్రీయ నృత్యం ప్రచారంలోనికి వచ్చినది శివుడు శిష్యుడు తండుడు ద్వారా ప్రచారమైన నాట్యరీతి తాండవమందురు. గాని తండుడు దేశసంచార మెక్కువగా చేసినట్లు కన్పట్టదు. శివుని అర్ధాంగి పార్వతీదేవి ద్వారా లాస్య నర్తనరీతి ప్రచారములోనికి వచ్చినది శివ సంప్రదాయమంతయూ నృత్తము, నృత్యము, ఆంగిక ప్రాధాన్యత గల్గిన అభినయ రీతికే అవకాశముంది. శివకథలందు, లీలలందు మనకు సాత్విక ప్రాధాన్యత గల్గిన అభినయానికి అవకాశం యెక్కువగా కన్పించదు శివపార్వతుల శృంగారాన్ని వర్ణించిన రచనలు వున్ననూ అవి స్వేచ్ఛగా అభినయించుటకు కళాకారుల మనస్సు జంకుతుంది. దక్షిణాదివారు శివుని పుత్రుడు సుబ్రహ్మణ్యస్వామి-వల్లీ ప్రణయ లీలలు వర్ణిస్తూ రచనలు చేసినారు. అవి హృదయానికి హత్తుకుపోయే రచనలు గావు కృష్ణ భక్తి, భాగవత కథలు అభినయించుట ప్రారంభించిన తరువాత సాత్వికాభినయం కొంతవరకు అభివృద్ధి చెందినది. అటుపై "రాధ" వచ్చింది. మన నృత్య సాహిత్యంలోనికి అమె రానట్లే గాదు. ఒక నూతన వెలుగును ప్రవేశపెట్టింది అదే ప్రపంచాన్ని సమ్మోహితుల జేసిన సాత్వికాభినయం. రాధ లేకుంటే మన నృత్య సాహిత్యంలో అంతటి మాధుర్యంతో కూడిన అభినయానికి అను కూలించే ప్రణయకవిత వచ్చేది గాదు రాధ లేంది జయదేవుడుండేవాడుకాడు, క్షేత్రయ్య పదములుండేవి గాదు, సాత్వికాభినయముండేది గాదు. శివతత్వ నృత్య కేళికలో నృత్య నృత్తాలు వృద్ధి చెందిన రీతిని రాధామాధవ మధుర భక్తి సాత్వికాభినయానికి ఆధార భూతమైంది ఆ రాధా మాధవ తత్వము విశేషంగా ప్రబలిన ప్రాంతాల్లో ఒక్కటి మణిపురము. మణిపురంలో ప్రాచీన దేవతారాధన నర్తనములు, శైవమత నర్తనములు, విష్ణు నర్తనాలు మూడు ప్రచారంలో వున్నవి.

'మైబీ' నర్తనం - పూజారినులు దేవతలు ఆవేశం పొందిన సమయాల్లో ప్రదర్శించే నర్తనరీతిగా పేర్కొనవచ్చును. 'మైబి'.

ప్రాచీన కాలంలో అన్నిదేశాల్లో దేవతలను ఆరాధించే వారు ప్రత్యేకంగా వుండేవారు గ్రీసులో 'ఆరెకల్సు' అని, శైవుల కాలంలో బసవిరాండ్రని పిలువబడేవారు యిట్టివారే వీరికి భగవదావేశం గల్గుట, అట్టి సమయాల్లో భూత భవిష్యత్ వర్తమానాలనుగూర్చి చెప్పుట, ఆ సమయాల్లో వారు చెప్పింది సత్యమగునని ప్రజలు విశ్వసించుట జరుగుచుండేది. ఈ 'మైబీ' అట్టిదనే తెల్పవచ్చును. ఈ పూజారి లేక పూజారిణి నృత్యంతో దేవతలను ఆరాధిస్తుంది. అటుపై దేవతలను వారిని ఆవేశించును. తరువాత ఫలితాలను చెప్పుటగూడా కలదు. ఇది అతి ప్రాచీనమైనట్టిది

"లయ హరోబా" - శైవసంబంధ నర్తనము. భూమిసృష్టి, జీవకోటి సృష్టినిగూర్చి తెల్పునట్టిదే లయ హరోబా.

మండిలచోలం - సంకీర్తన సంప్రదాయంలో ఒక భాగంగా స్త్రీలు చేసే నర్తనము, చేతుల్లో తాళాలు పట్టుకొని వాటిని తట్టుతూ నర్తనమాడుదురు.

పంగ్ చోలం - ఇది సంకీర్తనం సంప్రదాయం అటువంటిదే. స్త్రీలు చేతుల్లో తాళాలు ధరించి ఆడితే - పురుషులు మెడలో పొడుగాటి మద్దెళ్ళు (ఖోల్) వాయిద్యాలు ధరించి అనేక గీతాలు వాయిస్తూ వివిధ పాద విన్యాసాలుచేస్తూ నర్తనమాడుదురు.

రాస నృత్యము - మణిపుర సంప్రదాయాలన్నింటిలో రాస నర్తనం చాలా ముఖ్యమైంది అన్నింటిలోను 'మహారాస' చాలా విశిష్టత చెందినది.

ఆత్మ, జీవాత్మ, పరమాత్మల సంయోగాన్ని తెల్పునట్టిదే 'రాస' ఇది కృష్ణుడు, రాధ, గోపికల రూపంలో ప్రదర్శితమవుతుంది.

అనేక సమయాల్లో ఆడుటకు అనేకరకాల 'రాసకేళి' ప్రచారంలో వుంది. అవే మహారాస, వసంతలీల, కుంజరాస, నిత్యరాస, గోపరాస, ఉలూఖలరాస-ముఖ్యంగా యివ్వన్నీ రాధా మాధవుల ప్రణయగాధను చిత్రించును. కొన్నిమాత్రం కృష్ణుని బాల్యక్రీడలు చిత్రించునవిగా వుండును. అందు కృష్ణుడు, గోపికలు మాత్రం పాల్గొందురు. రాధ వుండదు.

కందుకక్రీడ గూడా ఒక ప్రత్యేక నృత్యకేళికగా వీరు కడు రమణీయంగా ప్రదర్శింతురు.

లయ హరోబా గురించి రెండుమాటలు చెప్పి ముగిస్తాను. ఇది సృష్టి క్రమాన్ని వర్ణించే నృత్యమని చెప్పాను. 'లైనమ్ జోగి' అని యిందులో ఒక భాగం. తొమ్మిదిమంది దేవతలు ప్రపంచాన్ని సృష్టించినట్లు తెల్పుతుంది ఇందులో ఆరుభాగాలుండును. మొదటి మూడుభాగాలు లాస్యరీతిలోనూ, మిగిలినవి తాండవపద్ధతిలోనూ ప్రదర్శింపబడును

## ఒరిస్సా ప్రాంతములోని నృత్యకళ

ఒరిస్సాలోని ఆలయ నర్తనరీతి "మహిర్", కేళికారీతి "ఒడిస్సీ" - ఈ రెండు వట్టువమేళ రీతులు. స్త్రీల సంప్రదాయ విద్యలు. ఒడిస్సీ భరతనాట్యంవలే నృత్త నృత్య అభినయాలతోకూడి వుండును. ఆటక్రమమును మంగళాచరణ, విటు, పల్లవి, అభినయ, మోక్షనట అని ఐదు విధములుగా విభజించవచ్చును.

మంగళాచరణ - జాగరణ, వందన, ప్రణామ మూడు భాగములు కల్గియుండును.

జాగరణలో నర్తకి కొద్దిసేపు నృత్తమాడి భూమాతకు నమస్కరించును. నృత్యసమయాన పాదతాడనము క్షమించుమని కోరుట - ఇన్ని అన్నిరీతులందూ వుండును. అటుపై విఘ్నేశుని స్తుతించుట, వందనము, శ్లోకమునకు అభినయం ప్రదర్శించుట. పిమ్మట దేవతలకు, గురువుకు, సభకు ముమ్మారు నమస్కరించుట ప్రణామము.

విటు నృత్య- ఇది ఒడిస్సీలోని ప్రత్యేక నర్తన విశేషము. ఇది ఇతర రీతులందు లేదు. ఆలయాల్లోని శిల్ప భంగిమలు, అందలి వివిధ వాద్యాలు వాయించే తీరులు అనుకరిస్తూ నర్తన మాడుటయందలి విశేషము. ఇది అనుకరణ నృత్తము.

'పల్లవి' అట శుద్ధ నృత్తము - జతిస్వరము వంటిది. ఇందు అనేక జతులు తీరకలు నృత్తమాడబడినపిదప అభినయము ప్రదర్శితమగును. ఈ అభినయములో రాధాకృష్ణుల ప్రణయ లీలలకు సంబంధించిన శృంగార గీతాలకు రసభావములు ప్రకటితమగును.

మోక్షనట ఆఖరిలో ప్రదర్శింపబడు నృత్త విశేషము. ఇది శుద్ధ నృత్తము - ద్రుతలయలో వుండును.

కొద్ది తేడాలతో ఈ నృత్యక్రమము భరతనాట్యమునుపోలి యుండును.

## చివరిమాట

దాక్షిణాత్యుల నాట్యకళా చరిత్ర పూర్తిగా చదివినారు. ఇందులో దక్షిణాదినేగాక పూర్తిగా భారతదేశంలో నున్న శాస్త్రీయ సంప్రదాయ, జానపద, అటవిక నాట్యాలూ, ఆరాధన, కేళికా నృత్యాలూ, నాట్య శాస్త్రాలూ వాటి ననుసరించి అభివృద్ధి చెందిన నృత్య సంప్రదాయాలు యివన్నీ వివరాంగా చర్చించ బడ్డాయి.

ఇదంతా చదివిన తరువాత మనం ధీర్ఘంగా నృత్యం, అంటే ఏమిటి ? అని ఆలోచిస్తే మనకు ఈ క్రింది అభిప్రాయం కల్గుతుంది.

సృష్టికి ఆధారమైన నాదం, ఆ నాదంనుండే శబ్దాలు, అక్షరాలు పుట్టుచున్నవి. ఆ అక్షరాల కూర్పే మాటలు, వాక్యాలై భాషయై విరాజిల్లి మన భావాలు, ఒకరితో యింకొకరు తెల్పుకొనుటకు సహాయపడుచున్నది. ఆ నాదాన్ని, అందలి గంభీరత, మాధుర్యాల్ని శరీరములో వివిధ విన్యాసాల ద్వారా ప్రదర్శించుటే నృత్యము. దాని వివిన్న రూపాలే నృత్తము, నాట్యం, నర్తనము, అభినయం, లాస్యం, తాండవము.

కనుక నాదమే సృష్టికంతటికీ మూలము.

<u>అనుబంధము</u>

# తాండవ లక్షణము - అభ్యాస క్రమము



( ఈ అభ్యాసక్రమము పురుషుల 'నాట్య మేళ', స్త్రీల "నట్టువమేళ" - రెండు సంప్రదాయముల ననుసరించి వివరించ బడినది రెండింటిలో కొద్దిపాటి భేదమున్ననూ, అభ్యాస క్రమము ఒకేరీతిగా వుండును.

ఇచ్చట తాండవమును గూర్చి కొద్దిగా వివరించుట అవసరము పురుషులచే చేయబడే ఉద్ధత కరణాంగహారములను గల్గినట్టి నర్తనము తాండవమనియూ, స్త్రీలచే చేయబడే కోమల కరణాంగ హారములను గల్గినట్టి నర్తనము లాస్యమనియూ - ఒక సంప్రదాయ నాట్యకళావేత్తల అభిప్రాయము

నర్తకి సభలో కూర్చొని శ్లోకములు, పద్యములు, గద్యలు, పదములు, జావళీలు యిత్యాది రచనలకు సాత్విక సంచారుల నభిన యించుట తాండవమనియూ, నిలిచి పల్లవులు, జతిస్వరము, తిల్లానలు, జక్కిణి యిత్యాది రచనలకు తాళ లయ బద్ధమైన హస్త పాద విన్యాసములను ప్రదర్శించుట తాండవమని నట్టువ మేళ కళావేత్తల అభిప్రాయము, పై రెండు పద్ధతులందూ ప్రయోగము చేయబడే విన్యాసముల గూర్చి తెలుపుచున్నాను )

తాండవ మనగా తాళలయల ననుసరించి, హస్తపాదము లను విన్యాసముచేయుట.

ఈ విన్యాసములు రెండువిధములు.

రస భావములు లేక కేవలము తాళలయలను అనుసరించి కాళ్ళు చేతులు తల నేత్రములు యిత్యాదులు కదిలించుట - ఇది శుద్ధనృత్తము.

రస భావములు కల్గియుండునట్టి హస్త పాద విన్యాసములు - ఇది నృత్యము.

ఈ రెండింటిని శాస్త్రీయపద్ధతిలో విన్యాసముచేయుటయే తాండవ మనబడును.

ప్రతి విన్యాసము కొన్ని శాస్త్రీయ కట్టుబాట్లకులోనై వుంటుంది వాటినే -

స్థానక, చారి, రేచక, భ్రమర, ప్లవన, మండల, కరణ, అంగహార విన్యాసము లందుము. ప్రతి శాస్త్రీయ నృత్యకేళిక వీటన్నింటితో మిళితమై వుండును మరియు భావాభినయంగాని, అర్థాభినయంగాని, లేని శుద్ధనృత్తముగాని ప్రదర్శించుటలో వీటి యొక్క ప్రయోగము వుండితీరును. అట్లు లేనిచో అది శాస్త్రీయ నృత్యముగాదు - కేవలము దేశి సంప్రదాయంగా మాత్రము పేర్కొనబడును.

ఈ తాండవ లక్షణంగూర్చి భరతుని నాట్యశాస్త్రంలోని ఒక విశేషము యిచ్చట తెల్పుట అవశ్యము -

భరతమహర్షి నాట్యశాస్త్రము రచనచేసి దాని ననుసరించి ఒక నృత్యనాటకమును రూపొందించి పరమశివునియెదుట కేళిక చేసినాడు ఆ కేళికనుజూచి శివుడు ఆనందించి, భరతుని తన చెంతకు పిల్చి -

అతని కేళిక బాగున్నదిగాని - అందు తాండవము లోపించిన దనియు, దేశి సంప్రదాయము చక్కగ పోషింపబడినను తాండ వము లేనిచో శాస్త్రీయత లోపించుననియూ, భరతుని తాండవ లక్షణం అభ్యసించవలెనని తెల్పి తన శిష్యుడు 'తండు'ని ఆ విద్య నేర్పుటకు యేర్పాటుజేసెను. తండువిద్వారా లోకానికి వచ్చిన విద్య గాన అది తాండవ మాయెను. అది శాస్త్రీయ కట్టుబాట్లుకల్గిన నృత్త, నృత్య విన్యాసము.

ఈ స్థానకములు, ప్లవనములు యిత్యాదులు నృత్యకేళికలో ప్రదర్శించుటకు ప్రారంభములో నర్తకులు సాముచేయుదురు. ఆ సాములో ప్రత్యేకంగా తయారుచేయబడిన తైలముతో శరీర మును మర్దించి, వివిధరకములైన దండెములు, మండెలు, బస్కీలు తీయుట, చిక్కులు తీయుట (కాలి చిక్కులు, చేతి చిక్కులు), గాలిలోనికి యెగురుట, కుప్పిలు యిత్యాదులు అభ్యాసము చేయు దురు, అటుపై స్థానక అభ్యాసము చేయుదురు.

కళాకారుల యొక్క ఉపయోగార్థము చిక్కులు తీయు క్రమము, సాము క్రమము కొన్ని చిత్రములు, వివరములతో యిచ్చుచున్నాము.

## సాము (చిక్కులు తీయుట)

నాట్య సమయములో వివిధ భంగిమలను పట్టుటకు; కర ణాంగ హారములను ప్రదర్శించుటకు, గతి విన్యాసములకు అను వగు విధమున శరీరమును తయారుచేయుటకు అనేక పద్ధతులలో సాము జేయించబడును అందులో 'చిక్కులు' దీయు విధము ముఖ్యమైనది. ఈ చిక్కులు చేతులతో, కాళ్ళతోగూడా తీయుదురు. ప్రారంభములో చేతులను వెనుక కట్టి వంచుటకు వీలైన విధమున దారము పట్టుకొని తీయుచు క్రమేణ దారము పొట్టిచేసి ఆఖరికి రెండు చేతులు కలిపి పాశహస్తము పట్టి తీయుదురు. అట్లే కాలు చెయ్యి కలిపిగూడా తీయుదురు ఈ సాధకవలన శరీరము స్వాధీ నములో నుండి చిత్తము వచ్చినట్లు మలచవచ్చును.







## చేతి చిక్కులు - తీయు విధము

సమముగా నిలబడి రెండు చేతులందు కపిత్థ హస్తములను పట్టి యిదిముగా వంచ చేతులను సులభముగా వెనుక ప్రక్కనుండి కాళ్ళ క్రిందుగా ముందుకు తెచ్చుటకు వీలైనంత పొడుగు దారమును తీసుకొని ముడివేసి దానిని రెండు చేతులల్లో పట్టి, చేతులను తలపైనుండి వెనుకకు రానిచ్చి రెండవ చిత్రమునందు వలె కాళ్ళ క్రిందనుండి ముందుకు, మరల యథాస్థానమునకు తేవలెను. కుడిచేతితో చిక్కులు తీయునప్పుడు కుడిచేయిని ముందుకు చాచి దాని వెనుక ఎడమచేతిని వుంచి కుడి కాలితో ప్రారంభించి యెడమకాలితో ముగించవలెను. అట్లే యెడమ కాలితో గూడా సాధనచేయవలెను.

## కాలి చిక్కులు

భూమిపై పద్మాసనము వేసి కూర్చొని, ఒక కాలును ముందుకు చాచి కాలి బొటనవ్రేలికి, కపిత్థము బట్టిన చేతి చూపుడు వ్రేలుకు దారమువేసి రెండవ చేతిని భూమిపై ఆనించి, కాలిని వెనుక త్రిప్పుతూ చేతిని తలపైనుండి రానిచ్చి భూమిపై ఆనించిన చేతి క్రిందుగా దారమును తెచ్చి మరల కాలును యథాస్థానములోనికి తేవలెను. కుడికాలితో ప్రారంభించినప్పుడు కుడిచేయి. ఎడమకాలితో ప్రారంభించినప్పుడు ఎడమచేతితో తీయవలెను.

## కర్రనాటు

కర్కట హస్తము-ఒకచేతి వ్రేళ్ళతో రెండవచేతి వ్రేళ్ళను చొప్పించి కర్రను పట్టుకొని, కాళ్ళ మునివ్రేళ్లపై నుండే కూర్చొని, ఒక్కొక్క కాలును ముందు వెనుకలకు చాచి. పాదముయొక్క అడుగుభాగము తలకు తాకునట్లు వలయము చుట్టవలెను. దీనివలన వెన్నెముకకు బలము చేకూరుటయేగాక నడుము, భుజములకు సాధన యగును.









సమము

## స్థానకములు

నృత్యముగాని, నృత్తముగాని ప్రారంభించుటకుముందుగా నిలబడే విధానము (కాళ్లు, చేతులను వుంచే విధము) స్థానక మనబడును.

ఈ స్థానకములందు నిలబడినతరువాత పాదములను విన్యాసము చేయుట 'చారి' యనియు, హస్తములను విన్యాసము చేయుట 'రేచక' మనియు, గాలిలోనికి యెగురుట 'ప్లవన'మనియు, తంగిమలుపట్టుట 'కరణ' మనియూ పిలువబడును. వీటినిగూర్చి వివరములు శాస్త్రపరిచయములో ఇచ్చియున్నాను.

ఈ స్థానకములందు ముఖ్యమైనవి 11 గూర్చి చిత్రములతో యిచ్చియున్నాను

## కొన్ని ముఖ్యమైన స్థానకములు

### వానిని పట్టే విధములు

1. సమము ; స్వభావసిద్ధముగా రెండు పాదములను చేర్చి నిలబడుట సమము. సహజముగా నిలబడుట. ఇందు రెండు చేతులను డోల హస్తములవలె యిరు పార్శ్వములకు జారవిడువ బడును. లేదా అర్ధచంద్ర హస్తములు పట్టి నడుముపై చేర్చ బడును

2. ఆలీఢ : ఎడమకాలును వంచి, దక్షిణ పాదముయొక్క కొనమండి ఐదుజానలు ముందుకుచాచి నటిన ఆలీఢ స్థానకమగును.



ఆలీఢ

3. ప్రత్యాలీఢ : ఆలీఢ విన్యాసమునే ఎడమప్రక్కకు చేసిన ప్రత్యాలీఢ మగును.



ప్రత్యాలీఢ

4. మండల : పాదములను యిరుప్రక్కలకు త్రిప్పి జానెడు యెడముగా నుంచి భూమిపై కూర్చొని, మోకాళ్ళు సమముగా వచ్చునట్లు చేసి పట్టిన మండలమగును.



మండల

5 వైష్ణవ : ఒక పాదమును సమముగా నుంచి, రెండవ పాదమును కొంచెముగా వంచి మొదటి కాలు ముందు ప్రక్కకు తీసికొనివచ్చి ప్రక్కగా వుంచిన వైష్ణవ స్థానకమగును.



వైష్ణవ

6. వలిత : ఒక కాలి బొటనవ్రేలు రెండవకాలియొక్క అనామిక, చిటికెన వ్రేళ్ళ మధ్యనుంచి మందముగా కదిలించిన వలితమగును.



వలితము

7. గతానుగత : పాదమును మందముగా చలింపజేయుచు ముందునకు వ్రేళ్లు వంగునట్లు చేసి. మెల్లగా ఆ పాదమునెత్తి మరల భూమిపై నుంచిన గతానుగత మగును.



గతానుగతము

8. వైశాఖ : రెండు పాదములను మూరెడు యెడముగా నుంచి తొడలను యిరుప్రక్కలకు వంచిన యెడల వైశాఖ స్థానకమగును.



9 అశ్వక్రాంత : ఒక పాదమును సమముగా నుంచి రెండవదానిని ముందుకుగాని, ప్రక్కకుగాని ఏడుతాళముల దూరమున నుంచిన అశ్వక్రాంత మగును.



అశ్వక్రాంత

10. మోదిత : ఎడమ పాదము సమముగా నుంచి కుడిపాదము ఎడమ పాదమునకు ఆరువేళ్లు ఎడముగా నుంచి క్రుంగునట్లు చేసి, కర్కట హస్తములు ఊర్ధ్వముఖముగా పట్టిన [illegible].



11. ఆయితము : కుడికాలు భూమిపై సమముగా నుండి ఎడమకాలు నెత్తి ముంగులుపై ఆనించి ఎడమప్రక్కకు శరీరాన్ని వంచి ఎడమచేత అలపల్లవము పట్టవలెను. ఇది ఆయిత మన బడును లక్ష్మికి చెల్లును.



ఆ యి త ము

# కరణములు - వాని విన్యాసము చేయు పద్ధతి

1. అతిక్రాంత
2. మయూర లలిత
3. లలాట తిలక
4. శకటాస్య

ఈ నాలుగు భరత శాస్త్రములో చెప్పబడిన 108 కరణము లలోనివి. వీనియొక్క సాధనవలన ముఖ్యముగా శరీరము స్వాధీన ములోనుండి మనము కోరినవిధమున విన్యాసము చేయుటకు వీలుం డును. 'అతిక్రాంత' నే 'మొగ్గవ్రాలుట' లేక 'వాలుమొగ్గ' అని పూర్వులు పిలిచెడివారు.

కరణము లన్నింటిలోను అతి కష్టమైనది శకటాస్యము. దీర్ఘకాలము సాధన చేసినగాని యీ విన్యాసము ప్రదర్శించుట కుదరదు. నర్తకి నాట్యమాడుతూ గాలిలోనికి యెగిరి కాళ్ళ వ్రేళ్ళ చేతులతో పట్టుకొని చక్రముగా తిరిగి మరల యధావిధిగా భూమిపై నిల్చి నాట్యమాడును ఇదంతయూ కొన్ని క్షణములలో ముగి యును. క్షణకాలములో గాలిలో వలయముచుట్టి మరల భూమిపైకి వచ్చుట యెంతకష్టమో వూహించిన ఈ కరణముయొక్క విశిష్టత గ్రహించగలము. నేటికినీ ఆంధ్రలోని దొమ్మరి వనితలు సునాయాసముగా ఈ కరణము ప్రదర్శించుట అచ్చటచ్చట చూడగలము.

ఈ కరణములు శాస్త్రీయంగా కొన్ని భావ విన్యాసములు చేయుటయందు వుపకరించు భంగిమలు ఇందు కొన్ని పురుషులు మాత్రము ప్రదర్శించిన రక్తివంతముగా వుండును. కొన్ని స్త్రీలు ప్రదర్శించిన శోభాయమానంగా వుండును.

## ఈ కరణములను పట్టే విధము

1. అతిక్రాంత : కాళ్ళను రెండు జానలు యెడముగానుంచి శరీరమును అర్ధచంద్రాకారముగా వెనకకు వంచి అరచేతులను భూమిపై మోపవలెను అటుపై నొసలు భూమికి తగులునట్లు భూమి దగ్గరకు తలను తేవలెను

ఇందు మరియొక విన్యాసమున్నది.

తలను పూర్తిగా పాదములయొక్క మడిమెలకు తగులునట్లు వంచి నర్తించుట. ఇది ప్రదర్శించునపుడు రెండు కాళ్ళు దగ్గరగా చేర్చి వుంచబడును. ఈ కరణ విన్యాసముతో గూడిన ఒక నృత్త విశేషము

నర్తకి రెండు కాళ్ళను జేర్చి పళ్ళెములో నిలబడును. పిమ్మట అతిక్రాంత విన్యాసము జేసి, అటుపై క్రమముగా తలను మడిమెలకు తగులునట్లు దెచ్చి చేతులను భూమినుండి వేరుపరిచి గాలిలో కదిలించుచూ 'మోడి' వంటి చతురశ్ర గతి సంగీతము నకు వలయములు తిరుగుచూ గతి విన్యాసము ప్రదర్శించుచు నర్తనము సల్పును.



అతిక్రాంత (మొగ్గుట)

2. మయూరలలిత : నెమలియొక్క సౌందర్య విన్యాసము.

చేతులను భుజములపైనుంచి కుడికాలు వెనుక ప్రక్కకు యెత్తిబెట్టిన తేలుకొండె వలె ముడువవలెను.

పిమ్మట హస్తములను పైకెత్తి, వలయములుగా త్రిప్పి యథాస్థానమునకు తేవలెను.

నడుమును గూడా వలయములుగా త్రిప్పవలెను.



మ యూ ర ల లి త

3. లలాట తిలకము : సమపాదములోనుండి కుడికాలును వెనుకకు వంచి నొసటి మధ్య భాగమునకు బొటనవ్రేలు తగులునట్లు తేవలెను. ఎడమచేతిని పైకెత్తి కాలి బొటనవ్రేలు ఎడమ చేతి బొటనవ్రేలు రెండును నొసటియందు తగులునట్లు పట్టవలెను.



లలాట తిలక

4. శకటాస్య : వర్తకి సమములో నిలువబడి శరీరమును వలయాకారముగా చుట్టవలెను. పాదము మడమలను పైకెత్తి బొటనవ్రేళ్ళపై నిలబడి మందముగా అడుగులు వేయుచు జరుగ వలెను. వక్షమును ముందుకు వొంగించవలెను సమమందు నిలువ బడి వలయముగా శరీరమును చుట్టునప్పుడు శ్వాసను బంధించ వలెను. శ్వాసను బంధించునప్పుడు కాలి బొటనవ్రేళ్ళపై భార మంతయూ మోపి నిలువబడి శరీరమును ఒక్కసారి కుదించి పైకెగిరివలయముగా తిరిగి మరల సమములో భూమిపై నిలువవలెను.



శ క టా స్య

# నృత్య నృత్తములో హస్తములను పాదములను విన్యాసము చేయు తీరులు

నృత్య నృత్తముల్లో అడవులు, జతులు, తీరికలు ప్రదర్శింతుము. విన్యాసములు యెన్నో విధములుగ వున్నను, జతులెన్ని విధములుగా మారినను, యతులు కూర్చబడినను, జాతులు కూర్చబడినను, విన్యాసక్రమము మాత్రము 5 విధములుగా మాత్ర ముండును. అంతకు మించిన క్రమము లేదు. ఏ విన్యాసమైనను యీ ఐదు క్రమములందే వచ్చిచేరును.

ఆ విన్యాసములను తెల్పే చిత్రము విచ్చట విచ్చియున్నాము.



కరణములను ప్రదర్శించుటకు స్థానకములు, చారులు, రేచకములు అవసరము. వాటినే అడవులు, అడుగులు అని పిలుస్తాము. అవి 'తై' అడవులు, 'దితై' అడవులు, 'తైయ్యుం దత్తా' - 'తాదితై' - మండె, జారు, ఒడ్డిక, కుప్పిలు మొదలైన రకాలుగా వున్నవి. 'వాటిని అభ్యాసం చేసే క్రమము యిచ్చట యిచ్చియున్నాను.

## కొన్ని అడవులు

1  2
1. త - తై (1 వ నంబరు కుడిపాదము)
(2 వ నంబరు ఎడమపాదము)
+  ο
త - తై + పాదము భూమిపై తట్టుట)
(ο విశ్రద్ధము
1  2  1  2
త - తై; త - తై
1  2
త త - తై తై

1  2
2. త త త - తై తై తై
1  2
త త త త - తై తై తై తై
1  2
త త త త త - తై తై తై తై తై

*  *  *  *

1 2  2 1
3. త తై - తై త
ο 2  ο 1
త తై  తై త
1 ο  2 ο
త తై  తై త

*  *  *  *

1  2
4. త - తై
1  2
త త  తై తై
1 2 1
త తై త
1 2  1 2 1
త తై  త తై త
1 2  1  1 2  1 2
త తై  త  త తై  త తై
1 2  1 2 1  1 2  1 2
త తై  త తై త  త తై  త తై

*  *  *  *

+  +
5. త - తై
+  +
త త - తై తై
+  +
త త త - తై తై తై
+  +  +  +
త త  త త - తై తై  తై తై
+  +  +
త త  త  త త
+  +  +
త త త  త త  త త
+  +  +  +
త త త త  త త  త త  త

*  *  *  *

+  +
6. త — తై
ο +  ο +
త త — తై తై
ο  +  ο ο +
త త త — తై తై తై
ο +  ο ο +
త త  త త త
ο ο +  ο +  ο +
త త త  త త  త త

*  *  *  *

+  +
7. త — తై
+ +  + +
త త — తై తై
+ + +  + + +
త త త — తై తై తై
(ఈ విధం ఒకటినుండి తొమ్మిది అక్షరములవరకు అవగా- 1, 2, 3, 4, 5, 7, 9. వరుసగా ఒక్కొక్క కాలును భూమిపై తట్టుతూ అభ్యాసం చేయవలెను.)

*  *  *  *

1  2
10. గిణతోం = ది తి తై
దిగిణతోం = ధి తి తె

తదిగిణతోం = తై ది తి తై
తక తదిగిణతోం = తై తై ది తి తై
తకదికి తదిగిణతోం = తై తై తై ది తి తై
(1. మృదంగంలో పలికే శబ్దక్రమము
2. కాలితో పలికే శబ్దములు.)
ది – మడమ
తి – పాదము ముందరిభాగము
తై – పూర్తిపాదము.

కుడికాలుతో ప్రారంభించిన యెడల ది – తి – కుడి పాదముపై పలికించి తై – పూర్తిగా ఎడమ పాదముపై పలికించ వలెను. అదే క్రమము యెడమ పాదముతో ప్రారంభించినప్పుడూ అనుసరించవలెను.

ఇందు ముందడుగులు – వెనకడుగులు రెండు రకములు – ముందడుగులో ది – తి – వేయునప్పుడు కాలు యథాస్థానము నుండి ముందుకు వచ్చును తై – రెండవ పాదము వున్నచోటనే తట్టబడును. ఇదొకక్రమము

మరొక పద్ధతి.
ది – కుడిపాదము మడిమ
తి – ఎడమ పాదము పూర్తిగ తట్ట
తై – ముందుకు చాచిన కుడిపాదము వెనుకకు తెచ్చి పూర్తి పాదము తట్టుట.

మొదటి క్రమము గతుల ఆట యందును రెండవ క్రమము అడవులందు, తీర్మానములందు పట్టబడును.

* * *

అడవులు పట్టే పద్ధతి–
ది తి తై – ది – కుడి మడమ.
తి – ఎడమ పాదము
తై – కుడి పాదము

* * *

తై ది తి తై – తై – కుడి పాదము వున్న చోటనే తట్టవలెను. మిగిలిన క్రమము ఒకటే

* * *

తై తై ది తి తై – రెండు పాదములు ఒకటి తరువాత ఒకటి భూమిపై తట్టవలెను – ది–తి–తై క్రమము ముందటి వలెను

తై తై తై ది తి తై – తై, తై, తై – ముందు ఒక కాలు తరువాత రెండవ కాలు అటుపై మొదటి కాలును తట్టవలెను – ది తి తై ముందటి వలెనే –

ఇట్లే వెనక అడుగుకూడా వుండును. ది–తి–తై – కి కాలు రెండవ పాదం వెనుకకు తీసుకొనిపోయి తట్ట బడును.

* * *

గిణతోం – తదిగిణతోం – తక తదిగిణతోం – యిత్యాదుల ఆట క్రమములో హస్తములు కోణములుగా వుండును

తరికిటతోం – తక తరికిట తోం – తకదికి తరికిటతోం–; ధిగ్గుడుతోం; కిటతక ధిగ్గుడు తోం: తరకిట తక దిరికిట తక: ఇత్యాది శబ్దములు పలికించినప్పుడు హస్తముల విన్యాసములు వలయములుగాను – అర్థ చంద్రాకారముగానూ వుండును.

కొన్ని అడుగులు భూమిపై సమముగా నిల్చి పట్టబడేవి – కొన్ని భూమిపై మండె కూర్చుని పట్టబడేవి వున్నవి. కొన్ని గాలిలోని ప్రక్కలకు ఎగిరి పట్టేవి – కొన్ని కుప్పించి వున్న చోటనే రెండు కాళ్ళతోనూ. ఒక కాలుతోనూ ఎగిరి పట్టేవి – కొన్ని మండె కూర్చొని గాలిలోనికి ఎగిరి పట్టే అడవులు – కొన్ని ముందు వెనకలకు. ప్రక్కలకు. వలయములుగా పట్టేవి వున్నవి. వీటికి శబ్దములు ఒక్కటే అయినా – వివిధ పద్ధతుల్లో పట్టబడుటచే అంగ విన్యాసములు మారును.

11. కోణాకార, వలయాకార విన్యాసములు–మృదంగ తీరికలు –
(అ) తదిగిణతోం – తక తదిగిణతోం –
తకదికి తదిగిణతోం –

* * *

(ఆ) తై దితి తై – తై తై దితి తై –
తై తై తై ది తై తై –

* * *

(ఇ) తై తరికిటతై – తై తై తరకిటతై
తె తె తె తరికిటతె –

(ఈ) తై ధిగ్గుకు – తై తై ధిగ్గుడుతై –
తై తై తై ధిగ్గుడుతై:

* * *

ఇందు – (అ) సాధారణం వాయించే మృదంగ తీరిక విధానం.
(ఆ) కోణాకార అడవులు తీరిక విధము.
(ఇ) వలయాకార హస్తవిన్యాసాలు
(ఈ) పాదములతో వలయంగా తిరుగువిధము.

* * *

తీర్మానము ఒకటే అయినను ఆ శబ్దజాలముల తీరునుబట్టి హస్తపాద విన్యాసములు మారును. ధ్వని, శబ్దచిత్రము ననుసరించి నర్తకులు హస్తపాదముల విన్యాసములు చేయుదురు. అడవులకూర్పు, హస్తపాద విన్యాసాలూ ఎప్పుడూ మృదంగ వరుస క్రమము (నాట్యరీతి) ననుసరించి యుండును.

ఉదా : తాం - దిగి తై దిగితై అను క్రమమును నర్తన మాడవలెనన్న నర్తకి ముందుగా "తాం" అను శబ్దానికి గాలిలో యెగిరి అటుపై భూమిపై పాదమును తట్టుతూ 'దిగితై' నడకను ఆడును.

సంగీతంలో రాగములు యెన్ని ఏర్పడినను ముఖ్యమైన స్వరములు - స, రి, గ, మ, ప, ద, ని ఏడు అయినట్లూ -

నాట్యంలో ఎన్నిరకములైన అడవులు, అడుగులు, జతులు, తీర్మానాలు ప్రదర్శింపబడినను - ముఖ్యమైన క్రమము అడవులు పదునెనిమిది మాత్రమే - వాటియొక్క క్రమబద్ధమైన వివిధ అడుగుల కూర్పు, తీర్మానములవల్ల - ఎన్నోరకములుగా ఏర్పడుతున్నవి నావద్ద సుమారు రెండువేలకు పైగా జతులున్నవి. అవి వివిధ జాతుల్లో, యతుల్లో, గతిబేధాల్లో వున్నవి. అందు కొన్ని మాత్రం యిచ్చట వ్రాస్తున్నాను -

తై - అడవులు.
ది తై - అడవులు
తైయ్యాతై - అడవులు.
తాదితై - అడవులు
తై య్యాతై - అడవులు
తైయ్యందత్తా - తైయ్యాతాహ - అడవులు.
తైయ్యా తైహి - అడవులు
తాం తై - అడవులు.
తైయిత్త తజ్ఝం - తైయిత్త తై - అడవులు.
తై తై తాం - తై తై తాం - అడవులు.
తై తై తా కిటతక - తై తై తాం
ఈ విధంగా అడవులు వున్నవి.

ఇవన్నియూ ముందుగా సాధన చేసిన పిదప ఒక స్థానము, అటుపై చారులు (భూ, ఆకాశ చారులు) మరల ఒక కరణము, ఒక గతి విన్యాసం చేర్చి తీరిక లివ్వబడును. ఇవియే జతులు అందము. దీనినే చారీ అలంకార క్రమమని గూడా పిలుతురు.

## కొన్ని తీర్మాన విధములు

(అ) త క ది కి త ది గి ణ త
త క త ది గి ణ త
త ది గి ణ త
ది గి ణ త
గి ణ త ॥

(ఆ) గి ణ త
ది గి ణ త
త ది గి ణ త
త క త ది గి ణ త
త క ది కి త ది గి ణ త ॥

*  *  *

(ఇ) ది గి ణ త
గి ణ త
త క త ది గి ణ త
త ది గి ణ త
త క ది కి త ది గి ణ త ॥

(అ) యందువలె ముందు ఎక్కువ అక్షరములతో ప్రారంభించి పోనుపోను తగ్గించబడును.

లేక

(ఆ) యందువలె తక్కువ అక్షరములతో ప్రారంభించి పెంచబడును

(ఇ) క్రమములేక ఎగుడుదిగుడుగా కూర్చబడును.

*  *  *  *

కొన్నింటియందు మూడుముక్తాయిలు ఒకేరీతిలో వుండును.

ఉదా : తక దికి తదిగిణ తోం
తక దికి తది గిణ తోం
తక దికి తదిగిణ తోం -త-

*  *  *  *

తక దికి తదిగిణ తోం
తక దికి తదిగిణ తోం
తక దికి తదిగిణ తోం -తై-
ఈ విధంగా నుండును.

*  *  *  *

ఈ విధంగా అనేక విధములైన కూర్పులవల్ల వివిధ అలంకారములతో తీర్మాన పద్ధతులు ఏర్పడుచున్నవి

అడుగులకు వరుసల అభ్యాస క్రమము.

1 త - తై ; త - తై ॥
2. తైయ్యా తై ; తైయ్యా తై ॥
3. తై తైయ్యా తై - తైయ్యా తై ॥
4. తై తైయ్యా తై - తైయ్యా తై ॥
5. తై తై । ది త తై - తైయ్యా తై ॥
6 తై తై । దిత్త తై । తై దిత తై - తైయ్యా తై ॥

7. తై తై తైయ్యతై - తై దిత తై - తైయ్యతై ॥

8. తైయ్య తైయ్యా - తై దిత తై - దిత తై - తైయ్యా తై ॥

9. తైయ్య తై - తైయ్యా తై - తై దిత్త తై - దిత్త తై - దిత్త తై - తైయ్యా తై ॥

10. తైయ్య । తైయ్య - తై దిత్త తై - తై దిత తై - దిత తై - తైయ్య తై ॥

11. తై తై । తైయ్యా తై । తై దిత తై । దిత తై । తైయ్య తై ॥

12. తైయ్య తై తక - తక తక - దికి తక -
తాం త - తై త - తక తైయ్య తై ॥

13. తైయ్య తైయ్య తై - తై తై దిత్త తై -
తైయ్య తై తక తైయ్య తై ॥

14. తై తైయ్యత్ తై - తైయ్య తై తక -
దిత తై - దిత తై - ది తైయ్య తై ॥

15. తై తైయ్యా - తైదిత తై - తై తై త త -
తై దిత తై - దిత తై తక - ది తైయ్యా తై ॥

* * * *

వివిధ రకముల తీర్మాన పద్ధతి :

1. తధీం గిణ తోం - తధీం గిణ తోం -
తధీం గిణ తోం - త ॥

2. తక తది గిణ త - తధీం గిణ త - త ॥

3. తధీం గిణ తోం - ధీం గిణ తోం -
గిణ తోం ॥

4. తక తదిగిణతోం - తధీం గిణ తోం -
ధీం గిణ తోం ॥

5 తత్తళాంగ్ - తది గిణ తోం -
తది గిణ తోం - ది గిణ తోం - గిణ తోం ॥

6 తది గిణ తోం - తక తది గిణ తోం -
తత్తళాంగ్ తది గిణ తోం ॥

7. తళాంగ్ - తక దికి - తక తది గిణ తోం ॥

8. గిణత - ది గిణత - తత్తళాంగ్ తక -
తధీం గిణ తోం - గిణ తోం ॥

9. తక దికి - తక తరికిట త - తధీం గిణ తోం -
తక దికి - తక తరికిట త - ధీం గిణ తోం - గిణ తోం ॥

10. గిణత - ది గిణత - ధీం గిణత - కిటతక తరికిటత -
తత్తళాంగ్ - తదిగిణతోం - తధీం గిణతో - తక తోం॥

* * * *

పాల వరుసల అభ్యాస పద్ధతి.

1. తైయ్య తైతక - తక తక - దికి తక -
తాంత తైత తక - తక తదింగిణతోం ॥

2. తై. ది తాం తరి - తై తక దికితక
తాం. దితాం తరి - తక తదీం గిణతోం ॥

3. తై తై య్య తై - తత్ తై తకతై
దిత్ తై తక తై - తాం తై య్యతక.
తక తదింగిణతోం ॥

4. త్రాం తై య్య తక - తక దికి ఝణుతక -
ఝం ఝాంత తక - ఝక ఝక దిగి తక -
ఝ ఝాంత ఝకఝక - తది గిణ తోం ॥

5 తోం తోం - తోం తోం - తోంగిట కిటతక -
తరికిట కిటతక - తఝాం ఝంత తక
ధిర్ధిత - ధిర్ధి త - తై దిగి దిగి
ఝణు తక - తఝం - తక ఝం -
తదీం గిణ తోం - త దీం గిణతోం -
తది గిణ తోం ॥

6. తరికిట తరికిట ఝంతా తరికిట -
ఝంతా తరికిట - ఝంతా తరికిట -
తరికిట తోం - తరికిట తక -
తక తక ఝణుతా - తత్తా కిట తక
తదిగిణత - దిగిణత - గిణతా ॥

ఇవన్నీ అభ్యాసమునకు హస్త పాద విన్యాసాలు శుద్ధంగా ఏర్పడుటకు ఉపయోగపడునట్టివి ఈ క్రమములను ఆటలో వుపయోగించుకోవలసి తాళబద్ధం చేసుకోవలెను

* * * *

జతుల అభ్యాస క్రమము :

1. త తై తాహ - ది తై తాహ
త తై తాహ - తాం దిత తై ॥ 2 ॥
త తై తాహ - తాం దిత తై
దితై తాహ - తాం దిత తై
త తై - ద తై
తాం దిత తై
తై తై - దిత తై - తై - దిత తై ॥

* * * *

ఆ తై - తై - దత్త తాం
తాతై దత్తాం - తై దత్తాం
తై దత్తాం దత్తాం కిటతక
తదిగిణతోం । తక తదిగిణతోం
తత్తళాంగ్ । తదిగిణతోం

* * *

2. దిం తా - తై - దత్త - తాం దికతా
దిం దిమిత - దిమిత - దింతా ॥
దింతా తై దత్తా తాందికి
దిగితా । తైదత్త తాందికి
దింతా దిగితా ।
దింతా దిగితా ।
తదిగిణతోం - తక తదిగిణతోం
తత్తళాంగ్ । తదిగిణతోం ॥

* * *

3. దందం - దం - దందం ధాకిట
దిందిం - దిం - దిందిం ధీకిట
ఝంఝం - ఝం - ఝంఝం ఝేకిట
దందం - ఝంఝం - ఝంఝం - ఝుఝుం
దంత - ఝంత ఝం - ఝంత - ఝంతఝు
దాంత - ఝాంత - ఝాంత - ఝాంత
తదిగిణతోం-తక తదిగిణతోం - తత్తళాంగ్-తదిగిణతోం.

## స్వరపద్ధతి జతి :

తత్త ఝంత - ఝుం - తఝం ఝాంత - తక తకుందరి కిట తక - తాకిట తక - ధీకిట తక - తకుందరి తక - దరికిట దరి కిట - తకతా - కిటతక - కిటతక్ - కిటతక్ - కిన్నగ - కిటాకు కిట కిటాకు - తక - తకఝక - ఝణుతక - ఝణుత - ఝణుత - తహ - తపణత - ధణదిమి - ధిమిత ధిమిత - కిట - దిరి దిరి-దేంకిట - ధీంకిట - ధికిట తకిట - తత్తరి - ఝణు ఝణు - తాహంత-ధణదిమి-ధిమిధిమి - కిన్నగ - ధీంకిణాంగ్ - కిణాంగ్ తక - తక తక - దికి తక - తదిగిణతోం -

ఈ రీతి జతి కట్టుబాట్లు 'పేరిణి' యిత్యాదులందు ప్రదర్శితములగుచున్నవి.

* * * *

## శబ్ద ప్రాధాన్యత :

ధిన్నం - తద్దిన్నం - తకధిన్నం - తత్త ధిత్త ధింధిం కుకు ధిన్నం - తత్త రిత్త తధేధేత్త ధిన్నం - తధే ధేత్త తధే ధేత్త ధిన్నం - దిగి ధిన్నం - దిగి దిగి ధిన్నం - దిగి దిగి వగదిగి ధిన్నం - ధీం ధ్రింకు ధ్రిం ధ్రిం కుకు ధిన్నం - కుందరి ధిన్నం - కుకుందరి ధిన్నం - కుకుంద తకుంద కిట తకుందరి ధిన్నం - తకుంద తకుంద కిట తాంగిట ధిన్నం - ధోంగిట ధోంగిట దాగా దో ధిన్నం - దిద్దిన్నం - దిగి దిన్నం దిగిదిగి వగ దరి తోం.

* * * *

## రసప్రాధాన్యత గల్గిన జతి :

ద్ధళాంగ్ - ధళ - ధళధళ - ళాంగ్ -
ధగధ్ ధగధ్ - ధీం - ధీంకిట కిట తక
ధిగిధ్ ధిగిధ్ - ధీం ధీంకిట కిట తక
ద్ధళాంగ్ - ధళ - ధళ ధళ - ళాంగ్ -
తర్రంగ్ - తుంగత్తా కిట తక - ధా కిట తక -
ధిమికిట తక - దిద్ది తళాంగ్ -
ధిర్గుకు తై త తై - ధిర్గుడు తై త తై తై ॥
తుంగా తత్తుంగ - తక తుంగ - తక తక తుంగ -
తరంగ తుంగ - ధిగి తక -

తత్త రిత్త - ధిం తా కిట కిట తక ధీ కిట ధీ కిట ది కిట తకిట - తత్త రిత్త - తద్ది కిట తక ఝుం - తాకిట తక ఝం -

* * * *

## తీరికల విధము :

1. తై తై తై దిత తై
తై తై దిత తై
తై దిత తై
దిత తై ॥

* * * *

2. తై. తై - తై తై దిత తై - తై దిత తై
తై తై దిత తై - తై దిత తై
దిత తై ॥

* * * *

3. తై దిత తై
తై తై దిత తై
తై తై తై దిత తై - దిత తై ॥

4. తాం
తై దిత తై
తై తై దిత తై

తై తై తై దిత తై
తై తై తై దిత తై
తై తై దిత తై
తై దిత తై
దిత తై

• • • •

5\. తై దిత తై । తై దిత తై । తై - తై
తై దిత తై । తై దిత తై । తై - తై ॥

• • • •

6\. ఉత తై తై - దిత తై తై
ధీ తరికిట తై - తై - తై - తై ॥ ॥ 2 ॥
ఉత తై - ధీ తరికిట తై
తై - తై తై - దిత తై ॥ 2 ॥
తై - తై తై - దిత తై - తై ॥ 3 ॥

• • •

7\. తైయుత తై - తై దిత తై -
తైయుత తై - తై దిత తై - తై -
తై తై ఉత తై ॥ 2 ॥
తై తై దిత తై - తై ఉత తై -
దిత తై - తై ॥ 3 ॥

• • •

8\. తై - తై - తై దిత తై - దిత తై - తై
తై తై దిత తై - తై ॥ 2 ॥
తై - తైదిత తై - తై తై దిత తై - తై తై తై
దిత తై - దిత తై ॥ 3 ॥

• • •

9\. తై -
దిత తై - తైధీ తరికిట తై -
ధీ ధీ - తరికిట తై - తై -
కిటతక ధిరుధుతోం ॥ 2 ॥
ధీ తరికిట తై - ధీ ధీ తరికిట తై -
తై తైయ్యా తై - తైదిత తై - దిత తై ॥ 3 ॥

• • •

10\. తై తై - తైదిత తై - తై తైయ్యా తై -
తై తైదిత తై - తై - తరికిట తై ॥ 2 ॥
తైయ్యా తై - తై తై దిత తై - తై ॥ 3 ॥

• • •

## జతి విధానము :

1\. తంద్ధ తక తక - తంద్ధ తక తక
తంద్ధ తక తక - తకాంగ్ తోం
ధీంద్ధి దిగి దిగి - ధీంద్ధి దిగి దిగి
ధీంద్ధి దిగి దిగి - ధీం గిణతోం ॥
తంద్ధ తక తక తకాంగ్ తోం
ధీంద్ధి దిగి దిగి ధీం గిణతోం
తాం తక - ధీం తక తకాంగ్ తక
తక దికి తక - తక దికి తక -
తదిగిణతోం - తత్తకాంగ్ తదిగిణతోం

• • •

2\. తాహత జంతరి - త । త జంతరి - త -
తత్త రిత్త జణు తకుందరి కిటతక ।
తత హత జంతరి - త । త జంతరి - త -
తత్త రిత్త జణు తకుందరి కిటతక ।
తకు దణేకు - దివకిట కిటతక
తధీ ధీత్త తోం తోం తోం ।
తకకు ధణేకు దివకిట కిట తక.
తధీ ధీత్త తోం తోం తోం ॥
తకు ధణేకు దివకిట కిట తక
తకకు ధణేకు దివకిట కిటతక
తధీ ధీత్త । తధీ ధీత్త । కిట తక జం ॥ 3 ॥

• • • •

3\. తాకు కుందా కుకుందా - తక కుకుందా కుకుందా
తా తరి కిట తై - తై తరికిట జం -
తాకు ధణేకు దివకిట కిట తక
తా తరికిట తై - తై తరికిట జం -
తాకు ధణేకు - దివ కిట కిట తక
తకకు దణేకు - దివకిట కిట తక
తా తరికిట తై - ।
తాకు ధణేకు - దివకిట కిటతక
తా తరికిట తై -
తకకు ధణేకు - దివ కిట కిట తక
తా తరి కిట తై -
తరేకు ధణేకు తై తరికిట తై ॥
తై - య్యా తై - య్యా తై -॥

• • • •

4\. త - దిత్త.
తై - త తై ॥2॥
తదిత - తై త తై
తదిత - తై త తై

ది త్త । తరికిట తక - తాగాంగ్ తక ।
తరికిట తక
త త్త । తరికిట తక - తగాంగ్ తక ।
తరికిట తక
తా ధీ గి ణా తోం తా
తది గిణ తోం
తధీం గిణ తోం
తదిగిణత - తదిగిణత - తదిగిణత
త త్త ఝణుత - ఝణు
తరిత ఝణుత - ఝణు
తరిత ఝణుత - ఝణు
తకత ఝణుత ఝణు
తాక ధిణకు - ఝం
ధిణకు కిణకు - ఝం
తకకు ధణకు - ఝం
ధణకు కిణకు - ఝం
తీర్మా॥ తద్ధి ఝంతరి - త
తత ఝంతరి - త
ఝంతరి - త
తక ధి ఝంతరి - త
తత ఝంతరి - త
ఝంతరి - త
తక దికి త ది గి ణ త
తక త ది గి ణ త
త ది గి ణ త
ది గి ణ త
గి ణ తోం ॥

5. ఝం - తఝ్ఝం - కిటతక -
తఝంత తఝంత ఝం ॥ 2 ॥
ఝంత ఝంత ఝం
ఝంత ఝంత ఝం
తఝ్ఝం ఝంత ఝ్ఝం ॥ 2 ॥
తాకిరతక - ఝంతరి - తఝం ఝంత ఝం
ధీకిర తక - ఝంతరి - దిఝం ఝంత ఝం
తాంగిర తక - ఝంతరి - తతోం తోం తతోం
ఝంగిర తక - ఝంతరి - ఝఝం ఝంత ఝం
తా కిర తక - ధీ కిర తక
తోంగిర తక - ఝం గిర తక
తా - తఝం - తఝం - తఝం
తా తా - ది ది - తో తో - ణ ణ
తాకు ధిణకు ఝం - ధిణకు కిణకు ఝం
తాకు ధిణకు ఝం - ధిణకు కిణకు ఝం -

తీర్మా ॥ ఝంతా కిటతక తరికిట
తరితా కిటతక తరికిట
ఝంతా కిటతక తరికిట
ఝం తఝం । తఝం తఝ్ఝం
త ఝ్ఝం తా ।
కిట తక తరిగుడుతోం । కిట తక తరిగుడుతోం
కిట తక తరిగుడు తోం ॥

◆ ◆ ◆ ◆

6. త ఝం - త క ఝం
త త్త రి త్త ఝం -
త ఝం ద రి కిట తక -
తా కి ట తై య్యా -
తా తా - ధీ ధీ - తోం తోం - ణ ణ
తద్ధీ కిర తక ఝం -
త ఝ్ఝం - తద్ధీ తక
తక ఝం - తద్ధీ తక
తఝ్ఝం - తద్ధీ తక
త క ఝం - త ద్ధీ త క
తై
తై హి వ దత్త తాం - తై హిత దత్త తాం
తై హివ దత్త తాం - తై -
తద్ధీ కిట తక ఝం - ధీ కిటతక ఝం
ధీ కిట తక ఝం - కిట తక ఝం । 3 ।
ధీ కిట తక ఝం - ధీ ధీ కిట తక ఝం - ఝం ॥

7. ది తై య్యా - తై య్యాకు - ధిన్నకు - కిట్టకు -
ధీంత - ధిన్నత - తాంత - తై య్యా త్త
దివకిట - దివకిట - దివకిట -
తాం తై -
దివతా - దివతా - దివతా - కిట తక తా ॥
తతై య్యా - తై య్యా త్త - తాంత - తై య్యాత
ధీం త - ధిన్నత - ధీంత - తై య్యా త్త
దివకిట - దివకిట దివకిట
తాం - తై -
దివతా - దివతా - దివతా కిట తక తా ॥
త త్త ది త్త దింత
తా కిట తక - తై య్యా త్త
ది త్త ది త్త దింత
ధీం కిట తక - తై య్యా త్త
దివకిట దివకిట దివకిట తాంతై । 3 ।

తాంత దివకిట తై
దివకిట తై । దివకిట తై ॥

♦ ♦ ♦ ♦

8. తతై య్యా - తై య్యా త్త
దింతక్క - దింతక్క
తాంత - తై య్యా త
దింతక్క - దింతక్క
తాంత - ధీంత - తతై య్యా - తై య్యా త్త
ధింతత - తద్ధింతక
కిటతక ధీంతక - కిట ధీం తక ॥ ? ॥

దింతత - దిగి తత - తాంతై
దింతత - దిగి తత - తాంతై
దింతత దిగి తత తై
దింతత దిగి తత తై
దిగితై దిగితై ॥
తద్ధి తాం - జంతరి తా-
కిటతక తాం తరితాం-
కిటతక తాం తరితై-
తాకు దణకు కిణ - తకుందరి కిటతక
జంతరి తా - కిటతక తాం తరితై ॥

* * * *

తక దిత్తాం - జంత రితా -
కిటతక తాం తరితాం-
కిటతక తాం తరితై-
తాకు దణకు కిణ
తకుందరి కిటతక
జంతరితా - కిటతక తాం తరితై ॥

* * * *

తాంగుడు తాంగుడు తాంగుడు
కిటతక
ధీ ధీ నంగిట కిటతక
తొంగిట కిటతక - కిటతక తా-
తాంగు జంత తరి
తాంగు జంత తరి ॥ 2 ॥

* * *

తా తతై - తత్తా - తతై
తా తతై - తతా తతై

తక్కిట కిట తక-
ధిక్కిట కిట తక
తొంగిట కిట తక
ణంగిట కిట తక-

♦ * *

తద్ధి జణుతరిత - తక జణుతరిత-
తక దికి తక జణుతరి-
తక దిజ్ఞణుతరిక - తక జణుతరిత
తక దికి తక జణుతరి-
తక ధీకి తక తదిగిణ - తక తదిగిణ -
తదిగిణ - తత్తాంగ్ - తదిగిణతోం

* * * *

మృదంగ జతిని కూర్చే విధాన మున్నట్లే - నాట్యంలోగూడా జతిని కూర్చుటకు ఒక క్రమపద్ధతిని అనుసరింతురు. అదే వారి అలంకార పద్ధతి అనబడుతుంది.

సాధారణంగా మృదంగ జతిని కూర్చేటప్పుడు :

తత్కారం - చందోరీతి - ముక్తాయి - కొన్ని సమయము లందు జాతీర్ల పడికలు యివన్ని చేర్చికూర్చబడును.
తత్కారం :- తద్ధీ కిణణక జం త తదిగిణతోం.
చందోరీతి - తద్ధీనుత ధిమి - తాహత జంతరి

ద్ధీనుత ధిమి - తాహత జంతరి
తక ధీనుత ధిమి - తాహత జంతరి
ద్ధీనుత ధిమి - తాహత జంతరి
తద్ధీనుత దిమి - ద్ధీనుత ధిమి
తక ధీనుత దిమి - ద్ధీనుత దిమి
తద్ధీనుత దిమి - తక ధీనుత ధిమి

తియా॥ తద్ధీ ణకణక జం
కిణక ణక జం
ణక ణక జం
తక దికి తదిగిణతోం.

ఈ విధంగా జతులను ఎన్నో రీతులుగా కూర్చుకోవచ్చును. అవిధంగానే ఆటలో జతి స్థానకంతో ప్రారంభమవుతుంది. తరు వాత్వారి - మరల ఒక స్థానకం, కరణం - గ తి - తి రి క యీవిధంగా కూర్చబడుతుంది.

తాం - తై -
తారిత రితణం - తతరిత రితణం.

తైయ్యా -
తైయ్యా తైహి - తైయ్యా తైహి -
తైయ్యాతై తైయ్యాతై -
తైతై దిత్తై - తైదిత్తై - తైదిత్తై.
ఈవిధంగా కూర్చి ఆడబడును.

ఈ జతులు అనంతం - తాళగతి, జాతి, జతి, యతి, ఛందస్సు తెలిసినవారు ఎన్నో విధాలుగా కూర్చుకొన వచ్చును. సూచన మాత్రం కొన్ని అడవులు, అడుగులు అభ్యాసం చేసే విధం చెప్పాను. అడవులు - హస్త పాద విన్యాసముల ఒక క్రమ పద్ధతిలో ప్రదర్శించుటను తెల్పును అడవులు తాళ లయల ననుసరించి వేసే పాద విన్యాసము - రెండింటిలో తేడా వుంది. అడవు పూర్తిగా 'కరణము'గా చెప్పలేము కొన్ని కరణములు అడవులుగా ప్రదర్శింపబడుచున్నవి. అయినను చాలామట్టుకు కరణములు భావముతో కూడిన విన్యాసములుగా పేర్కొనవచ్చును అడుగులు అట్లుగాక పూర్తిగా శుద్ధ నృత్తానికి చెందినవిగా చెప్ప వచ్చును. ఈ రెండింటిలో ముఖ్య బేధ మిదే.-

గతులు, యతులు, జాతులు యివన్నీ అడవులకు అలంకారములు.

స్వరములు ముఖ్యంగా ఏడు అయినను వానిని వివిధ విధాలుగా చేర్చుటచే ఎన్నో రాగములు ఏర్పడినట్లు అడవులను వివిధ రకములుగా చేర్చుటవల్ల ఎన్నో రీతులుగా ఏర్పడుచున్నవి. ఇవి ముఖ్యంగా శబ్ద చిత్రములుగా పేర్కొన వచ్చును.

## పురాణేతిహాసములో వర్ణింపబడిన నృత్య విశేషములు

1 ఋగ్వేదములో జరీఅంచు వస్త్రములను ధరించి కురచగా నుండు దుస్తులతో స్త్రీలు నాట్యమాడిరని, చూపులకు అపవర్గ సుఖము నిచ్చు అందగత్తెలు చాతుర్యముగ రమణీయమైన కదలికతో నాట్యము ప్రదర్శించిరని గలదు.

పురుషులు నటకులు యుద్ధ విషయములను నాట్యమాడినట్లు వర్ణింపబడినది.

2. రామాయణములో- అయోధ్యలో పాడువారు, నృత్యమాడువారు గలరనియు, గీతవాద్య నృత్యములు రాజులను నిద్ర పుచ్చుటకు, మేల్కొలుపుటకుగూడా నుపయోగింపబడినట్లు వర్ణింప బడినది రాజభవనములయందు, రాణివాస మందిరములలో స్త్రీలు ఆటపాటలతో వినోదములు సలుపుచున్నట్లున్నది ఒక నాట్యకళా విదుషీమణి తన అసమానమగు నాట్యాభినయములచేత రావణుని మనసు చూరగొన్నది. ఆమె నిద్రచే వివశయైనను, ప్రదర్శిత మందలి అంగవిన్యాసములన్నీ నిద్రయందు గూడా నిలచియుండెనట.

## సిలప్పాదికారము (తమిళ గ్రంథము)

ఇలాన్ కొవాదికల్ అను ఋషి వ్రాసినది. క్రీ. శ. 1వ శతాబ్దములో మాధవి కథానాయకురాలు, గణిక నాట్యప్రవీణులవద్ద సంగీతవిద్య నభ్యసించినది అధ్యాపకుడు, శిష్యుడు, వాద్య విశేషములు వీనిని గురించి వివరముగ, విపులముగ చెప్పబడినది.

4. భాగవతములో - కృష్ణుని యొక్క లీలలన్నియు నృత్యములే. గోపికలతో గలసి రాసక్రీడ సలుపును ఉషాకన్య నాట్యశాస్త్రమును రచించెను.

5. బౌద్ధయుగములో - నృత్యము ప్రబలముగా నుండెను. దీనిని భిక్కులు చూడరాదని కంఠోక్తిగా నిషేధింపబడినది కాళిదాస కవి విరచిత మాళవికాగ్నిమిత్రములో నృత్యకళా విశేషములు బాగుగ వర్ణింపబడినవి. బౌద్ధభిక్షు ఈ కళయందు ప్రముఖురాలు. పోటీ పరీక్షకు తీర్పుకర్తగా నియమింపబడినది.

రుద్రయామడను నృపతి వీణ వాయించుచుండగా నాతని సతి నృత్యము జేసెడిదట

సింహళరాజగు పరాక్రమబాహుడు తన భవనమందు నాట్యశాల నిర్మించెను అతని ధర్మపత్ని రూపవతి నృత్యమున పండితురాలు.

పద్మావతీ చరణ చారణ చక్రవర్తి - జయదేవుడు, అష్టపదులను పాడుచుండ పద్మావతి నృత్యమాడుచుండెడిది.

-※-

# మరికొన్ని నాట్యశాస్త్రముల
## సంక్షిప్త వివరణ

### భరతార్ణవము (నందికేశ్వర విరచితము)

ఇందు నాట్యమందు ఉపయోగించే వివిధ హస్తములు, భంగిమలు, దృష్టి చూపుల గ్రీవాది విశేషము లన్నియూ గాక ముఖ్యముగా శృంగనాట్య వివరములు, సప్తలాస్యముల ప్రదర్శించ వలసిన తీరు, అందుపయోగించవలసిన తాళములు, గతి కరణ చారి ప్రస్తారముల గురించి వివరంగా చర్చించినాడు. ప్రాచీన కాలమునుండి ఆలయాల్లోనుండిన ఆరాధన నృత్యకళ భరతార్ణవము ఆధారముగా అభివృద్ధిచెందినట్లు తోచుచున్నది. ఈ గ్రంథమునందలి వివరము లన్నియు చెప్పుతూ 'దేవదాసీ'ల ఆలయ నృత్యములను గూర్చి వ్రాసిన భాగములో చర్చించాను.

### జాయపసేనుని నృత్త రత్నావళి

ఇందునూ నాట్యమునకు గావలసిన శాస్త్రీయ విషయముల గూర్చి ముచ్చటించి, ముఖ్యముగా సప్తలాస్యముల వివరణ ఇచ్చినారు మరియు ఆంధ్రలోని కొన్ని దేశి సంప్రదాయ నృత్యముల గూర్చి తెల్పిరి. ఈ గ్రంథమునకు భరతార్ణవమునకు చాల దగ్గర పోలికలున్నవి.

### సంగీత దర్పణము (చతుర దామోదర విరచితము)

ఈ గ్రంథమునందునూ నాట్యము గూర్చి యితర శాస్త్రకారులు వ్రాసిన విధముగానే కరణ అంగహార, మండల, హస్త విన్యాసాదుల గూర్చి తెల్పి-

ముఖ్యంగా నృత్త నృత్యాభినయ దులను గూర్చి కొన్ని చక్కని ఉదాహరణముల నిచ్చిరి కొన్ని శ్లోకములను తీసికొని వానిని 'నాట్యధర్మి' పద్ధతిలో అభినయించవలసిన తీరు 'లోకధర్మి' ని అనుసరించిన ఆ అభినయమెట్లు మారునో వివరముగా వర్ణించిరి.

మరియూ వివిధ నృత్తములందు ఉపయోగించవలసిన జతులు, కొనుగోలు శబ్దములు, చిట్టాలయొక్క వివరములు, సప్త తాళములకు నృత్తమాడవలసిన పద్ధతులు - యతి నృత్యము - దానియొక్క వివరములు కిట్టుబాట్లు - పాలగసూడ, శుద్ధసూడ, ధ్రువగీత నృత్యము, చిందునృత్యము, బంధనృత్యము, కల్పనృత్యము, గొండలీ పేరిణి, శబ్దనృత్యము, గీతనృత్యము, స్వరమండ నృత్యము మొదలగు యెన్నియో నృత్యములగూర్చి వివరముగా తెల్పిరి. ఈ గ్రంథము చదువునప్పుడు మనకు ఈ గ్రంథకర్త, పండితుడు శాస్త్రకారుడేగాక నాట్యవిద్యలో బాగా అనుభవమున్న నాట్యాచార్యుడుగా గోచరించును బహుకాలము నాట్యకళ నారాధించి, ఆ విద్యలోని లోతుల నెఱిగి, కష్టసుఖముల తెలిసికొనిన పిమ్మట తనయొక్క అనుభవములన్నిటిని లోకోపకారార్థము గ్రంథరూపములో పొందుపరచియుందరు

### సంగీత సారామృతము

(తులజ మహారాజా రచించిన గ్రంథరాజము

ఈ గ్రంథ రచనకు ఆధార గ్రంథములు :-

సారంగదేవుని - సంగీతరత్నాకరము

జాయసేనుని - నృత్తరత్నావళి

దేవన - సంగీతముక్తావళి.

ఇందు ప్రతి నాట్యశాస్త్ర గ్రంథములో తెల్పే వివరములు గాక ప్రత్యేకముగా 'అ డ వు సా ము' యొక్క వివరములన్ని చక్కగా వర్ణింపబడినవి

'తై' అడవులు - 'దితై' అడవులు - తైయ్యా తైయ్యా - తైయ్యా తైఇతి - దిగిదిగి - జణోం అడవులు టిగ్ దిగ్-కుత్తన అడవు- నాటు తట్టడవు, ధోఁత తైయ్యా, ఒడ్డికలు, జారు, మండె, కత్తెరనాటు చలనాటు, తై తత్తా, తై తద్దిత్తమ్. తద్దితైతై తద్దిత్తాంతామ్, తైత, తైయ్యం తైయ్యాతై. తద్ది తై, తద్దిం త్తాం-తా, తైయ్యాతై-తై తై తై తై

ఈ అడవులకు పట్టే స్థానములు, నృత్త హస్తములు గతి ప్రస్తారము, విలంబిత మధ్య ద్రుత లయల్లో అడవులు పట్టే విధములు :

భ్రమరముల విన్యాసక్రమము, మండలములు, ప్లవనములు, వీనిని నాట్యములో ప్రయోగించే విధానము వివరముగా తెల్పిరి.

సాముచేసే పద్ధతుల విపులంగా తెల్పిరి మరియు ప్రాచీన నాట్య శాస్త్రాల్లో తెల్పబడిన విన్యాసములన్నియూ నేటి కాలములో 'భరతనాట్య'మనే పేరుతో ప్రచారములోనున్న దేవదాసీ నృత్య సంప్రదాయములో యెట్లు ఉపయోగించబడుచున్నవో తెలిసికొనుటకు ఈ గ్రంథమెక్కువగా ఉపయోగపడును.

## సంగీత రత్నాకరము - శార్ఙ్గ దేవకృతము

ఈ గ్రంథము ఏడు అధ్యాయములు గలది.

. స్వరగతాధ్యాయము
2 రాగ వివేకాధ్యాయము
3. ప్రకీర్ణాధ్యాయము
4 ప్రబంధాధ్యాయము
5. తాళాధ్యాయము
6. వాద్యాధ్యాయము
7 నర్తనాధ్యాయము

* * * *

భరతుని నాట్యశాస్త్రము తరువాత రచింపబడిన మహత్తర గ్రంథరాజము "సంగీత రత్నాకరము"

ఇందలి నరనాధ్యాయములో నాట్యకళకు సంబంధించిన వివిధ అంశములను గూర్చి చక్కగా చర్చించినారు

నర్తన విద్యకు సంబంధించిన అనేక శాస్త్రీయ విషయములే గాక ఆకాలములో దక్షిణాపథమునను, ఉత్తర దేశమందును ప్రచారములోనున్న అనేక నృత్య పద్ధతులగూర్చి వివరముగా తెల్పిరి భరతుని కాలమునుండి - సారంగుని కాలము వరకు శాస్త్రీయ నృత్యకళ పెంపొందిన తీరు, మార్పులు, కళా విధానము లన్నియూ ఈ శాస్త్ర పఠనమువల్ల తెలిసికోగలము. మరియు అనేకదేశ పద్ధతులు, వాని విన్యాస విధానములనుగూర్చి రచించిరి భరతుని కాలములో భారతావని కంతటికి ఒకే విధమైన నాట్యకళ (శాస్త్రీయ) వ్యాప్తిలో వుండినను కాలక్రమేణ సంస్కృతభాష ప్రత్యేకంగా పండితుల భాషయై, ప్రాంతీయ భాషలకు ప్రాధాన్యత హెచ్చి, వివిధ నృత్య సంప్రదాయములు వృద్ధిపొందినవి సారంగదేవుని కాలమునాటికి వివిధ ప్రాంతీయ పద్ధతులు సంపూర్ణము అభివృద్ధి గాంచినవి ఆనృత్య సంప్రదాయములన్నింటిని గూర్చి పూర్తిగా వర్ణించిరి

ఈ గ్రంథములో -

నాట్య శాస్త్రమునకు సంబంధించిన శాస్త్రీయ విషయములే గాక 'పిండోత్పత్తి' క్రమము గూర్చి సుదీర్ఘముగా చర్చించిరి

ఈ క్రమమునే ఆంధ్రదేశములోని 'గొల్ల కలాప' నర్తకులు తమ కలాపములో గోపికావిప్రులమధ్య వాద సంవాదములో ఒక భాగముచేర్చి చక్కని నృత్య నాటకముగా నర్తనమాడెదరు. పిండోత్పత్తి ప్రకరణములోని కొన్ని ముఖ్య అంశములు: నాదప్రశంస, నాద ద్వైవిధ్యము, బ్రహ్మ స్వరూపము జీవునకు దేహప్రాప్తి, జీవబ్రహ్మ జగదైక్యము, సృష్టిక్రమము, మానవ శరీరసోత్పత్తి క్రమము, గర్భధారణ, వివిధ మాసములందు పిండాభివృద్ధి, భావభేదము, జ్ఞానేంద్రియములు వాని వ్యాపారములు, ఇంద్రియ కారణము, గుణము, దేహభూతగుణము, ఆకాశ గుణము, వాయుగుణము, ప్రాణస్థానం, వ్యాపారములు, నాగాది పంచవాయువుల స్థానములు, వ్యాపారములు, ఉదకగుణం, పృథివీ గుణం, దేహభేదములు, అంగ ప్రత్యంగముల వివరములు, ఆధార చక్రము విశుద్ధ చక్రము, లలనా చక్రము, ఆజ్ఞా చక్రము, మన శ్చక్రము, సోమచక్రము, చక్రాంతరము, పిండ నిరూపణము, ఉపసంహారము, నాదోపాసన మొదలైన విషయములగూర్చి చర్చించిరి.

ఈ పుస్తకము నాట్యకళాచరిత్రకు సంబంధించిన దగుటవల్ల ప్రత్యేకంగా ప్రతి నాట్యగ్రంథములోని వివరములను విపులంగా చర్చించే అవకాశము లేదు. పూర్తి వివరములు తెలిసికోగోరువారు ఆయా గ్రంథములు చదువగోరుతాము.